# ఆంధ్రపత్రిక

## పందొమ్మిదవ సంవత్సరాది సంచిక

వి భ వ సం వ త్స ర ము

ఆంధ్రవిద్వన్మహాజనులచే వ్రాయఁబడిన

రా జ కీ య సా ర స్వ త చా రి త్ర క సాం ఘి కా ది

విషయకవ్యాసములును, దేశభక్తుల చిత్రములును గలవు

ఆంధ్రపత్రికా ముద్రాలయమున ముద్రితము; ఆంధ్రపత్రికాధిపతిచేఁ బ్రకటితము
6-7, తంబుశెట్టి వీథి, జార్జిటవును, మద్రాసు

1928-వ సంవత్సరము మార్చినెల 22-వ తేది

7



న్నవి. (డాలరు 1-కి సుమారు రూ. 3-2-0 మారకము.) అమెరికా సంయుక్తరాష్ట్రములకు 1926 సంవత్సరము నందు 39,627,55,690 ఆదాయమును, 35,849,87,874 డాలర్ల వ్యయమును కలిగినది. వ్యయముపోను సుమారు 3,700,00,000 ఆదాయము మిగులుచున్నది. ఆమెరికా సంయుక్తరాష్ట్రములకువ్యవసాయము, లోహములు, మోటారుబండ్లు, కిరసనాయిలు బొగ్గు మొదలగు వస్తువులు అపారమగు సంపదలను సమకూర్చుచున్నవి. ఆ దేశము నందు 1926 నందు 221,37,334 మోటారుబండ్లను ప్రజలు కలిగియుండిరి. ప్రతి అయిదుగురు మనుష్యులకును ఒక మోటారుబండి వాడుకయం దున్నది. మహాభాగ్యముతో తులదూగుచున్న దేశ మిపుడు నౌకాధిపత్యమును బడయుటకు విశ్వప్రయత్నములను చేయుచున్నది. అమెరికా దేశమునందు సంవత్సరమునకు 34 లక్షల రూప్యములకు మించిన ఆదాయము గలవారు 400 మందికి పైగా గలరు. హెన్రీఫోర్డుగారి ఆస్తి 10,00,00,000 సవరనులకు పైగా నుండుననియును, సంవత్సరమునకు 230,00,000 నికరాదాయము మీదను పన్నులు చెల్లించు ననియును తెలియుచున్నది. రాక్ ఫెల్లర్ గారి కొడుకు గతసంవత్సరమునందు 12,55,534 పన్నును చెల్లించియుండెను. ఇటువంటి సంపన్ను లింకను నెందరో కలరు. లక్ష్మీ కటాక్షమునకు పాత్రమైన అమెరికా సంయుక్తరాష్ట్రములు వర్తమాన యుగమునందు శాంతిస్థాపనమునకు నాయకత్వమును వహించుటకు సకలవిధములను తగియున్నవి. ధనాధికార లోభములు ఇతరదేశములను వలెను అమెరికా రాజ్యమును బాధించుచు, శాంతిస్థాపనము దుస్తరముగనున్నది. భాగ్యభోగములు గలుగజేయుచున్న సాంఘికపరివర్తనమునకును అమెరికాదేశము లక్ష్యముగ నున్నది. 1926 సంవత్సరమునందు12,02,970 వివాహములును, 1,80,872 వివాహవిచ్ఛేదములును జరిగినవి. మద్యపాననిషేధమును యథావిధిగ కొనసాగుచున్నది. ప్రపంచమునందు శాంతిని, ధర్మమును స్థాపించుటకు తగియున్న అమెరికా సంయుక్తరాష్ట్రములు స్వలాభాపేక్షను బూని నానా జాతి సమితియందు చేరకుండుట సంతాపకరముగ నున్నది. ఈ విషమపరిస్థితులకు గ్రేట్బ్రిటను విశేషమైన బాధ్యతను వహింపవలసి యున్నది.

ప్రపంచశాంతిని స్థాపించుట కేర్పడిన నానాజాతిసమితి శాంతిస్థాపనమునకు నిరుపయోగముగ నున్నది.

నానాజాతిసమితి

జినివాయందు స్థాపితమైన నానాజాతి సమితి సంవత్సరమునకు 10,00,000 సవరనులను వ్యయముచేయుచున్నది. ఆయుధవిసర్జనము, పరస్పరసంరక్షణము, పంచాయతి తీర్పు, సమితిధర్మము లని సిద్ధాంతమునం దంగీకరింపబడినను, ఆచరణమునందు మృతాక్షరములుగ నున్నవి. ఈసమితి యూరపురాజ్యముల స్వప్రయోజన సంరక్షణముల కేర్పడిన సమితిగ నున్నది. జూలైయందు గూడిన సంధిసమావేశమునందు ప్రసిడెంటు కూలిడ్జిగారు నిర్దేశించిన ఏర్పాట్లను బ్రిటిషు ప్రభుత్వము నిరాకరించినది. బ్రిటీషుప్రభుత్వము జలాంతర్గామువిసర్జనమునుగాని, యుద్ధనౌకానిర్మాణముల నియమనమును గాని అంగీకరింపలేదు. ఫ్రాంసు, ఇటలీ తటస్థముగ నుండినవి. అమెరికా సంయుక్తరాష్ట్రములకును, గ్రేటుబ్రిటనునకును యుద్ధనౌకానిర్మాణమునందు గలిగిన భేదాభిప్రాయములు నౌకానిర్మాణమును నియమించుటకు ప్రతికూలము లైనవి. సిసిల్ ప్రభువు మంత్రిపదవికి రాజీనామా నిచ్చి బ్రిటీషుప్రభుత్వము నావహించిన సామ్రాజ్య దురభిమానమును లోకమునకు విశదము చేసెను. బ్రిటీషుప్రభుత్వమునకు విశాలమైన సామ్రాజ్య సంరక్షణమునకు నౌకాదళమవసరముగ నున్నది. ఇటలీ రాజ్యమునకు భావికాలసామ్రాజ్యసంపాదనమునకాయుధ నియమము ప్రతిబంధకముగనున్నది. ఫ్రాన్సున కాత్మసంరక్షణమునకాయుధ నియమము ప్రతిబంధకముగ నున్నది. అమెరికా సంయుక్తరాష్ట్రములకు వ్యాపార విజృంభణమునకు ప్రతిబంధకముగ నుండగలదు.

అమెరికా సంయుక్తరాష్ట్రములకును, గ్రేటుబ్రిటనునకును ఆయుధనియమమునందును, వ్యాపారవిజృంభణమునందును ధనార్జనమునందును, పోటి ఏర్పడినది. గ్రేటుబ్రి

టనుయుద్ధనౌకలను,నిర్మించుటకును సింగపూరునావాశ్రయమును, నితర నావాశ్రయములను నిర్మించుటకును విశేషమైన ద్రవ్యమును వ్యయముచేయుచున్నది. ప్రజలుపనిపాటులులేక యల్లాడుచున్నపుడు ద్రవ్యము నాయుధధారణమునకై వినియోగించుట మహాఘోరముగ నున్నది. పరిశ్రమలయందును, వ్యాపారమునందును గ్రేట్‌బ్రిటను అమెరికా జర్మని రాజ్యములకు వెనుక బడుచున్నది. నేతపరిశ్రమయందును పోటిపర్పడి బ్రిటీషు వ్యాపారము తగ్గుచున్నది. బొగ్గు, ఇనుపపరిశ్రమలు వెనుకబడుచున్నవి. ఇట్టి విషమ పరిస్థితులందు కన్సర్వేటివు పక్షమవలంబించుచున్న రాజనీతి భయభ్రాంతులను సూచించుచున్నది గాని రాజ్యాంగ పరిజ్ఞానమును విశదము చేయుటలేదు. ”

నానాజాతి సమితియందు 55 రాజ్యములు చేరినవి. అమెరికా రుష్యాలు మాత్రము చేరలేదు. భారతవర్షము చేరినను బ్రిటిషు ప్రయోజనములకు లాభకరముగ నున్నది. కాని భారతీయ ప్రయోజనములకు నిరుపయోగముగ నున్నది.

యుద్ధకాలమునందు బ్రిటీషు సామ్రాజ్యముపట్ల సామ్రాజ్యాంతర్భాగములకు గలిగిన సామ్రాజ్యాభిమానము క్రమముగ సన్నగిలుచున్నది. స్వాతంత్ర్యముగల కనడా, ఆఫ్రికా, ఆస్ట్రేలియా మొదలగు సామ్రాజ్య భాగములు

కన్సర్వేటివుపక్షము

సంపూర్ణస్వాతంత్ర్యమును స్థాపించుచున్నవి. కనడ రాజ్యము ప్రత్యేకముగ రాయబారిని నియమించుట కధికారమును బడసినది. గతసంవత్సరమునందు ఒటావాయందు కనడాప్రభుత్వము బ్రిటీషుప్రభుత్వ ప్రమేయము లేకుండ స్వయముగ రాయబారిని నియమించినది. గత సంవత్సరమునందు కనడారాజ్యము అరువదవ సంవత్సరోత్సవమును జరిపినపుడు గ్రేట్బ్రిటను చూపిన గౌరవము బ్రిటీషు ప్రభుత్వమునకు కనడాపట్లగలగౌరవమును విశదముచేయుచున్నది. ఆఫ్రికాసంయుక్తరాష్ట్రములు స్వాతంత్ర్యమును స్థాపించుటకు చేయుచున్నప్రయత్నములు సర్వత్ర తెలిసియున్నవి. గతసంవత్సరమునందు జాతీయ పతాకమును నిర్ణయించుటకు జరిగిన యాందోళనము దక్షిణాఫ్రికా ప్రజల సంపూర్ణస్వాతంత్ర్యాపేక్షను వ్యక్తము చేయుచున్నది. బ్రిటీషుసామ్రాజ్యముయుద్ధమునందునిమగ్నమైయున్నపుడు కనడా, ఆస్ట్రేలియా, ఆఫ్రికా మొదలగు అధినివేశరాజ్యములు తటస్థముగ నుండుట కధికారము గలదని చేయుచున్న వాదము అధినివేశ రాజ్యములకును, బ్రిటీషుప్రభుత్వమునకునుగలసంబంధము శిథిలమగుచున్న విధమును విశదము చేయుచున్నది. గ్రేట్బ్రిటను నందు వ్యాపారపరిశ్రమలు మందగించుటయును, అధినివేశరాజ్యములు స్వాతంత్ర్యమును గోరుటయును బ్రిటీషు ప్రభుత్వదృష్టిని పరాధీనదేశములందు లగ్నము చేయుచున్నది. కన్సర్వేటివు ప్రభుత్వము బ్రిటీషు సామ్రాజ్యాంతర్గతములైన పరాధీనదేశములను దృఢమైన దాస్యపాశములతో బంధించుటకు విశ్వప్రయత్నము చేయుచున్నది. ఈజిప్టు, కెనియా, హిందూదేశము, సింహళము మొదలగు దేశములందు కన్సర్వేటివు ప్రభుత్వ మవలంబించుచున్న నిర్బంధ తంత్రమును, సంస్కరణ తంత్రమును బ్రిటీషు ప్రభుత్వ రాజ్యనీతిని వేయినోళ్లను చాటుచున్నవి. ఒక చేతితో నిర్బంధవిధానమును, రెండవచేతితో సంస్కరణ విధానమును ప్రసాదించుట బ్రిటీషురాజ్యనీతి యని చిరకాలానుభవము విశదము చేసినది. ఈజిప్టు రాజ్యమునకు ప్రసాదించిన సంధినియమములు సామ్రాజ్య దురభిమానమునకు సహజమైన దురాలోచనను విశదము చేయుచున్నవి. బ్రిటీషు సైన్యములు ఈజిప్టు దేశమును ఆక్రమించుకొనియుండుటయును, ఈజిప్టుసైన్యమునకు బ్రిటీషు సైనికులు శిక్షకులుగ నుండుటయును, ఈజిప్టుప్రభుత్వమునకు విదేశప్రభుత్వములతో సంబంధము లేకుండుటయును స్వాతంత్ర్య ప్రదానముగను ప్రాజ్ఞులు పరిగణింప జాలరు. ఈజిప్టుప్రజలును, ప్రభుత్వమును బ్రిటీషుసంధి నియమములను ఏకగ్రీవముగనిరాకరించి స్వధర్మమును నిర్వహించిరి. స్వాతంత్ర్యముగల తుర్కీ, పారశీకము, ఆఫగనిస్థానము మొదలగు మహమ్మదీయరాజ్యముల స్థితి బ్రిటీషుప్రభుత్వమునకు జ్ఞానోపదేశమును గలుగజేయవలసి యున్నది. ఈజిప్టునందు బ్రిటీషు రాజ్యాధికారము క్రమముగశిథిలమగు

చున్నది. బ్రిటీషు ప్రభుత్వమునకు సమ్మతమైనను, కాకపోయినను, ఈజిప్టునకు అనతికాలముననే స్వాతంత్ర్యము సంప్రాప్తము గానున్నది. మహమ్మదీయ ప్రపంచమునకంతకును తురుష్కుల స్వాతంత్ర్య ప్రవర్తనము లక్ష్యమై స్వాతంత్ర్యప్రాప్తికి పురిగొల్పుచున్నది. కన్నుల్లార మహమ్మదీయ స్వాతంత్ర్య ప్రయత్నములను గాంచుచుండియు నిర్లక్ష్యముచేయుట మూర్ఖత్వముగాని వివేకము గాదు. ఆఫ్గనిస్థానముప్రభువునకు యూరపుదేశ మొసంగిన మహాస్వాగతము ప్రాచ్యపాశ్చాత్య రాజ్యములకు ధర్మనిర్వాహణవిధానమును విస్పష్టము చేయుచున్నది.

ఆఫ్గనిస్థానము

ఆఫ్గనిస్థానము మహమ్మదీయ స్వతంత్రరాజ్యములందు చిన్నరాజ్యము. వైశాల్యము 2,45,000 చదరపు మైళ్లు. జనసంఖ్య 63,80,000. దేశము పర్వతమయమై సార రహితముగ నున్నది. బ్రిటీషు ప్రభుత్వమును యూరపురాజ్యములును స్వప్రయోజనపరాయణములై స్వాతంత్ర్యముగల ఆఫ్గనిస్థానమున కరియప్పణములను జేయుచున్న విధము స్వాతంత్ర్యము ప్రభుత్వముపట్ల ఆ ప్రభుత్వములకు గల భయభ్రాంతులను విశదము చేయుచున్నది. ఆఫ్గనిస్థానమునకును, రుష్యాకును 1921, 1926 సంవత్సరములందు జరిగిన సంధినిబంధనలు బ్రిటీషుప్రభుత్వము కట్టుకొనిన గింతెలను సడలించినవి. మహమ్మదీయరాజ్యములకు రుష్యా చూపిన యనుతాపము ఆఫ్గనిస్థానమునకు, బలమును విశ్వాసమును గలుగజేసినది. రహస్యపు టొడంబడికలోని విషయములు గోప్యములైనను బహిరంగ సంధియందలి నియమములును బ్రిటీషుతంత్రమును నిష్ఫలము చేసినవి. ఆఫ్గనిస్థానము సంగ్రామసమయములందు తటస్థముగనుండుట కంగీకరించినది. రుష్యా, ఆఫ్గనిస్థానము లన్యోన్యా సంపూర్ణస్వాతంత్ర్యము నంగీకరించినవి. ఉభయరాజ్యములును శత్రుపక్షమునకు సహాయమును ప్రతిషేధించినవి. ఉభయరాజ్యములును పరస్పర శత్రుత్వ కారణములను ప్రతిషేధించినవి. బ్రిటీషుప్రభుత్వము నూరేండ్లనుండియు నవలంబించుచున్న భేదదండన తంత్రములు నిష్ఫలములైనవి. రుష్యా అంగీకరించిన సంపూర్ణ స్వాతంత్ర్యమును బ్రిటీషు, జర్మని ప్రభుత్వము లంగీకరించినవి. కాబూలునం దిపుడు రుష్యా, బ్రిటను, జర్మని, తుర్కీ మొదలగు దేశముల రాయబారులు గలరు. ఆఫ్గనురాయబారులును నితరరాజ్యములందు గలరు. ఆఫ్గనుస్థానప్రభువు కేవలము గౌరవములతో సంతృప్తినిబొందక తన రాజ్యమును సకలవిధములను బలిష్ఠము చేయుచున్నాడు.

యంత్రాలయములయందు మరఫిరంగులు, తుపాకులు, గుండ్లు తయారగుచున్నవి. వాయువిమాననిర్మాణములు జరుగుచున్నవి. యంత్రాలయములు స్థాపితములగుచున్నవి. స్త్రీలు జనానానువిడిచి స్వేచ్ఛా సంచారమును జేయుచున్నారు. అమీరు అమానుల్లాఖానుగారికి వివిధరాజ్యములును నొసంగిన స్వాగతములవలన ఆసియా రాజ్యాంగములందాఫ్గనుస్థానమునకు గల ప్రముఖతవిశదమగుచున్నది. హిందూదేశమునకు ముఖద్వారముగనున్న ఆఫ్గనిస్థానము ఆదికాలము శత్రువులలక్ష్యము నాకర్షించినది. ఆఫ్గనుయుద్ధములు కోట్లరూప్యముల వ్యయమునకు మూలములైనవి. నేటికిని హిందూదేశ సంరక్షణమునకు బ్రిటీషుప్రభుత్వము నాఫ్గనుసమస్యయే బాధించుచున్నది. అమానుల్లాగారి సంచారము పాశ్చాత్యులకన్నులను విప్పినది. కరాచినుండి లండనువరకునుగల రాజ్యము లొసంగిన స్వాగతములును అమీరుగారి ప్రత్యుత్తరములును,స్వాతంత్ర్యస్థితికిని పారతంత్ర్యస్థితికిని గల భేదమును విశదము చేయుచున్నవి. అమీరుగారును,వారిభార్యయును పాశ్చాత్యులకు ప్రాచ్యులపట్ల ముఖ్యముగ మహమ్మదీయులపట్ల గల దురభిప్రాయములను తొలగించియుండవచ్చును. లండను టైమ్సు పత్రిక అమీరు 'నవయుగ పీటరు మహాశయు' డని యభినందించినది. ఇట్టి యభినందములు రాజ్యతంత్రములుగాని హృదయపరివర్తనమునకు నిదర్శనములు గావని యాంగ్లేయులు భరతవర్షమునందును, ఈజిప్టునందును నితరప్రదేశములందును నవలంబించుచున్న నిరంకుశ నిర్బంధవిధానములును, సంస్కరణ విధానములును విశదము చేయుచున్నవి.

భారతరాజ్యాంగములపట్ల బ్రిటీషు ప్రభుత్వ మవలంబించిన కుతంత్రములు గన్సర్వేటివు ప్రభుత్వ మవలంబించుచు దుర్ణయమును విశదముచేయుచున్నది.

భారతవిజ్ఞానమును, బల సంపదలును చిరకాలాగతంబులు. దేశవైశాల్య ప్రజాబాహుళ్యము గౌరవభాజనంబులు. ప్రజలు ధర్మపరాయణులు. బ్రిటీషు ద్వీపవాసులును, యూరపురాజ్యవాసులును పశుప్రాయులుగ నుండెడికాలమునందు భరతఖండ మహింసాధర్మ పరాయణులైన జినబుద్ధదేవులను లోకమునకు ప్రసాదించిన సత్కీర్తిని బడసినది. 2400 వందల యేండ్లకుపూర్వము విజయస్తంభములను పరిత్యజించి ధర్మశిలా స్తంభములను దేశమునం దంతటను స్థాపించిన అశోకధర్మమూర్తిని భరతమాత ప్రపంచమునకు ప్రసాదించినది. మద్యమాంసాశనములను, సంగ్రామములను పరిత్యజించువిషయమై యూరపురాజ్యములు 2400 తరువాత నింకను వాదోపవాదములందు మునిగి తేలుచున్నవి. భారతహృదయప్రవాహమునందు భౌతికబలము శుష్కించినను ధర్మబలము వీర్యవంతమై కూలంకషముగను ప్రవహించుచున్నది. మహాసంగ్రామములు సంక్షోభమును గలుగజేసినవి. రాజ్యము లంతరించినవి. రాజవంశములు నామ రూపములు లేక నశించినవి. ధర్మప్రవృత్తి మాత్రము చైతన్యము గలిగి భారతహృదయస్పందనమును జేయుచున్నది. భారతహృదయమునందు స్తంభితమైన ధర్మచైతన్యాంకురములనుగాంధి మహాత్ము డసహాయోద్యమ రూపమున భారత దాస్య విమోచనమునకును, లోక కల్యాణమునకును బహిర్గతము చేసి భారతహృదయమునం దాత్మ విశ్వాసమును గలుగజేసెను. భారత దేశ సంపద్బలములవలనను బలిసిన బ్రిటీషు ప్రభుత్వము ఋణవిమోచనము జేసికొనుటకైనను భారతస్వాతంత్ర్యమును స్థాపించుట ధర్మము, వివేకము. శుష్కించి క్షీణించిన భరతవర్షము భారతీయ ప్రయోజనములకును, బ్రిటీషుప్రయోజనములకును నిరుపయోగమని బ్రిటీషు రాజ్యాధికారులు సకాలమునందె గ్రహించుటకు భగవదనుగ్రహము గలుగుగాత!

**భారతరాజ్యాంగ సంస్కరణములు**

భారత రాజ్యాంగములను విమర్శించుటకును, నిర్ణయించుటకును బ్రిటీషు పార్లమెంటు కమిటీకిమాత్ర మధికారము గలదు. స్వరాజ్యమును గోరెడి భారతీయుల కేవిధమైన హక్కును, కమిటీతో గలిసి పనిచేయుట కవకాశములు లేవు. బ్కారెను హెడ్డుప్రభువు, భారతప్రభుత్వమును హైందవనాయకుల ప్రార్థనమును నిరాకరించిరి. చిరకాలము క్రితము రహస్యముగ జేసిన యోచనలను సఫలము చేయుటకుమాత్రమే సైమను విచారణసంఘమేర్పడిన విధమును బ్రిటిషు భారతప్రభుత్వాధికారు లవలంబించుచున్న మాయోపాయములువిశదము చేయుచున్నవి. బాల్డ్వినుగారు, బర్కెను హెడ్డుప్రభువు, రామ్సె మాక్డోనాల్డుగారు మొదలగు బ్రిటీషురాజనీతిజ్ఞులు సైమనుకమిషనును భారతీయులు శిరసావహింపవలయునని భయపెట్టుచున్నారు. సైమనుకమిషను నియామకమునందు బర్కెనుహెడ్డుప్రభువు భారతీయులకుజూపిన యవమానము భారతీయులకు పరమాసహ్యమును గలుగజేసినది. వివిధపక్షములవారిని మతములవారిని తెల్లకమిషను చేరకీసి భారతీయులకు వారి నిస్సహాయస్థితిని, సంయోగావసరమును విశదముచేసినది. దేశమంతయును భారతజాతీయమహాసభ నిర్ణయించిన బహిష్కారసిద్ధాంతము నవలంబించి భారత జాతీయ సంకల్పమును విస్పష్టము చేసినది.

**భారతజాతీయ మహాసభ**

చెన్నపురియందు గతసంవత్సరమునందు గూడిన 42-వ జాతీయమహాసభ సకలవిధములను గణనీయముగనున్నది. సుప్రసిద్ధ మహమ్మదీయనాయకులు డాక్టరు అన్సారిగా రధ్యక్షతను వహించిరి. వేలకొలది ప్రతినిధులు ప్రేక్షకులు కాంగ్రెసు యాత్రనుజేసి ధన్యులైరి. కాంగ్రెసు మహామంటపము వేలకొలది ప్రేక్షకులతో నిండినది. గంభీరోపన్యాసములతో ప్రతిధ్వనిల్లినది. బ్రిటీషు అధికారులు చూపిన నిరసనభావము భారతీయులను రోషావేశపూరితులను జేసినది. విషయనిర్ధారణసంఘసమావేశమునందును, మహాసభయందును మితవాదమున కవకాశము

పోయినది. వృద్ధులైన శ్రీమతి బెజంటమ్మగారును, పండిత మదనమోహన మాలవ్యాగారును మితవాదమును విసర్జించి సంపూర్ణస్వాతంత్ర్య సిద్ధాంతవాదము నామోదించుట ప్రజాహృదయమునందు గలిగిన కోపావేశమును వేరుగ వర్ణించుట యనవసరము. భారతజాతీయమహాసభయం దామోదింపబడిన తీర్మానములందు సైమను బహిష్కారతీర్మానము, బ్రిటీషువస్తుబహిష్కారతీర్మానము, సంపూర్ణస్వాతంత్ర్య ప్రస్తావము హిందూమహమ్మదీయసన్నియోగము ప్రముఖములు. ఈతీర్మానములు ప్రయోగయోగ్యములు కావనియును, బాధ్యతలేనివారిచేత నామోదింపబడిన వనియును ప్రతిపక్షు లాక్షేపింపవచ్చును. బ్రిటీషుప్రభుత్వ నిరంకుశవిధానమునందు స్వాప్రకార్యములను సయితము నెఱవేర్చుటకుభారతీయులకు శక్త్యవకాశములు లేవు. ప్రభుత్వమునకు ప్రతిబంధకములను కల్పించుటకు గల శక్త్యవకాశము లపారములు. ప్రజాభిప్రాయమును తెలుపుటయే జాతీయమహాసభకు సాధ్యము, కర్తవ్యము. ఆకర్తవ్యమును చెన్నపురియందు గూడిన భారతజాతీయమహాసభ నిర్భయముగ నిర్వహించినది. ఫలము దైవాధీనమునం దున్నది.

జాతీయమహాసభ ఆమోదించిన తీర్మానములు పిచ్చివారల కలవరము లని యాక్షేపించినను విచారపడ నవసరము లేదు. జాతీయ స్వాతంత్ర్య సంరంభములందు పిచ్చివారల కలవరములే కార్యరూపమును దాల్చుచుండును. డాక్టరు అన్సారీగారి ఆధిపత్యము క్రిందను 42 వ భారతజాతీయమహాసభ జయప్రదముగ ముగిసినది. అన్సారీగారు మహమ్మదీయనాయకులైనను భారతజాతీయ వీరులు. వారి యధ్యక్షతక్రిందను హిందూమహమ్మదీయ సంయోగమునకు సంబంధించిన ప్రస్తావ మామోదింపబడుటయును,హిందూమహమ్మదీయ హృదయములందు జాతీయాభిమానము ప్రవర్ధమానంబగుటయును శుభసూచకముగ నున్నది. కాంగ్రెసు మంటపమునందు గూడిన జనసమూహములు, చేసిన గంభీరోపన్యాసములు, ఆమోదింపబడిన తీర్మానములు భారతహృదయము నావరించిన సంపూర్ణస్వాతంత్ర్యాభిలాషను విశదము చేయుచున్నవి. ప్రజానాయకులు తీర్మానములకనురూపముగను కార్యాచరణమునకు బూనుకొని మాతృప్రేమను సార్థకము చేయుదురు గాత!

**ఇతర సభలు, ప్రదర్శనములు**

కాంగ్రెసు నగరమునందు గూడిన యితర సభలు, ప్రదర్శనములు భారతజాతీయ వికాసమునకు సాధనములను విశదము చేయుచున్నవి. గాంధిమహాత్ముడు ప్రారంభించిన ఖద్దరు ప్రదర్శనము ఖద్దరు ప్రభావమును ప్రత్యక్షము చేసినది. నిరుపేదలకు ఖద్దరు జీవనాధారమును గల్పించగల విధమును రాటములు, మగ్గములు, అద్దకపుపనులు, చేతిపనులు విశదము చేసినవి. ఆంధ్రఖద్దరు దుకాణము బ్రిటీషుప్రభుత్వము నిర్మూలము చేసిన పురాతనమైన ఖద్దరుపరిశ్రమను సంస్మరింపజేసినది. ప్రదర్శింపబడిన సన్ననిబట్టలు డక్కా-మజ్లినులను సంస్మరింపజేసినవి. ప్రదర్శింపబడిన బట్టలు ఖద్దరు నిర్మాణమునకును, వ్యాపనమునకును గల యపారమైన యవకాశములను తెల్లము చేసినవి. ప్రజాహృదయము నావరించిన పరావలంబన స్వభావము కార్యాచరణమునకు ప్రతిబంధకముగ నున్నది. వ్యవసాయశాఖయందును, అటవీ శాఖయందును, నితర స్వదేశశాఖలయందును ప్రదర్శింపబడిన వస్తువులు భారతదేశవికాసమునకు సర్వత్ర ప్రత్యక్షముగ నున్న సంపదలను మనోగతము చేసినవి.

అధికారులకు ప్రదర్శనమునందు గల యాదరణము వారి స్వప్రయోజన పరాయణత్వమును విశదము చేయుచున్నది. యంత్రా ద్యుపకరణములకు గల్పించిన ప్రాముఖ్యమును ఖద్దరునకును, చేతిపనులకును గల్పింపకుండుట యనుచితము. ప్రదర్శనములు ప్రజాసామాన్యమునందు స్వదేశాభిమానమును, ఆత్మపరిజ్ఞానమును గలుగజేయుటకు వినియోగపడవలయును గాని విదేశవస్తువిక్రయమునకును, ఆత్మ నాశనమునకును వినియోగపడ జనదు. మద్రాసు ప్రదర్శనాధికారులు విదేశవస్తువులకు గల్పించిన ప్రముఖత ప్రదర్శన ప్రయోజన

మును పాడుచేసినది. ఈయనర్థములకు భారతీయుల పారతంత్ర్యస్థితియే మూలకారణ మని శ్వేతాధికారుల విపరీతాచరణములు విశదము చేయుచున్నవి.

కాంగ్రెసునగరమునందు సమావేశమైన యితర సభలును భారతజాతీయప్రబోధమును విశదము చేయుచున్నవి. గాయకమహాసభ వేలప్రజల నాకర్షించినది. హిందీమహాసభ స్వదేశభాషాభిమానమును విశదముచేసినది. విద్యార్థిమహాసభ, మహిళా మహాసభ, సేవాదళసభ సర్వతోముఖమైన ప్రబోధమును ప్రత్యక్షము చేసినవి. ప్రజలయందును, నాయకులయందును భావప్రకటనమున కనురూపమైన కార్యవిధానము లేనపుడు మనోరథములు రిక్తము లగుచున్నవి. చెన్నపురి సభాప్రస్తావముల విషయమై గాంధిమహాత్ముడు చేసిన ఖండనమునకు భారతీయుల క్రియాదౌర్బల్యమె మూలముగ నున్నది. పూజా పురస్కారములు లేని సంకల్పము ఫలసిద్ధికి సాధనము గాజాలదు. బ్రిటీషువస్త్ర బహిష్కారమును చేయజాలని భారతీయులకు బ్రిటీషువస్తుబహిష్కారమును, సంపూర్ణ స్వాతంత్ర్యస్థాపనమును జేయుటకు సామర్థ్యము గలుగజాలదు. భారతీయుల సంకల్పములు ప్రస్తుతము సారహీనములుగ గనుపడినను కాలక్రమమున బలీయములై అనివార్యములు గాగలవు. స్వార్థపరులును, నిరంకుశాధికారులును నీసత్యమును గ్రహించి ప్రవర్తించుట వివేకము.

సైమనుసప్తకమునకు గంతలు కట్టి యధికారు లూరేగింపులను, విందులను జేసినను ప్రజల సంకల్పమును దేశమునం దంతటను జరిగిన హరతాళ బహిష్కారములు ప్రకటించినవి.

### సైమనుకమిషను

ఫిబ్రవరి మూడవ తేదినాడు దేశమునందు ఎగిరిన నల్లజండాలును, మార్మ్రోగిన సైమనుబహిష్కారఘోషలును అధికారవర్గమున కావేశమును గలుగజేసినను ప్రజాశక్తిని వెల్లడిచేసినవి. భారతసామ్రాజ్యశాసనసభ బహిష్కారప్రస్తావము నంగీకరించినది; సైమను గ్రాంటును నిరాకరించినది. మద్రాసు, మధ్యరాష్ట్రములు, సంయుక్తరాష్ట్రములు రాష్ట్రీయ శాసనసభలయందు సైమను బహిష్కారము నామోదించినవి. హరతాళములు ప్రజావిజయమును విశదముచేసినను అధికారుల మిత్రభేదతంత్రము పారతంత్ర్య ప్రభావమును విదశముచేసినది. అధికారులు సహకారప్రహసనములను ప్రదర్శింపగలిగిరి. అనామకులు, స్వార్థపరులు ప్రహసనములందు పాత్రధారులై బీభత్సరసమును ప్రదర్శించి జాతీయప్రయోజనములను విధ్వంసము చేసిరి. చెన్నపురియందు హరతాళ సందర్భమునం దధికారవర్గమును వారి యనుచరులును నవలంబించిన నిర్బంధములును, దుష్కార్యములును పారతంత్ర్య శాక్షసికి గల మాయోపాయములను ప్రత్యక్షము చేసినవి. తుపాకులు, మరఫిరంగులు, దండనశాసనములు, దౌర్జన్యములు, బీభత్సనాటకమును రసాభాసము చేసినవి. నిరంకుశప్రభుత్వబలము, ప్రజలదౌర్బల్యము నిశ్చేష్టతను గలుగజేసినవి. నాయకులు 144 శాసనప్రయోగమును ప్రతిఘటించుటకు నిరాకరించిరి. కాంగ్రెసు సమయమునందును, తదనంతరమును త్వరితముగ గమనము చేసిన జాతీయ జీవనప్రవాహము మందగమనమును పట్టినది. స్వదేశీయుల స్వార్థపరత్వము, నిరంకుశాధికారుల భేదదండనోపాయములు స్వరాజ్యసంపాదనమునకు ప్రతిబంధకములుగ నున్నవి. అధికారవర్గ మీ ఆయుధముల నుపయోగించగల విధమును సైమనుసప్తకమున కేర్పాటుచేసిన స్వాగతములు విశదము చేసినవి. అధికారులు వారి యధికారమును దుర్వినియోగము చేసి సైమనుస్వాగతముల నేర్పాటుచేసిన విధము బహిరంగ రహస్యము. మహమ్మదీయులను నిమ్నజాతి వారలను, స్వార్థపరాయణులను లేవదీసి ఆడించిన స్వాగత నాటకములు కోతులనాటకములవలె నున్నవి. అధికార దండ మాడినటులు జంతుక్రీడారంగములందు (Circus) జంతువులరీతిని భారతీయులాడుట వారి దౌర్భాగ్యస్థితిని దెలుపుచున్నది. నాయకులును, దేశసేవాపరాయణులును చూపిన దృఢసంకల్పము భావిభాగ్యోదయమున కాశాగాగములు ప్రసరింపజేయుచున్నది. సామ్రాజ్య శాసన సభయందు లాలాలజపతిరాయి, మదనమోహన మాల్ల

# DODGE BROTHERS

## COMMERCIAL BUS

## డాడ్జి బ్రదర్సు

### కమ్మర్షియలు బస్సు




నిశ్చయమైన లాభము—సౌఖ్యమయిన ప్రయాణము

ధరలు

మద్రాసు డిలివరీ

| | | |
|---|---|---|
| 20 మంది జనము కూర్చుండునది | ,, | రూ॥ 4700-0-0 |
| 18 | ,, | 3750-0-0 |
| 13 | ,, | 3600-0-0 |

వాయిదా ప్రకారము కావలసినయడల తగు యేర్పాట్లు చేయబడును. వలయువారు యీదిగున అడ్రేసుకు వ్రాయనలయును.

## మోటారు అండు జనరలు ఇంజనీరింగు కంపెనీ, బెజవాడ.

ఆథరైజుడు ఏజింట్లు: కృష్ణా, గోదావరి, జిల్లాలకు.



డబ్ల్యూ. సి. బెనర్జి, బొంబాయి–౧౮౮౫.



బదురుద్దీన్ త్యాబ్జి, ౧౮౮౭–మదరాసు.



జార్జియూల్; ౧౮౮౮–అలహాబాదు.



దాదాభాయి నౌరోజి, ౧౮౮౬–కలకత్తా.



సర్ విలియం వెడ్డర్ బరన్, ౧౮౮౯–బొంబాయి.



సర్ పి. యం. మెహతా, ౧౮౯౦–కలకత్తా.



పి. ఆనందాచార్యులు, ౧౮౯౧–నాగపూరు.



(శ్రీ రత్నా అండు కంపెని, చెన్నపురి)

అఖిలభారత జాతీయ మహాసభాధ్యక్షులు, ౧౮౯౨-౧౯౦౦ ఆంధ్రపత్రిక విభవ సంవత్సరాదిసంచిక




డబ్ల్యూ. సి. బెనర్జి, ౧౮౯౨-అలహాబాదు. దాదాభాయి నౌరోజి, ౧౮౯౩-లాహోరు. (శ్రీ రత్నా అండు కంపెనీ, చెన్నపురి)

బలహీనులపాలిటి వరప్రసాదము !! విద్యార్థుల పాలిటి కల్పతరువు !!!

ఆయుర్వేదమును పునరుద్ధరింపచేసి, అపరధన్వంతరియని ప్రఖ్యాతిగాంచిన

వైద్యతర్న పండిత డి. గోపాలార్యులగారి

వెల సీసా 1 కి. రు 3-4-0

# జీవామృతము

రిజస్టర్డు

(శ్రేష్ఠమైన బలవర్ధకౌషధము)

## కొన్ని యోగ్యతాపత్రములు

1. ఆర్. డి. స్మిత్తరుగారు, తిరుచునాపల్లి:–మీజీవామృతము నాలో నొక నూతనశక్తి నావిర్భవింప జేసినది.
2. ది ఆనరబల్, దివాన్ బహదూర్, పి. రాజరత్న మొదలియారుగారు, సి.ఐ. యి. ఇన్‌స్పెక్టర్ జనరల్ ఆఫ్ రిజిస్ట్రేషను, మదరాను:—మీజీవామృతము చక్కని బలవర్ధకౌషధము. ఇతర ఔషధముల వలె నిది మలబద్ధకము చేయదు.
3. టి. పి. మాసిలామణిగారు, దేశాభిమాని పత్రికాసంపాదకులు, జాఫ్నా:—శరీరమంతయు కృశించి క్షీణించినవారికి జీవామృతమే శరణ్యము. నేను దానివలన ఎంతో ఆరోగ్యము పొందితిని.
4. మంచళ్ల వేంకట పున్నయ్య శర్మగారు బి. ఎ., బహుళాంధ్ర గ్రంథకర్తలు, మద్రాసు:— మీ జీవామృతము పరమహంసక్రియవలె పనిచేసి మహోపకార మొనర్చినది.
5. వై. ల. నరసింహంగారు బి. ఏ., ప్లీడరు, గుడివాడ:—మీజీవామృతము విద్యార్థులకు పరమోపకారి.
6. కె. యస్. పద్మనాభయ్యగారు, బి.ఏ, ఎల్. టి, తొండమండలం హైస్కూలు ప్రధానోపాధ్యాయులు, మదరాసు:—మీజీవామృతము యథార్థముగ జీవామృతమే. దానికదేసాటి.
7. కె. శి. మూర్తిఅయ్యరుగారు, బి. ఏ., బి. ఎల్., కర్నూలు:—మీజీవామృతము యొక్క మహిమ వ్రాయ నలవికానిది. ఇది విద్యార్థులకు ప్రాణమిత్రము.
8. ఓకూరు కృష్ణశాస్త్రిగారు, నేటివ్‌డాక్టరు, కదిరి:—జీవామృతమునకు మీరిడినపేరు సార్థక నామధేయ మైనది.
9. లోతుగెడ్డ క్రిష్ణంనాయుడుగారు, కొత్తూరు:—మీజీవామృతము బలహీనులపాలిటి వరప్రసాదము.
10. డి. కోటి వీరయ్యగారు, కనగాల:—మీజీవామృతము నరములకు చాలా బలముకలిగించి, రక్తవృద్ధి, వీర్యవృద్ధి యొనర్చినది.

ఆయుర్వేదాశ్రమము, (రిజిస్టరుడు)

151 గోవిందప్పనాయునివీధి, పోస్టుబాక్సు 287, మదరాసు,

తంతివిలాసము:— "పండిట్" మదరాసు.



డి. ఇ. వాచా, ౧౯౦౧-కలకత్తా.



సురేంద్రనాథ బెనర్జి, ౧౯౦౨-అహమదాబాదు.



లాల్ మోహనఘోషు, ౧౯౦౩-మదరాసు.



జి. కే. గోఖలె, ౧౯౦౫-కాశీ.



సర్ హెన్రి కాటను, ౧౯౦౪-బొంబాయి.



దాదాభాయి నౌరోజీ, ౧౯౦౬-కలకత్తా.



రాసబిహారి ఘోషు, ౧౯౦౭-సూరతు.

రాసబిహారిఘోషు, ౧౯౦౮-మదరాసు.



(శ్రీ రత్నా అండు కంపెనీ, చెన్నపురి)

## అఖిలభారత జాతీయ మహాసభాధ్యక్షులు, ౧౯౦౯-౧౯౧౪



సర్ విలియం వెడ్డర్‌బరన్, ౧౯౧౦-అలహాబాదు.



బిషన్ నారాయణధర్, ౧౯౧౧-కలకత్తా.



ఆర్. యన్. మధోల్కారు, ౧౯౧౨-బంకీపూరు.



మదనమోహనమాలవీయ, ౧౯౦౯-లాహూరు.



నవాబ్ సయ్యదు మహమ్మదు బహదూర్, ౧౯౧౩-కరాచి.



భూపేంద్రనాథవసు, ౧౯౧౪-మదరాసు.



సర్ యస్. పి. సింహా, ౧౯౧౫-బొంబాయి.

(శ్రీ రత్నా అండు కంపెని, చెన్నపురి)

స్థాపితము 1890

తంతివిలాసము "నంద"




మావద్ద ఒకబేరముచేసిన, తరువాత మీరెప్పుడు మావద్దనే బేరముచేయుదురు. ఇతరులకు కూడ సిఫార్సు చేయుదురు.

మా సంగతి మేమే తెలుపవలసిన మాకిష్టములేదు. మమ్ములను మా వ్యాపార పద్ధతుల గురించి యితరులు యేమి తెలుపునది గమనింప ప్రార్థితులు.



## నమ్మకమునకు, పనితనమునకు



అందమునకు, మెఱుగుకు



సుప్రసిద్ధమైన నగల దుకాణము



(1) మొదటిరకము సీమకమలములు అమెరికన్ కట్టింగుచి, నిర్మలమైనవి, బ్లూజాగర్ రకములు మొదలగునవి విడిగాను, నగలుకట్టియు ఇచ్చెదము.

(2) సాదా ఉంగరములు, కెంపులు, పుష్యరాగములు, కెంపులు సీమకమలములు చేర్చికట్టబడినవి, జడబిళ్ళలు, తోడులు, మాటీలు, నాగరలు, హంసబిళ్ళలు యెంతధరలో కావలసినను సరఫరా చేయబడును.

(3) నవనాగరికమునకు తగిన పలురకముల నాణ్యమైన బంగారు గాజులు, వంకీలు, నాగవస్తులు, నెక్ చెయినులు, వడ్డాణములు మొదలగునవి తయారుగా నున్నవి.

(4) వెండిపూలబుట్టలు, రైలుకూజాలు, టీ కాఫీసెట్లు, టూర్నమెంటు కప్పులు, పన్నీరుచెంబులు, చందనగిన్నెలు, వెండి బంగారు మెడలులు మొదలగునవి సిద్ధముగా నున్నవి.

(5) పూజకు అర్హమైన వెండివిగ్రహములు, పటములు ఎంతఎత్తులో, ఎంతసైజులో కావలసినను మావద్ద హాజరులో నున్నవి.

**ముఖ్యగమనింపు:**— అక్కరలేనివి, తృప్తికరముగా లేనివి, వారముదినములలో వాపసుచేసిన, పైకము లేక వేరునగ లివ్వబడును. అప్పటమైన సీమకమలములకు, కెంపులకు, పచ్చలకు, పుష్యరాగములకు నవరంబంగారుకు, వెండికి పూచీనిచ్చెదము.





## కోటా మునిరత్నముశెట్టి అండు సన్సు,

సీమకమలములు, రత్నాలు, బంగారు, వెండినగల వర్తకులు,

217, చైనాబజారురోడ్డు, మద్రాసు.



స:॥ 1873 లో స్థాపితము.

# అడిసన్ అండు కో, లిమిటెడ్.

## మౌంటురోడ్డు, మదరాసు.

ఆఫీసులకనుకూలమైన వస్తువులు సప్లయిచేయుటకు దక్షిణ ఇండియాయందు అనాదిగానుండినట్టివారు మేమేయని, అందరిచేతను సమ్మతుల బడసితిమి.

రోనియోడూప్లికేటరు



రోనియోడూప్లికేటరు నెం. 16 మాడల్

రాయల్ పో



కొరోనా నెం. 4





యెల్లమ్స్
టైప్ రైటరు కార్బన్ పేపర్లు
రబ్బనులు,

యెల్ మ్స్ సైక్లోస్టైల్ డూప్లికేటర్లు,
స్టెన్సిల్స్, సిరా, ఫౌంటెన్ కలములు
తదితరములు గలవు.



ROYAL

TRADE MARK
ROYAL TYPEWRITER COMPANY, INC.

TYPEWRITERS

రోనియో
స్టీల్ అలమరలు, తదితరములు
కొనకముందు మమ్ములను విచారించుడు.
తృప్తికి పూచీ నివ్వగలము.

**We are Acknowledged to be the Premier House in S. India for OFFICE APPLIANCES.**

వ్య, శ్రీనివాసయ్యంగారు, జయకరు, జిన్నా, మోతీలాలు నెహ్రూగార్లు మొదలగు దేశభక్తులు నిర్భయముగ ప్రయోగించిన దివ్య ప్రయోగములు నిరంకుశాధికారమును భేదించుటకు వినియోగపడవలసియున్నవి. సామ్రాజ్యాభిమానాంధకారమును తామస తంత్రమువలె సాత్త్వికనిరోధము భేదించుటకు ప్రపంచము మహాదుఃఖవేదన ననుభవించుట దైవయోగముగ నున్నది. బ్రిటీషు కటాక్షలబ్ధములైన భారత రాజ్యాంగ సంస్కరణములు ఈజిప్టు సంధినియమముల రీతిని సారవిహీనము లని గత కాలానుభవమువలె భావికాలానుభవమును విశదము చేయగలదు.

శాసనసభలు,
రాజ్యాంగసంస్కరణములు

శాసనసభలు రాజ్యాంగసంస్కరణముల బూటకమును ప్రత్యక్షము చేసినవి. శాసనసభాప్రవేశ మసహాయోద్యమమును నిర్వీర్యము చేసినది. దేశబంధు చిత్తరంజనదాసుగారి నిర్యాణము స్వరాజ్యపక్షమును దుస్స్థితిపాలు చేసినది. కాంగ్రెసుపక్షము, స్వరాజ్యపక్షము యథోచిత సహకారపక్షము కలిసీ కలియక దేశమును సంక్షోభమయము చేసినవి. కాంగ్రెసుసభ్యులు శాసనసభలయందు చేయగలది లేదు. దేశమునందు నిర్మాణకార్య విధానమును నడుపుట కభిలాష లేదు. శాసనసభలయందు గంభీరోపన్యాసములను జేయుటకైనను కాంగ్రెసునిర్ణయించిన బహిష్కారతీర్మాన మాటంకముగ నేర్పడినది. అన్నిపక్షములవారు కలిసిచేసిన తీర్మానములను ప్రభుత్వము నిరాకరించుచు పరిహసించుచున్నది. తగ్గించిన మొత్తములను ప్రభుత్వము ధ్రువపరచుచున్నది. అన్ని పక్షములవారికిని నొకపాఠమునే ప్రభుత్వాధికారులు నేర్పుచున్నారు. ఆ పాఠము నిరంకుశాధికారపాఠము; బ్రిటీషు సామ్రాజ్యాధికార పాఠము; తెల్లదొరల పాఠము; శాశ్వత దాస్య పాఠము. ఈపాఠములను నేర్పి బ్రిటీషుప్రభుత్వము భారతీయులను మహాదీనులనుచేసినది. ఎంగిలిముక్కలకై పోట్లాడుట ఆత్మవినాశనమునకు సాధనముగాని ఆత్మోద్ధరణమునకు సాధనము గాదు. ఉద్యోగాధికారాపేక్షను పెట్టి విడదీసి నాశనముచేయుట బ్రిటీషురాజ్యతంత్రము. రెండు వందలయేండ్ల యనుభవానంతరముననైనను భారతీయులకు జ్ఞానోదయము గలుగకుండుట దైవశాపముగ నున్నది. అంతర్విభేదములను పోగొట్టి జాతీయైక్యమును సమకూర్చుటకు డిల్లీయందు గూడిన జాతీయైక్యసభ ప్రయోజనకరముగ నున్నది.

జాతీయైక్య సభ

ఉత్తరమున హిందూ మహమ్మదీయ భేదములు, దక్షిణమున బ్రాహ్మణ బ్రాహ్మణేతర భేదములు భారత జాతీయబలమును శిథిలముచేయుచు నిరంకుశాధికార బలమును పోషించుచున్నవి. హిందువులు, మహమ్మదీయులు, బ్రాహ్మణేతరులు, నిమ్నజాతులు ప్రత్యేకముగ హక్కులను గోరుచున్నారు. హిందూ మహాసభ, ముస్లిముసమితి బ్రాహ్మణేతరసభ భరతవర్ష ప్రయోజనములను వెనుకబెట్టి, ప్రత్యేక సాంఘిక ప్రయోజనములను, స్వప్రయోజనములను నాశించుచు, నిరంకుశాధికారుల దయను వేడుచు, నాత్మగౌరవమును, దేశప్రయోజనములను నాశనము చేయుచున్నవి. ప్రత్యేక నియోజకవర్గముల నేర్పరచుటయు, ఉద్యోగ ప్రాతినిధ్యాదులకు పరిమాణవర్గము లేర్పరచుటయు జాతీయ సంయోగమునకుగాని, జాతీయబలమునకుగాని సాధనములుగాక జాతీయ వియోగమునకును, జాతీయ దౌర్బల్యమునకును సాధనంబులగుచున్నవి. అధికార సంపద్గౌరవముల ననుభవించుచున్న బలవంతులును,అధికారసంపద్గౌరవములును గోరెడి దుర్బలులును సమానముగ దైన్యస్థితికిని, కలహములకును గారకులు. బలవంతులు బలహీనులను వంచించి సుఖవంతులగుచున్నారు. బలహీనులు బలవంతులను దిగద్రోసి సుఖవంతు లగుచున్నారు. రెక్కలను కత్తిరించి పంజరములందు బంధించిన పక్షులు ముష్టిగింజలకై గిజగిజలాడుచు పొడుచుకొని పడిపోవును గాని యెగురజాలవు. యాచకులు ఒకరిని మించి యొకరు ముందునకు త్రోసికొనిపోవునపుడు పడిపోవుదురు గాని ముష్టినైనను పొందజాలరు.

బలవంతులును బలహీనులునునగు పుత్రులు స్వార్థపరులై కలహించునపుడు తల్లి దుఃఖములపాలై క్షీణించుచున్నది. క్షీణించుచున్న తల్లి దుఃఖము బిడ్డలకు సంక్రమించుచు దుస్సంతానము గలుగుచున్నది. ఈ దుష్టచక్రమునందు గలుగుచున్న వేగాతిశయము వినాశవేగమునకు సాధనంబైనది. మరణయాతన ననుభవించుచున్న తల్లి పిల్లల దుఃఖయాతనను జూచి విలపించునుగాని దుఃఖ నివారణమును జేయజాలదు.

భారతమాత యనుభవించు చున్న దుఃఖవేదన పండితులందును, పామరులందును, నాయకులందును, అనుచరులందును, హిందువులందును, మహమ్మదీయులందును, బ్రాహ్మణులందును, నిమ్నజాతులందును, పురుషులందును, స్త్రీలయందును, వృద్ధులందును, పిల్లలందును, సర్వత్ర ప్రత్యక్షమగుచున్నది. ప్రజాసత్త్వము సకలాంగములందును క్షీణించినది. బుద్ధిచెడినది. ఇంద్రియములు క్షీణించినవి. శరీరము శుష్కించినది. ఆత్మ నిప్పురుగప్పిన నిప్పువలె నిస్తేజమైనది. భారతభూమి నిస్తేజమైన విధమును చరిత్రేతిహాసములు తెలుపుచున్నవి; డాక్టరు బెజంటమ్మ, గాంధి మహాత్ముడు మొదలగు దేశభక్తులు వ్యక్తము చేయుచున్నారు.

అవతారమూర్తులను కన్నతల్లి యిపుడు గొడ్డువోయినది. త్రిమతములను, షడ్దర్శనములను స్థాపించిన తత్త్వజ్ఞుల సంతానములు బుద్ధిహీనులు! మహావీరుల సంతానములు నిర్వీర్యులు! కర్మదక్షుల సంతానములు సోమరులు! ధర్మపరాయణుల సంతానము లప్రయోజకులు! సకలమును విపర్యస్తముగ నున్నది. పరావలంబనము భారతజాతీయ జీవనప్రవాహమును శుష్కింపజేసినది. చైతన్యమయములైన కారణ శరీరసూక్ష్మదేహములు స్తంభించినవి. జడమయమైన స్థూలదేహముమాత్రము మిగిలియున్నది. కారణదేహకాంతు లెప్పుడైనను కంటబడి ఆత్మ సంస్మరణము గలుగునపుడు నిర్బంధమాయాప్రతి బంధకములు వెలువడుచున్నవి. కారణ కాంతులంతర్హితములగుచున్నవి. సత్యాగ్రహ సంపన్నుడైన గాంధి మహాత్ముడు పిచ్చివాడు. దేశభక్తిపరాయణులైన దాసు, నెహ్రూ, లాలా, మాలవ్యాగారులు రాజద్రోహులు. దేశసేవాపరాయణులైన ప్రజ లప్రయోజకులు; స్వార్థపరులు. ఈ సమ్మోహావస్థయందు భారతమాతకు తరణోపాయము దుర్లభముగ నున్నది. మోక్షమునకు త్యాగము సాధనముగాని భోగము సాధనము గాదు. పండిత మోతీలాలు నెహ్రూగారు భారతస్వాతంత్ర్యసిద్ధికి నాయకు లాత్మ సమర్పణమును జేయుటకు సిద్ధముగా నున్న విధమును శాసన సభయందు సువ్యక్తము చేసిరి. భారతజాతీయ సంయోగము త్యాగాధారమున నిర్మితము గావలసి యున్నది. అన్ని పక్షములవారును స్వీయపక్షముల లాభములకు పెనగులాడునపుడు వియోగముసంభవము గాని సంయోగము సంభవముగాదు. త్యాగమును జేయుటకు గాంధిమహాత్ముడు జాతీయపతాకమునందు చిత్రించిన విధమున అధిక సంఖ్యాకులైన హిందువులు సంసిద్ధులు గావలయును. హిందువులందును జ్ఞానధన సంపన్నులైన ద్విజులు—బ్రాహ్మణ క్షత్రియవైశ్యులు సంపూర్ణ త్యాగమును జేసి భారత జాతీయసత్త్వము నుద్ధరింపవలసిన యవసరము గలిగినది. జాతీయచైతన్యమును త్యాగము సముద్ధరింప వలయునుగాని స్వరాజ్యాంగ నిర్మాణ ముద్ధరింపలేదు. చైతన్యములేని స్వరాజ్యాంగ నిర్మాణములు మృతాకారములుగనుండగలవు. అమృతప్రదాయకమైన త్యాగదీక్షయె లోకము నుద్ధరింపగలదు.

చెన్నరాష్ట్రము భరతవర్షమునందు విచిత్రస్థానమునలంకరించుచున్నది. ఆర్యద్రావిడ సంస్కారముల సంయోగసంఘర్షణము లీవిచిత్రస్థితికి మూలాంకురములుగ నున్నవి. ఆర్యవిజ్ఞానమువలెను ద్రవిడ విజ్ఞానమును దక్షిణాపథవికాసమునకు వినియోగపడినది. బ్రాహ్మణులవలె ఆది ద్రావిడులును ప్రజావికాసమునకు దోడ్పడినవిధము ఆళ్వారులు, నందనారులు విశదము చేయుచున్నారు. దైవభక్తులందువలెను దేశభక్తులందును తారతమ్యముల నెంచుట యసంగతము. ప్రాచీనకాలమునందువలె వర్తమాన కాలము

**చెన్నరాష్ట్రము**

నందును ఆర్యద్రావిడ సంస్కారములు దక్షిణదేశాభ్యుదయమునకు వినియోగపడుచున్నవి. చిరకాల సంవర్ధితంబై సంయోగబలమును బడసిన సంస్కారమును నిర్మూలముచేయుట యసాధ్యము; సాధ్యమైనను నిరర్థకము. దక్షిణాపథము నందును ప్రచండాకారమును దాల్చుచున్న బ్రాహ్మణ బ్రాహ్మణేతరసమస్యను నిర్ణయించుటకును త్యాగము సాధనముగాని భేదము సాధనము గాదు. బ్రాహ్మణబ్రాహ్మణేతర విభేదములు స్వప్రయోజనరూపమున దక్షిణదేశమునందు గలుగజేయుచున్న సంక్షోభము ధర్మహానికి గారణంబుగ నున్నది. కాంగ్రెసుసంఘములందును, శాసనసభలయందును, రాజకీయ పక్షములందును బ్రాహ్మణబ్రాహ్మణేతర విభేదములు పరస్పరవిశ్వాసమును బోగొట్టుచున్నవి. ఒండొరులను నమ్ముటకు వీలు గనుపడకున్నది. శాసనసభా రంగమునం బ్రహసనము విపరీతాకృతిని దాల్చి ధర్మహానికి సాధనంబుగ నున్నది.

మద్రాసు శాసనసభ

మద్రాసు శాసనసభాస్థితి ఘోరముగ నున్నది. సైమను బహిష్కారమును నామోదించిన శాసనసభ కార్యాచరణమునందు వెనుకంజ వేసినది. బహిష్కారమును బోధించిన ప్రజా నాయకులు 144 వ సెక్షను ప్రయోగింపబడినపుడు శాసనమును తిరస్కరించుటకు సంశయాత్మను విశదము చేసిరి. హరతాళదినము నందు తుంటరుల్లరులను జేసి పోలీసు దౌర్జన్యముల కవకాశములను గలుగజేసిరి. ప్రభుత్వము సైనికులను, రక్షక భటులను, ఫిరంగులను, తుపాకులను ప్రదర్శించి ప్రజా హృదయము నందు భయభ్రాంతులను గలుగజేసినది. ప్రభుత్వాధికారులీబీభత్సమును ప్రదర్శించుటకు మూడులక్షల రూప్యములను వ్యయముచేసిరి. ఆవ్యయమును శాసనసభ యామోదించినది. సైమను బహిష్కరణము నామోదించిన రంగనాథము, ఆరోగ్యస్వామి మొదల్యారుగార్లుమంత్రి పదవులను నిర్బంధముగను చాలించుకొనిరి. బహిష్కరణము నామోదించిన ముత్తయ్య మొదలిగారు, సేతురత్నయ్యగారు మంత్రులుగ నేర్పడిరి. శాసనసభాభిప్రాయమునకు వ్యతిరేకముగ ప్రవర్తించిన సుబ్బరాయనుగారు మంత్రిగ నున్నారు. ప్రభుత్వాభిప్రాయములకు వ్యతిరేకులైన ముత్తయ్యమొదలి సేతురత్నయ్య గార్లు మంత్రులుగ నున్నారు. ఈమంత్రివర్గమునందు శాసనసభకుగాని, గవర్నరునకుగాని, స్వీయపక్షమునకుగాని, పరస్పరము గాని విశ్వాస ముండుట కవకాశములు లేవు. కేవల మధికారలాభముమాత్రము మంత్రులను నిలువబెట్టినది. ఆ యధికారలాభమె జస్టిసుపక్ష రక్షణమును బడయుచున్నది. సైమను బహిష్కారమును పోషించిన జస్టిసు పక్షము మంత్రివర్గమును సైతము పోషించుట విచిత్రముగ నున్నది. దేశలక్ష్యము ధర్మలక్ష్యము లేక స్వార్థలక్ష్యము ప్రబలునపుడు తాత్కాలికముగ పక్షలాభము గలిగినను దేశప్రయోజనములు భగ్నము లగుచున్నవి. రామారాయణంగారు, సుబ్బరాయనుగారి మంత్రివర్గమున కభయము నొసంగుట జస్టిసుపక్షమునకును, బ్రాహ్మణేతర పక్షమునకును తాత్కాలికముగ లాభించినను దేశమునకును, ధర్మమునకును హానికరములుగ నుండగలవు. సంకల్పాచరణములకు సామ్యత్వము గలుగునపుడు విషఫలము సాధ్యముగాని సత్ఫలము సాధ్యముగాదు. సైమను బహిష్కారమున కారంభమునందు సమ్మతించిన రాజా రామారాయణంగారు సైమనుకమిషను నామోదించెడి మంత్రివర్గము నెటులు సమర్థింపగలరో దుర్గ్రాహ్యముగ నున్నది. పక్షములును, నాయకులును గోరునది స్వప్రయోజనములుగాని దేశప్రయోజనములు కావు. లామెంబరు బ్రాహ్మణేతరులైనను, మంత్రులందరును బ్రాహ్మణేతరులైనను, బ్రాహ్మణేతరసంఘము సంపూర్ణవికాసమును బడయజాలదు. రాజారామారాయణం గారు రాజ్యాంగ పరిజ్ఞానమును స్వరాజ్య సంపాదనమునకు వినియోగించుట ప్రయోజనకరముగాని ఉద్యోగములను సంపాదించుటకు వినియోగించుట ప్రయోజనకరము గాదు. సుబ్బరాయను మంత్రివర్గము నిలిచియున్నను, జస్టిసుపక్షము బలమును పొందినను, ఈయధర్మసంయోగ మధర్మఫలమును సమకూర్చునుగాని ధర్మఫలమును సమకూర్ప జాలదు. కాం

గ్రెస్సుప్రతిజ్ఞను భంగముచేసిన ముత్తయ్య మొదల్యారు, సేతురత్నయ్యగార్లును, శాసనసభాభిప్రాయమును ప్రతిఘటించిన సుబ్బరాయనుగారును, స్వీయాభిప్రాయములను పరోక్షముగ భంగముచేసిన జస్టిసుపక్షనాయకులును సందిగ్ధసమయమునందు భారతమాతకు మహోపకారమును జేసిరి. సైమనుగారు బహిష్కారము శిథిలమగుచున్నదనియును, సహకారము పెరుగుచున్నదనియును బ్రిటీషు దేశమునకు సందేశములను బంపుచున్నారు. గోషెన్ప్రభువుగారి యాచరణము సకల విధములను ధర్మవిరుద్ధముగ నున్నది. నిరంకుశప్రభుత్వ మవలంబింప గల చతురోపాయములను గోషెన్ప్రభు వవలంబించిన దుస్తంత్రము విశదము చేయుచున్నది.

శ్రీయుత వెంకటరామశాస్త్రి గారిని లామెంబరుగ నియమించి వారి శాఖలను సంప్రతింపకయే తీసివేయుట ధర్మవిరుద్ధముగ నున్నది. స్వపక్ష విశ్వాసమును, శాసనసభా విశ్వాసమును గలిగియుండని సుబ్బరాయనుగారిని, ప్రతిజ్ఞాభంగము చేసిన కాంగ్రెసు సభ్యులను మంత్రులజేసి యాడించుచున్న రామారాయణంగారి చాతుర్యమును, గోషెన్ప్రభువుగారి నైపుణ్యమును ప్రశంసనీయములుగ గనుపడుచున్నను కాలాంతరమున పరమానర్థములకు గారణములుగా గలవు. కాంగ్రెసుపక్షమును ధ్వంసముచేయుటకు బూనుకొనిన స్వదేశీయులు, విదేశీయులు కృతకృత్యులైనను అధర్మఫలము ఫలించగలదు. అసహాయోద్యమధర్మమును విసర్జించి శాసనసభలయందు జేరి కాంగ్రెసుపక్షబలమును నిర్వీర్యముచేసిన స్వరాజ్య పక్షమునకును నిర్గమనము సమీపించుచున్నది. శాసనసభారంగములు తంత్రముల కాటపట్టయిన విధమున కార్యసిద్ధికి రంగములు గావని నిత్యానుభవము విశదము చేయుచున్నది. దేశసేవాపరాయణులు నిర్మాణ కార్యదీక్షాపరాయణులై మంత్రిపదవులను, కార్యనిర్వాహక సభ్యత్వములను, స్థానికసంఘసభ్యత్వములను, శాసనసభాసభ్యత్వములను పరిత్యజించి, అధికారకలహముల కాకరంబైన చెన్నరాష్ట్రమునందు శాంతిని స్థాపించుట శ్రేయఃప్రాప్తికిని స్వరాజ్యసిద్ధికిని సాధనముగ నుండగలదు.

ఆంధ్రరాష్ట్రము

ఆంధ్రరాష్ట్రము బలాధికార సంపదలు లేక పరమదైన్యము ననుభవించుచున్నది. ఆంధ్ర స్వభావ స్వరూప విరహితమైన మద్రాసు రాజ్యస్థానము. రాజధానీ నగరమునందుగల యాంధ్రులు ప్రత్యభిజ్ఞానము లేక కాలయాపనమును జేయుచున్నారు. ప్రత్యభిజ్ఞానముగల యాంధ్రు లధికారప్రాప్తికై పరితపించుచున్నారు. ఉద్యోగములందును, వ్యాపారవాణిజ్య పరిశ్రమలందును ఆంధ్రులకు వారి గుణగణంబుల కనురూపమైన ప్రతిపత్తి గలుగకున్నది. లామెంబరుపదవిని ఆంధ్రున కొసంగుటకు జేసిన ప్రయత్నములు విఫలము లైనవి. నీటి పారుదల విషయమునను, పరిశ్రమలవిషయమునను ఆంధ్రదేశమునకు ప్రభుత్వాదరణము గలుగకున్నది. స్వల్ప ఫలదాయకమైన మెట్టూరు నిర్మాణమునందుగల యభిమానము విశేషఫలదాయకములైన కృష్ణాతుంగభద్రా నిర్మాణములమీద గలుగకున్నది. ఆంధ్రవిశ్వవిద్యాలయ మధోగతిపాలైనది. విశ్వవిద్యాలయ వికాసమునకు ప్రభుత్వము ధన సహాయమును జేయజాలకున్నది. ఆంధ్రు లన్యోన్యకలహములతో విశ్వవిద్యాలయ ప్రవృత్తిని స్తంభింపజేసిరి. స్థలముల తగాదాలతో రెండేండ్లు గడచిపోయినవి. ఉపసంఘసభ్యులు ఏక కేంద్రవిశ్వవిద్యాలయమును సిఫారసు చేసిరి. విశ్వవిద్యాల యాందోళనమునందు విశ్వప్రయత్నములను చేసిన రాజమహేంద్రపురవాస్తవ్యుల కాశాభంగము గలిగినది. అనంతపురవాస మాంధ్రవిశ్వవిద్యాలయమునకు విఘ్నములనుగలుగ జేయుచున్నది. ఉత్తరాంధ్రు లాంధ్రదేశమునకు దూరస్థమగుచున్నదని భయపడుచున్నారు. కర్ణాటకు లాంధ్రవిశ్వవిద్యాలయమును కర్ణాటకప్రాంతములందు బలవంతముగ స్థాపించుచున్నా రని మొరలిడుచున్నారు. దత్తమండలవాసులు- ముఖ్యముగ అనంతరపుర వాస్తవ్యులు, అనంతపురవాసమును గట్టిగ కోరుచున్నారు. రాజ్యాంగములందు వలెను విద్యాంగములందును స్థలాభిమానము, స్వార్థాభిమానము విద్యాలక్ష్యమును నిర్మూలము చేయుచున్నది. ఆంధ్రవిశ్వవిద్యాలయ మాంధ్రదేశ మధ్యస్థమై

ఆంధ్రాభ్యుదయమునకు వినియోగపడవలసి యున్నది. ఆంధ్రవిద్యాభిమాను లందరును నీ లక్ష్యమును గమనించి విశ్వవిద్యాలయమును సార్థకముచేయుటకు భగవంతు డను గ్రహించుగాత! శ్రీయుత రామలింగారెడ్డి గారిని తిరిగి వైసుచాన్సలరుగను ఎన్నుకొని సినేటుసభ్యులు స్వధర్మ నిర్వహణమునుచేసి కృతకృత్యులైరి. ఆంధ్రసమస్యలన్నియును ఆంధ్రరాష్ట్రసమస్యమీద నాధారపడియున్నవి. ప్రత్యేకాంధ్రనిర్మాణమున కాంధ్రులు ప్రయత్నము చేసి ఆంధ్రోద్యమమును సఫలముచేయుట వర్తమాన సందిగ్ధ సమయమునందు పరమావసరముగ నున్నది.

ఆంధ్రోద్యమమునకు కీలకమైన ఆంధ్రరాష్ట్రనిర్మాణావసరమును వివిధపక్షములవారును నంగీకరించు చున్నారు. భాషాప్రయుక్త రాష్ట్రవిభాగమును కాంగ్రెసు అంగీకరించినది. ఆ రేండ్లనుండియును ఆంధ్ర

**ఆంధ్రరాష్ట్రము**

రాష్ట్రజాతీయోపసంఘము వ్యక్తిత్వమును గలిగి పనిజేయుచున్నది. విజయవాడయందు గాంధి మహాత్ము డారంభించిన ఖద్దరు ఉద్యమము, బహిష్కారత్రయము స్వరాజ్యవాదమును దేశమునం దంతటను మారుమ్రోగించినది. అసహాయోద్యమ ప్రస్థానమునం దాంధ్రనాయకులు పురోగమనము చేసి ఆంధ్ర ప్రతిష్ఠను భరతఖండమునందు సువ్యక్తము చేసిరి. వేలకొలది యువకులు మహాత్యాగముచేసి కారాగృహ వాసమును స్వీకరించి మాతృదేశారాధనమును చేసి ధన్యవాదములను బడసిరి. చెన్నరాష్ట్రశాసనసభ ఆంధ్రరాష్ట్ర నిర్మాణ తీర్మానము నామోదించినది. వర్తమాన సంవత్సరమునందును రాష్ట్రతీర్మానమును తిరిగి యామోదించినది. ఢిల్లీనగరమునందు రాజ్యాంగనిర్మాణములను యోచించుచున్న వివిధపక్షముల సభయును భాషాప్రయుక్త రాష్ట్రవిభాగమును, అందును ఆంధ్రరాష్ట్ర నిర్మాణమును నిర్ణయించినది. సైమనుకమిషను నిర్ణయించెడి రాజ్యాంగ సంస్కరణములు రాష్ట్రీయస్వాతంత్ర్యమును నిర్ణయించుననను ప్రబలమైన వదంతులుగలవు. ఆంధ్రరాష్ట్ర నిర్మాణమున కారంభమునందు ప్రతికూలమైన వాతావరణ మిపుడనుకూలముగ నున్నది. అసహాయోద్యమ సాధకులైన యాంధ్రులు నిస్సహాయస్థితి నుండుట సంతాప కరముగ నున్నది. అధికార ప్రాతికూల్యమును, ప్రజల యలసత్వమును నాంధ్రోద్యమ ప్రవాహము నరికట్టినవి. నాయకులకు, ప్రజలకు చెన్నపురియాశ్రయము సత్యజీవనము నందు తప్పనిసరి యైనది. స్థానిక సంస్థలందు నియామకములకై చెన్నపురిచుట్టును తిరుగుటకు చేసిన వ్యయప్రయాసము లాంధ్రుల నిస్సహాయస్థితిని విశదముచేయుచున్నవి. తమిళాంధ్రసంయోగ ముభయులకును మనస్తాపములకు గారణంబై సంతాపానలము ప్రజ్వరిల్లు చున్నది. కౌన్సిలునందును, ఉద్యోగములందును, సభలయందును, నిర్మాణములందును నీవిభేదములు మనస్తాపమును గలుగజేయు చున్నవి. ప్రభుత్వము ప్రయోగించిన 144 వ శాసనము నుల్లంఘన సందర్భమున నీవిభేదములు బహిరంగములైనవి. ఆంధ్రోద్యమ వికాసమున కాంధ్రులకు ప్రత్యేక స్థితియును, ఆంధ్రరాష్ట్రనిర్మాణమును నవసరంబు లని గత కాలానుభవము విశదము చేసినది. ఆంధ్రోద్యమ ప్రాప్తికి సాధనముమాత్రము మృగ్యముగ నున్నది.

ఆంధ్ర జాతీయజీవనము స్తంభించిన వర్తమాన సమయమునందు కర్తవ్యము దుర్గ్రహముగ నున్నది. అసహాయోద్యమ ప్రస్థానము దుస్తరమైనది. శాసనసభా బహిష్కార మవరోధమును బొంది

**ఆంధ్రుల కర్తవ్యము**

నది. స్వరాజ్యవాదులు శాసన సభలయందు వాదప్రతివాదములతో కాలయాపనము జేయుచున్నారు. కాంగ్రెసుప్రచారకులు నిరాధారులై జీవనోపాధులను గల్పించుకొనుచు కాలయాపనమును జేయుచున్నారు. ఖద్దరుప్రచారము ద్రవ్యములేక స్తంభించుచున్నది. చరఖాసంఘమున కీయవలసిన బాకీల నిచ్చుటకు ఖద్దరు నిర్వాహకు లలసత్వమును జూపుచున్నారు. సత్యాగ్రహాశ్రమములు నిర్వీర్యములుగ నున్నవి. ఆంధ్రహృదయము నలసత్వము సంపూర్ణముగ నావహించినది.

అసహాయోద్యమారంభము నందు మహాప్రతిష్ఠను బడసిన ఆంధ్రదేశము వర్తమానకాలమునందు తన ప్రతిష్ఠను గోల్పోయి స్తంభించినది. దేశ మంతఃకలహములతో నిండినది. నాయకులు, ప్రచారకులు పరస్పర విశ్వాసము లేక వాదప్రతివాదములతో గాలయాపనమును జేయుచున్నారు. అనుచరులు లేనినాయకులు దేశమునం దంతటను గలరు. కాంగ్రెసు సంఘములు నామమాత్రావశిష్టములుగ నున్నవి. కాంగ్రెసుసభ్యుల సంఖ్య అత్యల్పముగ నున్నది. కొన్ని మండలములందు మండలసంఘములు సైత మపరూపముగ నున్నవి. ప్రజల

లక్ష్యము కాంగ్రెసుసంఘములనుండి మరలి స్థానిక సంస్థలందు లగ్నమైనది. స్థానికసంస్థలు కక్షులకును, పక్షములకును నిలయములుగ నున్నవి. శాసనసభయందు కాంగ్రెసుప్రతినిధులు నిస్సహాయులైనను సంయోగము లేక ప్రవర్తించుచున్నారు. చరఖాసంఘశాఖయందును నాయకులకును, ప్రచారకులకును పరస్పర విశ్వాసగౌరవములు గలుగకున్నవి. చరఖాసంఘమునందు జేరి నూలుచందా నిచ్చెడి సభ్యుల సంఖ్య క్రమముగ తగ్గిపోవుచున్నది. ఆంధ్రుల దురదృష్టము వలన గాంధిమహాత్ముని యాంధ్రదేశ సంచార మెప్పటికప్పుడు వెనుక బడుచున్నది. ఖద్దరునందు కలితి గలదను సందేహము చరఖాసంఘమునకు గలిగినది. పట్టుశాలి సన్నబట్టలవిషయమై సందేహము గలిగినపుడు ఖద్దరుప్రచారమును నపఖ్యాతి పాలగుచున్నది. కాంగ్రెసు ప్రతినిధులును, నాయకులును శాసనసభలయందు చేయగలదియును, నిర్మాణకార్యవిధానమునందు చేయుచున్నదియును గనుపడదు. ఈసందిగ్ధస్థితియందు కాంగ్రెసు కార్యవిధానమున నవీనసాధనలను నిర్ణయించుట రాజ్యాంగాందోళనమున కవసరంబుగ నున్నది. ఆయవసర మైనను భగవదనుగ్రహమువలన రావలయును గాని ప్రజలప్రయత్నము వలన రాజాలదు. సైమనుకమిషను గలుగజేసిన సంచలనము కమిషను వెడలుటతో నాగిపోయినది.

ఆంధ్రప్రజా వికాసము

మానవప్రయత్నములకు ఫల మాత్మవికాసము. సాహిత్యము, కళలు, శాస్త్రములు, కర్మలు, రాజ్యాంగములు మానవుల యాత్మవికాసమునకు వినియోగపడుచున్నవి. పరతంత్ర దేశములందు విద్యావంతుల లక్ష్య మాత్మవికాసమునకు మూలమైన స్వరాజ్య సంపాదనమునందు సహజముగ లగ్నమగుచున్నది. ప్రజాసామాన్యమునకును, నాయకులకును వర్తమాన విషాదావస్థయందు శాసనోల్లంఘన ప్రస్థానముగాని, సత్యాగ్రహ ప్రస్థానముగాని సాధ్యము గాకున్నది. ప్రజల లక్ష్యమును బాహ్యసాధనములనుండి యాంతరంగిక సాధనములకును, పరాపేక్షనుండి స్వాయంసహాయమునకును మరల్చుట స్వారాజ్యసంరంభమునకు సాధనంబుగ నుండగలదు.

ఆంతరంగిక సాధనములు

స్వరాజ్యసంపాదనమునకు సాయుధప్రతిఘటనము ప్రపంచమునకు పరిపాటియైన సాధనము. నిరాయుధులైన భారతీయులకు సాయుధప్రతిఘటన మసాధ్యముగ నున్నది. స్వల్పమైన ప్రతిఘటనము మహాసంక్షోభమునుగలుగజేయుచు నిర్బంధప్రయోగమునకు గారణం బగుచున్నది. ఫిబ్రవరి మాసమునందు చెన్నపురియందు ప్రదర్శింపబడిన సైనికులు, మరఫిరంగులు, రక్షకభటులు, గుండ్లప్రయోగములు భారతీయుల నిస్సహాయస్థితిని వెల్లడిచేయుచున్నవి. దుర్మార్గుల యల్లరులకు నిరపరాధులు బలియగుచున్నారు. నిర్బంధములు బయలుదేరుచున్నవి. ప్రజలద్రవ్యము పాడగుచున్నది. చిరకాలాభ్యాసములేని సాయుధప్రతిఘటనము దుస్సాధ్యముగ నున్నది. సాధ్యమైనను వర్తమానకాలమునందు విసర్జింపదగియున్నది. చీనాయందు జరుగుచున్న సాయుధపరివర్తనము మహాసంక్షోభమును గలుగజేయుచున్నది. దేశమంతయును రక్తసిక్తమై భయంకరముగ నున్నది. పరాధీనులై, నిరాయుధులై, సాధుజీవన మభ్యాసమైన ప్రజలు సాయుధప్రతిఘటనమును జేయుట సులభసాధ్యము గాదు. సంగ్రామములు పశుబలమును ప్రదర్శనము జేయుటకు వినియోగపడుచున్నవి గాని మానవధర్మప్రదర్శనమునకు వినియోగపడుటలేదు. పరులను పీడించుట ఆత్మనాశనమునకు సాధనం బగుచున్నది.

కార్యసిద్ధికి సంకల్పము బీజము. సంకల్పసామర్థ్యము విజయమునకు మూలము. సంకల్పసిద్ధికిధ్రువప్రహ్లాదాదులవలెసాత్త్వికనిరోధమునభ్యాసముచేయుటఆత్మవికాసమునకును, మానవకల్యాణమునకును ప్రయోజనకరములుగ నున్నవి. సాత్త్వికనిరోధము చిరకాలాభ్యాసము వలన సంప్రాప్తము గాగల విధమును ప్రహ్లాదుని వైష్ణవభక్తి, ధ్రువుని తపోనిష్ఠ విశదము చేయుచున్నవి. వైష్ణవభక్తి విష్ణుకటాక్షమును వలె దేశభక్తి దేశమాతను ప్రత్యక్షము చేయుచున్నది. దేశమాత నారాధించి మాతృప్రసాదమును బడయుట కనంతములైన సాధనములు గలవు. దేశభక్తులు స్వీయసంస్కారమున కనురూపముగ దేశారాధనమును జేసి కృతార్థులగుటకుదృఢసంకల్పము, కార్యదీక్ష సాధనములుగ నున్నవి.

అనన్యమైన దేశసేవను, మానవసేవను చేయగల గాంధిమహాత్ముని బోలిన దేశభక్తు లపరూపముగ నున్నా

రు. వారివారి సంస్కారములకును, స్థితిగతులకును దగి నటులు సేవను జేయుటకు సకలజనులకును నవకాశములు గలవు. రాజారామారాయణంగారు మంత్రిమై సేవను జేయదగును. సాంబమూర్తిగారు నిరోధమును, శాసనోల్లంఘనమును, సాత్త్వికనిరోధమునుబూని సేవను జేయదగును. సీతారామశాస్త్రిగారు ఖద్దరు వ్యాపనమును జేసి సేవనుజేయదగును. కాంగ్రెసు ప్రచారకులు, ఖద్దరు ప్రచారకులు వారి శక్త్యనుసారము సేవను జేయదగును. దేశమంతయు నేకముఖమున నడుచుట వర్తమానపరిస్థితులందు సాధ్యముగాదు. స్వార్థములేని దేశసేవ నేమార్గమున, నెవరు చేసినను దేశమాతకు జేరుచున్నది. స్వార్థరహితులైన దేశసేవకులు పట్టణములందును, గ్రామములందును ప్రజాసేవను జేయుట కపారమైన యవకాశములు గలవు. అయవకాశములను సఫలము చేయుట కాత్మవిశ్వాసముగల స్వయంసేవకులు గావలసియున్నారు. భారతదేశమునకు విమోచనము స్వయంసహాయము వలన రాగలదు గాని పరసహాయమూలమున రాజాల దని ప్రాజ్ఞు లందఱు నంగీకరించుచున్నారు.

**స్వయం సహాయము**

పరావలంబనమున కలవాటు పడిన ప్రజలకు స్వయం సహాయము సులభసాధ్యము గాదు. కష్టపడక యెంగిలికూడును దినుట కంగీకరించెడివారును గలరు. ఆశ్రయించి ఏగుమాస్తాపనియో సంపాదించి మురియుట దేశమునందు పరిపాటియైనది. బ్రాహ్మణేతర సమస్య కేవల ముద్యోగముల సమస్య గాని దేశారాధనసమస్య గాదు. ఉద్యోగములకై పెనగులాడువా రున్నను ఉద్యోగాపేక్ష లేక సేవాదీక్షను వహింపగల స్వయం సేవకులు దేశక్షేమమునకు గావలయును. సహాయనిరాకరణోద్యమ మారంభమునందు వందలకొలది స్వయంసేవకులను దేశమునకు సమర్పించినది. ఉత్సాహము చల్లబడినతోడనే సేవకులును చల్లబడుట సంప్రాప్తమైనది. స్వరాజ్య సంరంభము చిరకాలము జరుగ నున్నదిగాని శీఘ్రకాలములోన ముగియునది గాదు. స్వరాజ్యము సంప్రాప్తమైనను, కాకపోయినను ప్రజాసేవకు స్వయంసేవకులు సాధకులుగ నున్నారు. ప్రజావికాసమునకు రాజ్యాంగము లోకసాధనము గాని సమగ్రసాధనముగాదు. నిరంకుశాధికారుల హస్తములందు రాజ్యాంగ సాధనము నిరర్థకముగ నున్నది. గోపాలకృష్ణ గోకలె, బెజంటమ్మ, గాంధిమహాత్ముడు సేవాశ్రమములను స్థాపించి సేవకులను సిద్ధము చేయుటకు బ్రయత్నములను జేసియుండిరి. ఆప్రయత్నములు విశాలమైన దేశమున కత్యల్పములుగ నున్నవి. ఆంధ్రదేశాభ్యుదయమునందు సర్వతోముఖమైన వికాసము గలుగుటకు స్వయంసేవకులు వేలకొలది గావలసియుందురు. ప్రజలయందు స్వయంసహాయదీక్ష వ్యాప్తము గావలసియున్నది. సేవాపరాయణులైన నాయకులు క్షుద్రమైన పదవులకు పెనగులాడుటను మాని సేవానిరతులై సకలరంగములందును పాటుపడుటకు పూనుకొనిమెదరుగాక. సేవాశ్రమములను స్థాపించి సేవాదక్షులను సిద్ధము చేయుటకు ప్రజానాయకులు పూనుకొనుటయును నవసరమై యున్నది.

**సాహిత్యకళలు**

సర్వతోముఖమైన ఆంధ్రప్రజా వికాసమునకు సాహిత్యము, శాస్త్రములు, కళలు వికాసమును పొందుటకు ప్రజలును, పండితులును పాటుపడవలసి యున్నారు. ప్రజాహృదయమునందు విజ్ఞానము లేక వికాసము సాధ్యము కాదు. వికాసము లేని ఆప్రయత్నములు సంకుచితములై, స్వార్థపరములై దేశప్రయోజనమునకు నిరర్థకము లగుచున్నవి. సాహిత్యకళా రంగములందు ప్రభుత్వాదరణము లేక ఆంధ్రవిద్యావంతుల ప్రయత్నములు నిరర్థకము లగుచున్నవి. గతసంవత్సరమునందు ఆంధ్రవాఙ్మయమునందు 800 గ్రంథములు ప్రచురింపబడినవి. ప్రచురింపబడిన గ్రంథములందు నవలలు, నాటకములు, మతగ్రంథములు ప్రధానములుగ నున్నవి. ఆంధ్రహృదయస్వభావమునకు సహజములైన భావగీతములను కవికుమారులు ప్రచురించిరి. భావగీతములును, కథలును, నవలలును ఆంధ్రుల భావవికాసమునకు నిదర్శనములుగ నున్నను పాండిత్యావసరమునువిశదము చేయుచున్నవి. ప్రచురింపబడిన గ్రంథములందు శాస్త్రగ్రంథములు, పరిశోధకగ్రంథములు స్వల్పములు.ఆంధ్రవాఙ్మయ చరిత్రమునందు బ్ర. శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి షష్టిపూర్తి ఉత్సవము సంస్మరణీయముగనున్నది. లక్ష్మీనరసింహంగారి గ్రంథములు దేశమునకుజేసిన ఉపకార మాంధ్రుల హృదయమునకు దెలిసియున్నది.వారినవలలు, నాటకములు,ప్రహసనములుహాస్యరసపూరితములైఆంధ్రవాఙ్మయమునందు నవయుగ వికాసమునకుదోడ్పడినవి. దేశోద్ధారకులందుసాహిత్యవిశారదులు ప్రముఖులుగ నున్నారు. సాహిత్యనిర్మాతలైన లక్ష్మీ

నరసింహంగారి సాహిత్యసేవను, దేశసేవను, మానవ సేవను ప్రజలు గ్రహించి, వారి నుచితరీతిని సత్కరించి, ధన్యవాదములను బడయుదురు గాత! గతసంవత్సరమునందు గుంటూరు జిల్లాయందు నాగార్జున కొండ సామీప్యమున వెలువడిన స్తూపములును, శిలా శాసనములును ఆంధ్రదేశచరిత్రమునందు నవీనాంశములను బహిర్గతము చేయుచున్నవి. శిలాశాసనములు ప్రాకృతభాషయందు గలవు. పురాతనమైన ఇక్ష్వాకు వంశమును దెలుపుచున్నవి. గోలిస్తూపమునందలి శిలా నిర్మాణము లమరావతి స్తూపనిర్మాణములవలె కర్మ కౌశలమును దెలుపుచున్నవి. చెన్నపురి ప్రభుత్వ మాంధ్రశాసనములను ప్రచురించుటయందు జూపుచున్న యలసత్వము విజ్ఞానవ్యాపకమునకు ప్రతిబంధకముగ నున్నది. ఈవిషయమై ఇంతవరకును జేసిన ప్రయత్నములు విఫలములైనవి. మంత్రు లాంధ్రులైనను, ఆంధ్రేతరులైనను సమానమైన ఫలమే కలిగినది. ఇపుడీశాఖ కేంద్రశాఖ యగుటవలనను స్థితి మరింత అయోమయముగ నున్నది. శ్రీయుత మల్లంపల్లి సోమశేఖరశర్మగారును, నితర పరిశోధకులును శాసనపరిశోధనలందు జేయుచున్న పరిశ్రమ ప్రశంసనీయముగ నున్నది. ఆంధ్రదేశచరిత్రకును, వాఙ్మయచరిత్రకును సంబంధించిన శాసనాదులెన్నియో మూల బడియున్నవి. ఆంధ్రపరిశోధకులు ప్రభుత్వాపేక్షను వదులుకొని శాసనాదులను పరిశోధించి రాజ్యాంగములందు వలెను విజ్ఞానాంగమునందును స్వయంసహాయమునకు మార్గదర్శకు లగుదురు గాక!

విభవ సంవత్సరాది సంచిక భగవదనుగ్రహము వలన ఆంధ్రమహాజనుల సహాయప్రోత్సాహముల వలనను వెలువడినది. ఇది పందొమ్మిదవ

విభవ సంచిక

సంచిక. సంవత్సరాదిసంచికలను సాకల్యముగను బరిశీలించినపు డాంధ్రప్రజాజీవితమునందు గలుగుచున్నవికాసము గోచరంబగుచున్నది. వంగదేశ విభజన సమయమునందు బహిర్గతమైన జాతీయప్రబోధముతో నాంధ్రపత్రికయును వెడలినది. గతించిన ఇరువదేండ్లయందును యథాశక్తిని దేశసేవను భాషాసేవను జేయుచున్నది. వెనుకటిసంచికలకువ్యాసములనువ్రాసితోడ్పడిన మహాజనులం దెందరో స్వర్గవాసమును జేయుచున్నారు. దేశావృతమైన కాలభావపరివర్తనము సంచికలయందు ప్రతిఫలించుచు సంచికల ప్రయోజనమును విశదముచేయుచున్నది. విభవసంచికయందు గోచరంబయ్యెడి భావరూపపరివర్తనము ప్రజాహృదయములందు గలిగిన పరివర్తనమును ప్రతిబింబించుచున్నది. ఆరంభమునందు వింతగ దోచిన యత్న మిపుడు సర్వసాధారణముగ నున్నది. పేరుగల పత్రికలన్నియును సంవత్సరాది సంచికలను బ్రచురించుచు కాలస్వభావమును ప్రతిబింబించుచున్నవి.

విభవ సంవత్సరసంచిక యందు కాంగ్రెసు విషయములు ప్రధానములు. చెన్నపురియందు గూడిన 42 వ కాంగ్రెసుకు సంబంధించిన అధ్యక్షోపన్యాసము, పటములు ప్రచురింపబడినవి. ప్రచురింపబడిన వ్యాసముల విభాగములు వివిధవాఙ్మయశాఖలందును ఆంధ్రహృదయమునందు ప్రవర్ధమానంబగుచున్న యభిమానాభినివేశములను విశదముచేయుచున్నవి. సారస్వతమునందు కథలు పాఠకుల హృదయముల నాకర్షించుచున్నవి. సచిత్రములైన కథలు సంవత్సరాది సంచికకు నూతనాలంకారములుగ నున్నవి. నాటకవైద్యవ్యవసాయకళ లభివృద్ధి బొందవలసిన విధము నాయాశాఖలయందలి వ్యాసములు విశదము చేయుచున్నవి. పద్యములు భావపూరితములై ఆంధ్రహృదయోద్వేగమును విశదము చేయుచున్నవి. ప్రకటించినచిత్రపటము లాంధ్రదేశమునందు చిత్రకళావికాసము జరుగుచున్న విధమును విశదము చేయుచున్నవి. పదేండ్లయందు చిత్రకళ ఆంధ్రదేశమునం దత్యద్భుతముగ వికసించినది. ఆంధ్రచిత్ర కళవ్యక్తిత్వమును గలిగి ప్రత్యేక వైఖరిని గలిగియున్నది. సంచికయందుగల ఆంధ్రచిత్రకారుల చిత్రము లాంధ్రవైఖరిని విస్పష్టము చేయుచున్నవి. జంగమదేవర మొదలగు చిత్రములును భావగాంభీర్యమును దెలుపుచున్నవి. ముఖపటమునందు భారతసహాయ నిరాకరణయోధులు స్వరాజ్య పతాకములను ధరించి మాతృదేశారాధనమును జేయుచున్నవిధము వ్యక్తముచేయబడినది. కాంగ్రెసు సభాధిపతుల పటములు గలవు. విభవ సంవత్సరాది సంచికను యథాశక్తిని మనోహరముగ ప్రచురించి యాంధ్రలోకమునకు సమర్పింపగలిగినందుల కాంధ్రలోకమునకును,పరమేశ్వరునకును వందనంబుల నర్పించుచున్నాము. భగవంతుడు విభవ సంవత్సరమునందు సకలలోకములకును శుభంబులను ప్రసాదించి కాపాడుగాత!

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.



అంబికాచరణ మజుందారు, ౧౯౧౬-లక్నో.



సయ్యదు హసన్ ఇమాం, ౧౯౧౮-బొంబాయి(స్పె)



పండిత మోతిలాల్ నెహ్రూ, ౧౯౧౯-అమృతసరము.



ఆనీ బిసెంటు, ౧౯౧౭-కలకత్తా.



లాలా లజపతిరాయి, ౧౯౨౦-కలకత్తా (స్పెషల్).



సి. విజయరాఘవాచారి, ౧౯౨౦-నాగపూరు.



హకీమ్ అజ్మల్ ఖాన్, ౧౯౨౧-అహమదాబాదు.

పండిత మదనమోహన మాలవీయ, ౧౯౧౮-డిల్లీ.



(శ్రీ రత్నా అండు కంపెని, చెన్నపురి)

అఖిలభారత జాతీయ మహాసభాధ్యక్షులు, ౧౯౨౨-౧౯౨౮ ఆంధ్రపత్రిక విభవ సంవత్సరాదిసంచిక



సి. ఆర్. దాసు, ౧౯౨౨-గయ.



అబ్దుల్ కలామ్ అజాద్, ౧౯౨౩-ఢిల్లి (స్పెషల్).



మహమదాలీ, ౧౯౨౩-కాకినాడ.



మహాత్మాగాంధి, ౧౯౨౪-బెల్గాము.



సరోజినీదేవి, ౧౯౨౫-కాన్పూరు.



యస్. శ్రీనివాసఅయ్యంగారు, ౧౯౨౬-గౌహతి.



డా. యం. ఏ. అన్సారి, ౧౯౨౭-మదరాసు.

(శ్రీ రత్నా అండు కంపెని, చెన్నపురి)

# ప్రభవాబ్దనిరసనము

యు. వేంకటనరసు గారు

ప్రభవసమాఖ్య వత్సరుఁ డవాప్తశుభోదయుఁ డౌచు మాకు స
ద్విభవము లెన్నొ యిచ్చు నని వేయు విధంబులఁ గోర్కు లూఱ నీ
ప్రభవమునాఁ డనూనముగఁ బండువుఁ జేసితి మున్న సొమ్ముతోఁ
బ్రభవ, నిజాంతరంగశఠభావముఁ జూపితి వౌర! వెంటనే.

అఱువది యేండ్ల కొక్కతఱి యంట మహాత్ముని నిన్ భజింపనౌ
తరుణము సంభవించు టని తార్కొను వేడుకఁ బిన్నపెద్ద లం
దఱమును మిన్ను ముట్టితిమి దండము దండము! గండ మాయె నీ
కఱకుఁ దనంపు టేలుబడి కష్టులకున్ వల దోమహా ప్రభూ!

క్షితి నీపాదముఁ బెట్టి పెట్టకయె యిస్సీ! గ్రామముల్ గాలె దు
ర్మతులెంతేఁ జెలరేఁగి రుద్ధతిని సన్మార్గంబుఁ బాడాయెఁ బై
మతవిద్వేషము హెచ్చె రోగములు ముమ్మారుల్ ప్రజం గష్టసం
హతికిం దార్చెను గొఱ్ఱెలట్ల జనహత్యల్ మీఱె నిర్భాగ్యుఁడా!

బంగారుతీవెయో రెము-రంగార భుజించునట్టి ప్రముఖులు భోగుల్
రంగూను నూక గంజికిఁ గంగారై లంకలకును గదలిరి భృతికై.
ఎండిన చేనికై కృషికుఁ డేఁచి రసాతలమంటు బావిలో
నుండియు మోటఁదోలి కడు నోపికఁ జెమ్మటతోడి నీరమున్

రెండును మూఁడు పాదులకు రేపటి వేళనె దోర్చి మీఁద నా
యండ జలంబు లేమి యకటా! యురునిస్పృహ వెచ్చనూర్చఁడే.
వేకువ నిద్ర లేచి కలవేఱుపనుల్ గడఁ బెట్టి కుంభముల్
జేకొని దవ్వు పల్లియల చెంగట నూతుల నీరు తోఁడు నా
మూఁకలఁ జేరి వేఁడికొని మ్రొక్కులు వెట్టిన నిన్నియంబువుల్
దేఁకువఁ బోయమిం బొగిలి దేవుని దూఱరె నూలచేడియల్.

వర్షాభావముచే నీటి-కర్షకముఖలోకు లిచటఁగష్టమునఁబడదు
ఘర్షభయంకరవృష్టిని-వర్షించితి ఘూర్జరంబు పాడఱఁ బ్రభవా!

సాలయం గ్రీస్తుశకాబ్దముల్ శిఖరిచతుర్నైవధిగ్లాసుసం
ఖ్యల నార్జస్సిశసతుసస్తమిసిశం గల్పంబుఁ గల్పించు నీ
తలఁపుం దొట్టి సముద్భవం బగుచు నంధ్రత్స్మ తలింగాడుపుల్
గలఁతంబెట్టె నిఁ కెన్నఁడేని మఱవంగారాని యుద్వృత్తిత్రోన్.

గాలియనా యదియు జీవాళి భక్షించెడు నాలిబూతపు మన్నెమూలి గాని
కరువలియా యది తరుజాతినిర్మూలకరణసంక్రుద్ధ దిక్కరటి గాని
పయ్యెరా యది పూర్ణి కాయపాతనసముత్పన్నాశని వ్రాతపటిమగాని
ఈదరా యది మున్ను నాదిశేషునితోడ వాదుఁ బూనిననాఁటి జోదుగాని
కాక యుండిన నోర! యగణ్యమైన-ప్రాణికోటినిఁ దరుకోటి భవనకోటిఁ
బట్టి పల్లార్చునే? జగత్ప్రాణవిభుఁడ-వడయుఁ పవనుండు నీయేలుబడినిఁ బ్రభవ!

బహుభారకుష్యముల్ పడి దివంగతు లైనవారియాత్మల శాంతి గూరుఁ గాక
ఘనవృక్షములు గూలి మనుగడల్ డీకిన వారి యాత్మల శాంతి గూరుఁగాక
గృహములు పై గ్రీల నిహాము వాసినయట్టి వారియాత్మల శాంతి గూరుఁగాక
పొంగిన యేటిముంపులఁ జిక్కి నమసినవారియాత్మల శాంతి గూరుఁగాక
యుండ నిలుఁ బడె మాచంబు నొడలఁ బట్టఁ గూడు పొట్టకు లేక నల్లాడువారి
యసుసుం నీ కంటి తారక లుంకుదాఁక బ్రభవ! నీపేరు లోకానఁ బరఁగుఁ గాక.

ఆయెంబోయెను నిన్న నిట్టులన నేఁటా నికనైనం బస
ప్రామోదోద్యోగము మాని లోకులకు సంపల్లాభ మారోగ్య మా
వ్యాయంబున్ గలిగించి దుర్యశము వాయం జేసికొ విశ్వరే
చ్చాయుక్తిమ్మఁడ వైతివేని ప్రభవా, శాంతించుఁ బీడల్ భువిన్!

———

# SPENCER & Co.,
(Limited)

## MADRAS AND BRANCHES.




SUPPLIERS OF INDIA'S DAILY NEEDS

హోల్ సెల్ బ్రాంచీలు
బొంబాయి-కరాచి

రిటైల్
దక్షిణ ఇండియా

అలప్పె
బెంగుళూరు
కల్లికోట
చాంపియన్ రీఫ్స్
కాకినాడ
కొచ్చిన్
కోయంబత్తూరు
కూనూరు
జార్జిటౌను
కోడైక్కెనాల్
కోటగిరి
మధుర
మర్కెరా
ఉదకమండలం
పొల్లిబెట్ట
క్విలాన్
సికింద్రాబాదు
త్రివాండ్రం
తిరిచినాపల్లి
వేపెరి
నాట్టేరు

ఉత్తరహిందూస్థానము
ముర్రీ
పెషావర్
రావల్ పిండి
సిగర్ ఫ్యాక్టరి
దింపిగల్

డిపార్టుమెంట్లు
వైన్స్ అండ్ స్పిరిట్స్
గ్రాసరీ, ప్రొవిజన్సు
సిగర్స్, పొగాకు
వెండి ఇ.పి.వేర్ గడియారములు
కత్తులు, చాకులు మొదలైనవి
పింగాణి సామానులు
గాజుసామానులు

డిపార్టుమెంట్లు
లాంపులు
ఇనుపవస్తువులు
ఇనుపపెట్టెలు మొదలైనవి
మందులు అండ్ సుగంధద్రవ్యములు
గ్రామోఫోనులు
తుపాకులు, వాటికిమందుసామానులు
ఆటవస్తువులు
సైకిల్సు
మోటారు సామానులు
కళ్ళజోళ్ళు వాటిపరికరములు
స్టేషనరీ
లలితవిజ్ఞానవస్తువులు
బూట్సుశాఖలు
తోళ్ళవస్తువులు, జీనులు
ట్రావిలింగ్ సామానలు
కుట్టుయంత్రములు
జంట్సుదుస్తులు
లేడీసుదుస్తులు
కుర్లాయిలు
ఇంటిగృహయు సామానులు
బేకరి
లాండ్రీపరికరములు
బల్లలు కుర్చీలు

**హెడ్ ఆఫీసు: మౌంటురోడ్, మదరాసు.**



గ్రామఫోను మిషనులు, రికార్డులు, ఫిడీలు, బైసికిళ్లు, అందుకు సంబంధించిన పరికరములు, మోటారుటైరులు, మొదలగునవి అమ్మకమునకు సిద్ధముగా నున్నవి.

ఒకసారి మావద్దకు వచ్చిన అన్నియు విశదమగును.

# HUTCHINS & Co.,

**AUTHORISED AGENTS**

**TO THE GRAMAPHONE Co. Ltd., CALCUTTA.**

**188, Broadway Madras. 42 & 43 Vepery High Road, Madras.**

---

వెలస్వల్పము! ఫలమధికము!! పరీక్షించదగినది!!!

# నారసింహా లేహ్యాము




దీనియందు బంగారు, వెండిరేకులు, పచ్చకర్పూరము, కుంకుమపువ్వు, సాలామిశ్రి, సఫేదామిశ్రి మొదలగు అనేక విధములగు వస్తువులతో తయారుచేయబడియున్నది. ఇదిమిక్కిలి వీర్యవృద్ధిని, బలమును కలిగించుటలో అత్యుత్తమమయినది. మేహము, నిక్కాక, నిస్సత్తువ, శుక్లనష్టము, సంసార సౌఖ్యలోపము, మూత్రమువెంట శుక్లముపడుట, మొదలగువాటిని ఖండించును. పలుచనైన యింద్రియమును ఘట్టిపరచును. రక్తమును శుభ్రపరిచి వృద్ధిబొందించును. అతిమూత్రమును ఖండించును. వృద్ధులకైనను యౌవనమును బలమును, కాంతిని, సంసారసౌఖ్యమును, మిక్కుటమగు ధాతుపుష్టిని సంతానప్రాప్తిని గలిగించు వరప్రసాదము. అనేక యోగ్యతాపత్రములు వచ్చుచున్నవి. 2 డబ్బీలు తెప్పించి పరీక్షించినవారలు మరలమరల తెప్పించుకొనుటయే దీని ప్రాశస్త్యమునకు ప్రబలసాక్ష్యము. 2 డబ్బీలు చాలును.

20 తులముల డబ్బీ రు 2—8—0 పోస్టేజి 0—6—0

(నోటు:—ఈ ప్రతి 20 తులముల లేహ్యమునందున్నూ 3-12-0 లు విలువగల ¾ తులం లోహాభ్రకసింధూరమును గలిపి శేవించినయెడల మహాదిసమస్తరోగములను శీఘ్రముగా బోనడచుటయేకాక మిక్కుటమగు వీర్యవృద్ధిని, బలమును కలిగించుటలో సందియములేదు.)

20 తులములలేహ్యాము, లోహాభ్రకసింధూరము కలిపి రు 6—4—0 పోస్టేజి రు 0—6—0

ఒగ్గులాభము:—రెండుడబ్బాలలేహ్యాము ఏకకాలమందు తెప్పించుకొనినచో రు 1 కి 0—2—0 కమీషను తగ్గించి పంపెదము. అన్ని ఔషధములు గల మా క్యాటలాగు యుచితము.

**పి. శి. ఏ. అండు కంపెని, ఆయుర్వేద సమాజం — పెరిదేపి — నెల్లూరుజిల్లా.**

# విభవ ప్రశంస

శ్రీ. లక్ష్మీపతి శాస్త్రి గారు

విభవసంప్రాప్తి గలిగెడు విధము దెలుపఁ
బ్రభవవేళనె మనలోనఁ బ్రభవ మయ్యె
జాతిసమ్మేళనాసక్తి, జన్మభూమి
దాస్యమోచనకాంక్ష, స్వాతంత్ర్యవాంఛ
విభవ మారంభ మయ్యెనో విబుధులార!
ప్రభవవేళను గలిగిన పట్టు విడక
జన్మఫలమైన స్వాతంత్ర్య సత్ఫలంబు
పడయుఁ డన్యులమాయల పాలుగాక.

ఫలము

విభవఫలమును జెప్పెద వినుఁడు విభిగ
భరతఖండంబు సర్వార్థ భరిత మగును
సర్వజాతులవారికి సఖ్య మగును
బరులసామగ్రి భరతభూబాహ్య మగును
దాస్యబంధంబు తెగిపోవుఁ దనకుఁ దానె
తోడిదేశాల వారలతోడఁ గూడి
సరిసమానముగా నుండు శక్తి గలుగు
భరతఖండము పూర్వపు భాగ్య మొందు
దైవయత్నము సమకూడె దానితోడఁ
బురుషయత్నము గావలెఁ బూర్ణదీక్ష
యత్న మొనరింప విభవ సంప్రాప్తి యగును
విభవవేళల విభవాప్తి వింత యగునె?



# రాటము



సోమంచి సూర్యనారాయణ శర్మ గారు

రాటము ద్రిప్పవె రమణీ రమణీ!
 రమణీయ సుగుణశీలిన్—
కాటకముల నే దాటిపోదు నే
పాటిదుష్కృతిని గోట మీటుదును
గాటపుబత్తిని కదరె దాలుతును
సాటెద నిటు దిక్చక్రమునకు నని
పాటలు పాడుచు బ్రాలుమాలకను-రాటము.

౧

నూలు దీయవే లోల లోచనా
 లీలా లోలతను-
శీల మేది పాపాలసులు చేయు
కూళచెయ్దముల గొసకు దేగ గో
పాలకృష్ణు నపరావతారమే
లీలావిగ్రహు డానతిచ్చెనే
ఏలే గాంధీ హితము సెప్పెనే
మేలని తానే పూని తిప్పెనే
వాలాయం బీవరుస మప్పెనే-రాటము.

౨

నీలాలక నీకాల మెల్ల నిటు
 దూలింపగ నేలా-గా
జూలు చేతులను గల్లుగల్లురన
వాలుజడ వెనుక వడకాడగ నీ
వేలియుంగరాల్ వెలుగుల నీనగ
నీలిదృక్కులను నెఱి నెఱపుచు ము
క్కాలిపీటపై గడక గూరుచుని
మేలిదారములు మెలకువ దీయుచు-రాటము.

౩

సంగరభూముల సంగినలును వెను
 కం గరమలరరొ బంగరుతీవా-దు
స్సంగతి దొలంచ సతుల కవసరము
భంగము లేకను బతులకు దోడై
రంగారగ నీరజముఖులే యిం
దుం గడు జాణలతుల్యాలు సొంపా
రంగ ముంగిట హారంగుతోడుత ని
జాంగద్యుతు లల జాలుకొనంగను-రాటము.

౪

పైటగుడ్డకే లోటుగ సిగ్గులు
 బైట బెట్టుకొని చేటులు రారే!
కాటుక కన్నీ ర్కాల్వలు గట్టగ
మాటికి నీగుమ్మాలను బడి యీ
పూటగంజి యమ్మో బిడ్డకె లే
దేటిది నా కని యేడ్చుచు జిన్గుల
పైట యొడినె పసిపాపల గట్టుక
కూటికే చెలులు కోటు లేడ్వ నీ
కేటి భోగముల వేటి రాగములు
ఏటి జీవనమదే భవనము? మో
మాటము లేదే మనసు కరగదే
నీటుగోటులే నిసర్గంబులే
నేటికైన నీ నిదుర దీరదే
పాటకుల్ పడు నవస్థల గను మిక
మూట లేడవే పోషింపగ నీ!
మోటుదనం బని మోమటు దిప్పక
పాటి యెంచి యీ పాటికే దదా
రాటముదీర్పగ - రాజ్యముగూర్పగ-రాటము.

౫

సదనము కదురూ కవ్వ మున్న సం
 పదలకు నదె తా వోముదితా!
విదిత మాయె నీవేళ తదర్థము
పదింబదిగ నే బాడగ నేలా?
హృదయం బుండిన నెవ్వారైన నీ
వదినెలు నన్నలు బావ లక్కలును
వదలెదరే నీ పరిశ్రమ మెఱిగి
కదరే దాల్తురు కాంక్షతోడుతను
వదరే వారితో వాద మేలనే
పదిల మిదే యని. భావమునం గని-రాటము.

# ది ఆంధ్ర ఇన్సూర్యెన్సు కంపెనీ లిమిటెడ్., బందరు

## డాక్టరు కోకా అహోబలరావు గారు, యమ్. బి. సి. హెచ్. బి. (ఎడింబరో)
డి. టి. యమ్. (లివర్ పూల్)

### ముఖ్య విషయములు

(1) కంపెనీకి మొదటి సంవత్సరములో 5000, రెండవసంవత్సరములో 29000 నికరాదాయము. (Surplus)

(2) ఇంతవరకు మరణమువల్లగాని, మరేవిధమైనట్టిగాని క్లైమ్సు లేకపోవుట.

(3) ఖర్చులు ప్రీమియము ఆదాయములో మొదటి సంవత్సరం 100 కి 82°/。 రెండవసంవత్సరం 50°/。

I భీమాకంపెనీలు మొదటి సంవత్సరములో నికరాదాయమును (Surp)us కనుపరచుట అరుదు. ఆంధ్ర ఇన్సూ్యరెన్సు కంపెనీవారు అట్టిది మొదటి సంవత్సరములోనే చూపగలుగుట ప్రశంసనీయము. (స్టేట్సుమన్ పత్రిక)

II మా పట్టణములో 1925 వ సంవత్సరమున స్థాపింపబడిన ఆంధ్ర యిన్సూ్యరెన్సు కంపెనీవారు జూపిన కార్యదక్షత, పొదుపరితనము, వ్యాపారాభివృద్ధి, మిగుల శ్లాఘనీయముగా నున్నవని చెప్పకతప్పదు. మన దేశములో నిప్పుడు సుమారు 50 స్వదేశీ భీమాకంపెనీలు పనిజేయుచున్నను, నివి యన్నియు రాష్ట్రాంతరములం దుండుటచే, విదేశపు కంపెనీలతోబాటు ఇవిగూడ ఆంగ్లభాషలోనే వ్యవహారము జేయుచున్నందున యీభీమాకింపెనీల ప్రయోజనములుగాని, కార్యవిధానములుగాని, గ్రామవాసులైన రైతాంగమునకును, పాటకజనమునకును, తగినంత అందుబాటులో లేకపోవుట తటస్థించినది. మన ఆంధ్ర యిన్సూ్యరెన్సు కంపెనీవారీకొరతను వారించి, తెనుగులో వ్యవహారసౌకర్యమును గలిగించి ఆంధ్రరాష్ట్రవాసుల కుపకారము జేయబూనుట యెంతయు సంస్థవనీయము. "కృష్ణాపత్రిక"

III ఇదివరకు ఆంధ్ర దేశమునందు భీమాకంపెనీలు లేనందున నితర ప్రాంతములందలి కంపెనీలందు భీమాలనుజేయుట తటస్థించినది. ఆంధ్రదేశమునందు స్థాపించిన భీమాకంపెనీయందు భీమాను చేయించుట వలన చేసినవారును, చేయించినవారును, కంపెనీయును, దేశమును లాభమును బొందుటకు వీలు గలదు. భీమాచేయుటయందు జాగుచేయుట నష్టదాయకము. మచిలీపట్టణమునందు చక్కగ పనిజేయుచున్న ఆంధ్ర భీమాకంపెనీవలన ప్రజలు లాభమును బొందుటకును, కంపెనీని వృద్ధిచేయుటకును, విరివిగ భీమాలను చేయించుటకును, బూనుకొనిమెదరని నమ్ముచున్నాము. "ఆంధ్రపత్రిక"

పలుకుబడి గల ఏజంట్లు జీతముమీదను, కమీషన్ మీదను కావలెను.

యర్రమిల్లి మంగయ్య,
కార్యదర్శి.

## ౪౨-వ అఖిలభారత జాతీయమహాసభ-చెన్నపురి



డాక్టరు యమ్. ఏ. అన్సారీగారు
అధ్యక్షులు, ౪౨-వ అఖిలభారతజాతీయమహాసభ-చెన్నపురి



శ్రీయుత ముత్తురంగ మొదలియారుగారు

ఆహ్వానసంఘాధ్యక్షులు, ౪౧-వ అఖిలభారతజాతీయమహాసభ, చెన్నపురి

## కామినియా నూనె వేనకవేల కుటుంబములయందు వాడబడుచున్నది




### ఎందువల్ల?

కామినియా వెంట్రుకలు రాలిపోకుండ కాపాడును.

కామినియా చుండును రానీకుండ కాపాడును.

కామినియా నూనె మెదడుకు చల్లదనము గలిగించును.

కామినియాయందు వెంట్రుకలను వృద్ధిజేయు దినుసులు చేరి యున్నవి. మెదడుకు చాలా ఉపయోగమును గలిగించును.

కామినియా నూనె యింపైన సువాసన కలది.

కామినియా నూనె వెంట్రుకలు రాలిపోకుండ కాపాడును.

ఈసుగుణము లన్నిటినిబట్టియే, వేనకవేల కుటుంబములందు దీనిని కోరుచున్నారు. కామినియా నూనెను ఉపయోగించువారలు దీనిని వెంట్రుకలకు జీవమేయని కొనియాడుచుందురు.

### హెచ్చరిక

మీకు మీవర్తకులను సప్లయిచేయుమని కోరినయెడల ఎక్కువలాభమును పొందుట కుద్యుక్తులై, మట్టపురకం నూనెనుయిచ్చుటకు ప్రయత్నించెదరు. ఈమాయలకు మోసపోకుడు. కామినియానూనెనే యిమ్మనికోరుడు. వెంట్రుకలకు సరియైన నూనెనే కోరినయెడల ఎల్లప్పుడు కామినియా ఆయిల్ (రిజష్టర్డు)పేరును మరువకుడు.

| | | | |
|---|---|---|---|
| వెల సీసా 1 కి రు | 1-0-0 | వి. పి. చార్జీలు అణాలు | 0-6-0. |
| 3 సీసాలు | 2-10-0 | ,, | 0-12-0. |

పేరొందిన స్టోరులన్నిటియందును కామినియా ఆయిల్ అమ్మబడును.

సోల్ ఏజంట్లు: ది ఆంగ్లో ఇండియన్ డ్రగ్ అండు కెమికల్ కంపెనీ,

285, జుమ్మామశీదు, బొంబాయి-2.

# ౪౨ వ భారతజాతీయ మహాసభ, చెన్నపురి—అధ్యక్షోపన్యాసము

డాక్టరు అన్సారీగారు, అధ్యక్షులు

సోదరప్రతినిధులారా! సోదరీమణులారా! సోదరులారా!



డాక్టరు అన్సారిగారు



భారతదేశమునకు స్వాతంత్ర్యమును బడయుటకు మన మొనరించుచున్న సంఘర్షణము నందత్యంతవిషమమగు నీ సమయమున జరుగుచున్న భారత జాతీయ మహాసభ కధ్యక్షత వహింపవలెనని నాయందు మీరు సంపూర్ణ విశ్వాసముంచి నన్ను కోరినందులకు నాకుకలిగిన గాఢతమమగుకృతజ్ఞతను నేను సరిగా వెల్లడింపజాలకున్నాను. సుమారు 25 ఏండ్లకుపూర్వము నేను కళాశాలలో విద్యార్థిగానున్న సమయమున చెన్నపురిలో నీమహాసభ జరిగినది. నేనపుడు అధికోత్సాహసంతుడను, ఆశాపూరితమనస్కుడను అయియుంటిని. జాతీయ మహాసభను దర్శించుట నాకదియే తొలిసారి. నేడు మరల చెన్నపురిలో జరుగుచున్న యీమహాసభ యాపూర్వవిషయమును నాకుస్మరణకు తెచ్చినది. మరల నాచెన్నపురిలోనే భరతమాతపుత్రులలో విఖ్యాతులగువారు పలువురధిష్ఠించిన యీఅధ్యక్షపీఠమును అధిష్ఠించుభాగ్యము నాకు కలుగునని నేనపుడు కొంచెమైనను తలపోసియుండలేదు. మనరాజకీయోద్యమము నాటికంటె నేడత్యధికముగా నభివృద్ధినొందినది. దానికి వ్యాప్తియును, బలమునుగూడ నధికమైనవి. ప్రజలలో హెచ్చుమందికి రాజకీయములతో పరిచయము బాగుగా కలిగినది. స్వరాజ్యసంరంభము కడుతీవ్రమైనది. కాలక్రమమున మనము పరిష్కరింపవలసిన సమస్యలుగూడ క్లిష్టతరములయినవి. కావున అధ్యక్షపీఠము నధిరోహించువారి భారము మెండైనది. నాలోపములను మీరు సోదరభావముతో మన్నింతురనియు, నావిధులను నెరవేర్చుటలో మీ రుదారభావముతో తోడ్పడెదరనియు నాకు గట్టినమ్మక ముండుటవలననే నే నీఘనతరమగు బాధ్యతను వహించుటకు సాహసించితిని.

బ్రిటిషు సామ్రాజ్యమును పెంపొందింప గోరువారును, మన దేశమునందలి ధనమును గొనిపోగోరు ధనికులును ఎల్లకాలమును మనదేశమును పాలితదేశముగానే యుంచుటయును, మనదేశమునందలి ధనమును హరించుటయును సముచితమే యని సమర్థించుకొనుటకు మనలనుగూర్చి అసత్యములను కల్పించి వివిధదేశములలో గట్టిప్రచారమొనరించుచుండినను, విదేశములలోనున్న మిత్రపక్షముల ప్రతినిధులు సోదరభావముతో నీమహాసభకు వచ్చుటచే ప్రపంచమునందు వివిధదేశములలో ప్రజలు సామ్రాజ్యవాదులవలనను, ధనికులవలనను మనదేశమునందును మనవలెనే పీడింపబడుచున్నవారనియు, పాలితదేశములవారందరును అత్యధికముగా పరస్పరసహాయ మొనరించుచు నేకీభవించి పాలితులకందరికిని సమానముగ ప్రతిపక్షులగు సామ్రాజ్యవాదులను, ధనికులను ఎదుర్కొనుట అత్యవసరమనియు వారు గుర్తించిరని స్పష్టమగుచున్నది గాన నిది మన కాశాజనకముగా నున్నది. వివిధదేశములందలి రాజకీయసమస్యలకన్యోన్యాధారాధేయసంబంధము కలదనియు, భారతదేశము రాజకీయముగను, ఆర్థికముగను పరాధీనముగా నుండుటవలన మానవప్రపంచము శాంతియుతముగా నభివృద్ధి నొందుటకును, ముఖ్యముగా గ్రేటుబ్రిటనులోనున్న మిత్రులకును చాలఅనర్థకము కలుగుచున్నదనియు నన్నిదేశములవారును క్రమముగా గ్రహింప గలుగుచుండుటగూడ శుభావహమేయగును. ఇట్లు విదేశములనుండి వచ్చినమిత్రులకు మహాసభవారి పక్షమున మనఃపూర్వకముగ స్నేహార్ద్రహృదయుడనై స్వాగతము చెప్పుచున్నాను.

మనదేశమునం దన్నిపక్షములవారును మరల కాంగ్రెసులో చేరి పనిచేయవలెనని నేను చేసినవిజ్ఞప్తిని వివిధపక్షముల ప్రముఖులు దయతో మన్నించినందులకు నే నత్యధికమగు సంతృప్తిని, సంతసమును చెందుచున్నాను. భారతదేశము స్వాతంత్ర్యమును బడయుటకుగల హక్కుతో అవినాభావసంబంధముగల విఖ్యాతనాములగు నాయకులను, దేశసేవయం దారితేరిన ప్రముఖులను, అనుభవజ్ఞులగు ధీరులను మరల మనమధ్యను చూడగలిగినందులకు నేను మిక్కిలి సంతసించుచున్నాను. దేశసేవయందు సహకారులగు నీదేశీయసోదరుల కందరికిని మరల కాంగ్రెసుపతాకచ్ఛాయకు నేను మనఃపూర్వకముగ స్వాగతము చెప్పుచున్నాను. వెనుకటివలెనే యికముందుగూడ భారతమాత యీధీరుల సేవవలన సంపూర్ణఫలమును బడయునుగాక యని ఆశించుచు భగవంతుని వేడుకొనుచున్నాను.

## భారతదేశము-సామ్రాజ్యవాదము

కొంతకాలముక్రిందట నేను చేసిన ప్రకటనమునందు ప్రస్తుతమున్న రాజకీయస్థితియందలి ముఖ్యలక్షణములను సూచించుటయేకాక వాని విషయమున మన మవలంబింపదగిన పటిష్ఠమగు పద్ధతినిగూర్చి గూడ సంగ్రహముగా నా అభిప్రాయములను వివరించియున్నాను. కావున నావిషయమునుగూర్చి నేనీనాడు నత్యధికముగా ముచ్చటింపగోరను. సంగ్రహసింహావలోకనమునందుగూడ మనరాజకీయవిధానమును కొనసాగించుటతో ప్రత్యక్షసంబంధముగల ప్రతియంశమును మనము గమనించుచునే యుండవలెను. 'భారతదేశము స్వాతంత్ర్యమును, స్వపరిపాలనమును కలిగియుండవలెను. దేశమునందు నివసించువారికందరికిని సమానావకాశముల నొసంగవలెను. దేశమునందలి అన్ని సంఘములకును గల సముచితములును, న్యాయములునగు హక్కులను కాపాడుటకు పూనీపడవలెను. దేశమున శాంతిని నెలకొల్పవలెను. ప్రపంచమునందన్ని దేశములవారితోను మైత్రిని కలిగియుండవలెను.' అనునదియే మన ఆశయమని మన దేశమునందున్న సకలపక్షములవారునుగూడ నంగీకరించియే యున్నారు. స్వాతంత్ర్యము గల దేశములలో నివసించుచున్న ప్రజలు ఎట్టిహక్కుల ననుభవించుచున్నారో, ఎట్టి స్థానమును బడసియున్నారో అట్టి హక్కులనే భారతదేశమునందు తాము ననుభవింపవలెననియు, అట్టి స్థానమునే తాము బడయవలెననియు భారతీయులు కోరుచున్నారు గాని అంతకంటె అధికముగను, అల్పముగను గూడ నేమియును కోరుటలేదు. బ్రిటిషు సామ్రాజ్యమునందు మా (భారతీయుల) కిది లభించుట సాధ్యమైనచో మేము సామ్రాజ్యమును వదలి పోగోరము. సామ్రాజ్యసంబంధమిందులకు నిరోధకమైనచో ఆ సంబంధమును వదలుకొనుటకు మేము వెనుదీయము. "సాధ్యమైనచో సామ్రాజ్యములో, అవసరమైనచో సామ్రాజ్యమునకు వెలుపల" నను గాంధిమహాత్ముని వాక్యమే మా ఆదర్శవాక్యముగ నుండవలెను.

ఇందులకు చాలకష్టములు కలవు గాన నిది సులభమని నేననను. కష్టములెన్నియో కలవుగాని వానిలో నన్నిటిలోను సామ్రాజ్యవాద విజృంభణమును, అధికధనాశయును ప్రబలతమములు. నేడు ప్రపంచమునందు సకలదేశములలోను కష్టమును దైన్యమును కలుగుట కీరెండే ముఖ్యకారణములు. సామ్రాజ్యములు నిర్మితములైనవి. సామ్రాజ్యవాదులదురాశ పూర్తియగుటకు వివిధజాతుల స్వాతంత్ర్యము హరింపబడినది. ఐరోపాఖండమునందలి యంత్రశాలలను నింపుటకు పాలితదేశములందలిముడిపస్తువులు గుత్తగొనబడినవి.ఆయంత్రశాలలలో ఉత్పత్తియైనసామగ్రులనేకాని యితర దేశముల సామగ్రులను వేనిని పాలితదేశములందు విక్రయింప వీలులేకుండ చేయబడినది. "క్రైస్తవమతప్రచారకులు పాలితదేశములలో నాగరకతను కలుగజేసిరి. పాలితదేశములను పాలించుటకు శ్వేతజాతులవారే బాధ్యులు" అని రాజనీతిజ్ఞు లూరక ప్రగల్భములు పలుకుచుందురుగాని అందలి నిరుపయోగితను దక్షిణాఫ్రికా సామ్రాజ్యవాదులలో ప్రధానుడగు సెసిలురోడ్సుగారికంటె బాగుగా నెవరును వెల్లడించియుండలేదు."వంచనలేని లోకహితేచ్ఛ లేక దానము మంచిదే; కాని దాన మీయబడిన ధనముపైని నూటికి సాలుగు అయిదు రూపాయలు వంతున వడ్డీని గూడ లోకహితైషి యియ్యదలచినచో మరింత మంచిది" అని ఆయన నుడివెను. సామ్రాజ్యసిద్ధాంతప్రధానాచార్యుడగు జోసెఫు చేంబర్లేనుగారు రింకనుస్పష్టముగానే తెలిపిరి. "సామ్రాజ్యమనగా వాణిజ్యము. వెనుకటినుండి మాతో వర్తకము చేయుచున్నవియు, ఇక ముందుచేయబోవు నవియు నగు నన్ని దేశములలోను భారతదేశము మిక్కిలి ముఖ్యతమమును, అమూల్యము నైయున్నది." అనియాతడు దాపరికములేకుండ తెలిపెను. ఐరోపాఖండవాసులిట్లు విపరీతపరోపకారచింతతో నొనరించుచున్న యీదోపిడిచరిత్ర కాంగోమొదలు కాంటనునరకును రక్తముతోను, దురవస్థతోను వ్రాయబడియున్నది. దొరతనమువారి ఉక్కుచట్రమువంటి సిద్ధాంతమును, కోట్లకొలది నోరులేని ప్రజలకు సంరక్షకులమను దంభోక్తులును, ఐరోపా మహాసంగ్రామము జరుగకమును పాఖండమునందున్న స్థితిని కప్పిపుచ్చుటకు క్రొత్తగా కనిపెట్టబడిన నానాజాతి సంఘమును బురకాయును సామ్రాజ్యభావమునకుభిన్న స్వరూపము లేకాని అన్యములు కావు.హానికరములగు నీసిద్ధాంతముల ననుసరించుచున్నంతకాలమును మానవులదురవస్థకుగల కారణములు వృద్ధినొందుచునే యుండును. విశ్వమానవ సంఘముయొక్క యీదురవస్థను తొలగించుటకు సాధనము భారతదేశాధీనమయి యున్నది. ఏలయన ఈసామ్రాజ్యసిద్ధాంతమును కమానుకట్టడమునకు భారతదేశమే ప్రధానశిలగా నున్నది. కావున భారతదేశము స్వాతంత్ర్యమునుబడయగలిగిన క్షణమునందే ఆకట్టడమంతయును నేల గూలగలదు. భారతదేశము స్వాతంత్ర్యమును, స్వపరిపాలనమును బడయుటచే ఆసియాఖండస్వాతంత్ర్యమునకును, ప్రపంచశాంతికినిగూడ భద్రము చేకూరగలదు.

## కాంగ్రెసు రాజకీయవిధానము

ఇక భారతదేశమున కెటుల స్వాతంత్ర్యము లభింపగల దనువిషయము. ఒకపురుషాంతరమునకు పైగా భారతీయనాయకులు ప్రభుత్వమునకు పూర్తిగా సహాయపడుచునేయుండిరి. ఆపద్ధతి విఫలమగునని దాని స్వభావమువలననే తెలియుచున్నది. సమానాశయములుగల పక్షములకు మాత్రమే పరస్పరసాహాయ్యము సాధ్యమగును. ఉద్దేశములు కేవలము విరుద్ధముగా నున్నపుడు సహకారము కుదురదు. అట్టిస్థితిలో బలవంతులకోరికల కనుగుణముగా నడుచుకొనుటకు బలహీనులు తమ కత్యంత ప్రియతమములగు నాశయములను వదలుకొనుటయే సహకారమనిపించుకొనును. భారతీయులకును, బ్రిటిషువారికిని ఆశయములందు గలభేదము భారతదేశముపట్ల చాల సానుభూతి గలవాడని పేరొందిన వాడును, లిబరలుపక్షమువాడును నగు కీ. శే. మాంటాగుగారు ఇండియా మంత్రిగా నున్నపుడు ప్రకటించిన నివేదికయందు వెల్లడియైనంత

స్పష్టముగా మరెచటనుగూడ వెల్లడికాలేదు. 1919 ఇండియా ప్రభుత్వపుచట్టమునకు మాంటేగుగారి నివేదికయే పునాది. అందు బాధ్యతాయుత ప్రభుత్వము కాలక్రమమున నెలకొల్పబడునని వాగ్దానము చేయబడెను; భావికాలమున చాలఅభివృద్ధికలుగునని యెన్నియో ఆశలు చూపబడెను. మఱియు వానితోపాటే అందు "భారతదేశమునందలి వివిధరాష్ట్రములలోని ప్రజలకు భారతప్రభుత్వము ప్రతినిధివర్గ మగుటచే ఆరాష్ట్రములన్నియుగాని, వానిలో హెచ్చుసంఖ్యగాని సంపూర్ణ బాధ్యతాయుత ప్రభుత్వమున కర్హతను బడయగలుగునంతవరకు నది బ్రిటిషుకామనువెల్తునందలి యితరస్వాతంత్ర్యదేశముల దొరతనములతో సమానమయిన సమగ్ర ప్రాతినిధ్యమును, సంపూర్ణ బాధ్యతాధికారమును బడయజాలదనుట నిర్ధారణయేయని మాకు తోచుచున్నది. అప్పటికిని, భారతదేశము పొందగల బాధ్యత అన్నివిధములలోను అధినివేశ రాజ్యములు పొందిన భాధ్యతతో సరిసమానముగ నుండగలదని మేము తెలుపజాలము. భారతదేశ స్థితిగతులనుబట్టియే భారతప్రభుత్వ స్వరూపమును నిర్ణయింపవలసియుండును. సామ్రాజ్యబాధ్యతలను కాపాడవలసిన ఆవశ్యకములనుగూడ ముఖ్యముగా ఆలోచింపవలసియుండును." అని స్పష్టముగా వివరింపబడెను.

## ప్రభుత్వముతో సహకారము

తక్కువ జాతులను నాగరకులగా చేయుటకు భగవంతుడు తమ్మునే నిర్ణయించెనను భావమును మన పాలకులు వదలుకొనగలిగిన యెడలను భగవంతుని ఆజ్ఞలను అమలుజరుపు కర్తృత్వము తమదేయను భావమునుగూడ వర్జింపగలిగినయెడలను, రాజకీయార్థికవిషయములలో ప్రతికూలముగను విషణ్ణముగను పరాధీనతనుగాంచిన భారతజాతికంటె స్వాతంత్ర్యమును బడసి, మిత్రభావముతోనుండు భారతజాతివలననే తమ కధికమగు లాభము కలుగునని వారు గ్రహింపగలిగిన యెడలను, పెక్కేల, తమ నాగరకతకంటెను, విజ్ఞానముకంటెను శ్రేష్ఠమైనవి కాకున్నను, వానితో సమానములైన నాగరకతావిజ్ఞానములు ప్రపంచమునందు కలవనివారు గ్రహింపగలిగినయెడలను, పాలకపాలిత భేదబుద్ధిని వదలి మనలను తమతో సమానులుగా వారు చూడగలిగిన యెడలను, మేము సహకారమును గూర్చి మరల ఆలోచించుటకు అవకాశమేర్పడగలదు.

## శాసనసభల విధానము విఫలమగుట

అసహాయోద్యమమునకు నిరోధము కలిగిన పిమ్మట శాసనసభలకు వెళ్లి నియమానుసారముగా కార్యనిరోధమును కలిగించి ప్రజలయిష్టమునకు ప్రభుత్వము లొంగునటుల చేయదగునని వేరొకపద్ధతి సూచింపబడెను. ఈక్రొత్తపద్ధతిని సూచించువారు (స్వరాజ్యవాదులు) 1919 ప్రభుత్వపు చట్టమునందు విధింపబడిన నిబంధనలనుబట్టి అట్టి ప్రతిఘటన మంతయును నిష్ఫలమే యగుననియు, నియమానుసారముగా కార్యనిరోధమును కలిగించుట గూడ అసాధ్యమనియు సరిగా గమనించియుండలేదు. సరియగు నియమబద్ధరంగమున అత్యంత నియమబద్ధమగు విషయమును గూర్చి పోరాడుట అసంభవమను విషయమును కార్యనిరోధక (స్వరాజ్య)వాదులును సహకారవాదులును గూడ గ్రహించియుండవలసినది. వాదమునందు ప్రతివాదియే నిర్ణేతగాగూడ నుండునెడల వాదికి విజయ మెన్నటికిని కలుగదు. ఈయవష్టంభన పద్ధతియందు నమ్మకము గలవారిసంఖ్య మిక్కిలి హెచ్చుగనుండిన రాష్ట్రములలోగూడ నీపద్ధతి నెరవేర లేదని అనుభవమువలన విదితమైనది. కాని కార్యనిరోధక (స్వరాజ్య)వాదులు శాసనసభలకు వెళ్లుటవలన కొన్నిలాభములు కలిగినవి. సంస్కరణములు నిష్ఫలములని విదితమైనది. తమ కనుకూలురగువారినే శాసనసభ్యులనుగా దొరతనమువారు నియమించుట కవకాశము లేకుండపోయినది. తమ నిరంకుశ చర్యలు ప్రజాప్రతినిధులచే నామోదింపబడినట్లు దొరతనమువారు చాటుకొనుట కభ్యంతరము కలిగినది. కాని యీయన్నిటివలన మనకు స్థిరప్రయోజన మేదియును చేకూర లేదు; గమ్యస్థానమునకు చేరువకైన మనము పోగలిగియుండలేదు. వీనికొరకు మనము చెల్లించిన మూల్యముమాత్రము అత్యధికముగా నుండెను. ఈరీతిగా ప్రధాన నాయకులు పలువురు శాసనసభలలో చిక్కుకొనియుండుటచే యథార్థజాతీయప్రాముఖ్యముగల సమస్యలనుగూడ వారుపేక్షించుట తటస్థించినది. దేశము నిరుత్సాహమున మునిగియున్నపుడు కేవలము పరీక్షార్థక ప్రయత్నముగనే శాసనసభావిధాన మవలంబింపబడెను. మనము దానిని పరీక్షించితిమి. మనము కోరినఫలములు దానివలన కలుగకపోయినచో మనము నిరుత్సాహమును చెంద నవసరము లేదు. మన అనుభవమునుబట్టి మన పద్ధతి నిపుడు మార్చుకొనుటయే కర్తవ్యమగును.

## అసహాయోద్యమము

మన లక్ష్యమునుగూర్చి భిన్నాభిప్రాయ మెంతమాత్రమును లేదు. భారతదేశమునకు స్వాతంత్ర్యమును, స్వపరిపాలనమును మనమందరమును గోరుచున్నాము. దానిని సాధించుట కేదో యొక విధానమునే అనుసరింపవలెనను నిర్బంధము మనకేమియును లేదు. ఏదో యొక విధానమే పరమపవిత్రమనియు, దానినేకాని మరి దేనిని మనమనుసరింపగూడదనియు మన మెన్నటికిని భావించుట లేదు. ఏపద్ధతినైనను, ఏవిధానమునైనను మన మవలంబించుటకు ముందు అది మనదేశమునందలి సాంఘికరాజకీయ పరిస్థితులకు సరిపడునా, అది అనుష్ఠానసాధ్యమా, దానివలన మిక్కిలి ఆలస్యము కాకుండ ఫలితము కలుగునా అనువిషయములనుగూర్చి బాగుగా నాలోచింపవలసియుండును. కడచిన నలుబదియేండ్లలోను మనము కాంగ్రెసు నియమించిన మూడు పద్ధతుల ననుసరించితిమి; వాని ఫలితము మనకు విదితమైనది. ౧. ఏకధాటిని 3౫ ఏండ్లు ప్రభుత్వమునకు సహకారమొనరించితిమి. ౨. పదునెనిమిది నెలలు అసహాయోద్యమమును సాగించితిమి. 3. శాసనసభ

లకు వెళ్లి నిరోధించుట, నియమానుసున్యముగా కార్యనిరోధమును కలిగించుట యనుపద్ధతిని నాలుగేండ్లు సాగించితిమి. వీనివలన కలిగిన లాభనష్టములను మనమిపుడు తెలుపగలము. సహాకారమువలన కొంచె మైన లాభము కలుగలేదు. శాసనసభలలో నిరోధించుటవలన గూడ నెట్టి మేలును కలుగలేదు. అసహాయోద్యమమువలనగూడ ఆశించినంత మేలు కలుగలేదుగాని దానికి కారణము సరిగా మన మాయుద్యమ మును కొనసాగించుట కశక్తులమగుటయే కాని ఆయుద్యమమునందు గల యే లోపము చేతను కాదు. కావున అసహాయోద్యమము మనకు నిరుపయోగము కాలేదు. దానికే మనము నిరుపయోగుల మైతిమి. మొదటి సంగ్రామమునందే మనకు నిస్సంశయముగ ప్రబలమగు పరా జయము కలిగినది. నేడు మరల మనము దానినవలంబించుటకు ప్రస్తుతస్థితి లో ఎంతమాత్రమును అవకాశము లేదనిగూడ నేనే యొప్పుకొందును. సంతాపకరములగు మతసాంఘిక కలహములవలన ప్రజలలో మనస్పర్థలు, ద్వేషానుమానములు ప్రబలినవి. దేశమంతయు మతరాజకీయ కలహ ములలో మునిగి కక్షలుగా చీలిపోయి యున్నది. కావున మన మిపుడు మరల అసహాయోద్యమము నవలంబించుటకు అవకాశము లేదు. కాని అసహాయోద్యమభావము మాత్రము మన దేశమున స్థిరపడుటకే వచ్చినది. అది భారత రాజకీయములకు తీవ్రోత్తేజకముగా నుండుట నిశ్చయము. తలవనితలంపుగా నేర్పడిన అసాధారణ పరిస్థితులలో తప్ప మనము స్వరాజ్యమును బడయుటకు నీతివర్తనము, ఇంద్రియనిగ్ర హము, స్వయంసహాయము, కట్టుబాటును అలవరుచుకొని, ఏదోయొక రీతిని ప్రభుత్వమును ప్రతిఘటించుట కవకాశముగల యుద్యమము నవలంబింపవలసియే యుండును. హానికరమగు యుద్ధమువలన కలిగిన భౌతికనైతిక నష్టముల నిపుడు భారతదేశము పూర్తిచేసికొనుచున్నద నియు, త్వరలో నూతనశక్త్యుత్సాహసమన్వితమై వెలువడి తాను పొం దునట్లు నిర్దేశింపబడిన ఫలమును తప్పక పొందుననియు నేను కొండొ కచో నుడివినట్లు రూఢిగా నమ్ముచున్నాను.

ఇట్లు దేశము మరల నూతనోత్సాహశక్తి సమన్వితమై రెండవ సంగ్రామమునకు సంసిద్ధము కాగలుగుటకు మనము శ్రేష్ఠముగా పని చేయుటెట్లు? దేశమునందును, కాంగ్రెసులోను, శాసనసభల కింకను మన ప్రతినిధులు వెళ్లగోరినచో శాసనసభలలోనుగూడ, నైకమత్య మేర్పడిననేకాని మన మీకృషిని చేయజాలమని నేను నిశ్చయముగా నమ్ముచున్నాను. అన్ని దేశములందును ప్రజలలో భిన్నాభిప్రాయ ములు కలుగుచునే యుండును. అవి వెనుకను ఉండెను; ఇపుడును కలవు. ఇక ముందును ఉండును. ఏస్థితిలో వానిని మనము సర్దుబాటు చేసికొననిచో నవి దేశమునకు హానికరములో అను విషయమునే మనము గ్రహింపవలసి యున్నది. వ్యక్తిప్రతిష్ఠకును, జాతీయ లాభమునకును గల భేదమును మనము బాగుగా తెలుసుకొని జాతీయ లాభముకొరకు వ్యక్తిలాభమును వదలుకొనుటకు సంసిద్ధులము కావలెను.

## దేశమునం దైకమత్యము

### హిందూమహమ్మదీయసఖ్యము

ప్రస్తుతము మన రాజకీయములలో హిందువులకును మహమ్మ దీయులకును కలిగిన కలహములే మిక్కిలి అవమానమును, అశాంతిని కలిగించుచున్నవి. అతి విచారకరము లగు కొట్లాట లిపుడు చాల తరుచుగాకూడ కలుగుచున్నవి. నిష్కారణముగా తోడి మానవుల ప్రాణములను తీయుచున్నారు. ప్రాణవిత్తములను దారుణముగా నష్ట పరుచుచున్నారు. దేశమునం దేదో యొక భాగమున ఘోర దౌర్జ న్యము జరిగెనదను వార్త వినని దిన మొక్కటియైన కనబడుటలేదు. ఈకొట్లాటలవలన ఆగ్రహద్వేషములు మితిమీరిపోవుచున్నవి. పర స్పర నిర్మూలనాసక్తులగు ప్రజలయొక్క పక్షములతో దేశమంతయు నిండిపోయి గొప్ప యుద్ధరంగముగా పరిణమించునటు లున్నది. ఈక లహములవలననే కాంగ్రెసు మహాసభకుగల పలుకుబడిగూడ క్షీణించి నది. చాలరాష్ట్రములలో మతసంఘములకు, ముఖ్యముగా సంగ్రామ తత్పరము లగువానికే, ఉన్నతస్థానము నొసగుచున్నారు గాని, కాం గ్రెసునకు ప్రధానస్థానము నొసగుటలేదు. మొదట మత సంఘములు, పిమ్మట కాంగ్రెసు అను భావము దేశమున ప్రబలియు న్నది. ఇట్టి స్థితిని వెంటనే అంతరింపజేయవలెను కాని యీరీతిగా నెంతమాత్రమును సాగనీయగూడదు. హిందూమహమ్మదీయ కలహ ముల నొక్కసారిగా మరల నెన్నటికి తలచూపకుండునటు లడచివేయ వలెను. ఇందులకు కాంగ్రెసు మహాసభకున్న అర్హత మరేసంఘమున కును లేదు.

### భిన్న విజ్ఞానముల సంఘర్షణము

హిందూమహమ్మదీయ కలహములను పరిష్కరించుటకు మనము ప్రయత్నించుటలో లక్షణమును చూచి వ్యాధియని భ్రమపడగూడదు. కలహకారణము నిగూఢమును ప్రబలమునై యున్నది. అది ప్రపంచ మున వెనుక చాలసారులు జరిగియున్నదే కాని నేడు మన దేశమున మాత్రమే క్రొత్తగా కలిగినదిగాదు. అది భిన్నములగు రెండు విజ్ఞాన ములకే ముఖ్యముగా సంబంధించినదిగానున్నది. ఈ రెండు విజ్ఞానముల కును జీవితమునుగూర్చి భిన్నభావములు కలవు. ఈ రెండు విజ్ఞానము లును మన దేశమున ముఖాముఖిని తారసిల్లినవి. రెండువిజ్ఞానములును వృద్ధినొందుటకు హక్కును కలిగియున్నవని రెండు మతముల వారును గ్రహింపవచ్చును. పరస్పరసహనగౌరవభావములను వృద్ధి నొందింపవలెను. రెండుమతముల యువజనులును కలసి పనిచేయుటకు తగినజాతీయసంస్థల నేర్పరచి విజ్ఞానసామరస్యమును కలిగింపవలెను. రెండు నాగరికతలకును ఆధారములగు నాశయములను రెండుమతముల వారును సరిగా తెలిసికొనగలుగుట కవకాశములను కలిగింపవలెను. ఇదియే యుత్తమసాధనమని నేను తలపోయుచున్నాను. పరిస్థితులను

బట్టి భారతీయవిద్యార్థులు పాశ్చాత్యవిజ్ఞానమును తెలిసికొనుట తప్పని సరి యగుచున్నదిగాని స్వదేశమునందున్న వివిధమతములవిజ్ఞానమును గూర్చి యేమతమువారికినిగూడ కొంచెమైన తెలియదు. హానికరమగు నీఅసంగమును, అతిప్రబలమగు నీఅజ్ఞానమును తొలగించుటలో కొంచెమైన ఆలస్యము చేయగూడదు. రెండుమతములలోను అనాదికాలము నుండియు వేరూనినభావములను పరస్పరము సాకల్యముగా గ్రహించి యొండొరుల ఆశయములపట్ల సానుభూతిని కలిగియున్నచో ప్రత్యేక ప్రాతినిధ్యము, గోవధలు, మసీదులయెదుట వాద్యములు మున్నగు వివాదాంశములన్నియును తొలగిపోవుట నిశ్చయము. అటుపిమ్మట భారతదేశచరిత్రనుగూర్చి పరిశోధనలను సల్పు పండితులకు మాత్రమే అవి ఆకర్షకములుగా నుండగలవు.

అంతవరకును ఈ మతకలహముల సమస్యను మన ముపేక్షింప గూడదు. హిందువులును, మహమ్మదీయులునుగూడ జ్ఞాపకముంచుకొనదగిన ముఖ్యాంశములు కొన్నికలవు. మనమందరమును భారతీయులము. మనము భారతదేశమునందే పుట్టితిమి. ఇచటనే పెరుగవలెను. ఇచటనే తనువుచాలింపవలెనను విషయమును మనమెవ్వరమునుగూడ మరవగూడదు. భగవంతుడు మనఅదృష్టములను అవిచ్ఛిన్నముగా బంధించివేసెను. దేశమునందున్న ఏడుకోట్లమంది మహమ్మదీయులను దేశమునుండి తరిమివేయగలమని హిందువులలో నెవరైన తలచుచున్నచో అది గొప్పదుర్బుద్ధియని వారువెంటనే తెలిసికొని దానిని వదలుకొనవలెను. అట్లు వదలుకొనినచో వారికిని దేశమునకునుగూడ చాలమేలు కలుగగలదు. దేశమునందున్న 25 కోట్లమంది హిందువులపైనను తామధికారమును చలాయింపగలుగుదుమని మహమ్మదీయులలో నెవరైన తలచుచున్నచో అది కేవలము పిచ్చియూహయని వారెంతశీఘ్రముగా గ్రహింపగలిగిన నంతహెచ్చుగా మహమ్మదీయసంఘమునకును భారతదేశమునకును గూడ మేలు కలుగగలదు. మనము ప్రయత్నించుచున్న స్వరాజ్యము హిందూరాజ్యమును గాదు, మహమ్మదీయరాజ్యమును గాదు. అది భారతీయు లందరికిని సంయుక్తరాజ్యము. అన్నిసంఘములకునుగల న్యాయమైన హక్కులనన్నిటిని స్వరాజ్యము కాపాడును. ఎల్లప్పుడును కలహించుచుండుట మానవసంఘమునకు సహజస్థితి కాజాలదు. మతసాంఘికాభివృద్ధికొరకు పనిచేయు మతారాధకుడు తనమతమువారికి ఆర్థికరాజకీయ విద్యాదివిషయములం దభివృద్ధిని కలిగింపవలెననియే కోరుచుండును. ఇది అనుచితమని నేననను గాని ఒకజాతికి గాని,ఒకసంఘమునకుగాని స్థిరమును ఘనమునునగు, మేలుకలుగవలెననిన ఆదేశమున ప్రశాంతస్థితి నెలకొనుట ముఖ్యావసరమై యున్నది. తీవ్రసాంఘిక కలహములవలన నేదైన నొకసంఘమునకు కొద్దిమేలు కలిగిన కలుగవచ్చునుగాని యత్యధికమగు మేలు ఎన్నటికిని కలుగదు. దేశమునకసలే మేలుకలుగదు. వివాదములను పరిష్కరించుట కిట్టి అనాగరికపద్ధతుల నవలంబించుట మాని మన దేశమున కంతటికిని ప్రధానజాతీయ న్యాయస్థాన మనదగిన జాతీయమహాసభకే; యీదేశమునందు నివసించుచున్న అన్నిసంఘముల హక్కులను, బాధ్యతలను నశేపరచి ఆసభవారి పరిష్కారముప్రకార మన్ని మతములవారు నుసడుచుకొనుచుండుట చాల లాభకరమని నే నన్నిమతములవారికిని విన్నవించుచున్నాను.

విదేశీయుల ఆక్రమణమునుండి విముక్తిచెంద గోరుచున్న యే పాలిత జాతియును అంతఃకలహములలో మునిగి యుండజాలదు. స్వాతంత్ర్యమునకు అంతఃకలహములు కేవలము విరుద్ధతమమైనవిగాన మనము కలహములలో మునిగియుండ గోరినచో స్వరాజ్యముమాటను తలపెట్టుటకైన మన కవకాశ ముండదు. మనదేశమున జరుగుచున్న అంతఃకలహములను విదేశీయులు చూచినపుడు మనము మనఃపూర్వకముగా స్వరాజ్యమును కోరుచున్నామని వారు ఎంతమాత్రమును నమ్మజాలరు. మనదేశభక్తి యంతయును వారికి వంచనగానే తోచును. ప్రతిపక్షులకంటె నేవో కొన్ని అల్పసౌకర్యముల నధికముగా బడయవలెనను నాశవలన మనము అనైచ్ఛికముగ దినదినమునకు బల మధికమగుచున్న భారతదేశప్రతికూలురకు సహాయముచేసినవార మగుచున్నాము. కావున భారతీయుల మగు మనమందరమును గట్టి దీక్షతో కలసి పనిచేసినచో మనగౌరవమును హరించుచున్న యీమనోభావమును నిర్మూలింపజాల కుందుమా? ఆత్మగౌరవమును కాపాడుకొనుటకును, వ్యక్తిలాభమునకును గూడ మనము విశాలభావముల నలవరుచుకొనుట యత్యవసరము. శాశ్వతమగు జాతీయలాభమును బడయుటకొరకు తాత్కాలిక సాంఘికసదుపాయములను మనము వదలుకొనవలెను.

హిందువులకును, మహమ్మదీయులకును మైత్రిని గలిగించుటకు చాలసభలు జరిగినవి. వానిలో రెండుమతముల నాయకులును తమకు కలహకారణము లని తోచిన వానిని వివరించిరి.

రాజకీయవిషయములు మతవిషయములు, నని రెండు తెగలుగా నా కారణముల నన్నిటిని విభజింపవచ్చును.

## రాజకీయవిభేదములు

తమహక్కులను కాపాడుటకు విశ్వసింపదగినంతహెచ్చుగా అధికసంఖ్యాకులలో రాజకీయబాధ్యత వృద్ధినొందలే దనుభయమువలన మహమ్మదీయులు ప్రత్యేకప్రాతినిధ్యమును, ప్రత్యేకనియోజకవర్గమును కోరిరి. దీనినిగూర్చి వివరముగ చర్చించుట నిష్ఫలము. ఇది అందరకును విదితమైన పూర్వవృత్తాంతమే. ఇటీవల కలిగిన పరిస్థితుల వలన చాల హాని కలుగగలదని గ్రహించి కాంగ్రెసుమహాసభవారు నిరుడు గౌహతిలో వివాదములను పరిష్కరించుటకు సాధనముల నాలోచింపవలెనని భారత కాంగ్రెసుసంఘమును కోరుచు నిట్లు తీర్మానించిరి.

"ప్రస్తుతము హిందువులకును, మహమ్మదీయులకును కలిగిన హానికరములగు కలతలను తొలగించుటకు భారతకాంగ్రెసు కార్యసంఘమువారు హిందూమహమ్మదీయ నాయకులతో నాలోచించి సాధనములను నిర్ణయించుటకు వెంటనే పూనుకొనవలెను. 31_3_1927 తేదీలోగా స్థాయిసంఘమునకు తమ నివేదికను పంపవలెను. స్థాయి సంఘమువారా నివేదికనుగూర్చి ఆలోచించినపిమ్మట దేశమునందున్న కాంగ్రెసుపక్షమువారికందరికిని కాంగ్రెసుమహాసభపక్షమున నీవిషయమున సూచనలనుచేయుట మున్నగు కార్యములను చేయవలెను."

అను తీర్మానము గౌహతీమహాసభలో నామోదింపబడినందున అధ్యక్షుడు రెండు మతముల ప్రధాన నాయకులతోను దీనినిగూర్చి సంప్రతించెను. రెండు మతములవారి సద్భావమును, శ్రద్ధాయుతమగు సహాయమును బడయగోరి శ్రీమాన్ శ్రీనివాసయ్యంగారు దేశమునందంతటను సంచార మొనరించెను. పిమ్మట డిల్లీనగరమున చాల సంభాషణలను జరిపెను.

ప్రస్తుతమున్న రాజకీయవిభేదములను పరిష్కరించుటకు చివరకొకపద్ధతి కనుగొనబడెను. దీనికి శ్రీనివాసయ్యంగారు సద్భావముతోను, దీక్షతోను, గట్టిపట్టుదలతోను పనిచేయుటయే ముఖ్యకారణమని చెప్పకతప్పదు. మహమ్మదీయ నాయకులుగూడ దేశభక్తిని, రాజనీతిజ్ఞతను కలవారై సంకుచితమైన స్వమతలాభదృష్టిని, అనుమానమును దిగనాడి ధైర్యముతో క్రొత్తసూచనలనుచేసి, మహమ్మదీయభావమునకు భారతదేశమున నూతనస్వరూపమునుకలిగించినందులకు జాతీయమహాసభవారు చాల సంతసించిరని యీసందర్భమున నేను తెలుపకున్నచో నావిధికి తప్పినవాడనగుదును. పిమ్మట అనాలస్యముగా అధ్యక్షుడు బొంబాయిలో భారత స్థాయిసంఘసభను జరిపించెను. కార్యసంఘమువారి నివేదిక ఆసభలో చర్చింపబడెను. డిల్లీలో జరిగిన చర్చలఫలితముగూడ నా నివేదికయందు వివరింపబడెను. 16_5_1927_వ తేదీని బొంబాయిలో జరిగిన స్థాయిసంఘసభకు హిందూమహాసభ ప్రధాన నాయకులలో కొందరుగూడ వచ్చియుండిరి. ఆసభలో ఏకగ్రీవముగా నామోదింపబడిన తీర్మానము స్థాయిసంఘమువారి రాజకీయచాతుర్యమును, అధ్యక్షుని ప్రయత్నసాఫల్యమును, అతనికి గల అనునయనైపుణ్యమును వేనోళ్ల చాటుచున్నది. స్థాయిసంఘసభలో ఆమోదింపబడిన పీఠికతోగూడిన తీర్మాన మిట్లున్నది:

"20_3_27_వ తేదీని ఢిల్లీలో సమావేశమైన మహమ్మదీయ ప్రతినిధులగు నాయకులు చేసిన సూచనలను, హిందూమహాసభ మున్నగు హిందూసంఘములు చేసిన సూచనలను, ఇతరనాయకులు చేసిన సూచనలనుగూర్చి 15_5_27 న జరిగిన సభలో కార్యసంఘమువారు ఆలోచించి 16_5_27 న స్థాయిసంఘమునకు నివేదికను పంపిరి.

కార్యసంఘమువారి సూచనలను పొందుపరచుచు స్థాయిసంఘమునం దుపపాదింపబడిన తీర్మానము సభలో ఏకగ్రీవముగా నామోదింపబడెను. ఆసభకువచ్చిన హిందూమహాసభ ప్రధాన నాయకులుగూడ తీర్మానము నామోదించిరి. స్థాయిసంఘమువారి రాజకీయ చాతుర్యమును, అధ్యక్షుని ప్రయత్నసాఫల్యమును, అతనికి గల అనునయనైపుణ్యమును ఆతీర్మానము వేనోళ్ల చాటుచున్నది. హిందూమహమ్మదీయ సమస్యనుగూర్చి కార్యసంఘమువారు పంపిన నివేదికను, అందజేయబడిన సూచనలను స్థాయిసంఘమువారామోదించి, యీక్రింది సూచనలను నెరవేర్చుటకు తగినప్రయత్నముల నొనరింపవలెనని కాంగ్రెసుసంఘముల నన్నిటిని కోరుచున్నారు.

(1) సంయుక్తనియోజకవర్గములు.—

దేశమునందలి శాసనసభలలో ప్రాతినిధ్యమునుగూర్చి యిటుపైనచేయబడెడు రాజకీయవిధానమునందు రాష్ట్రీయశాసనసభలకును, భారతీయశాసనసభకును సంయుక్తనియోజకవర్గములనే యేర్పరుపవలెను.

(2) స్థానములను ప్రత్యేకించుట.—

హిందూ మహమ్మదీయ మతములవారి న్యాయమైనహక్కులు ప్రస్తుతము శాసనసభలలో కాపాడబడునని వారికి గట్టినమ్మకమును కలిగించుటకును, ఆసంఘములవారట్లు కోరినయెడల జనసంఖ్యనుబట్టి రాష్ట్రీయ భారతశాసనసభలలో సంయుక్తనియోజక వర్గములద్వారా ఆసంఘములకు ప్రాతినిధ్యమును సమకూర్చుటకును కొన్నిస్థానములను ప్రత్యేకింపవలెను. పంజాబులో సిక్కులున్నగు అత్యల్పజనసంఖ్యగల జాతులకు తగిన ప్రాతినిధ్యము లభించుటకు జనసంఖ్యనుబట్టి వారికి రావలసిన స్థానములకంటె హెచ్చుస్థానములను పరస్పరాంగీకారమువలన నొసంగవలెను. రాష్ట్రీయసభలలో నంగీకరింపబడిన స్థానముల తారతమ్యమును బట్టియే భారతశాసనసభలో గూడ రెండుమతముల వారికిని స్థానము లేర్పడవలెను.

(3) బ్రిటిషు బెలుచిస్తాను.—

ఎన్. డబ్ల్యు. (వాయవ్యదిక్కు) సరిహద్దు రాష్ట్రము.

పైని పేర్కొనబడిన రాష్ట్రములలోగూడ ఇతరరాష్ట్రములందు వలెనే సంస్కరణముల నమలులో పెట్టవలెనని మహమ్మదీయ నాయకులు చేసిన సూచన సమంజసముగా నున్నది గాన దాని నమలు జరుపవలెను. ఇతరములగు రాజకీయసంస్కరణములతోపాటు న్యాయశాఖాపరిపాలనమునుగూడ నారాష్ట్రములలో నేర్పరుపవలెను.

(3 అ) సింధురాష్ట్రమును విడదీయుట.—

1. సింధురాష్ట్రమును బొంబాయి రాష్ట్రమునుండి విడదీయవలెనను సూచననుబట్టి అన్నిరాష్ట్రములను భాషలనుబట్టి మరల విభజించుటకు తగిన అదను కలిగినదని యీసభవారు తలంచుచున్నారు. కాంగ్రెసువారిదివరకే యీపద్ధతి నవలంబించిరి.

2. కావున భాషలబట్టి విడదీయవలెనని ఏ రాష్ట్రము వారైన కోరినచో వెంటనే అట్లు విడదీయవలెను.

3. ముందుగా ఆంధ్ర, సింధు, కర్నాటక రాష్ట్రములను భాషనుబట్టి యేర్పరుపవలెను.

(4) అంతరాత్మస్వాతంత్ర్యము.—

ఇటుపైని చేయబడు నట్టిరాజకీయవిధానమున అంతరాత్మ స్వాతంత్ర్యమునకు పూచీ నేర్పరుపవలెను. అంతరాత్మ స్వాతంత్ర్యమును భంగపరచునట్టి చట్టములు ఏ శాసనసభలోకూడ ఆమోదింపబడగూడదు. నమ్మకము, భగవదారాధన, మతాచారములు, మత సంఘములు, మతవిద్య, మతప్రచారము మున్నగువాని నితరులకు ఇబ్బంది కలుగకుండను, ఇతరులహక్కులకు భంగము కలుగకుండను సాగించునట్టి స్వాతంత్ర్యమే అంతరాత్మ స్వాతంత్ర్యము.

(5) అంతస్సాంఘిక విషయములు.—

ఏశాసనసభలోగాని, సభ్యులుగా నున్న ఏమతము వారిలోనైన సభకు వచ్చినవారిలో $\frac{3}{4}$ మంది ప్రతిఘటులురుగా నున్నపుడాశాసన సభలో ఏచట్టమును, తీర్మానమును, సవరణను ఉపపాదింపగూడదు; చర్చింపగూడదు;ఆమోదింపను గూడదు. శాసనసభ ప్రారంభమగునపుడు ప్రతిసెషనులోను గూడ రెండుమతములవారిని సంయుక్తస్థాయిసంఘముగ నేర్పరుపవలెను. వారు నిర్ణయించిన సమస్య లన్నియును అంతస్సాంఘికసమస్యలని గ్రహింపవలెను."

1916 సంవత్సరమున లక్నోలో జరిగిన యొడంబడిక యందు కంటె యీ పైతీర్మానమునందు చాల అభివృద్ధి చూపించబడెను. ఈతీర్మానము చాల స్పష్టముగా నున్నదిగాన నేనేమియును తెలుప బనిలేదు; కాని సంయుక్తనియోజకవర్గములను గూర్చి మాత్రము నేను నొక్కి చెప్పదలచితిని. ప్రత్యేకనియోజకవర్గములు వివాదముల కొక ముఖ్యకారణముగా నుండెను. ఒక అభ్యర్థి తనమతమువారి ఓట్లవలననే ఎన్నుకొనబడవలసియున్నచో వారి ఆదరమును బడసి ఓట్లను సంపాదించుట కతడు మతవివాదముల కధికముగు ప్రాముఖ్యము నిచ్చుట కవకాశ మేర్పడును కావున అత్యల్పసంఖ్యగలజాతులకు ప్రత్యేకస్థానములను నిర్ణయించుచు ఈ తీర్మానము నూతనావకాశమును కలిగించినది.

జనసంఖ్యనుబట్టి ప్రతినిధుల సంఖ్యను నిర్ణయించవలెనను సిద్ధాంతము నామోదించుటవలన మననియోజకవిధానము న్యాయముగను, సర్వసమముగనుగూడ జరుగగలదు.అల్పసంఖ్యాకులగుజాతులకు హెచ్చు సౌకర్యములు లభించుచున్నవను మనస్తాపము దీనివలన కొన్నిరాష్ట్రములలో తీరగలదు. వంగపాంచాల (పంజాబు) రాష్ట్రములలో అధిక సంఖ్యాకులు అల్పసంఖ్యాకులుగా చేయబడుటవలన వారికి కలిగిన మనస్తాపముగూడ తొలగగలదు. అల్పసంఖ్యాక పక్షములలో శాసన సభకు వచ్చియున్న యే పక్షప్రతినిధులలోనైన ముప్పాతికభాగము ప్రతినిధులు ఆపక్షమునకు సంబంధించిన యేతీర్మానము నైన నాక్షేపించినచో దానిని త్యజింపవలెనని విధించుటవలన అల్పసంఖ్యాక జాతి పక్షములకుగూడ భద్రము చేకూరుచున్నది.

మత సాంఘిక కలహములను పరిష్కరించుటకు కాంగ్రెసువారి కధికారము లేదని కొంద రాక్షేపించిరి. రాజకీయములైనను, మత సంబంధము లైనను అవి అంతస్సాంఘికములైనచో కాంగ్రెసువారు కల్పించుకొనరాదని వారు తెలిపిరి. కాంగ్రెసు మహాసభతో సమానమగు గౌరవమును బడయుటకైనను ఏ మతసంఘమునకును, అన్నిమత సంఘముల సముదాయమునకునుగూడ నర్హత లేదనినపుడు కాంగ్రెసు నతిశయించుటకు వేనికినిగూడ నర్హత లేదని నేను వేరుగా తెలుప నవసరములేదు. వివిధమతసాంఘిక సంస్థలు చేసిన పరిష్కారములను సమోదు చేయుటకే కాంగ్రెసు ఏర్పడియుండలేదు. అట్టివిషయములను పరిష్కరించుటకును, అన్నిసంఘములకును సామరస్యమును కలిగించుటకును ముఖ్యమగునధికారము కాంగ్రెసునకేకాని మరే సంఘమునకును లేదు. మత సంఘములనాయకులు వివాదమూలములగు విషయములలో సమాధానమును కుదుర్చుకొనగలిగిన న్యాయమగు నేర్పాటును చేయగలిగినచో కాంగ్రెసువారు నిస్సంశయముగా దాని నామోదించెదరు. వారట్లు సామరస్యమును కలిగించుకొనజాలనిచో, ఆవిషయములో ఐకమత్యమును కలిగించుకొని సామరస్యమును కలిగించి శాంతిని నెలకొల్పవలసిన బాధ్యత ప్రధానప్రతినిధిసంఘమగు కాంగ్రెసునకుమాత్రమే కలదుగాన అసంతృప్తులును, కుపితులు నగు సాంఘికులు అవిధేయతతో చేయునట్టి బెదరింపులను, ఆక్షేపణలను కాంగ్రెసు లెక్క చేయజాలదు.

## మత విభేదములు

రాజకీయ విభేదములనుగూర్చి పైన వివరింపబడిన రీతిని కాంగ్రెసువారు బొంబాయి నగరమున సంతృప్తికరమగు విధానమును సూచించిరి. మతసాంఘికసమస్యల నింకను పరిష్కరింపవలసి యుండెను గాన వానినిగూర్చి సమాధానమును కుదుర్చుకొనుటకు రెండు మతముల నాయకులకును సిమ్లాలో అధ్యక్షుడు శ్రీనివాసఅయ్యంగారు అవకాశమును కలిగించిరి. కాని అచట జరిగిన సంభాషణలవలన ఫలితము తేలలేదు. కావున కలకత్తాలో భారతకాంగ్రెసు స్థాయి సంఘసభ జరిగినపుడాసమస్యలను పరిష్కరించుటకు తనకును, స్థాయి సంఘమునకును సహాయముచేసి సలహా నొసంగుటకు హిందూమహమ్మదీయ నాయకులను శ్రీనివాసయ్యంగా రాహ్వానించెను. దాని ఫలితముగా కలకత్తాలో నైకమత్యసభలో రెండు తీర్మానము లామోదింపబడెను. స్థాయిసంఘసభవారుగూడ వాని నామోదించిరి.

1. మతదీక్ష.

"తమ మతమును గూర్చి యొక వ్యక్తికిగాని, వ్యక్తులకుగాని వాదమువలనను, నచ్చ జెప్పుటవలనను వారిని ఒప్పించి వారిని తమ మతములో కలుపుకొనుటకు వ్యక్తులకును,సంఘములకునుగూడ హక్కు కలదుగాని యేదో లాభమును కలిగించెదమని ఆశ పెట్టియు, మోసగించియు, నిర్బంధించియు, దౌర్జన్యమును చూపియు ఎవరును మరియొకరిని తమమతములో కలుపుకొనగూడదు. సాధుమార్గమున నొక

రిని వేరొకరు తమమతములో కలుపుకొనుచున్నపుడు కలియుచున్న వాని మతమువారుగాని మరియొకరుగాని, దౌర్జన్యమువలన దానిని నిరోధింపగూడదు. పదునెనిమిదియేండ్లకు లోపు వయసువారిని వారి తలిదండ్రులతోగూడ నైనచో కలుపుకొనవచ్చునేకాని లేనిచో కలుపుకొనగూడదు. పదునెనిమిదియేండ్లకు లోపు వయసుగల యొకమతస్థుడు అనాథగానున్నచో మరియొకమతమువా రతనిని చూచినయెడల వా రతడేమతమువాడో తెలుసుకొని ఆమతమువారికే వానిని వశపరుపవలెను. ఎవరినిగాని ఒకరు తమమతములో క్రొత్తగా కలుపుకొనగోరినపుడును, ఒకమతమువాడింకొక మతములో కలిసిన పిమ్మట పశ్చాత్తాపముకలిగి మొదటిమతమును మరల నవలంబింప గోరినపుడును మతదీక్ష నొసంగువారు రహస్యముగా నొసగగూడదు. ఆవ్యక్తి పేరును, స్థలమును, తేదెని, కాలమును, పద్ధతిని స్పష్టముగా ప్రకటింపవలెను. అట్టి సమయములలో కలుపుకొనినవారు ఆర్భాటములు, ఊరేగింపులు, ఉత్సవములు మున్నగువానిని జరుపగూడదు. ఈనియమములకు విరుద్ధముగా నెవరైన మెలంగినచో, అనగా బలవంతముగానో, రహస్యముగానో, మోసగించియో కలుపుకొనినను, 18 యేళ్లలోపు వారిని కలుపుకొనినను, ఆవిషయమై ఫిర్యాదు వచ్చినయెడల భారతకార్యసంఘము వారిచే నియమింపబడెడు మధ్యవర్తులు విచారణచేసి వివాదములను పరిష్కరింపవలెను.

2. ఆవులు–వాద్యములు.

ఈ దిగువ వివరింపబడిన తీర్మానమును స్థాయిసంఘమువా రామోదించుచు తీర్మానమునందు వివరింపబడిన రీతిని ప్రచారము చేయుటకు కాంగ్రెసు సభ్యుల కందరికిని అధికారము నిచ్చుచున్నారు. ఈప్రచారమును సాగించుట కొక సంఘమును నియమింపవలెనని కార్యసంఘమువారిని కోరుచున్నారు. చెన్నపురిలో జరుగనున్న స్థాయిసంఘసభలోను, కాంగ్రెసు మహాసభలోను ఈతీర్మానమును మరల నుపపాదించి ఆమోదమును బడయవలెననికూడ కోరుచున్నారు:

“ భారతదేశమునం దేసంఘముగాని మరియొకసంఘమును తమ మతవిధుల ననుసరింప వలెనని నిర్బంధింపగూడదు. నీతికిని, శాంతికిని భంగము కలుగకుండ ఎవరయినను ఏమతధర్మములయినను అవలంబించి అనుష్ఠించుట కెట్టి అభ్యంతరమును లేదు.

హిందువులు మతసంబంధమునవైనను, ఇతరసంబంధములలో నయినను ఊరేగింపులను జరుపునపుడు సంగీతముతోను,వాద్యములతోను అన్ని మసీదుల చెంతనుండియు పోవచ్చునుగాని మసీదులయొద్ద నాగగూడదు; అచట అట్టహాసము చేయగూడదు; ఆ సంగీతము వలనను, వాద్యములవలనను మసీదులలో ప్రార్థనలు చేయువారి కెట్టి యిబ్బందియును, హెచ్చగు తొందరయును కలుగగూడదు.

మహమ్మదీయులు ఏపట్టణమునందైనను, ఏగ్రామమునందయినను మతనియమములకొరకు ఆవులను బలియిచ్చుటకును, లేదా ఆహారముకొరకు ఆవులను వధించుటకును ఎట్టి అభ్యంతరమును లేదుగాని వారు మ్యునిసిపలు నిబంధనలను గమనించుటయేకాక రాజవీథుల లోను, దేవాలయములకును, ప్రార్థనామందిరములకును చేరువగాను, హిందువులకు కనబడునట్లును ఆవులను చంపగూడదు. అట్లు చంపుటకు తీసుకొనిపోవు ఆవులను వీథులవెంట ఊరేగించుచు తీసుకొనిపోగూడదు; ఆర్భాటములను చేయగూడదు. గోవధలపట్ల హిందువులకు అనాదికాలమునుండియు ప్రబలమగు నయిష్టత వేరూనియున్నదిగాన ఏ పట్టణమునగాని, గ్రామమునగాని, మతసంబంధమునగాని, ఆహారముకొరకుగాని మహమ్మదీయులు ఆవులను వధించునపుడు అచటిహిందువులకు మనఃక్షోభమును కలిగింపనట్టి పద్ధతినే గోవధలను జరుపవలెనని ముఖ్యముగ కోరబడుచున్నారు.

ఈ తీర్మానమునందలి షరతుల నెవరైన నుల్లంఘించినట్లు ఫిర్యాదు వచ్చినచో భారతకార్య సంఘమువారిచే నియమింపబడిన మధ్యవర్తులు విచారణచేసి పరిష్కరింపవలెను.”

ఇదివరకు ఒక మతమువారికిగల హక్కులను మరియొక మతమువారు నిరోధింప బూనుచుండుటవలన మతకలహముల నడంచుటకు చేయబడిన ప్రయత్నములు సఫలమగుట కభ్యంతరము కలుగుచుండెను. అందువలన అవిశ్వాసమును, సంశయమును తొలగుటకు బదులు వివాదములు మరింత ప్రబలుటయే తటస్థించుచుండెను. ఇపుడు వివిధమతములవారికి గలహక్కులను పూర్తిగా అంగీకరించుచు సాంఘిక జీవనము శాంతముగాను, సమష్టిగాను జరుగుట కత్యావసరమగు నిబంధనలను చేర్చిచేయబడిన తీర్మానము స్థాయిసంఘసభలో నామోదింపబడెను. తమ హక్కులు భంగమగునను భయమిపుడుతొలగుటచే ఉదారభావమును చూపవలెనని రెండుమతములవారి నిపుడు కోరుటవలన నైకమత్యము కలుగుట కవకాశ మధికమైనది. ఒక మతమువారు రెండవమతమువారికి మనస్తాపమును కలిగింపకుండుటకు తమకుగల హక్కులను తమంతనే వదలుకొనుటకూడ అసంభవముకాదు.

కాంగ్రెసువారు స్పష్టమగు మార్గమును చూపించిరి. భారతరాజకీయ కళేబరమును వేరుపురుగువలె దొలుచుచున్న మతకలహములను మహావ్రణమును నిర్మూలించుటకు కాంగ్రెసువారు అమృతప్రాయమగు నౌషధమును నిర్ణయించిరి. ఈతీర్మానములనుగూర్చి రెండుమతముల ప్రజలకుచక్కగావివరించిచెప్పి,వారువానినామోదించునటులచేయవలసినభారముకాంగ్రెసుసభ్యులమగుమన పైనే యున్నది. దీనినిగూర్చి మనము గట్టి ప్రచార మొనరింపవలెను. భారతదేశహితైషులందరును వారి రాజకీయాభిప్రాయము లెట్టివైనను గూడ నైకమత్యమును కలిగించువిషయమున మనఃపూర్వకముగా కాంగ్రెసువారికి తోడ్పడవలెనని నేను ముఖ్యముగా కోరుచున్నాను. పత్రికలవారు తమబాధ్యతను గుర్తింపవలెనని వారిని నేను ప్రత్యేకముగా కోరుచున్నాను. ప్రజాభిప్రాయమును సవరించుటకును, అంతస్సాంఘిక సంబంధములను సరిచేయుటకును పత్రికలకుగల ప్రాముఖ్యము మరేసాధనమునకునుగూడ లేదు.

# ది బెజవాడ స్పిన్నింగ్ అండ్ వీవింగ్ మిల్స్ లిమిటెడ్, బెజవాడ.



ధర తక్కువ!! మన్నిక ఎక్కువ!!!

రిజిష్టరుడు ఆఫీసు:— మెయిను కెనాల్ రోడ్డు, బెజవాడ.

మిల్లుకట్టడములు:— కృష్ణా కెనాలుస్టేషనుకు సమీపమున.

నియమించబడిన మూలధనము:— రు. **20,00,000**

వాటా 1-కి రు. 20 చొప్పున 1,00,000 వాటాలు.

(29-2-1928) చందా మూలధనము:— రు. **2,94,400-0-0**

(29-2-1928) వసూలు అయిన మూలధనము:— రు. **2,66,055-0-0**

మీ ధన సహాయము లేనిది దేశీయ పరిశ్రమలు వృద్ధిచెంద నేరవు.

సర్వ సామాన్యులకు అందుబాటులో వుండి అనుదినము వాడుక కనుకూలమగు వస్త్రము లన్నియు, నాణ్యమైన నూలుతో తయారు చేయబడి, తగ్గుధరల కమ్మబడుచున్నవి.

మాచే తయారు కాబడు ధోవతులు, సైన్లు, జాకినీటు, తువాళ్లు, పక్కదుప్పట్లు, చాపలమర్తింగులు, చీరెలు యింకను వివిధ రకములు పలుచోట్ల అమ్ముటకు మాకు నమ్మకమయిన ఏజంట్లు కావలయును.

నలయువారికి ఖరీదుల పట్టీ పంపబడును. హోల్సేలుగా అమ్మకమున కున్నవి.

వివరములు తెలిసికొనుటకు చిరునామా:—

గూడూరి లక్ష్మణరావు, బి. ఏ.,— మేనేజింగ్ ఏజంట్ అండ్ డైరక్టర్, బెజవాడ.

శ్రీమత్స్వగ దేవతాయైనమః

# లోకోపకారము

(1) ఎవరేని కార్యార్థులయి వచ్చి, వారు తమ కార్యమును జెప్పకమునుపే వారి పేరును, ఊరును, వచ్చిన పనియును, ముఖము చూచినమాత్రముననే చెప్పుట

(2) వచ్చినవారు తాము కోరదగిన ప్రశ్నమును ఒకకాగితము మీద వ్రాసికొని భద్రముగా తమవద్ద దాచిపెట్టుకొనియుండగా, ఆకాగితము మీదనే ఆయాప్రశ్నల కుత్తరము వ్రాయబడియుండుట

(3) ప్రశ్నకువచ్చినమనిషి రోగియైనచో, ఆరోగి మొగము చూచినంతనే రోగమిట్టిదని విస్పష్టముగా చెప్పుటేకాక రోగమారంభించిన తేదీ మొదలుకొని జరిగినచరిత్రమంతయు పూసగ్రుచ్చినట్లు చెప్పుటయు, ఆరోగము నివర్తించెడిదియైనచో దానికి అనుకూలించుఉపాయములు చెప్పుట, లేక చేయుట

ఆయీసందర్భములు నేను స్వయముగా ఏలూరిలో చూచి లోకోపకారార్థముగా ప్రకటించితిని. ఈప్రకటనకు సంబంధించిన పురుషుని ఛాయాపటము, చేవ్రాలు ఈక్రింద ముద్రింపబడియుండును. వలయువారతని యొద్దకుజని యుపకృతి నందుదురు గాక!

చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి,
శతావధాని.

విఖ్యాతసమ్మోహన
విద్యానిపుణులగు



ప్రొఫెసర్. శేఖర్,
ఏలూరు.
(పశ్చిమగోదావరి జిల్లా)

పురాతన మహర్షి విజ్ఞానమను రత్నగర్భమునుండి, కేవలైహిక భోగపరాయణమని చెప్పబడు నేటికాలమునందును, అప్పుడపుడు నమూల్యము లగు రత్నము లొక్కటి రెండు వెలికీడ్వబడి ప్రజల నాశ్చర్య మగ్నులను చేయుచున్నవి. ప్రశ్న ఫలములను చెప్పెడి జ్యోతిషము మున్నగు నితరసాధనములు ఒక్కొక్కప్పుడు చెప్పెడివారి లోపముచే నైననేమి, ముహూర్తనిర్ణయమునందలి లోపముచే నైననేమి తప్పిపోవుట సంభవించును. గాని దివ్యదృష్టివలన చెప్పుఫలములకు తిరుగులేదు. వైద్యులు హృదయ పరిశోధిని, ఘర్మమెటరు మున్నగుసాధనము లెన్నిటితోడ పరిశీలించియు ఫలానా వ్యాధి యని తెలిసికొనలేకున్నారు. ప్రొఫెసరుగారు సరాసరిగా నిదానము, నివారణము తన జ్ఞాననేత్రమున నారసి చెప్పగలరు. సుప్రసిద్ధులు వు లిట్లు వ్రాయుచున్నారు.

సీ. అఖిల విద్యాభోజుఁడగు పిఠాపురమహారాజ సత్కార విభ్రాజివైతి
మెప్పించితివి మెరమెచ్చులాడని సెరవాని "వల్లింగ్డను" ప్రభువతంసు
నీ లకోటా ప్రశ్నలాలించి యచ్చెరువంది "యర్లాం" చేత వందియయ్యె
సకలకళావిచక్షణుఁడైన "గోషెను" ప్రభుని సత్కారమ్ము నడసినావు

ఖండఖండాంతరముల నఖండ శేము, షీ
సనాదులు నీవైమషీ సమగ్రతను కరమ్ములు
మోడ్చి రింతకు మరింత సోమ
శేఖర! కీర్తి విస్ఫూర్తి గనుము!!



సభామంటప సింహద్వారము



సభామంటప సింహద్వారమునెదుట జాతీయపతాకాస్థాపనము

కాంగ్రెసునగరమున-సభామంటపగమనము



అధ్యక్షులు మొదలగువారు



మఱికొందఱు నాయకులు

మేలుచేయుటకును, హానిచేయుటకునుగూడ పత్రికలు సమర్థములై యున్నవి. ఇదివరకు మనదేశమున మతకలహములు ప్రారంభమైనప్పటి నుండియు పత్రికలు –ముఖ్యముగా దేశభాషాపత్రికలు – ప్రజలమేలు కొరకు పనిచేసియుండలేదని చెప్పవలసివచ్చినందులకు నేను చాల చింతించెదను. ఏవో కొన్ని ప్రశంసనీయములైన పత్రికలు తప్ప తక్కిన పత్రికలన్నియును కలహాగ్నిని ప్రజ్వలింపజేయుటకే పూనుకొనినవి. తమవిధుల నవి బొత్తిగా స్మరింపలేదు. ఆంగ్లోయిండియను పత్రికలను నేనాక్షేపించుటలేదు. తమ యజమానులమేలునే ఆపత్రికలు కోరుట సహజము. కాని దేశీయపత్రికలైనను స్వార్థపరత్వమునువదలి సకలజన హితకరమగు జాతీయతాభివృద్ధికొరకు దేశమున మరల నైకమత్యమును, సద్భావమును కలిగింపవలెనని ప్రయత్నించుచున్న పక్షములకు బాసట కావలెనని ఆపత్రికలను కోరుట అందరాని ఫలమున కాశించుటయే యగునా? పత్రికలకు వార్తల నందించు సంఘములవారుగూడ మనదేశమున సంతృప్తికరముగా పనిచేసియుండలేదు. కావున నిటుపైనైన దేశమున శాంతిని నెలకొల్పుటకు వారుగూడ సహకారు లగుదురని మన మాశింతము. ఈ విషయము మనకు ప్రాణరక్షణవలె ముఖ్యతమ మని మన మందరమును స్మరింపవలెను. భారతభావిభాగ్య మంతయును మన నైకమత్యముపైననే ఆధారపడి యున్నది.

## అస్పృశ్యత

హిందూమహమ్మదీయ కలహములు సర్వవ్యాపియగు క్రిమివలె దేశమునం దంతటను వ్యాపించియుండుటవలననే నే నీసమస్యనుగూర్చి అధికముగా చర్చింపవలసిన అవసరము కలిగినది. అల్పసంఖ్యాకులగు అనాగరక తరగతుల హక్కులు అను విశాలసమస్యలో హిందూ మహమ్మదీయసమస్య యొక అంతర్భాగమే యగును. ఉత్తరమున సిక్కులకును, దక్షిణమున బ్రాహ్మణేతరులకును, సర్వత్ర నిమ్నజాతులకును సంబంధించిన విషయములను మనము సమానశ్రద్ధతోనే గమనింపవలెను. ప్రస్తుతమున నిమ్నజాతులు, లేక అస్పృశ్యులనుగూర్చి మాత్రమే నేను కొద్దిగ తెలుపగోరెదను. ఈ సమస్యను పరిష్కరింపవలసిన బాధ్యత ప్రధానముగా హిందూసోదరులపైననే యుండినను భారతీయు లందరునుగూడ దీనినిగూర్చి శ్రద్ధపూనవలసియే యుండును. దేశమున నధికసంఖ్యగల యొక తెగవారు సాంఘికముగను, రాజకీయముగనుగూడ చాలకష్టములకు పాల్పడుచున్నపుడు మన ముపేక్షించినచో దేశాభివృద్ధికి నిరోధము కలుగక మానదు.

## కాంగ్రెసువారిలో నైకమత్యము

ఈరీతిగా దేశమునందు సాంఘిక సామరస్యమును మరల నెలకొలుపుట యెంత ముఖ్యమో, విశాలదృష్టితో కాంగ్రెసును సంస్కరించుటగూడ నంత ముఖ్యమే యగును. అసహాయోద్యమమునందు మనము వెనుకంజ వేయవలసి వచ్చుటచే కాంగ్రెసుకు ప్రబలమగు నష్టము కలిగినది. 1920–1921 సంవత్సరములలో దేశీయు . లత్యధికోత్సాహముతో పని చేసిరి. ప్రతి గ్రామమునందునుగూడ కాంగ్రెసు సంఘము లేర్పడెను. ఆయుత్సాహము క్రమముగా తగ్గిపోసాగెను. సాంఘిక మతకలహములు తలచూపినపిమ్మట కాంగ్రెసుపట్ల చాలమంది ఉపేక్షను చూపసాగిరి. కొందరు ప్రతికూలతనుగూడ చూపసాగిరి. కాని వీరిసంఖ్య అత్యల్పము. ఇపుడు భారతస్థాయి సంఘమువారు చేసిన యేర్పాటులవలన సాంఘికసమస్య పరిష్కరింపబడెను గాన కాంగ్రెసు సభ్యతయందు ప్రజల కాసక్తిని కలిగించుటకును, అన్ని పక్షములవారును కాంగ్రెసులో చేరునట్టు ప్రోత్సాహమును కలిగించుటకును మనము ప్రయత్నింపవలెను. మన బ్రాహ్మణేతరమిత్రులు మరల కాంగ్రెసులో చేరుట కంగీకరించినందులకు నేను సంతసించుచున్నాను. ఈసభలో వారి ప్రతినిధులు హెచ్చుమంది యుండుట చాల సంతోషప్రదము. మహమ్మదీయుల సంఖ్యయును, సిక్కుల సంఖ్యయును చాల తగ్గిపోవుట సంతాపకరము. కాంగ్రెసుమహాసభ యేర్పరుపబడిన క్రొత్తలో పార్సీలు చాల శ్రద్ధగా పనిచేయుచుండిరి. ఇపుడు వారు పూర్తిగా విరమించుచున్నారు. దేశీయక్రైస్తవు లందరును ఇప్పటివరకును కాంగ్రెసులో చేరకుండనే యున్నారు. తాము కాంగ్రెసులో చేరకుండ నుండుటవలననే దేశీయక్రైస్తవసంఘమున కధికమగుమేలు కలుగునను దుర్భ్రమలో వారు మునిగియున్నచో మహమ్మదీయులకు కలిగిన అనుభవము వలననైన వారిపుడు నిజమును తెలిసికొనదగును. మనదేశమునందలి మహమ్మదీయులు పెక్కువత్సరములవరకును భారతజాతీయతకు ప్రతికూలురగు వారితోనే చేరి యుండిరి. అందువలన తగినఫలమును వారనుభవించిరిగాన నిపుడు వారు కనులు తెరచిరి. కాంగ్రెసులో చేరి దేశమునందలి యితర మతముల వారితో కలసి సమానముగా పనిచేసిననేకాని మహమ్మదీయ సంఘమునకు మేలుకలుగదని వారిపుడు గ్రహింపగలిగిరి. భారతక్రైస్తవులుగూడ నీప్రత్యేకతను విరమించి కాంగ్రెసులో చేరి భారతజాతీయ దృక్పథము నవలంబించిననే క్రైస్తవసంఘమున కధికమగుమేలు కలుగగలదని వారు గ్రహింపదగును. కాంగ్రెసు ద్వా:ా జాతీయకార్యములను నెరవేర్చుటలో తాముచేయవలసిననేవను చేయుటకు మనదేశమునందున్న అన్నిమతములవారును సద్భావముతో నొకరికంటె నొకరధికమగు నుత్సాహమును చూపదగునని నేను కోరెదను. అన్ని పక్షములవారును కాంగ్రెసులోచేరుటకు వీలగునట్లు ద్వారములను పూర్తిగా తెరువవలెను. వివిధపక్షములవారు మరల కాంగ్రెసులో చేరునట్లు చేయుటకు ప్రధానసిద్ధాంతములను తప్ప తక్కినవానినన్నిటిని త్యజించుటకు మన మెంతమాత్రమును వెనుదీయగూడదు. ప్రతిదేశమునందును భిన్నాభిప్రాయము లుండకమానవుగాని వానినిగూర్చి పోరాడవలసిన స్థానము భారతదేశమునందలి రాజకీయసంఘము లన్నిటిలోను ప్రధానమగు భారతజాతీయమహాసభాస్థానమే. ప్రతిపక్షమును తన దృక్పథమునుగూర్చి మహాసభవారికి నచ్చజెప్పి అధికసంఖ్యాకులు తన విధానము నామోదించునట్లు చేయుటకు సంపూర్ణావకాశముకలదు. అధికసంఖ్యా

కులు సహేతుకముగనో, నిర్హేతుకముగనో ఒకపక్షమువారి విధానము నామోదింపనిచో అధికసంఖ్యాకుల పాలనముకంటె మంచిపద్ధతిని మనము కనుగొనగలుగువరకును అధిక సంఖ్యాకుల నిర్ణయమునకు లోబడుటయే ముఖ్యకర్తవ్యమగును. ప్రజాప్రభుత్వమున అనుష్ఠానమున కనుకూలమగుపద్ధతి యిది యొక్కటియే. అల్పసంఖ్యాక పక్షమువారు తమవిధానమునుగూర్చి ప్రచార మొనరించుచు అధికసంఖ్యాకులు దాని నామోదించునట్లు పనిచేయుట కిందువలన వారికెట్టి నిరోధమును కలుగదు. వివరములలోను, పద్ధతిలోను భేదాభిప్రాయము కలిగినంత మాత్రమున మాతృసంఘమును పరిత్యజించి ప్రత్యేకపక్షముల నేర్పరుపగూడదు. స్వాతంత్ర్యమును, స్వపరిపాలనమును బడసిన దేశములందు సైతము స్వల్పభేదములకొరకు పక్షముల నేర్పరుచుట లాభకరముకాదు. అట్టిచో మొట్టమొదట హక్కులకొరకే యింకను పోరాడవలసినస్థితిలో నున్న మనదేశమునందిట్టి నిరోధకములును, క్లిష్టములునగు పక్షముల పద్ధతి కసలే తావులేదు. దేశమునందు కోట్లకొలది సంఖ్యగలజనసామాన్యమునకు వారిహక్కులనుగూర్చి యింకను సరిగా తెలియదు. వారికి వానిని బాగుగా బోధింపవలసిన బాధ్యత దేశీయులలో విద్యాధికుల పైననే యున్నది. దేశమున ననేకపక్షము లేర్పడుటవలన కలిగిన కలవరమువలన బుద్ధివైకల్యముగూడ కలుగునుగాన పామర జనాభివృద్ధికి ప్రయత్నించుటయందుపేక్ష కలుగును. కావున విభేదాంశములను మనము ప్రకటించుట మాని అనుకూలాంశములను గూర్చియే దీక్షగా పనిచేయదగును. బాగుగా చూచినచో విభేదాంశములు మిక్కిలి తక్కువ యనియు, అనుకూలాంశములే చాల హెచ్చనియు తేలకమానదు.

## శాసనసభలలో నైకమత్యము

శాసనసభలయందు నాకు నమ్మకము లేదుకాని శాసనసభలకు వెళ్లుటవలన దేశమునకు మేలు కలుగ గలదని కాంగ్రెసువారిలో హెచ్చుమంది నమ్ముచుండుటచే ఇష్టమున్నవారు శాసనసభలకు వెళ్లవచ్చునని మహాసభవా రనుమతి నొసగిరి. శాసనసభలయందు నమ్మకము కలవారు శాసనసభలకు వెళ్లుట తప్పనిసరి యని యిపుడుగూడ తలంచుచునే యున్న యెడల ప్రజాప్రతినిధులలోగల భిన్నాభిప్రాయముల వలన ప్రభుత్వపక్షమువారి చట్టములు నెగ్గుట కవకాశము కలుగనీయక శాసనసభలలో నుండు ఇతర జాతీయపక్షములతో చేరి ప్రజాప్రతినిధి పక్షము నేర్పరచి యేకముఖముగా ప్రతిపక్షులను ప్రతిఘటించుట కాంగ్రెసువారు శాసనసభలలో చేయదగిన కనిష్ఠసేవ యగునని నేను సవినయముగా వారికి విన్నవించుచున్నాను. చాల సమస్యలలో ప్రజాప్రతినిధులలో నేకాభిప్రాయమే కలుగుచుండును. శాసనసభలలో పనిచేయుటనుగూర్చి కాంగ్రెసుమహాసభవారు చేసిన నిర్ణయమునే కాంగ్రెసువా రనుసరించుచున్నచో నైకమత్యముతో పనిచేయుట కది మూలాధారము కాగలదు. అటుల కలసి పనిచేయుటకు నిర్ణయములలో నేవైన మార్పు లవసరమని యెవరికైన తోచినచో, వారు మహాసభలో తమ అభిప్రాయములను స్పష్టముగా తెలుపవచ్చును; కాని వానినిగూర్చి కాంగ్రెసువా రెట్లు నిర్ణయించిన నట్లేనే వారు నడుచుకొనవలెను.

## రాయలు కమిషను

వెనుకటి రోజులలో పాలకులు ప్రసాదించు వరముల (సదుపాయముల)కొరకు పాలితులాతురలతో నిరీక్షించుచుండువారు. దయామయుడగు సర్వేశ్వరుడు ఈవిచారణసంఘరూపమున మనకు సత్యమగు వరమునే అనుగ్రహించెను. భారతదేశీయులు స్పష్టముగ వెల్లడించిన కోరికలను పాలకు లతి నీచముగా తృణీకరించిన వైఖరిని గాంచుటవలన దేశీయులలో పాలకులయం దిదివరకు సంపూర్ణవిశ్వాసము గలవారు సైతము నిజస్థితిని తెలిసికొనకుండజాలరు. మనలో గల విభేదములను వదలుకొని మన మందరమును కలసి పని చేయవలెననుట కిది ప్రబలతమమును. బాగుగా నచ్చునట్టిదియు నగు హేతువై యున్నది. ఈ సంఘమును గూర్చి దేశీయులు నుడివిన, వ్రాసిన విషయము లన్నియును దాని ముఖ్యాంశమును వెల్లడింప లేదనియే నేను తలచెదను. భారతీయులనుగూడ సంఘమునందు సభ్యులనుగా నియమింపక పోవుటవలన అధికమగు ఆశాభంగమును, అక్కజమును కలిగెనని చాలమంది తెలిపిరి. ఇందులకు నాకాశాభంగమును, అక్కజమునుగూడ కలుగలేదు. ఇట్లు జరుగునని నాకిదివరకే తెలియును. హిందూప్రముఖులలోనొకరినో, లేకమహమ్మదీయనాయకులలోనొకరినోసంఘమున సభ్యునిగా నియమింపవలెనను విషయమును, భారతీయులు సభ్యులుగనో సహాయులుగనో, (అసెసరు) ఉపదేశకులుగానో సహకార మొనరింపవలెనను విషయమునుగూడ ముఖ్యమైనవి గావు. దీనియందు గల ప్రధానసిద్ధాంతమే వేరు. అది మూలాధారము, ముఖ్యతమమునై యున్నది. భారతదేశ రాజకీయాభివృద్ధికి పరిమితిని, కాలమును తానే నిర్ణయింపవలెనను బ్రిటనుదేశపు హక్కును లోకజ్ఞానమును, ఆత్మగౌరవమును గల భారతీయు లెవరును నెన్నడును ఆమోదింపజాలరు. మన ఆవశ్యకతలు మనకు తెలిసియున్నంత బాగుగా మరెవ్వరికిని తెలియవు. కావున స్వపరిపాలనస్వరూపమును నిర్ణయించుటలో కడపటి నిర్ణయము మనయిష్టానుసారమే జరుగవలెను. అది మనకు సహజమును, అపరిహార్యమును నగు హక్కు. కాంగ్రెసు సభవారు మొదటినుండియు ఈ సిద్ధాంతమునే అనుసరించుచున్నారు. స్వపరిపాలనవిధాన మిది యని స్థిరపరచి దానిని చట్టముగా వ్రాసి పార్లమెంటుసభవారి ఆమోదమును బడయుటకు ముందు దానిని స్థిరపరుచుటకు సర్వాధికారము నొసగుచు భారత బ్రిటను దేశముల ప్రతినిధుల సభను (రౌండు టేబిలు కాన్ఫరెన్సు) జరుపవలెనని కాంగ్రెసువారు సూచించియుండిరి. వా రిందుల కంగీకరించిననే భారతీయుల ఆత్మగౌరవమునకును, ప్రతిష్ఠకును భంగము కలుగకుండ నుండును. అటు లుండిననే కాని వారు ప్రభుత్వమునకు సహాయ మొనరింపజాలరు. ఈ సూచనలను బ్రిటనుదేశీయు లామోదింపనంతవరకును

మిల్నరుసంఘమును ఈజిప్టుదేశీయులు బహిష్కరించినట్లు ఈ విచారణసంఘమును భారతీయు లందరును బహిష్కరింపవలె ననియే కాంగ్రెసుమహాసభవారు దేశము నొసంగవలసియుండును గాని వేరొక పద్ధతిని వారెంతమాత్ర మంగీకరింపజాలరు. భారతీయుల అభిప్రాయములకు కేవలము విరుద్ధముగా నియమింపబడిన యీ విచారణసంఘముతో మన మెట్టిసంబంధము కలిగించుకొనజాలము.

## స్వరాజ్య విధానావశ్యకత

భారతదేశ స్వరాజ్యవిధానమును మనము సిద్ధపరుచు టత్యవసరము. ఈవిచారణసంఘము రానున్నదను కారణమున దాని నుపేక్షింపగూడదు. విధానమును సిద్ధపరుచు టవసరమని చిరకాలము క్రిందనే నిర్ణయింపబడెను. బొంబాయిలో జరిగిన భారతస్థాయిసంఘసభలో దేశమునందలి రాజకీయ నాయకులతో నాలోచించి భారతకార్యసంఘమువారు విధానమును సిద్ధపరుపవలెననికూడ తీర్మానింపబడెను. దానిని సిద్ధపరుచుటవలన స్వరాజ్యము వచ్చినపిమ్మట తమ కెట్టి స్థితి కలుగునో యని సంశయించుచున్న సంఘములకు మనశ్శాంతి కలుగగలదు. వివిధపక్షములవారు కాంగ్రెసులో చేర వీలగును. ప్రజలకు రాజకీయ హక్కులనుగూర్చి బోధించుట కిది అత్యధికముగా నుపకరించును. ప్రజలు దేనిని బడయుటకు సంసిద్ధులు గావలెనో ఆవిషయమును వారికి స్పష్టముగా తెలుప వీలగును. స్వరాజ్యమును బడయుటకు మనము కృషి సలుపుటలో దీనివలన మన కధికమగు బలముగూడ చేకూరగలదు. వివిధమతములకు చేరి వివిధభావలను మాటలాడుచున్న 32 కోట్లమంది ప్రజలను గలిగియున్న భారతదేశమునకు స్వరాజ్యవిధానమును నిర్ణయించుట ప్రజాపరిపాలనము గల రాజ్యములవా రిదివరకు చేసిన నిర్ణయము లన్నిటిలో చాల గొప్పదియును, అత్యంతవిలక్షణమునుగూడ నగును. స్వపరిపాలనముగల కొన్నిసంస్థానములుగూడ మనదేశమునం దున్నవి. ఇది మరియొక చిక్కు సమస్య. మొత్తమువిూద అమెరికాసంయుక్తరాష్ట్రముల పద్ధతినే మనముగూడ నవలంబింపవలసియుండును. రాష్ట్రములకు స్వరాజ్యపరిపాలనాధికార ముండవలెను; సంస్థానములుగూడ రాష్ట్రములుగానే పరిగణింపబడవలెను; దేశరక్షణమునం దన్నిరాష్ట్రములునుగూడ తగురీతిని పాల్గొనవలెను; విదేశవ్యవహారములు మున్నగు దేశీయసమస్యల నన్నిరాష్ట్రముల ప్రతినిధులును కలిసియే పరిష్కరింపవలెను. ఈ విధానము ముసాయిదాసిద్ధముకాగానే దానినాలోచించి ఆమోదించుటకు దేశమునం దన్ని సంఘముల పక్షముల ప్రతినిధుల నాహ్వానించి జాతీయసభను (నేషనలు కన్వెన్షను) సమావేశపరుపవలెను.

## వంగరాష్ట్రమున నిర్బంధితులు

ఏదేశమునకైనను స్వాతంత్ర్యమును గోల్పోవుటకంటె మహానరకము మరేమియును లేదు. స్వాతంత్ర్యముగల దేశములలో ప్రజలు దేశభక్తిని కలిగియుండుట మిక్కిలి శ్రేష్ఠమగు సుగుణమని ప్రపంచమందంతటనుగూడ నంగీకరింపబడెనుగాని పరాధీనదేశములలో నాదేశభక్తియే దారుణమగు నపరాధముగా నెంచబడుచున్నది. మనదేశమున దేశసేవాపరతంత్రులగువారిలో నించుమించుగా నందరునుగూడ దేశభక్తిని వెల్లడించినందుల కెపుడోయొకపుడు అధమ పాపకార్యముల నొనర్చినవారివలెశిక్షింపబడికారాగృహములకుపంపబడియేయున్నారు. పాలకులు శాంతిక్రమము లనువ్యాజమున మనదేశమున నన్యాయముగా శిక్షించినవారి సంఖ్యను సరిగా తెలుపుట సాధ్యముకాదు. కోమాగాతామారూకేసులో శిక్షింపబడినవారును,పంజాబులో సైనికశాసనముక్రింద శిక్షింపబడినవారును (వీరిలో ప్రవాసశిక్ష విధింపబడిన ౧౦-౧౧ఏండ్ల బాలురుకూడ కలరు.), అసహాయోద్యమమునందు శిక్షింపబడినవారును, అకాలీ ఉద్యమమునందు శిక్షింపబడినవారును, ౧౯౨౨ లో శిక్షింపబడి ప్రవాసమున కంపబడిన అత్యధికసంఖ్యాకులగు మోప్లాలును కలసి ౬౧,౧౧౦ మంది యుందురు. కాని యీ ౬౧,౧౧౦ మంది విషయమునను మామూలు న్యాయస్థానములలో కొందరికిని, ప్రత్యేక న్యాయస్థానములలో కొందరికిని, సైనికన్యాయస్థానములలో కొందరికిని విచారణ యను దాని నేదో యొకరీతిగా జరిపియే శిక్షవేసియున్నారు. కాని వంగరాష్ట్రమున చాలమందియువకులు దేశభక్తిని కలిగియున్నారను కారణమునమాత్రమే వారినందరిని నిందుయోపవమున నే విచారణయను ప్రహసనమునైన జరుపకయే కారాగృహముల కంపిరి. నవసినవసి మృతినొందునట్టిగతియే వారికి కలిగింపబడుట అత్యంతదారుణమగు విషయము. ౧౮౧౮ మూడవ రెగ్యులేషను ముత్తాతలనాటి చట్టమును, ౧౯౨౪ లో చేయబడిన బెంగాలు ఆర్డినెన్సు అను కఠినతమమగు ప్రజాపీడకనిర్బంధక సాధనమునకు మరల ౧౯౨౫ లో బెంగాలు క్రిమినలు లా అమెండుమెంటు ఆక్టు అను పెద్దపేరుపెట్టి దానిని ఆధారము చేసుకొని యువకుల కిట్టి కఠినశిక్షలను విధించిరి. వంగరాష్ట్రయువకుల నిర్బంధచరిత్ర ప్రాచీనమధ్యకాలపుచరిత్రవలెనే యున్నది. ఆమధ్యకాలమున మానవప్రపంచమునందు నీతియును, నాగరకతయును గూడ నిప్పటివలె వికసించియుండలేదు. అప్పటికంటె నెన్నియో రెట్లధికముగా నీతిని, న్యాయమును గూర్చిన భావములు ప్రజలలో వికసించినవని చెప్పబడుచున్న 20 వ శతాబ్దమునందే, నాగరికతకు మార్గదర్శకులమని చెప్పుకొనుచున్నవారే యిపుడు వంగరాష్ట్రమున నీవిషాదకథనమును ప్రదర్శించుచున్నారు. దొరతనమువా రేర్పరచిన న్యాయస్థానములందే, వారుచేసిన న్యాయశాస్త్రములప్రకారమే, వారు నియమించిన న్యాయాధిపతులవలననే విచారింపబడుట కీయువకులను రావింపగల ధైర్యము ప్రభుత్వమునకు లేకపోవుట వారికి కలిగిన నైతికాభావమునకు ప్రబలతమమగు సాక్ష్యము. ఇట్లు కఠినముగ ప్రజలను దొరతనమువారు పీడించుచుండుటవలన నత్యంతకఠోరభావములు ప్రజల హృదయాంతరాళములను దహించుచున్నవని నేను దొరతనమును హెచ్చరించుచున్నాను. ప్రజలలో కలిగినస్వాతంత్ర్యవాంఛను చిదిపివేయుట కితరదేశముల దొరతన

ములుగూడ ప్రయత్నించియే యుండెను. వారి ప్రయత్నముల ఫలితమును తెలియగోరువారు రష్యా అయిర్లండుదేశముల ప్రస్తుతస్థితిని గమనింపదగును. ప్రతిదినమును ప్రజలప్రాథమికములైన హక్కులను, వ్యక్తి స్వాతంత్ర్యమును నిర్లక్ష్యముగ నుల్లంఘించుచున్న దొరతనము వారు భారతభావికళ్యాణమును మనఃపూర్వకముగ కోరుచున్నామని నుడువుచు పెద్దపెద్ద పేర్లతో సిద్ధాంతములను వెల్లడించుట నిష్ఫలము. ఏలయనగా భారతీయులలో నెంతటి అమాయకులైననుగూడ నీప్రకటనలను సాధారణముగా నమ్మజాలరు. భారత బ్రిటనుదేశములకు గల సంబంధమును సరిచేయుటలో బ్రిటిషువారి కిపుడు సద్భావము కలిగినదని నమ్ముటకు వారిపుడైన యీవంగ యువకులను విడుదల చేసినచో నది కొంతవరకు సూచన కాగలదు. ఇపుడు నిర్బంధింపబడిన యువకులను విముక్తులను గావించుటతోనే మనము విరమింపగూడదు. అనుల్లంఘనీయములగు పౌరస్వాతంత్ర్యములను గూర్చి వారెన్నటికినిగూడ నిట్టి అక్రమమును మరల చేయ వీలులేకుండునట్లు దేశీయప్రధాన నిబంధనలలో హక్కుల ప్రకటనమునుగూడ చేర్పించుటవసరము. ఆరీతిగా ప్రతి పౌరునకును వ్యక్తిస్వాతంత్ర్య, వాక్స్వాతంత్ర్య, సహవాస స్వాతంత్ర్య మనః (కాన్షన్సు) స్వాతంత్ర్యములను భద్రపరుపవలెను.

వంగయువకుల సమస్యకును, విదేశములలో ప్రవాసము ననుభవించుచున్న భారత జాతీయవాదుల సమస్యకును సంబంధము కలదు. వారు వెనుకచేసిన చర్యలను మన మామోదింపజాలకపోవచ్చును. కాని వెనుక వారిట్టి చర్యల నొనరించుటకు కారణములైన అసామాన్యపరిస్థితు లిపుడు లేవు. కావున వారు మరల తమ మాతృదేశమునకు వచ్చి సేవచేయుటకు వారికిగల హక్కును నిరాకరించుట కిపుడెట్టి కారణమును కనబడదు.

ఈనిర్బంధితులకును,ప్రవాసితులకును మాత్రమేకాక మామూలు పౌరులకుగూడ చాల ఇబ్బందులు కలుగుచున్నవి. సంచారముచేయుటకును, స్వదేశమునకు వచ్చుటకును, స్వదేశమునుండి మరల వెళ్లుటకును పౌరులకుగల హక్కులనుగూడ దొరతనమువారు ప్యాసుపోర్టుల నిబంధనలను విచిత్రముగా నమలుజరుపుటద్వారా భంగపరుచుచున్నారు. దేశీయులకు నష్టమును కలిగించుట కిపుడు నిరంకుశులకు పాసుపోర్టులుగూడ నొక క్రొత్త సాధనముగా దొరకినవి. భారతదేశ మొక విశాలనిర్బంధస్థానముగ మారినది. విదేశములలో నున్న భారతీయులలో చాలమంది మరల స్వదేశమునకు రాకుండ బాగుగా నిరోధింపబడిరి. దేశమునం దున్న గౌరవప్రతిష్ఠలు గల పౌరులు ఆరోగ్యముకొరకైనను, వాణిజ్యముకొరకైనను, దేశాటనముకొరకైనను విదేశములకు వెళ్లగోరినచో అనుమతి నిచ్చుట లేదు. ఆంగ్లదేశమునందు అత్యధికగౌరవమునకును, పదవికిని అర్హుడుగా నంగీకరింపబడిన బ్రిటీషు పార్లమెంటుసభ్యుడు సాపూర్జీ సకలత్వాలాగారి ప్యాసుపోర్టునుగూడ రద్దుపరచిరి. ప్యాసుపోర్టు నిబంధనలు దుర్వినియోగపరుపబడుచుండుట కిది మిక్కిలి ప్రబలతమ మగు నిదర్శనము. సకలత్వాలాగారు తన మాతృదేశమునకు వచ్చుటకు అనర్హుడని ఆంగ్లపౌరుల ఆమోదముతోనే ప్రకటింపబడెను. ఈ నిరోధము లన్నియును తొలగవలెను. కారాగృహవాస మసలే యుండగూడదు.

## భారతదేశము..ఆసియాఖండము

భారతదేశము స్వశక్తిపై నాధారపడియుండునట్లు చేయుటయే మన ముఖ్యకర్తవ్యమని నే నిదివరకే చెప్పియున్నాను. మన మీసమస్యను పూర్తిచేయుటకు తొలుతను ప్రధానముగా మనము మనవసతులపైననే ఆధారపడియుండవలెను. అందులకు అవసరమైన సంఘములను మనము ఏర్పాటుచేయవలెను. ఈ సమస్యలు కేవలము భారతదేశమునకు మాత్రమే చెందినవని భావించుట మనము మానివేసినచో ఫలసిద్ధికి సౌకర్యములు చాల అధికముగా కలవు. చిరకాలమునుండి ఈ సమస్యలను కేవల భారతీయములుగ మాత్రమే మనము పరిగణించుచుండుటవలన గొప్ప పొరపాటునే చేసియున్నాము. ఇకనైన వాని అంతర్జాతీయభావమును మనము గ్రహింపవలసి యున్నది. విశ్వరాజకీయములందు మనసమస్యలతో సంబంధముగలవాటి నన్నిటినిగూడ మనము గమనించుచుండవలెను. ఈ విషయమున ముఖ్యముగ అపరాధము చేసినవారు మన హిందూసోదరులే. సర్వము దేశమునందే లభించుచుండుటవలనను, వారి సాంఘికవిధానమునందలి ప్రత్యేకపద్ధతులనను వారికిట్టి అసంగదృక్పథము అలవడియుండును. బ్రిటిషువారు మనదేశమునందు ప్రవేశించిన పిమ్మట ఈ నిస్సంగభావమును వెంటనే తమలాభముకొరకు ఉపయోగించుకొని తక్కిన ప్రపంచముతో మనకెట్టి సంబంధముగూడ లేకుండునట్లు ప్రబలమగు విభేదమును కల్పించిరి. అందువలన మనకు మిక్కిలి చేరువగనుండు దేశములవారి స్థితినిగూడ మనము గ్రహింపజాలకుండునట్లు వారు చేయగలిగిరి. ఒక్క లండనునగరముతో మాత్రమే అదియునుగూడ బ్రిటనుదేశమువారికి అనుకూలముగ నుండునంతవరకే వారు మనకు సంబంధము ననుగ్రహించిరి. కావున బ్రిటిషువారికనులతోనే మనము ప్రపంచమును చూచుచుంటిమి.

మహమ్మదీయులు మాత్రము అప్పుడప్పుడు బహిఃప్రపంచమునందు జరుగుచున్న అభివృద్ధినిగూర్చి భారతీయులకు గల ఔదాసీన్యప్రశాంతోపరిభాగమునందు మాత్రమే అల్పమగు సంభ్రమమును కలిగించుచుండిరి. కాని ప్రపంచరాజకీయములందు మహమ్మదీయులు మతవిషయికముగ మాత్రమే శ్రద్ధచూపుచుండుటచే జాతీయభావప్రవాహము వెనుకటివలెనే సాగిపోవుచున్నది. ప్రకృతిశాస్త్రములు చాల అభివృద్ధి నొందినందున ఇపుడు దూరదేశముల కేగుటకు గల అభ్యంతరము లన్నియును తొలగిపోయినవి. అత్యల్పకాలములో

ప్రపంచము నంతను చూచివచ్చుటకుగూడ సౌకర్యము లేర్పడినవి. కావున దూరభారము లిపు డంతరించిపోయినవి. అన్ని దేశములును ఒండొంటికి చాలచేరువ అయినవి. ప్రపంచమం దొకభాగమున జరుగు విషయములు మరియొకభాగమున వెంటనే ప్రతిధ్వనించుచున్నవి. కావున అసంగమును, ప్రత్యేకతయును ఇపు డెంతమాత్రమును సాధ్యములు కావు. ప్రపంచమునందలి అన్ని దేశముల సమస్యలకును పరస్పరము ఆధారాధేయసంబంధ మేర్పడినందున జాతీయరాజకీయముల స్వరూపనిర్ణయమే పూర్తిగ మారిపోయినది. స్వదేశ సమస్యలపట్ల అశ్రద్ధ చూపకుండ పనిచేయుటతోపాటు విదేశములలో జరుగుచున్న విషయములందును, అభివృద్ధియందును అధికమగు శ్రద్ధనుగూడ మనము చూపకపోయినచో మనకు చాలనష్టము కలుగుట నిశ్చయము. ఆసియా ఐరోపాఖండములకు ఏర్పడిన సంఘర్షణమందు ఆసియా ఖండము పరాజిత మగుటకు కారణ మేమనగా ఐరోపాఖండమునందలి సకలదేశములును కలసి పనిచేయుచున్నవి. ఆసియాఖండమునందలి దేశములు ఐకమత్యము లేకుండ విడిపోయియున్నవి. అందువలననే ప్రతివిషయమునను ఆసియాఖండమునకు పరాజయముకలిగినది. పాశ్చాత్యసామ్రాజ్యవాదులయు, ధనికులయు విజృంభణమును అరికట్టుటకు మనము చేయుచున్న ప్రయత్నములు సఫలములు కావలెనన్న ప్రాగ్దేశములు అధికమగు నైకమత్యముతో వాని నెదుర్కొనుచున్న సమస్యలను గూర్చి అత్యధికమగు శ్రద్ధను చూపక తప్పదు. భాగ్యవశమున మనదేశీయులలో ఒకతెగవారికి ఆసియాఖండ పశ్చిమభాగమునందలి దేశములవారితోను, ఇంకొకతెగవారికి ఐరోపాఖండమునకు తూర్పుభాగమునందలి దేశములవారితోను వైజ్ఞానికసంబంధ మేర్పడినది. ఆర్థికసమస్యలలోగూడ ఇంచుమించుగ ఇట్టి సమానధర్మమే కలదు. స్వర్గీయ దేశబంధు చిత్తరంజనదాసుగారు సూచించిన అఖిల ఆసియాఖండ సమ్మేళనము కొనసాగుటకు సమానవిజ్ఞానమును, సమానలాభనష్టములును తోడ్పడగలవు. దేశభక్తులలో అగ్రగణ్యు డగు దేశబంధు దాసుగారు భూగోళసంబంధము లగు నిరోధములను అతిక్రమింపగల భావనాశక్తిని, ఆసియాఖండమున నివసించు సకలజాతులను ఆవరింపగల విశాలదృష్టిని కలిగియుండునట్లు భగవంతుడే అనుగ్రహించెను.

బ్రుసెల్సులో జరిగిన సామ్రాజ్యవాదప్రతికూలమహాసభయందు పాల్గొనుటకు భారతకాంగ్రెసుమహాసభవారు అధికారము నొసంగి ప్రతినిధులను పంపుటయును, సామ్రాజ్యవాద ప్రతికూలసంఘముతో సంబంధము కలిగించుకొనుటయును శుభప్రారంభమే అయియున్నది. ఇపుడు చీనా దేశమునందు జరుగుచున్న సంగ్రామమునందు చీనావారికి వైద్య సహాయమును చేయుటకు కొంతమందిని అచటకు పంపవలెనని కూడ కాంగ్రెసువారు నిశ్చయించిరి. ఇది మిక్కిలి ముఖ్యమును, ఫలప్రదమునుకూడ నగునుగాని దొరతనమువారు ప్యాసుపోర్టుల నిచ్చుటకు నిరాకరించుటచే వారు అచటకు వెళ్ల వీలులేకపోయినది. ఇట్లు ప్యాసుపోర్టుల నీయకపోవుటకు కారణములను తెలుపు విషయమున దొరతనమువారు రెండుసారులు తమ హేతువులను సవరించుకొనుటవలననే వారట్లుప్యాసుపోర్టుల నీయకపోవుటకు యథార్థమగుకారణమువారు బహిరంగముగ తెలిపిన కారణముకంటె భిన్నమని స్పష్టముగా తెలియుచున్నది. యుద్ధము చేయుచున్న ఇరుపక్షములలో ఏపక్షమునకైన వైద్యసహాయము చేయుటకు కొంతమందిని పోనిచ్చినయెడల అకలంకనిష్పాక్షికతకు భంగము కలుగునను దొరతనమువారి వాదము అపూర్వమైనదిగా నున్నది. అది శుద్ధపాక్షికతకు భంగకరమని వారు తెలిపియుండినచో చాలవరకది సత్యమునకు సమీపమై యుండును. సంగ్రామ మొనరించుచున్నవారికి నిర్నిరోధముగ వైద్యసహాయము చేయుటకు తటస్థులకు మాత్రమే అవకాశము కలదనుట నిర్వివాదాంశము. ఈసిద్ధాంతము ననుసరించియే ఐరోపా మహాసంగ్రహము మున్నగు యుద్ధములలో అంతర్జాతీయ క్రైస్తవ మహమ్మదీయ వైద్యసహాయక సంఘములు అత్యధికమగు సేవను చేయగలిగియుండెను. పదునైదు వత్సరములకు పూర్వము జరిగిన సంగ్రామమందు గ్రేటుబ్రిటను దేశము తటస్థముగా నున్నపుడు వైద్యసహాయము చేయుటకు టర్కీదేశమునకు పోగోరు వారికి బ్రిటీషు దొరతనమువారే ప్యాసుపోర్టులను ఇచ్చిరను సంగతి మరచిపోవుటవలననే ఇప్పుడు దొరతనమువారిట్టి హేతువును తెలిపిరని తోచుచున్నది. ఈవిషయమున మన అసమ్మతిని వెల్లడించుట నిష్ఫలము. ఇట్టి నిరోధములు కలుగుచున్నను అఖిల ఆసియాసమ్మేళనమును గూర్చి మన ప్రయత్నముల నెంతమాత్రమును విరమింపగూడదు.

జాతీయారోగ్యము

సాంఘిక సామరస్యమును,రాజకీయపక్షముల యేకీభావమును ప్రస్తుతము మన జాతీయతాభివృద్ధికి ముఖ్యతమములగుట వలననే వానినిగూర్చి నేనుచాలసేపు ముచ్చటించుచు మీకుశ్రమను కలిగించినవాడనైతిని. భారతదేశ శ్రేయమును నిక్కముగ కోరువారందరును ముఖ్యముగ గమనింపవలసిన సమస్య ఇంకొకటి కలదు. అదియే జాతీయారోగ్యము. సరిగ చూచినచో ఆరోగ్యము రాజకీయ సంఘముల పరిశీలనలోనికి రాతగినది కాదని కొంద రనవచ్చును. ఇప్పటివరకును కాంగ్రెసు మహాసభవారు ఈవిషయమును గూర్చి తగిన శ్రద్ధను చూపకపోవుటకు గూడ ఇదియే కారణమై యుండును. భావికాలమున భారతీయులు స్వపరిపాలనాధికారముగల జాతియై వర్ధిల్లుటకు సంబంధించిన ముఖ్య సమస్యలలో ఆరోగ్యముకూడ నొక్కటియై యున్నది. కాన మనజాతీయార్థికములలో ఆరోగ్యమునకుగల ప్రాముఖ్యమును కాంగ్రెసువారిప్పటికైన గుర్తించి దానినిగూర్చి శ్రద్ధవూనుటఅత్యావసరమైయున్నది.

కడచిన యేబదియేండ్లలోను దేశీయుల ఆరోగ్యము చాల చెడి పోయినదని చెప్పుటకు అపూర్వపరిశీలన శక్తిగల మేధావు లెవ్వరును అవసరము లేదు. అది మనకందరకును స్పష్టముగానే తెలియుచున్నది. ప్రజల ఆరోగ్యము క్రమక్రమముగ క్షీణించుచున్నది. వెను

కటి రెండు పురుషాంతరములలోని యువజనుల శరీరదార్ఢ్యములతో మన పురుషాంతరమునందలి యువజనుల శరీరదార్ఢ్యమునుపోల్చిచూచి నయెడల ఆరోగ్యము క్రమముగా అత్యధికముగ క్షీణించుచున్నదని స్పష్టము కాగలదు. ఈవిషయమున అధికముగ వివరములను తెలుపుటఅనవసరము. వెనుకటి రెండుపురుషాంతరములవారికి ఇప్పటివారికి ఉన్నంత మేధాశక్తి యుండకపోవచ్చునేమోకాని వారు ఇప్పటివారికంటె అత్యధికమగు చురుకుదనమును, ధైర్యమును, కష్టములను సహింపగలశక్తిని కలిగియుండిరనుటకు ఎట్టిసంశయమును లేదు. వారికిప్పటివలె వ్యాధులుగూడ తరుచుగా కలిగెడివి కావు. ప్రస్తుతము మనదేశమందలి ఆరోగ్యస్థితికిని, పాశ్చాత్యదేశములందలి ఆరోగ్యస్థితికిని పోల్చి చూచినచో మనదేశమందు ప్రబలియున్న అనారోగ్యస్థితి మనకు మరింతస్పష్టముగ గోచరింపగలదు. శీతోష్ణస్థితియును, సాంఘిక ఆర్థిక విద్యావిషయములును ఆరోగ్యశాస్త్రమును అనారోగ్యస్థితికి కారణమని చెప్పవలసియుండును.

ఉష్ణదేశములందు సంవత్సరములో అధికకాలము ఉష్ణమత్యధికముగా నుండును. అందువలన మనుష్యులలో శక్తిఅధికముగ వ్యయమగుచుండును. కావున వారికి కడుశీఘ్రముగనే అలసట కలుగుచుండును. శీతలదేశములందును, సమశీతోష్ణ ప్రదేశములందును, ఉష్ణదేశములందును నివసించువారు సమానమగుకాలమునందే నిర్ణయింపబడిన గంటలకు మించకుండ ఒక్కవిధమగుపనినే చేసినపుడు గూడ ఉష్ణదేశములవారికే కడుశీఘ్రముగ అలసట కలుగును. శీతదేశాది దేశములవారికి అంతశీఘ్రముగ అలసట కలుగదు. పైగా శీతదేశాది దేశములకంటె భారతదేశమునందు పనిచేయవలసిన కాలము అధికముగగూడ నున్నది. ఈశ్రమను తీర్చుకొని శక్తినిమరల పూరించుకొనుటకు తగినంతవిశ్రాంతికిని, వినోదవిహారములకును భారతీయుల కవకాశము లేదు. వారి శక్తిమాత్రము పనివలన దినదినమునకు క్షీణించు చుండును. అందువలననే ప్రజలు బలహీనులగుటయు, చిరకాలము జీవింపజాలకపోవుటయు తటస్థించుచున్నది.

సంఘసంబంధములైన అనుపపత్తులు అందరికిని తెలిసినవేకాన వానినిగూర్చి నేనిచట వివరింపనవసరము లేదు. మనస్త్రీయొక్క అంతఃపురములయందలి ఏకాంతవాసము, అతిబాల్యవివాహములు, వివాహవిషయములలో స్వవర్ణమువారినేకాని ఇతరవర్ణములవారిని పెండ్లిచేసికొనకుండుట మున్నగువానివలన మహానర్థము కలుగుచున్నదని సంఘసేవ చేయువారి కందరికిని బాగుగ తెలిసియే యున్నది. కుటుంబసంబంధములగు సాంఘికనియమములు మిక్కిలి కఠినముగ నుండుటవలన కుటుంబముల మానసికశారీరకాభివృద్ధి దారుణమగు నిరోధ మేర్పడుచున్నది. ఇందువలన ముఖ్యముగా బిడ్డలకు హానికలుగుచున్నది. పగ తీర్చుకొనుటలో ప్రకృతికి కనికరము లేదు. మానవజాతికి సంబంధించిన నియమములను మన ముల్లంఘించినచో మానవసంఘము నష్టపడక తప్పదు.

మనదేశమునందు పొలములలోను, యంత్రశాలలలోను పని చేయుచున్నవారే జనసంఖ్యయందు ముప్పాతికవంతునకు పైగానున్నారు. వీరు తమ కుటుంబములను పోషించుటయే దుర్ఘటమగుచున్నది. వారికి పని అధికము. ఆదాయము తక్కువ. తగినఇండ్లు లేవు. కడుపునిండ తిండిలేదు. కట్టుకొనుటకు గుడ్డలేదు. ఈకారణముల వలన అతిసులభముగ వ్యాధులు వీరి నాక్రమించుచున్నవి. కావుననే వేలకొలదిగ అంటువ్యాధులకు బలియగుచుందురు. కలరా, ప్లేగు, ఇన్‌ఫ్లూయంజా, మశూచికము, మన్నెపుజ్వరము మున్నగువ్యాధులవలన ప్రతివత్సరమును లక్షలకొలది మనుష్యులు చనిపోవుచున్నారు.

దేశమునందు మద్యపానము మితిమీరుచున్నది. ఇందువలనప్రజల ఆరోగ్యమునకేకాక మన సాంఘికసంస్థ కంతటికినిగూడ ప్రబలమగు హాని కలుగుచున్నది. మహమ్మదీయమతమును, హిందూమతమును గూడ మద్యపానమును కఠినముగ నిరసించినవి. అట్టిస్థితిలో మద్యపానమును నిర్మూలించుటకు పూనుకొనిన దేశీయులపట్ల దొరతనమువారు సానుభూతిని చూపినయెడల ఈమహానర్థమింత శీఘ్రముగ దేశమునందంతటను వ్యాపించియుండదు. దొరతనమువారిట్లు చేయకపోవుటయేకాక మద్యపాననిర్మూలనమునకు పనిచేయగోరిన దేశారాధకులకు ప్రబలమగు నిరోధమునుగూడ కల్పించిరి. మద్యవిక్రయశాలలవద్ద శాంతముగ బోధించుచుండిన వందలకొలది యువకులను చెరసాలలకు పంపిరి. పౌరులకు రాజకీయస్వాతంత్ర్యమును ఇయ్యనందువలన కలిగిన నష్టమును కూడదీయుటకు కాబోలు తప్పత్రాగి ఒడలెరుంగకుండ మెలగుటకు పౌరులకుగల స్వాతంత్ర్యమును కాపాడుటకు దొరతనమువారు న్యాయశాసనాయుధమును సంస్కర్తలపై ప్రయోగించిరి. కొందఱు బాల్యమునుండియు, కొందఱు అభ్యాసమువలనను, కొందఱు నిర్బంధమువలనను త్రాగుబోతులగుచున్నారు. మద్యపానమువలన ప్రజల ఆరోగ్యము నశించుచున్నను సరే, ఘోరకృత్యములు మెండగుచున్నను సరే, కృషికులును, కార్మికులును శక్తిహీనులగుచున్నను సరే, వారికుటుంబములవారు తిండిలేక మాడుచున్ననుసరే, ప్రభుత్వాదాయమునకు లోటురాకూడదు. కావున వారు మద్యపాననిర్మూలనమునకు సమ్మతింపరు. తమ ఆదాయము తగ్గకుండుటకు తమబొక్కసమును నింపుకొనుటకు ఇతరసాధనములను వేనినైన నవలంబించి ఈయొక్క విషయమందైన ప్రజలయొక్క కోర్కెను దొరతనమువారు మన్నింపగూడదా?

మధ్యతరగతులలోను వారికి క్రింది తరగతులలోను ఉండు ప్రజలస్థితికూడ చాల ఆందోళనమును కలిగించుచున్నది. వీరు చాలవరకు పట్టణములందును నివసించుచుందురు. అచట ఆదాయము తక్కువ; వ్యయ మధికము. కుటుంబ గౌరవమునకు భంగము కలుగునను భయముచే వారు ఆదాయమునకు మించిన వ్యయమును చేయవలసియుండును. అందువలన వారు చాల కష్టములకు పాలగుచున్నారు. వానికి ముఖ్యముగా కావలసిన అన్న వస్త్రములు లభించుటయే దుర్ఘటముగా

నున్నది గాన దార్ఢ్యమును, ఆరోగ్యమును కలిగించునట్టి ఆహారపదార్థములను భుజించుటకు వారికి దారిలేదు. పరిశుభ్రము కాని ప్రదేశముల నున్నవారి నివాసగృహములు ఆరోగ్యకరములుగా నుండవు. ఇండ్లలో జనసంఖ్య మిక్కిలి హెచ్చుగానుండును. ఈకారణములచే చాలమంది క్షయవ్యాధివలన బాధపడుచుండుట తటస్థించుచున్నది. గ్రామములలోను,పట్టణములలోనుగూడ ప్రసవసమయమందును, బాల్యదశయందును కలుగుచున్న మరణముల సంఖ్య అతి దారుణముగనున్నది. ఈవిషయమున మనము వెంటనే శ్రద్ధవహింపవలసి యున్నది.

ఆరోగ్యమును, పారిశుధ్యమును గూర్చి తగిన యేర్పాటులు లేకపోవుటవలన ఈఅనర్థము మరింత ప్రబలుచున్నది. వ్యక్తులకును, గృహములకును సంబంధించిన పారిశుధ్యమును వృద్ధి నొందించుటకు చాల అవకాశము గలదు. గాలియును, వెలుతురును బాగుగ తగులునట్లును, పరిశుభ్రముగా నుండునట్లును ఇండ్లను కట్టవలెను. నీటివసతి బాగుగా నుండునట్లును, పరిశుభ్రత యేర్పడునట్లును,మురికిని తీసివేయుటకు వీలగునట్లును, ఏర్పాటులను చేసియే గ్రామములను, పట్టణములను నిర్మించుట అవసరము. ఎట్టిచిన్నగ్రామమునందైనను ఆహారపదార్థములను,మార్కెట్టులను గూర్చి అత్యధికముగశ్రద్ధతో పరిశీలించుట ముఖ్యతమము. ప్రజలకు వైద్యసహాయము ఇప్పటికంటె చాల హెచ్చుగ లభించునట్లు ఏర్పాటు జరుగవలెను. నిరోధింప వీలైన వ్యాధుల నన్నింటిని లోపరుచుకొనుటకును, వానిని తుదకు పూర్తిగ నిర్మూలించుటకును ఇవియే ముఖ్యసాధనములు.

ఇవి బాగుగ జరుగవలెననిన ప్రజలలో విద్య విస్తారముగ వ్యాపించవలెను. ప్రజలకు తగిన విద్యను నేర్పకున్నచో జనసామాన్యమునకు సంబంధించిన ఆరోగ్య విధులను వారు గ్రహింపజాలరు. కావున అతిముఖ్యములును, ప్రాథమికములును అగు నియమములను గూడ వారు ఉల్లంఘించుచుందురు. మన పురపాలక సంఘములకును స్థానిక సంఘములకును గల అధికారములపైని దొరతనమువారు చాల నిరోధముల నేర్పరచినను ప్రజలశక్తిసామర్థ్యములు తగ్గిపోయుండుటకును. ప్రజలు మంచి ఆరోగ్యస్థితియం దుండుటకును అధికముగ కృషిచేయుటకు వారి కింకను అవకాశము కలదు.

## శరీరపరిశ్రమ

అతి ముఖ్యతమమగు సమస్య శరీర పరిశ్రమయే. కాని ధనమును, తీరికయునుగల ధనికులును, తదితరులునుగూడ శరీరపరిశ్రమను గూర్చి కొంచెమైన శ్రద్ధవహించుటలేదు. ఇది చాల సంతాపకరమగు విషయము. దేశీయులకుగల ఆయుధధారణ స్వాతంత్ర్యమును పూర్తిగ నిర్మూలించుటవలనను, సేనానాయకత్వమునకు వలసిన శక్తిని, నైపుణ్యమును బడయుటకు మన యువకుల కవకాశము లేకుండచేయుటవలనను శరీర పరిశ్రమనుగూర్చి వారికి సహజముగ నిట్టి ఔదాసీన్యము కలిగినదని తలచెదను. ప్రజలు తమ మానవిత్తప్రాణములను కాపాడుటకు అశక్తులై పరులపై నాధారపడవలసిన దుర్గతికి వచ్చియున్నారు. ఈపరాధీనభావము దేశమునందంతటను పూర్తిగ నిండియున్నది. పూర్వకాలమందుండిన అఖారాలు, తాలింఖానాలు మున్నగు శరీరవ్యాయామశాలలు ఇపుడంతరించినవి. వానితోపాటు జాతీయగౌరవమునకు ముఖ్యతమమగు ఆత్మవిశ్వాసభావముగూడ నంతరించినది. ప్రజల పౌరుషమును రూపుమాపుచున్న సార్వజనికమగు నీ ఆయుధ ధారణ నిరోధన పద్ధతిని తొలగించి స్వదేశసంరక్షణమునకు దేశీయులను సిద్ధపరుచుటకు భారతీయుల కవకాశ మొసంగుడని దొరతనమువారి నెపుడు కోరినను వారు అధైర్యమునే చూపుచున్నారు. దానికిగలకారణము మనకు గోచరించుటలేదు. ప్రజలకు ఆయుధధారణస్వాతంత్ర్య మొసంగిననో దేశశాంతికి భంగము కలుగునని సంశయించుట కెట్టి అవకాశమును లేదు. భారతదేశమునందున్న సంస్థానములలో ఆయుధశాసనము లేకున్నను చేతికర్రలను పట్టుకొనుటనుగూర్చి కూడ నిబంధన లేర్పడియున్న బ్రిటిషుఇండియాయందే ఆసంస్థానములందుకంటె అల్లరులు అధికముగ నున్నవి. ప్రజల ఆరోగ్యమును కాపాడు నిమిత్తము అఖారాలను, తాలింఖానాలను ఏర్పరుచుట మున్నగు పనుల నన్నిటిని చేయవలెనన్న ధనము హెచ్చుగ కావలసియున్నది. ప్రజ లీవిషయమున నెంత చక్కని యేర్పాటులు చేసినను ప్రస్తుతస్థితిలో అవి చాలియుండవు. ప్రభుత్వాదాయమునందధికభాగమును ఇందులకై వ్యయపరిచిన గాని నిజముగ జాతీయనిర్మాణస్వభావముగల ఇట్టి సంస్కరణములను ప్రారంభింప వీలు లేదు. దేశరక్షణ మను పేరుతో సైనికశాఖకొరకు భారతదేశాదాయమునందు నూటికి అరువది వంతున దొరతనమువారు వ్యయపరుచుచున్నారు. దేశీయులు అత్యధిక శరీర దుర్బలస్థితియందుండునట్లు చేసినపుడు దేశరక్షణ కలుగజాలదని దొరతనమువారు గ్రహింపదగుదురు. విత్తము నధికముగ వ్యయపరిచి శిబిరములను, దుర్గములను నిర్మించుటవలనను, మారణయంత్రములను అమర్చుట వలనను దేశరక్షణము కలుగనేరదు. ధనము వ్యయపరిచి కందకములను త్రవ్వింపగలిగినను, వానిలో నిలుచుకొని పోరుసలుపుటకు మనుష్యులు కావలెను. దేశీయుల పౌరుషమును, ఆరోగ్యమును వృద్ధినొందించిననే కాని నిజమగు దేశరక్షణ కలుగజాలదు.

## సమాప్తి

మరల ముందున కడుగిడుటకు దేశమును సిద్ధపరుచుటలో మన మెంతమాత్రమును ఆలస్య మొనర్పగూడదు. మన రాజకీయశరీరమునందు ప్రవేశించియున్న సాంఘిక రాజకీయ విభేదములనుశత్రువులను నిర్మూలించుటకు మనము శక్తిసామర్థ్యముల నన్నిటిని కేంద్రీకరించవలెను. హిందూమహమ్మదీయ వివాదములను పరిష్కరించుటకు కాంగ్రెసు స్థాయిసంఘమువారు చేసిన పరిష్కారము రెండు పక్షములవారికిని న్యాయమైనదిగా నున్నదిగాన రెండు మతములవారును దాని

నంగీకరించి కలహముల నంతరింపజేయ వలసినదని నేను వేడుకొనుచున్నాను. వెంటనే దేశమునందంతటను కాంగ్రెసు సంఘములను సక్రమముగ నేర్పరుపవలెనని నేను నొక్కి చెప్పుచున్నాను. మన దేశమునందు కాంగ్రెసు మహాసభయే ప్రధాన ప్రజాప్రతినిధిసభ యైయున్నది. ఆపేరు సర్వవిధముల దానికి సార్థకమగునట్లు అన్ని సంఘముల వారును, అన్ని రాజకీయ పక్షములవారును కాంగ్రెసునందు చేరవలెనని నేను ఆహ్వానించుచున్నాను. ఇంకను శాసనసభలకు వెళ్లవలెనని యే కోరుచున్న వా రందరును ఒక్క ప్రజాపక్షముగ నేర్పడి కాంగ్రెసు విధానమునే అనుసరించి శాసనసభలలో ప్రతికూలపక్షముగ పనిచేయవలెనని కోరుచున్నాను. కాంగ్రెసువారును, దేశీయులందరును రాజులు కమిషనును సంపూర్ణముగ బహిష్కరింపవలసినదని నిష్కర్షగా తెలుపుచున్నాను. భారతభావిస్థితిని నిర్ణయించుటకు భారతీయులు బ్రిటీషువారితో కలసి పనిచేయవలెనని రౌండుటేబిలు కాన్ఫరెన్సును జరుపుట ఒక్కటియే సాధనమని వెనుక కాంగ్రెసు వారు తెలిపిన విషయమునే నేను మరల తెలుపుచున్నాను. స్వరాజ్య విధానమును నిర్ధారణ చేయుటకు ఆసభకు సంపూర్ణాధికారము నొసంగవలెను. ఆసభలో భారతబ్రిటీషుప్రతినిధులుకలసి ఆలోచించి దానిని నిర్ధారణ చేయవలెను. స్వరాజ్యవిధానమును కాంగ్రెసువారు వెంటనే సిద్ధపరిచి పిమ్మట నేషనలు కన్వెన్షనును సమావేశపరిచి ఆసభలో దానిని నామోదింపజేయవలెనని నేను సూచించుచున్నాను. భారతీయసమస్యలను అంతర్జాతీయ దృష్టితో మన మాలోచించవలెను. ఆసియాఖండమునందలి ఇతరదేశములలో విజ్ఞానసంబంధమును, స్నేహభావమును వృద్ధిబొందింపవలెనని నేను నాదేశీయులకు విన్నవించుచున్నాను. వంగరాష్ట్రీయయువకులను కారాగృహములనుండి విముక్తులను గావించువరకును, భారతీయుల ప్రాథమిక హక్కులను దొరతనమువారు మరల నెన్నటికిని భంగపరుపకుండ తగిన కట్టుబాటులను చేయువరకును మన ప్రయత్నములను మనము విరమింపగూడదని నేను ప్రజలను హెచ్చరించుచున్నాను. దేశీయుల ఆరోగ్యస్థితి అత్యధికముగు ఆందోళనను కలిగించుచున్నది. కావున ఆరోగ్యమునకు భంగకరములగు కారణములను తొలగించు విషయములలో చాల దీక్షతో పనిచేయవలెనని నేను దేశీయులను కోరుచున్నాను. భారతదేశము నొకజాతిగావించి అదితన మహదాశయమును గాంచుటకుగల నిరోధములన్నిటిని అమోఘసంకల్పముతోడను, దృఢనిశ్చయముతోడను జయించి, ప్రపంచజాతులలో దాని నర్హస్థానము నాక్రమింపజేయుటకు సాయపడు సాధనము లివియని నేను తలచుచున్నాను.

# తీర్మానములు

## ౧

### సామ్రాజ్యతత్వము—ప్రతినిరోధక సమ్మేళనము

**1927** సం. ఫిబ్రవరిమాసమున బ్రుసెల్సునగరమున సమావేశమైన సామ్రాజ్యతత్వప్రతిరోధక మహాసభవారు సామ్రాజ్యతత్వమును ప్రతిరోధించుటకు ప్రత్యేకముగ నొక సమ్మేళనము నేర్పరచినందులకీసభవారు తమ ఆమోదమును వెలిపుచ్చుచు, సామ్రాజ్యతత్వము పై గావింపబడు పోరాటమునం దీసమ్మేళనములతో కలసి పనిచేయుటకు అఖిలభారత జాతీయోపసంఘమువారు గావించిననిర్ణయము నామోదించుచున్నారు.

## ౨

### చైనాయెడల సానుభూతి

ఈ మహాసభవారు చైనాప్రజల నభినందించుచు,జాతీయ విముక్తికొరకు వారు సాగించుచున్న పోరాటమునందు సంపూర్ణమగు సానుభూతిని దెలుపుచున్నారు. అఖిలభారత కాంగ్రెసు సంఘమువారు తాము చైనాకు పంపదలచిన వైద్యసహాయక దళమునకు ప్రయాణానుమతిపత్రముల నొసగ నిరాకరించిన ప్రభుత్వచర్యను ఖండించుచున్నారు. చైనాలో తమసామ్రాజ్యాధికారమును బలపరుచుకొనుటకును, చైనాదేశీయులు స్వాతంత్ర్యము సాధించుకొనకుండ నిరోధించుటకును బ్రిటిషు ప్రభుత్వమువారు తిరిగి భారతీయ పటాలములనుపయోగించినందులకీ సభవారు తీవ్రమగు ఆగ్రహమును దెలుపుచున్నారు.

ఇంకను చైనాలోనున్న భారతీయపటాలములను, పోలీసు దళములను అన్నిటిని వెంటనే తిరిగి స్వదేశమునకు పిలిపింపవలెననియు, సామ్రాజ్యతత్వమును ప్రతిఘటించుటలో చైనీయులు, భారతీయులు ఏకకార్యదీక్షాపరులగుటచే ఇకమీద భారతీయు లెవ్వరును బ్రిటీషుప్రభుత్వమువారి ఏజంటులుగ, చైనాదేశీయులకు ప్రతికూలముగ పనిచేయుటకు చైనాకు వెళ్లరాదనియు ఈసభవారు కోరుచున్నారు.

మెసపటోమియా పర్షియా దేశములనుండియు, బ్రిటిషు కాలనీలనుండియు, ఇతరదేశములనుండియు భారతీయ పటాలములను, పోలీసుదళములను, రాయబారివర్గ రక్షకపటాలములను వెంటనే పిలిపింపవలెనని ఈ జాతీయమహాసభవారు గోరుచున్నారు.

## 3

### ప్యాసుపోర్టుల నిరాకరించుట

విదేశముల దర్శించుటకు వెడలగోరు భారతీయులలో కొందరకును, భారతదేశమును దర్శింపగోరు భారతీయులకును పాస్‌పోర్టుల

వెల స్వల్పము ! పరీక్షించండి !! గుణ మధికము !!!

శ్రేష్ఠమగు ఈ రెండు ఔషధములను ప్రతిగృహస్థుడును కలిగియుండుట లాభకరము. తాత్కాలికమందు గలుగు వ్యాధుల కన్నిటికిని వైద్యులకడ కరుగ నవసరము లేదు. ఈ ఔషధము లుండిన ఒకవైద్యుడు మీ గృహమం దున్నటు లుండును. వాత సంబంధమగు వ్యాధుల కన్నిటికిని అమృతకల్పమును, ఉష్ణసంబంధమగు వ్యాధుల కన్నిటికిని సంజీవనకల్పమును అమోఘ మయినవి.




# అమృతకల్పము

ఇది మిక్కిలి ఘాటుగల ద్రావకము, అనుపాన భేదములచేత అనేకవ్యాధుల కిది వజ్రాయుధము వలె పనిచేయును. దీనిని లోపలకు పుచ్చుకోవచ్చును. పైన రాయవచ్చును. వాయువు, శైత్యము మొదలగు వాట్లచే కలుగు అన్ని వ్యాధులకు రామబాణము వంటిది. కీళ్లనొప్పులు, పార్శ్వపునొప్పులు, పక్షవాయువులు, జలుబు, శైత్యము, జ్వరములు, పైత్యవాయువులు, వాంతులు, భేదులు, కలరా, గ్రహణి. ప్లేగు, ఋతుశూలలు, సర్వశూలలు, కడుపునొప్పులు, కడుపుబ్బరములు, అజీర్ణములు, పంట్లనొప్పులు, చెవిపోటు, అంటువ్యాధులు, విషదోషములు, సన్నిపాతములు, చిన్నబిడ్డగుణము, నలిపురుగులు, జెణుకులు, గాయములు, పుండ్లు, తీట, ఇతర చర్మరోగములు, తేలు విషజంతువుల కాటులు మొదలగువాటిని ఖండించును. ప్రతివారును ఒకసీసా వద్దనుంచుకొనిన తాత్కాలిక వ్యాధుల బాధనుండి సులభముగా తప్పించుకొనవచ్చును. ప్రతి గృహమం దుండతగినది.

½ అవున్సు పెద్దసీసా 1-కి రు. 1-4-0. ¼ అవున్సు చిన్నసీసా 1-కి రు. 0-12-0

# సంజీవనకల్పము




ఇది అనేక భస్మ సిందూరములు చేర్చి తయారు చేయబడినది. ఉష్ణవాత సంబంధ మగు సమస్త వ్యాధులకును శ్రేష్ఠ మయినది. ఉష్ణాధిక్యము, ఉష్ణపైత్యము, ఉష్ణవాతము మొదలగు వాట్లచే కలుగు సమస్త వ్యాధులను, జ్వరమాంద్యమును, దాహము, తాపము, కొన్నివిధములగు దగ్గులు, అత్త, కీళ్లనొప్పులు, నడుమునొప్పులు, కీళ్లవాపు, అన్ని మేహములు, మూత్రకృచ్ఛ్రము, మూత్రముబిగించుట, శరీర వేడిమి, రక్తపైత్యము, రక్తభేదులు, గుండెలలోనొప్పి, మంట, శెగరోగము, స్త్రీల కుసుమవ్యాధులు మొదలగు వ్యాధులకు రామబాణము వంటిది. తత్కాలికముగా కలుగు అనేకవ్యాధుల కిది అమృతతుల్య మయినది. ప్రతిగృహమం దుండదగినది. వెల స్వల్పము. ఫల మధికము.

5 తు. పౌడరు గల సీసా రు. 1-4-0. 2 తు. సీసా రు. 0-10-0.

వి. పి. ఖర్చులు ప్రత్యేకము.

వెంటనే పై నుదహరించిన రెండు ఔషధముల కొరకు ఈ క్రింది విలాసమునకు వ్రాయుడు.

## పి. శి. ఏ. అండు కంపెని, ఆయుర్వేదసమాజం,

## పెరిదేపి, నెల్లూరు జిల్లా.




# రత్నపురుషలేహ్యం




ఈ లేహ్యమునకు వచ్చిన బహుమతి పతకముల ఆకృతి.




ఈలేహ్యము పూర్వులచే కనిపెట్టబడి చిరకాలాను భవముగా వాడబడుచున్నది. ఇందు వలన శుక్లనష్టము తగ్గించి అధిక వీర్యవృద్ధి కలుగుటయే గాక శుక్ల మేహము మొదలగు 20 మేహములు మేహపిటుకలు సర్వవిధ సర్వ విధ పైత్యములు కీళ్ళ నొప్పులు తిమ్మెరలు మొదలగు రోగ ములు, శీఘ్రస్ఖలనము, స్వప్నస్ఖలనము, కాళ్లు నడుము లాగుట మొదలగు వాటిని పోగొట్టి మనస్సునకు సంతోషము కలుగచేయును. స్త్రీలు కూడా సేవించిన ఋతు దోషము తగ్గించి సంతానము కలుగజేయును. పూటకు పావులా యెత్తు మోతాదు, డబ్బీ నెల రోజులు వచ్చును.

డబ్బీ ఖరీదు రు. 3—4—0.

## శ్రీ పట్టాభిరామ వైద్యశాల

### రాయవరము, తూర్పు గోదావరి జిల్లా.

ఆంధ్రగ్రంథమాల **ధమ్మపదము - (వచనము)** ౮-వ కుసుమము

అనువాదకులు : శ్రీ కిళాంబి రంగాచార్యులుగారు, యం. ఏ., బి. యల్.

వెల రు. ౦-౧౦-౦.

అహింసయే జీవితపరమార్థముగ వెలసిన బుద్ధదేవుని ఉత్తమ ధర్మోపదేశము లిందు పాళీమూలమునుండి అనువదింపబడినవి. భగవద్గీత ఎట్లు వైదికమత సర్వస్వసారమో యీ బుద్ధగీత (ధర్మపద) మట్లు బౌద్ధమత సర్వస్వసారము. మానవజీవితము చరితార్థ మగుట కీ మహనీయుని ధర్మోపదేశము లందఱకు సర్వదా పఠించి యాచరింపదగినవి.

**ఆంధ్రగ్రంథమాల,** నెం. 7, తంబుశెట్టి వీథి, మద్రాసు.



కాంగ్రెసునగరము



స్వచ్ఛందసేవాదళము



శ్రీ రాజారామపాండ్యగారు, స్వచ్ఛంద సేవాదళ నాయకుడు



శ్రీమతి ఆచంట రుక్మిణమ్మగారు, బి. ఏ.
నాయకురాలు



శ్రీమతి కమలాదేవి ఛటోపాధ్యాయగారు
ఉపనాయకురాలు

స్వచ్ఛంద స్త్రీ సేవాదళము



స్వచ్ఛంద స్త్రీ సేవాదళము

ఎట్టి వయస్సునందైనను తీసుకొనదగిన టానిక్

రుచికరమైనది. శక్తిని సంపాదించునది.

జాండు గారి

# చవనప్రాస

(దేహశక్తిని, మనోశక్తిని వృద్ధిపరచును.)

ఆయుర్వేదమందు అసమానమైన ఔషధరాజము.

దగ్గులకు, శైత్యము, గొంతురాసుట, ఉబ్బసము, శ్వాసకోశ సంబంధమైన వ్యాధులు, ఊపిరితిత్తుల యందలి వ్యాధులు, అకాల వృద్ధాప్యము మొదలైనవాటికి దివ్యాస్త్రము

వెల 1 పౌను సీసా 1-కి రూ 2--8-0

½ పౌను సీసా 1-కి రూ 1--5-0

¼ పౌను సీసా 1-కి రూ 0-13-0

## జాండు ఫార్మెటికల్ వర్క్సు,

## (లిమిటెడ్) బొంబాయి 14,

వారిచే తయారు చేయబడుచున్నది.

ఏజెంట్లు కావలెను.

వివరములకు, ఆయుర్వేదమందుల విచక్షణలు విపులముగా వ్రాయబడిన మా కేటలాగునకు వ్రాయుడు.

సోల్ ఏజెంట్లు:

## దామోదర్ అండు కో,

90-1 నయినప్పన్ నాయక్ వీధి,

పార్కు-టౌన్, మదరాసు.

నెల్లూరు—ఆర్యన్ పార్మసీ.

ఏలూరు—చౌదరీ అండు కో.

రాజమండ్రి—మెసర్సు ఈశ్వర్ దాస్ అండు కో.

కాకినాడ—డాక్టరు కె. యల్. నరసింహారావు, L. M. S.

మచిలీపట్నం—యన్.యమ్. దక్షిణామూర్తిశాస్త్రి

అనంతపురం—పండిత ఏ. వి. గోపాలాచార్యులు, టౌన్ ఎక్సటెన్షన్.

బళ్లారి—శ్రీకృష్ణవేణియమ్మ, ప్రేమయాతనవైద్యశాల.

(ఐదుభాగములు) ఆదిపాండురంగ

# భక్తవిజయము

రాయల్ సైజులో మొత్తం 860 పుటలు గలది.

21, ఆఫ్టోన్ పటములు చేర్చబడ్డది. వెల రు 6-0-0 పోస్టేజి ప్రత్యేకము.

ఈభక్తవిజయగ్రంథము, మహారాష్ట్రదేశంబునం దవతరించిన మహాభక్తుల చరిత్రము లన్ని యున్నవి. ఇందు అత్యుత్తమమైన భగవద్గీత, పాండవగీత, ముకుందమాల, భాగవతము, విష్ణుపురాణము మొదలగు గ్రంథములలోనుండి యనేక ఉదాహరణము లుదాహరింపబడియున్నవి. ఎట్టివారికిని, ఏస్థితియందుండువారికిని, ఈపుస్తకము మహోపకారి యగును. ఎట్టివారినైనను సన్మార్గమునందే పోవునట్లు చేయుట కిది సాధనమైన మహాగ్రంథము. స్త్రీలు కూడ నీగ్రంథమును జదివిరేని వివేకము, జ్ఞానము గలిగి, తమబిడ్డలకును మంచి మతిని గఱపగలుగుదు.

## ఆది త్యాగరాజస్వామి కీర్తనలు

విష్ణు, శివసంబంధ కీర్తనములు 600 ఉన్నవి. ఎంటీకాలికో బైండు చేయబడియున్నది. స్వాములవారి చిత్రము న్న వారియొక్క ఫోటోయున్న ఉన్నవి. వెల 3-0-0

## శ్రీత్యాగరాయహృదయము

530 పుటలుగల 3 సంపుటములుగ మంచి గ్లేజుకాగితములో ముద్రింపబడి మేలుబైండు చేయబడియున్నది. ఇందలి విషయములు:—మహనీయులగు శ్రీత్యాగరాజ అయ్యగారిచే రచియింపబడిన కీర్తనములలో 225 కీర్తనములను ఎక్కబరచి వానికి అవతారిక, మూలము, ప్రతిపదార్థము, విశేషార్థము, రాగలక్షణము స్వర సాహిత్యములును వ్రాయబడి యున్నవి. 3 సంపుటములు సెట్టు 1-కి ధర రు. 10, సంపుటము 1-కి రు 4.

## ఆది సంగీతసుధాంబుధి

ఇందు సంగీతలక్షణములును, ప్రథమాభ్యాసపద్ధతులును, వాడుకయందున్న అనేక రాగములకు ఆరోహణాదిక్రమములును, త్యాగయ్య, దీక్షితులు, శ్యామాశాస్త్రిలు, ఘనం సీనయ్య, కన్నకుడి కృష్ణయ్య, సుబ్రహ్మణ్యయ్య, గోవిందసామయ్య, గర్భపురివాసులు, పురంధరవిఠలు, నారాయణ తీర్థులు తరంగంబాడి పంచనాధయ్య, సదాశివరావు మొదలగు సుమారు 35 పూర్వ ప్రసిద్ధ వాగ్గేయకారక విరచితంబులైన వర్ణములు, కీర్తనలు, జావళ్లు మొదలగునవియును, తత్కాలరుచ్యమైన హిందుస్థానీలు, పార్సీలు, ఇంగ్లిషునోటు, తిల్లానా మొదలగు (Delicious Miscellany) లలిత మిశ్రమములును, స్వరములతో నున్నవి. ఇందు వీణ, హార్మోనియ పటములును అమర్చబడియున్నవి. మంచి గ్లేజుకాగితములో ముద్రితమై, మేలు బైండు చేయబడినది. వెల 3-0-0

## ఎం. ఆది అండు కంపెని, పుస్తకవ్యాపారులు,

(అప్పాబిల్డింగ్సు), 11/286, ఎస్ప్లనేడ్, మదరాస్.

నిరాకరించుటలో ప్రభుత్వమువారవలంబించుచున్న విధానమును సభవారు ఖండించుచున్నారు. అనవసరమగు పాస్‌పోర్టుల కర్మకాండనంతను వెంటనే రద్దుచేసి భారతదేశమునకు వచ్చుటకును, తిరిగి వెళ్లుటకును సంపూర్ణమగు స్వేచ్ఛనొసగవలెనని ఈ సభవారు గోరుచున్నారు. పార్లమెంటు సభ్యుడగు షాపుర్జీ సకలత్వాలాగారు భారతదేశమునకు జనుట కొసగబడిన ప్రయాణానుమతిపత్రమును రద్దుచేసి అతనిని తన స్వదేశమునకు వెళ్లకుండ నిరోధించి ప్రవాసితునిగ నొనర్చినందులకు బ్రిటిషు ప్రభుత్వమువారి చర్య నీ సభవారు ఖండించుచున్నారు. తనను బలపరచుటకు రెండవవ్యక్తి యైనను సాధారణముగ గనుపింపని పార్లమెంటుసభయందు ఎంత ప్రాతికూల్యమును, కష్టములను ఎదుర్కొనవలసివచ్చినను నిరంతరము భారతదేశ స్వాతంత్ర్యముకొరకు నిలిచి పోరాడుచున్న సకలత్వాలాగారి ధైర్యసాహసముల నీసభవారెంతయు ప్రశంసించుచున్నారు.

౪

రాబోవు మహాసంగ్రామము

భారతదేశమునందును, ప్రాక్సముద్రములయందును, అందు ముఖ్యముగ భారతదేశమున పశ్చిమోత్తర పరగణాలయందును బ్రిటిషు ప్రభుత్వమువారు గావించుచున్న అసాధారణమగు విస్తారసమరసన్నాహముల నీసభవారపరిమితాందోళితహృదయములతో పరికించుచున్నారు. ఈ సంగ్రామసన్నాహములు భారతీయుల స్వాతంత్ర్యప్రయత్నములను అణచివైచి భారతదేశమున బ్రిటిషు సామ్రాజ్యాధికారమును దృఢవత్తరముగ నొనర్చుకొనుట కుద్దేశింపబడుటయేకాక ఇందువలన వినాశకరమగు సంగ్రామ మనతికాలమున సంభవించి, ఆ సమయమున విదేశీయులు తమసామ్రాజ్యమును విస్తరింపజేసికొనుటకు భారతదేశమును సాధనముగ నొనర్చుకొనుటకు ప్రయత్నించెదరు.

భారతదేశప్రజలకు తమ ఇరుగుపొరుగువారితో నెట్టివివాదముగాని, పోరసులుగాని లేవనియు, వారితో కలసి శాంతముగ జీవింపగోరుచున్నారనియు, ఏ సంగ్రామమునందైనను పాల్గొనుటయా లేదా యనువిషయమును నిర్ణయించుకొనుటకు వారికి సంపూర్ణమగు హక్కు గలదనియు ఈకాంగ్రెసుసభవారు ప్రకటించుచున్నారు.

ఈ సంగ్రామ చిహ్నములను అంతమొందింపవలసినదనియు, బ్రిటిషుప్రభుత్వమువారు భారతదేశమున సంగ్రామమును ప్రకటించి, తమ సామ్రాజ్యమును విస్తరింపజేసికొనుటకు భారతదేశము నుపయోగించుకొన బ్రయత్నించునెడల, అట్టిసంగ్రామమున పాల్గొనుటకుగాని, ఏవిధముగనైనను సహకారమొనర్చుటకుగాని భారతీయులెల్లరును నిరాకరింపవలసినదనియు ఈసభవారు ప్రకటించుచున్నారు.

౫

బహిష్కరణ తీర్మానము

భారతవర్షముయొక్క స్వయంనిర్ణయహక్కును కేవలము తృణీకరించి బ్రిటిషుప్రభుత్వము స్టాట్యూటరీ రాయల్ కమిషనును నియమించినందున సదరుకమిషనును సర్వవిధముల బహిష్కరించుటయే భారతవర్షము అవలంబింపవలసిన ఆత్మగౌరవకరమగు ఏకైకమార్గమని ఈజాతీయమహాసభవారు తీర్మానించుచున్నారు. బహిష్కరణ విధానము క్రిందివిధమున గావింపవలెను:

(ఏ) దేశమునందుండెడి కాంగ్రెసుసంఘములన్నియును.

(౧) కమిషను భారతదేశమునం దడుగిడిన రోజుననే బహిష్కరణమున కనుకూలముగ ప్రజాభిప్రాయప్రకటన ప్రదర్శనమున కేర్పాటులు దేశమందంతటను గావింపవలెను. కమిషను సందర్శించెడివేర్వేరు పట్టణములందును అట్టిఏర్పాటులే కావింపబడవలెను.

(౨) కమిషనును సంపూర్ణముగ బహిష్కరించుటకై వివిధ రాజకీయపక్షములవారిని బురికొల్ప ప్రజాభిప్రాయమును ప్రచారము మూలమున బలపరుపవలెనని తీర్మానించుచున్నారు.

(బి) భారతదేశమందలి శాసనసభలలోని అనధికార సభ్యులును, వివిధరాజకీయపక్షనాయకులును, సంఘనాయకులును, తదితరులెల్లరును కమిషనువారియెదుట సాక్ష్యమొసంగరాదనియు, ప్రత్యక్షముగగాని, ఆంతరంగికముగగాని ఎట్టిసహకారము గావింపరాదనియు, కమిషనువారి కొసంగెడి విందులకు హాజరగుటగాని, అందు పాల్గొనుటగాని గావింపరాదనియు ఈసభవారు తీర్మానించుచున్నారు.

(సి) శాసనసంస్థలందుండెడి అనధికారసభ్యులెల్లరును

(౧) ఈకమిషను సందర్శనములో నియమింపబడనుండు ఉపసంఘములకు సమ్మతుల నొసంగరాదనియు, అట్టి ఉపసంఘములపై పని చేయరాదనియు తీర్మానించుచున్నారు.

(౨) మరియు కమిషనువారి పనులకయి అయ్యెడివ్యయమునకుగాను శాసనసభలం దుపపాదింపబడు గ్రాంటునుగాని, ప్రతిపాదననుగాని దేని నయినను ఓడింపవలెననియు తీర్మానించుచున్నారు.

(డి) భారతశాసన సంస్థలందున్న అనధికారసభ్యులెల్లరును తమ సభ్యత్వములు రద్దుగాకుండ నుండుటకుగాని, లేక బహిష్కారోద్యమమును బలపరచుటకుగాని, లేక మంత్రివర్గము నోడించుటకు గాని, లేక భారతీయాశయములను ప్రతికూలమని కార్యనిర్వాహక వర్గము వారు తలంచుచు చేయునట్టి ప్రతిపాదనల నెదుర్చుటకుగాని శాసనసభలకు హాజరుగావలయునేకాని ఇతరసమయములందు శాసనసభల కరుగరాదు.

(ఇ) బహిష్కారమును బలయుతమును, సంపూర్ణమును గావించుటకయి సాధ్యమైనతావులందు తాము ఇతరసంఘములతోను, పక్షములతోను సంప్రతించి, వారి సహకారమును బొందుటకై వర్కింగు కమిటీవారి కీ జాతీయమహాసభవా రధికార మొసంగుచున్నారు.

౬

సంపూర్ణ స్వాతంత్ర్యతీర్మానము

సంపూర్ణజాతీయ స్వాతంత్ర్యము భారతదేశీయుల ఆదర్శమని ఈజాతీయమహాసభవారు ప్రకటించుచున్నారు.

## ౭

### బెంగాలు నిర్బంధితులు

౧౮౧౮ సం.పు ౩ వ రిగ్యులేషనుక్రిందను, ౧౯౨౫ సం.పు బెంగాలు క్రిమినల్ లాసవరణచట్టముక్రిందను నిరపరాధులగు పౌరులను, కాంగ్రెసుసేవకులను విచారణలేక అంతులేనికాలమునకు కారాగారముల పాల్చేసి, నిర్బంధవిధానము ననుసరించుచున్న భారత ప్రభుత్వముయొక్కయు, బెంగాలు ప్రభుత్వముయొక్కయు పరిపాలనావిధానమును జాతీయమహాసభవారు తీవ్రముగ ఖండించుచున్నారు. సదరుప్రభుత్వ నిర్బంధవిధానమునకు గురియై మాతృదాస్యవిమోచనకై పలుకష్టముల నంది, ప్రస్తుత మిడుమలకు లోనగుచున్నట్టివా రందరకును స్నేహపూర్వకముగ ధన్యవాదముల నందజేయుచున్నారు.

(అ) ౧౯౨౫ సం.పు బెంగాలు క్రిమినల్ లా సవరణ చట్టము క్రింద నిర్మితములైన ప్రత్యేక న్యాయస్థానములచే శిక్షింపబడిన రాజకీయ నిర్బంధితులయొక్కయు, విచారణలు లేక నిర్బంధమునం దుంపబడిన ప్రవాసితులయొక్కయు సత్వరవిమోచనమును కాంగ్రెసువారు కోరుచున్నారు.

(ఆ) 1818 సం.పు వంగదేశసంస్థాన నిర్బంధితుల ౩ వ రిగ్యులేషన్ క్రింద సర్దార్ శాంతసింగుగారిని నిర్బంధించినందులకు ప్రభుత్వమువారి చర్యను కాంగ్రెసు సభవారు తీవ్రముగ ఖండించుచున్నారు.

## ౮

### కాకోరీనిర్బంధితులు

కాకోరీకేసునందు శ్రీయుతులు యస్. రామప్రసాదుబిస్మల్, రాజేంద్రనాథలాహిరి, అషఫ్‌గుల్ల, రోహన్‌సింగుగార్లపై విధింపబడిన అమానుషశిక్షలపై ప్రజ లత్యంతాగ్రహము ప్రకటించిననుగూడ దానిని సరకుచేయక శిక్షలను తగ్గింపకుండుటలో ప్రభుత్వమువారు వహించిన అలక్ష్య భావమునకు ఈజాతీయమహాసభవారు మిక్కిలి విచారమును వెల్లడించుచు, అట్టి శిక్షల పాలైనవారి కుటుంబములకు తమ మనఃపూర్వక సానుభూతి నందజేయుచున్నారు.

## ౯

### జనరలు అవారీగారు

నాగపూరు ఆయుధశాసనోల్లంఘన సత్యాగ్రహనాయకు లగు జనరలు మంచర్ష అవారిగారును, వారి అనుచరులును దృఢమగు దేశాభిమానము, స్వార్థత్యాగమును వెల్లడించినందుకు ఈ జాతీయమహాసభవారు అభినందించుచు, అవారిగారు ఆహారనిరసనవ్రతము బూనిన యీ 75 వ దినమున వారియెడల సానుభూతి దెల్పుచున్నారు.

## ౧౦

### భారత బర్మాదేశముల సంయోగము

బర్మాను భారతదేశమునుండి ప్రత్యేకించుటకు జరుగు ప్రయత్నము లన్నిటితో ఈజాతీయమహాసభవా రనంగీకారమును ప్రకటించుచు, పశ్చిమోత్తరసరిహద్దురాష్ట్ర నిర్మాణాభిప్రాయము ఖండించుచున్నారు.

భారతీయులకును, బర్మాదేశీయులకును భారత బర్మాసంయోగమును సాధ్యమైనన్నివిధముల పరస్పరము బలపరచుటకై కాంగ్రెసువారు విజ్ఞప్తి గావించుచున్నారు.

## ౧౧

### బ్రిటిషువస్తు బహిష్కారము

బ్రిటిషువస్తు బహిష్కారమునకై అఖిలభారతకాంగ్రెసు సంఘమువారు గావించిన తీర్మానమును తిరిగి బలపరచుచు రాష్ట్రీయకాంగ్రెసు సంఘములవా రీతీర్మానము నాచరణలో పెట్టుటకై తగిన ఏర్పాటులను గావింపవలయును.

## ౧౨

### స్వదేశసంస్థానములు-బాధ్యతాయుతప్రభుత్వము

భారతవర్ష మందలి సంస్థానాధీశుల యొక్కయు, ప్రజలయొక్కయు క్షేమములను పాటించినచో స్వదేశసంస్థానములందు త్వరలో ప్రజాప్రతినిధిసంస్థలద్వారా బాధ్యతాయుతప్రభుత్వమును స్థాపింపవలయునని తీర్మానించుచున్నారు.

## ౧౩

### దక్షిణాఫ్రికాలోని భారతీయులు

దక్షిణాఫ్రికాయందు యూనియను ప్రభుత్వమువారు భారతీయుల నెక్కువాదరముతో జూచుట కభిలాష గలవారని దెలుపుటకు నిదర్శనముగ నంగీకరింపబడిన ఇండోయూనియను ఒడంబడికను ఈకాంగ్రెసు సభవారు అంగీకరించుచు, భారతీయనివాసులకు యూనియను ప్రభుత్వమునందు ఓటింగు అధికారముగల యితరప్రజలతో సరిసమానమగు హక్కు లొసంగినగాని సంతృప్తి నొందజాలమని తమ అభిప్రాయమును దెలుపుచున్నారు. యూనియను ప్రభుత్వమువారు వర్ణభేదముల చట్టము, భారతీయులను హోటల్సులో నౌఖరులుగ నియమింపరాదని విధించుచట్టము, మునిసిపలు స్థలముల ప్రత్యేకించు నేటాలుచట్టము మున్నగు జాతిభేదము ననుసరించుకొనియున్న చట్టములను రద్దుపరిచి ఉభయదేశముల మధ్య నూతనముగా గల్గిన సఖ్యమును పెంపొందించవలెనని కోరుచున్నారు.

తూర్పు ఆఫ్రికాలోను దక్షిణఆఫ్రికాలోను భారతీయుల ప్రతిపత్తి నధికము చేయుటకు మానవసేవకు ఎక్కువ పాటుబడిన దీనబంధు సి. యఫ్. ఆండ్రూసుగారికి కాంగ్రెసువారు హృదయపూర్వకముగ కృతజ్ఞత దెలుపుచున్నారు.

## ౧౪

### తూర్పు ఆఫ్రికాలో భారతీయులు

1. తూర్పు ఆఫ్రికను ఫెడరేషనుకమిషను భారతీయప్రతినిధు లెవరు లేకుండ నియమించి, బాధ్యతాయుత ప్రభుత్వ మనునెప

మున అప్పటి అమాయకులగు దేశీయులను, ఐరోపియనులు చేరకమునుపె పోయి వారితో అనేకశతాబ్దములనుండి సఖ్యముగా నుండిన భారతీయులను అణచివేయుటకు ఐరోపియనుల కెక్కువ అధికారమిచ్చు విధానమును ఈ కాంగ్రెసువారు తీవ్రముగ నిరసించుచున్నారు. 2. టాంగనైకా మాండేటునందు ఐరోపియనులకు మాత్రము ప్రత్యేకముగ ఉన్నతస్థలముల నేర్పాటు చేయుచుండుటవలన చాల ప్రమాదము గలదనియు, జాతిసమితివారు ఈవిషయమున శ్రద్ధవహింపవలెననియు కోరుచున్నారు. 3. కెన్యాస్థానికస్వపరిపాలనముగూర్చి ఫీనముకమిటీవారి రిపోర్టు నైరోబీ, మొంబాసాలయందు ఐరోపియనులకె లెక్కకుమించి ప్రాతినిధ్యము అన్యాయముగ నొసంగినందున దాని నిరసించుచు, తూర్పుఆఫ్రికా భారతీయులు సరిసమానస్వత్వము కొరకు ఆందోళన పూర్తిగ కొనసాగించెదరని నమ్ముచున్నారు.

## ౧౫

## హిందూముస్లిము సఖ్యము

### ౧వ భాగము—(రాజకీయపు హక్కులు)

కాంగ్రెసువారు ఇట్లు తీర్మానించు చున్నారు:—ముందు సూచింపబడు రాజ్యాంగవిధానమునందు రాష్ట్రశాసనసభలయందును, కేంద్ర శాసనసభయందును సమష్టి నియోజకవర్గముల నేర్పాటు చేయవలెను.

రెండు పెద్ద సంఘములకు, శాసనసభలవిషయమున వారివారికి గల న్యాయమగు హక్కులకు ఎట్టి భంగము కలుగకుండుటకై, వారు కోరినచో, సమష్టి నియోజకవర్గములందే,ఆయా సంఘములకు జనసంఖ్యననుసరించి ప్రతినిధులసంఖ్య ప్రత్యేకించి యుంచవలెను.

పంజాబులో అల్పసంఖ్యాసంఘములకు అనుకూలముగ కొన్ని సౌకర్యములను ఒసంగవచ్చును. శాసన సభా ప్రాతినిధ్యము విషయమున అల్పసంఖ్యా సంఘములకు నిర్ణీతసంఖ్యకన్న నెక్కువ ప్రాతినిధ్యము గావలెనన్నచో, తా మధిక సంఖ్యగానున్న యితరరాష్ట్రములందు ప్రతిపక్షమువారి కట్టి సౌకర్యము నొసంగుటకు అన్యోన్యానుకూలమగు ఒడంబడిక నేర్పరచుకొనవలెను. దానిననుసరించియే పంజాబులోని అల్పసంఖ్యాకులకు సౌకర్య మొసంగబడును. ఉభయమతముల వారికి రాష్ట్రములందు ఈ ఒడంబడికననుసరించి ప్రాతినిధ్యమునం దెట్టివ్యత్యాస ముంచబడునో కేంద్రశాసన ప్రతినిధుల సంఖ్యవిషయమునకూడ అట్టి వ్యత్యాసమే యుండును.

పంజాబులో శాసనసభా స్థానముల ప్రత్యేకించుటనుగూర్చి తీర్మానించునపుడు సిక్కులనుగూడ ముఖ్యమయిన అల్పసంఖ్యాక సంఘముగనెంచి వారిహక్కులగూర్చి పూర్తిగ విచారించుటయగును.

పశ్చిమోత్తర సరిహద్దు రాష్ట్రమునందు, బ్రిటిషు బెలూచిస్థానునందు ఇతర రాష్ట్రములలో వలెనే సంస్కరణముల ప్రతిపాదింపవలెనని మహమ్మదీయ నాయకులు గావించినసూచన చాల న్యాయముగ నున్నదని కాంగ్రెసువారు తలంచుచున్నారు. ఇది వెంటనే అమలుజరుపవచ్చును. పరిపాలనా విషయమగు ఇతర సంస్కారములతోపాటు న్యాయపరిపాలనా విధానమునందుగూడ తగిన సంస్కారము ప్రారంభింపవలెను.

సింధును ప్రత్యేకరాష్ట్రముగ వేరుచేయవలెనను సూచనగూర్చి భాషాప్రయుక్తరాష్ట్రవిభజనమునకు తగిన అవసరము గలదని, కాంగ్రెసువారు దలంచుచున్నారు. కాంగ్రెసునిర్మాణమునందు ఈ సూత్ర మంగీకరించబడెను. వెంటనే భాషలననుసరించి రాష్ట్రముల విభజించవలెను; అట్టి యేర్పాటును ఏరాష్ట్రమయినను తాను కోరినచో వెంటనే ఒసంగవలెను.

ముందుగ ఆంధ్ర, ఉత్కళ, సింధు, కర్నాటరాష్ట్రములను ప్రత్యేకరాష్ట్రములుగ నేర్పాటు చేయవచ్చును.

స్వరాజ్యవిధానమును తయారుచేయుటలో అంతఃకరణస్వాతంత్ర్యమునకు మనము భద్రమును కలుగజేయవలెను. ఈస్వాతంత్ర్యమును భగ్నము చేయునట్టి చట్టములను జేయుటకు భారతశాసనసభకు, రాష్ట్రశాసనసభకు గూడ నెట్టి అధికారము నుండకూడదు.

నమ్మకము, ఆరాధనము, మతానుష్ఠానము,సాహచర్యము, మతవిద్య, మతప్రచారము మున్నగువానిని, ఇతరులకు అట్టి విషయములలో భంగము కలుగకుండ, నెరవేర్చుటకు వ్యక్తులకుగలస్వాతంత్ర్యమే అంతఃకరణ స్వాతంత్ర్యము.

రాష్ట్రశాసనసభయందుగాని, కేంద్రశాసనసభయందుగాని ఏదేనియొక సంఘమునకు చెందిన సభ్యులలో $\frac{3}{4}$ వంతు సంఖ్య అభ్యంతరము దెలిపినచో, సాంఘికవిషయములకు సంబంధించినతీర్మానములనుగాని, చట్టరూపములనుగాని సభలో చర్చకు దేరాదు; చర్చ చేయరాదు; ఆమోదింపరాదు. "సాంఘిక విషయములకు సంబంధించినవి" అనగా శాసనసభలలోని హిందూమహమ్మదీయ సభ్యులనుండి యెన్నుకొనబడిన జాయింటు స్టాండింగు కమిటీవారు ఆరీతిగా నిర్ణయించునవి.

### ౨ వ భాగము—మతవిషయమగు హక్కులు

కాంగ్రెసువా రిట్లు తీర్మానించుచున్నారు:—తమ యిష్టమువచ్చినచోట వాద్యములతో ఊరేగింపు జరుపుకొను హిందువుల హక్కులకును, తమ యిష్టము వచ్చినచోట గోవులను వధచేయుట లేక బలివేయుటకు గల మహమ్మదీయుల హక్కులకును భంగము కలుగకుండ, వీలయినంతవరకు గోవధ విషయమున హిందువుల కోర్కెను మన్నించవలెనని మహమ్మదీయులును, మసీదులయెదుట వాద్యముల విషయమున వీలయినంతవరకు మహమ్మదీయుల అభిప్రాయమును మన్నించవలెనని హిందువులును తమ తమ సంఘములవారికి హెచ్చరికలు దెల్పుచున్నారు.

కావున హిందువులు, మహమ్మదీయులుగూడ ఈవిషయము నందు దౌర్జన్యమునకు గడంగరాదని కాంగ్రెసువారు కోరుచున్నారు.

అన్యమతస్థులను సహేతుకముగ వాదించి, బోధచేసి, ప్రోత్సహించి తన మతములో కలుపుకొనుటకు ప్రతివ్యక్తికిని, ప్రతిసంఘమునకు హక్కు గలదు. కాని యెవ్వరుగూడ బలవంతముగ వారింప యత్నింపరాదు. మోసముచేసి గాని భౌతిక ప్రలోభనముల జూపికాని మతాంతరీకరణము లొనర్పరాదు. 18 ఏండ్లలోపు వారిని వారి తలిదండ్రులతో దప్ప విడిగా అన్యమతములోనికి చేర్చుకొనరాదు. 18 ఏండ్లలోపువారు అనాథలుగ దొరకినప్పుడు వారిని వారిమతమువారి కొప్పగించవలెను. ఒకమతమునుండి వేరొక మతములోనికి మార్చునపుడు ఆవ్యక్తినిగూర్చికాని, స్థలమునుగూర్చికాని, సమయమునుగూర్చికాని యెట్టి రహస్య ముండరాదు. ఆకార్యము నెరవేరిన పిదప అమితోత్సాహప్రదర్శనము లేమియు నుండరాదు.

మతాంతరీకరణముగూర్చి బలవంతముగ, లేక రహస్యముగ జరిగినదనికాని, మోసముచే జరిగినదనికాని, అక్రమముగజరిగినదనికాని ఫిర్యాదులు వచ్చినను, లేక 18 లోపువారిని అన్యమతస్థులు స్వీకరించినను ఆవిషయమును వర్కింగు కమిటీవారిచే నియమింపబడు మధ్యవర్తులు విచారించి పరిష్కరించవలెను.

౧౬

## స్వరాజ్యప్రభుత్వప్రణాళిక

దేశమునందుగల వేర్వేరు రాజకీయపక్షములు స్వరాజ్యప్రభుత్వప్రణాళికను తయారుచేయుట కేకముగుట కభిలషించుచుండుటచే, కార్యనిర్వాహకసంఘమువారీసభవారియెదుట నుంచిన చిత్తుప్రణాళికలను, ఇతరులొసగిన సలహాలను సమగ్రముగ నవలోకించి, ఇతర రాజకీయ కార్మిక సాంఘికపక్షములచే నిందునిమిత్తము నియమింపబడు ప్రత్యేకసంఘములతో కలసి చర్చించి, స్వరాజ్యప్రణాళికను తయారు చేయవలసినదని కార్యనిర్వాహకసంఘమువారిని గోరుచున్నారు. ఆప్రణాళికయందు ప్రజల పౌరసత్వపు హక్కులనుగూడ నిర్వచింపవలెను. ఆవిధముగ తయారుచేసిన ప్రణాళికను చర్చించుటకు మార్చినెలలోగా ఢిల్లీలో ప్రత్యేకముగ నొక కన్వెన్షనును సమావేశ పరుపవలెను. ఆసమావేశమునకు అ. భా. జాతీయోప సంఘసభ్యులు, పై నుదాహరించిన ఇతరసంస్థలనాయకులు, ప్రతినిధులు, కేంద్రరాష్ట్రీయ శాసన సభయందలి ప్రజాప్రతినిధులు ఆహ్వానింపబడవలెను.

౧౭

## కార్యదర్శులు

గత వత్సరము కార్యదర్శులుగ నుండి అమూల్యమగు సేవ యొనర్చిన ఎ.రంగస్వామి అయ్యంగారు, వల్లభాయి పటేలుగార్లకు కృతజ్ఞతలను దెలుపుటకు దీర్మానింపబడెను.

1928 సంవత్సరమునకు—1. షొయబ్ కొరాషీ, 2. జవాహిర్ లాలు నెహూరి, 3. సుబాష్‌చంద్రబోసుగార్లను కార్యదర్శులుగ నెన్నుకొనవలెనని తీర్మానింపబడెను.

## కోశాధికారులు

1928 సంవత్సరమునకు జమ్నాలాలు బజాజ్, రేవాశంకర జగ్జీవనుగార్లను కోశాధికారులుగ నెన్నుకొనవలెనని తీర్మానింపబడెను.

## రాబోవు కాంగ్రెసు

రాబోవుకాంగ్రెసును కలకత్తాలో జరుపవలెనని తీర్మానింపబడెను.

---

## జెండా యేనుఁగు

మద్దిపల్లి వేంకటరమణయ్య గారు



పూర్వకాలంబు భారతభూమియందుఁ-జండతరమైన భండనం బొంఁడుజరిగె; [డవు.
భేరిభాంకారముల దిశల్ మాఱుసెలఁగెఁ;-బెనుతుపాకులుఢామ్ముఢామ్మనిమొద
నాఁటి సంకుల సమర సన్నాహరంగ-మందు నియమితంబైన కృత్యంబునెరప
భాసురధ్వజవహన సంభారమగుచుఁ-గదలె నొకయేన్గు సాటోపగమనమునను

వాఁడిమూపులు వ్యూహంబుపైని బఱపి-ఆడకీడ కాకరి మావటీఁడు నడిపె;
ఆకసమునఁ గ్రాలునిజపతాకఁగాంచి-సంబరముచెంది పోరెను సైనికాళి—

"ఆఁగు"మనిమెఁ దుదకు నాధోరణుఁడు;శిర-సావహించె నాజ్ఞ సామజంబు;
మెఱపువలెను వచ్చి కఱకుటమ్మెదఁగాఁడె-"హా"యటంచు నాతఁ డవనిఁ గూలె.

పోరు ఘోరమయ్యెఁ, బోటులు మెండయ్యెఁ-ద్రాక్షఫలములట్లు తలలు వ్రాల్లెఁ
బఱచె జివ్వుమంచు బందూకులను గుండ్లు,-శవవికీర్ణమయ్యె సమరతలము.

అట్టి నిర్భయంబుగ నిల్చె నాగజంబు-తనపదంబులు రక్తసిక్తంబు లైనఁ
బరబలంబులయెడ్డైఱ ప్రబలమైన-బలముడిగి తనవారలు కలఁగుచున్న బంట్లు.

చెవులు ఱిక్కించి యాలించె దివినిహస్తి-ఏలికయనుజ్ఞకోసంబు చాలసేపు;
పరమశాంతంబుతో నిల్చె మరలకుండ-విఱిగి వెన్నిచ్చి తనసేన పఱచుచున్న.

క్రాలెఁ డెక్కె- మెప్పటియట్లు గజముమీఁదఁ-బ్రమదమునఁ జూచిరద్దానిఁ బఱచు
"ఓడిపోలేదు విజయాశ యుడుగలేదు"-అనుచు నూల్క్యని మరలిరి వెనుకకంత.

తాఁకి రరులను ద్విగుణితోత్సాహమునను-చెండి వైచిరి వేటాఱు తుండెములుగ;
వెనుకకును మళ్లినప్పుడు విజయవీచి-చెట్టుకొకఁడుగ రిపుసేన చెదరిపాఱె—

ఆజి ముగిసెను; దినసంబు సంతమొందె; నైన నాత్మైకశాసనుఁ డౌనిషాది
యాజ్ఞకును గట్టునడి నిల్చెహస్తిరాజ-మెచటఁ దను మున్న తఁడునిల్పె నచటువిడక

మూఁడహోరాత్రములు సమిద్భూమియందు-స్వామియానతికై వేచె వారణంబు;
లాలనలు తర్జనలు బరిగోలపోట్లు-కాలి నైనను గదలింపఁ జాలవయ్యె—

తట్టె నొక్కయూహ ధాత్రీశునకు నంతఁ;-దోన తెలివినొందె నాననమ్ము;
సమరనిహతుఁడైన తమ మావటికుమారు-నటకుఁ దెచ్చుకొఱకు భటులఁబంపె.-

ఎన్నియో మైళ్లదూరాన నున్నవానిఁ-దొమ్మిదేఁడుల బుడుతనిఁ దోడితెచ్చి,
నిలువఁ బెట్టిరి వారు మన్నీనియాన-నద్రివోలెఁ జలింపని హస్తిమ్రోల—

చూచినది యేన్గు యజమానసూను నెలమి-వంచినది యున్నతంపుఁగుంభస్థలంబు;
నడచినది వేగ వానివెంబడిన తాను-ఆతఁడపుడప్డు తనకు నియంత యగుట—

బారసాచినట్టులు సాగె వారణంబు-తునిసి మఱకలై సవరణ తూలియాడ;
మూఁడునాళ్లైనసక్కటా! చూడఁ డొకఁడుఁ-బ్రక్కరక్తమ్ము చిమ్ము క్రూరక్షతమ్ము.

వేదనాభరంబు విశ్వాసమున డాఁచెఁ - గంబళంబు క్రింద గాయమట్లు;
చిన్నదొరపిలుంద శిబిరంబునకుఁ జేరెఁ;-గలయ రోసె స్వామికై గజంబు—

నెరపె నిస్పృహాధీనమూ నిడుదయూర్పు;-మృత్యువేదనోన్మిశ్రఘీంకృతులు సల్పె;
అర్భకునిమేనఁ దుండంబు నల్లఁబెనఁచి-స్వామిభక్తినిధాన మానపువు విడిచె.

[అనుకరణము.]

# యుద్ధనివారణము - నానాజాతిసమితి

నేత్రకంటి శ్రీనివాస కోనేటరావు గారు, బి. ఏ., బి. యల్.



గత జులై ఆగస్టు మాసములలో ఆయుధ విసర్జనార్థము బ్రిటిషు, అమెరికా, జపాను ప్రభుత్వములవారు సమావేశమగుటయు, ఏకాభిప్రాయము నెంతమాత్రము పెంపొందించుకొనజాలకుండుట వలన కార్యక్రమము భగ్నమై తత్సభ నిష్ప్రియోజన మగుటయు సంభవించినది. అయినను తరువాత వెంటనే సమావేశమైన వివిధ దేశప్రతినిధులు పెక్కండ్రు గలిగినట్టి నానాజాతి సమితి మహాసభయందు యుద్ధ బహిష్కారమును గురించి పోలండు దేశప్రతినిధి తీర్మానమును ప్రవేశపెట్టగా ప్రతిఘటనము గాని, సవరణగాని లేకయే అంగీకరింపబడినది. యుద్ధబహిష్కారము సహజముగ ఆయుధవిసర్జనముపై నాధారపడియుండగా, ఆయుధవిసర్జనపు సమావేశము నిష్ఫలమగుటయు, పిమ్మట యుద్ధబహిష్కారపు తీర్మానము ఆమోదింపబడుటయు జూడ మిక్కిలి హాస్యాస్పదము. ఇందలి తత్త్వమును గ్రహించినయెడల, అమెరికా, యింగ్లండు, ఫ్రాంసు, జపాను, ఇటలీ లోనగు గొప్ప ప్రభుత్వముల యొక్క నిజాశయములను, ప్రస్తుత నానాజాతిసమితి యొక్క దౌర్బల్యమును విశదమగును. ఇప్పటి స్వరూపమును, కార్యక్రమపద్ధతులును మారినగాని నానాజాతి సమితి యుద్ధములను మాన్పుట కేవిధముగను సాధనభూతము కాజాలదనియు సువ్యక్తమగును.

గత ఐరోపా మహాసంగ్రామమునకు పూర్వము యూరపుఖండరాజ్యములన్నియు వివిధకక్షలుగా నేర్పడి బాలన్సుఆఫ్ పవర్ (Balance of Power) సిద్ధాంతముప్రకారము వివిధప్రభుత్వములవారు సమానశక్త్యవకాశములకై పరితపించుచు, అన్యోన్యసహాయార్థము ప్రత్యేక సంధులను గావించుకొనుచు, ఏయొక్క దేశమైనను విశేష బలాధిక్యమును పొందకుండునట్లు అనుగుణముగా స్వీయసైన్యములను, యుద్ధపరికరములను పోటీగా వృద్ధి చేసికొనుచుండుటయు పరిపాటిగా నుండినది. సదా యుద్ధమునకు సంసిద్ధస్థితియం దుండుటకై దేశాదాయమునుండి విశేషధనము యుద్ధభటులకొరకును, మందుగుండు సామానుల నిమిత్తమును, నౌకావాయువిమాన నిర్మాణమునకును జంకుగొంకులేక ఒకరికి మించి యొకరు పట్టుదలతో ఖర్చుపరిచిరి. ఈవిషయములో నగ్రగణ్యులు మన బ్రిటిషుప్రభుత్వమువారును, జర్మనీవారును. తత్ఫలితముగ మారుమూలనున్న సర్వియా దేశములో తటస్థించిన యొక స్వల్పవిషయము కారణభూతమై గత ఐరోపా మహాసంగ్రామము సంఘటిల్లి లోకవ్యాప్తమైన విధ్వంసము కావించినది. ఆదినములలో ఉభయకక్షులవారికి యుద్ధ మెప్పటికైన పరిసమాప్తి నంది జనసామాన్యమునకు సుఖజీవన ముండునాయని తోచినది. అప్పటి అమెరికా సంయుక్తరాష్ట్రాధిపతియగు విల్సనుమహాశయుడు సంధిసమాలోచన సందర్భమున శాశ్వతముగ లోకములో యుద్ధమనునది నిర్మూలించుటకును, సంధిషరతులు ధర్మవిహితముగ నెలకొల్పుటకును పదునాల్గుసూత్రములను ప్రతిపాదించి సర్వప్రజాప్రబోధము గావించి పుణ్యము గట్టుకొనినాడు. కాని, ఆమహాత్ముడు తలచిన దొకటి; వర్సైల్సుసంధిస్వరూపము వేరొకవిధముగా పరిణమించినది. ఆమహనీయుని యాశయములను దురాశాపీడితులును, విజయమదోన్మత్తులును అగు ఇంగ్లండు, ఫ్రాంసు, జపాను, ఇటలీ ప్రభుత్వములవారు త్రోసిరాజని తాము స్వలాభప్రయోజనములను బడసినారు. నష్టపరిహారము లనుపేరట కోటానకోట్ల రూప్యముల నేటేటను లాగికొనుచు అందుకు హామీగా భాగ్యవంతమగు సార్ వాలీ, రైన్‌లాండు ప్రదేశముల

నాక్రమించుకొని జర్మనీదేశమును ఆర్థికదాస్యమునకు పాల్గావించినారు. శత్రుపక్షమువారి వలసరాజ్యము లైన తూర్పుఆఫ్రికా, సిరియా వగైరా దేశములను, ఆయాప్రజల కోర్కులను లక్ష్యపెట్టక తా మాక్రమించుకొని స్వీయ సామ్రాజ్యవిస్తృతిని ఫ్రెంచి, బ్రిటిషు ప్రభుత్వములవారు గడించినారు. వర్సెల్సుసంధివలన పెక్కు అక్రమములు సంభవించినను మహాసంగ్రామఫలితముగ భావియుద్ధనివారణార్థమును, లోకకల్యాణమునకును నానాజాతిసమితి యనుపేరట నొక నూతనశాశ్వతసంస్థను ౧౯౨౦ సంIIన మిత్రమండలివారు జినీవాపట్టణ మునికిస్థానముగా నేర్పరచి సంస్థాపించినారు. మొదట జర్మనీ రష్యా దేశములను జేర్చుకొనలేదు. ఇటీవల వారినికూడ సభ్యులుగ జేర్చుకొనినారు. ఇంతదనుక తత్సభాకార్యములవలన నంతర్జాతీయ కలహము లంతరించి ముఖ్యప్రభుత్వములకు యుద్ధమునెడల వైముఖ్య మెంతవరకు పెంపొందినదో గుర్తింపవలసియున్నది.

వర్సెల్సు సంధినిబట్టి ముఖ్యముగా ఇంగ్లాండు, ఫ్రాన్సు, జపాను దేశములకు మాండేట్సు రూపకముగ నూతనరాష్ట్రములు లభించి పూర్వముకంటె ప్రతిష్ఠయు, బలమును హెచ్చెను. ఇయ్యది అమెరికావారి కెంత మాత్రమును సంతోషదాయకము కాదు. రష్యాదేశము విషయములో లెనిన్‌మహాయోధుని పరాక్రమ సామర్థ్యములు ప్రబలి మిత్రమండలివారి దుస్స్వభావమును, కుట్రలును సాగనీయక, ప్రస్తుతపు సోవియటు ప్రజాప్రభుత్వము నెలకొల్పబడినది. టర్కీదేశము కెమాల్‌పాషా మహానాయకుని ధైర్యసాహసముల ఫలితముగ విజృంభించి పునరుద్ధారణము గాంచినది. రష్యా, టర్కీ దేశములపైన వర్సెల్సుసంధిషరతులు నెగ్గలేదు. కాని మొత్తముమీద సర్వత్ర అధర్మముగను, అసందర్భముగను పరిణమించినందున తత్సంధిని పురస్కరించుకొని యుద్భవ మొందిన నానాజాతిసమితిసంస్థ సరిగా కార్యములను నిర్వహింపగల సమర్థత కలిగియుండదని ఆరంభముననే కొందరు రాజకీయవేత్తలు నుడివియుండిరి.

మరియు, అమెరికా సంయుక్తరాష్ట్ర ప్రభుత్వమువారు యూరపుఖండపు క్లిష్టపరిస్థితులలో తగుల్కొని తమ వ్యక్తిత్వమును గోల్పోవువారము కామని సమితియందు జేరుటకు నిరాకరించిరి. వారివలన నిది యొకతప్పిదమని యెంచుట కెంతమాత్రమును వీలులేదు. యుద్ధము ముగిసినపిమ్మట బ్రిటిషువారియొక్కయు, ఫ్రెంచివారియొక్కయు ధోరణి చూడ వారికి ఏవగింపు గలిగినదని చెప్పక తప్పదు. ఈసమితియందు వా రెంత అనాదరణమును జూపినను యుద్ధబహిష్కారము, ఆయుధనియమములయెడ అమెరికావారు అధికమైన శ్రద్ధ వహించి యేతద్విషయమై సాధనాన్వేషణమును జేయుచునే యున్నారు. మహోత్కృష్టమగు ఉద్దేశముతో నవతరించిన సమితియందు అమెరికా లేని లోపమటుండ, ఉన్న సభ్యులయందైనను పిన్న పెద్దభావము లేక సరిసమానపు హోదా యున్నచో నీసభాకార్యము సామరస్యముతో సాగియుండును. కాని పశుబలమునందును, సామ్రాజ్య విస్తారమునందును, పలుకుబడియందును అత్యధికులగుటచే బ్రిటిషు, ఫ్రెంచి, ఇటలీ, జపాను వారలు యావత్తు పెత్తనమును తమపై వైచికొని, చిన్నదేశముల యభిప్రాయములను సరకుగొనక కార్యక్రమమును నిరంకుశముగ నడుపుచున్నారు. అందుచే తుదకు తమయొక్క స్వలాభములను బడయుట కిది యొకసాధనముగా పరిణమించినదికూడ లోకము సందేహింపవలసి యున్నది. ఈ సందర్భమున బ్రిటిషుప్రభుత్వమువారు తమసామ్రాజ్య మన్నిఖండములయందును కల దనువ్యాజమున తమ వలసదేశము లగు కెనడా, దక్షిణఆఫ్రికా, ఆస్ట్రేలియా,న్యూజీలండు దేశములను ప్రత్యేకసభ్యులుగ చేర్పించినారు. మరియు స్వతంత్రదేశము కాకపోయినను హిందూదేశమునకుగూడ తమ వోట్లబలగము హెచ్చుచేసికొనుటకు నానాజాతిసమితిలో బూటకపు సభ్యత్వమును సంపాదించి హిందూదేశపు టాదాయమునుండి విశేషధనమును చందాగా నిప్పించుచున్నారు. సొమ్ము జమకట్టించుటయే కాని అందువలన హిందూదేశమునకు నిజమైనహోదా యేమియు రాలేదు.

ఏలన, హైందవులు స్వదేశములో బ్రిటిషునిరంకుశ పరిపాలనమువలన పడుచున్న బాధలను గురించికాని, విదేశములవారు, అనగా దక్షిణఆఫ్రికా, కెనడా, కెనియా ప్రభుత్వములవారు భారతీయులయెడల కావించుచున్న అక్రమములను, దౌర్జన్యములను గురించికాని యీ నానాజాతిసమితియందు చర్చకు తీసికొనివచ్చుటకు వీలులేదు. కారణమేమన, ఏసామ్రాజ్యసమస్యలు ఆ సామ్రాజ్యాధికారులే పరిష్కరింపవలయు నని చెప్పి అట్టి సమాచారములను సమితియొక్క జ్యూరిస్డిక్షనునుండి మినహాయింపు చేసిరి. కాబట్టి నానాజాతిసభాసభ్యత్వమువలన హిందూదేశమునకు ధనవ్యయమేకాని సుంతైనను ప్రయోజనము లేదు. సామ్రాజ్యస్థదేశములైనంతమాత్రమున ఆయాకష్టనిష్ఠురములను బయల్పరుచుటకును, చర్చించుటకును అవకాశములేమి నానాజాతిసమితియొక్క సంపూర్ణాధికారమునకొక గొప్పలోప మగుచున్నది.

మరియు నానాజాతిసమితి సభ్యులలో శ్వేతజాతులవారును, పాశ్చాత్యులును అధికసంఖ్యాకులుగ నుండి, ప్రాచ్యదేశీయులగు శ్వేతేతరజాతులవారు కడు హైన్యముగ జూడబడుచున్నారు. జపానువారు బలసంపన్నులై నెగడుచున్నందున వారికి గౌరవమున్నదిగాని, లేనిచో చీనావారిగతియే వారికిని పట్టియుండును. చీనాదేశము విదేశీయుల సంపర్కమునుండి తప్పించుకొని సంపూర్ణస్వాతంత్ర్యమును బడయుట కెట్టిపాట్లు పడుచున్నది దినదినము వార్తాపత్రికలలో చదువుచున్నారము. నానాజాతిసమితియందు చీనాదేశముకూడ నొక మెంబరే. అయినను అచ్చట బ్రిటిషువారును, జపానువారును ప్రేరేపుచున్న అల్లకల్లోలమును, రక్తపాతమును మాన్పుటకు యుద్ధనివారణార్థ మవతరించిన నానాజాతిసమితి యిసుమంతైనను కలుగజేసికొనలేదు. బ్రిటిషుప్రభుత్వమువారు ఇంగ్లాండునుండి యుద్ధనౌకలను, హిందూదేశము నుండి భారతీయసైన్యమును చీనాదేశములోనికి నడపించినప్పుడు వారించుటకు నానాజాతిసమితికి సమర్థత లేకపోయినది.

యుద్ధములకు కారణము వివిధప్రభుత్వములవారు తమప్రత్యేకలాభమునిమిత్తము లోకక్షేమము నారయక రహస్యాలోచనలను సలుపుచు వేర్వేరుసంధులను గావించుకొనుట యని వేరుగ చెప్పనక్కరలేదు. ప్రత్యేకపు ఒడంబడికలు ప్రపంచరాజకీయ పరిస్థితులయందు కలవరమును పుట్టించి కుట్రల కాస్పదమైనట్టియు, అనుమానపూరితమైనట్టియు వాతావరణమును కలుగజేయును. తత్ఫలితముగ నిర్హేతుకముగ అపోహలు ప్రబలి నానాదేశములును పార్టీలుగా నేర్పడుటయు, క్రమక్రమముగ ద్వేషపూరితులగుటయు సంభవించును. ఈవిషయము గ్రహించి యింతటినుండిరహస్యమంత్రాంగపద్ధతి( Secret Diplomacy) విడనాడి, సంధులను, ఒడంబడికలను బహిరంగమున జరపుకొనుచుండినగాని లోకములో యుద్ధమునకు అవకాశములు తగ్గవని విల్సనుమహాశయుడు తన సిద్ధాంతములో నిదియొక ప్రధానసూత్రముగ నుగ్గడించి యున్నాడు. అప్పు డందరును తలయూచినారు. కాని ఆచరణలోనికి దెచ్చిమార్గదర్శకులగుటకు మారుగ తమలో తాము పెద్దప్రభుత్వములవారు రహస్యముగ సమావేశ మగుచు వేర్వేరు సంధులను నిరాఘాటముగ గావించుకొనుచున్నారు. బ్రిటిషువారును, ఇటలీవారును ప్రత్యేకసంధి కావించుకొనినారు. స్పెయినువారు బ్రిటిషువారి యండ జేరుచున్నారు.

ఇదివరలోకంటె ఫ్రెంచివారును, జర్మనీవారును ఎక్కువ స్నేహభావము కలవా రగుచున్నారు. రష్యను సోవియటుప్రభుత్వముతో విడివిడిగా సుమారు అన్ని ముఖ్యదేశములును ఒడంబడికలు కావించుకొనినవి. అమెరికావారికిని, రష్యావారికిని విశేషమైత్రి పొసగుచున్నట్లు సూచనలు కాన్పించుచున్నవి. ఏలన, రష్యావారు బ్రిటిషు వర్తకులను, బ్రిటిషు సరకులను బహిష్కరించి తమకు కావలసిన వస్తువులను అమెరికానుండి దిగుమతి చేయించుకొనుచున్నటులు తెలియుచున్నది. అందుచేత నిప్పుడు నానాజాతిసమితియందు కక్షలు బయల్దేరుచున్నవి. సమితి సమావేశమునకు ముందు రహస్యముగ మాట్లాడుకొని



KATHIAWAR
TRADING COMPANY'S
POPULAR
HAIR OILS
777
కుసుమాల్ తలనూనె.
చక్కని సువాసన గలిగియుండును. ఏదీ సరిపడనివారు గూడ
దీని సువాసన కానందపడుదురు. వెల రు 1-0 0.
ఇండియన్ బ్యూటీ వాసననూనె.
సౌమ్యమైన వాసన గలిగియుండును. సున్నితమైన నాసికగల
ప్రతి స్త్రీయు దీనిని కని ముదమందును. వెల రు 0-14-0.
తెల్లగులాబీ వాసన నూనె నెం 777.
అచ్చముగ గులాబీపూల వాసన గలిగి యుండును.
వెల రు 0-14-0.
పుష్ప సేన వాసన తలనూనె.
క్రొత్త తలనూనెలకొఱకు ఎల్లప్పుడు వెదకుచుండువారికి ఇది
యొక వరప్రసాదము. దీని వాసన ఘాటుగ నున్నట్లుండినను
సౌమ్యముగ నుండగలదు. వెల రు 0-14-0.
కె. టి. కొబ్బరి నూనె నెం. 777.
విద్యార్థి బృందము దీని నుపయోగించి ప్రశంసించియున్నారు.
ఒకసారి వాడిన, నిజము మీకు తెలియును. వెల రు 0-14-0.
PUSHPAMALTI
THE KATHIAWAR TRADING CO.
INDIAN BEAUTY HAIR OIL
NOVELTY HAIR OIL
THE KATHIAWAR
TRADING COMPANY
GIRGAON POST
BOMBAY

# అమృతాంజనము



కలికావతారము

"నా మార్గదర్శి! నా వైద్యుడు!! నా స్నేహితుడు!!!"

# అమృతాంజనము

"బాధలనే రాక్షసులను సంహరించుటకై ఉద్భవించిన
అ వ తా ర ము"

"లావొక్కింతయు లేదు ధైర్యము విలోలంబయ్యెఁ బ్రాణంబులా
ఠావుల్దప్పెను మూర్ఛవచ్చెఁ దనువున్ డస్సెన్ శ్రమంబయ్యెడిన్
నీవేతప్ప నితఃపరం బెఱుఁగ మన్నింపదగుం దీనునిన్
రావే యీశ్వర! కావవే వరద! సంరక్షింపు భద్రాత్మకా!"

"స్వామహాబాహుకృపాణ కృత్తగళతుచ్ఛమ్లేచ్ఛ వీరస్ఫుటో
త్క్రిమణాపాదిత పద్మినీరమణ మధ్యచ్ఛిద్రఖశ్యామికా
గమనానాసమయోపరాగ ముదితక్ష్మా సౌరగంగానదీ
భ్రమకృత్కీర్తికకల్కిమూర్తికపరబ్రహ్మన్ స్తుమస్త్వా మనున్."

"పరిత్రాణాయసాధూనాం వినాశాయ చ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే."

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.

# ఇతర మహాసభలు-చెన్నపురి



శ్రీ కే. నటరాజనుగారు

అధ్యక్షులు, అఖిలభారత సంఘసంస్కరణ మహాసభ, చెన్నపురి



శ్రీ పండిత మదనమోహన మాలవ్యగారు

అధ్యక్షులు, అఖిలభారత హిందూమహాసభ, చెన్నపురి



శ్రీ పండిత జవాహిర్ లాల్ నెహ్రూగారు

అధ్యక్షులు, అఖిలభారతప్రజా స్వాతంత్ర్యవాదిమహాసభ, చెన్నపురి



శ్రీ డాక్టరు ప్రమోదనాథ బెనర్జిగారు

అధ్యక్షులు, అఖిలభారత గ్రంథాలయమహాసభ, చెన్నపురి



సర్ ఇబ్రహీం రహీంతుల్లా గారు

అధ్యక్షులు, అఖిలభారత పారిశ్రామికమహాసభ, చెన్నపురి




సేట్ జమ్నాలాల్ బజాజ్ గారు
అధ్యక్షులు, ఆర్యవైశ్యమహాసభ, చెన్నపురి



శ్రీ జే. యం. సేనుగుప్తగారు
జాతీయపతాకా స్థాపకులు, చెన్నపురి



మహాత్మా గాంధిగారు
ఖద్దరుప్రదర్శన ప్రారంభకులు, చెన్నపురి



శ్రీమతి సరోజినిదేవిగారు
అధ్యక్షురాలు, హిందీమహాసభ, చెన్నపురి

యేపార్టీకి ఆపార్టీవారు తమ భావములను నిర్ణయించుకొని సభ కరుదెంచుచున్నారు. కనుక సభాక్రమము వట్టిఫార్సు క్రింద పరిణమించుచున్నది. మరియు రహస్యాలోచనల వలన గొప్పయనర్థ మేమనగ, ప్రపంచ రాజకీయరంగము సదా మారుచుండి, నేడు శత్రువులుగ నున్న వారు మిత్రు లగుటయును, మిత్రులుగ నున్న వారు శత్రుపక్షమున జేరు చుండుటయు తటస్థించి, లోకమున నేభాగమునందును శాంతి నిలుకడగా పెంపొందజాలదు.

ప్రకృతము యూరపుఖండమున వివిధ దేశముల వారియొక్క సంబంధభావములను స్థూలదృష్టితో తిలకించి నచో, పరిస్థితు లెంతమాత్రమును శాంతికరముగ లేవని గోచరించును. ఇటలీదేశ ప్రభుత్వము ముస్సోలిని నాయ కత్వము వహించినదిమొదలు యూరపులో విజృంభించి రాజకీయప్రాముఖ్యమును సంపాదించినది. ముస్సోలిని తన మాతృదేశమునకు సామ్రాజ్యమును సమకూర్చి పూర్వపు రోమకసామ్రాజ్య ప్రఖ్యాతిని తిరిగి గడించుట తన యాశ యమని నిర్భీతిగా లోకమునకు చాటుచున్నాడు. బాల్కన్సువైపునను, ఉత్తరఆఫ్రికాయందును తమ శక్తిసామర్థ్యములను ప్రదర్శింపవలయునని ఇటలీప్రభుత్వమువారు అవకాశములను నెమకుచున్నారు. అట్టి సామ్రాజ్యకాంక్ష ప్రబలినచో నూతనముగ రాజకీయ ప్రబోధమును గాంచి స్వాతంత్ర్యబలమును బడసిన ఈజిప్టు, టర్కీ, ట్రిపోలి, అరేబియాదేశపు మహమ్మదీయ ప్రజలకు, తత్ప్రభుత్వములకును ఇటలీవారిపై ద్వేషము హెచ్చి, యిరువదియవ శతాబ్దమున క్రూసేడ్సువంటి మతయుద్ధములను రగుల్కొలుపవచ్చును. మరియు బాల్కను రాష్ట్రములలో నెప్పటివలెనే విషమ పరిస్థితు లేర్పడుచున్నవి. దీనికిగూడ ఇటలీయే కారణమని చెప్పవచ్చును. పూర్వము టర్కీసామ్రాజ్యప్రభుత్వమువారు క్రైస్తవులును, నిస్సహాయులును నగు నీచిన్నచిన్న రాష్ట్రపు ప్రజలను బాధించుచుండిరనియు, అందుచేత నెప్పుడును హత్యలు, తిరుగుబాటులు సంభవించి అశాంతిని ప్రబలజేయుచుండెడివనియు టర్కీవారిపై నిందారోపణ కావింపబడుచుండెడిది. గత మహాసంగ్రామఫలితముగ జూగోస్లావియా (పూర్వపు సర్వియా) బల్గేరియా, రొమేనియా, ఆల్బేనియా దేశములకు టర్కీసంపర్కము నిశ్శేషముగ వదలిపోయినది. అయినను వారిలో వారికి అంతఃకలహములును, జాతి వైషమ్యములును అంతరించుటకు మారుగా హెచ్చు పెరిగినవి. ఇటలీవారు తమపలుకుబడిని ఏడ్రియాటిక్ సముద్రమున కావలివైపు ప్రదేశమున వృద్ధిచేసికొన సంకల్పించినట్లు వెల్లడియగుచున్నది. ఆల్బేనియావారిని, జూగోస్లావియావారిని బెదరించియు, వారిలో నొండొరులకు మిత్రభేదముచేసియు సముద్రతీరమున స్వస్థానములను కల్పించుకొనుటకు ఇటలీప్రభుత్వమువారు ఎత్తులు వేయుచున్నారు. అందుకుగాను కలవరములను గూడ ప్రేరేపుచున్నారు. ఇటీవల బల్గేరియా జూగోస్లావియా వారలకు కలిగిన భేదములను పురస్కరించుకొని బల్గేరియాపక్షము నవలంబించి జూగోస్లావియాదేశముపై ఇటలీవారు కయ్యమునకు కాలుదువ్వినారు. ఫ్రెంచివారు జూగోస్లావియావారితో అన్యోన్యసహాయార్థము ప్రత్యేకసంధి కావించుకొనినారు. వెంటనే ఇటలీవారు దానికి ప్రత్యుత్తరముగ ఆల్బేనియావారిని చేరదీసి వారితో సంధి జరపి లోకమునకు ప్రకటించినారు. ఇటలీవారి విజృంభణము ఫ్రెంచివారి కెంతమాత్రమును కిట్టుటలేదు. యుద్ధానంతరము ఫ్రెంచివారు సిరియారాష్ట్రమును, బ్రిటిషువారు మెసపొటేమియాదేశమును సంపాదించినరీతిని మాండేటుగా గ్రహించి తత్ప్రజలు ఘోరముగ తిరుగుబాటుచేసి పోరాడినను, తమ పశుబలమును ప్రయోగించి ఆ ప్రదేశమును తమవశము చేసికొనినారు. ఇందునుగురించి ఫ్రాంసువా రనిన ఇటలీవారికి మిక్కుటమగు నసూయ కలదు. అందుచేత ఇటలీవారు బ్రిటిషువారితో మైత్రి దినదినము వృద్ధిపరుచుకొనుచు, ఫ్రాంసు, ఇంగ్లండులకు భేదములు పొడసూపినచో సత్వరముగ బ్రిటిషువారిపక్ష మవలంబించుచున్నారు.

ఇక ఆఫ్రికావైపున స్పెయినుదేశ ప్రభుత్వము వారికి టాంగియర్ పట్టణమును (Tangier) తాము సంపా

దింపవలె ననియు, అక్కడనుండి యితరయిరోపీయులను వెడలగొట్టి తమప్రత్యేకపరిపాలనము నెలకొల్పవలెననియు నుద్దేశము కలదు; బ్రిటిషువారి యనుజ్ఞకై ప్రయత్నించు చున్నట్లు ప్రకటింపబడినది. టాంగియర్ పట్టణము జిబ్రా ల్టరుపట్టణమున కెదురుగ సముద్రమున కావలితీరమున ఆఫ్రికాఖండమున నున్నది. అట్లాంటిక్ మహాసముద్రమున కును, మధ్యధరాసముద్రమునకును జిబ్రాల్టరువలెనె మార్గద్వారమగుచు, ఆఫ్రికాఖండవర్తకవ్యాపారమునకు నిలయమై, మున్ముందు ప్రాముఖ్యమును బడయగలదు. కావున స్పెయినువారు అబ్దుల్ క్రిమ్ నాయకుని జయించి మొరాకోదేశమును వశపరచుకొనినను, తమకు రాక పోకల కనువగు అనువైన రేవుపట్టణము లేక బాధపడు చున్నారు. అయితే ఆఫ్రికాఖండవర్తకము నందరకును సమానమగు ఆసక్తి కలదు గావున టాంగియర్ పట్టణ మును యూరపుప్రభుత్వములవా రందరునుకలసి సమాన పుహక్కులు కలుగుటకేర్పరచుకొని న్యూట్రల్ పరిపాలన లోనికి దెచ్చినారు. స్పెయినువారు ఆఫ్రికాయందు విశే షించి ప్రబలులగుట ఫ్రాంసువారికి సుంతయును సరిపడదు. బ్రిటిషుమంత్రి ఛేంబర్లేనుగారితో స్పెయినునాయకుడు ప్రైమొ డివెరాగారు టాంగియర్ విషయమై ప్రస్తావించి రనియు, రహస్యపుటేర్పాటు జరుగుననియు వార్తాపత్రి కలో వ్రాయబడినది. ఈకుటిలప్రయత్నములవలన లాభ ముండకపోవుట యటుండ నూతనమనఃస్పర్ధలు బయల్దేరు ననుటకు సందియము లేదు.

మరియు, యూరపు మధ్యభాగపరిస్థితులను పరికించి నచో నచ్చటకూడ శాంతి భంగకరమగు సమస్యలు పొడ సూపుచున్న నని తెలియును. వర్సెల్సుసంధి విషయములో పెద్దప్రభుత్వములవారు ధర్మాధర్మ విచారణయు, దూరదృ ష్టియులేక కొన్ని అక్రమములను కావించి, తత్ఫలితముల నిప్పు డనుభవించుచున్నారు. ఓడిపోయిన జర్మనీవారిపై నష్టపరిహారములను విధించి రైన్లాండు ప్రదేశమును తామా క్రమించుకొనుటతో నూరకుండక, పూర్వపు జర్మనీసామ్రా జ్యముయొక్క తూర్పుభాగమైన పోలండుదేశమును వేరప రిచి ప్రత్యేకస్వతంత్రరాజ్యముగ సృష్టించియున్నారు. ఏక జాతిప్రభులకు నూతనముగ స్వేచ్ఛనిచ్చి పరాధీనతనుబాపి ప్రత్యేక స్వపరిపాలనమును ప్రసాదించుట స్వయంనిర్ణయ సూత్రముప్రకారము తప్పక యుక్తమే. కాని యీసంద ర్భములోగూడ నొకయక్రమము సరిహద్దుల విషయమున సంభవించినది. విల్నా (Vilna) పట్టణము యుద్ధారంభమున పోలండు కుత్తరముననున్న లిథూనియా రాష్ట్రమువారు అప్పటి రష్యాసామ్రాజ్యపు సహాయమున జర్మనీవారి నుండి వశపరుచుకొనియున్నారు. కాని యుద్ధానంతరము పోలండువారు విల్నానగరము తమకు సహజముగ చెంద వలెననియు, ఆవాస్తవ్యులు తమజాతివారనియు వాదించి బలాత్కారముగా తిరిగి తమ రాజ్యములో కలుపుకొని నారు. పోలండు స్వతంత్రించి చేసినదౌర్జన్యమునకు నానా జాతిసమితి యేమియు చేయజాలక మిన్నకుండుట తట స్థించినది. కాని లిథూనియావారికి ప్రస్తుతము సోవియటు వారు వెనుకనుండి సహాయు లగుచుండి పురికొల్పుటచే తిరిగి నేడీవిషయము పైకి వచ్చినది. పోలండును నానా జాతిసమితి వారింపనిచో నీస్వల్ప విషయము నాధారము చేసికొని రష్యా, పోలండుదేశముల మధ్య పోరాటము తప్పదు.

ఇక బ్రిటిషుప్రభుత్వమువారివిషయము చూడ వలసియున్నది. లేబరుపార్టీ పరిపాలనము పోయి, సంకుచి తాశయులును, ముఖ్యముగ సామ్రాజ్యవ్యాప్తియందు పట్టు దల గలిగి ప్రవర్తించువారును నగు కన్సర్వేటివుపార్టీ వారు తమపాలనమును ప్రారంభించి యిప్పటికి నాల్గుసంవత్సర ములు గతించినవి. వారు వచ్చినదిలగాయతు శాంతిపద్ధ తులను విడనాడి వైరపద్ధతుల ననుసరించుచు లోకనింద పా లగుచున్నారు. చీనాదేశములో చీటికిమాటికి జోక్య ము కలుగజేసికొనుచు, స్వార్థపరులై, నిర్దాక్షిణ్యముగ తమపశుబలమును ప్రదర్శించుచున్న విదేశీయు లందరి లోను మనబ్రిటిషుప్రభుత్వమువారే ముఖ్యులు. ప్రస్తుత సంక్షోభమునకును, నిరంతరకలహములకును వీరే కారకు లని వెల్లడి యగుచున్నది. రష్యను సోవియటు ప్రభుత్వ

ముతో లేబరుగవర్నమెంటువలన కుదుర్చబడిన మైత్రిని నిష్కారణముగ వీరు చెడగొట్టి, రష్యావాణిజ్యకార్యస్థానమగు ఆర్కాసుభవనమును ముట్టడించి, గర్భశత్రుత్వములోనికి దిగుచున్నారు. వీరియుభయులమధ్యను పోరాటము సంభవించినచో లోకవ్యాప్తమగు యుద్ధానలము ప్రజ్వలించితీరును. నానాజాతిసమితియొక్క శిక్షణకు వీరు లొంగుదురనుట కలలోనివార్త. ఆశియాఖండమందు బ్రిటిషువారి విశేషాధికారము నడంచుటకు సోవియటు ప్రభుత్వమువారు చీనాదేశములో జాతీయపక్షమువారికి ముఖ్యసహాయులుగ నుండుటయే కాక, పర్షియా ఆఫ్గనిస్థానము టర్కీదేశములతో ప్రత్యేకసంధులను చేసికొని, తమమంత్రులను, కార్యస్థానములను ఆయారాజధానులయందు నెలకొల్పి, విశేషవ్యాపారసంబంధములనుగూడ బడసి, మహాధికారమును సంపాదించుచున్నారు. నానాటికి బ్రిటిషువారికిని, రష్యావారికిని పోటీసందర్భములు చెలరేగుచున్నవి.

అన్నిదిశలను పరిస్థితులిట్లు విషమముగ పరిణమించుచుండ ఆయుధవిసర్జన ప్రయత్నముల తత్వమును గ్రహింపవలసి యున్నది. అమెరికావారికి సామ్రాజ్య కాంక్ష మిక్కుటము కాకపోయినను, ఐరోపాదేశీయులవలె క్రొత్తక్రొత్తప్రదేశములకై పెనగులాడు స్వభావము వారు కాకున్నను, తమ వ్యాపారబాహుళ్యమును బట్టి సముద్రాధికారమునకై పరితపించుచున్నారు. ఇప్పట్టున బ్రిటిషువారికిని, అమెరికావారికిని పోటీ హెచ్చగుచున్నది. కొన్ని శతాబ్దములనుండి బ్రిటిషువారు తమ సామ్రాజ్యము విస్తరించినకొలది నౌకాబలమునుగూడ వృద్ధిచేసికొని, సముద్రమార్గములయందు సర్వత్ర రేవుపట్టములను సంపాదించికొని, విరివిగా నౌకాశాలలను నిర్మించికొని, సముద్రములన్నింటిపైన సర్వాధికారమును చలాయించుచున్నారు. ఈసముద్రాధికారమే వారికి పూర్వయుద్ధములలో విజయమును సమకూర్చినది; యుద్ధములు లేనప్పుడు వాణిజ్యమును పెంపొందించి ఇంగ్లాండు దేశమునకు విశేషద్రవ్యలాభమును కలిగించినది. గత మహాసంగ్రామ సమయమున, సముద్రమంతయు తమకు వశముగావున, బ్రిటిషువారుజర్మనీదేశములోనికి సరకులెవ్వియు పోకుండ మార్గమునుగట్టివైచి వారినిలొంగదీసిరి. ఆ బ్లాకేడ్ (Blockade) మహాస్త్రము బ్రిటిషువారి కింకనుగలదు. నానాదేశ వాణిజ్యమునకు సముద్రయానము ముఖ్యసాధనముగావున అమెరికావారు బ్రిటిషువారి నిరంకుశత్వమును ధిక్కరించుచున్నారు. నౌకానియమము,ఆయుధవిసర్జనము ఇదమిత్థమని నిర్ణయించి, కట్టుబాట్ల ననుసరించి ప్రభుత్వములవారందరును ప్రవర్తించిన గాని లాభముండదు. ఈ నియమములను తేల్చుటకై అమెరికావారు దీక్షతో పదేపదే సభలను జరుపుచున్నారు. ఈవిషయములో జపానువారికి మంచినౌకాబలము కలదు గావునను, విశేషించి పసిఫిక్ మహాసముద్రమున వారిధాటి మిక్కుటమగుటను వారుకూడ ప్రధానవ్యక్తులు. నౌకానిర్మాణమును, ఆయుధసామగ్రిని తగ్గించుకొనుటకు వీరుముగ్గురును ఏకాభిప్రాయమునకు వచ్చినగాని లోకమునకు క్షేమముండదు. నౌకానిర్మాణమును తగ్గించుటకు అమెరికావలె నిశ్చితమనస్కులైనట్లు బ్రిటిషువారు కనుపట్టుటలేదు. ప్రపంచమందంతటను తమ సామ్రాజ్యదేశములు కలవనియును, వానిసంరక్షణబాధ్యత తమపై నున్నదనియును వారివాదము. యుద్ధమును పూర్తిగా బహిష్కరించుటకొరకును, లోకశాంతినిమిత్తమును యావన్మందియు నాయుధవిసర్జనమునకు గడంగుచుండగా, సామ్రాజ్యవిస్తృతినిబట్టి నౌకాబలమును, ఆయుధబలము నుండవలెననుట చెల్లదని అమెరికావారి యభిప్రాయము. గత జులై మాసమున జరగిన సమావేశము నిరర్థకమైనది. తిరిగి కొలదిదినములలో పైదేశములేకాక రష్యావారుగూడ సమావేశమునకు వచ్చి, పునరాలోచన ప్రారంభింతురని ప్రకటింపబడినది. గతసమావేశము విఫలమగుటకు కారణము బ్రిటిషుమంత్రియగు ఛేంబర్లేనుగారే యని స్పష్టపడినది. ఇంతవరకు నానాజాతిసమితిలో బ్రిటిషుమంత్రిపదవి నధిష్ఠించి, ప్రపంచశాంత్యుద్యమమున పేరుగాంచిన సెసిల్

ప్రభువుగారు పదవికి రాజీనామా నిచ్చి తమయాత్మ గౌరవమును గాపాడుకొనుటయే కాక లోకమునకు సత్యమును వెల్లడిచేసియున్నారు. ఛేంబర్లేనుగా రన్ననో, తమకు సామ్రాజ్యసంరక్షణయే ప్రధానమనియును, నానాజాతిసమితి వ్యవహారములు ఆదర్శము లనియును కొన్ని శుష్కవచనములను పలికియున్నారు. దీనిభావమేమన, బ్రిటిషువారు తమ సామ్రాజ్యాధిక్యమునకు ఏమాత్రము భంగము వచ్చునని తోచినను నానాజాతిసమితిని, యుద్ధ నివారణసూత్రమును లెక్కపెట్టరని విశదమగుచున్నది. కావుననే కోట్లకొలది ధనమును వెచ్చించుచు సింగపూరు నౌకాశ్రయమును అతిత్వరితముగా కట్టుచున్నారు. ఈచర్య అమెరికావారికిని, జపానువారికినిగూడ అసంతృప్తిని, కోపమును కలిగించుచున్నది. ముందు సమావేశమునందైన పెద్దప్రభుత్వములవారు త్యాగమస్కులై సద్భావముతో ఆయుధవిసర్జనమునుగురించి చర్చించి భావికార్య నిర్ణయమును బడసినచో లోకమంతయు ధన్యత గాంచును.

---

## తేటగీతి—అభినందనములు

దీపాల పిచ్చయ్యశాస్త్రి గారు

౧

తేటలంగి శార్దూలసమితి కానలను దూఱ-గుసిసిమత్తేభగణము దిక్కులకుఁ బఱవ
మత్తకోకిలకులము కొమ్మలనడంగఁ-గందములు దిక్కుమాలి యాకసముఁజేరఁ
జంపకోత్పలమాలలు తెంపువడఁగ-సీసము మఱింత మెత్తనై వాసిచెడఁగ
ఆటవెలఁదుల సౌభాగ్య మగడుపడఁగఁ-గవికుమారకులకుఁ బ్రీతిఁ గడలుకొలిపి
కావ్యసామ్రాజ్యపట్టంబుఁ గట్టికొనియె-నేఁటి కౌరార! చిన్నారి తేటగీతి.

౨

మలయమారుతపోతముల్ మలసినట్లు-సార మధురామృతము జాలువాఱినట్లు
చెదరి చదలేటితుంపురుల్ చిలికినట్లు-విరిసి విరితేనెవాఁక జొబ్బిలినయట్లు
పలుకుపలుకున భావంబు తొలకరింపఁ-జరణచరణంబునను రససరణి లొలయఁ
బదపదంబునఁ బ్రకృతిసౌభాగ్య మెనయఁ-బాదపాదంబునను బారవశ్య మెసఁగఁ
దెలుఁగునుడికారముల తీరుతియ్యములను-గమ్మకమ్మనిగీతగానమ్ము సలుపు
నవ్యకవిసంతతికి నభినందనములు.

---

# కవిరాజసూరి కాలనిర్ణయము

శ్రీమాన్ ఈయుణ్ణి వేంకటవీరరాఘవాచార్యులు గారు

"శ్లో. సుబన్ధుర్బాణభట్టశ్చ కవిరాజ ఇతి త్రయః, వక్రోక్తిమార్గనిపుణా శ్చతుర్థో విద్యతే నవా."

—రాఘవపాండవీయమ్. 1 స. 41 శ్లో.

## ౧. పీఠిక



ఏకవిరాజసూరి ధీ దీధితికౌశల్యముచే భారతరామాయణరాజీవము వికసించెనో, యేకవిరాజరసజ్ఞుఁడు రామాయణమార్ద్వీకమును, భారతమృద్వీకము నేకపాత్రమున సంయోజించి రసాస్వాదలోలుపములగు రసికమధువ్రతములకు నొసంగెనో, యేకవిరాజపండితుఁడు రామాయణరత్న భారతప్రవాళముల నేకసూత్రమున గ్రుచ్చి యామనోహరహారముచే గీర్వాణవాణీగ్రీవము నలంకరించెనో యట్టిసుగృహీతనాముని నామమాత్రస్మరణమున మనము చరితార్థుల మగుదుము.

ఈకవితల్లజునిఁ బుత్త్రునిఁగాఁ బడసిన పుణ్యాత్ము లెవరో తెలియుటలేదు. ఈకవిశిరోమణిజననముచే నేదేశము పూతమయ్యెనో, యీతని కైంకకాలికు లగు భాగ్య మెవరికిఁ గలిగెనో యించుక యరయుదము.

గీర్వాణసారస్వతమున 'వాసవదత్తా' రచయితయగు సుబంధు మహాకవియుఁ, 'గాదంబరీ' కావ్యనిర్మాతయగు భట్టబాణమహాకవియు శ్లేషకవితానిర్మాణదక్షులు ; ద్వ్యర్థికావ్యరచనా దక్షులు కవిరాజునకుఁ బూర్వ మెవ్వరును లేరు. ౧. "రాఘవపాండవీయము"ను రచించి కవిరాజు ద్వ్యర్థికావ్య నిర్మాణమునకు మార్గదర్శకుఁ డయ్యె. పిమ్మట నైఘంటుకధనంజయుఁడు (దశరూపక కారుని కంటె భిన్నుఁడు) ౨. రాఘవపాండవీయాపరనామముగల "ద్విసంధానమహాకావ్యము"ను రచించెను. పిమ్మటఁ గ్రీస్తుశకైకాదశశతాబ్దిలో 'సంధ్యాకరనన్ది' యనుకవి 3. "రామచరిత" మనుద్వ్యర్థి కావ్యమును రచించెను. (Edited by M. M. Haraprasada Sastri, M. A: "Memoirs of the Asiatic Society of Bengal", vol. III, p. 1). తరువాత హరదత్తసూరి (17 వ శతాబ్ది) ౪. "రాఘవనైషధీయ"మనుద్వ్యర్థికావ్యమును (Kavyamala Series-2 Sargas)రచించెను. "కమలినీకలహంస" "కావ్యదర్ప"ణాది గ్రంథనిర్మాతయగు 'రాజచూడామణి దీక్షితుఁడు' ౫. "రాఘవయాదవపాండవీయ" మను త్ర్యర్థికావ్యమును రచించెను. (Vide. Preface to 'Kamalini Kalahamsa', p. 5. Sri Vani Vilas Series, Srirangam).ఆంధ్రసారస్వతమున ౧. వేములవాడ భీమకవి "రాఘవపాండవీయ"మనుద్వ్యర్థికావ్యమును రచించినట్లును,నది పింగళిసూరనకుఁ బూర్వమే ఖిలమైనట్లును సూరనకృత రాఘవ పాండవీయమువలనఁ దెలియుచున్నది. (చూ. రాఘవపాండవీయ పీఠిక, ౫వపుట, 10,11 పం. వావిళ్ల వారిప్రతి.) ౨. అందుచే"నాంధ్రరాఘవపాండవీయ"నిర్మాతయే యాంధ్రద్వ్యర్థికావ్య నిర్మాణమార్గ ప్రథమపథికుఁడు (క్రీ. శ. 16 శతాబ్ది). తరువాత రామరాజభూషణుఁడు 3. "హరిశ్చంద్ర నలోపాఖ్యాన" మను ద్వ్యర్థి ప్రబంధమును రచించెను. పిమ్మటఁ గృష్ణాధ్వరి ౪. "నైషధపారిజాతీయ" మను నొకద్వ్యర్థికావ్యమును రచించెను. (చూ. గు. శ్రీరామమూర్తిగారి "కవిజీవితములు" ఆంధ్రద్వ్యర్థికావ్య కవులచరిత్ర, 25 పు. 1894). పిండిప్రోలు లక్ష్మణకవి (క్రీ. శ. 18 వ శతాబ్ది) ౫. రావణదమ్మీయము(లంకావిజయము)అను ద్వ్యర్థికావ్యమును రచించెను. ౬. క్రొత్తలంక మృత్యుంజయకవి (క్రీ. శ. 18 వ శతాబ్ది) "ధరాత్మజాపరిణయ" మను ద్వ్యర్థికావ్యమును నిర్మించెను. పిమ్మట బుక్కపట్టణము తిరుమల వేంకటాచార్యకవి పైప్రబంధ పద్ధతిని ౭. "అచలాత్మజాపరిణయ" మను ద్వ్యర్థికావ్యమును రచించెను. పోడూరి పెదరామకవి ౮. "శివరామాభ్యుదయ" మను ద్వ్యర్థికావ్యమును రచించెను. (చూ. 'ఆంధ్రకవులచరిత్ర' III భా). మంత్రిప్రగడ సూర్యప్రకాశకవి ౯."కృష్ణార్జునచరిత్ర"మను ద్వ్యర్థికావ్యమును రచించెను. శ్రీపాద వేంకటాచలకవి ("కౌసల్యాపరిణయ" కర్త; 19 వ శతాబ్ది) ౧౦. "రామకృష్ణోపాఖ్యాన"మను ద్వ్యర్థికావ్యమునురచించెను. ఆంధ్రత్ర్యర్థికావ్యరచనకు మొదంజవేసినవాఁడు మహోపాధ్యాయబిరుదాలంకృతుఁడగు నెలమూచి బాలసరస్వతి (17-వశతాబ్ది). ఇతఁడు ౧౧. "రాఘవయాదవపాండవీయ"మను మూడర్థములకావ్యమును నిర్మించెను. నెల్లూరి వీరరాఘవకవి (18-వ శతాబ్ది) ౧౨. "యాదవరాఘవపాండవీయ" మను నొక త్ర్యర్థికావ్యమును నిర్మించెను. ౧3. అయ్యగారి వీరభద్రకవి "రాఘవపాండవయాదవీయ" మనునొక త్ర్యర్థికావ్యమును రచించెను. ఓరుగంటి సోమశేఖరకవి రాఘవయాదవపాండవార్థముల నిచ్చు ౧౪. "రామకృష్ణార్జునరూపనారాయణీయ" మను నొక త్ర్యర్థికావ్యము నొనర్చెను. ౧౫. మఱియొకకవి"నలయాదవరాఘవపాండవీయ" మను చతురర్థికావ్యమును నిర్మించినట్లు తెలియుచున్నది.

(చూ. 'కవిజీవితములు' ఆంధ్రద్వ్యర్థి కావ్యకవుల చరిత్రము-పుట. 42.) గీర్వాణాంధ్ర ద్వ్యర్థి త్ర్యర్థి చతురర్థి కావ్యవిషయము నింతటితో విరమించి లేఖినిని బ్రసంగాంతరచర్చకు మరల్చెదము.

## ౨. కవిరాజసూరి కాలనిర్ణయము

కవిరాజు కాలనిర్ణయచర్చకుఁ బూర్వము, ప్రాచ్యపాశ్చాత్యవిద్వాంసు లీవిషయమున నొసంగిన యభిమతముల విమర్శింతము.

1. విద్వచ్ఛిరోమణియగు "మెక్‌డానెల్" మహాశయుఁడు స్వవిరచిత 'గీర్వాణసారస్వత చరిత్రము'న నిట్లు వ్రాసి యున్నాఁడు:

"The culmination of artificiality is attained by the 'Raghavapandaviya', a poem composed by Kaviraja, who perhaps flourished about A. D. 800." (Dr. A. A. Macdonell's 'History of Sanskrit Literature, p. 331.)

2. 'డఫ్'పండితునియభిప్రాయము: (As given by Sriman M. Krishnamachariar in his 'History of Skt. Literature'):—

"Dr. Duff's 'Chronology' makes Sruta-kirti the author of the poem, whose name is mentioned in an inscription dated 1130 A. D. In that case, the poem must be assigned to about the 10th or 11th century".

3. శ్రీమాన్ కృష్ణమాచార్యులగారి యభిమతము:— "The poet's (Kaviraja's) history is utterly in the dark; but he appears to have flourished about the beginning of the 9th century." ('History of Skt. Literature', p. 41, by Dr. M. Krishnamacharya, M. A., M. L., Ph. D., M. R.A. S.)

4. పండిత మాధవదాసచక్రవర్తి సాంఖ్యతీర్థునియభిమతము:—

"Kaviraja, the author of 'Raghavapandaviya' flourished at about 800 A. D." ('A Short History of Skt. Lit., p. 141, by Prof. Madhabdas Chakravarty' M. A., Sankhya-tirtha.)

5. పండిత "కీత్" మహాశయుని యభిప్రాయము:— "The ultimate result of the love of playing with language which marks both Bharavi & Magha is seen in the 'Raghavapandaviya' of Kaviraja, which is most probably to be dated under the Kadamba Kamadeva about A. D. 1190, though it has been ascribed to the nineth century." (Dr. A. B. Keith's "Classical Skt. Literature, p. 56.)

6. శ్రీమత్పండిత పరవస్తు వేంకటరామానుజస్వామివారి యభిమతము:— "As Vamana who belongs to the 8th Century A.C., refers to Kaviraja—'Kavyalankara-sutrani, IV Adhikarana, i Adhyaya, 10th Sutra— he must have flourished in the 7th in the cy. A. C."

'కవిరాజు' కవియొక్క బిరుదము గాని కవినామము కాదు. ఇట్లు బిరుదములచేతనే కొందఱుకవులు వ్యవహరింపఁబడుట సుప్రసిద్ధము. ఉ. 'భవభూతి' కవిబిరుదము; కవినామము 'శ్రీకంఠుఁడు'. 'రసగంగాధర' 'మనోరమాకుచమర్దన' నాదిగ్రంథరచయిత యగు జగన్నాథపండితుఁడు బిరుదనామమగు 'పండితరాయ' పదబంధము చేతనే వ్యవహరింపఁబడుచున్నాఁడు. కవిరాజసూరి నామము మృగ్యము. కావ్యాంతమునందలి (XIII, 62 శ్లో.) చక్రబంధమునఁ గూడ "కవిరాజకావ్య" మనియే వ్రాయఁబడియున్నది.

'కవిరాజ' బిరుదాలంకృతులగు కవుల పరిచయము.—

(1) క్రీ. శ. 4-వ శతకమున రాజ్యపాలన మొనర్చిన సముద్రగుప్తునకుఁ గవిరాజబిరుదము గలదు.

"Samudragupta, we learn, was a poet himself whose title of 'King of Poets' (Kaviraja)—later the style of poet laureate awarded to successful writers—was established by the composition of many poems worthy of imitation by the learned, who was master of a poetic style worthy of study, and who enriched by his efforts the spiritual treasures of the poets.") (Dr. A. B. Keith's 'Classical Skt. Literature,' p. 28.

(2) 'కర్ణభూషణ' మను నలంకారగ్రంథకారుఁడగు గంగానందునికిఁ గూడఁ 'గవిరాజ' బిరుదము గలదు.

(3) 'బాలరామాయణ' 'కావ్యమీమాంస' సాది గ్రంథనిర్మాత యగు రాజశేఖరమహాకవిగూడఁ 'గవిరాజ' బిరుదాలంకృతుఁడు. ఇతఁడు 'కర్పూరమంజరి' ప్రస్తావనలోఁ దనసమకాలికులగు 'మృగాంకలేఖా కథాకారాపరాజితకవులు' తన్ను నుతించినట్లుగా "బాలకవిః కవిరాజో నిర్భయరాజస్య తథోపాధ్యాయః" అని చెప్పికొనెను.

రాజశేఖరుఁడు 'కావ్యమీమాంసా' గ్రంథమున (పుట 9) దశవిధకవులను నిర్వచించుచు, "దశ చ కవే రవస్థా భవన్తి, తత్ర చ బుద్ధిమదాహార్య బుద్ధ్యో స్సప్త, తిస్రశ్చ ఔపదేశికస్య. తద్యథా: 1. కావ్యవిద్యాస్నాతకః; 2. హృదయకవిః; 3. అన్యాపదేశీ; 4. సేవితా; 5. ఘటమానః; 6. మహాకవిః; 7. కవిరాజః; 8. ఆవేశికః; 9. అవిచ్ఛేదీ; 10. సంక్రామయితా చ. ... ... ... యోఽన్యతరప్రబంధే ప్రవీణః స మహాకవిః; యస్తు తత్ర తత్ర భాషావిశేషే తేషు ప్రబన్ధేషు తస్మిం స్తస్మింశ్చ రసే స్వతంత్రః స కవిరాజః" అని వ్రాసి యున్నాఁడు. ఇందు దశవిధకవులలో నాఱవవాఁడు మహాకవి; ఏడవవాఁడు కవిరాజు. నానాభాషాప్రవీణుఁడు, నానావిధప్రబంధప్రణేత, రసభావనిరంతరకవితాదక్షుఁడే 'కవిరాజ' బిరుదార్హుఁడు. కవిరాజు మహాకవికంటె నధికతరుఁడు.

(4) వంగదేశాధీశుఁడగు బల్లాలసేనసూనుఁడగు లక్ష్మణసేనుని సభాలంకారభూతుఁడును, "పవనదూత" కావ్యనిర్మాతయు నగు

'ధోయీకవి'కిఁ గూడఁ గవిరాజబిరుదము గలదు. 'పవనదూత' కావ్యాంతమునందలి గద్య: "ఇతి శ్రీధోయీకవిరాజవిరచితం పవనదూతాఖ్యం కావ్యం సమాప్తమ్."

"శ్లో. దన్తివ్యూహం కనకలతికాం చామరం హైమదణ్డం
యో గౌడేన్ద్రా ద్దలభత కవిక్ష్మాభృతాం చక్రవర్తీ;
శ్రీధోయీకః సకలరసికప్రీతిహేతో ర్మనస్వీ
కావ్యం సారస్వతమివ మహామన్త్ర మేత జ్జగాద."

—పవనదూతమ్, 101 శ్లో.

"శ్లో. × × × యావ ద్రాధారమణతరుణీకేలిసాక్షీకదమ్బ
స్తావ జ్జీయా త్కవినరపతే రేష వాచాం విలాసః."

—పవనదూతమ్. 103 శ్లో.

ఈ గ్రాంథికోదాహరణములవలన 'ధోయీ' కవిరాజ బిరుదాంచితుఁడని సుస్పష్ట మగుచున్నది. మఱియు జయదేవమహాకవి నిజ 'గీతగోవింద' కావ్యమున నిట్లు వ్రాసియుండెను. (I-4):—

"శ్లో. వాచః పల్లవ యు త్యుమాపతిధరః సంధర్భశుద్ధిం గిరాం
జానీతే జయదేవ ఏవ శరణ శ్లాఘ్యో దురూహద్రుతేః;
శృంగారోత్తరసత్ప్రమేయరచనై రాచార్య గోవర్ధన
స్పర్ధీ కోఽపి న విశ్రుత శ్శ్రుతిధరో 'ధోయీ' కవిక్ష్మాపతిః."

ఈశ్లోకమున జయదేవుఁడు తన సమకాలీనకవుల నుల్లేఖించి యున్నాఁడు. ఈశ్లోకమువలనఁ గూడ ధోయీ కవిరాజబిరుదాలంకృతుఁడని తెలియుచున్నది. ఇంతియ కాక, లక్ష్మణసేనుని సభాభవన ద్వారమందున్న శిలాశాసనమునందును—

"శ్లో. గోవర్ధనశ్చ శరణో జయదేవ ఉమాపతిః,
కవిరాజశ్చ రత్నాని సమితౌ లక్ష్మణస్య చ."

అనుశ్లోకము వ్రాయఁబడియున్నట్లు తెలియుచున్నది. దీనివలనఁగూడ ధోయీ కవిరాజబిరుదాంచితుఁడని తెలియుచున్నది. లక్ష్మణసేనుఁడు క్రీ. శ. 12-వ శతాబ్దిలో రాజ్యపాలన మొనర్చుటచే, ధోయీకవిగూడ నాకాలముననే యుండినట్లు నిశ్చితము. రాజశేఖరస్తుత్యుఁడగు కవిరాజు ధోయీకవిరాజుకంటె భిన్నుఁడుఁ, బూర్వుఁడు నని తెలియునది. ఏలన, రాజశేఖర మహాకవి నిశ్చితకాలము క్రీ. శ. 880—920; కాని ధోయీకవిరాజు క్రీ. శ. 12 వ శతకములోనివాఁడు.

(5) 'సాహిత్యదర్పణ' కారుఁడగు విశ్వనాథునకుఁ గూడఁ గవిరాజబిరుదము గలదు. (క్రీ. శ. 14 వ శతాబ్ది.)

కాని రాఘవపాండవీయకారుఁడగు కవిరాజువలెఁ బైఁ జెప్పిన సముద్రగుప్త, గంగానన్ద, రాజశేఖర, ధోయీ, విశ్వనాథులలో నెవ్వరును కేవలబిరుదముచే వ్యవహరింపఁబడుట లేదు. ధోయీకవియైనను బూర్వోదాహృత శ్లోకములలోఁ దప్ప, కవిరాజని వ్యవహరింపఁబడుట లేదు. అందుచే వ్యస్తముగాఁ 'గవిరా' జనిన రాఘవపాండవీయకారుఁడేఁ సూచితుఁడు.

ఇఁకఁ గవిరాజ కాలసమాలోచనము చేయుదము.—

(1) క్రీ. శ. 8 వ శతాబ్దోత్తరభాగమునఁ గాశ్మీర దేశాధీశుఁడగు జయాపీడుని యాస్థానమున నుండిన వామనపండితుఁడు తన 'కావ్యాలంకారసూత్రవృత్తి' లోఁ గవిరాజనామముగల శ్లోకము నుదాహరించెను:

"పాదానుప్రాసః పాదయమకవత్. యే పాదయమకస్య భేదాస్తే పాదానుప్రాస స్యేత్యర్థః. తేషా ముదాహరణాని యథా:

"శ్లో. కవిరాజ మవిజ్ఞాయ కుతః కావ్యక్రియాదరః
కవిరాజం చ విజ్ఞాయ కుతః కావ్యక్రియాదరః."

—(IV అధికరణము, i అధ్యాయము, 10 సూ.)

అందుచేఁ గవిరాజు సప్తమశతకోత్తరభాగమున, నష్టమశతక ప్రథమపాదమునను జీవించియుండెనని నిశ్చయింపనగును. (క్రీ. శ. 650—725.)

(2) రాజశేఖరమహాకవి 'బాలరామాయణ' ప్రస్తావనలోఁ గవిరాజును సూచించియున్నాఁడు:

"శ్లో. స మూర్తో యత్రాసీ ద్గుణగణ ఇ వాకాలజలద
స్సురానన్ద స్సోఽపి శ్రవణపుటపేయేన వచసా;
న చాన్యే గణ్యన్తే తరళకవిరాజప్రభృతయో
మహాభాగ స్తస్మి న్నయ మజని యా యా వరకులే."

—బాలరామాయణము, I అఙ్కము, 13 శ్లో.

ఈశ్లోకమున రాఘవపాండవీయప్రణేతయే కవిరాజశబ్దసూచితుఁడు. రాజశేఖరుఁడు 880—920 నడుమ జీవించియుండుటచేఁ గవిరాజు నవమశతకమునకుఁ బూర్వుఁడని తేలుచున్నది. పూర్వోక్త వామనపండితుని సూచనచేఁ గవిరాజు 650—725 నడుమ జీవించి యుండినట్లు నిర్ణీత మగుచున్నది.

(3) ఇఁక గ్రంథస్థనిదర్శనము విమర్శించెదము.—

రాఘవపాండవీయాన్తిమగద్య— "ఇతి శ్రీహాలధరణీ ప్రసూత కాదమ్బకులతిలక చక్రవర్తి వీరశ్రీ కామదేవ ప్రోత్సాహిత కవిరాజ పండిత విరచితే రాఘవపాండవీయే మహాకావ్యే కామదేవాఙ్కే రావణదుర్యోధనవధ, శ్రీరామయుధిష్ఠిరాభిషేకో నామ త్రయోదశ స్సర్గః."

అని యున్నది. దీనివలనఁ గాదంబకులతిలకుఁడగు వీరకామదేవుని ప్రోత్సాహముచేఁ గవిరాజు రాఘవపాండవీయమును రచించెనని తెలియుచున్నది. వీరకామదేవుని దేశకాలములు తెలియుటలేదు. అందుచేఁ గవిరాజసూరి దేశకాలములుగూడ నజ్ఞాతము లయ్యెను.

"శ్లో. సుబంధు ర్బాణభట్టశ్చ కవిరాజ ఇతి త్రయః;
వక్రోక్తిమార్గనిపుణా శ్చతుర్థో విద్యతే నవా."

—రాఘవపాం. I-41.

అను నీశ్లోకమునఁ గవిరాజు సుబంధుభట్టబాణులును, దానును వక్రోక్తికవితారచనమున దక్షులనియు, నీక వక్రోక్తికవితానిర్మాతలు లేరనియు ఘంటాఘోషమున నుద్ఘోషించెను. ఈశ్లోకమువలన భట్టబాణుఁడు (590—650) కవిరాజుకంటెఁ బూర్వుఁడని తెలియుచున్నది. కవిరాజు పూర్వోక్తకవిత్రయముకంటె శ్లేషకవితానిపుణులు లేరని కంఠోక్తిగా వక్కాణించుటంజేసి, శ్లేషకవితానిర్మాణమున సిద్ధహస్తుఁడు రాఘవపాండవీయాపరనామముగల "ద్విసంధానమహాకావ్య" మును రచించిన ధనంజయమహాకవికంటెఁ 'గవిరాజు' పూర్వుఁడని తెలియుచున్నది. ద్విసంధానమహాకావ్యనిర్మాత యగు ధనంజయుఁడు (దశరూపక కారునికంటె భిన్నుఁడుఁ, బూర్వుఁడు) రాజశేఖర మహాకవికంటెఁ బూర్వుఁడని యీక్రింది 'ద్విసంధానపీఠిక' వలనఁ దెలియుచున్నది:

"884 క్రిస్తాబ్దపర్యన్తం కాశ్మీరా న్పాలయితు రవన్తి వర్మణః సమకాలీనయో ర్ధ్వన్యాలోకనిర్మాయకానన్దవర్ధన, హర్షచరిత మహాకావ్యరచయితృ రత్నాకరయో స్తావకస్య, 959 క్రిస్తాబ్దరచిత యశస్తిలక చంపూనిర్మాతృ జైనసోమదేవేన స్తుతస్య, బాలరామాయణాద్యనేకనిర్మాతృ రాజశేఖరస్య నామ్నా జల్హణాదిసంగృహీత 'సూక్తిముక్తావళ్యాదిషు లిఖితేషు' ప్రాచీనకవి వర్ణనశ్లోకేషు (సూక్తిముక్తావళి సుభాషితహారావల్యోః)

'శ్లో. ద్విసంధానే నిపుణతాం సతాం చక్రే ధనంజయః,
యయా జాతం ఫలం తస్య స తాం చక్రే ధనంజయః.'

ఇ త్యుపలభ్యమానత్వేన 'రాజశేఖరకవేః ప్రాచీనో ధనంజయకవి రాసీత్' ఇతి."

'కవిరాజు శ్లేషకవితానిపుణులను మాత్రమే యుదాహరించెను గాని, సామాన్యులగు శ్లేషకవుల నుదాహరింప లేదు. అందుచేఁ బూర్వోక్తరాఘవపాండవీయ శ్లోకము (I స. 41 శ్లో.) కవిరాజధనంజయ పౌర్వాపర్యద్యోతకము కాఁజాల' దని కొందఱియభిమతము. ధనంజయ మహాకవి కవిరాజుకంటె నేవిషయమునను దీసిపోవువాఁడు కాఁడు.

"శ్లో. ప్రమాణ మకలంకస్య పూజ్యపాదస్య లక్షణం
ద్విసంధానకవేః కావ్యం రత్నత్రయ మపశ్చిమమ్."

—ధనంజయనిఘంటువు, II–48 శ్లో.

ఈశ్లోకమువలన నకలంక భట్టారకుని న్యాయశాస్త్రమును, బూజ్యపాదుఁడను దేవనన్దియొక్క వ్యాకరణమును, ద్విసంధానకవి యగు ధనంజయుని రాఘవపాండవీయమును 'ద్విసంధాన' కావ్యమును నసదృశరత్నత్రయమని విశద మగుచున్నది.

"శ్లో. జాతే జగతి వాల్మీకౌ శబ్దః కవి రితి స్మృతః;
కవీ ఇతి తతో వ్యాసే కవయ శ్చేతి దణ్డిని.
కవయః కవయ శ్చేతి బహుత్వం దూర మాగతమ్;
వినివృత్తం చిరా దేత త్కవౌ జాతే ధనంజయే."

—ధనంజయనిఘంటువు, II–49, 50 శ్లో.

స్థలసంకోచముచే నీశ్లోకము లవివృతములు. ఈశ్లోకములవలన ధనంజ యుఁ డుత్తమకవిశిరోమణి యని విశద మగుచున్నది. 'ఈశ్లోకములు ధనంజయుఁడు స్వకుచమర్దనప్రియత్వముచేఁ జెప్పినవి గాని యితరు లెవరును ధనంజయు నిట్లు స్తుతింప లే' దని వీనిని గొందఱు నిరసించినను, ద్విసంధానకావ్యరత్నము నవలోకించిన ధనంజయకవి యసదృశప్రజ్ఞావైభవము తెల్లమగును. కవిరాజు ధనంజయునికంటెఁ బూర్వుఁ డైననో, నీతఁడు కవిరాజు నేల యుదాహరింప లేదనిన, 'ద్విసంధానము'లో ధనంజయుఁడు పూర్వకవిస్మరణము చేయమియే దీనికి హేతువు.

Prof. A. B. Keith opines in his 'Classical Sanskrit Literature,' p. 56. footnote: "A work of the same title (ie., Raghavapandaviya) by Dhanamjaya is mentioned by a Rajasekhara, and the date of it is dubious."

ఇట్లు పండిత "కీత్"మహాశయుఁడు వ్రాసియున్నాఁడు. కాని పూర్వవిమర్శితాంశములఁబట్టి ధనంజయుని, నతని రాఘవపాండవీయమును సూచించినరాజశేఖరుఁడు బాలరామాయణాదిగ్రంథకర్తయేయనియు, నీధనంజయుఁడు కవిరాజునకుఁ బరమునను, రాజశేఖరునకుఁ బూర్వమునను నుండినవాఁడనియు స్పష్టమగుచున్నది. పూర్వోద్ధృత శ్లోకములలో, "కవయ శ్చేతి దండిని"; "కవయః కవయ శ్చేతి బహుత్వం దూర మాగతం:" ........అనుటచే (6 వ శతాబ్దిలోనుండిన) దండ్యాచార్యునకుఁ బిమ్మటఁ జాలకాలమునకు ధనంజయుఁ డుండినట్లు తెలియుచున్నది. అందుచే ధనంజయుఁ డష్టమశతకోత్తరార్ధమున (750—800 A. D. )నుండిన ట్లూహింపనగును.

ఇంతవఱకుఁ దేలిన సారాంశము: కవిరాజు క్రీ.శ. 650—725 నడుమ నుండె నన సత్యదూరము గాదు. అందుచేఁ గవిరాజు క్రీ.శ. 725 వ వత్సరమునకుఁ బరమున నుండె నను టెరిడేల్, కీత్ మొదలగు విద్వాంసుల యభిమతము లన్నియు నళీకవాదము లగుటంజేసి నిరస్తములని సత్యాన్వేషణపరాయణుఁడనై మనవి చేయుచున్నాను.



శ్రీ సి. సుబ్బలక్ష్మిగారు, బి. ఏ.,



శ్రీ ఆర్. కృష్ణాబాయిగారు, బి. ఏ., యల్. టి.



శ్రీ మిస్. పి. పారిజాతంగారు



శ్రీ శకుంతలా కన్యగారు, యం. ఏ.,

శ్రీ డాక్టరు హెచ్. యం. లాజరస్‌గారు, యఫ్. ఆర్. సి. యస్.



శ్రీ సీతా దేవదాసుకన్యగారు



శ్రీ ఇంద్రాణి బాలసుబ్రహ్మణ్యంగారు



శ్రీ లలితగారు



౧౯౩౭ సం. చెన్నపుర విశ్వవిద్యాలయ
పట్టభద్రలు



# తృణకణములు

సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి గారు



౧

ప్రగతిఁగల సర్వజంగమ స్థావరములు-నాదుజన్మలమూర్తులై నాకుఁ దోఁచుఁ
దారకలు దేవ! నీకృపాధార సిద్ధిఁ-గొన్న సిద్ధులమూర్తులై చెన్ను మెఱయు.

౨

కడలికరుడులగమి నాదుఃకలుషములకుఁ బ్రతికృతులటంచు ఫేనాకురముల వ్రాసి
నాకుఁ జూపుచునున్నా వనేకగతుల-దేవ! తత్ప్రతీకార మర్థింతు నిన్నె.

౩

మూఢపశుజన్మఁ దప్పించి పూర్ణకృపను-దేవ! నరజన్మమును బ్రసాదించినావు
కాని తొలిజన్మధర్మ మేకారణమున-న్యాయ్యపరివర్తనంబుఁ జేయవు? మహాత్మ!

౪

నిన్ను సాక్షాత్తుగాఁ గాంచ నేరనట్టి-మాదృశులను ననుగ్రహింపంగఁ దలఁచి
పుడమిపైనిఁ బుణ్యక్షేత్రములమిషమునఁ-దావకకటాక్షముల నిల్పినావె? దేవ!

౫

నిను జపించుచుఁ గూర్చుండ నిశ్చలముగ-నన్యసంకల్ప పక్షిచయంబు వచ్చి
వ్రాలునాదగు చిత్తంబుపైని; విసరి-చూడ్కి యొడిసెలగమి వెలార్చుము మహాత్మ!

౬

కడఁగి యెప్పటికప్పుడే కడిగి తుడుచు-చున్నఁ బైనుండి రాలుచునుండె దుమ్ము
నామనోదర్పణంబున నాథ! కప్పు-మా! భవత్కృపాచ్ఛాదనాంబరము దాన.

౭

పుడమి నాజీవితం బొక ముఱికికాల్వఁ-జేసె యెల్లకల్మషరాశి చేర నిందుఁ
బెక్కుతూముల నిర్మించి పెట్టి తేల?-పంటకాల్వగ దాని మార్పఁదగు దేవ!

౮

నీమహాశక్తి శైవాలినీఝరంబు-కొండపయినుండివలె జీవకోటిపయినిఁ
బడుచు సర్వతోముఖముగాఁ బాఱుచుండి-క్షితినిఁ గళ్యాణవంతంబుఁ జేయు దేవ

౯

కేలు లేదు, గ్రహింతువు; కాలు లేదు-పఱతు; కన్ను లేదు కనుదు; మఱియు వీను
లేదు వినుదు నీచరితముల్ దేవ! భువిని-నశ్రుతచరంబులును నద్భుతావహములు.

౧౦

నిను సమీపింపఁగావలెనని యనంత-కాలములనుండి యత్నింతు గాఢముగను
దేవ! కకుబంతరేఖమాడ్కిఁగ దవ్వు-దవ్వులకుఁ బాఱు నిన్నెట్లు దగ్గఱింతు?

౧౧

కన్నుఁ దెలిదమ్ములును మనఃకైరవంబు,-నడుగుఁదామరదోయియు, హస్తకోక
నదము లివ్వన్ని కలిపి దండగను గ్రుచ్చి-తండ్రి! నీకు సమర్పింపఁ దలఁచినాఁడ!

౧౨

నాదు పిల్లనగ్రోవిని నూఁది దేవ!-తావకాలయమంటపస్తంభములను
జిగురువెట్టంగ నొనరించి శీతలమగు-కాయమానంబు నిర్మింతు హాయి నింతు.

౧౩

ధాటి నాపైపునకుఁ బాఱు త్వత్కృపాత-రంగిణికి దేవ! నాదు ప్రారబ్ధకర్మ
పర్వతంబయి యాతంకపఱప నకట!-తప్పుకొని ప్రక్క-వాటుగా దాఁటిపోమె. దేవ!

౧౪

తావకపదాంబురుహసన్నిధానమందు-మోఁకఱిలియుంటిఁ గేల్దోయి మోడ్చి
త్వత్కటాక్ష పుష్పాక్షతల్ దయ దలిర్పఁ-జల్లి దీవింతువన్న యాశను వహించి.

౧౫

ప్రభుఁడవా? లోకములకు, సేవకుఁడవా? త్వ-దీయసత్యపథంబును దెలియకుంటిఁ
బ్రభుఁడవేనిఁ ద్రిప్పుము సుమార్గమునకు మము-సేవకుఁడవేని మాయాజ్ఞ సేయుమయ్య!

౧౬

పువ్వులకు దివ్యతరఫలంబుల నొసంగు-దొక్క-తృణము సమర్పింపఁ బెక్కు-కోట్ల
ధనము లిత్తువు; నీయంగడిని లభించు-రాగిపైసకు రతనాలరాసి దేవ!

౧౭

మామకకటాక్ష భూషణమాలికలను-లలితముగఁ దావకాంగం బలంకరించి
చిత్తపీఠంబుపైని నాసీనుఁజేసి - నినుగుఱించి గీతములు పాడుకొనుదు దేవ!

౧౮

నాదుజీవితగాథ లెన్నటివి నాఁడె - తెలుపుచుంటి నాగాన* తంత్రిలతమీఁద
సత్యవశ్యంబులగు ననేకాంశములకు-నోయి! ప్రత్యుత్తరముఁ గోరుచున్నవాఁడ.

౧౯

ఓసి పుష్పాంజలీ! నీయొకొక్క-పువ్వు-నాకు నొక్కొక్క-దూతవై నాదుహృదయ
వేదనలు సహస్రముఖాల వెల్లడించి-దేవదేవుని కృపను సాధింపఁబొమ్ము.

* Coire.

౨౦

నిన్నుఁగన నాకు నిపుడున్న కన్నుదోయి-చాలదనియందువా? యట్లు చాలకున్నఁ
జాలినట్టివి కల్పింపఁజాలవే? యె-దో? నెపము వెట్టి తప్పించుదువు మొగంబు.

౨౧

నను భవత్పరిచారక జనమునందు-నెలమిఁ గడవానిఁ గానైన నిలువనిమ్ము
నిత్యమును నీదు దివ్యమందిరము నూడ్చి-కొలుచుచుందును నెల్ల వేళలను దేవ !

౨౨

నాదువదన ధారాంబుయంత్రంబునుండి-సకలకాలంబు పీయూషసదృశమైన
కవనపూరంబు ప్రవహింపఁగా నొనర్చి-దాన నిన్నభిషేకింతుఁ దలఁచు దేవ !

౨౩

పద్మముల్ గావు నీపాదముల్ నామనో-భ్రమరంబునకుఁ జంపకములుగాని
వనజారి గాదు నీవదనంబు నానేత్ర-కువలయద్వయికిని సవితగాని
సుమవృష్టి గాదు నీచూడ్కులనుండి నా-పయి వ్రాలునది బాణపటలిగాని
అమృతంబు గాదు నీహాసచంద్రిక నన్నుఁ-గనువేళఁ బెనువిషాకరము గాని
అభయదముగాదు నీదైన హస్తశాఖ-కరుణ మాలి నన్ జళిపించు కత్తిగాని
యిట్టి విపరీతరూపంబు నీవు దాల్పఁ-గటకటా! దేవ! నాపాపకర్మమేమి?

౨౪

బాలరంభాస్తంభజాల సౌభాగ్యంబు-మొత్తంబుగాఁ బోఁతపోసినట్లు
కమనీయ మల్లికాసుమ పరీమళ రేఖ-గాఢంబుగా గడ్డకట్టినట్లు
మానిత హైయంగవీనమార్దవభూతిఁ-జెన్నొందఁగాఁ బ్రోగు సేసినట్లు
సలలితమాకంద ఫలరససంపత్తి-పెల్చననాకృతిఁ దాల్చినట్లు
ముగ్ధమధురంబునౌ జగన్మోహనంబు-శాంతిసంబద్ధమగు భవచ్చారురూప
మకట! నాదురదృష్టవీచికలు గప్పి కానఁబడకుండఁ జేసె; నాగతి యిఁకేమి?

౨౫

ఒకసారి బర్హిశాబకములతోఁగూడి-యందంబుగా లాస్య మాడినట్లు
ఒకతేపఁ జంద్రచంద్రికలమవ్వంబును-నవ్వంగఁ గిలకిల నవ్వినట్లు
ఒకమారు మబ్బులందున్న చంద్రకళనా-నడరుచు దోబూచులాడునట్లు
ఒకసారి మందానిలోదయం బైనట్టి-వేళవాహ్యాళికిఁ బిలిచినట్లు
దాఁగిమూఁతల నాడుచు దాఁగినట్లు-చిలుకపలుకులతో నన్నుఁ బిలిచినట్లు
గుసగుసలు వల్కఁ జెవిచెంతఁ గూరుచున్న-యట్లు నాసామి నాసఖుం డాత్మఁదోఁచు.

# కవిత్వముయొక్క విలువ

కవికొండల వేంకటరావు గారు

కవిత్వముయొక్క విలువను రూపాయలణాల పైసలలో మన మెన్నటికిని లెక్కింపనేరము. అది ధనధాన్యములు, భూములు, బంగారు, వెండి మున్నగునవి కలవానికివోలె, తనస్వామికి ధనము చేకూర్చునంతనే విలువ కలదని మనము పరిగణింప వలనుపడదు. బమ్మెరపోతనామాత్యుఁడు తనభాగవతమువలన నెంతధన మార్జించెనని తెలపోయనగును? వాల్మీకి తన రామాయణమువలన చక్రవర్తిసిరి ననుభవించెనని యూహింపజెల్లునా? కాదు, కాదు. కలిమికిని కావ్యములకును చాలదవ్వు. దానివిలువ యొకమనఃస్థాయి. సత్యము, అహింస, శౌచము, శాంతి, ఇంద్రియనిగ్రహము మున్నగున వెట్టివో, యట్టి యొకానొక యమూల్యమానసికతత్త్వము కవిత్వము. అది మనము లేదన్నను మనస్సునకు దట్టుచునేయుండు. మన కెందులకనుకొన్నను డెందంబున కందళించుచునేయుండు. మనము నేర్వకున్నను నేర్చినట్లు లొక్కొక్కతరి స్ఫురించు. ఆ స్వయంసపన్నతయే దానివిలువ-దానికలిమి.

ప్రతివాడును రామాయణము బాగున్నదని నిరతము దానినే పఠించునా? ఇతరపనులు చక్క జూచుకొనడా? ప్రతివాడును భారతము చక్కని కథామంజరి యని అనవరతము దానిని చేతబట్టి తిరుగాడునా? తిరుగడు. మనము చదువుదు మొకానొకప్పుడు; అది మనమనస్సునకు వేఱొకప్పుడు సామాన్యజీవితమునందు సంస్మృతికి దట్టుచు సాక్షాత్కరించు. మనకు దానియగత్య మగుపించు. మనకు సహజముగ గల కవిత్వస్వభావము నయ్యది గట్టిపఱిచి, మనకు సమయమునకు ప్రబోధ మిడుచుండు; మనదృక్పథమును మార్చు. అంతక్రీత మొకవిధముగ జూచులోకమునందు, లోకులవర్తనమునందు నొకానొక క్రొత్తయర్థమును మనము గ్రహించుచుందుము.

ఎట్లు? మనము సూర్యాస్తమయసమయ కుంకుమరాగ ప్రశోభితంబగు నభంబును దిలకింతుము. అది చూచునపుడు మనలో నయ్యెడ నేదైనమార్పు గోలిపించుచున్నదా? కొలిపింపవచ్చు; లేదా మనము పరధ్యానముగ నున్న గొలిపింపకపోవచ్చు. కాని దానిరంగు, దాని కాలపరిపక్వత బెడంగు, మన కవ్వేళగా కున్న వేఱొండుతఱి జ్ఞప్తికి వచ్చి, యెప్పుడో యొకానొకప్పుడు ప్రతివానిజీవితమునందును తత్తదుచితసంస్ఫురణంబు నుద్దీపింపజేయు. అలనాడు మనలసంచలింపఁజేయనిదనిసూర్యాస్తమయము శక్తిశూన్యమా? సౌందర్యవిహీనమా? కాదు. అదియే మఱియొకప్పుడు మిక్కిలి సత్తువతో మన కుద్బోధనంబు గావించు. అందలిప్రతిభ యప్పుడునిప్పుడు నొక్కటియే. కాని అప్పుడు మనము దానివలన చలింపకపోతిమి; నేడు చలించితిమి. కావున మనలోనిదికాని యాలోపము; సూర్యాస్తమయమునంద లిది కాదు. అది నేను లోపమనికూడ ననను. మనతొల్లింటియవస్థ సూర్యాస్తమయముతో వియ్యమందునంతటిదిగ లేదనుకొనవలసియుండు.

అట్లే కావ్యములతో మనము సంబంధ మలవఱుచుకొనునప్పుడును ఒకానొకపాత్ర మొకప్పుడు చదువ మన కేమియు నర్థముకాని దుత్తరక్షణమందు మనలో మఱొండు సమయంబున నందలి యంశము స్ఫురించుచు మన కుత్తేజనంబు గల్గించు. అంశములు మన భావనాశక్తిని నిల్పునవికాని, మన నాలుకచివర నాడునవి కావు. ఆ నిల్చునది మన మానా డెఱుగకపోవచ్చు. కాని యెప్పుడో యొకనాఁడు దానియందు విలువయనున దున్నయెడల తప్పక తట్టు. అట్లు తప్పక తట్టువాని నుద్గ్రంథము లని కొనియాడజెల్లు. ఏగ్రంథముగాని చదివివేసి బాగులేదని

త్రోసివేయజనదు. ఆగి ఆలోచింపవలెను. ఆ గ్రంథము నందలియంశము తిరిగి మనజీవితమునం దెప్పుడేని స్ఫురించునదియా యని చింతనంబిడ స్ఫురించునదియేని, అది మనకు గవిత్వము బ్రసాదించిన దన్నమాటయే.

మన యవసరమునకు, మన ప్రస్తుతావస్థకు దగు గ్రంథములను కొని మనము వానివలన తాత్కాలికలాభ మును బడయుచున్నారమన్న, మనము గ్రంథపఠనము నొకానొక స్వప్రయోజనమును మనసునం దుంచుకొని చేయుచున్నామనుమాట. అందు మనకుగల "పరాకాష్ఠ" వెల్లడియగునే కాని మనము కళను కళకొఱకై యే సేవించునట్లు తోచదు.

ముక్తికొఱకు భుక్తికొఱకు గ్రంథములు పఠించుట లన్న, దేవతాసందర్శనమునకై పుణ్యక్షేత్రములు సేవించుటవంటి దగుగాని; సృష్టిసందర్శనార్థమై గహనారణ్యములు యదృచ్ఛ జొఱబడుటవంటిది కానేరదు.

మన మొక గ్రంథమును జదువునప్పుడు ఒక ప్రయోజనము నెద నుంచుకొనరాదు; ఒకసూత్రము, ఒక పరిబంధనము, ఒక కట్టుబాటు నరయజనదు. యదృచ్ఛ జదివి, యదృచ్ఛ యోజింపనగు. ఆగ్రంథమునందలి యంశము మన జీవితలక్ష్యము నెందేని, నెప్పుడేని మార్చక పోవునా?

ప్రార్థనపద్యము

ఎవ్వానికొఱకు కోయిలపిట్ట యెలుగెత్తి
          కొమ్మఁ గోకోయని కొసరువిసరు
ఎవ్వానికై సెలయేరు జల్జలమని
          పెనుకొండలోయఁ బింపిల్లుగూయు
ఎవ్వానిపాంటె నుయ్యెలఁదూఁగు చిటిపాప
          మవ్వంపుఁజిన్ని లోనవ్వు నవ్వు
ఎవ్వానిఁగూర్చి హాయిగఁ బేదగోపండు
          గుల్లపిల్లంగ్రోవిఁ బల్లవెత్తు
అట్టి చిద్రూపమూర్తి కనశ్వరునకు
సకల జంగమస్థావర సాధు జీవ
లలిత సత్కళాభావచిత్రాలయునకుఁ
బురుషసూక్తున కంజలిపుటి ఘటింతు.

---

## వేణుగానము

భమిడి ఉమామహేశ్వరావధాని గారు

నీలముల నేలఁజాలు పెన్నెరులు నీదు - చిఱునగవు లొల్కు మోమునఁ జిందులాడఁ
    బలుకుపలుకునఁ దేనియ లొలుకునటులు - పాడుమాలీల వేణుగోపాలబాల!
పండువెన్నెలతేటలో నుండుమురువు - గండుకోయిలపాటలోఁ గ్రాలుహరువు
తొడరి పీయూషకలిత మాధుర్యగరిమ - కలదు గోవింద! నీవేణుగానమందు.

శాలు కఱంగు; మోడులు విరాజిలుఁ గ్రొంజిగురొత్తి; క్రేపులుం
బాలను ద్రావుటల్ మఱచుఁ; బన్నగముల్ దఱిఁజేరి యాడు; కెం
గేలను వేణువూని మధుగీతములం బచరించునంత గో
పాల! త్వదీయశక్తి మది భావనసేయఁగ శక్యమేరికిన్?

---

## ౩. నాటకము

# పల్నాటి పౌరుషము

సంగనామముల రామచంద్రరావు గారు

### అంతిమ దృశ్యము

[బ్రహ్మనాయఁడు కూర్చుండియుండును]

బ్రహ్మ—దైవమా! చెన్న కేశవా! ఎందఱు వీర వతంసులు కారంపూడియుద్ధభూమిలోఁ దెగటాఱిరి!

సీ. వృద్ధికామఁుడు మాపినమల్ల దేవుండు
జీవిత కావ్యంబు చిగురుఁ జదివె!
మరలి చూడక యిల్లు మాకొఱ కీల్గిరి
యుగ్రాహవోత్సుక యోధవరులు
మాచెర్ల రాజ్య మామంత్రించినను బోయె
మల్ల భూపతి పెరుమాళ్ల సేవ
లేకలేక కలుఁగు నేకపుత్రుఁడు గోరె
బాలచంద్రుండు రంభాసుఖంబు
అయినవా రందఱును సమరాగ్నిలోన
మ్రగ్గిపోయిరి నల్గామరాజు నేను
నూడఁగొట్టిన నాగల్ల మొండినాము
అకట! యుద్ధాభిలాష మహాపకారి!

కన్నమదాసు—(బంధితమైన నాయకురాలితోఁ బ్రవేశించి) తండ్రీ! నమస్కారములు.

బ్రహ్మ—(నాయకురాలిని జూచి) కన్నమా! ఇది యేమి?

కన్న—తండ్రీ!
అన్న దమ్ముల కున్న స్నేహంబు చెఱిచి
ఆఁడుపెత్తన మేడ్చి రాజ్యప్రతిష్ఠ
నాగులేటను గలిపిన నరగనాచిఁ
ద్రాటఁ గట్టితి నాయకురాలి నిదిగో.

బ్రహ్మ—కుమారా! నీహృదయక్షేత్రంబున నేను నాటిన ధర్మాధర్మపరిచ్ఛిత్తియను లతికను విషజలంబు వోసి పెంచుచున్నావే!

[కోటకేతుఁడు, నలగామరాజు నొకవైపునుండి ప్రవేశించి వినుచుందురు.]

కన్న—(జంకుతో) అదే మట్లనెదరు?

బ్రహ్మ—చెప్పెదను గాని ముందు బంధంబుల విప్పుము.

కన్న—చిత్త మట్లే చేయుదును. (నాయకురాలి కట్లు విడిపించును.)

బ్రహ్మ—(నాగమ్మతో)

ఉ. ఆగురిజాలరాజ్యమహి
మాంచిత మంత్రపదానుభోగమం
దూఁగిన భాగ్యశాలినికి
నోటము వెట్టుట గాక త్రాళ్లతో
నీగతిఁ గట్టియుంట తగ
దీతఁ డెఱుంగక తప్పుఁ జేసె నో
నాగమతల్లి! దీనికి మ
నస్సున జింతిలకమ్మ! మానినీ!

(నాయకురాలు తల వంచుకొని యుండును.)

కోటకేతుఁడు—రాజుగారూ! బ్రహ్మనాయఁడు గారు శత్రువుపైఁ జూపునౌదార్యము ప్రశంసాపాత్రము గదా!

నల—అతఁడు సుగుణంబుల పెన్నిధి.

బ్రహ్మ—(కన్నమతో) కుమారా!

మ. అవమానంబునుగూర్చి యన్యులకు వా
ర్తాత్రిం దలఁప వాంచి పె

ల్లు విలాపింపఁగఁ—జూచి వేడ్క పడుబు
ల్పూర్ణ మాను మోతండ్రి! యీ
యవమానం బది నీకె యేని నెడలస
హ్యం బౌనె? లోకంబు నా
త్మవలెం జూచుచు జ్ఞాని శత్రువుల స
న్మానించుఁ బ్రేమంబునన్.

గీ. యుద్ధమున శత్రురాజుల నోర్చియున్న
వారిఘనతను గౌరవింపంగవలయు
ము న్నలెగ్జాండ్రు పురుషోత్తముని జయించి
ఎంతగా గౌరవించెనో యెఱుక లేదె.

శాత్రవుం డొనర్చు దుశ్చేష్టితంబుల ఖండింపవలెఁ గాని వారికిమాత్ర మెట్టిహింసయుఁ గావింపరాదని నా కుద్బోధము గలుగుచున్నది. సంగ్రామరంగమున నోడింపఁబడిన వా రెంత యవమానకీలలతోఁ దపింతురో విజయధ్వజ మెత్తినవా రంత మహాప్రేమంబును వర్షించి వారిమనస్సునకు శాంతిఁ గల్పింపవలయును. (ఆలోచించి) ప్రేమాయుధంబున సాధింపఁబడఁజాలని శాత్రవులు దార్జన్యాయుధంబునఁజక్కఁబడరని తోఁచుచున్నది.

ఉ. ప్రేమము దుష్టమానసప
రీత విరోధములం బెకల్చి లోఁ
బ్రామును స్నేహితంబు నిరు
పక్షములందునఁ;గామధేనువై
ప్రేమము లోకసౌఖ్య శుభ
రీతి పయస్సును జేపుచుండ నో
హో! మదమెక్కి చంపితిమి
యుగ్రరణంబున జీవకోటులన్.

అట్టి లోక క్షేమకరంబైన ప్రేమసిద్ధాంతంబు గీటునంబుచ్చి యీకలియుగంబుననే కాక పూర్వయుగంబులందును ధర్మజ్ఞులగు వీరులుగూడ శత్రువుల భంజించుపట్ల దార్జన్యంబు సూపించి భీమంబుగా రణంబు గావించి పగతుర నోడించి యున్నమాట వాస్తవము. అయినను నంతకంటె నుత్కృష్టతరమై, లోకకల్యాణమునకు దారిఁ జూపుచు, నెట్టి కఠినహృదయుండెలనుగూడ ద్రవింపఁజేయఁ గలిగిన దార్జన్యరాహిత్యము మనకందఱ కవలంబనీయము.

శా. సాసూయంబుగఁ జూచుచుం బ్రకటదా
ర్జన్యంబుఁ గావించి యెం
తో సాధించెను జాతిగుండెగలశ
త్రుండైన మోహమోడి య
ప్డే సౌహార్దము సూపి లోఁబడును గా
ఠిన్యంబు పోఁగా నహిం
సా సిద్ధాంతరహస్య మియ్యది ప్రపం
చక్షేమ మిందే సుమీ!

కన్న—తండ్రీ! మఱల సెలవిండు.

బ్రహ్మ—(మఱలఁ జదివి)

గీ. తెలిసి శూరులె దీని సాధింపఁగలరు
ధర నహింసాస్థితికి పందలకుఁ గాదు
మేటివీరులు దీన నమ్మికను గలిగి
లోకమోక్షంబు గూర్పఁబోలును గుమార!

(కొంచెముండి) ప్రాణబంధువులు,గడ కేకపుత్రుండగు బాలచంద్రుండును సమరభూమిలోఁ జదిసినారు. నే నింక నస్త్రసన్న్యాసం బేకాక మానసికసంసారసన్న్యాసంబుగూడ వైరాగ్యబుద్ధిచేఁ గావించి,భవిష్యజ్జీవితంబంతయును బంచమహాస్పృశ్యతానిరోధంబుతో పాటుగా నహింసాసిద్ధాంత ప్రబోధంబుగూడఁ జేయుచు లోకోపకారమునకుఁ బూనవలెనని యున్నది. ఈ యహింసాసిద్ధాంతమును దేశమున నెట్లు ప్రచారములో నుంచవలెనో, దాని యాదర్శములు మానవకోటి కెట్లుపకరించునో—యీ మొదలగు సర్వ విషయంబులు విపులముగఁ దరువాతఁ దెలియఁజేసెదను. అసలహింసాసిద్ధాంతము—లేక— ప్రేమ సిద్ధాంతము, కుమారా! నీకెంతవఱకు నచ్చునో తెలియదు.

కన్న—తండ్రీ! భగవంతుండగు శ్రీకృష్ణుం డర్జునునికి నిష్కామకర్మయోగ ముపదేశించినమాదిరి నేఁడు దమరు నాకు దార్జన్యరాహిత్యసూత్రములచే నుద్బోధము గావించుటచే ధన్యుండనైతిని. ఇఁకముం దహింసాసూత్ర

లతికలు నలుదిక్కులఁ బ్రచారామృతప్రసారంబున వృద్ధిఁ బొందించి వ్యాపింపఁజేసెదఁగాక.

(నాయకురాలిని జూచి)నాగమ్మగారూ! నేను మీ యెడలఁ గావించిన మహాపరాధమునకు మన్నింపవలెనని ప్రార్థించుచున్నాను.

నాయ—(తనలో) అహింసాసిద్ధాంతముల నేను గూడ వినవలెననియే యింత సేపు కుమారునికి నాయఁ డుపదేశించినాఁడు. ఈతని యుద్యమంబులు గొన్ని నాకం గీకారార్హములుగాకున్నను, మొత్తముమీఁద గొప్పధర్మ జ్ఞుఁడని చెప్పక తప్పదు.

కోట—ఆహా! మహాత్ముఁడుగదా బ్రహ్మనాయఁ డు! నరసింగరాజు, పెదమల్లదేవుఁడు, బాలచంద్రుఁడు రణం బున నిహతులైరనివిని, పరితపించి పరితపించి, వైరాగ్యము దెచ్చుకొని, నాయఁడుగారు లోకోద్ధరణమునకు నూతన సూత్రంబులను బ్రతిపాదించుచున్నారు.

నల—కోటకేతుఁడుగారూ! క్రౌంచమిథునంబును గాంచిన వాల్మీకిమహర్షి రామాయణకథాకవితామృతం బు వర్షించినవిధమున నీకార్యంపూడి యుద్ధపర్యవసానం బును బొడఁగనిన బ్రహ్మనాయఁడుగారు దౌర్జన్యరాహిత్య సిద్ధాంతములు సముజ్జీవింపఁజేయుచున్నారు. ఇఁక మనము బయలువడుదమా?

కోట—ఊఁ. (దగ్గఱకు వచ్చి)నాయఁడుగారికి నమ స్కారములు.

నల—(నాయనిఁజూచి యవమానముతో) నమ స్కారములు.

బ్రహ్మ—(నలగామునిజూచి యాశ్చర్యంబును మిం చిన సంతోషముతో) ఓహో! న్మాప్రేమాస్పదుఁడు వచ్చి నాఁడే! (పోయి కౌఁగిలించుకొనును.)

నల—(కన్నీరు నించుచు) అయ్యా! మీరు చిన్న తనంబున నాకుఁ దండ్రిడితరువాతఁ దండ్రియంతవారయి రాజ్యపరిపాలన వివిధధర్మంబు లుపదేశించినను—సత్య మొప్పుకొనిమెదఁగాక—మిమ్ములను ద్రోసిపుచ్చి—యీ నాగమ్మగారి మతకుతంత్రములలో మునిఁగి తేలలేక, యా మెకు లోఁబడి, సర్వకార్యములందును నామెకుఁ గనుసన్న మెలంగుచుఁ, దుదకుఁ గలిగినబంధువుల నందఱను జంపు కొనిన నిర్భాగ్యుఁడ నైతిని. పూర్వప్రేమంబును మఱచి పోరని విశ్వసించి శరణార్థినై వచ్చితిని.

బ్రహ్మ—నాయనా!

మ. చిరకాలోపగతాతిమాత్ర రుచిర
స్నేహంబువుల్ గర్మపుం
బరిపాకంబునఁ గొంతకాలము పరా
మర్శించి లోఁగొంటి సుం
దరహా నీముఖచంద్రబింబమును సం
దర్శించి నాచిత్తసా
గర ముప్పొంగుచు ముంచివేసినదిన
ల్గామకుమావల్లభా!

మ. కలబాంధవ్యము మాసిపోవఁగ వియో
గంబుల్ పునస్స్నేహముల్
కలయా—నిశ్చయమా—యెఱుంగను మహా
కష్టంబులున్ సౌఖ్యరీ
తులు శ్రేయుంబవళుల్ వలెన్ దిరుగువం
తులెట్టి యీమానవా
వళి కాలాఖ్యుని చేతిబొమ్మలుగ్రహిం
పంజాల మీచిత్రముల్.

తండ్రీ! కడచినదానికిఁజింతింపకుము. నీకు భయము లేదు. రోహిణికార్తెలో వడదెబ్బ దగిలి శోషిల్లిన లతా కుడుంగములు మృగశీర్ష కరుణామృత వర్షలేశంబున సేద దేఱునట్లు దౌర్భాగ్యప్రభావమువలన విడిపోయిన మన మిర్వుర మీకార్యంపూడి కయ్యంబువలనఁ బునస్సమాగ మంబు చేసికొనఁగలిగితిమి. పరమసంతోషము.

కోట—(నాయనితో) అయ్యా! తమరు మహా త్ములు; మహాత్ములయాజ్ఞ యనుల్లంఘ్యము. పల్నాటి రాజ్యంబింక నేతీరున సాగింపవలెనో విచారింపవలెనని కోరుచున్నాను.



యమునా విహారము

[ఈ యప్రకటిత చిత్రము శ్రీ దివాన్ బహదూర్ చతుర్భుజదాసు గోవిందదాసుగారి యనుమతిని]

బ్రహ్మ—నేనుమాత్ర మేమి చెప్పఁగలను? పెద్ద వాఁడ నైతిని. నాయీ మిగిలిన జీవితకాల మంతయును నహింసనుగూర్చియు, నస్పృశ్యతానిరోధముఁ గూర్చియు దేశంబునఁ దీవ్రప్రబోధంబు గావించుచు లోకక్షేమము నకై ప్రయత్నింపవలెనని యూహించుచున్నాను.

కోట—పెద్దలకు నేఁ జెప్పఁగలవాఁడను. గాను అయినను,—

అంత యశోవిశాలుఁడగు
నల్గుమహీపతి దాఁటఁగానె ధీ
మంతులు మీరలుండినను
మచ్చపడెం బలనాటనంచు లో
నెంతురు లోకులెల్లరును
హేళన చేయుదు రేలుఁ డీమన
శ్చింతఁ దొలంచుచుం బరుల
చేతికిఁ బోఁవగనీక రాజ్యముల్.

మాచెర్ల, గురిజాల— రెండు రాజ్యముల పరి పాలనంపు నిర్వహణము దమ మంత్రాంగ కౌశలంబునఁ గాని సాగనేరదు. కనుక మీ రభ్యంతరముఁ జెప్పవలదని మనవి.

బ్రహ్మ—మరల నన్ను మంత్రిత్వమునకు రమ్మ నుచున్నారే!

నల—సర్వజ్ఞులగు తమరు చేయి వెట్టనిది యేపని సాగించుటకును సాధ్యము గాదు.

బ్రహ్మ—బాలమల్ల దేవుండు పిన్నతనంబుననుండి పరిపాలనముపట్ల నపరిచితుండగుటచేత రెండురాజ్యములు మరల నొక్కటియై దానికి నలగామరాజే యాధిపత్యము వహించుట నా కంగీకారమే.

కన్న—ఇఁక నాగమ్మగారివిషయము?

బ్రహ్మ—నాగమ్మగారి పరిపాలనములోని లోపం బులును, నామె మాయెడఁ గావించినదుష్కృత్యంబులును నానుపూర్విగ నీవచ్చిన రాజులందఱ సమక్షమునఁ దగి నంతగా విశ్వసనీయముగా నివేదింపఁ దలఁచితిని. విష యంబులన్నియు వెల్లడియైనఁగానిమంచిచెడ్డలు లోకంబు నకుఁ దెలియవుగదా! నాగమ్మగారియందు నా కెట్టివిరో ధభావమును లేదు. ఆమె గావించిన దుండగంబుల మాత్రము గర్హించుచున్నాను. పాపమును ద్వేషింపవలెఁ గాని పాపిని ద్వేషింపఁ దగదని మహాత్ముల యభిప్రా యము.

నల—నాయఁడుగారూ! అయినదేమో యయి నది. మీరు చూపింపఁబోవు నేరములన్నియు యథార్థ ములని నేను బూర్ణముగ గ్రహించితిని. మరల మీ రా విషయముఁ దరువవలదని వేఁడుచున్నాను. మీరు మాత్రము గురిజాలలో మంత్రిత్వము వహింతురని నా విశ్వాసము.

బ్రహ్మ—(ఆలోచించి) కుమారా! నలగామా! ప్రజలలో నహింసాది సద్గుణంబు లలవడఁజేయుటకు నధి కారముగూడఁ జేతనుండుట మంచిదియే కావున మంత్రి త్వమును స్వీకరించుటకు సమ్మతించుచున్నాను. ఆవిషయ మట్లుంచుము. కొంతకాలము మహోన్నత పదమునం దుండిన నాగమ్మగారిని రాజ్యంబునుండి తఱిమివేయుట నా కిష్టముగాదు. ఆమె నింక మంత్రిపీఠంబున నుంచుట కంటె మతప్రబోధమునకు నియమించుట మిక్కిలివాంఛ నీయము. శైవమతానుసారిణియై తనమానసావలంబనము నకుఁ దగినట్లు శైవమతమున కామె యొనర్చినసేవ నిరు పమానమని చెప్పక తప్పదు. అంత మహోత్సాహము గల్గిన విద్యావతిని నగౌరవముగాఁ జూచుట పాడిగాదు. మఱియు,—

ఉ. శైవము వైష్ణవంబను ప్ర
జామతముల్ సమరీతిఁ బెంచుచుం
బోవలె సాధువర్తనుల
బోధకులన్ నియమించి పోటి యే
త్రోవను లేక శైవమత
ధూర్వహతన్ మననాగమాంబకే
యీవలె; వైష్ణవోద్యమము
నీడ్చును గన్నమదాసు పూనికన్.

చ. మతసహనం బహింసయును
మాలలయుద్ధరణంబు భోగముల్
మితముగఁబొందుటల్ కలిమి
లేమి సమాదరణంబు ధర్మస
మ్మతముగ మద్యపానమఁను
మాన్పుట లోకహితానుమోది జీ
వితమును నిర్వహించుటవి
వేకుల రాజుల ముఖ్యధర్మముల్.

కోట—కోవిదులగు మీ రుపదేశించు ధర్మము లమూల్యములు.

నల—నిరభ్యంతరంబుగా మీయిష్టంబనుసరించి ప్రవర్తింప సంసిద్ధుఁడను.

కన్న—మాతండ్రిగారు మరల రామరాజ్యమును బ్రతిష్ఠించుచున్నారు.

బ్రహ్మ—నాగమ్మగారూ! మీ రవమానమును బొందనవసరములేదు. మిమ్మును బల్నాటిరాజ్యంబులోని శైవమతప్రచారమునకు ముఖ్యాధికారిణిగా నియమించుచున్నాము. తమ రీయుద్యోగమును నిరాకరింపరని నమ్ముచున్నాము.

నాయ—నాయఁడుగారూ! పశ్చాత్తాపమునఁ బాపపరిహారము గలుగునని తమబోఁటి యార్యులకడ వినుచున్నాను. జరగినదేమో జరగినది. నాలోపములకుఁ బాపములకుఁ బశ్చాత్తప్త నగుచున్నాను. నే నెన్నియొనర్చినను స్వప్రయోజనార్థము గాదనియు, నేను నమ్మిన శైవమతము నుద్ధరించుటకనియే యనియుఁ దమరు గ్రహింపవలెనని నాప్రార్థన.

బ్రహ్మ—సత్యముఁ బలికితిరి. అందుకొఱకే కదా శైవమతాధిపత్యంబును స్వీకరింపుఁడని బ్రతిమాలుచున్నాము!

నాయ—మంచిది. అట్లే కావించెదను.

కోట—నాప్రార్థన మంగీకరించినందులకు నాయఁడుగారి నభినందించుచున్నాను.

నల—నాయఁడుగారూ! యుద్ధహతావశిష్టులయిన రాజన్యులను, సేనాప్రకరంబులను దగుగౌరవంబులతో వారివారి రాష్ట్రంబుల కనుపవలయునుగదా.

బ్రహ్మ—మంచిది. నాగమ్మగారూ! పోవుదమా?

నాయ—చిత్తము.

[అందఱు నిష్క్రమించుచున్నారు.]

---

# బసవపురాణము

## వెల రు. ౨-౦-౦

గ్రంథకర్త: పాల్కురికి సోమనాథకవి — పరిష్కర్త: వేటూరి ప్రభాకరశాస్త్రిగారు

పండ్రెండవశతాబ్దమున వెలసిన శైవమతప్రతిపాదకమగు ద్విపదకావ్యము. ఇందు శైవమతోద్ధారకుఁ డగు బసవేశ్వరునియు, తత్పూర్వులు తత్సమకాలీనులు నగు శివభక్తులయు చరిత్రములను సరసముగను, పాఠకులు మనసు కరగి తన్మయులగునట్లుగను కవి వర్ణించినాడు. గ్రంథమున మృదుమధురము లగు జానుదెనుగుపలుకుల జాలువార్చి రచనమున ముద్దులుగురిపించినాడు. ఆధునిక కవికుమారుల కిది యత్యంతోపకారకము.

విలాసము: ఆంధ్రగ్రంథమాల, నెం. 7, తంబుశెట్టివీధి, మద్రాసు.

# ఉద్రేకము

తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు



౧

కేనలతోడ నవ్వెలమసింగ మభంగుర సంగరోత్సవ
శ్రీనిధి బ్రహ్మనాయఁడు విశిష్టచరిత్రుఁ డవార్యవీర్య స
మ్మానితమైన తేజము నమానుషపౌరుషమున్ వెలుంగఁ దా
నానలగామితోఁ దొడరి యాజి నొనర్పఁ దలంచి పోవుచున్.

౨

అంతిపురంబునంగల కులాంగనలం బరిరక్షసేయ దు
ర్దాంత బలప్రతాపసముదగ్రుఁ గుమారుని బాలచంద్రు ధీ
మంతులు ధైర్యవంతు లన మంతుకునెక్కిన వానినెయ్యురన్
దంతివిరోధివిక్రములఁ దా నియమించి రణోర్వికిం జనెన్.

౩

నిజభుజశక్తి చూపుటకు నేఁడుగదా! తఱి యయ్యెనంచు స
క్కజమగు సంతసంబు నెదఁ గాంచెడు బాలున కీయనుజ్ఞ దుః
ఖజనకమయ్యె, నైన జనకప్రతివాక్యము గూడదంచుఁ దా
గజిబిజిమానియుండెఁ జెలికాండ్రురతో నల వీరమేడపిన్.

౪

మేడపిలో నతండు తన మిత్రులతో నొకనాఁడు బొంగరా
లాడఁదొడంగ వీటఁగల యంగనలెల్లరు నేఁగుదెంచి యా
వేడుక సూచుచుండిరట వీరులమాటలలోని నేర్పు గొం
డాడుచు బొంగరాలఁ గొని యాడుచుఁ బాడుచు గుంపుగూడుచున్.

౫

పంబిన వేడ్క నత్తఱిని బాలుఁడు ద్రిప్పెడు పైఁడిబొంగరం
బంబరమున్ దిగంతములు నార్వఁగ "బజ్జు" మటంచువచ్చి విం
తం బొడగాంచుచున్న యొక తన్వికి నన్నమకజ్జమీఁద నా
టెం బాలిపోని వేగమున డెప్పరమంచు జనంబు లాడఁగన్.

౬

అయ్యెజదిద్రవేటుఁగొని "య-య్యయ్యో చచ్చితి"నటంచు నన్నమ్మవర్గ్
నెయ్యంపుఁజెలులు చెవులన్-జయ్యన మూసిరి విచారసంతాపములన్.

౭

అంతఁ గొంతవడికి నయ్యింతి లేచి దు-రంతరోష కలుషితాత్మ యగుచు
మొనసి "మొప్పె"యంచు ముకుళితహస్తుఁడై-ప్రోలనిలిచియున్న బాలుఁజూచి.

౮

"రేచెర్లాన్వయులైన వెల్మదొర లుర్విన్ జండకోదండ వి
ద్యాచాతుర్యము మీఱ శాత్రవకుల ధ్వంసంబు గావించి ధ
ర్మాచార్యత్వము నంది పేర్వడసి రిట్లన్యాయ మార్గంబులన్
నీచారంభములం బొనర్పరుగదా! నిర్భీకులై యెన్నఁడున్.

౯

కలన నిశాత హేతుల నఖండవిరోధి వసూధినీ శిరో
ధులఁ దెగవ్రేయఁ బోవ రణదుర్జయులౌ దొరలెల్ల నీవిటుల్
గులుకుచు సిగ్గుమాలి మదిఁ గొంకక జంకక బొంగరాలవ'':
జెలువల పాదపద్మములఁ జెండెద విస్సిరో! రాచబిడ్డవై.

౧౦

కలదొకో నీకుఁ బౌరుషము? కల్గినఁ గారెమపూఁడి సేరి స్త్రీ
దళములఁ గూడి శత్రువసుధాపతి సేనల నుగ్గుసేసి దో
ర్బలమును జూపలేని మగపాడికి మెత్తురు లోకు; లిట్లు దు
ర్బలలగు నింతులన్ జదుమఁ బొల్పెదిరన్ నిను బ్రువ్వఁ దిట్టరే.

౧౧

మీసము దువ్వి శాత్రవులమీఁదికి దూఁకఁగ శక్తిలేక సం
త్రాసముఁ జెంది పందవయి తంత్రపులకీర్తికి మచ్చఁ దెచ్చి చే
దోసములేసి చాపలకు దోర్బలముం బ్రకటించుచుంటివి వి
స్సీ! సరివారిలోనఁ దల నెత్తఁగ నీమన సెట్లు లొప్పెడిన్.

౧౨

అని తెగడుచున్న వైశ్యాం-గనపలుకులు ములుకులట్లకాఁడిన మది స
గ్గుణనిధి కినుకం జెందక-వినయంబు నయంబు వెలయ వెలఁదికి ననియెన్.

౧౩

"తల్లిరో! బాంగరంబు నిను దైవవశంబునఁ దాఁకెఁగాని నా
ప్రల్లదమోటు? గాటమగు బాధకు నోరువలేక శోకమున్
వెల్లువలోపలం బడి వివేకముఁ గోల్పడి నన్నుఁ దిట్టుదే?
కల్లనిజంబులం గనవు కర్జమె? నీమదిలోఁ దలంపుమా.

౧౪

దోషమొ! పొరపాటో! ని-ర్దోషమొ! నే దోషి ననుచుఁ దోఁచినఁ గడుసం
తోషంబున మన్నింపుము-రోషంబును బూని చానరో! తిట్టకుమా!

౧౫

అని యవ్వాలంది గాయం-బునకుం దన మేలిపట్టుఁబుట్టంబును గ్ర
క్కునఁ జించి కట్టు గట్టెను-వనితకు మందులకు నూఱువరహా లొసఁగెన్.

౧౬

ఇచ్చి యచ్చెల్వ నింటికిఁ బుచ్చివైచి-యాటపాటలఁ జాలించి యనుఁగుఁజెలుఁ
నన్నపోతాదులంగాంచి యాగ్రహంబు-దుఃఖమును సంభ్రమంబుఁ దోడ్తోఁజనింప.

౧౭

"గండరగండ వై యలవు గండును మెండుగఁ దాండవింప ను
ద్దండవిరోధికాండముల దర్పమునన్ విదళించి మించుచున్
గొండలఁ బిండిసేయఁగల క్రోల్పులి కెట్టి యవస్థ వచ్చె నీ
ముండకుఁ జుల్కనైతిఁ గద మూరినదుర్విధి నేమి సెప్పుదున్.

౧౮

రోసములేని పందనని రోయుచుఁ గోమటివీరకాంత నన్
గూసినకూఁత లెల్ల ననుఁగుంజెలు లందఱు వింటిరే? యిఁకన్
మీసము దువ్వి శాత్రవుల మింటికి గెంటక యింట నున్నచో
వీసరపోవకున్నె మన విశ్రుతపౌరుష వీరసంపదల్?

౧౯

నిరుపమ విక్రమక్రమము లనింద్యులు నాఁ బలనాటి వీరశే
ఖరులు ప్రసిద్ధిఁ గాంచిరి యఖండయశోనిధులై వెలుంగు న
ప్పురుషులలో నొకండనయి పుట్టి కృపాణముఁ జేతఁ బట్టి సం
గర మగుచో నిట న్నిలువఁ గాంతలు నవ్వుటలోన వింతయే.

౨౦

ఈపలనాటిసీమ జనియించిన వీరవరేణ్యుఁ డీలస
ద్రూపవిలాస విక్రమ నిరూఢచరిత్రుఁడు నేఁడ కామధా
త్రీపతి గుండె జల్లుమనఁ దెంపరియై రణసీమఁ జేరు మీ
రోపిన రండు చండరిపుయోధశిరంబుల బంతులాడఁగన్."

౨౧

వీరరసోద్రేకంబున-నీరీతి నతండు వల్కి హెచ్చినవేడ్కన్
ఘోరాహవప్రయాణ-ప్రారంభము చెంగలింప బాలుని మిత్రుల్.

౨౨

"ఓపిన రండటంచు మము నుల్లసమాడఁగ నేల బాల! మా
యోపిక లెట్టివో! తెలియవో! వినవో! పెఱవారమో! యశః
ప్రాపణమైనఁ జావయినఁ బాయక నీవెనువెంట నుంటయే
మాపని గాదె? భీరువులమాడ్కి మముం దలపోయు టొప్పునే.

౨౩

ఎవఁడు పరరాజవశ్యమై హీనదాస్య-శృంఖలాబద్ధమై నిజశ్రీవిలాస
దూరమై గతగౌరవోదారమై దు-రంతపరిభవ జనితదుఃఖాగ్ని హేతి
పటలసంతప్తహృదయమై పరితపించు-దేశమాతను గాంచి దుఃస్థితుల నరసి
నెవ్వగలఁ గుంది వేఁడికన్నీరు రాల్చి-మాతృదాస్య విమోచన మహితదీక్ష
బద్ధకంకణుఁడై రక్తబలి నొసంగి-పొంగి యాత్మార్పణంబు సేయంగ వెఱచు
నానిరర్థకుఁ డానీచుఁ డానికృష్టుఁ - డిందు నందును బూజ్యత నందఁ గలఁడె?"

౨౪

అని బాలచంద్రుతో నా-డిన విని యవ్వీరుఁ డినుమడించిన శౌర్యం
బున వారిఁగూడి తగుదీ-వనలం గొనఁ దల్లికడకు వడివడి నడచెన్.

---

## భార్గవి

కావ్యకలానిధి, చిదంబరశాస్త్రి గారు, శతావధాని



శ్రీదనుజుఁ డోషధీశుఁడు భవత్తనయుండు ప్రపంచకర్త ని
న్నెద నిడికొంచు లోకముల నేలెడివాఁడు భవత్ప్రియుండు నీ
వది సకలం బెఱింగియు ననార్యుల నేమిటి కాశ్రయింపఁబో
యెద విది మీకులీనులకు నెల్లఁ గళంకముగాదె భార్గవీ!

ఎవ్వని కీయఁగాఁదగుదు వీ వనికూడ నెఱుంగకుండ నీ
జవ్వనమెల్ల వ్యర్థముగఁ జల్పి పవిత్రతఁ గోలుపుచ్చి ని
న్నెవ్వగపాలు సేయు నవినీతుల నే భజియించుచుందు వే
మివ్విధి నీలలాటమున నెవ్వఁడు వ్రాసినవాఁడొ భార్గవీ!

ఒక్కఁడు మాటలాడుటకు నోపఁడు వేఱొకఁడేది యెట్టిదో
ముక్కుమొగం బెఱింగి కనఁబోవఁడు వేఱొకఁ డంధకల్పుఁ డే
దిక్కును జూడఁజాలఁ డొకధీరుఁడు లోకవిగర్హితుండు నీ
కెక్కడఁ జిక్కె నిట్టిగుణహీనుల యాశ్రయణంబు భార్గవీ!

పుచ్చినవక్కయైన నిడఁబూనక దేశహితంబుపొంటె వి
ద్వచ్చయనిందితాత్ములయి ప్రాణము లుండియుఁగూడ బొందిలోఁ
జచ్చినవారికంటె మును జచ్చినవారలరీతి నుండు నీ
కుచ్చితు లెట్లు నీకు సమకూరిరి డగ్గఱఁ జేర భార్గవీ!

బ్రాహ్మణవంశమందుఁ బ్రభవంబు వహించియు ధర్మహీనులై
జిహ్మలతోడఁ గూడి నిరసింపఁబడందగు వర్తనంబునన్
బ్రహ్మవిదగ్రగణ్యుల కపాయములన్ గలిగించుచుండు యం
బ్రహ్మల నాశ్రయింతువు పురాకృతమా యిది నీకు భార్గవీ!

గుణములు లేనివారికడఁ గ్రూరులసన్నిధియందుఁ గార్యనై
పుణము నెఱుంగనట్టి జడబుద్ధుల గేహములందు నెన్నఁడున్
క్షణమయినన్ వసింపవని చాటుచునుందురు నిన్నుఁగూర్చి ధీ
మణు లిపు డేమి కాలమహిమంబున నీ విటులైతి భార్గవీ!

విప్రులు ధర్మవేత్తలు వివేకులు నీకు సపత్నులేమి లో
భ్యప్రతిహాన్యమానులు దురాగతు లజ్ఞులు మిత్రులేమి నీ
వప్రతిమాన శేముషి వనార్యచరిత్రవుగావు నీకు నీ
చప్రవణత్వ మేమిటికి సంధిలెనో కదవమ్మ భార్గవీ!

కలుషము లేనిదానవు వికారములం గనఁబోనిదాన వ
ర్థులకు రుచించుదానవు బుధుల్ గొనియాడెడిదాన వన్నిటన్
గలిగినదాన వున్నతులు గాంచినదానవు నీకునిట్టి నీ
చుల పరిసర్పణం బెటులు సోఁకినదో కనరాదు భార్గవీ!

జలజవుగానఁ దద్గుణము సంధిలె నీకని కొందఱందు ర
ప్పలుకులు విశ్వసింపఁదగుపాటివి గావు తలంచి చూచినన్
జలజము గాదె రత్నము నిశాకరుఁ డచ్చర లెంద ఱెందఱో
జలజులుగారె నీచపరిసర్పణ మెవ్వరి కబ్బె భార్గవీ!

వేడుకతోడఁ దా ననుభవింపక వేరొకవాని కీయఁ జే
యాడక నిన్ను బంధమునయందు సదా పడవైచు నిర్గళ
త్క్రీడుల మానదూరుల వివేకవిహీనుల నాశ్రయింతు వీ
జాడ భవత్స్వభావగుణసంభవమో మఱియేమొ భార్గవీ!

అవగుణ వంచు మాయికములైన విచిత్రములందు సర్వజం
తువులను ముంచి తేలిచెడి న్యూనచరిత్ర వటంచు నిన్ను సా
ధువులు స్పృశింపకుండిరను దుఃఖము నేని మనంబులోన నొం
దవు లవమంత నీకిది విధాతృవిధానమొ యేమొ? భార్గవీ!

కనుఁగొనఁ గానరా వనధికారుల చెంతకుఁ జేరుచుందు వొ
క్కనికిని సౌఖ్య మీయవు వికారములన్ గలిగింతు వీవు ని
ల్వనిమెడలన్ జగంబు వికలంబగు నియ్యది చూడ నద్భుతం
బనునటు దోఁచె నీచరిత మన్యదురాపముగాదె భార్గవీ!

---



బుద్ధగయలోని ప్రధాన దేవాలయము

# ఉగాది కానుకలు

## 3

సెట్టి లక్ష్మీనరసింహము గారు



కానుక లన్నవి మన దేశములోఁ బూర్వకాలమునఁ గొన్నికొన్ని సమయములందే కొందఱకు కొందఱకే యిచ్చుచుండిరి. ప్రభుసందర్శన సమయములందుఁ బ్రజలు పెట్టెడి యులుపాలు, వివాహకాలములందు బంధువులుచదివించు కట్నములు, విద్యాపరిసమాప్తివేళలందు శిష్యులు సమర్పించు గురుదక్షిణలును దృష్టాంతములు. అవియన్నియు సముచితములైన కానుకలు.ఇప్పుడన్ననో, యట్టియౌచితి యేమాత్రమును గనఁబడదు. దేశకాలపాత్రము లెఱుఁగని కానుకలు కొన్ని పాశ్చాత్య దేశపద్ధతులనుబట్టి మనకు వచ్చినవి. అట్లు వచ్చినవే యుగాదికానుకలును.

ఏవంవిధములైన భావములను వెల్లడించుచు, చెన్నపురముననున్న తన యున్నతసౌధమందలి యొక మీఁది గదిలోఁ గుర్చీపైఁగూర్చుండి వరదరాజమొదలి తన మిత్రుఁడైన బలరామపిల్లతో సంభాషించుచుండెను.

మొదలి బంగారుపిచ్చుక. (బంగారుపిచ్చుక యన్నది నేతిబీరకాయ సామ్యము కాదు.) పట్టణములో నతని తండ్రి బట్టలవ్యాపారముచేసి దిట్టముగా దుడ్డు సంపాదించి మరణించెను. మొదలి యేకపుత్రుఁడు.ఆతనియక్క తాయారు పెంపకమునకు వచ్చినది. ఆబిడ తండ్రినాఁటనే వివాహితయై కాఁపురమునకు వెళ్లెను.

మొదలి బ్రహ్మచారి; ఇరువదియైదేండ్ల యీడు. పిల్లయంతకంటె కొద్దిగా పెద్దవాఁడుగాని, యతనికిని బెండ్లి లేదు. వారిరువురును బాల్య స్నేహితులు; పచ్చయప్ప కాలేజిలోఁ జిన్నతరగతినుండియు సహాధ్యాయులు. క్షీరోదక న్యాయమున కుదాహరణప్రాయముగాఁ దిరుగుచున్న వారికి కృష్ణార్జునులన్న పేరు వచ్చినది. పిల్లకు చెల్లెలు పదునాఱేండ్ల దున్నది; ఆమె పేరు సుభద్ర. లోకులు పెట్టిన పేరులు సార్థకములగు యోగ మున్నదేమో!

అక్క తాయారు గాక, మొదలికిఁ గల చుట్టపక్కములు పెదతండ్రి పినతండ్రుల కూఁతులు, పెదతల్లి పినతల్లుల బిడ్డలు, వారిసంతానము, పుట్టిచచ్చినవారు గాక పుట్టెఁడు మంది యున్నారు. వారందఱవి పేదసంసారములు. తాయారు నిచ్చినకాలమునాఁటికి మొదలి బావ కందసామిమోతుబరియేకాని, యిటీవల యతని స్థితియుఁ గొంత చితికినది. మొదలి ప్రేమపాత్రుఁడో, మొదలి బంధువులు ప్రేమగలవారో యైయుండవలయును. ఉగాది యుగాదికిని వారతనికిఁ గానుకలు పంపించుచుండిరి. తండ్రిగతించిన యెనిమిదేండ్లనుండి యొక్క యుగాదికైనను గానుక పంపని యొక్క బంధువైనను లేకుండెను. "తమ్ముఁడు వరదరాజు మొదలికి", "మఱఁది వరదరాజు మొదలికి", బావ వరదరాజు మొదలిగారికి", "అన్న వరదరాజు మొదలిగారికి", "మేనమామ వరదరాజు మొదలిగారికి", అని యీ విధముగా వారివారి బంధుత్వములకుఁ దగినట్లు మీఁదఁ గాగితపుముక్క లంటించి బంధువు లతనికిఁ బంపిన యుగాది కానుకలతో నిప్పటి కొకబీరువా నిండి, రెండవ బీరువా యవసరము పడినది. కానుకలకు మాఱుకానుకలు పంపుట మర్యాద; విధి. అక్కలకుఁ, జెల్లెండ్రకు, బావలకు, మఱఁ

దులకు, అన్నలకు, తమ్ములకు, మేనల్లుండ్రకు, మేనకోడండ్రకు మొదలి యుగాది కానుకలు ద్రవ్యరూపముగాఁ బంపుచుండెను. తనస్థితికిఁ దగినట్లు తాను బంపవలసి వచ్చినందున, మొదలి యందుకొనుచున్న యుగాది కానుకల కంటెఁ బంపుచున్న కానుకల విలువ దశగుణముగాను, గొన్నియెడల శతగుణముగాను దేలుచు వచ్చినది.

ఆనాఁడు ఫాల్గుణబహుళ ద్వాదశి; అయినను రావలసిన యుగాదికానుక లన్నియు వచ్చి చేరినవి. అవి పిల్లకుఁ జూపించు సందర్భముననే మొదలి తన యుపన్యాసము మొదలిడెను:

"బలరామా, 'ఏఁడాదికొకసారి పేరయ్యదెబ్బ'యని తెలుఁగుదేశమువా రనుచుందురులే. అదే మాదిరిగా నున్నది యీ యుగాది కానుకల యాచారము. ఇది యెక్కడ నుండి వచ్చినదయ్యా, మనకు? పెండ్లియనియా, పేరఁటమనియా? ఎందుకువచ్చినకానుక లివి? చూడు, కన్నులెత్తియొకసారి. ఇవి యుగాదికానుకలఁట! హ హ్హ హ్హ! ఉగాది నాలుగుదినము లున్న దనఁగానే యీచెత్త నా నెత్తినివేసి మొత్తినారు. చూడవయ్యా, చూడు. చూచి, నీకు నావలె బంధువులు లేకపోయినందుకు సంతోషించు. బావలు, మఱఁదులు, మేనల్లుండ్రు, మేనకోడండ్రు లేక నీవు సుఖపడినావు. ఇవి యన్నియుఁ గలిసి, పట్టుమని పది రూపాయిలు చేయునో, చేయవో? ఎందుకును పనికిరాని యీతుక్కుకు మాఱుగా నేను నాలుగువందలో, నైదువందలో చదివింపవలెను," అని మొదలి తన చీకాకును దెలిపెను.

'తుక్కు', 'చెత్త'యని యతఁడు నామకరణముచేసిన యా వస్తుసముదాయము వ్రాఁతబల్లమీఁదఁ గుప్పగాఁ బడియున్నవి. వానివంకఁ జూచి పిల్ల చిఱునవ్వుతో, "వరదా, ఏమి, యావస్తువులకువచ్చిన లోపము? భేషుగా నున్నవి. సంతోషించుటకు మాఱు చిఱ్ఱుబుస్సు లాడుచున్నావు. ప్రతిసంవత్సరమును బంధువు లిట్లు నిన్ను మఱవకుండ ఉగాదికానుకలు పంపుచుండుట యెంతటి యదృష్టము?" అనెను,

"ఆవస్తువులకు వచ్చిన లోపమును లేదు; నీ తెలివికి వచ్చిన లోపమును లేదు," అని మొదలి పరిహసించెను.

ఊరడింపుగా పిల్ల: "కానుకలవిలువ ఖరీదుఁబట్టి కాదు చూచుట. 'పత్రం పుష్పం ఫలం తోయం'—"

"చాలు,చాలు;నీచదువు చాలించు. కానుకలవిలువ దేనిఁబట్టి యాలోచింతువో యాలోచించి, నామేనల్లుండ్రు, నామేనకోడండ్రు, వారి తలిదండ్రులు, నాకుఁ బంపిన యీ యుగాదికానుకలలో నట్టిచెత్తయుఁ, దుక్కును గాక పనికి వచ్చు వస్తు వొక్కటియైన నున్నదేమో గాలించి వెదకి చూపింపుము."

"పనికి రానీ, రాకపోనీ. అది ముఖ్యము కాదు. వారికి నీమీఁదఁగల ప్రేమయే కావలసినది. ఉగాది కానుకలు పంపు ప్రేమగలచుట్ట మొక్కఁడును లేఁడుగదా యని నేను దుఃఖించుచుందును. నీకు సంతోషము కలిగింపవలయు నన్నదే యీయుగాదికానుక లన్నిటి యుద్దేశమును. మాటవరుసకు, ఈమేజోళ్ల జత—"



"టపటపాల చెప్పులుతప్ప నిండుజోళ్లు తొడుగని నాకు మేజోళ్లేల, గ్రుడ్డికంటికి సులోచనముల లాగున?"

"అయినను—"

"అయినను, ఏమిచేసికొమ్మందువు? పోనీ, రాత్రులు పరున్నప్పుడు వెచ్చఁదనముకొఱకుఁ దోడుగుకొన వలయు నన్నను, నాకాళ్లకుఁబట్టనియంత బిగువు. ఇట్టిజతలు పదునేడున్నవి: అన్నియు ఉగాదికానుకలు."

"ఆలాగుననా?—మఱి, యీమంగలికత్తి? మంచి వాడిగానున్న దే?"

"సొంతక్షౌరము చేతఁగాని నాకు మంగలికత్తి యెందుకు, గొంతుక కోఁతకు? ఈ బంధువు లందఱునుగలిసి నాకు జేయఁదలఁచుకొన్న తిరుక్షౌరమున కిది సూచకము కాఁబోలు! మంగలివాని కిచ్చి దీనితో క్షౌరము చేయుమంటిని; తెగదు! చౌకపారురకమఁట! ఇట్టివి పదునొకొండున్నవి. అన్నియు ఉగాది కానుకలు."

"మఱి, యీసబ్బుముక్కలో? నీవు సబ్బు వాడుకచేయుదువు గదా?"

"అవి సబ్బుముక్కలు కావు; సున్నపు ముద్దలు. పెట్టెమీఁది పేరుచూచి భ్రమపడి మొగమునకు రుద్దుకొని చూచినాను. మొగమెల్లఁబొక్కి, తొక్కయూడి,వారము దినములు బాధపడవలసివచ్చినది. ఈసబ్బుతో నుతికిన యెడల ఎంత గట్టిబట్టలైనను నాలుగుదినములలోఁ దూంట్లుపడి జల్లెడయాకారమును బొందును.గుజిలీబజారులో నాలుగణాలు పెట్టెఖరీదు. ఇట్టిసబ్బుపెట్టెలు నాలుగు దొంతులున్నవి. అన్నియు ఉగాదికానుకలు."

"మఱి—"

"బలరామా, మఱిమఱియన్నపాట యేల పాడెదవు? ఈ యపభ్రంశపు, దౌర్భాగ్యపు, నిరర్థకపు,నిష్ప్రయోజకపుఁ జెత్తలోఁ బనికివచ్చు వస్తువొక్కటియు లేదు; నా మాట నమ్ము."

"అట్లే కానిమ్ము. ఐన నేమి? నే నింతకు ముందే చెప్పియుంటిని. కానుకలవిలువ ఖరీదుఁబట్టి చూడము. నీబంధువులు నిన్ను మఱవలే దన్నందులకే యీ యుగాది కానుకలు నిదర్శనములు."

"నన్ను వారు మఱవకుండుటకుఁగాదు; వారిని నేను మఱవకుండ జ్ఞాపకార్థము పంపిన నిదర్శనము లన్నయెడల సరిగానుండును. ఒకప్పుడు నేనును నీవలెనే వెఱ్ఱిమొగమునై, యుగాదికానుకలపేరిటి యీనిరుపయోగవస్తువులు బంధువులకు నాయెడలఁగల యవ్యాజప్రేమకు సూచకములని నమ్మి సంతోషించుచుంటిని. నిజముగాఁ బ్రేమగలవారే యైనపక్షమునకుఁ గొంతశ్రద్ధపెట్టి, చౌకవైనను నా కుపయుక్తములగు వస్తువులు వారు కొనియుండరా యన్న యాలోచన యిటీవలఁదట్టి, నా కిందలి యాథార్థ్యము బోధపడినది. నాసౌఖ్యమును గూర్చిన తలంపే లేకుండ, వెట్టితీర్చుకొనుటకుఁ గొన్న వస్తువులేకాని ప్రేమతో నిందు సంబంధమే లేదు. ప్రతిసంవత్సరమును నావలనఁ బడయుచున్న బహుమతుల నిమిత్తమై, క్రొత్తసంవత్సరము మరల వచ్చినదని నా బంధువులు నాకుఁబంపిన జ్ఞాపకచిహ్నములే యీ యుగాది కానుకలని నమ్ముము."

"అయ్యో! ఏమి, వరదా, యట్లనెదవు?"

"అట్లు కానిచో, నీమొగము మఱి యెట్లనుమందువు? ఒకయేఁడా, రెండేండ్లా? ఎనిమిది యేండ్లనుండి జరుగుచున్న భాగవతము."

పిల్ల కొంచెముసేపు మౌనము వహించి, కొంత జంకుచు, "వరదా, రాత్రి నాటకమునకు వెళ్లినాము. నిద్రలేక నీకుఁ గొంత చీకాకుగా నున్నది. మామూలుగా కులాసాగా నుండువాఁడవు—"

"చీకాకుచేతఁ జెప్పుచున్న మాటలుకావు; నిశ్చయముగాఁ జెప్పుచున్నాను, విను. ఈయుగాదికి నేను నా బంధువులకొక యెఱ్ఱని యేగాని యైనను బంపఁ దలఁచుకో లేదు," అని మొదలి బల్ల గుద్దెను.

"చేచే! అది న్యాయము కాదు."

"బలరామా, న్యాయము కాదనుచున్నావు; బాగుగా వినుము. పైసా పంప నంటినేకాని బహుమతులు పంప నన లేదు."

"అట్లయిన-చో సరియే. ద్రవ్యమునకు మాఱు తగిన బహుమతులు పంపవచ్చును. తప్పేమి?" అని పిళ్ల మనస్సమాధానము చేసికొనెను.

"తగిన బహుమతులే పంపెదను," అని మొదలి పండ్లు బిగించి, "అపభ్రంశపు, దౌర్భాగ్యపు, నిరర్థకపు, నిష్ప్రయోజకపుచెత్తవస్తువులు వెదకికొనెదను,"అనిముగించెను. పిళ్ల యేమో యనుటకు నోరు తెఱవఁగా మొదలి యడ్డు వచ్చి, "బలరామా, నీవును నాతో రావలెను సుమా. ఇద్దఱమును గలిసియే బజారుకు వెళ్లుదము. ఈ మధ్యాహ్నమున నీకుఁ దెఱపియే కదా?" అని యడిగెను.

"తె—తెఱపియే కాని వరదా, ఏమి యీ యసందర్భము? హాస్యమున కనుచున్నావా, సత్యమా?"

"హరిశ్చంద్రుఁడు సహా యింతకంటె సత్యమైన వచనమెన్నఁడును బలుక లేదు."

అట్లయిన రానని పిళ్ల నిరాకరించెను. ససేమిరా రాను, రాను, రానని మంచి జిగితముగా నారంభమైన యా నిరాకరణము నిండుగా నైదు నిమిషములైనను నిలువ లేదు. పిళ్ల మనోబలముకంటె మొదలిదే హెచ్చయినది. "ఇదియు నొక వినోదము గదా?" అని మొదలి పిళ్లకుఁ గన్నులు తుడిచెను.

"సరియే, వచ్చెదను. హాస్యమాడుచున్నావు గాని, నిజమున కట్లు చేయవన్న నమ్మకము నా కున్నది. వచ్చెదను గాని," అని పిళ్ల తన జేబులోనుండి రెండు తెల్లని బల్లిగుడ్లవంటి మాత్రలు తీసి, "ఇవి నోటిలో వేసికొని కొంచెము నీరు త్రాగుము," అని చేయి చాఁచెను.

"ఇవి యేమి?"

"నీమాట నేను వినుచున్నాను గనుక నామాట నీవు విన వలయును. నీకన్నులు బరువుగా నున్నవి. నిద్ర లేమిచేతఁ దలనొప్పి పుట్టి నీకుఁ జీకాకు కలిగినదనుట నిశ్చయము. ఈయుదయమున నేను రెండుమాత్రలు వేసికొనఁగా, మంచి కులాసాగానున్నది నాకిప్పుడు,"అని పిళ్ల తెలిపెను.

"మంచి కులాసాగానే కనఁబడుచున్నది నీ ముఖారవిందము!"

"వెక్కిరింతువు గాని, వేసికొమ్ము మొదట మాత్రలు," అని పిళ్ల పట్టుపట్టెను.

మిత్రుఁడు తనతో రావలెనన్న కోర్కె బలముగా నుండుటచేతను, నిజముగా రవంత తలనొప్పి యుండుటచేతను, మొదలి కొంత వెడనవ్వుతో మాత్రలు పుచ్చుకొని, "ఇవి నేను వేసికొన్న యెడల, మధ్యాహ్నమున నీవు నాతో వచ్చి, వస్తువులను గొనుటలో సాయపడి, కొన్న వస్తువులను గూర్చి నేను జెప్పిన పనులన్నియుఁ జేయుదునని చేతిలోఁ జేయివేయుము," అని కుడి చేయి చాఁచెను.

ఆవిధముగా వారిరువురకు ప్రమాణము తోడి యొడంబడిక జరిగినది.

మధ్యాహ్న భోజనానంతరమున మిత్రులిరువురును ట్రాము బండిమీఁద చీనాబజారునకు వెళ్లి యాపరిసరములఁ గల షాపులమీఁదఁ బడిరి. మొదలిచేతిలో నతని బంధువుల పేరుల జాబితా యుండెను. జాబితా విప్పి మొదలి మొదట



నిలువఁబడిన చోటున కెదుట నొక బంగారు నగలదుకాణమున్నది. అది చూచి, పిల్ల ముఖము వికసించెను. సొగసయిన నగ నగదుకంటె స్త్రీలమనస్సులకు హెచ్చుసంతోషకరమని యతనికిఁ దట్టిన యూహ.

మొదలి జాబితాను జూచుచు, "మొదటిది మాయక్కతాయారు, నామెకుటుంబమును గదా? ఏమి కొందును మాయక్కకు?........ఆఁ! అవును. బంతులాటలోఁ తొడుగుకొను తెల్లని రబ్బరుజోళ్ల జత యామెకుఁ దగిన కానుక. ఆమె నాకు గతమున మూడునాలుగు జతల మేజోళ్లు పంపినది. బలరామా, రమ్ము; జోళ్ల షాపునకు వెళ్లుదము," అని పిల్లను లాగెను.

"జోళ్లా?" అని పిల్ల నోరు వెళ్లఁబెట్టెను.

"అవును. మఱిరమ్ము; కొనవలసిన వస్తువులు విశేషముగా నున్నవి" అని మొదలి తొందరపెట్టెను.

"మీయక్క జోళ్లు తొడుగుకొనని పూర్వాచారపరాయణురాలుకాఁబోలు! అపయిని, బయటికిఁ గాలుపెట్టి యెఱుఁగని యామెకు బంతియాట జోళ్లతో ప్రయోజనమేమి?"

"టపటపాలచెప్పులు తొడుగుకొనువానికి మేజోళ్లతోనెట్టి ప్రయోజనమో, యట్టిదే" యని మొదలి పిల్లను జోళ్ల షాపుకడ కీడ్చుకొనిపోయెను.

"ఏ కొల?" అన్నది షాపువాని ప్రశ్న.

"తనపాదములు చిన్నవని మాయక్కకు గర్వము" అని పిల్ల చెవిలోఁ జెప్పి, మొదలి గట్టిగా, "ఉన్న జోళ్లన్నిటిలోను బెద్దవి తీయుము" అని షాపువానితో ననెను.

జోళ్లపొట్లము తనచేత మొదలిపెట్టినప్పటి పిల్లముఖమునకు ఛాయాపటము తీయవలసినదే. తొందర పెట్టుచు ముందర నడుచుచున్న మిత్రుని వెంబడి మేఁకవలె నతఁడు పోవసాగెను.

మొదలి: "బలరామా, పొట్లము వీడిపోవుచున్నట్లున్నది. దారము కొనవలయును; జ్ఞాపకమునకుఁ దెమ్ము. ఇఁక మా కందసామి బావగారికి........ దొరచుట్టలు కొందము, రమ్ము."

"ఆయనకు చుట్టయభ్యాసమున్నదా?"

"పొగాకు పేరు విన్నంతనే యతనికి రెండు దినములు క్రిందట జీర్ణమైన యన్నమును నమన మగును. మంచిగాలైన చుట్టల పెట్టెయొకటి కొందము రమ్ము."

వలదని బోధించిన పిల్లవాక్యములు బూడిదలో పోసిన పన్నీరువంటివైనవి; చుట్టలపెట్టెకొనుట జరిగినది.

"ఇఁక మాయక్కసంతానముమాట. దిగువనుండి మొగవరకుఁ జోవుదము. అందఱికంటె కడసారి వాఁడు సుందరము; ఐదేండ్లవాఁడని జ్ఞాపకము. వానికొఱకు పుస్తకము కొనియెదను," అని మొదలి యనెను.

పిల్ల కొంతసంతోషించి, "అవును-రంగులబొమ్మల తోడిది"; యని యేమో చెప్పుచుండఁగా, వేదాంతసార మన్న పుస్తకము మొదలి కొనితెచ్చి యతని చేతఁ బెట్టెను. జోళ్ల పొట్లమును జుట్టలపెట్టెయుఁ గలిపి యెంతబరువో, పుస్తకమంతబరువు; వేదాంతమంతయు వడియఁ గట్టఁగా దిగిన నిగ్గగుటచేతఁ గాఁబోలు !

"బలరామా, పుస్తకముల కొట్టులో నున్నాము గనుక సుందరముకంటెఁ బెద్దది యాండాలుకుఁగూడ నేదియో గ్రంథమే కొందము. అది రమారమి యేడేండ్లది...... దానికొఱకు పాకశాస్త్రమును గొనియెదను. పదిపండ్రెండేండ్లు గడచినతరువాతఁ బనికిరావచ్చును........ అరవ గ్రంథము గాక తెలుఁగుదే కొనియెదను. ఆండాలును దెలుఁగువాఁడెవ్వఁడైనఁ గట్టుకొని యది తెలుఁగు నేర్చుకొనునేమో యెవరు చూచినారు?" అని మొదలి మఱియొకపుస్తకముకొని మిత్రునిపైఁ బడవైచెను.

"వరదా, నేనేమి గాడిద ననుకొనుచున్నావా? చాకలవాఁడు——"

"బలరామా, నేను చెప్పిన పనులన్నియుఁ జేయుటకుఁ బ్రమాణము చేసినావు; మఱచిపోకుము...సుందరముఁ ఆండాలు అయినారు. ఆపయివారు మీనాక్షి, నాంచారు, రామసామి: పది, పదునాలుగు పదునెనిమిది యేండ్ల

వారు. ఏమి కొనుచున్నవారు? నీయుద్దేశము, వారికొఱకు?" అని మొదలి యడిగెను.




"ఏరా నేనేమి గాడిదననుకొనుచున్నావా"

పిల్లకు మరల నించుకంత ధైర్యము కలిగినది. మొదలికి మనస్సు కరఁగుచున్నదని యతని యాశ. చేరువను బొమ్మల దుకాణమొకటి యుండుట చూచి యతఁడు, పెద్ద దొరసాని బొమ్మ—" యనెను.

"భేష్! బాగుగా చెప్పినావు. అదియే తగిన కానుక, రామసామికి......కాని దాని నతఁడు చెల్లెండ్ర కిచ్చునేమో? అది వలదు...పొడుగుపాటి చేతికఱ్ఱ...ఊఁహూఁ! అదియు వలదు. దానిని తండ్రి తీసికొనవచ్చును...... చత్వారపు జోడు కొందము. అది వానికి మఱి యిరువది సంవత్సరముల పైని బనికి రావచ్చును. మా కందసామి బావగారిది దగ్గఱచూపు గనుక, ఆయనకు వేఱువిధమైన సులోచనములే కాని చత్వారపు జోడు పనికిరాదు. మీనాక్షికి...పదియేండ్లది గదా?...మఱకాళ్ల జత. నాంచారుకు......ఆఁ! మంగలి కత్తి. ఈకాలమున దొరసానులు మంగలకత్తులు వాడుక చేయుచున్నారఁట! రమ్మ మఱి; ఇవన్నియుఁ గొనవలసి యున్నది."

పిల్ల, "మంగలికత్తి మీబావగారు వాడుక చేసికొందురేమో సుమా," అని మెగతాళిగాఁ బలికెను.

"ఆ భయము లేదు. ఆయనయు నావలెనే మంగలి చేతికి జుట్టునిచ్చువాఁడే. సొంతక్షౌరము చేసికొనునా, కత్తి గంట్లకు సున్నపుబొట్లు పెట్టుకొని పీరులపండుగ వేషము క్రిందఁ దయారగును," అని నవ్వుచు మొదలి పయిని వివరించిన వస్తువులన్నియుఁగొని పిల్ల చేతి కిచ్చి, "బలరామా, భద్రము! పుస్తకములు చంకఁబెట్టుకొని మఱకాళ్లు కుడిచేతిని బట్టుకొనుము. ఇక్కడకు మాయక్క కుటుంబము ముగిసినది. ఇఁక మా పెదతండ్రి కూఁతురు రంగనాయకి కుటుంబము. ఆమెకును, ఆమె మగనికిని గలిపి యేఁబది రూపాయిలు మామూలు........ఏఁబది వీణ తీఁగెలు కొని యిప్పుడు పంపెదను," అనెను.

"వారియింట వీణ యున్నదా?"

"వీణకాదుగదా తంబురా" కొయ్యయు లేదు. వారి కూఁతులయిదుగురకు—"

"అయిదుగురే! మగపిల్లలో?"

"లేనే లేరు. పంచకన్యలలాగున నయిదుగురు కొమార్తలే కలిగినారు. వారిలోఁ బెద్దది పదునాల్గు సంవత్సరములది. దానిని నాకుఁ గట్టిపెట్టఁ జూచుచున్నారు. నాంచారును జేసికొందునని మాయక్క తాయా రాశపెట్టుకొని యున్నది. దానికొఱకే మంగలి కత్తి కొన్నాను: మాంగళ్యసూచకము. పక్షపాతము లేకుండఁ బంచకన్యలకొక్కరకపు వస్తువులే పంపవలయును......అవిగో, అక్కడ ప్రేల గట్టి యున్నవి, పిట్టగూండ్లు; వానిని గొందము."

"రామచిలుకలా, గోరవంకలా వారు పెంచుచున్నవి?"

"రాత్రులజోలపాటలు పాడుటకు దోమలే వారు పెంచుచున్నవి. పిట్టగూండ్లు మోయలేవు; చివరనుగొనవచ్చును. రంగనాయకి కుటుంబమైనది. ఆమెతరువాతిది ముత్తులక్ష్మి. లక్ష్మియన్న పేరు పెట్టుటచేతఁ గాఁబోలు, పెండ్లి యయినవెంటనే మగఁడు వైకుంఠవాసుఁ డైనాఁడు! ఆమె కోసము పదివీసెలపసుపు, నాలుగువీసెల కుంకుమ."

పిల్లె: "తప్పు తప్పు! భగవంతుఁడు కలిగించిన వైధవ్యమును బరిహాసించిన ట్లుండును."

"అవివాహితుఁడనగు నాకు రవికలగుడ్డలు పంపిన దామెయే" అని మొదలి.

"నీవు పొరపడియుందువు. ఆమె పంపినవి జేబురుమాళ్లయి యుండును" అని పిల్లె సమాధానము చెప్పెను.

"జేబురుమాళ్ల మీఁద రంగురంగుల మొగ్గ లుండునా? పోనిమ్ము; నీమాట యేల త్రోసివేయవలయును?........ ఆమెకొఱకు పొడుముడబ్బీ కొనెదనులే. మఱి రా; ఆలస్య మగుచున్నది. జాబితా జాబితాలాగుననే యున్నది. వీణతీఁగ లింకను గొననేలేదు. చేతిలోని పొట్లము నీవు మాటిమాటికిని జాఱవిడుచుచున్నావు. అవి యెత్తినప్పుడు చంకలోని పుస్తకములు జాఱుచున్నవి. జెట్కా–బండి చేయింపుమందువా యేమి?" అని మొదలి యడిగెను.




జెట్కా–బండి ప్రశంసపడిన యుత్తరక్షణమందు జెట్కా–వాఁడొకఁడు ప్రత్యక్షమైనాఁడు. బరువెక్కు–చున్న బలరామపిల్లె వైఖరి చూచి, యరగంటనుండి యాబండి వారిని వెంబడించుచుండెను.

అటుతరువాత వరదరాజమొదలి కొన్న వస్తువు లన్నియు వివరించుట యనావశ్యకము. బండి క్రమక్రమముగా నిండినది. ఆఱుగంటలకు మిత్రు లిరువురును మొదలిమందిరము చేరుకొనిరి. ఉగాదికానుకలని మొదలి వెక్కి–రింపుగాఁ బేరుపెట్టిన యావస్తువులన్నియు బండివాఁడు తెచ్చి గది నడుమ కుప్పపోసెను.

"వరదా, ఇవి కొనుటతో నీవెఱ్ఱి తీరిన దనుకొందును. ఇవి కానుకలుఁగాఁ బంపెడి యసందర్భమునకు దిగవని నా నమ్మకము," అని పిల్లె సందేహముతో మొదలి మొగమువంకఁ జూచెను.

"నీసంశయ మిప్పుడే తీరఁగలదు," అని మొదలి కొన్ని తెల్ల కాగితపుముక్క–లు తీసి, వానిమీఁద, "తమ్ముఁడు వరదరాజమొదలిపంపిన యుగాది కానుక," "మఱఁదివరదరాజ మొదలి పంపిన యుగాదికానుక," "మేనమామ వరదరాజ మొదలిపంపిన యుగాదికానుక," యని వ్రాయుచు, "బలరామా, మొద్దువలె నిలువఁబడి చూచెదవేమి? రమ్ము; ఈజాబితాను బట్టి పయివిలాసములు వ్రాయుము, "అని పిల్లెను బిలిచెను.

పిల్లె వ్రాయ ననెను; మొదలి ప్రమాణమును జ్ఞప్తికిఁ దెచ్చెను. పిల్లె కోపముతో, "ఓయీ, నీమూర్ఖబుద్ధి మేర మీఱినది. మతిభ్రమతప్ప వేఱుకారణము నీచర్యకుఁ గనఁబడదు. ప్రమాణముతప్పిన పాపమునకుఁ బ్రాయశ్చిత్తమైనను జేయించుకొందును గాని నీవెఱ్ఱికి వెనుకతాళము మఱి వేయను. చిరకాలమిత్రుని నన్నిట్లు చులకనచేసిన మాట యటుంచుము. బంధువిరోధము కొనితెచ్చుకొనఁ జూచుచున్నావు. కడసారి నాప్రార్థన వినుము" అని దీనాలాపములకు దిగెను. "ప్రమాణము" అన్న యొక్క–మాటయే మరల ముక్తాయింపు.

పిల్లెఁ గిఱ్ఱునఁ దిరిగిపోవుచుఁ బిట్టగూఁడు కాలికిఁదగిలి ముందుకుఁదూలెను.

"ఆఁ,ఆఁ! భద్రము. ప్రమాణము తప్పినందుకు ఫలితము వెంటనే కనఁబడుచున్నది. బలరామా, వెళ్లెదవా? రెండు మేజోళ్ల జతలు తీసికొనిపోరాదా? రెండుమంగలికత్తులైనను సరియే. పోనీ, రెండుసబ్బుపెట్టెలు" అని మొదలి వెంబడించెను.

అందుకు జవాబు తలుపు దడాలున బయటనుండి మూసిన చప్పుడుమాత్రమే.

* * * * *

ఉగాదికి ముందుదినమున పిళ్లకు మనస్సు బాధింపఁ జొచ్చినది. కారణము, మిత్రునియొద్దనుండి వచ్చినచీటీ. అందిట్లున్నది:-

"బలరామా, తలనొప్పితో బాధపడుచున్నాను. నీవిచ్చిన మాత్రలలో రసమో విసమో యున్నదికాఁబోలు! దయగలదేని వెంటనే రమ్ము. వరదరాజమొదలి వ్రాలు."

చీటీ చదువుకొని పిళ్ల తనలో, "ఎంతపొరపాటు చేసినాను! మాత్రలు నాలుగిచ్చియుండవలసినది. ఇఁక నిప్పుడు పని చేయుమందొక్కటియే," అని నిశ్చయించి, యమృతాంజనపుడబ్బీయొకటి జేబులో వేసికొని, మిత్రుని యింటికి వెళ్లెను.

మడతకుర్చీమీఁద కాళ్లుచాఁచి పరున్న మొదలి యతనిఁ జూడఁగానే, "బలరామా, వచ్చినావా? మఱి నిన్నుఁ జూడ ననుకొన్నాను," అని హీనస్వరమునఁ బలికెను.

పిళ్ల తొందరతో సమీపమునకు వెళ్లి, "ఏల యీ యధైర్యము? నీకు వచ్చిన భయమేమియు లేదు. ఏమి బాధగా నున్నదో చెప్పుము" అని ప్రేమ యుట్టిపడున ట్లడిగెను.

రోగి కన్నులు తేలవైచుచు, "నాకున్న బాధ యేమనఁగా, అవిగో నేలనున్న యీవస్తువులవైపునఁ జూడుము: అవి రెండుచోటులకే తీసికొనివెళ్లవలెను. ముత్యాలపేటలో మాయక్క తాయారున్నది; చాకలిపేటలో మా పెదతండ్రికొమార్త రంగనాయకి యున్నది. బండి చేయించుకొమ్ము; అద్దె నాపద్దున వ్రాయుము. జోళ్లను, బిట్టగూండ్లను మాత్రమే కొంతభద్రముగా. తీసికొని వెళ్లవలసినవి," అని మెల్లగాఁ జెప్పెను.

పిళ్ల చిట్లింపుమొగముతో, "ఇంకను వెనుకటి వెఱ్ఱియే? ఇప్పటికిని బోలేదా?" అనెను.

"ఇవిమాత్రమే పోలేదు. తక్కినవన్నియు బంగీలు కట్టి నిన్నను, మొన్నను బంపివేసినాను. నాతో సంబంధము చేయఁ జూచుచున్నవారు గనుక, వీ రిరువురకును స్వయముగా తీసికొనివెళ్లవలయునని యేర్పాటు. అడ్డుగా దిక్కుమాలిన యీతలనొప్పి వచ్చి తగులుకొన్నది. బంగీమూలముగాఁ బంపించుటకువ్యవధిలేదు. మామూలుకూలివారిని నమ్మియిచ్చుటకు వస్తువులు- హహ్హాహ్హా!—విలువమైనవి. నీకును నాకును భేదములేదు గనుక, నా కడసారి ప్రార్థన మన్నించి యివి నీవు తీసికొనివెళ్లి యిచ్చిరమ్ము.

నామాట వినకుంటివా, చచ్చిదయ్యమై నిన్నుఁ బట్టుకొందును"అని మొదలి కనుగ్రుడ్లు త్రిప్పెను.

తీసికొనివెళ్లనన్నమాట పిళ్ల నాలుకకొనవఱకును వచ్చినదిగాని, యింతలో దివ్యమైన యాలోచన యొకటి యతని మనస్సునకుఁదటాలునఁదట్టినది: పయివిలాసములు దొరకుచున్నవి గదా? జేబులో నూఱురూపాయిలనోటున్నది. త్రోవలోనే తపాలాకచ్చేరీ. వస్తువు లిచ్చినదియు, లేనిదియు మొదలి చూడవచ్చినాఁడా? ఈవిధముగా నూహించి, యతఁడు "ఓయీ, నీ వింతగాఁ జెప్పుచున్నావు గనుక కానిమ్ము" అనెను.

మొదలి గబాలున లేచి పిళ్లవీఁపుతట్టుచు, "నీవు నామాట త్రోసివేయవని నాకుఁ దెలియును. నాకు బహుసంతోషముగా నున్నది" అని గంతసాగెను.

* * * * *

తపాలాకచ్చేరీకే పిళ్ల మొదట బండితోలించెను. కచ్చేరీలోనుండి యతఁడు బయటికి వచ్చినసరికి నాలుగు గంటల ముప్పావు దాఁటినది.

"మఱి యెక్కడకు సామీ?" అని బండివాఁడు.

"నీయిల్లెక్కడ?"

"తిరువల్లిక్కేణి."

"అక్కడకే పోనిమ్ము."



శ్రీమతి శారదామణిదేవి

శ్రీ రామకృష్ణపరమహంసగారి సతీమణి




## డాక్టరు సన్‌యాట్ సేనుగారు, వారి మరణశాసనము

చైనా అధ్యక్షులుగ నుండిన కీ. శే. డాక్టరు సన్ యాట్ సేనుగారి పటము; దానిదిగువ వారిమరణశాసనము. ఇది చైనాలోజరుగు ప్రతివిప్లవకారుల సభయందును నుంచబడును. జాతీయవాదులందరు మరణశాసనమును కంఠపాఠము చేయుదురు. "విప్లవోద్యమ మింకను ముగియలేదు. సోదర సభ్యులందరు ఉద్యమము జయప్రదముగ కొనసాగునట్లు పాటుపడవలయును" అను రెండువాక్యములే వారి మరణశాసనము. మూడుపర్యాయములు ఛాయాపటమునకు వందనము లర్పించి మరణశాసనము చదివి మూడునిమిషము లధ్యయనము చేయుట చైనా జాతీయవాదులందరకు సంప్రదాయమైనది.

# ఆంధ్రసభలు - అనంతపురము—౧౯౨౭.



శ్రీ దండు నారాయణరాజుగారు, యం. యల్. సి.
ఆంధ్రరాష్ట్రీయమహాసభాధ్యక్షులు



శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు
ఆంధ్రగాయకమహాసభాధ్యక్షులు



శ్రీ చినపడమల ఓబిరెడ్డిగారు
ఆహ్వానసంఘాధ్యక్షులు, ఆంధ్రరాష్ట్రీయమహాసభ



శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారు
ఆంధ్రగ్రంథాలయమహాసభాధ్యక్షులు

అది యెద్దుబండి. తిరువల్లిక్కేణిలో గంగనామండపము నకుఁ బోవుసరికిఁ జీఁకటిపడినది. దారిలో పిల్ల చేసిన యుద్యోగ మేమనఁగా,బండిలోని వస్తువుల కంటించియున్న కాగితపుముక్క లతఁడు పదిలముగా నూడఁదీసెను; ఒక్కటియైనను మిగులనీయలేదు.

జనసంచారములేని ప్రక్కసందులో బండి యాఁపించి, పిల్ల బండివానితో, "నీకుఁ బెండ్లి యయినదా?" అని జంకుచుఁ బ్రశ్నించెను.

"అయినది సామీ, ఆఱుగురుపిల్లలు."

"ఓహో! మహాదృష్టము."

"ఏమి యదృష్టము సామీ?పోషింపలేక చచ్చుచున్నాను."

"ఇదిగో, ఇది తీసికొమ్ము" అని పిల్ల వానిచేతిలో నొక రూపాయి పెట్టి, "ఓయీ, మీరు పిట్టలేవయినను బెంచుచున్నారా?" అని యడిగెను.

"పిట్టలా సామీ? కోడిపెట్ట నొకదానిని బెంచుచున్నాము."

"అయ్యో! పిట్టలు లేవేమి? నీకు-నీకు-నేను కొన్ని పిట్టగూండ్లీయవలె ననుకొంటిని. ఆమీఁద రబ్బరుజోళ్ల జతయొకటి, చత్వారపుజో డొకటి,ఆపైని గొన్నిగ్రంథములు. అన్నట్టు, నీవు వీణ మీటఁగలవా?"

బండివాఁడు తెల్లపోయి పిల్ల మొగము మిడుతుమిడుతుమని చూచెను.

పిల్ల మరల: "వీణతీఁగెలు కొన్ని యీయవలె ననుకొంటినిలే, నీకు........నామాటలన్నియు విని నీవు నన్ను వెఱ్ఱియాస్పత్రినుండి తప్పించుకొని వచ్చినవాఁడ నేమో యని యనుమానపడుచుండవచ్చును. నేనువెఱ్ఱివాఁడను గాను. నాకొక గొప్పయాపద సంభవించినది."

"అయ్యో, పాపము! నాకు నిండ విచారముగా నున్నది సామీ."

"ఆయాపద యేమనఁగా, ఈబండిలోని వస్తువు లన్నియుఁ గొందఱు స్నేహితులకు ఉగాదికానుకలుగా నిచ్చుటకు నేను కొన్నాను. కొన్నతరువాత, ఆస్నేహితు లందఱును చనిపోయినారని తెలియవచ్చినది."

"రామరామరామా! అందఱు నొక్కమాటే? ఏలాగున సామీ?"

"రెయిలుబండ్లు తిరుగఁబడినవఁట!"

"ఎక్కడ సామీ?"

"కుంభఘోణములో........అందుచేత ఈవస్తువుల యవసరము నాకు మఱి లేదు. వీనిని జూచుటయు నాకుఁ గష్టముగా నున్నది: నాయాపద కివి జ్ఞాపక చిహ్నములుగా నున్నవి."

"అయ్యో! సామీ."

"ఓయీ, విచారింపకు. దైవఘటన! ఎవరు తప్పింపఁగలరు? నాదుఃఖము పోఁగొట్టఁదలఁచితివా,యీబండిలోనివస్తువులు నీవు తీసికొనిపొమ్ము. నీభార్యయు, బిడ్డలును వీని నెందుకైన నుపయోగింపవచ్చును; లేదా యమ్ముకొన వచ్చును. ఇందులో చుట్టలపెట్టె యొకటి యున్నది. దొరలు కాల్చు చుట్టలు. ఏమందువు?"



బండిలోనికిఁ దొంగిచూచి, "హాస్యమా, సామీ?" అని బండివాఁ డడిగెను.

"హాస్యము కాదు. ఈవస్తువులు మఱి నాకన్నులఁ బడ రాదు. ఇవి నీకు రేపటియుగాదికిఁ గానుకలు; ఇంటికిఁ దోలుకొని పొమ్ము. ఇదిగో"

పిల్లబండి దిగి, "మఱియొక రూపాయి."

"దండము సామీ" అని బండివాఁడు బండి దడదడలాడించుకొని పోయెను.

*　　*　　*　　*

ఉగాదినాఁటి యుదయమునఁ దొమ్మిదిగంటలకు పిల్ల మొదలిమందిరమునకు వెళ్లఁగా, నవ్వుమొగముతో మొదలి మిత్రునిఁ బలుకరించెను.

"బలరామా, నామాట త్రోసివేయవని నేను మొదటినుండియు నమ్మినాను. ఏమి జరిగినది? ఉగాదికానుక లిచ్చిన తరువాతివినోదము చూచినావా?"

ఎఱ్ఱవాఱిన మొగముతో పిల్ల, "వరదా, నన్ను క్షమింపుము. నేను ముత్యాలపేటకుఁగాని, చాకలిపేటకుఁ గాని వెళ్లనే లేదు. నీవు చెప్పినట్లు చేయుటకు నాకు మనస్కరించినది కాదు" అనెను.

"ఆఁ" అని మొదలి నోరు వెళ్లఁబెట్టి, "మఱి నా వస్తువులో? ఉగాదికానుకలో?"

"వానిఖరీదు నేను నీకు ముజరా యిచ్చుకొందును. అవి యన్నియు బండివాని కిచ్చివేసినాను."

"ఏమి—ఏమిచేసితివి ? ? ? ? ? ?"అని మొదలి పెద్ద గొంతుకపెట్టి యడిగెను,

"బండివాని కిచ్చివేసినాను."

"అన్నియునా ? ? ? ? ? ? "

"అన్నియును; అవి వాఁడు పుచ్చుకొనుటకు రెండురూపాయలు దక్షిణకూడ సమర్పించినాను—ఇఁక నేఁటితో మన మైత్రి కంతమే కాఁబోలు!" అని పిల్ల లేచెను.

నిశ్చలదృష్టులతో నిశ్చేష్టుఁడై నిమిషమువఱకును మొదలి నిలిచియుండుటచేత పిల్ల యూహ నిశ్చయమైనట్లే కనఁబడినది. అటుపిమ్మట, హఠాత్తుగా, అతని మొగమునుండి కోపము మాయమైనది. కన్నులు మెఱయసాగినవి. పెదవులు కదలఁజొచ్చినవి. చిఱునవ్వు మొలకెత్తినది. చిఱునవ్వు నిండునవ్వుగా తేలినది. నిండునవ్వు వెడనవ్వుగాఁ బరిణమించినది. వెడనవ్వు పెనుబొబ్బ యైనది. మడత కుర్చీమీఁదఁ బడి యతఁడు ప్రక్కలు పట్టుకొని పకాపక, పకాపక పకాపకమని బొబ్బరించెను.

దిగ్భ్రమచెంది పిల్ల కొంతకోపముతోఁ గొంత విన్నఁబాటుతో, "ఏమి యిందలి కిటుకు?" అని యడిగెను.

"నన్నడుగకు; నేను చెప్పలేను, నాకుఁ దగిన ప్రాయశ్చిత్తము జరిగినది," అని మొదలి కన్నులు తుడుచుకొనుచు



లేచి, "బలరామా, లెమ్ము. భోజనమునకు వేళ యైనది. ఇది యుగాది పండుగ. ఉగాదివిందు నీకు మాయింట. నీవలన నాకుఁగలిగిన సంతోషముకంటె గొప్ప యుగాదికానుక యేముండును? నీవు లోనికి వెళ్లి స్నానము చేయుము. ఇంతలో నేను రెండు తంతివార్తలు పంపి వచ్చెదను," అని పిల్లను లోనికిఁ బంపించెను. అతఁడు పంపిన తంతివార్తలు ముత్యాలపేట కొకటి; చాకలిపేట కొకటి. అవి వట్టివి కావు; ద్రవ్యసహితమైనవి.

*　　*　　*　　*

పిల్లకు మొదలిచెప్పని కిటుకు నాఁటి తెల్లవాఱుజామున బండివాని యింటికి వెళ్లినవారికిఁ దెలిసి యుండును. వాని పెండ్లాము రబ్బరుజోళ్లు తీసి తొడుగుకొనుటకుఁ బ్రయత్నింపఁగా, రెండుజోళ్లలోను రెండు పదిరూపాయిలనోట్లున్నవి. దానిమగఁడు చుట్టకొఱకు చుట్టలపెట్టె విప్పి చూడఁగా, దానిలో రెండు పదిరూపాయిల నోట్లు. పిట్టగూండ్లలోఁ, అట్లే తక్కినవస్తువులలోఁ, గొన్ని పదిరూపాయిలనోట్లు, కొన్ని యయిదురూపాయిల నోట్లు, కొన్ని రూపాయినోట్లు! ఆకుటుంబమునకు నాఁడు కలిగిన యానందమునకు మేరలేదు. అట్టి యుగాదికానుకలు వారియబ్బనాఁడు, తాతనాఁడు నెఱుఁగరు.

ముత్యాలపేటకుఁగాని,చాకలిపేటకుఁగాని,నాఁటి యుదయమునఁ బదిగంటలకు వెళ్లినయెడల, అక్కడను పిల్ల తెలియఁగోరినకిటుకు తెలిసియుండును. తపాలామూలమున నొకటి, తంతిమూలమున నొకటి, వారికి ద్రవ్యరూపమైన యుగాది కానుకలు రెండేసి యందినవి. రెండువిధములఁ బంపినవాఁడును వరదరాజమొదలియే. మామూలుకంటె ద్విగుణముగా వచ్చిన యాయుగాది కానుకలను జూచి, తన పెద్దకూఁతును మేనమామ పెండ్లియాడుటకు నిశ్చయించినాఁడని తాయారు సంతోషించినది; రంగనాయకియు నట్లే సంతోషించినది.

చదువరులారా, మీకును ద్విగుణములైన యుగాదికానుకలు కలుగును గాక!

గీ. క్రొత్తసంవత్సరంబు మీకుం ద్వదాప్త
జనులకు సుఖప్రదంబయి జరుగుఁగాక!
ఇట్టిసంవత్సరంబు లనేకము లిటు
మీఁద మీకుఁ గల్గుత పరమేశు కరుణ!

---

## తాళీవని

పెనుమర్తి వెంకటరత్నము

ఏ సమున్నతతాళ భూమీరుహమ్ము-లేయుగాల నావంటివో? యిపు డనూన
నిశ్చలాస్పందముకుళితనేత్రములను-తలచుచున్నవి యుగయుగమ్ముల చరిత్ర!

జనన దేశమునుండి నిశ్చలతపొందు; పూర్వలౌల్యమ్ము విస్మృతి పొందినట్టి
జీవులో యేమొ? గాలి వీచినను గాని-పలుకనే పల్క- వీరహఃప్రణయమేమొ?

ఈ యుగయుగాంతజీవు లెన్నెన్నిమార్లు-ఆశలను బెంచుకొనిరొ! దిగంతములకు
ప్రాకలేనియాసల తలపై ధరించి-ఇల నిలంబడు శీతోష్ణములు సహించి!

---



వేలూరి శివరామశాస్త్రి గారు

[చిత్రకారుడు: అడివి బాపిరాజు గారు, బి.ఏ.]

౧

కొందఱ జన్మము ఉపోద్ఘాతము లేక వెలువడదు. కొందఱు తల్లిని లంచమిత్తురు. కొందఱు ఆత్మసమర్పణ మొనరించుచు తల్లిని గూడ నర్పింతురు. మఱికొందఱు ఏదో చెప్పవచ్చి ఊరకున్నటులు చచ్చి ఊరకుందురు. ఇంకొందఱు తండ్రికిని, మేనమామకును పరలోకమునుండి జాబులు గొనివత్తురు. కసుగందులు కొంద ఱిటులు కొంతమందితో సంయోగ వియోగములు చేసి వారి ప్రయోజనము పలాములు చేయుదురు. ఇట్టి చిలిపివా రరుదు కారు.

ఆశ గర్భములో పడినది మొదలు తనస్వాత్వమును కేటాయించుకొనుచునే యుండెను. తాను గర్భమున జాగరిల్లి తల్లిని నిద్రింపఁజేసెను. తీఁగ చెట్టును వంచినట్లు తల్లిని వంచివేసెను. ప్రతిభాశాలుర కది స్వభావము. తుద కాశ జన్మించి తల్లిని దక్షిణ పుచ్చుకొనెను.

ఆశకు తల్లిలేదు. గోవిందునకు భార్యలేదు. ఒకటైనను రెండుగా తోఁచు ఈలోపము ఆశను ద్విగుణప్రేమతో పెంచెను. గోవిందుఁడు ఊయెల నూఁపుచు—ఆశ కిపు డుయ్యాలయే తల్లి' అనుకొనును. నడికిరేయి ఊఁపఁబోయి ఉయ్యాలత్రాళ్లను జూచి, 'తల్లి ఆకాశము నుండి చేతులు చాఁపుచున్నదా యేమి?' అని నివ్వెఱపడును. ఆశ ఆకాశమును జూచెనా, అతఁ డందు స్వర్గమును చూచెను. నవ్వెనా, ఆనందాభిషేక మొందెను. ఆశ అతని వాసనల పెంపొందింపవచ్చిన ఉపకరణము.

ఆశ బడిలో పడెను. అందు పంతుల్లు ఇద్దఱు. మొదటి పంతులకడ ఆశయొక్క చూపుడువేలు కొంత అఱిగెను. ఉన్న పిల్లలలో ఎవరివే లెక్కువ అఱిగెనో ఆశ పరీక్షించును. పంతులవేలు ఏపిల్లవేలంతయు అఱుగకపోవుటచేత అతనితో "ఆలోకకు వచ్చినంత చదువు మీకు రాదు" అనును. హరిణయింటికి వెళ్లి హరిణ తన తల్లిని అమ్మాయని పిలుచుట విని ఇంటికివచ్చి—నాన్నా! హరిణఅమ్మ నాకు లేదేమని గోవిందునితో గోఁజాడును.

ఆశ క్రమముగా పెద్దపంతులకడకు వెళ్లెను. అచట దైనందినము ఒకటాఫు, బుడ్డిఁడుసిరా, ఒకబలపము, ఒక పాళీయు ఆమెకు కావలసిన పరికరములు. బడిపెద్ద యగు శకులాదుఁడు అటిటులు పోవుచుండఁగా కాలుతగిలి ఆశ

సిరాబుడ్డిదొరలి చుట్టుఁబ్రక్కల నున్నవారి పుస్తకముల మీఁద శిల్పప్రావీణ్యమును చూపుచుండును. ఆశ పరాకుగా నున్నపుడు ప్రక్కనున్న 'ఆలోక' టావు దొంగిలించును. ఆశ పట్టుకొనఁగా ఆలోక 'ఇదుగో, పడవచేస్తాను; దీనిమీఁదెక్కి ఇంటికి వెళ్లచ్చు' అనునుగాని తుదకాపడవ వారిమీఁదనేమెక్కి వెళ్లును. ప్రతినాఁడును బలపాలు పంచిపెట్టుచుండుటచే ఆశ యింటిపేరు బలపాలవారుగా మాఱెను. ఆశ తనచేతిలోని పలక పుస్తకములను క్రిందపెట్టునపుడు సంచినుండి కలము జాఱి నేలలో పాఁతుకొని కలాలచెట్టుగా పిలిపించుకొనును.



ఆశ క్రమముగా పైబడిలో చేరెను. కావ్యములలో విష్ణుచిత్తీయము, నైషధము, నాటకములలో మదాలస, ఉత్తరరామచరితము, పురాణములలో భాగవతము, స్కాందము, వేదాంతములలో చతుర్వేదసార సూక్తులు, యాజ్ఞవల్క్యసంహిత-ఈమొదలగునవి చదివెను. మాతులవంశమున ప్రసిద్ధుఁడగు ఏలేశ్వరోపాధ్యాయునిచాలు ఆమెయందు టీకాలు వేసినట్లు కానిపించెను.

ఉపాధ్యాయుఁడు ఆశను బడి చివర కూర్చుండఁబెట్టును. సదుత్తరములు చెప్పఁజాలని పిల్లలకు చెప్పిన వారిచే దవడకాయలు బహుమతి. ఇపుడాశచే బహుమతి పొందనివాఁడొక ఉపకలాపుఁడే. అపుడపుడు ఆమె మృదుహస్తస్పర్శ మాతఁడును, అతని లఘుచపేట ఆశయును పంచుకొందురు. ప్రథమస్థాన మాక్రమింప వారు చేయు వ్యాసంగము ఒకపోరు. అచట కజ్జలు దొరకుచో వారు కొట్టుకొనరుగాని అవి వారితరఫున పోరాడుచో చూచుచుందురు. వారు బడి విడిచిరా, పరమమిత్రులు. వారు ఇంటికడ స్మృతులు చర్చించి అందలి ఆచారకాండను విమర్శించుకొనుచుందురు.

౨

గోవిందుఁడొకనాఁడు గురుములూరు పయనమైపోయెను. అచట అతనిసోదరి గంగయు, బావమఱఁది వీరేశ్వరుఁడు, మేనల్లుఁడు ముకుందుఁడును కలరు. భార్యావియోగమయిన పిమ్మట గోవిందుఁడచటికి వెళ్లుట అదియే మొదలు. గంగావీరేశ్వరులు గోవిందుని అతిభక్తితో పూజించిరి. గోవిందున కింటికడ కూఁతురేటులో ఇచట ముకుందుఁడటులు. ముకుందుని ప్రతిపనియు అతనికి ముద్దు. మేనమామ అయిపోయెను గాని గోవిందుని ముకుందుఁడు కనిపట్టుచో అతనిని గూఢచారిగా భావించును. గోవిందుఁడచట కొన్నాళ్లుండి బావమఱఁది యనుమతిని గంగాముకుందులను తనయింటికి తీసికొని వెళ్లెను.

గోవిందుని రాకకు కారణము గంగా వీరేశ్వరుల కంటె లోకులు స్ఫుటముగా నెఱిఁగిరి. చదరంగ మాడువారికంటె పయివారికి మంచియెత్తులు తోఁచును. గోవిందుఁడు ముకుందునకు పిల్లనీయవచ్చెనని ఊరును నాడును మ్రోఁగిపోయెను.

ఆశాముకుందు లిరువురు కలిసి భుజించుచుండఁగా, చదువుకొనుచుండఁగా, మాటలాడుచుండఁగా, గంగ కనుల పండువుగా చూచుచుండును. గోవిందుఁడామాపునకె ఆమెను తీసికొనివచ్చెను.

ఆశాహారిణులకు మిగుల మైత్రి. ముకుందుఁడు ఉన్నను హారిణ ఆశను,ఆశ హారిణను విడనాడియుండలేదు. ముకుందుఁడు ఆశతో వాదించుచు ఓడిపోవునపుడు హారిణ అతనిపక్షము నవలంబించి వాదమును నిలువఁబెట్టినపుడు, ముకుందుఁ డామెను ప్రసన్నముగా చూచెడివాఁడు. ఆశ స్త్రీధన మపహరింపరాదు అని అనుచుండెడిది. హారిణ తలవంచి ఆలోచించి ఏదోపని కల్పించుకొని ఇంటికి పోయెడిది. కాని అరుఁగుమీఁద కూర్చుండి చూడ కుండలేక పోయెడిది. ముకుందుఁడు "ఆశా! హారిణయింటికి పోదమా? అకారణముగా పరిహాసించితి" వనఁగా దానిని పరిహరించుటకు నీసాయమే కావలయునని ఆశ అనునది. ఆశా ముకుందు లిరువురు హారిణయింటి కేఁగి హారిణచేతను, వారి పెద్దలచేతఁగూడ గారవింపఁబడుచుండిరి.

కొన్నాళ్ళపైని వీరేశ్వరుఁడు విచ్చేసెను. వారి సమ్మేళనమే అదియొక పండువుగా నుండెను. కొలఁది దినములకు భార్యాపుత్రులతో వీరేశ్వరుఁ డింటికి మఱలెను. వారలఁబంపుటకుఁబోలె గోవిందుఁడువారి ననుగమించెను. గురుములూరికి వెళ్లినపిదప కొన్నాళ్లకు గోవిందుఁడు గంగా వీరేశ్వరులతో పెండిలిమాటలు తెచ్చెను. వీరేశ్వరుఁ డానందముతో అంగీకరించెను. గోవిందుఁడు నిష్క్రమించెను.

ఇపుడు ఆమగణాంతము వీరు ఎవరికి ఈ బంధము నిర్మించిరో వారు దీనిని ఇసుమంతయు ఎఱుఁగరు. రెండు తాంబూలములతో ఆబంధము నాగపాశ మగును. సంఘమంతయు ఆనాగపాశమునే ప్రాణముచే పూరించును. ఆహా తలిదండ్రుల ప్రేమపాశము ఎంతనాగపాశమో!

బంట్లు పాకలు పందిళ్లు వేయుచుండిరి. చాకళ్లు ఇండ్లమూలమూలల వెల్లవేయుచుండిరి. వంటబాపనక్కలు పిండివంటలు మొదలుపెట్టిరి. ఈప్రయత్న మంతయు తమకొఱకే యని ఆశకును, ముకుందునకును తెలియక పోలేదు. తండ్రులు తమతో ఆప్రసంగము తేలేదు. వారును తండ్రులతో ఏమియు సంప్రతింపలేదు. కాని వారు తమవిధిని ఇటులు నిర్వర్తించుకొనిరి. ఆశ ముకుందున కొకకమ్మ యిటులు వ్రాసెను:

"ముకుందా!

నానోరు మూఁగిది; చేయి వాచాలము. నీవు నాకు బావ వగుటలో సందియము లేదు. నాతండ్రి మాత్రము నిన్నిఁక 'బావా' అని పిలువకుండఁ జేయుచున్నాఁడు.

వలచినవానిని పెండ్లాడవచ్చునుగాని పెండ్లాడినవానిని వలచు టెటులు? పెండ్లాడినవానినే ప్రేమింపుమని పెట్టిన బడిలో శిష్యులు పూర్వపక్షములు మొదలు పెట్టఁగా ఉపాధ్యాయుఁడు బెత్తము జాడించుచున్నాఁడు. ఆదెబ్బ లన్నియు వానిమీఁదనే వ్రాతలు పడుచున్నవి.

మెడలోఁగట్టిన మంగళసూత్రమును ఉరిత్రాటిని జూచి ప్రేమ విలపించుచున్నది. బజంత్రీల బాజాలలో ఆ విలాప మెవరు విందురు?

ప్రేమప్రవాహమునకు ఒకఒడ్డా? రెండొడ్లా? నా మైత్రికి హారిణను కానుకగా అర్పించుచుంటిని."

ఆశ ఈయుత్తర మెపు డారంభించెనో ముకుందుఁడును సరిగా అపుడే ఈయుత్తర మారంభించెను.

"ఆశా!

నాకు మీతండ్రిమీఁదను, నాతలిదండ్రులమీఁదను గల ఆదరముచే ఇఁకముం దెన్నఁడును నిన్ను ఆశా అని యే పిలుతునుగాని, 'ఏమోయ్!ఏమ్!ఓయ్!' అని పిలువను. కాని లోకులు నిన్ను ఉళక్కి పెండ్లామందురు. అటు లనకుండఁ జేసికొనుభారము మాత్రము నీది.

రోగికిని వైద్యునకును పాలే కోరిక. నాకు ఆదేశముగా వచ్చునాతనికి నామైత్రిని కానుకపంపు నీ ఉళక్కి మగఁడు ముకుందుఁడు."

ఆశ హారిణను పిలిచి ఈవిషయ మంతయు పూసగ్రుచ్చినటులు చెప్పెను. ముకుందుఁడు వ్రాసిన ఉత్తరమును చూపించెను. తుదకు తాను వ్రాసిన ఉత్తర మంతయు గుఱుతు తెచ్చుకొని వినిపించెను. అది విన్నంతనే హారిణ మాటాడక వెళ్లిపోయెను.

హారిణయింటిముందు పెద్దపెద్ద మంగళప్రయత్నము లారంభము లైనవి. సరిగా ఆలగ్నముననే హారిణాముకుందులకు పెండ్లి ఆయెను.

## 3

గోవిందునియింట పాకలు పందిళ్లు పీఁకివేయఁ బడెను. ప్రజలు ఏమూల చూచినను గుసగుసలు పోవుచుండిరి. గోవిందుఁ డూరిమో మెఱుఁగఁడు. అతఁడు ఆతీరుబడిలో స్మృతుల నన్నింటిని తిరుగవైచి చూచెను. ఆచారముల ననుసరించి స్మృతులు మాఱుటయు, స్మృతులను ఒకానొక మధ్యవేగముతో ఆచారము లతిక్రమించుటయు ఈ రెంటికిని ఈపందెము నిత్యమనియు అతఁడు గ్రహించెను. అర్థహీనముగా ఆచరింపఁబడి ముప్పేటగా బిఱ్ఱబిగిసిన వివాహబంధమును జ్ఞానమువచ్చిన తనకూఁతుమెడను స్వయముగా తగిలించుట అపచారమని అతఁడు తనలో తా ననుకొనెను.

ఆశ ఎప్పటి చిఱునగవుమోముతో వాకిటి యరుఁగుపై కూరుచుండి హారిణతో అపుడపుడు ముచ్చటించుచుండెడిదిగాని అందలి రహస్య మెవరికిని మెఱుక పడలేదు.

గోవిందుఁడు ఆశతో ఒకమాటయే నాడలేదు కాని ఒకనాఁ డాహ్వానము వదిలెను. అతఁ డాశను బిలిచి యిటు లనెను: "నాకు భార్యలేని లోపము ఇపుడు కానిపించుచున్నది. ఆశా! నేను లేకుండ నీబాల్యము నీభారమును భరింపలేదు. నీవు అవివాహితగా ఇంట నున్నచో నిన్నును నన్నును వెలివేయరా? లోఁగడనే దిక్కులేని కాకులము; ఇఁక మాలకాకుల మై పోదుము."

ఆశ ఇటు లనెను: "నాయనా! నేను తల్లిని జంపి పుట్టితిని. ఇఁక తండ్రిని జంపి బ్రదుకవలసి యున్నదేమో యని భీతి. నీవులేకుండ నేను బ్రతుకలేను. సంఘములందు చాలకాలమునుండి ఏదోకారణముచే రూఢమయిపోయిన ఒక ఆచారముకంటె యమముకల ఒకానొకజీవి మహత్తరమైనదని నీకుఁ దోఁచెనేని నీయింట నన్నుండనిమ్ము. నాయన్నము నేను వండుకొనఁగలను. నాబట్టఁ పాఁతా నేనుతుకుకొనఁగలను. నాగాలి గూడ నీకు తాఁకనీయను. సంఘమున వెలివచ్చుచో నాకే రానిమ్ము. నేను కోరునది రక్షకుఁడైన తండ్రియొక్క ఒక్క ప్రేమకిరణమే."

గోవిందునకు ఏమి మాటాడుటకు తోఁప లేదు. కానిమ్ము చూచుచుండుటయే నాపని అని అనుకొని అచటినుండి వెళ్లిపోయెను.

కొన్నాళ్లయిన తరువాత ఆశకును తనకును కొంచెమేని స్పర్శ లేకుండునటులు ఇళ్లు మొదలయినవి కట్టించెను. రాఁబోవు నుత్పాతపరంపరలనో మంగళపరంపరలనోకాని చూడఁగలశక్తికై అందుండి ధృతి దాల్చెను.

ఆశ తనయన్నమును తానె వండుకొనును. తనతావు తానె శుభ్రపఱచుకొనును. తెలవారు కడ తన వస్త్రములు తానె ఉతుకుకొనును. గృహోద్యానపు సోపానములనుండి తుంగభద్రలోనికి దిగి తానె నీరు తెచ్చికొనును. శరచ్చంద్రికలోని సోమలతవలె ఆశ ఆశలో ఏకాంతమున నివసించెను.

హారిణ ఇపుడు ఆశకడకు అంతగా రాకపోకలు చేయదు. ముత్తైదువలందఱకు ఆశ యనినచో కంటిలో కారము. సంఘ మంతయు ఆశపై ధర్మశాస్త్రపుమందు దట్టించి తుపాకులు బారుచేసెను. ఆశ తనలో ననుకొనును—'లోకు లందఱు స్వర్గమునకు శ్మశానమని పేరిడుచున్నారు. అట్టి శ్మశాన మనుపేరుకల స్వర్గధామముననే నే నున్నాను.'

నాలుక ఒకతీరున తిరుగదుగదా! లోకులు గోవిందుని పలుతెఱఁగుల ననుకొందురు. అతని నెవరును విందులకుఁ బిలువరు. అతని గృహకృత్యము నెఱిఁగినవారు మాత్రము 'పాము కఱచినయెడల గోవిందుఁడు తనవేలు అని ఊరకుండఁడు' అని శ్లాఘించుచుండిరి. ఇటులు కొన్నివసంతములు కడచెను.

శకులాదుఁడు ఒకనాఁటిరేయి ఒకపొదలో పొంచుండి, గ్రామమునకు వెలుపట నున్న దుర్గాలయమునకు

వెళ్లి ఒంటరిగా వచ్చుచున్న ఆశను వెంబడించెను. ఆచారము నతిక్రమించుచో సంఘమునకు ఎంత అలుసోకదా! అతని ఒకగుండె కొట్టుకొనును. ఒకటి ఉప్పొంగును. ఒక కాలు వెనుకకు మరొకటి ముందులకు నడుచును. మనస్సు కొట్టుకొనును. బుద్ధి నిశ్చల మగును. అతఁ డీ యూటుపోటులలో ఉయ్యాలలూఁగి తుదకు ముందరికే నడచెను.

ఆశ ఈయలికిడికి వెనుదిరిగిచూచెను.

శకులాడుఁ డొకపొదలో నంతరించెను.

ఆశ మెల్లగా నడిచి యింటికి వెళ్లిపోయెను. పిదప పొదనుండి చెడుపామువలె నిర్గమించి గృహోన్ముఖుఁడగుచుండఁగా వెను వెనుక నేదోశబ్దము అతఁడు వినెనుగాని అతని కెవరును కానరాలేదు. 'నాశబ్దమునే నేను విని భ్రమించియుందు నని అతఁ డనుకొనెను. అది ఆశను కాపాడుటకు వచ్చిన రక్షకుని దండశబ్దమా?

ప్రతిశుక్రవారమునను ఆశ ఏసమయమున దుర్గాలయమునకు రాకపోకలు చేయునో శకులాడునకు హృత్కవిలె. ఒక శుక్రవారమున ఆతఁడు మఱల ఒకపొదలో పొంచుండెను. ఆశ ఆలయమునుండి క్రమ్మఱుట అతఁడు కనిపట్టెను. సమయమునకు సాక్షాత్కరించెను. ఆశ అతని ముఖమునందు వలపుదయ్యమును చూచెను. వెంటనే యిటు లనెను : 'శకులాడా! నీ తల్లి ఒంటరిగా వెళ్లుట చూచి కుమారునివిధిని నిర్వర్తింప వచ్చితివా? అటులయిన ఈపొదరింట డాఁగితివేల? ఔను లెమ్ము! కుమారుఁడు తల్లికడ దాఁగుడుమూఁత లాడఁడా?'

శకులాడుఁడు తెల్లఁబోయెను. నాలుగడుగులు ఆమెతో నడచి గమనసౌందర్యమునకు లుబ్ధుఁడయిపోయెను. మెల్లగా నిటులనెను : 'వివాహమే లేనిది నీవు తల్లివెటు లగుదువు ?"

'ఓరివెట్టినాయనా! పెండ్లికాని నీవు నీ యన్నకొడుకులకు పినతండ్రివి కావా? నీ వింకనుఎంతమందికి తండ్రివో నీ వేమి యెఱుఁగుదువు? వటబీజమున ఎన్ని వృక్షము లున్నవో యెఱుఁగవా? అనంతమాతృరూపయగు శక్తిలో ఎన్ని బ్రహ్మాండము లున్నవో తెలిసికొనవా? నే నాశక్తియొక్క ఒకశక్తిని. ఓయయ్యా! ఇఁక ముందు నడిచి నీయమ్మకు దారిఁ జూపుము.' అని ఆశ అనియెను.

శకులాడుఁడు నిర్విణ్ణుఁడాయెను. అతఁడు విధేయుఁడైన కుమారునివలె ముందు నడిచెను.



"ఆశ అతని ముఖమునందు

౪

ఒకనాఁటి సాయంకాలమున రెండువేసడములు వందలతరబడి తాటాకుపుస్తకముల మోసికొని వచ్చుచుండెను. స్ఫురద్రూపియైన యొకఁడు దాక్షిణ్యఁగా వానివెంట అంతలింతలైన పదిపదియేనుగురు

వచ్చుచుండిరి. అతఁడు రాజవీథిలో ప్రవేశించిన పదపడి అతనిని చూచి,‘ఉపకలాపా! ఎక్కడినుండి యీసామాను? అంగడి ఎక్కడ వైచెద’వని కన్నయ్యసెట్టి అడిగెను. ‘ఏ దేశపు సరకు?’ అని ముత్తయ్య. ‘ఇది కాశీసరకు’ అని రంగనాథాచార్యులు. ‘అంగడి ఎక్కడ?’ అని సుబ్బిసెట్టి. ‘మెదడులో’ అని అనంతశాస్త్రి.

‘కాటినుండి తిరిగివచ్చితి’నని మోటుగా వమఱఁదులు



ఫలప్రసయ్యమును చూచెను.”

ఉపకలాపుని ఉపహసించిరి. బాల్యమిత్రుఁడుపతాయి అతనిని కౌఁగిలించుకొనెను. గాయకుఁడు అనంతుఁడు వచ్చి ఆదేశమునందలి గాయకుల నడుగుచు కూరుచుండెను. బాల్యసఖి వారాంగన హంసీయాన వచ్చి నమస్కరించి దూరముగా నిలువఁబడెను. బాల్యసఖుఁడు రాజమల్లుఁడు లకుమయ్య అతని వీఁపు చఱచి ముందు కూరుచుండెను. రైతురాచప్ప వచ్చి దండములు పెట్టి—‘మీరు చదువుకొన్న బాసలో మీపేరు ఏమంటారు?’ అని అడిగెను. ఊరంతయు పండితమైనదని అందఱు సంతసించిరి.

విద్యార్థుల వల్లనలచే చెవులు చిల్లులుపోవఁదొడఁగెను. గుంజలు నునుపు దేలెను. నిమంత్రణములకు కావలసినంతమంది.

కొలఁదికాలముననే ఉపకలాపునకు వృద్ధులలో డాఁగులు తగిలెను. అవి యివి—ప్రాతస్స్నానము అయిన పిదప భంగువేయుట - మధ్యాహ్నముదాఁక శిష్యులకు పాఠములు చెప్పి ఆవస్త్రములతోనే భుజించుట—సాయంకాలమున షికారు వెళ్లుట—ఋష్యంతరమతముల నాశ్రయించినూతనాచారములసాధించుట—వస్త్రమును పింజెలు పోసి కట్టక నడికట్టుకట్టుట—మోమున కుంకుమతాల్చుట—ఈ మొదలగున వన్నియు ఆతని ‘కాశీగుండా’ చేసెను.

అతఁడు కాలుపెట్టిననాఁడే ఆశనుగుఱించి కనుఁగొనెను. ఆతనికి వచ్చినది మొదలుకొని చిన్ననాఁట తనతో చదువుకొన్న ఆశను చూడను ఆశ. ఆయాశతోడనే ఆతఁడు మరల వచ్చెను. గోవిందుఁడు తనను పలుకరించుచో లోపలికి వెళ్లి ఆశను చూడవచ్చునని అతని యభిప్రాయము కాని అతఁడిపు డెవరికి కానిపించును? అటులు అతఁడు వారియింటిమీఁదుగా షికారు వెళ్లుచుండఁగా ఒక సుపరిచిత మయిన ముఖము కన్నులతో ఒకానొక నూతనభాషతో ప్రసంగించెను. అనుకొనకయే సమకూరిన ఆశాసందర్శనమున అతఁడు నివ్వెఱయేపడునా? మాటలాడునా?

ఉపకలాపుఁడు నెమ్మదిగా నడచిపోయెను. అతఁడొకచెట్టునీడఁ గూర్చుండి, “ఈమె ఎవరికొఱకు ఇంతవఱకు వివాహిత కాలేదో! సంశయము లేదు: నాకొఱకు. కాళిదాసు చెప్పనే చెప్పెను:

* ‘సతాం హి సందేహపదేషు వస్తుషు
ప్రమాణ మంతః కరణప్రవృత్తయః’

* సత్పురుషులకు సందిగ్ధవిషయములలో తమ చిత్తవృత్తులే ప్రమాణము.

అని. ఇన్ని సంవత్సరములనుండి ఆశ నావలెనే ఉన్నదా? నా చదువు సఫలము. నన్ను నిక్కముగా ఆశ అర్థము చేసికొన్నది. ఈశ్వరుఁడా! నీసృష్టికి అర్థ మున్నదే! ఏమీ? ఆశ నన్ను ప్రేమచే అభిషేకించునా?"

ఉపకలాపుఁడు గృహోన్ముఖుఁ డాయెను. ఆకాశము అతనికి ఆశాముఖమండలము చూపఁ గాఁబోలు, చంద్రదీప మెత్తెను. అతని హృదయరంగమున ఒకనటి



హల్లీసక మాడుచుండెను. ఆశ తలుపు తీసికొని అరుఁగు మీఁది కంబము చాటున నిలిచెను. అతని హృదయ రంగమున నటి ప్రస్తావన ముగించి అంకావతరణికను సూచించెను.

అతఁడు తాటాకుకట్టల నన్నిఁటిని దిరుగవైచి ప్రౌఢావివాహమునకు అనుకూలములగు కారికల నన్నిటిని ఒకచో సేకరించెను.

అతఁడు ఆమఱునాఁడు మరల షికారు బయలు దేరెను. కర్ణాంతవిశ్రాంతములగు నేత్రములును, వేఁపాకులవలె వంపులైన కనుబొమలును గల అతని మోమునందు వేఁడొక ఆత్మప్రభ అధికరించి యుండెను. అతఁడు కాలుపెట్టినది వీథిమీఁదనైనను నడచునది ప్రేమోద్యానమున. నడుమనడుమ అతఁడనురాగ మూర్ఛనలలో మూర్ఛితుఁ డగుచుండెను.

ఆశాగృహము సమీపించెను. అతని కూఁకటి వేరు కదిలెను. అతనికాలు దిగ్గజపాదమంత బలువుగా లేచి పడుచుండెను. అతఁడు గవాక్షమునుండి చూచెను. అతఁడు నిండారి వెల్లివిరియు తన చెఱువు మరగొమ్మును తెఱచి వైచెను. ఉపకలాపుని ప్రఫుల్ల ముఖసహస్రపత్రమునందలి దళదళమునను ఆశానిరీక్షణభృంగములే.

ఆశకు ఉపకలాపుఁడు పక్షిఛాయవలె పరుగిడినటు లాయెను. 'ఈతనిలో నేను జాగరిల్లియే యుంటిని. నన్ను కులహీనగా ఇతఁడు తలఁచునా? అటులు తలఁచెనేని తనకోసమే కులహీనయాయె నని తెలియఁగాక!'

కొంతవడి ఆశ దారిని చూచును. దృష్టికిఁ గల అశక్తికి పరితపించును. తలుపుతీసి వెలికి వచ్చును. మార్గమును చూపులచే సీమంతిత మొనరించును.

ప్రణయిజనుల ఒకదర్శనమునకును మఱియొకదర్శనమునకును నడుమఁగల కాలము పుణ్యకాలము. ఆస

మయమున వారి ధమనులు ఆడవు. ప్రతిగాలియు పరిమళ భారమున పెండ్లినడకలు నడచును. వారి ప్రతిచేష్టితము పరస్పరదర్శనమునకు. ఆమధ్యకాలమంతయు కుంభకము.

వాతాయనముక్రింద కూరుచుండి ఆశ తిలకించుచుండెను. ఉపకలాపుఁడు పుట్టెఁడాశతో వచ్చుచు ఎట్టెదుట ఆశ కానరాఁగ స్తబ్ధుఁడై నిలిచిపోయెను. అతని ఆశాసౌధశృంగము అవనతమై పడిపోవుచుండఁగా, ఆశ ఒయ్యారముగా లేచి దానిని తుపానునకైన ఒఱుగకుండ నిలిపెను. ఉపకలాపుఁడు విప్పారిన కనులతో మెల్ల మెల్లగా ముందులకు నడచిపోయెను.

౬

తన కిపుడు తల్లిదండ్రులులేని లోపము ఉపకలాపునకు గోచరించెను. తన కిపుడు తల్లి లేని లోపము ఆశకు తెలియవచ్చెను. ఇపుడు దాతృప్రతిగ్రహీతలు తమకు తామే. అందులకు చేయవలసినపని ఆ యిరువురిలో ఎవరికిని తిన్నగా తోఁపలేదు.

స్త్రీజన సహజమగు గాంభీర్య ముపకలాపున కెటులు వచ్చును? అతఁడు పురుష నైజము ఆవిష్కరింపనెంచెను.

తుంగభద్రా తీరము నందలి గృహోద్యానమున నతఁడు ప్రవేశించెను.

నిశాంతమున మేఘములు పెండ్లినడకలు నడచుచుండెను. పులకిత యగు భూమిగంధమును వాయు వెల్లదిక్కులకుఁ బంచిపెట్టెను. రెండు మూఁడు మెఱపులుమెఱసి సిగ్గుపడి దాఁగుకొనెను. తెల్లవావిలిపూలచే తోరణకట్టఁబడిన తుంగభద్రాతీరమున ఒక పొదరింటిలో పెండ్లికొడుకువలె విశ్రమించెను. అతనిచూపులు ఆ యుద్యానమున పుష్పరాసులవలె పడుచుండెను.



మబ్బులాకాశమున చింతచెట్లవలె అలముకొనుచుండెను. వానిలోనుండి అంధకారము పొగలవలె బయలుదేరి భూమ్యాకాశములను ఏక మొనరించెను. ఆ చిమ్మచీఁకటిలో అతఁడు ఆశాగమనమును పసిపట్టెను. భూగర్భమున నున్న నిధినివలె నికుంజమున నున్న తనప్రియుని ఆశ దాఁటిపోయెను.

ఉపకలాపుఁడు వావిలిపూలు గుత్తులు గుత్తులుగా చేర్చి పేర్చుచుండెను. ఆ పుష్పసముదాయ మంతయు అవ్యక్తుఁడగు మన్మథుని చిఱునగవువలె నుండెను. అపుడే మబ్బులు కొంచెకొంచెముగా తెఱపియిచ్చెను.

ఉషాదేవితోపాటు ఆశ బయలుదేఱెను. ఆమె పాదములముందలి ప్రతి రేణువును పరిస్ఫురిత మగుచుండెను. ఉపకలాపుఁడు పొదరింటి వాకిటికి వచ్చి పలుకరింప నుద్యమించెను. స్వరము గొణుగుపోయెను. కాళ్లు కంపించెను.

రక్తము చివ్వున ప్రవహించెను. అతఁడు గద్గదికతో 'ఆశా, నీకు ఆశీస్సులు!' అని ఉదాత్తానుదాత్త స్వరిత ప్రచయ స్వరములలో అనెను.

'ఓరీ! ప్రేమచోరుఁడా! నీపేరేమి? ఇదిగో, ఉపకలాపునియిల్లు ఇచటనే యున్నది. ఓహోయి విద్యార్థులారా! ఇనీ! ఇతనిపేరు నుడువరాదు' అని ఆశ కాకులతోపాటు అఱచెను.

ఆశ అతనిని శకులాదుఁ డనుకొనెను. అమె చకిత పాదములతో ఇంటిలోనికి వెళ్లిపోయెను. ఆమె పరమేశ్వరుని స్మరించి తనభాగధేయమునకు వగచి శకులాదుని యమంగళము ఉపకలాపునిముఖముఁ గాంచి పరిహరించుకొందు ననుకొనెను.

ఉపకలాపుఁడు కానిపించునను ప్రత్యాశతో సమయము సముద్రమునకు పోవునదివలెఁ గడఁచిపోయెను.

ఆశ గవాక్షమునఁ గూరుచుండెను. బాటసారులు వచ్చుచు పోవుచు నుండిరి. 'ఆతని చూడ మఱచితినా? యీతని చూడ మఱచితినా?' యని ఆశ వెలుపలికి వచ్చి చూచుచు లోనికి జనుచుండెను.

ఆశ వాకిట అంతసే పెన్నఁడును కూర్చుండి యుండలేదు. కూర్చుండెను కూర్చుండెను. సంధ్యాదేవి పేరంటమునకు వచ్చెను. నక్షత్రపుష్పములు కానుక యిచ్చెను. వెన్నెల బట్టలు పెట్టిపోయెను.

ఉపకలాపుడు రాలేదు. చంద్రుఁడు వచ్చెను. కొంతసేపు బంధనమోచనముల ఉన్మత్త తాండవమున కవాటములు నలిఁగిపోయెను.

ఆశ డాబామీఁద కూరుచుండెను. ఉపకలాపునియిల్లు పొనపొన కానిపించుచుండెను. అది పెద్దనిద్దురలో మునిఁగియుండెను. తుంగభద్ర స్వేచ్ఛగా ప్రవహించి పోవుచుండెను. నడుమ నడుమ చిన్నమబ్బులలో మినుకు మినుకు మను చుక్కల పెండ్లికూఁతుండ్రు చందురు పెండ్లికొడుకును తమభావ మెఱిఁగి పెండ్లిచేయు పెద్దలు లేరుకదా యని తలపోయుచుండిరి. ఆశ ఈదృశ్యమును అదేపనిగా చూచుచుండెను. కొంతసేపటికి చంద్రుఁడు సన్న్యసించి కావిగుడ్డలు కట్టుకొనినటులు ఎఱ్ఱఁబడెను. మెల్లగా అస్తమించెను. ఆశ ఉలికిపడెను.

వాకిలిపాద చూచెను. చూపు త్రిప్పుకొనెను. అంతఃకరణమునందు ఈ యనుమానము తట్టెను.—నన్నాశీర్వదించిన స్వర మెవరిది? మరల—నన్నాశీర్వదించిన స్వరమెవరిది? అని. ఏమిటి ఆయాశీస్సులు? ఎవరి వవి?

## ౬

ప్రాతఃకాలములందు దీర్ఘముగా వినిపించు ఉపకలాపుని వామనస్తుతి యిపుడు వినఁబట్టదు. విద్యార్థుల వల్లనలు లేకపోవుటచే ఇపుడు ఎవరికిని నిద్రాభంగము లేదు. వఱద వచ్చి తీసినది.

ఊరివారందఱు అనుకొనిరి—'ఉపకలాపుఁ డెక్కడికి వలసపోయెను?'

ఆశ గ్రహించెను--తన యపరాధమే ఉపకలాపుని గ్రామమునుండి బహిష్కరించె నని.

ఆశ అనుకొనెను-'శకులాదోపకలాపులభేద మింత మాత్రము గుర్తింపనైతి నేమి? శకులాదుఁ డైనచో నన్నాశీర్వదింపఁగలఁడా? ఇపుడు ఉపకలాపునిస్వరము విస్పష్టముగా విననగుచున్నది. ఈభేద మపుడేల తెలిసికొనలేనైతిని? నాప్రేమలో ఏమేని లోప మున్నదా? ఒకపర మాణువేని లేదు. మఱి యిది యేమి? ఏమైన నేమి? నేను మేలుకొనకముందే నామీఁద అరుణసూర్యకిరణములు ప్రసరించినవి. చీకాకుతో బట్ట ముసుగువెట్టుకొని పవళించితిని. నాదైవము నన్ను వెతకుకొనుచు వచ్చెను: నేను దయ్య మనుకొని వెళ్లఁగొట్టితిని.'

ఇటు లామె చింతించుచుండఁగా ఒక బిచ్చగాఁడు పాడుకొనుచు వచ్చుచుండెను. వాని స్వరము స్ఫుటము; ఉచ్చారణము విశుద్ధము. పాట తేనెయూట.

మనసా! ఓవెఱ్ఱిమనసా!
నీలోన నున్నట్టి - నీప్రియుడూ వచ్చిన
నిరసించి పోయావె-మనసా! ఓవెఱ్ఱి మనసా!

తుంగభద్రాయొడ్డు-తూర్పుకోవెలలోనా
దూరీయున్నాడే-మనసా!-ఓవెఱ్ఱిమనసా!

భక్తితంతువు బట్టి పాకాడిపోతేను
పట్టంగా నేర్తావె-మనసా! ఓవెఱ్ఱిమనసా!
మనసా! ఓవెఱ్ఱిమనసా!

ఆశ చెవులు దోఁబెట్టుకొని వినెను. 'ఈస్వరము ముకుందునిదా?' అని వాకిటితలుపు తెఱచెను. వాకిలి నిర్మక్షికము.

ఆశ అనుకొనెను--'నాకు తాళపుచెవి దొరకినది.' ఉన్నది ఉన్నపాళముగా బయలుదేఱెను. తుంగభద్రాతీరమున ఆమెకు ఒకబైరాగి కానిపించెను. ఆమె అతనిని పరికించి పరికించి చూచి అతనిపయనమును గుఱించి అడిగెను. అతఁడనెను-'మేము సన్నాసులం. కాశీకి పోతాము రామాహరీ! మాకు ఒహ ఊరేమిటి పల్లేమిటి? తుంగభద్రపొడుగూతా పోతాం.'

ఆమె తుంగభద్రపొడుగున నడిచెను. సూర్యుఁడస్తమించుచుండెను. ఆమె ఒక యిసుకతిన్నెపై కూర్చుండెను. ఏటిలో నీరొకదరిగా కులస్త్రీవలె ఒదిగి ప్రవహించుచుండెను. గూండలోని పిట్టలు తమ తమ ప్రియులను రమ్మని అఱచుచుండెను. ఏటిదరి తీవలు బ్రహ్మచర్యమవలంబించిన కన్యలతో వియ్యమందెను. అచటి ప్రకృతిస్వాతంత్ర్యము ఏరాజుచేతను ఆక్రమింపఁబడలేదు. ఏఁటిరింతలు బాకాలూఁది గూండ్లలో చేరుకొనెను. గబ్బులుఁగుమాత్రము దొంగవలె సలిసప్పుడులేక కూరుచుండెను. రెండుకొంగలు అపుడే యేటినీటిలో తపస్సుచేయుటకు దిగెను.-యానిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ.--ప్రవాహమునఁ గొట్టుకొనివచ్చు పూలు నురుఁగువలె నుండెను. ఆశ ఆరామణీయకమును అనుభవింపవచ్చిన ప్రకృతిదేవతయా? ఆమెచుట్టు కొన్నితుమ్మెదలు తానముచేసెను. అడవిపావురములు కొన్నిపల్లటీలు కొట్టెను. కడిమిచెట్టు ఆమెపై కొన్నిపూలు వర్షించెను.

తర్కముచే నననయని నిషేధింపఁబడిన తావున విశ్వేశ్వరుఁడు వీరాసనమున కూర్చున్నాడు. స్వభావవాది కూర్చున్నవానిని కూలఁద్రోయుచున్నాఁడు. పలువురు లేదని వివాదపడు ఒకానొకపీఠమున ఆనుషంగికఘటన దైవమును అధిష్ఠింపఁ జేయుచున్నది.

దూరముగానున్న ఒకపుట్టమీఁద వాఁడు చూపిన తంగెడుపూలలోమునిఁగియున్న-ఒకమృణ్మయవిగ్రహము ఆమెకంటఁబడెను. పూలెడలించి చూడఁగా తనవిగ్రహమే. ఆశకపుడొకదైవశక్తి గోచరించెను. 'ఆశక్తియే ఈఘటనావిఘటనలఁ జేయుచున్నది. మఱి ఆశక్తియే ఇఁక నాప్రియుని చూపఁగలదు.' అని అనుకొనుచు ఆశ మరల నడువమొదలిడెను. ఆమెపాదములు తీపులు తీయలేదు. ఆఁకలి అనిపించలేదు. విసువువిరామము లేక నడిచెను. ఆమె నెదురుకొను మంగళమువలె ప్రభాత మాయెను.



౭

సమీపగ్రామములనుండి ఒకపుంతవెంట మేఁకల త్రోలి కొని కొందఱు గొల్లలు వచ్చుచుండిరి. వారి మాటలు ఆశకు ఎంత తెలిసెనో ఆశమాటలును వారికి అంతయే తెలిసెను. వారు వెళ్లిపోవులోపల వారివెఱ్ఱి యంతయు బయటఁబడకపోలేదు. గొల్లలుకదాయని వెఱ్ఱి వారికంటఁ గట్టరాదు. నిద్రాహారములు లేకలేక నడిచినడిచి యున్న ఆశ తెలవాఱుజామున అభినయించు నటివలె నుండెను. మునిముందు కూర్చుండు సభ్యులవలె వారు ఱిచ్చవడి వెళ్లి పోయిరి.

తుంగభద్ర తూర్పు టొడ్డున దేవళము కానిపించుచుండెను. ఒకఁడు స్నానమొనరించి కావిబట్ట లారఁగట్టు కొనుట కానిపించుచుండెను. అతనికి తగుమాత్ర గడ్డము స్ఫురించుచుండెను. అతనిముఖము కలకలలాడు చుండెను. దారినిబోవు మేఁకగాని, పులిగాని,ఆఁడుదిగాని,మగవాఁడు గాని అతనిని తనివార చూడనిది అడుగిడుటలేదు. పరివ్రాజకుని వేష మెంత చమత్కారమైనది! అది లక్షుల మన్మథులను కప్పిపుచ్చును. కూలి యీయనక్కఱలేని బంటులను సృష్టించును. జగము నంతయు ఏమిరాయని శాసించును. ఆవేషము ప్రతివానిని ఉబలాట పెట్టును. అది తనలో నున్నవానిరూపమునంతయు తినివేయును.

పరివ్రాజకుఁడు పరికించి చూచినకొలఁది ముందుకానిపించునది ఒకసౌందర్యరాశిగా గోచరించుచుండెను.అతఁడిపుడామె సౌందర్యమును కనులారఁ జూచికనులు మూసికొనెను. లోనిరూపును వెలిరూపును ఒకటిగా నుండెను. ధ్యానముయొక్క కాష్ఠ అట్టిది గదా! అతఁ డనుకొనెను- 'నేను ఆశను ప్రేమించుట అధర్మమా?నామనస్సు ఆప్రేమ చేతనే సృజింపఁబడినది. ఇటులయియుండును: ఆమె నన్ను అన్యుఁడని భ్రాంతిపడియుండును.' ఈ మాటలే అతఁడు పునః పునరావృత్తిగా జపించుచుండెను.

ఆశ ఆఱినవలువలు తాల్చి, 'నే నీపరివ్రాజకునకు నమస్కరించి ఆశీర్వాదము పడసి దేవాలయములోనికి వెళ్లెదను' అని అనుకొని యేటి కెగువగా చనుచుండెను. వెదురుపొదలు పెద్దమ్రానులు తాళ్లు మొదలైన వృక్షములు దాఁటెను. నడుచుచునడుచుచు త్రోవలోనున్న పుష్పముల కోసికొని తీసికొనిపోవుచుండెను. పరివ్రాజకుని సమీపించినకొలఁది ఆమెకు జాతిస్మరత్వము ఎక్కువయగుచుండెను. అతనిముఖము చూచినకొలఁది ఆశనేత్రములు నిశ్చలము లాయెను. ఆశ వడివడిగా దాపున కరిగి, ఆకుసుమములను అతనిపాదములమీఁదఁ బోసి,అతనిముని ముందు మోఁకాళ్లఁబడి యుండెను.

పరివ్రాజకుఁ డిటులు భావించుచుండెను—"ఆశ యింటి కేఁగుచు,' ఉపకలాపా! నీప్రేమ సరిగా పక్వము కాలేదు. 'నీపేరు ఏమి?' అని నేను గద్దరించినపుడు అన్యునివలె పాఱిపోయితి వేల?' "

పరివ్రాజకునిధ్యానము శిలవలె గట్టిపడుచుండెను తాను వావిలిపొదరింట నుండఁగా ఆశ ఎదురుగా వచ్చు



ఆకుసుమములను అతని పాదములమీఁదఁ బోసి,

చుండెను. ఇపుడు అతనికి కంపము కలుగలేదు.ముందులకు నడిచి, 'నిన్ను ఆశీర్వదించుచున్నాను.' అనెను. ఆశ 'నీ పేరేమి?' అనెను. 'ఎంత యంధకారమునందైనను నీ ప్రియుని నీవుగుర్తింపవలయును జుమా!' అని అతఁ డనెను.

నిదురనుండి మేలుకను శిశువువలె అతని నేత్రములు క్రమక్రమముగా విప్పాఱెను. పరివ్రాజకుఁడు కనులెత్తి చూచెను. ఎవతె నాతఁడు వృక్షములందు చెక్కెనో, ఇసుకతిన్నెల గీసెనో, తీరములందు పుట్ట మట్టితో

ప్రతిమ లొానరించెనో, ఆమెయే! 'ఏమీా!నాధ్యాన మింత వడిగా ఫలించినదా? ఓహో ఆశా! ఇది యేమి? లెమ్ము లెమ్ము.'

'ఉపకలాపా! ఆమబ్బులచీఁకటిలో ముత్యమును ఆలిచిప్ప అనుకొంటిని. నీ యనుగ్రహమునఁగాక నీశ్రమను నే నెటులు పోఁగొట్టఁగలను?'

'నీవు నన్ను వెదకికొనుచు వచ్చుటచేత నే నాశ్రమ సఫలమయినది. శ్రమయేమి?

* అనాతురోత్కంఠితయోః ప్రసిద్ధ్యతా



అతని మునిముందు మోఁకాళ్లఁబడి యుండెను.

సమాగమేనాఽపి రతి ర్న మాం ప్రతి;
పరస్పరప్రాప్తి నిరాశయో ర్వరం
శరీరనాశోఽపి సమానురాగయోః. (మాలవిక)

ఇపుడు మనసృష్టి సఫలము. ఈశ్వరుఁడా! పరస్పరము ప్రేమించుకొను ఇట్టి ప్రియుల సృష్టింపుము. ఆశా! బాల్యమున బడిలో చదివికొను ఆశోపకలాపులముగా మనము మాఱిపోవుదము. అని ఆయుపకలాపుఁడు ఆశను దాపునకు దీసికొని కౌఁగిలించుకొనఁబోయెను.

ఆశ రెండడుగులు వెనుకకు వైచెను. 'ఉపకలాపా! తల్లియు, దండ్రియు, దైవమును తానైన నాతండ్రి నన్ను నీ కీయఁగలఁడు. వెళ్లిపోదము లెమ్ము.'

గోవిందుఁడు దేవాలయము చాటుననుండి వెంటనే అచ్చటికి వచ్చెను. 'ఆశా! నిన్ను ఈనాఁడు ఆశీర్వదించుచున్నాను. ఉపకలాపా! ఆశను నా యాశీర్వాదముతో పాటు ఈనాఁడు నీకు ఇచ్చుచున్నాను.'

ఆశ జలజల రాలు బాష్పములతో తండ్రిని కౌఁగిలించుకొన్న,'నాయనా! నీవు నాకు నాయన వేకావు:అమ్మవు. అమ్మవే కావు: సర్వమవు. నేను నీకు పుత్రికనై యెన్ని కష్టములు కలిగించితిని!'

'కష్టములు ప్రసవించిన సుఖము అతిమధురమని నీకు తెలియలేదా?నీతల్లి పోయినపిదప నాకు ఇన్నాళ్లకు ఆశ్వాసము కలిగినది. ఉపకలాపా! ఇఁక భారమంతయు నీయది. నాకు కొడుకుఁగుజ్జైనను, అల్లుఁగుజ్జైనను, నీవే' అని అనుచున్న గోవిందునకు ఉపకలాపుఁడు నమస్కరించెను.

వారు మువ్వురును గృహములకుఁ జనిరి. హరిణ ముకుందులు పెండ్లిపనులు చేసిరి. మరల ఒకబడిలోఁజేరిన ఆశోపకలాపులకడతనదోషమునొప్పుకొని శకులాదుఁ డను గ్రహింపఁబడెను. గ్రామస్థు లందఱు వారి వివాహమును వేడుకగా చూచిరి. ఆశను ఉళక్కి పెండ్లామా అని పిల్చి ముకుందుఁడు హరిణచే కోరచూపులు చూపించుకొనెను.

---

* అతికోరిక (నిలువనీని తహ తహ) లేనివారికి పొందు చేకూరినా నాకు సంతోషం లేదు. పొందువిషయములో ఇద్దఱూ నిరాశులైనప్పటికీ సమానమైన అనురాగము కలవారికి శరీరనాశం సంభవించినా అది కొంచెము సంతోషం.

## దాంపత్యము-శృంగారము

ఆంధ్రవిశారద తాపీ ధర్మారావుగారు బి. ఏ.,

భర్త



ప్రేయసి, రమ్మురమ్ము, విపరీతపు వార్తలఁ జూడు మెవ్వరో
వ్రాయఁ గడంగినా రిదిగొ పత్రిక; బాగుగఁ జూడు మే మనం
బోయెద ? విన్ని నాళ్లు మనమున్గిన దాది రసప్రవాహమా ?
స్వీయవిమోహకల్పిత విచిత్రవికారము లెండమావులా ?

భార్య

(చదువుచుండును.)

భర్త

విప్రయోగంబునందును బెండ్లిముందు-మాత్రమే కల్గు శృంగారమాన్యరసము
గానఁ బెండ్లితోఁ దీఱు శృంగారమంట !-దంపతుల కాదిరసజీవితం బిఁకేది?

భార్య

పోనిం, డేమొ మహాప్రమాదమని యీబూమెల్ వితర్కింపఁగా
నేనా ? వే ననుఁ బిల్చి; రారసము పెండ్లిం దీఱ నున్మాదమా?
హానివ్రాత నుతప్రచారమగు దాంపత్యంబు నిస్సారమా?
శ్రీనాథాదుల భవ్యదంపతి లసత్ శృంగారముం జూడమా?

భర్త

నిరసించినఁ బని తీఱునె?-తరుణీ, మనకవులు పెండ్లిదనుకను, దూరం
బరిగిన వెనుకను గాదే,-విరచించిరి తద్రసంబు విపులము గాఁగన్.

'పెండిలినాఁటినుండియుఁ బవిత్రగృహస్థ విశేషధర్మ బ
ద్ధుండయి పూనఁగావలెఁ జతుర్విధ సత్ పురుషార్థ దీక్ష నె
వ్వండు' నటంచుఁ దెల్ప నిటు వ్రాసిరి గాని రసప్రసక్తి లే
కుండుటఁ గాదు; లేదు సవియోగమునందు రసాహితత్వమున్.

భార్య

ఆలును బెన్మిటం చనినయంత విలాసరసంబు లింకఁగా
నేల? సుధాంశుచంద్రికల యింపు లయించునో! సాంధ్యరాగపున్



కీ. శే. సర్ పి. రాజగోపాలాచార్యులుగారు



కీ. శే. సర్ టి. సదాశివయ్యరుగారు



కీ. శే. ఎ. సి. పార్థసారథి నాయడుగారు



కీ. శే. కట్టా పాపయ్యశాస్త్రిగారు



కీ. శే. బొబ్బిలిమహారాజుగారు



కీ. శే. పప్పు పార్వతీశంగారు



కీ. శే. గంటి లక్ష్మినరసింహం
పంతులుగారు



కీ. శే కాళ్లకూరినారాయణరావుగారు, మహాకవి.

లీలలు మాయమానొ! రమణీయవసంతము రాదొ! వేడుకం
గ్రాలుచు యావనోష్ణరుధిరంబు శరీరములందుఁ బర్వదో!

భర్త

కలగొను ప్రేమ కైవసము గామిఁ దదీయవచః కటాక్ష సం
చలన వికారదర్శన విచారము—దూరము వాసియుండు గా
దిలితొలిచేయు కూర్మి వెనుదియ్యని నెయ్యపుఁజెయ్వు లెంచి చిం
తిలుటయునుఁ—రసంబయిన, నింద్యమె తత్ఫలహేతువర్తనల్?

భార్య

తొలి మీచూపులు మాటలుం గుణము సంతోషంబుతోఁ జూచి నా
కు లభించుంగద యివ్వి సర్వమని కోర్కుల్ దీఁగలై సాఁగ డో
లల నూఁగాడితి; నివ్వ డవ్వి గని, వాల్లభ్యాప్తి వైమానికో
జ్జ్వలయానంబున సంచరింతుఁ బరితోషవ్యోమమార్గంబులన్.

భర్త

దూరమువిద్య కే నతికుతూహలతం జనఁబోవు నప్పుడా
ద్వారముచెంత నిల్చి, పెఱవార లెఱుంతురొ యంచు నూరు క
న్నీరు దొఱంగనీయమిఁ గనీనికలన్ సుడివెట్టుచుండ, శృం
గారపుఁ బూలతోరణము గట్టవె నీవసితోత్పలంబులన్!

భార్య

బాంధవాదరణంబున, భర్తృభక్తి-నార్తపోషణ, సకలవిద్యానురక్తి
'నన్నపూర్ణకు నుద్దియా నతనిగృహిణి'-యనఁగ వినుమీదుచూపులకర్థమేమి?

భర్త

నాదుగుణమును, కవనసన్మానగరిమ,-నేఁ బరీక్షలఁ బ్రస్తుతి న్నెగడుటయును
జనము గొండాడ, నీవు న గ్గనెడు చిన్ని-యదటుచూపులకెల్ల వ్యాఖ్యాన షుద్ది.

భార్య

అనుచు మన మాడుకొనుమాట విని విమర్శ-చేయఁగలవారు గల్గిన వేయునేల!
నరసశృంగార రసవిలాసములఁ దేల-దంపతుల లీల సొంపుల నింపదేల?

భర్త

శృంగారాకృతి నీవు నిల్చుట, రసోద్రేకంబుతో నేను క్రా
యం, గారామునఁ జూచి పద్యములలో నాత్మానుభూతార్థ మొం
ద్గుం గా నుండుట, నీదుచూపు, త్రపయుక్, మోదంబు, కోపంబు నై,
శృంగారార్ణవ వీచికోదయములన్ చీకొట్టదే, వాకొనన్?

భార్య

అలనాఁడట్టులు కాలిబాధను వితాకై యుండు నాదంప మీ
రలు బాధోపశమ ప్రయత్నసువిచారం బందఁగాఁ జూచి, చిం
తిలు నన్నుం గను మీకటాక్షవిలసన్నిర్ణిద్ర రాగప్రభల్
కలవా, కాగడపట్టి చూచినను శృంగార ప్రపంచంబునన్?

భర్త

"ముక్కు మొగంబు మీవె మనముద్దులపట్టికి; దేహకాంతు లి
వ్వెక్కడఁ గగ్గె?...మీ రెఱుఁగ; రెప్పుడు నామెదఁ బాయకుండు మీ
యక్కమనీయ కాంతిసముదగ్రత సుం" డని పల్కువేళ నీ
చెక్కులఁ జిందులాడు కళ శిక్షయొనర్చు రసాతిరేకమున్.

భార్య

చిన్ని నిసుంగు మోహనునిఁ జెంత పడంతికిఁ జూపుభాగ్య మి
ట్లెన్ని దినాలఁ గగ్గె ననియేమొ, మహోముద మంది తెక్కలన్
మిన్నునఁ దేలుచుండుసను, మీ రటు దూరము నుండి చూచునా
సన్ననిచూపులోఁ గులుకు చందము గందుమె యెందునెన్నఁడేన్?.

భర్త

"శ్రీరంగేశు భజించి, తాతిరుపతిన్ శ్రీనాథు సేవించి, తా
పుర్హరిన్, గంచిని గంటి, సేతువున నోముల్పట్టి తేకోర్కెతో
నారీ, నీ" వన, "నేమొ పోం" డను విధానంబందుఁ గాన్పించు శృం
గారార్థంబును విప్పిచెప్పిన మహాకావ్యంబు గాకుండునే?

భార్య

దైవకృపావిలాసమున ద్రవ్యము సర్వము వోవునాఁడు, నా
కే వగఁ దోఁపనీయక మదేకనిబద్ధ విలోచనంబులన్
సేవగ లోక్యరీతిఁ గరుణించి, "బలా! యవకాశ మబ్బె, నీ
కీవిధిఁ బ్రేమఁ జూపి తనియింపఁగ" నంట య దేరసంబొకో!

భర్త

ఇరువుర మేఁప్రబంధము పఠింపఁగ, నందలి యావిలాసమై
ఖరులు నిజానుభుక్తములకన్న ఘనంబులొ కావొ యంచు లో
సరయుచు నుండు నీశిరమునందలి కంపము, కంటిచూపు, సుం
దరముఖకాంతియుం దరుణి, తాండవలీల రసాధినేతలన్.

భార్య

బుడుత మొగంబు వెన్నెలల ముద్దిడునంత, నొకళ్లొకళ్ల కె
క్కుడు రుచిరాంగులై తెలియఁ, గూరిమి నాలుమగల్ ముగంబులో
నడరిన యప్పుడాముఖములందలి లేనగుతేట చాలదే,
వెడఁగు ప్రబంధవర్ణనల వేయిని చీయని తూలనాడఁగన్?

---

# త్యాగరాజస్వామి చరిత్రము

పద్యకావ్యము - ఆంధ్రగ్రంథమాల 2 వ కుసుమము

గ్రంథకర్త: శ్రీపసుమర్తి కృష్ణమూర్తిశాస్త్రిగారు    వెల రు. ౦-౧౦-౦

శ్రీరామభక్తాగ్రేసరుడు, గాయకశిఖామణి యగు త్యాగరాజస్వామి జీవితచరిత్ర మిందు రసోత్తరముగ వర్ణితమైనది. కవిత్వము ధారాశుద్ధిగలిగి హృదయంగమముగ నున్నది. జీవితమునందలి ఆయాసందర్భముల ననుసరించి యిందు చేర్చిన త్యాగరాజకృతులీ పుస్తకమునకు పెట్టని సొమ్ములుగ నున్నవి.

విలాసము: ఆంధ్రగ్రంథమాల, నెం. 7 తంబుశెట్టివీధి, మద్రాసు.

# వసుబాలుడు

కథకుడు, చిత్రకారుడు: అడివి బాపిరాజుగారు, బి. ఏ.,

## ౧



వసుబాలరెడ్డి పరువుకల కమ్మవారిబిడ్డడు. గజపతుల రాజ్యమైన కొండపల్లి మండలం గుడివాడసీమలోని "కురసద్దాలి" అని పల్లెటూరినుంచి శ్రీరాయరాయ నరసింహదేవరయ్యవార్లంగారు కొలువుచేయగా శివబాలరెడ్డి తన రెండెడ్లబండిపై గూడుకట్టుకొని కతిపయప్రయాణాలు చేస్తూ విజయనగరం ప్రవేశించాడు. అప్పట్నుంచి కత్తినడుము కట్టి డాలు బుజానవేసుకొని రాయలదండులో కాల్బలంలో చేరాడు. దళవాయి అవడం, చమూపతి అవడం, చివరకు శ్రీసూరు రాయరగండ శ్రీకృష్ణదేవరాయ లయ్యవార్లంగారి సేనాధిపతుల్లో ముఖ్యుడవడం, శివబాలరెడ్డి అదృష్టమో! పతివ్రతాశిరోమణి అయిన ఆతని భార్య అదృష్టమో?

విజయనగరంలో జన్మించాడు మన వసుబాలుడు. కాని పుట్టినప్పట్నుంచి వసుబాలుడు కవిత్వం ప్రారంభించాడు. 'అమ్మ' 'అక్క' అనేమాటలు రాకుండానే "తములై ఎవ్వలు ముకతకలమతియులై" అని పద్యాలు ఎవరికీ ఏమీఅర్థంకాకుండా గళగ్రాహంగా చదివేయడం ప్రారంభించాడు. శివబాలు డతన్ని చూసి ఒక్కనిట్టూర్పు వదిలేస్తూవుండేవాడు. పెద్దన్నామాత్యుల శిష్యుడయ్యాడు; పండితుడయ్యాడు, కవిస్వరూపం దాల్చాడు. వసుబాలరెడ్డి కాని, తండ్రిగారి మోస్తరుగా కత్తికటారు తిప్పడంలో చాకచక్యం ఎక్కడా కనబడలేదు అతనిదగ్గిర.

శివబాలరెడ్డి తీరని విచారానికి ఎవ్వరూ ఉపశమన వాక్యాలన్నా చెప్పేవారు కారు. వృద్ధులైన తమ్మన్ననాయకులు సేనానాయకులలో చాలా పేరు పొందాడు. ఆయనతో తన విచారమంతా వెళ్లబోసుకున్నాడు శివబాలరెడ్డినాధుడు.

తమ్మన్న—అబ్బాయికి ఏమీ ఇష్టం లేదనే అంటారా?

శివబాలుడు—సుతరామూ! ఈరహస్యం తమరితోతప్ప ఎవరితోనూ నేను సెలవియ్యలేదు. మావాడు నాకు శీఘ్రగా వుందండి, మావాడు పిరికికూడాను.

తమ్మన్న—అంటే! ఏలా తెలిసింది! తనువుద్దేశం ఏమిటే!

శివబాలుడు—(ఒక్కదీర్ఘనిశ్వాసం విడుస్తూ) చిన్నతనాంనుంచీ నేను చూస్తూనే వున్నానండి. నప్పుడవుతే ఉలిక్కిపడి కెవ్వున కేకవేస్తూ లేచేవాడు; పిల్లిని చూస్తే భయపడేవాడు; చీకట్లో ఒక్క దూ వుండలేకపోయేవాడు; ఒక్క దూ పడుకోలేకపోయేవాడు—

తమ్మన్న—అది చాలా కష్టమే.

శివబాలుడు—కత్తి పట్టలేడు; గుఱ్ఱం స్వారీ చేయలేడు; రక్తం కళ్లచూస్తే మూర్ఛపోతాడు. నాకుటుంబములో ఇంత దురదృష్టం యిదివర కెప్పుడూ లేదండి. మాఅత్తవారిపైపునా లేదు. ఎక్కడనుంచి దాపురించిందో ఈదురదృష్టపు పిరికిదేవత!

తమ్మన్న—కవిత్వం సగం పిరికిమందు పోస్తుంది. అబ్బాయిని కవిత్వంలో పెట్టారేమిటి?

శివబాలుడు—నేను పెట్టలేదండీ! పెద్దనామాత్యులు చిన్నప్పట్నుంచీ మావాణ్ణి బుజ్జగిస్తూ చేరతీసారు. ఇంతప్పటినుంచీ కవిత్వం. గంటం, పత్రం; రాత్రిళ్లు నిద్రపోడు ఆపిన్చ నస్తే, ఊహనిరాగాలు తీస్తూ రాస్తూనే వుంటాడు.

తమ్మన్న—దీనికి వుపాయం నేను ఆలోచించి తమకు మనవి చేస్తా.

శివబాలుడు—ఈరహస్యము అతిగోప్యంగా వుంచి నాకుటుంబమునకు తాము వుపకారంచేస్తే మిమ్మెప్పుడూ తలపోస్తూనే వుంటాము.

తమ్మన్న—నే నేమి చేసేది, కొన్నాళ్లు పోయిన వెనుక చెప్తానులెండి.

పెద్దన్నామాత్యుని భవనముననే సదా వసుబాలుడు మకాం. ఇంటికీకూడా రావడం మానివేసాడు. ఆంధ్రభాషలో "విద్యాధరచరిత్ర" అను నరవాహనదత్తవిజయము అనే అసాధారణ కవిత్వం ధారాళంగా ప్రవహిస్తూవున్న గ్రంథం రచించడమేకాక, కర్ణాటకభాషలో పదునెనిమిదేండ్ల బాలుడయిన వసుబాలుడు ఒకవ్యాకరణము, రామచరిత్ర అనుకృతిని రచియించి రాయలకు అంకితం చేసాడు. సంస్కృతములో నిదే అన్నారు వసుబాలుణ్ణి. కావ్య వ్యాకరణ మీమాంసాది శాస్త్రాలన్నీ భాష్యాలతో పెద్ద

నామాత్యులు తనప్రియశిష్యుడికి నూరిపోసాడని విజయనగర పండితబృందం అనుకుంటూంటే శివబాలరెడ్డి సేనానాయకులు విని, తన భార్యతో, "అబ్బాయి కత్తి ఏలా వుంటుందో తెలుచుకొని మూర్ఛబోయ్యేరోజులు వచ్చాయి" అని అన్నాడు.

వసుబాలుడికి పారశీకం అరబ్బీ మహారాష్ట్రభాషలు నేర్చుకుందామని తోచింది. అదే వెట్టి పట్టింది. తండ్రిని, గురువును వేపుకుతింటే సరేఅని వొప్పుకున్నారు. బీజపురం వెళ్లడం మహోత్తమం అన్నారు. నవాబుగారికి స్నేహితుడుగా వెళ్లడం మరీవుత్తమంగా! తండ్రిగారి దగ్గరనుంచి కొండపల్లి మండలాధిపతికి వుత్తరం; అక్కడనుంచి కటకపురికి గజపతి మహారాజులుంగారికి వుత్తరం తీసికుని వెళ్లాడు. వారిసభలో నాలుగురోజులు గౌరవాలు పొందాడు; పండితులతో వాదించాడు; "సింహంపిల్లరా;సింహంఅయితే ఎట్లావుంటుందో" అని ఆస్థానకవులు డిల్లపోయేటట్టుగా ప్రతాపం చూపించాడు. శ్రీమహారాజు మెచ్చుకుని, ఆతని ఉద్దేశంగ్రహించి, బీజపురంనబాబ్ బహదూరువారికి స్నేహపు ముద్రిక ప్రసాదించగా, ఆపడది తీసుకుని వెళ్లాడు. ఒకఏడాది నిరాటంకంగా బీజపురం నబాబుమన్ననకు పాత్రుడవుతూ, పండితులచే గౌరవం పొందుతూ, రాజబంధువుల స్నేహం సంపాదించుకుంటూ, ఆభాషలు మూడున్నూ నేర్చుకున్నాడు. పండితుణ్ణి అయ్యానని తలవూపుకున్నాడు కూడాను.

౨

రాజవంశీకుడు మహమ్మదుయిబిన్ బహుర్లాఉస్మాన్అమీర్ జంగ్ జముల్ ముల్కు అనేబాలుడూ, వసుబాలుడూ ఒక రోజున హుక్కా పీలుస్తూ కూర్చున్నారు ఆమహమ్మదీయ బాలకుని యింట్లో.

అమీర్ జంగ్ — భాయ్, నీకు చదువు పూర్తిఅయిందే, యింటికి పోరాదూ?

వసు — ఎందుకు?

అమీర్ జంగ్ — మాసుల్తాన్ బహదూర్ వారికిన్నీ విజయ నగరం కిష్ణరాయలకీ యుద్ధంగా! ప్రారంభం అయిందా, నీగతి ఎట్లా అవుతుందో! ఆలస్యం ఎందుకూ?

వసు — రాయలకీ నవాబ్ బహదూర్ వారికిన్నీ యుద్ధం లేదుగా; సంధిరాయబారాలే జరుగుతూవుండేవిగా!

అమీర్ — వెఱ్ఱివాడా! మా సైన్యం సర్వంసిద్ధం. ఒకచిటికలో బెల్గాంవగ్గిర్నుంచి ఉస్మాన్పూర్ దాకా సైన్యం బారులు తీరుస్తుంది; ఒకరాత్రిలో కృష్ణ దాటుతుంది. రెండవరోజుకు ఆవిజయనగరంవాళ్లు నిద్రకళ్లు నలుపుకుంటూ వుండగానే ఆవూరుమీదబడినాశనంచేయడం.

వసు — అబ్బా! విజయనగరం చాలా అందమైన మహాపట్నం అంటారు. అది నిష్కారణంగా పాడుచెయ్యడమే!

అమీ — అవసరమైతే అంతే. ఇప్పుడు ముఖ్యావసరం కాబట్టి మగపురుగన్నవాడు కత్తిపట్టాలని సుల్తాన్ బహదూర్ వారి ఆజ్ఞ. సెలవు తీసుకుంటా. కటకపురినుంచి మహారాజావారి జాగీరావులతో నీకుత్తరాలు నాకు పంపుతూవుంటావుకాదూ! నీపెళ్లి అయినప్పుడు నేను వివాహానికి హాజరు. అని ఆబాలుడు వసుబాలునికి సలాం పెట్టి చేయి ముద్దుపెట్టుకొని వీడుకోలిచ్చాడు.

వసుబాలుడి గుండెల్లో రాయిపడింది. 'ఈపాడుయుద్ధాలేమిటి? ఒకళ్లని ఒకళ్లు లక్షలకొలదీ చంపుకోడమే' అనుకున్నాడు. అతనిచెవులు హోరుమన్నాయి; కళ్లు తిరిగిపోయాయి. రక్తమేఘాలు దిశలు దిశలు కమ్మినట్టే కనిపించాయి; యుద్ధం మొదలుపెట్టేలోపుగా తాను నెమ్మదిగా గజపతుల రాజ్యంలోంచి విజయనగరం చేరాలి. 'ఎంత విద్వచ్ఛిరోమణిఅయితేనేం; కళాహృదయం కలవాడయితేనేం' 'సరసశృంగారరస వీచికాసల్లాప సంతోషజీవి' అయితేనేం; శ్రీశ్రీరాయలు ఈయుద్ధాలవిషయంలో కటికవాడే' అనుకున్నాడు. ఉన్న రాజ్యం చాలదయ్యా! అబ్బా!

రెండుసుత్తాలరథంమీద నవాబుకోటలో దేవిడీనుంచి తనవిడిది మహల్ కు వస్తూవుంటే లోకం అంతా ఫిరంగులు మోగిపోతూవున్నట్టే అయింది. కత్తులరాపిళ్లు, జేవురించినపిశాచమొహాలు, ఒకళ్ళనొకళ్ళు పీక్కు తింటూవున్నట్టే వసుబాలుని కళ్ల ఎదుట తాండవంచేస్తూవున్న విగ్రహాలు అనంతంగా కోటానుకోట్లు కనబడ్డాయి.—

ఉలిక్కిపడి-బండివానితో మాట్లాడితే ధైర్యం!

"ఏమయ్యా, 'బగ్గీవాలా,' శ్రీపాదుషావారికి ఎన్ని అరబ్బీ గుఱ్ఱాలున్నాయి?"

బగ్గీవాలా — లక్షల్, సఫేద్ వర్ణం, హవారీఅందం, వేగం, విశ్వాసం, లడాయిలో నిర్భయం-ఆఖరిప్రాణం పోవాలా, అప్పటికీ శాతునీ కాపాడవాలా, మహరాజ్ నవాబ్!

"యుద్ధానికేమిగాని—"

బగ్గీవాలా — ఖుదావంద్, యుద్ధం అంటారే, నేను రేపు యెల్లిపడనా! యిరోధులు ఎంతమందికి చంపితే అంతాసంతోసం!

"అబ్బా!"

ఆలోచించుకుంటూ యింటిలోకి వచ్చాడు. బసలో తన దేవిడీ అంతా కంగారుగావుంది.—ఒక సేవకుడు పరుగుపరుగున రెడ్డిదగ్గరకు వచ్చి, "తురకసర్దారులు కొందరు వచ్చి మీసామానంతా వెతుకుతూవున్నారు, మహాప్రభూ; వెళ్లిచూసుకోండి" అన్నాడు. రెడ్డి దడదడమనే గుండెతో లోపలికి వెళ్లి, "ఏమి టీదౌర్జన్యం" అన్నాడు. నలుగురు సిపాయీలు, ఒకదళవాయి రెడ్డిగారి పెట్టెలు బేడలు అన్నీ కలగాపులగంచేసి, మంచిమంచి జరీకండువాలు, అంగరకాలు, దోవతీలు అన్నీ చిందరవందరగా పారేసి ఏమిటో వెతుకుతూవున్నారు.

రెడ్డిగారులోపలికి రాగానే ఆదళవాయి పందిరిమంచంమీద కూచున్న వాడు లేచి సలాముచేసి, "జనాబ్! మీరు పరాయిదేశంవాళ్లు. మీద గ్గిర ఏమైనా రాజద్రోహకరమైన గ్రంథం వుందేమోని వెతుకుతు న్నాము. ఏమీ కనబడలేదు." అన్నాడు.

వసుబాలునకు ఏమన్నా ధైర్యమనేది వుంటే మటుమాయమైపో యింది. "నువ్వెవరవు? నాసంగతి తెలుసునా? ఇదిగో శ్రీసుల్తాన్ సాహబ్ బహదూరువారి ఫర్మానా" అని ఆదళవాయి చేతికిచ్చాడు వసుబాలుడు. సిపాయిలందరూ మోకరించారు. దళవాయి వంగి సలా ము చేసి ఆఆజ్ఞాపత్రం నెత్తిమీద పెట్టుకొని కన్నుల నద్దుకొని ముద్దు పెట్టుకుని, "శ్రీసుల్తాన్ శ్రీకటకపురనివాస రాజాధిరాజ మహారాజ అనంతనాథ సర్వశత్రువిదారణ శ్రీగజపతిరాజబహదూరు స్నేహితుల రాజ్యసభికుడైన వసుబాలరెడ్డిగారు మారాజ్యము విడిచి క్షేమంగా వారిరాజ్యం చేరుకోడానికి చేసే ప్రయాణంలో మాప్రజలు, సేవకులు, సేనాధికారులు, తాబేదార్లు యావన్మందిన్నీ సర్వగౌరవాలతో వారికి నౌఖరీ చేయవలసింది. ఇది పాదుషాఆజ్ఞ." ముద్ర ఉన్నది.

ఈ ఆజ్ఞాపత్రం చూసేటప్పటికి ఆ దళవాయి కొంచె మెచ్చుతగ్గగా వణికాడు – అస్తమానం సలాములే–"అన్నీ సద్దండి" అని పారసీకంలో సిపాయీలకు ఆజ్ఞ యిచ్చాడు. అది చూసి పౌరుషంతో వసుబాలవర్యుడు ఫక్కున నవ్వాడు.

అంతా నిమిషంలో సర్దారు. ఆదళవాయి సలాముచేసి,"జనాబ్ ఖుదానంద్–మీరు త్వరగా మీదేశం పొండి తాళికోట మీదుగా. అక్కడ మా సైన్యాలు వుండయి. ప్రజలు మిమ్మల్ని చాలా గౌరవం చేస్తురు. నేను తాళికోట తహశీల్, తాలూకాదార్లకు అంచె పంపుతుండా. తమకు ఆరు బగ్గీలు, నాలుగు ఒంటెలు, ఒక ఏనుగు, ఇరవై లష్కర్ హుక్కుం."

వసు—తాళికోటలో శుభ్రమైన బస వుందయ్యా?

"జీహా, పాండేకరుబస పెద్దాభవనం; అన్నీ సౌకర్యాలు; చాలా మంచిది".

వసు—సరే; యిక నువ్వు పోయి నావెంట వచ్చే దళం పంపించు జల్దీ!

ఈలోపుగా అంతా సర్ది వెయ్యడం అయ్యింది. ఆ దళవాయి సైనికులు వెళ్లి పోయారు.

వసు—బాలుడిగుండె నెమ్మదించింది. ఏమో, తాను రాయల మనిషి అని గ్రహించి, ఇన్నాళ్లనుంచీ వాళ్లనిచేసిన మోసం ఊహించి కొఱత వేయిస్తే! చాలాగొప్పగండం తప్పింది. ఇక్కణ్ణుంచి త్వరగా ప్రయాణాలు సాగించి కటకపురం పోతే కొంత ప్రాణం కుదుట పడుతుంది.

## 3

తాళికోటలో పాండేకరుగృహంలో మకాం చేశాడు వసుబాలరెడ్డి. స్నానం భోజనం పూర్తిచేసుకొని షోకుగా ముస్తాబుచేసుకుని వూరుచూడ్డానికి బయలుదేరాడు. అక్కడ కొన్ని గొప్పదేవాలయాలున్నయి. మంచిమశీదుంది.

శిల్పచాతుర్యము, భవననిర్మాణకుశలత చూసి చాలా మెచ్చుకుంటూ బజారులో చిత్రమైనవస్తువులు కొన్ని కొన్ని కొనుక్కుంటూ, వసుబాలరెడ్డి కూలివానినెత్తిమీద సరుకులతో యింటికి వచ్చినాడు. ఈ తెచ్చినసామాను తన సుంద్రడని తోలుపెట్టెలో, కొంత కావిడిపెట్టెల్లోను సర్దుకుంటున్నాడు. అప్పుడు తనబట్టలమధ్య దివ్యమైనరవిక కనపడ్డది. ఆరవికశోంకం చూసేటప్పటికి వసుబాలుడి హృదయం హాయి మనేరాగాలు పాడింది. ఘుమఘుమ పరిమళించింది ఆ రవిక. జరీ



పువ్వులు, ఆణిముత్యాల అంచులుకుట్టిన ఆమేలిపట్టు ఊదారవిక ముట్టు కోడంతోనే వసుబాలుడివళ్లు జల్లుమంది. ఒక దివ్యసుందరవిగ్రహమైన బాలామణి రవిక విప్పి, మడతపెట్టి తనపెట్టెలో కొన్నిరోజుల కింద పెట్టినట్టే వుంది.

ఆ ఆనందంలో ఈరవిక తనపెట్టెలో ఎట్లా వచ్చింది అని ఆలోచన కలిగింది. విద్యానగరం బయలుదేరినప్పటినుంచి వుందా? తనపెట్టె లక్షసారులు సర్దుకున్నాడు; వుంటే కనపడదూ? పైగా తన యింటిలో ఇల్లాంటిరవిక తొడుక్కునే బాలికలు ఎవరున్నారు?

రవిక చేత్తో పట్టుకునేవున్నాడు. ఇంకా గుడ్డలు తీస్తూవుంటే; మనోహరమైన చీర కనిపించింది. మాయా? కలా? పరవశం చేసేటంత అందంగా వుంది ఆచీర.పొద్దున్న అరుణకాంతిలా మృదుత్వంగా వుంది

వెన్నెలలా లాలిత్యం తాల్చింది; చుక్కలమినుకులా లేనే లేదనునట్లుగా అతిసన్నతనం; వేయిపూవులతావులు ప్రాణాలు కరిగించే మడతలు అక్కడక్కడ.

ఈయింద్రజాలం అర్థం కాలేదు. ఆలోచనలేని ఆనందతన్మయత్వంలో ఒకనిమేషం మునిగిపోయి వసుబాలుడు ఇంక "అనగా అనగా ఒక్కరాజుకుమార్తె రావాలీ—"

అంటూండగా గభాలున తలుపులు తోసుకుని మేఘంలో మెరుపులా ఒకవ్యక్తి సుగంధంతో నిండిపోయిన సుడిగాలిలా వచ్చి వసుబాలుణ్ణి కౌగిలించుకొని, "నాథా ఎన్నాళ్లకు కలుసుకున్నాము!" అన్నది. క్వచిదుష్ణాంగకాలు ఆ లని దే హా న్ని చుట్టివేయడంతోనే ఆతనికి కెరటాల్లాంటి పులకరాలు పుట్టినవి. కవుగిలించిన ఆవ్యక్తి అంతటితో పోనిచ్చిందా! కళ్లునిమీలితాలుచేసి, వసుబాలుడి తలవంచి, ఆతని పెదవులమీద ఊపిరాడకుండా ముద్దులవర్షం కురిపించింది. వసుబాలుడు తన్మయుడై అప్రయత్నంగా, అద్భుతంగా, ఆనందతమంగా వచ్చిన ఆసుధా ప్రవాహంలో ప్రాణాల్ని ఎక్కడికో పోనిచ్చి ఏమి తెలియకుండానే ఆవ్యక్తిని తనవక్షానికి గట్టిగా అదిమివేసుకున్నాడు.

ఇంతలో ఆనూతనవ్యక్తి కౌగిలి సడలించుకుంది. వెనుకకు పోయి, అచ్చట వుండే ఒక పీఠంపై చదికిలబడి, "ఇప్పటికి నాప్రాణం మరల వచ్చింది" అని మెల్లగా అనుకున్నది.

ఆమె పదహారేళ్ల ఎలప్రాయాన వెలిగిపోయే బాలిక. చాలా అందంగా వుంది. మోము మూటగట్టినముద్దులే; మంచి వెడల్పయినకళ్లు. ముక్కు సమంగా సన్నంగా రాగంలోని 'సంగతి'లా వుంది. ముద్దకర్పూరం మొగ్గలే పెదవులు. చిన్ననోరు. దివ్యవిలాసమూర్తి. గాలిచేత చెదిరిన నీలిమబ్బులా ఆమెజుట్టు ముంగురులు చెదరిపోయివున్నయి. కళ్లల్లో నీరు తిరుగుతుంది; కాంతులు రెండు ఆకళ్లలోనే వెనకవెనక కనబడినై. పెదవులచివర సంతోషాన్ని విషాదాన్ని సమైక్యం చేసిన సుడిగుండాలు అతిచిన్నవి తిరుగుతున్నవి.

"మీరు పంపిన బేగిరావు అందగానే ఆలస్యం లేకుండా అందలం మీద వచ్చాను."

వసుబాలరెడ్డికి పిచ్చన్నా ఎత్తివుండాలి, లేక చైతన్యంఅన్నా తప్పివుండాలి. తెల్లబోయి అలాగే చూస్తూవున్నాడు. మాటలేదు.

ఆ అమ్మాయితో వచ్చిన దాసీలున్నూ ఆయింట్లోనేవున్న పనికత్తెలున్నూ వెళ్లిపోయారు.

ఆబాలిక లేచి ఆగదితలుపు మూసుకున్నది. అప్పుడామె కళ్లు లేడికళ్లలా బెదరుతున్నవి. రెండు చేతులతోనూ కళ్లు మూసుకొని వెక్కివెక్కి ఏడవడం మొదలు పెట్టింది.

ఇదంతా తనచరిత్ర కనుక్కోటానికి నబాబుపన్నిన తంత్రం కాదుగదా అనుకున్నాడు వసుబాలుడు. అతనికి చెమటపట్టింది.

అయితే ఈఅమ్మాయి తప్పకుండా పక్కా బోగంది; ఎంత పన్నాగం పన్నిందీ? తనగుట్టు తెలియడానికి ఏమన్నా పొరపాటు పని చేయలేదుగదా తాను! అతిజాగ్రత్తగా వుండాలి. ఈ రాయలు కవిత్వాలువింటూ సమస్తభోగాలు అనుభవిస్తూవుండక యీయుద్ధాలు ఎందుకయ్యా! తనకి ప్రాణభయం లేదుగదా?- అతని ఆలోచన లేడి పరుగులా పరుగెత్తుతోంది.

"వసుబాలరెడ్డివర్యా!"

ఉలిక్కిపడి తలయెత్తి చూశాడు వసుబాలుడు. ఆబాలిక తనవైపు దీనత్వం వెదజల్లే అపాంగవీక్షణాలు పంపిస్తూవుంది.

"మహావీరుడను శివబాలరెడ్డి సేనానాయకుణ్ణి స్మరించుకోండి."

ఏమిటిది ఎవరీబాలిక? తనగుట్టు అంతా తెలిసింది. నవాబుపన్నిన పన్నాగం ఇది. సాయంత్రంలోపుగా తలయెగిరిపోతుంది. పారశీకభాష నేర్చుకోవటానికి ఎందుకు బీజపురం వచ్చానో!

వసు—నువ్వు ఎవరవు?

బాలిక—మాది రాయచూరు కాపురము.

వసు—అయితే?

బాలిక—నేను ఈదేశంలోంచి పారిపోవాలి.

వసు—ఏల?

బాలిక—బీజపురం నవాబుకు శ్రీమూరు రాయరగండ శ్రీకృష్ణరాయ సార్వభౌములవారికిని యుద్ధం వచ్చింది.

వసు—ఎందుకు?

బాలిక—శ్రీకృష్ణరాయలయ్యావార్లంగారు రాయచూరు ముట్టడించారు.

వసు—ముట్టడిస్తే?

బాలిక—రాయచూరు నవాబుది: అందుకని యుద్ధం.

వసు—నాకీగొడవ అంతా ఎందుకు?

బాలిక—మీచేతిలో నాప్రాణం వున్నది.

వసు—నీది రాయచూరు కాపురం అయితే యీయుద్ధభయం ఎందుకు?

బాలిక—రాయచూరుపూర్వకాలంనుంచి విజయనగరంవారిది.

వసు—అది నువ్వు పారిపోవడానికి కారణ మెట్లా?

బాలిక—రాయచూరులోవుండే ప్రజలంతా విజయనగరపక్షపాతులు-నేనున్నూ విజయనగర పక్షపాతిని-అందుచేత విజయనగరరాజ్యంలోకి పోవాలి.

వసు—నువ్వు యిక్కడ వుంటే ఏమిభయం? నువ్వు ఇక్కడ వుండడం ఏలా తటస్థించింది?

బాలిక—నేను ఈచుట్టుపక్కల మాచుట్టాల యిళ్లల్లో వుండడం తటస్థించింది. రాయచూరు సంగతులన్నీ గ్రహించాను; నేను శ్రీరాయలవారి వేగువారిలో ఒకర్తెను, అంతఃపుర నారీమణులతో మెలగుతూ అనేక వేషభాషలతో సంచరిస్తూ రహస్యములు ఎన్నో గ్రహించాను. అవన్నీ ఎల్లుండి ఉదయంలోగా అప్పాజీవారికి అందాలె. అట్లా అందాలంటే తమరొక్కరే ఆధారం.

వసు—మాప్రభువుకున్నూ మీరాయలవారికిన్నీ మనస్పర్ధలు చాలా వున్నాయి. మాది కటకపురం; నేను నవాబువారికి స్నేహితుణ్ణి. నేను నీకు ఎట్లా సహాయం చేస్తాను. నాదగ్గిర మాప్రభువు గజపతిసహారాజులవారి ఆజ్ఞాపత్రము,శ్రీనవాబువారిఫర్మానాయున్నూ ఉన్నవి.

బాలిక—మీరన్నది కొంత నిజమే. కాని మీచరిత్ర పూర్తిగా తెలుసును. శ్రీశివబాలరెడ్డివర్యులను అందుకోసమే జ్ఞాపకం తెచ్చుకోమన్నా. నేను నవాబుతరఫున మనిషిని అని మీరేమిన్నీ భయపడనద్దు. మీరీవూరు సంవత్సరంక్రితం వచ్చి పారశీకం నేర్చుకున్నారు. ఆ గ్రంథాలన్నీ చదివాను.

ఆ ఆఖరుముక్కకు వసుబాలుని హృదయం హాయిమంది.

"నేనున్నూ, మాతండ్రి ప్రతాపనాయలవారున్నూ రాయచూరులో రాయలవారి వేగుసైన్యంలో పనిచేసేవారం. అంతఃపురాల్లోని రహస్యాలు గ్రహించడంలో అతి చమత్కారంగా పని చేస్తానని మా నాయన గారంటారు. ఆయనగ్రహించిన రహస్యాలు, 'నేను గ్రహించిన రహస్యాలు నాదగ్గిరవున్నై; ఆయనదారిగా ఆయన, నా దారిగా నేను పారిపోదామని అనుకుంటూవుండగా ఆయన పట్టుబడ్డారు. మా యిద్దరికితప్ప యింక ఎవరికీ ఈరహస్యాలు తెలియవు. మీ చరిత్ర మొదటనుంచీ మాకు తెలుసును. మాతండ్రిగారు పట్టుపడిన తరువాత నేను మాచుట్టాలయిళ్లల్లో మాయమయ్యాను. నాసంగతి నవాబు వేగుసైన్యాధిపతికి, అతని తాబేదార్లకు చాలామట్టుకు తెలియవచ్చింది. పూర్తిగా తెలియదు. చిన్నతనాన్నుంచి మగబిడ్డలు లేని మాతండ్రి నాకీ వేగువిద్య చాలాబాగా నేర్పారు."

వసు—అయితే. నేను నీకు ఎట్లా సహాయం చేయగలను?

బాలిక—మీదగ్గిర నవాబు ఫర్మానా వుంది. అందులో వసుబాలరెడ్డిగారు అన్నది పంక్తిచివర వున్నది. అక్కడ భార్యతో అని చేరిస్తే సరిపోతుంది.

ఆమెముఖం సిగ్గులతో కెంపువారింది.

వసు—నీవు అవివాహితవా?

బాలిక—అవును.

వసుబాలుడికి ఏమిటో ఆనందమైపోయింది.

వసు—నువ్వు చెప్పేసంగతులు యథార్థములన్న గుర్తేది?

బాలిక తలవాల్చి చిరునవ్వు పెదవులచివర సుడులు తిరుగుతూ వుండగా వెనకకు తిరిగి ఏదోవస్తువు తీసి అతనివైపు తిరిగి చూపించింది.

అది శ్రీరాయల రహస్యముద్ర. ఆముద్ర విద్యానగర ప్రజలలో చాలా కొద్దిమందికే తెలుసును. వసుబాలుడికళ్లు పువ్వుల్లా విడ్డాయి. "అమ్మాయీ అట్లాగేకాని నేను ఆఫర్మానా దిద్దలేనే."

"ఆపని నాదండి; ఆఫర్మానా నాచేతి కివ్వండి."

"కాని నా ఫర్మానాలో వున్న సంగతులన్నీ నీకెట్లా తెలిసినవి?"

"అయ్యా! బీజపురంలో మిమ్మల్ని తణిఖీచేయడానికి వచ్చిన దళవాయిసైనికులు శ్రీచక్రవర్తి వేగుసైన్యంలో వున్నవారే!"

వసుబాలుడికి ఆశ్చర్యం వేసింది.

"అయితే నాపెట్టెలోవున్న రవిక, చీర నీవా? అవి బీజపురంలోనే ఆదళవాయి పెట్టివుంటాడా ఏమిటి?"

"అవినావే. ఆదళవాయే మీపెట్టెలో పెట్టాడు. ఆయనే మీఫర్మానా చూశాడు. మీమీదే మావేగు ఆధారపడి వున్నదని మేమంతా నిశ్చయం చేసుకున్నాము."

ఆమె ఆఫర్మానా పుచ్చుకున్నది. ఆమె కూడా తెచ్చినపెట్టెలోంచి రంగులపెట్టె తీసి ఆఫర్మానామీద రాసిన దస్తూరీలాంటి దస్తూరీతో అటువంటి రంగులోనే "భార్యతో" అని రాసింది. వసుబాలుడు చూస్తూనే త్రుళ్ళింగా మైమరిచి పోయాడు.

౫

వసుబాలుడి కవిహృదయం యావత్తూ ఆబాలికమీదనే వుంది. ప్రేమాలోచనలమీద ప్రేమాలోచనలు వెల్లువల్లా పొర్లుకు వస్తున్నవి. ఏవేవిటో భావించుకుంటాడు. తనెక్కిన గుఱ్ఱంబండి ఆమెసవారి వెనక్కు పోనిస్తాడు. ఏమి అందమైంది! పెద్దన్నగారి కవిత్వంలో, యితరకవుల కవిత్వాల్లో యీలాంటి నాయికను వర్ణించారూ? కనకప్రబంధాల్లోనూ, గ్రంథాల్లోనూ లేరు అపరిమిత సుందరమైనటువంటిస్త్రీలు—అయితే ఎల్లాగ తాను ఈనవాబుసైన్యాలు దాటడం; ఎల్లాగ ఈబాలికనూ......వాళ్ళవాళ్ళకి అప్పచెప్పడం? బాలికలు కూడాచాలా తెలివైన వాళ్లు వుంటారు! ఏమి చాకచక్యంగా మాట్లాడింది;ఎంతనేర్పుగా వ్యాపారం సర్దుకునచ్చిందీ! ...... ఎంతకష్టం వచ్చినా ఆబాలిక్కే తప్పించేశక్తి వుంది.—

అదృష్టవశాత్తు ఆతని ప్రయాణంకూడా రాయచూరు ప్రక్కన వున్నది. ఉళింది, అక్కడనుంచి పానగల్లు, దేవగకొండ మీదుగా గోలకొండరాష్ట్రము, అక్కడనుంచి నాలుగైదు మజిలీల్లో కళింగరాజ్యం చేరుకోవడంగా నవాబు వుద్యోగస్థులు ఏర్పాటుచేసివున్నారు.



రాజకీయోన్నత బాలికా పాఠశాల | నాటకపాత్రలు— [illegible]



సప్తమవార్షికోత్సవము, శ్రీశారదాసమాజము, అనంతపురము



శ్రీశారదా ఉచిత గ్రంథ పఠనాలయము

వసు—నువ్వు యిక్కడ వుంటే ఏమిభయం? నువ్వు ఇక్కడ వుండడం ఏలా తటస్థించింది?

బాలిక—నేను ఈచుట్టుపక్కల మాచుట్టాల యిళ్లల్లో వుండడం తటస్థించింది. రాయచూరు సంగతులన్నీ గ్రహించాను; నేను శ్రీరాయలవారి వేగువారిలో ఒకత్తెను, అంతఃపుర నారీమణులతో మెలగుతూ అనేక వేషభావాలతో సంచరిస్తూ రహస్యములు ఎన్నో గ్రహించాను. అవన్నీ ఎల్లుండి ఉదయంలోగా అప్పాజీవారికి అందాలె. అట్లా అందాలంటే తమరొక్కరే ఆధారం.

వసు—మా ప్రభువుకున్నూ మీరాయలవారికిన్నీ మనస్పర్థలు చాలా వున్నాయి. మాది కటకపురం; నేను నవాబువారికి స్నేహితుణ్ణి. నేను నీకు ఎట్లా సహాయం చేస్తాను. నాదగ్గిర మాప్రభువు గజపతిసహారాజులవారి ఆజ్ఞాపత్రము,శ్రీనవాబువారిఫర్మానాయున్నూ ఉన్నవి.

బాలిక—మీరన్నది కొంత నిజమే. కాని మీచరిత్ర పూర్తిగా తెలుసును. శ్రీశివబాలరెడ్డివర్యులను అందుకోసమే జ్ఞాపకం తెచ్చుకొన్నా. నేను నవాబుతరఫున మనిషిని అని మీరేమిన్నీ భయపడవద్దు. మీరీవూరు సంవత్సరంక్రితం వచ్చి పారశీకం నేర్చుకున్నారు. మీ గ్రంథాలన్నీ చదివాను.

ఆ ఆఖరుముక్కకు వసుబాలుని హృదయం హాయినుంది.

"నేనున్నూ, మాతండ్రి ప్రతాపనాయలవారున్నూ రాయచూరులో రాయలవారి వేగుసైన్యంలో పనిచేసేవారం. అంతఃపురాల్లోని రహస్యాలు గ్రహించడంలో అతి చమత్కారంగా పని చేస్తానని మా నాయన గారంటారు. ఆయనగ్రహించిన రహస్యాలు, నేను గ్రహించిన రహస్యాలు నాదగ్గిరవున్నై; ఆయనదారిగా ఆయన, నా దారిగా నేను పారిపోదామని అనుకుంటూవుండగా ఆయన పట్టుబడ్డారు. మా యిద్దరికితప్ప యింక ఎవరికీ ఈరహస్యాలు తెలియవు. మీ చరిత్ర మొదటనుంచీ మాకు తెలుసును. మాతండ్రిగారు పట్టుపడిన తరువాత నేను మాచుట్టాలయిళ్లల్లో మాయమయ్యాను. నాసంగతి నవాబు వేగు సైన్యాధిపతికి, అతని తాబేదార్లకు చాలామట్టుకు తెలియవచ్చింది. పూర్తిగా తెలియదు. చిన్నతనాన్నుంచి మగబిడ్డలు లేని మాతండ్రి నాకీ వేగువిద్య చాలాబాగా నేర్పారు."

వసు—అయితే. నేను నీకు ఎట్లా సహాయం చేయగలను?

బాలిక—మీదగ్గిర నవాబు ఫర్మానా వుంది. అందులో వసుబాలరెడ్డిగారు అన్నది పంక్తిచివర వున్నది. అక్కడ భార్యతో అని చేరిస్తే సరిపోతుంది.

ఆమెముఖం సిగ్గులతో కెంపువారింది.

వసు—నీవు అవివాహితవా?

బాలిక—అవును.

వసుబాలుడికి ఏమిటో ఆనందమైపోయింది.

వసు—నువ్వు చెప్పేసంగతులు యథార్థములన్న గుర్తేది?

బాలిక తలవాల్చి చిరునవ్వు పెదవులచివర సుడులు తిరుగుతూ వుండగా వెనకకు తిరిగి ఏదోవస్తువు తీసి ఆతనివైపు తిరిగి చూపించింది.

అది శ్రీరాయల రహస్యముద్ర. ఆముద్ర విద్యానగర ప్రజలలో చాలా కొద్దిమందికే తెలుసును. వసుబాలుడికళ్లు పువ్వుల్లా విడ్డాయి. "అమ్మాయీ అట్లాగేకాని నేను ఆఫర్మానా దిద్దలేనే."

"ఆపని నాదండి; ఆఫర్మానా నాచేతి కివ్వండి."

"కాని నా ఫర్మానాలో వున్న సంగతులన్నీ నీకెట్లా తెలిసినవి?"

"అయ్యా! బీజపురంలో మిమ్మల్ని తణికీచేయడానికి వచ్చిన దళవాయిసైనికులు శ్రీచక్రవర్తి వేగుసైన్యంలో వున్నవారే!"

వసుబాలుడికి ఆశ్చర్యం వేసింది.

"అయితే నాపెట్టెలోవున్న రవిక, చీర నీవా? అవి బీజపురంలోనే ఆదళవాయి పెట్టివుంటాడా ఏమిటి?"

"అవినావే. ఆదళవాయే మీపెట్టెలో పెట్టాడు. ఆయనే మీఫర్మానా చూశాడు. మీమీదే మావేగు ఆధారపడి వున్నదని మేమంతా నిశ్చయం చేసుకున్నాము."

ఆమె ఆఫర్మానా పుచ్చుకున్నది. ఆమె కూడా తెచ్చినపెట్టెలోంచి రంగులపెట్టె తీసి ఆఫర్మానామీద రాసిన వస్తూరీలాంటి వస్తూరీతో అటువంటి రంగుతోనే "భార్యతో" అని రాసింది. వసుబాలుడు చూస్తూనే తుణ్ణంగా మైమరిచి పోయాడు.

※

వసుబాలుడి కవిహృదయం యావత్తూ ఆబాలికమీదనే వుంది. ప్రేమాలోచనలమీద ప్రేమాలోచనలు వెల్లువల్లా పొర్లుకు వస్తున్నవి. ఏవేవిటో భావించుకుంటాడు. తనెక్కిన గుఱ్ఱంబండి ఆమెసవారి వెనక్కు పోనిస్తాడు. ఏమి అందమైంది! పెద్దన్నగారి కవిత్వంలో, యితరకవుల కవిత్వాల్లో యీలాంటి నాయికను వర్ణించారూ? కనక ప్రబంధాల్లోనూ, గ్రంథాల్లోనూ లేరు అపరిమిత సుందరమైనటువంటిస్త్రీలు—అయితే ఎల్లాగ తాను ఈనవాబుసైన్యాలు దాటడం; ఎల్లాగ ఈబాలికనూ......వాళ్ళవాళ్ళకి అప్పచెప్పడం? బాలికలు కూడాచాలా తెలివైన వాళ్లు వుంటారు! ఏమి చాకచక్యంగా మాట్లాడింది;ఎంతనేర్పుగా వ్యాపారం సర్దుకువచ్చిందీ! ...... ఎంతకష్టం వచ్చినా ఆబాలికేక్క తప్పించేశక్తి వుంది.—

అదృష్టవశాత్తు ఆతని ప్రయాణంకూడా రాయచూరు ప్రక్కన వున్నది. ఉళింది, అక్కడనుంచి పానగల్లు, దేవరకొండ మీదుగా గోలకొండరాష్ట్రము, అక్కడనుంచి నాలుగైదు మజిలీల్లో కళింగరాజ్యం చేరుకోవడంగా నవాబు వుద్యోగస్థులు ఏర్పాటుచేసివున్నారు.



రాజకీయోన్నత బాలికా పాఠశాల నాటకపాత్రలు——పరశురామగర్వభంగము



సప్తమవార్షికోత్సవము, శ్రీ శారదాసమాజము, అనంతపురము



శ్రీ శారదా ఉచిత గ్రంథ పఠనాలయము



దారిపొడుగునా నవాబుగారి సైన్యాలే ఎదురుపడ్డవి. మన ప్రయాణీకుల్ని ఆపుచేయడం, నవాబుగారి ఫర్మానా చూసి పోని య్యడం నాలుగయిదుసార్లు జరిగింది. ఎప్పటికప్పుడు వసుబాలుడి ప్రాణాలైదున్నూ అతని అరచేతిలో చేరుకుంటూ వుండేవి.

మరునాడు సాయంకాలానికి వుళింది చేరుకున్నారు; సత్రంలో బసచేశారు. వూరంతా సైన్యాలు నిండి వున్నవి. సత్రంలో దిగగానే, ఒక సుబేదారు కొంతమంది సర్దారులతో వచ్చి వసుబాలుణ్ణి నవాబు ఫర్మానా చూపించమన్నాడు.

వసుబాలుడికి భయంవేసింది; కొంచెం కోపమూ వచ్చింది. మాట్లాడకుండా మొగం చిట్లించుకుంటూ ఫర్మానా తీసి చూపించాడు. ఫర్మానాకు సలాంపెట్టి ఆసుబేదారు దీక్షతో ఫర్మానాను ఎగాదిగా చూశాడు; కాగడాలు తెమ్మని ఆవెల్తురులో పరీక్షించాడు.

సుబేదారు—నీ భార్యపేరు?

అమ్మగొయ్యో! ఇదేంప్రశ్న? వసుబాలుడిగుండె గుబుక్కుమన్నది. కోపముఖంతోనే-"సిరియాలదేవి."

సుబే—మీకెప్పుడు వివాహం అయింది.

"ఏడున్నర్థం అయింది."

ఈమాత్రం ధైర్యం వసుబాలుడికి ఇదివరకు కలగనేలేదు.

సుబే—మొదట వచ్చేటప్పుడు భార్యతో వచ్చారా?

"లేదు; కాని మా అత్తవారూరికి బేగిరావుటపా పంపాను."

సుబే—ఏవూరదీ?

వసు—(తడుముకోకుండా) అమరాబాదు.

సుబే—అయ్యా, మీరు కొండపల్లి సంస్థానం నుంచే వచ్చివుంటారు. మీసంగతి మాకు ఇదివరకే వేగు వస్తూవున్నది. కాని మీకు వివాహమైనట్లుగా మా కేవిధమైన సంజాయిషీ వచ్చివుండలేదు. మీరు బీజపురంలో వున్నంతకాలం ఎక్కడా భార్యతో వున్నట్లు కనపడలేదు.

వసు—ఏమండీ పారశీకం నేర్చుకునేటందుకు వచ్చేటప్పుడు- ఒక్కఏడాదే పరదేశంలో వుండవలసి వచ్చినప్పుడు- భార్యనుకూడా తీసుకురావాలా? ఇంక స్వదేశం పోతున్నాంకదా, కంభంలో చుట్టాలు వుండడంచే ఆపట్టణంపోదామని, భార్యను పంపమని మామగారికి వుత్తరం పంపించినా.

ఆ సుబేదారుకు మళ్లీ మాట్లాడకుండా వసుబాలుణ్ణి ఒకగదిలోకి తీసికొనిపోయి అన్నిదుస్తులువిప్పించి శల్యపరీక్ష చేశాడు. "సరే,మీరు పొండీ" అన్నాడు.

సుబే—అయ్యా,మీభార్యను కూడా తనిఖీచెయ్యాలి. మాలో ఆడవేసువాళ్లు వున్నారు. వారు పోయి తనిఖీచేస్తారు.

వసు—ఏమయ్యా, నేను శ్రీగజపతి మహారాజువారికి ముఖ్యసభ్యుల్లో వొకణ్ణి. వారి శ్రీముఖము, వారికి ప్రాణస్నేహితులైన శ్రీశ్రీ సుల్తాన్ బహదూరువారి ఫర్మానా వున్నవి. అప్పటికి నువ్వు అగౌరవం చేస్తున్నావు. ఇది మాప్రభువుకు విన్నవించుకోవాలి. అటుపైన ఏమిజరిగేదీ నువ్వు ఆలోచించుకో.

సుబే—సలామ్. మీరుచెప్పింది నిజం. అయితే మారహస్యాలు కొన్ని ఒకస్త్రీ—అంటే ఒకబాలిక,మీభార్య అంతవున్నది- గ్రహించుకొనిపోయింది. ఆమె ఇంద్రజాలంలా మాయమై పోయింది. ఆమె పారిపోకూడదు. అందుకని మేము ఈలాంటి కట్టుదిట్టాలు చేయవలసి వచ్చింది. క్షమించాలి.

ఆబాలిక పరీక్ష అయింది.

ఒకస్త్రీ మేలిముసుగు వేసుకు వచ్చి ఈసుబేదారుకు ఒకకాగితం ముక్క యిచ్చింది అది వసుబాలుడు తనమామగారికి రాసినఉత్తరం. భార్యను త్వరగా పంపించమని, కంభంలో వున్న మామగారి యింటికి వెడుతున్నానని అందులో వున్నది.

కంభంలో నిజంగా వసుబాలుడి మేనమామ వుండడం నిజం. నిజంగా ఆవుత్తరంలో "శ్రీఅమరాబాదు వాస్తవ్యులున్నూ ...... శ్రీమామగారి పాదసముఖానకు తిమ్మానేని వసుబాలరెడ్డి సాష్టాంగ

దండప్రణామాలుచేయంగలవాడైఅర్పించుకున్నటువంటి మనవి......" అని వున్నది. అది తాళ్ళికోటలో యథాలాపంగా చూసివుంటాడు. లేకపోతే ఆవూరు తొందరగా ఏలా జ్ఞాపకం వస్తుంది? అమ్మయ్యా, భగవంతుడు మహాఉపద్రవమైన గండం తప్పించాడు.

సుబేదారు—అయ్యా, నేను చెప్పిన ఆబాలికను ఎరిగిన కొందరు స్త్రీలు వున్నారు, రాయచూరుకాపురస్థులు. వాళ్లు షోలాపురంలో వున్నారు. వాళ్లని తీసుకురమ్మని అతివేగంగల రౌతును పంపించాను. వాళ్లు పొద్దున్నకు వస్తారు. అందాకా మీరు ఈసత్రంలోంచి కదలి వెళ్లకూడదు.

౬

వసుబాలుడి హృదయంలో రాయి పడింది. అతడు 'సరే' అని అతిస్థైర్యంగా కబురుచెప్పి లోనికి పోయాడు. గదిలో ఆబాలిక కూర్చునివున్నది. వసుబాలుడు "ఇది అంతా ఎట్లా—" అని ఏదో అడగబోతున్నాడు. 'ఉస్' మని ఆబాలిక సైగచేసింది. దగ్గరగా కూర్చుండమనిపిలిచింది. పరవశమైన దేహంతో పోయి ఆబాలికప్రక్క కూచున్నాడు. ఆబాలిక అతిరహస్యంగా అతనిచెవులో— "నారం గులపెట్టె వాళ్లెవ్వరికీ తెలియకుండా దొడ్డిభూముకాలవలో దాచి నాను. రేపు నన్నెరిగున్న ఆడవాళ్లు వస్తారు. నన్ను ఆనవాలు కడ తారు. నేను మిమ్మల్ని వృథాగా ఎందుకు ప్రాణాపాయమైన అవస్థ లోకి తీసుకురావడం? నేను పారిపోతాను. మిమ్మల్ని వాళ్లేమీ చేయరు."

"నువ్వు పారిపోతే వాళ్లకి పట్టుబడకుండా వెళ్లగలవా?"

"ఏమో! నాశక్తి వున్నంతవరకు ప్రయత్నం చేస్తాను. నాప్ర భువుకోసం నాప్రాణం పోతే ఏం?"

"అయ్యయ్యో! నువ్వు వొక్కదానివే పారిపోగలవా? ఒక మనిషివస్తే పరుగెత్తగలవా— నీకు సహాయం చేసేవాళ్లు యుద్ధం ప్రా రంభం అయిన తరువాత ఎవరు దొరుకుతారు—"

"మానాయనగారు 'ఎవరికి వారే సహాయం. వేగువారు పర సహాయం కోరరు. ప్రాణానికి వెరువరు—' అని చెప్పుతూవుండేవారు."

వసుబాలుడు దీర్ఘంగా ఆలోచన ప్రారంభించాడు. అతనికి ఏమీ పాలుపోలేదు. ఈబాలికతో వెడితే ఇద్దరూ పట్టుబడతారు. తప్పదు! అప్పుడు ఇద్దరికీ మృత్యువే. చావు చాలా భయంకరమైంది; వొళ్లుజలుపు గొలుపుతుంది. తాను మూడుకొత్తభావలు నేర్చుకున్నాడు. ఈమూ డేళ్లలో రాసినగ్రంథాలు గురువుగారికి వినిపించలేదు. ఆయన చిరు నవ్వుతో మన్నించడం— తోడి సహాధ్యాయుల మెప్పులు పొందవద్దూ? రాయలకే అంకితమా—అప్పాజీఅయ్యవారికి కృతి ఇద్దామని ఎంతకాలం నుంచో—

వసుబాలుడు ఉలిక్కిపడ్డాడు. ఆబాలిక ఉన్నదనే మరిచి పోయాడు. భయంతో ఆమెదగ్గిర్నుంచి కొంచెం పక్కకు జరిగాడు. శ్రీరాయల సభావైభవం, ఆనందంతో కూడుకొనివున్న తన సాధారణ జీవితం, పద్యాలు చదవడం— అన్నీ ఎదురుగుండా కనిపించినవి.

కాని—ఈబాలిక ఎంత అందకత్తె!— ఆమెఅందం ఎంత వర్ణిం చాలనుకున్నాడు! కాని— ఇంత,కష్టాలకు అధిదేవత అని ఎవరనుకున్నారు! అయితే తనప్రభువుకోసం ప్రాణాలకి వెరవకుండా రాజసేవా పత్నము లలో తేలిపోయే దివ్యహంసిలా వున్నది. ఆడవాళ్లకు రాజసేవ అవ సరం లేదు. కుడిచికూర్చోకుండా ఏమిటో—నికారమైనకార్యాలు!—నిజ మైనసేవ సరస్వతీసేవ.—ప్రభువులు లేకపోతే సరస్వతీ సేవ చేయనిచ్చే వారెవరు? తనుకూడా వుంటే ఆబాలిక్కి. కష్టం; ఎవరిదారిని వారు పోతే!

అస్పష్టంగా చెవులకు వెక్కి-వెక్కి— ఏడుపు వినవచ్చింది. వసు బాలుడిమనస్సు కయిక్కుమన్నది. ఆఅమ్మాయి చెయ్యిపట్టుకుని ఆబాలి కను దగ్గిరకు చేరదీసుకున్నాడు. అతనిచేతిమీద వెచ్చని కన్నీటిచుక్క లు పడినవి.

అస్పష్ట ధ్వనితోనే "ఓఅమ్మాయీ! నీకు సిరియాలదేవి అని పేరుపెట్టుకున్నా......అప్పుడు నాహృదయం ఎంత పొంగిందో భగ వంతునికి ఎరుక! నాటి నాఉత్తేజం, నాఆనందం ఈనాటికి మరిగి పోదు. నువ్వు ఒక్కదానవు వెడితే తప్పక నవాబుసైనికుల చేతుల్లో పడిపోతావు. నువ్వు పరుగెత్తలేవు. నువ్వు నడవలేవు. ఒకరిద్దరు విరోధులు వస్తే వారితో—ఆ-ఆ-యుద్ధం చేయలేవు. కాబట్టి నేను న్నూ నీతో వుండాలిసిందే."

"మీరు కవులు; భక్తులహృదయం ఆనందతాండవ తన్మయమై పోయేటట్లు చేయగలరు. మీకు ఈతుచ్ఛయుద్ధాలు, ఈగొడవా వద్దు. నాకు కళ్ల నీళ్లువచ్చిందె? భయంచేత కాదు. ఆడదాన్ని-చేతగానిదాన్ని— ఇదివరకు పరపురుషునితో ఏవిధమైన సంపర్కమున్నూ కలిగివుండ లేదు. నాప్రభువుకు ఏలా సేవచేస్తానా, రాయచూరు ఏలా చక్రవర్తి స్వాధీన మవుతుందా—అని ఆలోచించగా ఆలోచించగా, హృదయంలో బెంగపుట్టి, కంటినీళ్లువచ్చినవి. మాఆడవాళ్ల స్వభావమే కాదా అది."

వసుబాలుడికి పులకరాలు పుట్టినవి. ఏమికవిత్వం? తాను పురు షుడు- తనప్రభువు మహాచక్రవర్తి కృష్ణరాయలు మహా కవి - మహా విద్వాంసుడు—భోగి—వీరుడు—భక్తుడు! అతనికోసం ప్రాణం ధారపోయటం అత్యంతమూ గొప్ప కాక, అపరిమితమైన సుందరాంగి తనజీవితం, ఆత్మ, సర్వంలయంచేసుకుంది. పూర్వకథానాయకులు ఎవ రింతఅదృష్టవంతులు! ఆబాలికదగ్గిరవుంటేనే పదివేలు. మంచిగంధపుచెట్టు పెరటిలోవున్నట్టే! వెన్నెల వెన్న, అమృతము, పారిజాతపుష్పపువాసన, గీతావీచికలలో వున్న అంతరాంతర మాధుర్యం - అంతా మూర్తిభవించినట్లు వున్నది. ఈమె లేక నాబ్రతు కేమిటి; కవిత్వం ఏమిటి?

ఆతని వదనము జేవురించింది. వెయ్యి ఏనుగుల బలం వచ్చినట్లయింది. ఉత్సాహం తేజస్సులా వచ్చి ఆవరించి వేసింది. ఆమెదగ్గరగా వచ్చాడు; ఆమెమూర్ధము కరతలాలతో పట్టుకున్నాడు; తన హృదయాన్ని అదుముకున్నాడు; భగవంతుని ప్రార్థిస్తూ ఆమె నొసటిమీద పెదవులను ఆనించాడు.

ఆమె లేచి నుంచుంది. వసుబాలుడు హృదయం ఆబాలికకు అవగతం అయిపోయింది. ఆతని చెవిలో కొన్ని రహస్యాలు చెప్పింది. వసుబాలుడు మాట్లాడకుండా సత్రంకిటికీకి వున్న కఱ్ఱవూచలు నాలుగూ అతిబలంగా పీకిపారేశాడు. ఇద్దరు చప్పుడుకాకుండా ఆచీకటిలోకి సత్రంవెనకగా గోడపక్కలనుంచి సందులోపడి ఊరిబయట పొలాల్లో దూరి మాయమైపోయారు.

సత్రంలో వీళ్ళగది ఎదురుగుండా పహారాజవాను ఏమరుపాటులేకుండా పారా యిస్తూనేవున్నాడు.

## ౨

ఆరాత్రల్లా కునికిపాట్లు పడుతూ, ఆలసటపడి ఒరిగిపోతూ, కాళ్ల నొప్పులతో,కణతలబరువుతో యిరవై మైళ్లు నడిచారు.డొంకలు-గుట్టలు- కత్తిలాంటి రాళ్లు. కీచు రాళ్లు, అడవిమృగాలధ్వనులు గుండెలు కలవిపెట్టేస్తున్నవి వసుబాలుడికి. ఒకరికొకరు ఆసరగా చుక్కల్ని చూచి ఆనవాలు పట్టుకుంటూ దక్షిణంగా పోయారు.

చల్లనిగాలి వీచింది. అస్పష్టమధురరాగం వినపడింది. కొంతకీకారణ్యం దాటగానే ఎట్టఎదుట కృష్ణానది.

దారిలో నవాబుసైన్యాలు సెగళ్లదగ్గిర కనపడ్డాయి. డేరాలు ఆచీకట్లో నెల్లని గొడుగుల్లా వున్నవి. భయపడుతూ చుట్టుదారులు చుట్టుకుంటూ వచ్చారు. నీరసము పడుతూన్నకొద్దీ, ఆయాసము ఎక్కువ అవుతూన్నకొద్దీ వసుబాలుడు ధైర్యం, ఆనందం ఎక్కువగా సాగింది.

ఇంక ఏలాగు కృష్ణ దాటడం? అక్కడ కృష్ణఒడ్డు కత్తిరిగట్టుగా వుంది. కొండ నిలువుగా కోసివుంది. రాళ్లు రప్పలు. నెమ్మదిగా ఆగట్టునే తూర్పుగా వెళ్లడం ప్రారంభించారు. ఆచీకట్లోనుంచి ఒక పిశాచధ్వనిలా, "ఎవరుమీరు? అక్కడ కదలకండా ఆగండి" అని వినవచ్చింది. ఇద్దరూ నిశ్చేష్టుల్లా అల్లాగే నిలుచుండిపోయారు.

ఎవరో చెకుముకివెలిగించి కాగడా ముట్టించారు. ఇద్దరు నవాబుసైనికులు వీళ్ల దగ్గిరకు వచ్చి వీళ్లిద్దర్ని ఎగాదిగా చూచి వారిలో వారేదో సైగచేసుకున్నారు.

ఒకడు__ఎవరు మీరు?

వసు__మేము దారి తప్పిపోయిన బాటసారులము.

వాడు__ఇక్కడ ఎక్కడ దారి తప్పిపోయారు?

బాలిక__ముల్వమట్టిగ్రామంనుంచి గద్వాల పోతున్నాం. దారిలో దొంగలు కొట్టినారు. అక్కడనుంచి పోతూ ఈలా వచ్చినాము.

వాడు__అల్లాగా! మిమ్మల్ని చూస్తే మాకు చాలా అనుమానంగా వుంది. ఇక్కడ మైలుదూరంలో మాసైన్యం మకాంచేసింది. అక్కడకి మీఇద్దరు రావాలి.

వసుబాలుడు తన సిరియాలదేవికేసి పారచూశాడు. ఆ అమ్మాయి ఆతనికేసి తీక్ష్ణమైన ఒక్కవీక్షణం పంపించింది. "వీళ్లతో వెడితే మనపని సున్న"అని అర్థం అయ్యింది వసుబాలుడికి. వాళ్లిద్దరకేసి పారచూశాడు. తుండుముక్కల్లా వున్నారు. కత్తులు, డాల్లు వున్నవి. వీళ్లతో తాను దెబ్బలాడగలడా? ఇదివరకు ఎప్పుడూ యుద్ధంచేసి యెరగడే. అయితేఏం? అతనికొళ్లు పొంగింది. ఇదే సమయం. తన సిరియాలదేవి ఆశ్చర్యపడి తన్ని మెచ్చుకోవాలి. తలుచుకున్నకొద్దీ అతనికి ఉత్సాహం ఎక్కువఅయింది. కోపం పెంచుకున్నాడు. సింహంలా ఒక్కగంతువేసి ఎదుట మాట్లాడుతూవున్న సైనికుణ్ణి ఒక్కతోపుతో కిందపడేసి వాడిమొలనున్న కత్తి లాగుకున్నాడు. ఈసంగతి మెరుములా జరిగింది. రెండవవాడు కాగడా అవతల పారేసి కత్తిదూసి ముందుకు ఉరికాడు.

తరాలనుంచి వసుబాలుడి కుటుంబంలోవున్న క్షాత్రం రాయిపెకలించుకొని వచ్చు ఒక పెద్ద నదిలా ఉమ్మకుంటూ వచ్చింది. తండ్రి మహావీరుడు. ఆతని ఖడ్గయుద్ధప్రావీణ్యము రాయలదేశంలో ప్రతివారిచేత పొగడ్త పొందింది. శత్రువులకు గుండె అవియచేస్తుంది. ఆప్రావీణ్యము వసుబాలుని ఆత్మలో వుంది; దేహంలో సమైక్యమైవుంది. నాలుగైదు పొడుపులు, అడ్డుకోతలు, ఏటులు, మెలికలు అయినవి. ఆసిపాయి డొక్కలో చేయిపెట్టి చిమ్మటగొట్టంలా వచ్చురక్తం ఆపుచేసుకుంటూ పడిపోయాడు.

ఆబాలిక ఇదంతా చూస్తూనే వుంది. వసుబాలుడి సాహసం చూసి ఆశ్చర్యపడ్డది. ఆమెకు అపరిమితసంతోషం కలిగింది. ఆమె కన్నులు నక్షత్రాల్లా మిలమిలలాడిపోయినవి. పడియున్న సిపాయి లేవకుండా ఆమె ఆతని పీకపై కాలువైచి నొక్కివుంచి, అతనినడుమునే వేలాడుతున్న కైజారు తీసి కదిలితే పొడిచివేయవలెనని ఉన్నది. కిందపడి నప్పుడు తల రాయికి తగిలి దిమ్మపడింది; అతనికి స్మృహ వచ్చి కదిలినాడు. బాలిక వెనక్కు తప్పుకున్నది. వసుబాలుడిరూపం, స్నేహితుడి అవస్థా చూసి ఆతడు వసుబాలుడికి మోకారించాడు. వసుబాలుడు పారిపొమ్మని సైగచేసాడు. ఆభటుడు ఒక్కచిటికలో ఆతెలతెలపోయే చీకట్లో డొంకలలో మాయమైపోయాడు.

వసుబాలునికి ఉత్సాహం వదిలింది; భయము కలిగి గజగజలాడిపోయినాడు. తాను ఎల్లా చంపాడు ఒకమనుష్యుణ్ణి!-తన యింట్లో మాంసభోజనాదికములు పూర్తిగా మానివేసాడే. అమ్మయ్యో, వసుబా

లుసు కూలబడి వణుకుతూ ఆఅస్పష్టసంధ్యలో లీనమైపోయేముఖం రెండు చేతులా మూసుకున్నాడు.

ఆబాలిక గబుక్కున బాకు అక్కడ పారవేసి వసుబాలుడి దగ్గరకు గంతువేసి ఆతన్ని కౌగిలించుకొని, "మీరు చూపిన ధైర్యం,పౌరుష్యము, ఆయుధకుశలత అపరిమితమైన ఆనందాన్ని కలిగించినవి. మీ కేమిభయం? మీరు శివబాలరెడ్డిసుమాల్లు గదా? ఒక్కమనుష్యుణ్ణి-విరోధిని-మనప్రాణాల్ని నిశ్చింతగా నల్లిని చంపివేసినట్లు తీసివేయదలంచుకొన్నవాడిని చంపుట ఏమిదోషము?" అని సానందాశ్రునయనాలతో ఆతనిముఖం చూసింది. వసుబాలుడికి జీవితము ధన్య మనిపించింది. ఆ వెలుగుచీకట్లో చెదిరిపోయిన ముంగురులతో కాంతులని విజ్జల్లేమోముతో సౌందర్యనిధులైన కన్నులతో తన్ను కౌగిలించుకున్న బాలికను చూచి వసుబాలుని పిరికితనం తెల్లవారి మంచులా పటాపంచలైంది. ఆత డామెను ఒడిలోనికి తీసుకుని మూర్ధ మాఘ్రాణించి, "నువ్వు నన్ను ప్రేమిస్తున్నావా?" అని చిన్నప్రశ్న వేశాడు.

"నాకు మొదట ఇష్టంలేదు; కాని మిమ్మల్ని చూచినకొద్దీ నాహృదయం సంపూర్ణంగా మీపాలయింది. ఇప్పటితో నా ఆత్మ, నాసర్వస్వము తమలో లీనమైపోయింది."

వసుబాలుడి హృదయం రాగాలుపాడింది.

"అయితే పరపురుషుణ్ణి అన్నైనాఎంచక నన్ను తాళికోటలో ..................."

"మానాయకుడు కొద్దివారాలక్రిందట మానాయనగారికి రహస్యమైన అంచె పంపించాడు. అది చూచి ఆయన గడియలకొద్దీ అదే ఆలోచించుకున్నారు. ఒకరోజున ఆయన నన్ను మారువేషం వేసుకొమన్నారు; ఆయనా వేసుకున్నారు. ఇద్దరం బయలుదేరాము. బీజపురంలో నవాబుగారి బంధుఖానాలో మీదగ్గరకు వచ్చాం. ఒకబుధవారం ఒకముసలితురకనవాబు, ఆయనకుమారుడూ రాలేదూ!"

"ఆయిద్దరు మీరా! నిజంగా!" ఆబాలికను తన హృదయానికి ఇంకా అదుము కున్నాడు.

"మేము బయటికి వెళ్లిపోయిన తరువాత మానాయనగారు నన్నుచూసి, 'అమ్మాయీ అరవిందా, ఆఅబ్బాయే నీభర్త; అది శ్రీశ్రీమన చక్రవర్తిఆజ్ఞ సుమా!' అన్నారు.

వసుబాలుడు ఆశ్చర్యంచేత అనిమిషు డయ్యాడు.

౭

తెల్లవారిపోతూన్నది: మంచు విడిపోయింది; ప్రకృతి అంతా తూర్యారావములు సలిపింది.

వసుబాలుడు అరవిందాదేవి చేయిపట్టుకొని నెమ్మదిగా కృష్ణ దాటడం ప్రారంభించాడు. కొంతదూరం పోయేటప్పటికి లోతు



అయింది. వసుబాలుడికి ఈతరాదు. మళ్లీ వెనక్కు వచ్చారు. ఒడ్డున వున్న పడిపోయిన రెండుచెట్లు కష్టపడి కృష్ణలోకి తోశారు. ఇద్దరూ పట్టుకుని నెమ్మదిగా కాళ్లుకొట్టుకుంటూ నదిలోకి, లోతుల్లోకి తేలిపోయారు.

ఆప్రవాహానికి నదిలో చాలా దిగువను గట్టు ఎక్కారు. ఎండ వచ్చింది. దంతధావనాదులు చేసుకుని రాయచూరు ఎటు వుందా అని కృష్ణానదితీరంవెంబడే నడక సాగించారు. వసుబాలుడు తలకు చుట్టుకున్న పైకండువా తడవలేదు కాబట్టి అది చీరపిడుచుకుని కట్టుకొమని అరవిందాదేవికి ఇచ్చాడు.

ఆమె పునహాపట్టుచీర పాముకుబుసంలాంటిది ఆ ఎండలో ఒక అరగంటకి ఆరిపోయింది. ఆరిపోయిన బట్టలు కట్టుకునిఇద్దరూ దారిసాగినారు.

ఆకలి! పొద్దెక్కినకొద్దీ ఆకలి ఎక్కువ అయింది.

ఆలాగే వెళుతూవుండగా నెమ్మదిగా నెమ్మదిగా ఫిరంగుల చప్పుడు వినవచ్చింది. పెద్దకల్లోలము హోరు. వీళ్లు నెమ్మదిగా ఒక గుట్ట ఎక్కారు. ఎదుట రెండుసైన్యాలు హోరాహోరిగా పోరుతున్నారు. రెండుక్రోశాలు వ్యాపించి వున్నవి ఆసైన్యాలు. బందూకులు, తోపుఖానాలు చెవులపుటాలను బద్దలుకొటుతున్నవి. అతి పారవశ్యంగా కించిత్తు భయంతో చూస్తూ నిలుచుండిపోయాడు వసు

బాలుడు. అరవింద ఆకలిచేత, బడలికచేత, ఆయాసంచేత ఒడిలిపోయిన పువ్వులా నేల వాలిపోయింది. వసుబాలుడు చూసి, 'అమ్మమ్మో' అని ఆబాలికను ఎత్తుకొని నెమ్మదిగా అడుగు దిగాడు. "ఆవల సైన్యం రాయల సైన్యం అయివుంటుంది. అక్కడకు ఎలాగైనా జేరుకుంటిమా, మా ప్రాణాలు మావి" అనుకుంటూ వసుబాలుడు ఆవైపుకు ఆ చెట్ల చాటునుంచి వెళ్లుతూవున్నాడు.

ఆతని హృదయాన్ని పసిపాపలా పడుక్కుపోయిన ఆ బాలిక



ఆతని ముగం చూసి, "ఈసమయంలో నేను బ్రతుకుతానని తోచదు. నన్నువదిలి మీరు వెళ్లిపోండి" అని అన్నది.

వసుబాలుడు భయపడి కోపంతో, "నేనా నిన్ను వదలడం? పెన్నిధి దొరికిన పేదలా వున్నాను. పాలసముద్రంలో లక్ష్మి విష్ణువుకు దొరికినట్లు నాకు దొరికినావు. నాప్రాణం అంతా నీతోనే వుంది. నువ్వులేని ఉత్తరక్షణంలో శివబాలరెడ్డి పుత్రుడులేని తండ్రి—"

ఆ బాలిక నవ్వుతూ ఆతనినోరు మూసివేసింది.

"ఆవతలిది శ్రీచక్రవర్తి సైన్యం, మనం ఎల్లాగో అక్కడికి పోవలె. నాకు ఏమీ ఓపికలేదు. కాబట్టిమీరు నన్ను దింపండి; కొంత దూరం నడవగలను. ఆలా నడవలేనప్పుడు మీరు నన్ను......ముఖ్యంగా ఈరెండువస్తువులు మీదగ్గిర వుంచండి: ఇది శ్రీచక్రవర్తి రహస్య ముద్రిక; ఇది మీరు మాకు అమరాబాదు పంపిన బేగిరావు ఉత్తరం" అని నవ్వుతూ యిచ్చింది. "ఎందుకూ ఈవుత్తరం" అని చిరునవ్వుతో వసుబాలుడు ఆవుత్తరం చూసుకున్నాడు. అచ్చంగా తన దస్తూరే.

"ఈవుత్తరం ఎందుకు దాచుకోటం?"

"ఆవుత్తరమే అతిముఖ్యమైంది. ఒకవేళ మీరు వొఖ్ఖరే మాట్లాడే స్థితిలో వుంటే అప్పాజీవారికి ఈవుత్తరం యివ్వండి."

"ఈవుత్తరం, ఈముద్రిక ఎలా దాచావు దేవీ! ఆసరదారు ఒక స్త్రీచేత తణికీచేయించాడు కదా!"

"వేగులవారిలో శ్రీచక్రవర్తి వేగులవారికి సరిపోయినవాళ్లు భరతఖండంలో లేరు. ఆరెండున్నూ నా తలముడిలో దాచుకున్నా—నే హనుమంతా వెతికిన మనిషి తలకట్టు వెతకలేదు సుమండీ!"

వసుబాలుడు ఈ నాలుగుదినాల్నుంచి కవులుకూడా ఎరగని కొత్తసంగతులు నేర్చుకోడమనే ఆశ్చర్యంలో పడివున్నాడు.

ఆరెండువస్తువులున్నూ వసుబాలుడు నడుముకు కట్టుకుని బట్టలు సర్దుకున్నాడో, లేదో విరిగిపడ్డ ఒక కొండ ప్రవాహంలా గుఱ్ఱపు సైన్యం పారిపోతూ ఆదారిని వచ్చారు. అనేకమందికి గాయాలు తగిలి వగరుస్తూ వున్నారు. వారిగుఱ్ఱాలు రక్తాలు; కారుస్తున్నవి. వారి దుస్తులు చిరిగిపోయివున్నవి. విరిగినకత్తులు ముక్కలైనవాళ్లు ప్రాణాలకోసం పరుగెత్తుకుపోతూ వచ్చారు.

వాళ్ళు వీళ్లని చూచారు. కొందరురౌతులు ఓపిక లేకపోయినా గుఱ్ఱాల్ని వీళ్లమీదకి తిప్పారు. వసుబాలుడు అరవిందాదేవిని వెనక్కు తోసి, కత్తిలాగి ఝళిపించి, జేవురించిన మొగంతో హృదయంలో ఏమూలలో లేని భయంతో నిలుచున్నాడు. గుఱ్ఱాలు సకిలిస్తువుండగా నలుగురురౌతులు నాలుగువైపులా వచ్చారు. అరవింద కూచున్నది.

ఆరోజున వసుబాలుడు దెబ్బతగిలిన సింహంలా పోరాడు; దెబ్బలుతిన్నాడు; రక్తధారలఎరుపుతో ఉదయభానుబింబం అయ్యాడు. కొనఊపిరి వున్నంతసేపు ఏటు ఏటుకు తప్పుకోడం, పోటుపు పోటు పుకు వంగడం, ఆలా యుద్ధంచేసి వేటకుక్కలముందర కొమ్ములజింకలా, పెద్దపులులమధ్య వృషభరాజంలా, తమదగ్గిరకు వాళ్లని రానీయకుండా యుద్ధంచేశాడు.

చేతిలో కత్తి యెగిరిపోయింది; నెత్తిమీద బలమైనగాయం తగిలింది. కళ్లలో మెరుములుకమ్మి గిఱ్ఱున తిరిగిపోతూ గబుక్కున చైతన్యం వదలి పడిపోయాడు.

దాచి వుంచుకున్న బాకు తీసింది; నాలుగు దెబ్బలు తిన్నది, ఒకడిగుఱ్ఱాని పొడిచివేసింది; మహాశక్తి అయిపోయింది అరవిందాదేవి. నాలుగుక్షణాలు జరిగినవి.

ఇంతలో డెక్కలచప్పుడు, సింహనాదాలు వినబడ్డవి. రాయలు గుఱ్ఱపువళంకాబోలు, విల్లునుంచివచ్చే బాణంలావచ్చింది. దానితో చెల్లాచెదరై పారిపోయారు బీజపూరు ఆరౌతులు. అందులో ఒకడు కసిగొని గుఱ్ఱంమీదనుంచే వంగి, తూలి పడపోతూవున్న అరవిందాదేవిని ఒక్క అదటున మీదకి లాక్కొని పారిపోయాడు.

ఆవచ్చినరౌతు లిది చూశారు; వాళ్లవెనక అమితవేగంగా వచ్చిన సైన్యం యావత్తూ ఉడాయించారు. కాని నాయకుడు పక్కనున్న రౌతుకి "ఇప్పుడు జరిగిన ఆఅధర్మయుద్ధంలో ఒకవ్యక్తి పడిపోయివున్నట్టున్నాడు: చచ్చినాడో బ్రతికివున్నాడో చూచిరా—కొన ఊపిరివుంటే నెమ్మదిగా నీదగ్గిరమందులు ఇచ్చి మన శిబిరానికి తీసుకుపో"

అని ఆజ్ఞయిచ్చాడు. ఆతడు వెనుతిరిగి మన వసుబాలుడు పడివున్న స్థలానికి వచ్చాడు. నాడి చూశాడు. 'ఊఁ' అని తల ఊపుకున్నాడు. మందులసంచిలోవున్న ఒక చిన్న మాత్ర తీసి పళ్లు బిగిసిపోయి వున్న వసుబాలుని నోరు బలంతో విడదీసి ఆమాత్ర వేశాడు. దానితో వసుబాలుడు ఒక్క నిమేషంలో మూలగడం ప్రారంభించాడు.

౬

వసుబాలుడికి మెలకువ వచ్చేటప్పటికి ఒకగుడారంలో వున్నాడు. మంచిపరుపులు,దిండ్లు ఒకనులకమంచంమీద పరిచివుండగా,అందుమీద పడుకొనివున్నాడు. గుబుక్కున లేవబోగా అక్కడేవున్న ఒకాయన వద్దని వెనక్కు పడుకోపెట్టాడు.

వసు—నే నెక్కడున్నాను?

అతడు—శ్రీవిద్యానగరాధీశ శ్రీశ్రీమూరురాయరగండ కృష్ణ రాయసార్వభౌముని శిబిరంలో వున్నావు.

వసుబాలుడు ఆశ్చర్యంతో మళ్లీ లేవబోయాడు. నెమ్మదిగా చిరునవ్వు నవ్వుతూ ఆవ్యక్తి వసుబాలుణ్ణి వెనక్కు పడుకోబెట్టాడు.

వసుబాలుడు—ఒకబాలిక వుండాలి!

"ఆమె క్షేమంగా వున్నదిలెండి".

వసుబాలుడికి అమ్మయ్యా అని పించింది.

అతడు—ఈరోజుకు నువ్వు కదలకూడదు. గాయాలుబలమైనవి తగిలాయి. రక్తం చాలా నష్టం అయింది. అందుకని నా ప్రార్థన.

వసు—అదంతా నాకు తెలియదండీ. నేను ఇప్పుడు తత్‌క్షణం అప్పాజీవారిదగ్గిరకు పోవాలి. నేనువారికి అతి ముఖ్యమైనటువంటి వేగు యివ్వాలి.

అతడు—రేపు యివ్వకూడదూ?

వసు—ఇప్పుడు జరిగే యుద్ధప్రాముఖ్యం మీకు తెలుసునా?

అతడు—నేను వైద్యుణ్ణయ్యా!

వసు—వైద్యులికికూడా ఎందుకు యుద్ధం చేతకాకూడదూ? కవులుఅందరూ యుద్ధం చేయవలసిందేకాదా!

అతడు—నిజం, నేను శ్రీనరసింహదేవరాయ సార్వభౌములదగ్గిర సేనానాయకత్వం చేశాను.

వసు—అమ్మయ్యా! అటయితే సరే. మీకు నమస్కారము. నాకు ఇప్పుడు బలం వచ్చేమందు ఇవ్వండి. నేను అప్పాజీవారి శిబిరానికి పోతా!

ఫిరంగులమోత వినబడుతూనే వుంది.

ఆవ్యక్తి మారుమాట్లాడకుండా తన మందులపెట్టెలోంచి ఒక బుడ్డి తీశాడు.

"ఇందులో ఒకమందు వుంది: ఒక చుక్క అమృతం; రెండు చుక్కలు విషం. ఈచుక్కతాగిన పదునాల్గు గడియలదాకా మనిషి యుద్ధం చేయగలడు; ఏనుగును ఎత్తగలడు. తర్వాత నాలుగు రోజులు లంకణాలు చేయవలసివస్తుంది."

వసుబాలుడు సరే అన్నాడు. ఆచుక్క తాగినాడు. ఆలని దేహంలో ఒకశక్తిప్రవాహం అతివేగంతో ప్రవేశించి కొండ పిండి కొట్టగలనన్న బలం వచ్చినట్లయింది. లేచాడు. ఆవైద్యుడు పైనవున్న సేవకునికి ఆజ్ఞయివ్వగానే ఆతడు గుఱ్ఱం ఒకటి తీసుకువచ్చి నిలుచున్నాడు. వసుబాలుడు ఆగుఱ్ఱం ఎక్కాడు. ఇంకోరౌతు సిద్ధంగా వున్నాడు. ఆతడు ముందు, వసుబాలుడు వెనకగా మహాపట్టణంలావున్న శిబిరంలో ఆగుడారాల వీథుల్లోనుంచి వెళ్లి వెళ్లి, అనేకమంది రౌతులు; బలమైనపదాతులు కావలికాస్తూ,పట్టుజల్తారిముత్యాలతో అలంకరించి కుబేరమందిరంలా వున్న గుడారందగ్గిరకు వెళ్లారు. ఆపక్కనే ఆడంబర రహితంగా సౌభాగ్యము చూపిస్తూవున్న గుడారందగ్గిరకు వెళ్లారు.

దారిలో వసుబాలుణ్ణి అనేకమంది రౌతులు ఆపినారు; కాని ముందుపోయే ఆశ్వికుడు ఏదోజవాబుగాచెప్పగా పోనిస్తూవుండేవారు.

పైగుడారందగ్గిరకు వెళ్లి గుఱ్ఱాలు దిగారు. అక్కడవున్న ద్వారపాలకుడు లోపలికి పోయేందుకు గురుతు ఇవ్వమన్నాడు. వసుబాలుడు ఒకముఖ్యకార్యముమీద శ్రీసార్వభౌముని సేవకుడు వచ్చాడని చెప్పమన్నాడు. ద్వారపాలకుడు పనికిరాదన్నాడు. వసుబాలుడికి కోపం వచ్చింది. "చాలాముఖ్యవిషయం: అందుమీద అంతా ఆధారపడి వుందయ్యా!" ద్వారపాలకుడు లాభంలేదని తలవూపినాడు.

వసుబాలుడు గుఱ్ఱంయెక్కి బయలుదేరినప్పటి నుంచి తాను మహమ్మదీయులతో పోరినవిధం, తనకు స్పృహతప్పినవిషయం అంతా జ్ఞాపకం వచ్చింది. తనకు శ్రీదేవి అరవిందాదేవి ఏమయి పోయినది? సురక్షితంగా వుందంటే! ఎక్కడ వున్నది? ఆవైద్యుణ్ణి ఇంకా తప్పేళ్లు అడగవలసిందే! కాని ఆదేవి ఆజ్ఞ శిరసావహించేగా, తాను యీవేగు శ్రీఅప్పాజీవారికి తెలియజేయడానికి వచ్చింది. ఆ, జ్ఞాపకం వచ్చింది. ఆబేగిరావు ఉత్తరంతోపాటు ఆమె శ్రీసార్వభౌముని రహస్యముద్రిక యిచ్చింది. అది పనికిరాదా!

"ఓద్వారపాలకుడా! ఈగుర్తుచూసి నీయిష్టం వచ్చినట్లు చేయి" అని వసుబాలుడు తన దేహాన భద్రపరుచుకొన్న ఆముద్రిక చూపించాడు. ఆద్వారపాలకుడు వంగి నమస్కారముచేసి, తత్‌క్షణమే లోపలికి పోయి వచ్చి,"శ్రీఅప్పాజీప్రభువు మీరాకకోసం చూస్తూవున్నారు" అని అన్నాడు:

వసుబాలుడు లోనికి పోయాడు. విజయనగరసామ్రాజ్యం దేదీప్యమానంగా మట్టమధ్యాహ్నసూర్యుడులా వెలిగేటట్టుచేసిన శ్రీసాళువ



తిమ్మరుసు మహామంత్రులవారు పరుపులపై అధివసించి, ఏవో పత్రాలు తిరగవేస్తున్నారు.

వసుబాలుడు ఆవృద్ధునకు వీరనమస్కారముచేసి నుంచున్నాడు. తిమ్మరుసు "నువ్వు ఏవేగువాడవయ్యా! నీముఖం మాకు పరిచయంగా వుండే."

"ప్రభూ, నేను వేగుసైన్యంలో లేను. ఈవుత్తరం తమకి అందజేయవలసిందిగా ఒకబాలిక- అరవిందాదేవి, ప్రతాపనాయులవారి కుమార్తె- ఇచ్చింది." అని ఆవుత్తరం యిచ్చాడు.

తిమ్మరుసు అతి ఆనందంతో ద్వారపాలుకుణ్ణి పిలిచి, "శ్రీ తిమ్మన నాయకులవారిని, శ్రీ వేగేశిన అనంతమల్లవర మహారాజులుంగారిని సార్వభౌముని గుడారానికి రావలసిందిగా చెప్పు" అని ఆజ్ఞ యివ్వగానే ఆ ద్వారపాలకుకు పైనవున్న ఒక చమూపతికి ఆ ఆజ్ఞ అందిచ్చాడు. అప్పాజీ లేచి వసుబాలరెడ్డిని దగ్గఱగా తీసి, "అబ్బాయీ! నీవిషయం చూస్తే నువ్వు అపరిమితమైన కష్టాలకు ఓర్చి ఈప్రాణప్రదమైన లేఖ పట్టుకువచ్చినట్లు మాకు స్పష్టమౌతూంది. శ్రీసార్వభౌముల కడ నీచరిత్ర చెప్పుదువుగాని రా!" అని ఆతన్ని వెంటపెట్టుకొని, తన గుడారం దాటి సార్వభౌముని గుడారంవైపు నడవడం మొదలుపెట్టినాడు. దారిలో సైనికులు, చమూపతులు, దళవాయులు అంతా వీరనమస్కారములు చేస్తూనే వున్నారు. అప్పాజీగారిని చూడగానే సార్వభౌముని గుడారపు ద్వారపాలకులు, చక్రరక్షకులు, రక్షకవీరులు, అంతా నమస్కారాలతో దారి యిచ్చారు. ఒక పారిపార్శ్వకుడు పరుగెత్తికొనిపోయి, సార్వభౌమునికడ మోకరించి, శ్రీ ఆప్పాజీవారు వస్తున్నారని మనవి చేసుకున్నాడు. సార్వభౌముడు చిరునవ్వుతో లేచి స్వాగత మిచ్చారు. మన వసుబాలుడు సార్వభౌముని ఎదుట మోకరించినాడు. సార్వభౌముడు అప్పాజీవంక చూచి, తలపంకించి, ఇది ఎవరు అని సంజ్ఞగా ప్రశ్నించినాడు.

"ప్రభూ! ఇతడు అతి ముఖ్యమైన వేగు పట్టుకొని వచ్చినాడు. తిమ్మన్ననాయకులకు, అనంతమల్లవర మహారాజులకు కబురు పంపించినాను."

సార్వభౌముడు ఆపరుపుల సింహాసనంమీద కూచున్నాడు. వసుబాలుణ్ణి ఎదుటవున్న పరుపులమీద కూచోమని శ్రీఅప్పాజీ సంజ్ఞ చేశాడు. ఇంతలోతిమ్మన్న నాయకులు,అనంతమల్లవరప్రభువూవచ్చారు. వారు వీరనమస్కారాలు చేసి తమ ఆసనాలమీద సార్వభౌముని కనుసన్నతో అధివసించారు.

అప్పాజీ అరవిందాదేవి వుత్తరం తిమ్మన్ననాయకులకు యిచ్చినాడు. ఆవుత్తరంచూసితిమ్మన్ననాయకులు"ఇదిఏమి"అనిప్రశ్నించాడు.

తిమ్మరుసు-"అరవిందాదేవి వుత్తరం."

"ఆఁ! వచ్చినదా! వచ్చిందా! ఇక రాయచూరు రెండునిముషాల్లో పట్టుపడింది! ఏది! ఎవరది- నీళ్ల డేగిసా చిన్నది పట్టుకురా" అని సంతోషంతో తొందరపడ్డాడు. డేగిసా రాగానే తన దగ్గిరవున్న సంచిలోని పొట్లంలోవున్న పొడి కొంత అందులో చల్లి నీళ్ళు కలపమని ఆజ్ఞయిచ్చి ఆవుత్తరం అందులో వేశాడు. పైన వసుబాలుడు సిరియాలదేవిని పంపమని మామగారికి రాసినదన్న వుత్తరం అక్షరాలు మటుమాయమైపోయాయి. ఆవుత్తరం నీళ్ళలోంచి తీసి, అద్ది, హారతికర్పూరపు వుండ ఒకటి తీసి వెలిగించి ఆసెగలో ఈవుత్తరం పట్టుకున్నాడు. మంత్రంలా ఆపెద్దపత్రంమీద గీతలు, అక్షరాలు చీమలబారులాంటివి కొత్తవివచ్చి ప్రత్యక్ష మయినవి.

సార్వభౌముడు, తిమ్మరుసు, తిమ్మన్న, మహారాజు అందరూ ఆవుత్తరం మధ్య పెట్టుకొని, "ఇదిగో,ఇక్కడ అగడ్తలోతు తక్కువ.

ఇక్కడ గోడ లోటు. ఇక్కడ కాపలా ఎక్కువ వుంచలేదు. ఇక్కడ సైన్యాలు అపరిమితం. ఇక్కడ ఫిరంగులు మంచివి కావు." అని అన్నీ చూసుకుంటూ దీక్షగా ఒకగడియ ఏదేకధ్యానంలో వున్నారు.

అయినది. సార్వభౌముడు చిరునవ్వునవ్వుతూ వసుబాలుణ్ణి దగ్గరకురమ్మన్నారు. వసుబాలుడు దగ్గిరకువెళ్లి ఆసనందాపుననిలబడ్డాడు.

"నీచరిత్ర చెప్పు."

వసుబాలుడు చక్రవర్తి ఆజ్ఞ కాగానే ఆజలతారు సుడారం, ఆ మణిదీపం బుడ్ల మిరుమిట్లు, పట్టుపరుపులు, కాశ్మీరరత్నకంబళ్లు, పట్టు కలంకారీతెరలు, ముత్యాలజాలర్లు- అన్నీ మరచిపోయాడు. కవి భావోన్మాది; ప్రేమపూర్ణైకజీవి. ఆనందాత్ముడు అయిపోయి మొదట నుంచి పూసగుచ్చినాడు; చరిత్ర ఏకరువుపెట్టినాడు.

ఆతనికథలో అందరూ తన్మయత్వం బొందినారు. సార్వభౌముని ముదము, అప్పాజీగారిసంతోషము కన్న తమ్మన్ననాయకులు పొందిన ఆనందము అపరిమితము; ఒకపారిపార్శ్వకునితో చెవులో రహస్యం చెప్పి పంపించాడు.

"ఏమిటే, నువ్వు శివబాలరెడ్డి నాయకుల కుమారుడవా?" అని సార్వభౌములు ఆశ్చర్యం వెలిపుచ్చినారు.

"పెద్దన్నగారి శిష్యుడవా!" అని తిమ్మరుసు తల పంకించాడు.

"పారశీకం నేర్చుకునేందుకా బీజపురంవెళ్తా" అని మల్లవర ప్రభువు చిత్రం అయిపోయాడు.

తమ్మన్న నాయకులు మాట్లాడనేలేదు.

వసుబాలునికథ పూర్తిఅయింది. ఆతడు చక్రవర్తి ఎదుట మోకారించి, "మహారాజాధిరాజా! నేను ఆబాలికను........ ఆమె ఇప్పుడు ఎక్కడవున్నది? ఆమెకుఆపద లేదుగదా? ఆమెచరిత్ర ఏమిటి? నాకు తెలియజేయ ప్రార్థించుచున్నాను" అన్నాడు.

సార్వభౌముడు చిరునవ్వుతో వసుబాలుణ్ణి దగ్గిరకు రమ్మని, తన మెళ్లోఉన్న దివ్యమణిహారం ఒకటితీసి ఆతనిమెళ్లోవేసి, తల నిమిరి— "కవివినీ, వీరుడవున్నూ అయి నీచక్రవర్తికి సహాయం చేసుకో!-అని పెద్దనామాత్యులకి కబురు పంపవలసింద" అని అన్నారు.

ఒకద్వారపాలకుడు వేగంగా పోయినాడు. వసుబాలుడు భూలోకంలో లేడు. ఇదివరకు చక్రవర్తిని దూరంగా చూడడమే; ఆయనతో మాట్లాడలేదు. ఆయన తలనిమిరినప్పుడు శ్రీఆదివిష్ణువు ఆశీర్వదించినట్లయింది. జన్మసాఫల్యంఅయిందిఅనుకున్నాడు వసుబాలుడు.

ఇంతలో ఒకపక్కనుంచి పెద్దనామాత్యులు, ఒకపక్క నుంచి శివబాలరెడ్డినాయకులు చక్కావచ్చి సార్వభౌమునికి నమస్కారములు చేసి ఆసనాలు అధివసించారు.

వసుబాలుడు ససంభ్రమంగా లేచి గురువుగారికి మోకారించి నమస్కరించాడు. ఆయన లేవదీసి, "ఏమి చిక్కావు, గట్టితనం దాల్చావు; ఈగాయాలు, ఈకట్లు ఏమిటిది!" అనిఅన్నారు.

వసుబాలుడు తండ్రికి మోకారించినాడు. ఆతడు కుమారుని ఎత్తి మూర్ధమాఘ్రాణించా. డుకళ్ళనీళ్ళు తిరుగుతూవుండగా, గొంతుకలో డగ్గుత్తిక పడుతూవుండగా, కుమారుణ్ణి గట్టిగా కౌగిలించుకున్నాడు. అక్కడవున్న అందరకు కళ్లల్లో నీళ్ళు తిరిగినవి.

అప్పాజీ "శివబాలరెడ్డివర్యా! నీకుమారుడు తన సార్వభౌమునికి, శ్రీవిజయనగర సామ్రాజ్యానికి తీరరాని ఉపకారం చేసినాడు. శ్రీసార్వభౌములు అతనికి సూరాపాలెం జాగీరు దయచేయుచున్నారు." అని అప్పుడే చక్రవర్తి స్వహస్తనామాంకితమైన ముద్ర వేయగానే ఆపత్రము పుచ్చుకొని వసుబాలుడికి యిచ్చినారు.

ఇంతలో ప్రతాపనాయులు ఒక బాలికను మేలిముసుగుతో కొనివచ్చినారు. అందరూ ప్రతాపనాయకుణ్ణి బహూకరించారు.

వసుబాలుడి గుండెలు కొట్టుకున్నవి. ఆతనికి దివ్యగీతానాదములు వినిపించినవి. వేయూరు అపరిమిత సుగంధములు వీచినట్లయినవి.

అప్పాజీ- ప్రతాపనాయకా! నువ్వు నీసార్వభౌములకు చేసే సేవ అపరిమితము. నీకుమార్తె ఎవ్వరికిన్నీ సాధ్యముగాని రహస్యభేదనాలు నీసహాయంతో చేసి అత్యుత్కృష్టమైన సేవ చేసింది. ఆమెకు శ్రీసార్వభౌములు సూరాపాలెం జాగీరు పక్కవున్న వీరాపాలెం జాగీరు దయచేస్తూవున్నారు. ఆరెండు జాగీర్లు కృష్ణాతుంగభద్రల్లా ఉండుగాత!

సార్వభౌములు, మల్లవరప్రభువు, తమ్మన్ననాయకులు "తథాస్తు" అని అన్నారు.

అప్పాజీ సార్వభౌమునివంక చూసి అన్నాడు- "దేవా! ఈతమ్మన్ననాయకులే ఈనాటకానికి సూత్రధారులు. ఈలా వస్తుందని అనుకోలేదు. ఈఅమ్మాయి అందం లోకప్రసిద్ధం. అమ్మాయిని వసుబాలుడికి యివ్వడానికి తనకుడిచెయ్యి అయిన ప్రతాపనాయని కోర్కెతో ఆబాల ఏదో కష్టంలో, దొంగలు కొట్టునట్లుగా ఏర్పాటు చేసి, వసుబాలుడు చూసేటట్లుగా చేసి ఆతడు ఆమెను రక్షించేటట్లు చేయాలిసిందిగా ఆజ్ఞ పంపించాడు. శివబాలుని 'కుమారునకు ప్రతాపునికుమార్తెను యిచ్చునట్లు శ్రీదేవర ఆజ్ఞ ఇదివరకే పుచ్చుకొన్నాను కదా! అది నేను పంపినాను. కాని అసలు జరిగినకథ వేరు. విరూపాక్షుడే వసుబాలుడికథ తాను నడిపాడు."

౧౦

వసుబాలుడు ప్రతాపుని శిబిరానికి పోయాడు. అంతఃపురండేరాలు ప్రతినాయకుని డేరాకు వెనకగా వుంటాయి. అంతఃపురస్త్రీలు కనబడరు! అయితే అదృష్టం, ప్రతాపనాయకులు లేరు. ఇంతలో డేరాకు ఒకద్వారానికి వున్న తెర ఒత్తిగింపబడింది. ఒకవ్యక్తి మెరుములా, సుగంధప్రవాహం సుడిగాలిలా, వేయి ఆనందాల సుడిగుండంలా వచ్చి వసుబాలుడి ఒళ్లో పడింది. వసుబాలుడు మైమరచాడు. వెనకయీలాగే వచ్చిందికా! వాళ్ళిద్దరూన్నూ ఆతన్మయంలో ఒకరిగాయాలు ఒకరు చూసుకుంటూ ఒక్కటే ఆశ్లేషంలో తమతరువాయి కథారహస్యం చెప్పుకుంటూ వుండిపోయారు.



బృందావనవిహారము

[జయపుర చిత్రము: దివాన్ బహదూర్ చతుర్భుజదాసు గోవిందదాసుగారి యనుమతిని]

# తుమ్మెద పెండ్లికొడుకు

జి. జాషువగారు

కొండల నందు గుంజిగురుఁగొమ్మలుమేసి మదించు భద్రవే
దండకపోలదానజల ధారలఁ దానము లాడఁబోయి యు
ద్దండకఠోరకర్ణములు దాఁకిన మూర్ఛిలితో? మతేల రా
కుండెద? నీవిలంబనము నోర్చునె తేఁటిపడంతి పట్పదా?

కోరిక పల్లవింప నదిగో సుదతీమణులెల్ల నీముఖాం
భోరుహదర్శనార్థమయి పుప్పొడిపుట్టములన్ ధరించి కా
సారనికేతనాంగణవిశాలతలంబుల విశ్రమించి యు
న్నా రిఁక రాకయున్న దహనంబునఁ గ్రుంకెదరోయి పట్పదా!

కాకులు కూసినంతన మొకామొకి నిద్దురనుండి లేచి మా
ధ్వీకము దొంగిలింపఁ బరువెత్తితి వబ్జహితుండు క్రుంకునం
దాఁక సుధాధనాపహరణం బొనరించెద వేలనోయి?నా
ళీకవనంబు కన్నుముకుళించిన నీగతి యేమి పట్పదా?

తమ్ములచుట్ట మస్తగిరి దాఁగె; మృగాంకుఁడు తూర్పుకొండనె
త్తమ్ముల కెక్కి చిక్కని సుధారసభుక్తి చకోరబంధు బృం
దమ్ముల కిచ్చె నింతనఱదాఁక గృహంబుఁ దలంప వేల? నీ
తుమ్మెదపెండ్లికూఁతుల నెదుర్కొన రాఁగదవోయి పట్పదా!

పూవులు దాఁచుకొన్న మధువుం దనివారఁగఁ గ్రోలియింటికిన్
దేవలెనన్న యాస నలుదిక్కులకెక్కెడు నీచరిత్రయం
దేవ జనించి పద్మవనమెల్ల మొగంబు మరల్చె నింత తృ
ష్ణావిలబుద్ధి తమ్మిచె[illegible] కంపకపోవదు నిన్ను పట్పదా!

మొన్న వివాహమాడితివి ముద్దుపడంతుల పెండ్లిమైన యం
త న్నవమల్లికామధునదంబులఁ జొచ్చితి వెంతకాల మీ
క్రొన్ననతీవె జొంపములఁ గూఁతలు వెట్టెద వింకనైన రా
కున్న జగంబు మెచ్చదనియుం దలపోయ వదేలపట్పదా?

బంగరుపూవుటిండ్ల తలవాకిలిఁ ద్రొక్కని బిచ్చగాని ని
న్నుం గని నవ్వుచుండు సుమనోనిచయంబిది యేటివింత నీ
యంగనకంఠమం దలరదా యలనాఁటి సువర్ణసూత్ర మో
భృంగకుమారకా! కుదువఁ బెట్టవుగా మధుమద్యపాయివై?

# నీలాంబరి

రాయసం వెంకటశివుఁడు గారు, యం. ఏ., యల్. టి.

౧

చెన్నపురిమహాసభలు దర్శించి, సామ్మిచ్చి శోకము తెచ్చుకొనినట్లు మనస్తాపమున గ్రుగ్గుచు, సాయంసమయమున కీల్పాకుతోఁటలోఁ గూర్చుంటిని. అచటి పెద్దచెట్లపై పిల్లవాయువులు ప్రసరించుట వలన మెల్లని సంగీత మారంభమయ్యెను. మెత్తని పానుపువంటి పచ్చిక మీఁదఁ బండుకొని, నిర్మలిన మగు నంబరతలము నుపలక్షించుచు ఈమూఁడునాళ్ల నుండి నన్ను విడనాడిన మనశ్శాంతిని మెల్లమెల్లగఁ జేపట్టుకొనుచుంటిని. మనస్సును గలంచెడివి చిన్నచిక్కులే యైనను ఒక్కపెట్టున వాని నుండి విముక్తిఁ గాంచుట దుస్తరము. మరల మరల నా మనస్సు తాత్కాలికకష్టములు తలపోయుచు వనటఁ జెందుచుండెను. దేశీయసభా ప్రతినిధులకు విడుదులలోఁ గలుగని సదుపాయముల వైపునకును, సంస్కరణసభలో నాంధ్రజనులు గాంచని ప్రాముఖ్యము కొఱకును, పార్కు వేడుకలలోఁ జూపఱకు లభింపని వినోదముల దెసకును నామనస్సు మరలమరలఁ దిరుగుచుండెను. అంత దూరమున వచ్చెడి యొకపురుషుని యాకారము గానఁబడెను. ఈయన నాకుఁ బరిచితుఁడే; నా పూర్వపు గురువులలో నొకరు. సజ్జనుఁడయ్యును, ప్రాఁతవడిన యూహల నంటిపెట్టుకొనియుండు నీమహనీయునినుండి ముఖము తొలఁగింపఁ దలఁచుకొంటిని! స్వర్గము చేరినను 'వడేకులు' తప్పవే! ప్రాఁతమనుష్యులు, ప్రాఁత భావములు, ప్రాఁత పద్ధతులు—వీనిని మొదలంట నాహృదయమునుండి పెరికి వేయఁ దలంచితిని. యౌవన నూత్న భావములతో నుప్పొంగు నా మనసున కీప్రాఁతవానితోఁ బనియేమి? యువకులు, క్రొత్తత్రోవలు, నూతనపరిస్థితులు వీనిలోనే భారతదేశమోక్ష మిమిడియున్నదని తలంచి, తలవంచి యామనుజుని బారినుండి తప్పించుకొనఁ జూచుచుంటిని.

ఆయన యంతమాత్రమున నూరకపోక, "ఎవరక్కడ? పురుషోత్తమూ!" అని కేకవైచెను. "ఇదేమిరా, ఈసంధ్యవేళ నీయనకంటఁ బడితిని!" అని సణుగుకొనుచు విధిలేక నేలఁబరచిన యుత్తరీయము నెత్తిపజుట్టి, లేచిపోయి యాయనను గలసికొంటిని. ఉభయకుశలోపరి, గురువు తనదారిని దాను సాగిపోయి, అమితవాంఛనీయ మగు స్వేచ్ఛకు శిష్యుని వదలివేయునని కాంక్షించితిని! కాని యటు జరుగలేదు. చీఁకటి పడుచుండుతఱి చెట్లనీడ నిలువ రాదనియు, నామనస్సును గలంచెడివి నిజమైన కష్టములు గావనియు నన్నాయన హెచ్చరించి తనతోఁ దీసికొనిపోయెను. యౌవనముపై వార్ధక్యము చెల్లించెడి యిట్టి నిరంకుశాధికారమునకు నేనెంత లోలోనఁ గనలినను, చేయున దేమియులేక, ఆయనవెంట నడుగు లిడితిని. మహాసభా ప్రతినిధులకు మద్రాసువారి యాతిథ్యము ఒప్పిదముగ నున్నదనియును, సంఘసంస్కరణ సభాకార్యక్రమభారము మనయఱవసోదర సోదరీమణులే యీతూరి వహించుట ఎంతో శుభావహమనియును మాగురువులు నాకు నచ్చఁజెప్పిరి. మనస్సునఁ గొంతకలఁకఁ దేఱి నేనంత వారితోఁ గలసిపోతిని.

"అయ్యా! రాత్రిసమయమైనది. బసకుఁగాక మనమిపు డెచటికి బోవుచున్నాము?" అని నే నడిగితిని.

"పురుషోత్తమూ! నీకుఁ జెప్ప మఱచితిని- చెన్నపురి వచ్చినపుడెల్ల, నాపూర్వ పరిచితులఁ జూచికాని మరలిపోను. రేపే నే పయన మేర్పఱచుకొన్నాను గాన కొందఱుమిత్రులఁ జూచి పోవలెనని యిటు వచ్చుచున్నాను" అని నాగురువర్యులు చెప్పి, ఒకచెట్టున కెదురుగనున్న యింటిసంఖ్య తెలిసికొనిరమ్మని నన్నంపిరి.

తెలిసికొనివచ్చి చెప్పితిని. ఆగుమ్మమునొద్ద కాయన పోయి, "నీలాంబరమ్మ యున్నారా!" అని తలుపుతట్టెను.

పరిచారిక తలుపుతీసి, "అయ్యా, స్త్రీలసభకుఁ బోయినారు. వచ్చుసమయమైనది. మీరు లోపలఁగూర్చుండుఁడు" అని యాహ్వానించెను. అంత మేమిరువురము లోనికిఁ బోయి కూర్చుంటిమి.

"పురుషోత్తమా! మనము సందర్శింపఁబోవు స్త్రీ చరిత్రము విచిత్రమైనది. ఆమె వచ్చులోన నీకాకథ వినిపించెదను" అనినలికి నాయనయిట్లు ప్రారంభించెను.

౨

"నలువదియొక్క సంవత్సరములకుఁ బూర్వము క్రిస్మసుపండుగలలో నొకానొకసంవత్సరము వేడుకలు జరుపుటకై పీపిల్సుపార్కులో నెన్నియో పెద్దకుటీరములు వేయఁబడెను. ఇపుడు నీ కెంతో చప్పగాఁ గానవచ్చిన పార్కు వేడుకలలో నాలుగవవంతువానికే ఆనాఁటివారు చెవి కోసికొని యుందురు. అప్పటి స్వల్ప వినోదములకే యాకాలపు ప్రజలు ఆనందమున మిన్ను ముట్టుచుండిరి. అనుదినమును వేలకొలఁదిజనులు వినోదములు దర్శించుట కాయుద్యానవనమున కేతెంచుచుండిరి. ఒక కుటీరమున నాటకము, రెండవదానిలో గారడి, మూఁడవదానియందు విచిత్రవస్తుప్రదర్శనమును జరుగుచుండును. ఇటు లేకకాలమున నెన్నివినోదములో జనుల చిత్తాకర్షణము చేయుచుండెను.

"ఒకసాయంకాలము, ఒక కుటీరమునిండ జనులు మూఁగియుండి, గారడి-చోద్యములు చూచుచుండిరి. అపుడు ప్రమాదవశమునదడి నిప్పంటుకొని, పాకపై కెగఁబ్రాకెను. జనులదృష్టి యాటలయందే యుండుటచేత, మంట నడికప్పున కెగయువఱకును పెక్కండ్ర కా యుపద్రవము దృగ్గోచరము గాకుండెను. చూచినకొందఱు ఒకమాఱుగ లేచి, 'పాకకు నిప్పంటుకొనినది!' అని గట్టిగ నఱచి, ద్వారమువైపునకుఁ బరుగులిడిరి. మంటలు కనులఁ బడకుండియును, మాటలు వినఁబడకుండియును, వీరిని జూచి నలుదిశలనుండినవా రొక్కుమ్మడిగ లేచి, ఏదో యుపద్రవము సంభవించినదని మాత్రము గ్రహించి, కేకలు వేయుచు ద్వారముదిశ ముఖమైరి. పార్కులో వేసిన యానాఁటిపాకల కన్నిటికి నొక్కొకద్వారమే యేర్పడియుండెను. ఆ యిరుకుదారిని వందలకొలఁది మనుజు లొకసారి గఁబోవుట కలవిగాక జను లొకరినొకరు త్రోసికొనుచు, బైటపడుట కనేకప్రయత్నములు చేసిరి. ప్రాణభయము చేత పలువురు ఇటునటుఁ బోవ ప్రయత్నింపఁ, స్తంభముల తాఁకుడుచేత గాయపడి, నేలఁ బడిపోయిరి. ఈలోపుగ మంట లెగఁబ్రాఁకి, పాకనలుదిశల వ్యాపించెను. కాలుచుండిన కొయ్యలు పడి, దారితెలియక చెరలాడు లోని జనులు కొందఱు ఒడలు కాలి, అగ్నిహోత్రుని కాహుతియైరి. పలువురు కొనయూపిరితో నుండి, చెప్పనలవికాని వేదన కగ్గమై కొట్టుకొనుచుండిరి.

చేరువనేయుండిన తక్కిన పాకలలోనివారి కగ్నివలన వెంటనే ప్రమాదము లేకుండినను, లోన మూఁగిన జనులు చెప్పనలవిగాని యలజడిపాలైరి. ప్రజలసంక్షోభమునకు మితిలేదు. అజ్ఞాన మెన్నియనర్థములకో మూలకందమని జను లనుకొందురు. దుర్జ్ఞానమన్ననో, విపత్తునకు పర్యాయపదమనియె చెప్పవచ్చును! ఏదో చేరువనున్న పాకకు నిప్పు తగిలెననియు, పార్కుప్రాంతమందలి బోనుల నుండిన పెద్దపులులు తప్పించుకొని పాకలలోఁ జొచ్చెననియును ప్రజలు విపరీతముగ వేర్వేరువిధములఁ జెప్పుకొనిరి. 'నిప్పు', 'పులి' యను నసంపూర్తిమాటలు చెవిఁ జొచ్చిన జనసమూహము ఒక్కపెట్టున పాకలలోనుండి బైటపోవుటకుఁ బ్రయత్నించుచుండిరి. పాక కొక్కొక మార్గమె యుండుటచేత, జను లొకరినొకరు త్రోసికొనుచు, ఒకరితోనొకరు పోరుచుండిరి. శరీరసత్త్వము లేనివారు, పిన్నలు, స్త్రీలు, వృద్ధులును జనులయొరపిడికి క్రుంగుచును, కాళ్లక్రింద నలుగుచును, దెబ్బలుతినుచును, చెప్పనలవిగాని బాధలపాలైరి. ఆమూఁకకు నిజముచెప్పి, ధైర్యమార్గముసూచించి, అదుపులో నుంపఁగలవా రచ్చటఁగాన రాకుండిరి. కావున మృత్యుదేవత ఆసాయంసమయమున, ఆవినోదరంగమున, తన వేయినోళ్లను తెఱచి,

లీలాలాస్యము చేయుచు, జనసమూహమును దనయిచ్చ వచ్చినచొప్పునఁ గబళించుచుండెను.

3

"బాల్యదశనుండిన నే నాకాలమున చెన్నపురిలో విద్యార్థిగ నుండి, వినోదములుచూచుట కానాఁడు పార్కునకు వెళ్లియుంటిని. ఉపద్రవముసంగతి వినులఁ బడఁగనే నేనుండు కుటీరమున జనసమూహము తుపానుసమయమున సముద్రతరంగములవలె లేచి, పిచ్చివారివలె కేకలు వైచుచు, ప్రాణసంరక్షణార్థమై ద్వారముకడకుఁ బరువు లిడసాగిరి. జను లచ్చట మఱింత క్రిక్కిరిసి యుండుటచేత, కాలుసాగుటకే వలనుపడకుండెను. అందుచేత, ప్రజాసంక్షోభము మేరమీఱి యుండెను. పైఁబడు మంటలవలని యుపద్రవము మాకుటీరమున లేకున్నను, ఎవరిప్రాణములు దక్కించుకొనుటకు వారుచేయు ప్రయత్నములే యందఱికిని ఉపద్రవము తెచ్చిపెట్టుచుండెను. దారికొఱకు పెనఁగులాడుచును, త్రోసికొనుచును, తిట్టుచును, శోకించుచును, అచటి మనుజులు తమమానవత్వమును మఱచిపోయి, మృగప్రాయులుగ సంచరింపసాగిరి. ఒక్కింత యోపికగలిగి మెల్లమెల్లగ నడచినచో నందఱును భద్రముగ, సులభముగ ద్వారము చేరియుందురు. కాని ప్రాణములమీఁది మమకారమున ఒకరికాళ్లొకరికి బంధములుగను, ఒకరిచేతు లొకరికి ఉరిద్రాళ్లుగను బరిణమించెను. నే నపుడు పైకిఁ జూచి, 'ఆహా! నిర్హేతుకముగ నెట్టిఘోర మృత్యువు పాలు కావలసివచ్చినది దైవమా!' అని నిట్టూర్పువిడిచితిని.

"ఈసంక్షోభము వలన ఆకుటీరమున నొకరిమొగ మొకరికిఁ గానఁబడుటలేదు; ఒకరిమా టొకరికి నచ్చుచుండుటలేదు. ఐన నట్టి కోలాహలమునందు, 'తొందర పడవద్దు!' అనుమాటలు పలుకు బొంగుగొంతొకటి యపుడపుడు వినవచ్చుచుండెను. ఇదిమొదట నెవరును లెక్కచేయలేదు. కాని యిట్లు హెచ్చరించుచుండు మనుష్యుఁడు కొన్నినిముసములలో ద్వారపుస్తంభమున కెగఁబ్రాఁకి, అచట దడిని తనచేతి బెత్తముతో మోఁదుచు, 'సోదరులారా! వేగిరపడకండి! మెల్లగ నడచిపొండి—మీకు వచ్చిన యుపద్రవ మేమీలేదు!' అని బిగ్గఱగ నఱచుచు, బెత్తమును కదలించుచు, జనుల తీవ్రగమనము నరికట్టుచుండెను. ఈతఁ డెవరాయని నే నట్టె పైకిఁ జూడఁగా బుగ్గమీసములతో శోభించు పెద్దపులిమోమువంటి లావు మొగముగల మిల్లరుదొర యాకృతికానవచ్చెను. మిల్లరు దొర హెచ్చరింపుమాటలవలన జనుల యాతురతయు, ఆర్పులును క్రమక్రమముగ శమించెను. ఇపు డచటినుండి ప్రజలు నెమ్మదిగ నడచిపోఁజొచ్చిరి. నడువలేని బాలకులను తనమూఁపున నిడుకొని మిల్లరు బైటికిఁ గొనిపోయి విడిచివచ్చుచుండెను. ధైర్యవిహీన లగు నబలల కామహానీయుఁడు తన చేతికఱ్ఱను చేయూఁతగ నిచ్చి రక్షణస్థానముఁ జేర్చుచుండెను.

"బైటపడి బ్రతికితి నిఁక దేవుఁడా యని నిట్టూర్పు విడుచుచు నేను దూరమునఁ దగులఁబడుచున్న పాకవైపునకుఁ బరుగులిడుచున్న గుంపును జేరితిని. అచటనే మొట్టమొదట నిప్పుపుట్టినదని ప్రజలు దానిని జూపించుచుండిరి. ఆకుటీరమునుండి తప్పించుకొనఁగలిగిన జను లిదివఱకే బైటికి వచ్చివైచిరి. ఇఁక నెందఱో లోపల చిక్కుపడి యుండిరనియు, కొందఱి దేహములు తగులఁబడుచున్నవనియును, కొందఱు కాలుసేతులు విఱిగి పడిపోయిరనియు జనులు చెప్పుకొనుచు, కుటీరద్వారముఁ జేరిచూడవలెనని త్రోసికొనిపోవుచుండిరి. కాని యచటి చోద్యము చూడవలె ననుతలంపే కాని, ఆపన్నులను దప్పింపఁ గోరెడి సచ్చింతమాత్రము వారి కెవ్వరికిఁ బొడమకుండెను. ఆ ద్వారముఖముదగ్గఱ వెనుక మాకుటీరమునొద్ద యఱచిన పురుషుని కంఠస్వరమె నాకు వినవచ్చెను. 'ఇక్కడ కెవరును రావలదు. లోన చచ్చిపోవుచున్నవారిని వెలుపలికీడ్చివేయవలెను.' అని మిల్లరుదొర గొంతు చీల్చుకొని యఱచుచుండెను. ఆయన చొక్కాయి మసితోఁ గప్పఁబడియుండెను. పైనుండి రాలు నిప్పుకణములవలన దానిలో తూట్లు పడుచుండెను. 'మీ రిఁక కదలిరండి, రండి!' అని యాయన కనేకులు బైటనుండి బోధించి, సైగచేయు

చుండినను, ఆమహామహుఁడు అట్లు చేయక, ఒకమూల యఱచుచును, ద్వారముదగ్గఱ పడిపోయి సగము మృతి నొందిన వారి కళేబరములను బైటికి లాగివేయుచును,ఇంక నిట్టిసాయమె వేగచేయుట కెవరైన తమకుఁ దోడ్పడుఁడని జనుల వేఁడుచును ఉండెను. ఆయనకు సహాయులు బొత్తిగ లేకపోలేదు: ఇంకొక తెల్లవారును, ఒక హిందూ యువకుఁడును ఆయనను శీఘ్రమె కలసికొని ఆయన యాజ్ఞ చొప్పునఁ బనులు నెఱవేర్చుచుండిరి. లోకము నిపుడావరించుచున్న యంధకారమును బైటికిఁ దోలుట కేర్పడిన వా యనునట్లు, పైనుండి కాలి పడిపోవుచుండిన యాకొయ్యలవెలుఁగున ప్రజాసేవచేయు నాముగ్గురు మనుష్యుల ముఖములును తళతళమని మెఱయుచుండెను. లోకసంరక్షణార్థ మావిర్భవించిన దేవతలవలె వారు గాన్పించిరి.

'ఈపాటికి వెడలిపోవుదము!' అని యిరువురు సహచరులును తన్ను తొందరపఱుచుచున్నను మిల్లరుదొర వారిమాటల వినక, 'కడసారిప్రయత్న మొకటి చేసెదను. దక్షిణపుదిక్కున నొకస్త్రీ యాకారము గానవచ్చుచున్నది!' అని మండిపోవుచున్న యింటిలోని కట్టెచొచ్చెను. తోడనె పొగ వాని కనులను గప్పివైచెను. అగ్నిదేవుఁడు నాలుకలు చాఁపుచు వాని నాహుతిఁగఁ జేయఁ జూచుచున్నట్టుగఁ గానఁబడెను. 'ఇంక రండి, రండి!' అని యిరువురు స్నేహితులును, మూఁగిన జనులును మిల్లరుదొరను బిలిచి, చప్పటలు గొట్టిరి. అంత నొకశరీరమును కుడిబుజమున వైచుకొని, యింకొకరిని జేత నుంచుకొని, తగులఁబడుచున్న తనదుస్తులను రెండవ చేతితో నులిపికొనుచు, మిల్లరుదొర బైటికి వెడలివచ్చెను. ఆనిముసముననే పాకపైకప్పు ఒక్కుమాఱుగఁ గ్రిందికి గుబాలునఁ గూలిపోయెను!

మిల్లరుదొర దుస్తులు అచ్చటచ్చట కాలిపోయెను. యుద్ధరంగమున మహావీరుని శరీరమువలె నాతని దేహము గాయములతోఁ గప్పఁబడియెను. ఆయన మాత్రము తన బాధను దలంపక, తాను కడపటిసారి తెచ్చిన శరీరమును క్రింద నుంచి, 'మిత్రులారా! నే నీస్త్రీ నెట్లులైన రక్షింపవలెనని మండుచున్న కుటీరములోనికిఁ బోయి, నేల పడియుండిన యామెశరీరమును కదలింపఁబోఁగా, అది మిక్కిలి బరువుగాఁ గనఁబడెను. ఆమెహస్తములతోఁ గట్టిగ బంధింపఁబడి యొకపిల్ల యుండెను. శిశువును దిగవిడుచుట పాడిగాదని దానిఁ జేత నుంచుకొని తల్లిని మూఁపున మోచికొని, యెట్లో బైటపడితిని.చూడుఁడు: ఈశిశువునకుఁ గొనయూపిరి యున్నట్లున్నది!' అని పలికెను. అపుడు ముఖముమీఁద నీటిబిందువులు చల్లఁగాఁ, ఆపిల్ల కదలి,యేడిచి, కూర్చుండెను.ఇటునటుచూచి బిడ్డ యంతట చేరువను బడియుండిన తల్లిఱొమ్ముఁ జేరి, నిర్జీవయగు మాతయొద్ద స్తన్యపానము చేయఁజూచెను. ఆదృశ్యము చూపఱనయనములను బాష్పతోయముల ముంచివైచెను. కొండవలె నిలువఁబడియుండిన మిల్లరుదొర యెడమచేత నున్న జేబురుమాలుతోఁ దనకనులు దుడుచుకొని, కుడిచేతితో ఆపిల్లను తల్లికళేబరమునుండి తీసియెత్తి, 'నీలాంబరమూ! నీవును, నా సోదరుఁడు ఫాదరు ఫిలిప్సును చేసిన సాయముననే యీ పిల్ల యీ నాఁడు బ్రదికినది. ఇది హిందూబాలిక. తల్లిఱొమ్మునుండి తీసి దీనిని నీవశము చేయుచున్నాను! నీవే యిఁక దీనికిఁ దల్లియు, తండ్రియు! మన మిపుడు ఇండ్లకుఁ బోయెదము. దుస్తులు మార్చి సలుపుచున్న గాయములకుఁ గట్లుగట్టించుకొందము' అని పలికెను. రణరంగమునఁ బోరి శత్రుసమూహముమీఁదఁ బరిపూర్ణవిజయముఁ గొనిన శూరాగ్రేసరులవలె నాముగ్వురుపురుషు లంతట బైటికి వెడలివచ్చిరి. వారిని బొగడి ప్రశంసింపని జిహ్వ మద్రాసునగరమున నాదినములలోఁ గానరాదయ్యెను.

౪

"నేను క్రైస్తవుఁడను కాను-మిల్లరుదొరశిష్యుఁడను కాను-కాని, ఆనాఁటనుండియు నాకును మిల్లరుదొరమహానీయత మనస్సున గాటముగ నాటినది. పురుషనామమున కట్టి మహనీయుఁడే యర్హతగలవాఁడు. ఈమిల్లరు దైవాంశసంభూతుఁడు కాఁడాయని నేను పలుమారు మనస్సున వితర్కించుకొనుచుందును. మనుష్యమాత్రున కిట్టి

మహాత్కార్యనిర్వహణము సాధ్యమగునా యని యనేకపర్యాయములు నేను విస్మయమందుచుందును! ఆపుణ్యపురుషుఁ డానాఁడు గావించిన సత్కార్యము లీక్షించి మిరుమిట్లుగొనిన నాకన్నులసంభ్రమ మింకను శాంతింప లేదు!- మిల్లరుదొర పిమ్మట చిరకాలము చెన్నపురికి, భారతదేశమునకుఁ జేసినసేవ లోకవిదితమే. ఆయన పడసిన విఖ్యాతియు నపారమైనదియే. కాని, పూలమ్మెడి యంగడినె బొగ్గులును అమ్ముచుండును: ఆపుణ్యపురుషుని వినుతించిన నోటనె ఆయనమీఁద నిందను జనులు గుసగుసలుగఁ జెప్పకొనసాగిరి. తాము నీరుపోసి పెంచిన కీర్తివృక్షమును తమ చేతులతోనే తెగటార్చినఁగాని మాయప్రపంచమునకుఁ దనివితీరదు! లోక మెట్లు ప్రేలినను నావిశ్వాసము నాదియె! మిల్లరుదొర పరమపవిత్రుఁడని నామతము. ఆయనను దరింపఁజేయుట కానాఁడు ఆయనగావించిన మహోపకారకార్యములే చాలును. ఎట్టిమానవులకైన జీవన్ముక్తి గాంచుట సాధ్యమగునేని అట్టిమహనీయులలో మిల్లరుదొర ప్రథమగణ్యుఁ డని నా పరిపూర్ణవిశ్వాసము!

"నీలాంబరమొదల్యారు ఆకాలమున మిల్లరుదొరకు ప్రియమగు విద్యార్థులలో నొకఁడు. అట్లు తనగురువర్యునితోఁ బాటుపడి వారిచే నొసఁగఁబడిన బాలికను మూఁపునఁగై కొని యింటి కేఁగిన నీలాంబరమును ఈబాలిక నెట్లు పెంచఁగలనా యనుచింత నాఁటినుండియె వేధింపఁదొడంగెను. బ్రహ్మచర్యాశ్రమముననే విద్యాపరిపూర్తి యగువఱకు నుండవలెనని కాంక్షించు నీలాంబరము అభిమానపుత్రికారక్షణము కారణముగా వెనువెంటనే గృహస్థాశ్రమస్వీకారము చేయవలసివచ్చెను. లోకజ్ఞానమెఱుఁగని యాబాలదంపతులు పుత్రికారక్షణముతో సంసారయాత్ర నారంభింపవలసివచ్చుటచేత మితిలేని కష్టములపాలైరి. కాని యల్లారు ముద్దుగఁ బెరుఁగు "నీలాంబరి"ని జూచి వారు తమకష్టములన్నియు మఱచిపోయిరి. నీలాంబరి యున్నతవిద్యాభ్యాసముచేసి, తన వినయవివేకసంపదచే జననీజనకుల కాచంద్రార్కమగు కీర్తి సమకూర్చెను. నాసహపాఠియు, మిత్రుఁడునగు నీలాంబరమొదలియారు తనపుత్రికకుఁ జేయవలసిన విధ్యుక్తధర్మము నెఱవేర్చి యిటీవల కీర్తిశేషుఁడయ్యెను. నీలాంబరి విద్యాధికుఁడును, సుగుణాన్వితుఁడు నగు నొకపురుషుని కిల్లాలై, సత్సంతానమును గాంచి, ఋజువర్తనమున మెలంగుచున్నది!"

ఇట్లు నాగురూత్తముఁడు పలుకుచుండఁగనే, వీథితలుపు తెఱచినచప్పు డయ్యెను. గృహస్థుఁడును, గృహిణియును తమసంతానముతో నింటఁ బ్రవేశించిరి. నాగురువుమూలమున నేను వారికిఁ బరిచితుఁడనైతిని. క్రిందటిదినము సంఘసంస్కరణమహాసభలో స్త్రీస్వాతంత్రతనుగుఱించి తీర్మానమునుపపాదించిన స్త్రీరత్నమే నీలాంబరి యగుటకు నే నాశ్చర్యపడి లోకేశ్వరునిచర్యలు విచిత్రములుగదాయనుకొంటిని. వీరు హిందువులయ్యును, వీరిపుత్రులకు మిల్లరు, ఫిలిప్సు అను క్రైస్తవ నామములు గలుగుట నా కెంతమాత్రము విపరీతములుగఁ దోఁపలేదు. తనతండ్రియగు నీలాంబరమును గుఱించి మాటాడుచున్నపుడు, నడివయస్సున నుండిన యాకాంత కనుగొనలనుండి యశ్రువులు సంతతధారగ నొలుకుచునే యుండెను. ఇంక మిల్లరుదొర స్మరణమావనితామణికి రామస్మరణమే. చనిపోవుట కాఱునెలల ముం దామహాపురుషుఁడు తనకు వ్రాసినజాబు పెట్టెనుండి తీసి యాకాంత చదువుచుండఁగా, మిల్లరుదొరమాహాత్మ్యము నేను గూడ కొంత గ్రహింపఁగలిగితిని. ఇప్పుడైన మన మద్రాసువారు మిల్లరునకు 'మహాత్మ' యను గౌరవబిరుద మొసఁగి యేల తమపేరు నిలువఁ బెట్టుకొనఁగూడదా యని నేను విస్మయ మందితిని.

# కవిత

కవిసోదరులు: పువ్వాడ శేషగిరిరావు, చోడవరపు జానకిరామయ్య గార్లు

నాకవాహిని సవతు రత్నాకరుండు-చనవులం జూపి మన్నించు శైలజాత
తెలుఁగుపొలములఁ దీయనిజలము పోసి-స్వర్ణధాన్యమ్ముఁ బండించు సస్యలక్ష్మి.

చనుఁ గుడిపి తెనుఁగుదేశము-జనియించినదాది మమ్ము సాఁకినవనితా
మణి కృష్ణానది; తత్తట-మున ఫలవృక్షయుతమయిన పూఁదోఁ టొకటన్.

ననులేఁతపచ్చిక కొనలపైఁ దల నెత్తి-వికసించుఁ జిఱుపూవుసకియ శోభ
అరవిచ్చుచున్నట్టి విరులమొత్తంబుల-మధువానఁ బోవు భృంగములగములు
ఒకటఁ దలిరుటాకు టోఁగిరమ్ము భుజించి-'కూ'యని కూయు పుంస్కోకిలములు
గరువమ్ము నెఱపెడి గరువలియూఁపున - ధరణిపై జల్లన గుఱియుపూలు
లేఁతప్రొద్దులకాంతి గిల్గింత లిడఁగ-నుబ్బి నృత్యమ్ము సేయు మయూరములును
లేఁతచెంగావివలువఁ దాలిచిన సాంధ్య-కన్య కాతిథ్య మిచ్చెడి కరణి దోఁప.

నూతనాగతయౌవనానూనరుచులు-తనువునం దెల్ల నిండిపోయిన విధాన
'గరగర'నితోఁచు గ్రొమ్మేనికాంతిఁ బఱపి-విరులనవకమ్ముఁ గైకొని వెలఁదియోర్తు.

మేలిమిజాళువాపసిఁడి మేని నిగారపుఁ జెల్వు గుల్క జం
బాలసముద్భవాభసుకుమారములై సొబగారు బాహువుల్
గ్రాలఁగ నంచయానము బరాబరి సేసి చరించె మాదుభా
వాలకుఁ దావొసంగి వనవాటికఁ బూవులు సేకరించుచున్.

కమ్మనిదేహకాంతి యొడికమ్మగు చక్కఁదనంబు గండభా
గమ్ములలేఁతనవ్వు చెలికారము విశ్వముతోడుతన్ విశా
లమ్మగు ఫాలభాగము విలాసపుమూర్తియుఁ గల్గి "మూఁడులో
కమ్ముల నిట్టిఁ డున్నె" యనఁగాఁ దగు సుందరుఁ డొక్కఁ డచ్చటన్.

అలసగతిఁ బోవుచుండఁ బయ్యంటచెఱఁగు-నేల జీరాడ నెడనెడఁ గేల సరిది
కొనుచు వనభూమిఁ దిరుగాడు వనితఁ జూచి-హృదయ మించుక బెదరినఁ బదిల
[పఱిచి.

పైపైఁ దోఁచెడి కౌతుకమ్ము మునుమున్ బాదమ్ము సాగింపఁగా
నాపున్ గొం కొకవంకఁ ద్రోచి వెనుకంజన్ వేయ నీలీల ని

ర్వ్యాపారుండయి నెమ్మదిన్ గడకు వాంఛాయత్తముజేసి వా
చాపాండిత్యము తోఁపఁ జేరి పలికెన్ జంద్రాస్యతో నిట్టులన్.

“ప్రతిభావంతము నీదురూపు, కడునిర్మానుష్య మీవంక, నీ
గతి నీవీసమయంబునం దిటకు రాఁగా నక్కజం బయ్యెడిన్
మతి నావంతయు సందియంపడక సొంతంబైన వృత్తాంత మో
యతివా, తెల్పుదె? మామకీనహృదయాహ్లాదంబు సంధిల్లఁగన్.”

అని ప్రశ్నించెడి యాతనిం గనుచు నొయ్యారంబు రూపైన రీ
తిని గాంతామణి నిల్చి, “ఒంటి, వనవీథిన్, బూరుషుల్ మానినీ
మణి నొక్కర్తుకఁ బల్కరింపఁ “దగవా? మైపోకగా నెంతువే!”
యనిరన్, సప్తపదాతిరిక్త గమనం బైనన్ విలోకింపవో?”

అని నొడువ రసికుఁడని యా-తని నెఱిఁగి నెలంత తనదు తరుణాధరమున్
మునిపంట నొక్కి- నణఁకెడు-తను నెంతొ వశంబుఁ దప్పఁ దన్నిటు తెలిపెన్.

“ప్రవిమలానంద రసధునీ రచిత భవ్య-పులిన తలములయందు నిచ్చలుఁ జరింతు
నా యుషఃకన్యకయును సంధ్యాలతాంగి-నాకుఁ గడుఁ గూర్చు మిత్రరత్నములు [చూవె!

మలఁగన్ దేవనదీసమాగత లసన్మందానిలస్యందితో
జ్జ్వలవాఃపూర తుషార బిందువులు—నాచ్ఛాదింతుఁ గ్రొందళ్కు-పూఁ
తల ను న్బట్టుచెఱంగు—రంగుకయి సేఁతల్ సేసి—మారందధా
రలు చిందన్ ఘటియింతు శ్రోత్రములకున్ రమ్యత్వసిద్ధాంతముల్.

నారాజ్యంబునఁ గష్టకారణము కానన్ రాదు, సౌఖ్యార్ణవ
శ్రీ రాజిల్లఁగ నెల్ల వేళల విపంచీరావమాధుర్య లీ
లారమ్యత్వము సత్కవిత్వ రచనోల్లాసంబుతోఁ గూడి నిం
డారన్ మోదముఁ గూర్చు నెవ్వనికి నైనన్ జిత్త మూరింపుచున్.

భావనాశక్తి బుద్ధివైభవముతోడ-సరసవాక్చాతురీ విలాసములు గలిగి
ప్రకృతి తోడుత నైక్యభావంబు నెఱపు-కవులు చూపినత్రోవ మార్గమ్ము నాకు.

వినవలతు మీచరిత్రము-వినిపింపఁగఁ దలఁతురేని వీనులు తనియం
గను” నను వనితను గని యా-తనిమోమునఁ దోఁచి వెలయ దరహాసరుచుల్.

“ఏనిముసాని కానిముసమే కనిపించెడి క్రొత్త సోయగం
బానుతమిన్ జనించు నభిమానముచేఁ దొలివేల్పుచేత ని



పెద్దాపురపు హావేలి రాజకుటుంబము



శ్రీ కోనసీమ కో ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు లిమిటెడ్, పాలకవర్గము—౧౯౩౭-౩౮

ర్మాణము నొంది చూపఱఁ గరంబుఁ గరంచెడి పూలతోఁటలన్
మానక సంచరింతు లలనా! కడుచిత్రము నాప్రవర్తనల్.

[లందు
తలిరు గుబురుల కొండ నెత్తములయందు-మలఁకలై పాఱు సెలయేటి మలుపు
పొఱలి తీరమ్ములోరయు నిర్ఝరిణులందు-తన్మయత్వంబునొంది సంతసముఁగనుదు.

రమణీ! రమణీయమై యనురాగరసము-లూఱి జాలైన నింకింప నోర్తురెవరు?
కలిగినంతకు వలపు మొక్కలకుఁ దార్చి-పూలుపూయించుకొంద్రు కాదా లతాంగి!

ఇది నీకు సమ్మతముగా-మదికిన్ దోఁచెడున యేని మగువా! మనకున్
బదనైన జీవ కుసుమము-తుదిలేని మరంద ధారఁ దోఁగుట కలుగున్.'

అని పలుకంగఁ దోఁచి దరహాసము మోమున చేకులెత్త చి
క్కని తెలిచూపుకాంతి కడగన్నులఁ బాఱఁగ నమ్మొలంత యా
తని పలుకుల్ గ్రహించిన వితంబు బయల్పడె, నాతఁడున్ మనో
జ్ఞ నయనముల్ విశాలములు చారుతరంబులునై తనర్పఁగన్.

కెంపువాతెఱ చవులఁ బుక్కిటను బట్టి-మొలకజవ్వనిఁ జక్కిలింతలకుఁ దార్ప
బోటిజడకుచ్చు వ్రేటు వీపునకుఁదగిలెఁ-గాముకుల చాటు చెయిదాల గడన యేల?

ఆఱాతిరి గల జాములు-పాఱెను కృష్ణానదీప్రవాహము వోలెన్
రేఱేఁడు వెల్లఁబోఁ దెల-వాఱెను—ప్రాచీలతాంగి ప్రభ గయిసేసెన్.

తొలిప్రొద్దువేళ కెంపుల నీను బాలభా-స్కరు గుబాళించు కెంజాయ నొరసి
తొలుకాడు తెలినీటి తళుకు రేకలలోని-నిద్దంపు సొగసుఁ బన్నిదము చఱచి

తులలేని వెలిదమ్మి చలువచూపులలోని-ముత్యాలబెళుకు సొంపులకుఁ దార్చి
తొలిజాము మంచుబిందులలోన వికసించు-పవమాను పేశలత్వము భజించి
గరగరిక చేసి—నిద్దురకలఁత వాసి-జాఱుపయ్యెదతోన సింగార మొలుక
రమణి నిలిచెను కవికుమారకుని చెంత-సిగ్గుతరఁగలు మోమునఁ జెంగలింప.

సిగ్గుతరఁగలఁ గలువపూఁజివురుటాకు-దొన్నెల న్నించి కృష్ణావధూటి యిచ్చు
సేవ కాంచనపుష్ప సందీప్తహాళి-తలుల దీవించె వాగ్దేవతాలతాంగి.

"కవిత" నుండి.

---

# శుంగకాణ్వవంశములు

ఆంధ్ర శేషగిరిరావు గారు, బి.ఏ., (సారస్వత సమాజము)

౧

## ఉపోద్ఘాతము

### నాటి దేశస్థితి

అశోకవర్ధనుని అనంతరము మౌర్యవంశమున ప్రజ్ఞాదక్షులగు రాజులు అవతరింపలేదు. అట్లగుటచే అశోకుని తరువాతి మౌర్యులు విశేషరాజ్యభారమును వహింపలేకపోయిరి. ఉత్తర హిందూదేశమున కాకాలమున ప్రతాపమహితుడగు మహారాజు కావలసియుండెను. ఆ దినములలో పశ్చిమమునుండి యవనులు హిందూకుష్‌పర్వతముల నతిక్రమించి దేశమునచొఱబారుచుండిరి. అట్టి యవనులదాడినుండి తమ్ము, తమ దేశమును రక్షింపగల ప్రజ్ఞావివేకికొఱకు ప్రజలు తల్లడిల్ల జొచ్చిరి. పుష్యమిత్రుడనువాడీస్థితిగతు లారసి దేశరక్షణార్థము ముందునకు వచ్చెను. (పుష్యమిత్రునకు పుష్పమిత్రుడని నామాంతరము కలదు.)[1]

### బృహద్రథుని పతనము

పుష్యమిత్రుడు మౌర్యులలో కడపటివాడగు బృహద్రథుని సేనాని. బృహద్రథుడు విశాలరాజ్యక్లేశముల కోర్వలేని దుర్బలుడు. కావున పుష్యమిత్రుడు బృహద్రథుని త్రోసిరాజని తానే మగధరాజ్యసింహాసన మాక్రమింప దొరకొనెను. బృహద్రథమౌర్యునకు చూపునెపమున ఆతనిసేనాపతి పుష్యమిత్రు డొకనాడు సేనాబలమంతయు ఒక్కచో చేర్చెను. రాజు వానిని చూడవచ్చెను. ఆ సమయమున పుష్యమిత్రుడు తిరుగబడి బృహద్రథుని తుదముట్టించి మగధసింహాసన మాక్రమించెను.[2] ఇది క్రీ. పూ. ౧౮౪-౫ సంవత్సరమున జరిగెను. ఇంతకుముందే రాజ్యక్షేమము నుపలక్షించి రాజ్యసభవారు (Council) తమరాజును త్రోసిపుచ్చి పుష్యమిత్రుని వాని స్థానమున రాజుగా ఎన్నుకొనిరని ఒక చరిత్రకారుడు వ్రాయుచున్నాడు.[3] ఇది సరికాదని స్మిత్తు అభిప్రాయము. బృహద్రథమౌర్యుని తుదముట్టించి మగధరాజ్య సింహాసన మెక్కిన ఈ పుష్యమిత్రుడు శుంగవంశీయుడు. ఇతనితో మగధసామ్రాజ్యమున శుంగవంశప్రభుత్వము ప్రారంభ మగుచున్నది.

### వంశవృక్షము

మగధరాజ్యమును పాలించిన శుంగరాజులు పదిమంది అనియు, వారు నూటపండ్రెండు సంవత్సములు రాజ్యపాలనము చేయుదురనియుపురాణములు చెప్పుచున్నవి.[4] పురాణముల ననుసరించి ఆపది శుంగరాజులనామములును, వారి రాజ్యకాలపరిమితియు నిదిగువ నీయబడుచున్నవి:—

1. కాళిదాసకృత మాళవికాగ్నిమిత్రము.
2. Harsha-Charita-Translated by Cowell and Thomas; p. 193.
3. Havell p. 119.
4. Pargiter: Dynasties of the Kali Age; P p, 30-3, 70.

| వరుస నెంబరు | రాజు పేరు | రాజ్యకాల సంవత్స రములు |
|---|---|---|
| ౧ | పుష్యమిత్రుడు | ౩౬ |
| ౨ | అగ్నిమిత్రుడు | ౮ |
| ౩ | వసుజ్యేష్ఠుడు లేక సుజ్యేష్ఠుడు | ౭ |
| ౪ | వసుమిత్రుడు | ౧౦ |
| ౫ | ఓద్రక లేక ఆంధ్రక | ౨ |
| ౬ | పుళిందకుడు | ౩ |
| ౭ | ఘోషుడు | ౩ |
| ౮ | వజ్రమిత్రుడు | ౯ |
| ౯ | భాగవతుడు | ౩౨ |
| ౧౦ | దేవభూమి | ౧౦ |
| | మొత్తము | ౧౨౦I |

[I. వరా: ఈ మొత్తము పురాణము లిచ్చిన మొత్తము (112)తో సరిపోవుట లేదు.]

### శుంగవంశము

శుంగవంశీయులు సామవేదులు;[5] బ్రాహ్మణులు. వీరు వేదాంతశాస్త్రప్రవీణతకు ఆనాటివారిలో పేరు మోసియుండిరి.[6] శుంగవంశీయులు మొదట మౌర్యులవద్ద పౌరోహిత్యము నెఱపిరి.[7] అశోకునికాలమున మౌర్యులు బౌద్ధమత మవలంబించుటచే వీరి పౌరోహిత్యమునకు అవకాశము లేకపోయినది. అయినను మౌర్యులు శుంగ వంశీయులను గౌరవప్రపత్తులతోడనే చూచుచు వచ్చిరి. శుంగవంశపు రాజులలో కొందఱినామముల చివర 'మిత్ర' శబ్దము (పుష్యమిత్ర, అగ్నిమిత్ర, వసుమిత్ర మొదలైనవి) ఉండుటచే వీరు పరిషియాదేశస్థులనియు, సూర్యో (మిత్ర) పాసకు లనియు కొందఱి అభిప్రాయము. కాని విన్సెంటుస్మిత్తు ఇది సరికా దనుచున్నాడు.

## ౨

## పుష్యమిత్రుడు

### రాజధాని: రాజ్యవిస్తీర్ణము

క్రీ. పూ. ౧౮౪-వ సం. న పుష్యమిత్రుని రాజ్య పాలనము ప్రారంభ మయ్యెను. మౌర్యులకాలమునందు వలెనే పుష్యమిత్రుని కాలమునకూడ పాటలీపుత్రమే రాజధానిగా విలసిల్లెను. ప్రాక్తనమగధరాజ్యములోని మధ్యభాగములు, అనగా బీహారు, తిరుహత్, ఆగ్రా, అయోధ్య అను ప్రదేశములు పుష్యమిత్రుని అధికార మునకు లోబడియుండెను. ఆతనిరాజ్యము దక్షిణపు సరిహద్దు నర్మదానదివఱకు వ్యాపించియుండెను. అశోకుని అనంతరము మౌర్యులుకాని,శుంగవంశజులుకాని పంజాబు నందు అధికారము చలాయించి రనుటకు వీలులేదు.[8] అయినను శుంగరాజుల కాలమున మగధరాజ్యము కొంతవఱకు విశాలమై యుండెననుట కాధారములు కలవు.[9]

### ఖారవేలుని మొదటిదాడి

క్రీ. పూ. ౧౬౫-వ సం. ర ప్రాంతమున కళింగ రాజగు ఖారవేలుడు పుష్యమిత్రుని రాజ్యముపై దండెత్తి పాటలీపుత్ర నగరప్రాంతమునకు సేనల సాగించుకొని పోయెను. యుక్తిపరుడగు పుష్యమిత్రు డది చూచి పాటలీపుత్రమును విడిచి మధురాపట్టణమున కొత్తిగిల్లెను. పుష్యమిత్రుని వెనుదగులుటకు బదులు యుద్ధసంరంభము లంతతో ఆపివెనుకకు పోవుటయే అప్పటికి మంచిపనియని భావించి ఖారవేలుడు గోరథగిరులనుండి మరలి కళింగ దేశము చేరెను.

5. Smith: Early History of India (4th edition)p. 208.
6. Journal of Bihar and Orissa Research Society, IV, 1918.
7. Ibid.
8. Smith: Early History of India (4th edition); p. 209.
9. Rapson: Ancient India, Chapter VIII, P. 115.

### ఖారవేలుని రెండవదాడి

నాలుగు సంవత్సరములు గతించిన తరువాత ౧౬౧ లో ఖారవేలుడు మరల పుష్యమిత్రునిపై కత్తి దూసెను. సేనల కూర్చుకొని ఉత్తరహిందూస్థానమున ప్రవేశించి, హిమాలయపర్వతప్రాంతమున కొన్నినాళ్లు జరిపెను. అనంతరమతః ఉత్తరమునుండి ఏనుగుల సాయమున గంగానదినిదాటి అకస్మాత్తుగ పాటలీపుత్రమును ముట్టడించెను. అట్టి స్థితిలో పుష్యమిత్రుడు లోబడక తప్పినది కాదు. ఖారవేలుడు పాటలీపుత్రమును కొల్ల గొట్టెను. అట్లు కొల్లగొట్టబడిన వస్తువులలో ప్రథమజినుడగు ఋషభదేవుని శిలాప్రతిమ యొకటి. ఆ ప్రతిమ మూడుశతాబ్దములకు పూర్వము మొదటి నందరాజుచే కళింగదేశము నుండియే కొంపోబడియెను.[10] తిరిగి దానిని జైనరాజగు ఖారవేలుడు స్వదేశమునకు గొనివచ్చెను.

### మినాందరు దండయాత్ర

ఇంతతో పుష్యమిత్రుని యుద్ధ కథనము ముగియలేదు. ఖారవేలునికంటె ప్రబలమైన శత్రువొకడు ౧౫౫-వ సంవత్సరమున పశ్చిమమున పొడసూపెను. ఈ శత్రువు మినాందరుఅనుయవనుడు. ఇతడానాటి బౌద్ధగ్రంథములలో మిళిందుడనిపేర్కొనబడుచున్నాడు. ఇతడు బ్యాక్ట్రియారాజగుయూక్రెటైడ్సునకుచుట్టము; కా(బూ?)బూలు, పంజాబు రాజ్యములకుపలిక. రెండవ అలగ్జాండరు అనిపించుకొనవలయునను ముచ్చటతో ౧౫౫-వ సం.న మినాందరు హిందూదేశముపై ఎత్తివచ్చి సింధుడెల్టా, సురాష్ట్రము, మఱికొన్ని పశ్చిమసముద్ర తీరదేశములను జయించి తనరాజ్యమున కలుపుకొనెను. అంతతో తనివినొందక ఆతడు యమునానదీతీరస్థమగు మధురాపట్టణ మాక్రమించుకొని, రాజపుత్రస్థానములో మాధ్యమిక నగరమును (ప్రస్తుతము చిత్తూరునకు ఎనిమిదిమైళ్ల ఉత్తరముననున్న నగరి) ముట్టడించి, సాకేతపట్టణమును చుట్టుముట్టి, పుష్యమిత్రుని రాజధానీనగరమగు పాటలీపుత్రముపై పడ నుంకించెను.

పుష్యమిత్రుడు ౧౫౩-వ సం.లో మినాందరునకు ఎదురైపోరి ఆతనిని ఓడగొట్టెను. చేయునదిలేక గ్రీకురాజు తిరుగుమొగము పట్టెను. హిందూదేశమును జయింపవలయునను మినాందరు ఉద్దేశ్యములన్నియు ఇట్లు గాలి కెగిరిపోయినవి. అయినను ఆతడు జయించిన పశ్చిమతీరభాగములు మఱికొంతకాలమాతని రాజ్యమునకే అంకితములైయుండెను. క్రీస్తుతరువాత మొదటిశతాబ్దములోకూడ మినాందరునాణెములు భరుకచ్ఛము రేవున చెలామణియగుచుండెనని పెరిప్లస్సుగ్రంథకర్త వ్రాయుచున్నాడు[11].

భూమార్గమున హిందూదేశముపై ఎత్తివచ్చిన యూరోపియను రాజులలో మినాందరు కడగొట్టువాడు. దరిమిలాను వచ్చిన యూరోపియను రాజులు జలమార్గమున వచ్చిరి. "ఇటుల అలగ్జాండరు, సెల్యూకసు, మినాందరు అను యూరోపియను రాజులు ఈదేశమునకువచ్చి మొదట కొంతజయమును, రాజ్యమును సంపాదించిరి. కాని ఈదేశపురాజుల శౌర్యసాహసముల నెదిరించి శాశ్వతముగ నిచ్చటనిలువలేక, తుదకీదేశమునుండి వెడలిపోవలసినవారైరి. ఇది అప్పటి హిందువుల పౌరుషమునకు వన్నెకదా!"[12]

### అగ్నిమిత్రుని వృత్తాంతము

పుష్యమిత్రు డిట్లు యవనరాజు మినాందరుపై జయముగొనిన దినములలో ఆతని కుమారుడును, యువరాజును అగు అగ్నిమిత్రుడు విదర్భరాజుపై జయముగొని తనతండ్రిరాజ్యమునకు బలగౌరవములు చేకూర్చెను. మాళవికాగ్నిమిత్రమను కాళిదాసకృతమైన నాటకములోని నాయకు డీ అగ్నిమిత్రుడే. నర్మదానదికి ఉత్తరమున నున్న మగధరాజ్యభాగమును తనతండ్రికి ప్రతి

10. Journal of Bihar and Orissa Research Society, vol III, 1917, p. 425.
11. Smith: Early History of India(4th edition), p. 227.
12. హిందూమహాయుగమునుండి.

నిధిగా అగ్నిమిత్రుడు పరిపాలించుచుండెను. యమునకు ఉపనదియగు వేత్రవతి (నేటి బేత్వా) యొడ్డున నున్న విదిశానగరము (నేటిబిల్సానగరము) ఆతని పాలితరాష్ట్రమునకు రాజధాని. ఆ దినములలో నర్మదానదికి దక్షిణమున నున్న విదర్భదేశమునకు యాజ్ఞసేని యనువాడు పాలకుడు. ఇతడు ఆంధ్రుడో కాక ఆంధ్రశాతవాహన రాజులకు సామంతుడో అయిఉండును.[13] విదర్భరాజ్య విషయమున యాజ్ఞసేనికిని, ఆతని పినతండ్రికిని తగవు వచ్చెను. ఇట్టి తగవులాటలో అగ్నిమిత్రుడు జోక్యము కలిగించుకొని యాజ్ఞసేని పినతండ్రిపక్షము వహించి, యాజ్ఞసేనునిపై ఎత్తివెళ్లెను. యుద్ధమున ఓడిపోయి యాజ్ఞసేనుడు తనరాజ్యములో సగభాగము పినతండ్రి కిచ్చునట్లు అచ్చుకొనెను. గోదావరి ఉపనదియగు వరదానది యాజ్ఞసేని రాష్ట్రమునకును, ఆతనిపినతండ్రి రాష్ట్రమునకునునడుమ సరిహద్దుగా అంగీకరింపబడెను.[14]

## అశ్వమేధయాగము

తనకు మిళిందునితో కలిగిన జయమునకును, తన కుమారునకు యాజ్ఞసేనితో కలిగిన జయమునకును సంతోషించి పుష్యమిత్రుడు ఆర్యావర్తమందలి తన సార్వభౌమత్వమును సూచించుటకు అశ్వమేధయాగమును చేయ తలపెట్టెను. అధ్వరఘోటకలక్షణములు గల గుఱ్ఱమును ఆగమవిధిని ఆతడు విడిచిపుచ్చెను. తన మనుమడు అగు వసుమిత్రుని పుష్యమిత్రుడు యాగాశ్వరక్షకునిగా నియమించెను. ఈ వసుమిత్రుడు అగ్నిమిత్రునకు ఆతని పట్టపురాణి ధారుణియందు జనించినవాడు. ఇతడు నవయౌవనుడు; మొక్కవోని వీరుడు. యాగాశ్వరక్షణమున సాహాయ్యముగా నూర్గురు రాజపుత్రులు వసుమిత్రునివెంట వెళ్లిరి.[15] వసుమిత్రుడు యాగాశ్వరక్షణము చేసి పితామహునకు సంతోష మొనగూర్చెను. బుందేలుఖండమునకును, రాజపుత్రస్థానమునకును నడిమి ఎల్లగా ప్రవహించు సింధునది (పంజాబునందలి సింధునది కాదు) దక్షిణపార్శ్వమున యవనులగు ఆశ్వికులు కొందఱు యాగాశ్వమును పట్టిరి. వసుమిత్రు డాయవనాశ్వికులతో పోరి వారిని తుదముట్టించి, యాగాశ్వమును విడిపించెను. యాగాశ్వమును పట్ట నుద్యమించిన ఇతరవీరులను కూడ వసుమిత్రు డిట్లే నిర్జించుచు వచ్చెను. ఇంతలో యాగాశ్వము దేశమున తిరుగవలసిన కాలపరిమితి సంవత్సరమును పూర్తిఅగుటచే వసుమిత్రుడు అశ్వముతో పాటలీపుత్రము చేరెను. అప్పుడు పుష్యమిత్రుడు అశ్వమేధమును తనరాజధానీనగరమున యథారీతిని నిర్వర్తించెను. ఈ యంశము లన్నియు మాళవికాగ్నిమిత్రనాటకములోని దిగువ వాక్యములవలన దేటపడగలవు.

"శ్రీరస్తు. విదిశానగరమునందున్న చిరంజీవియైన మాపుత్రుడగు నగ్నిమిత్రుని సేనాపతియైన పుష్పమిత్రుడు ప్రేమ పూర్వకముగ నాలింగనము చేసికొని యజ్ఞశాలనుండి పుత్తెంచినపత్రిక. నేను రాజయజ్ఞదీక్షితుడనయియుండి నూఱువురు రాజపుత్రులను దోడిచ్చి మనవసుమిత్రుని తురంగరక్షణార్థము సంవత్సరముక్రిందట నియోగించి తనమనసువచ్చినట్లుగా సంచరించుటకై గుఱ్ఱమును విడిచిపెట్టితిని. అది సింధునది దక్షిణతీరమున దిరుగుచుండగా దాని నశ్వసేనాధిపతియైన యవనుడు పట్టుకొనియె. అప్పు డుభయసేనలకు ఘోరయుద్ధము సంభవించె. అతులధన్వియగు వసుమిత్రుడు నాగుఱ్ఱమును తీసికొనిపోవ యత్నించిన యాశత్రువుల నోడించి నాయుత్తమాశ్వమును మరలించెను. అంశుమంతుడు సగరున కశ్వమును దెచ్చియిచ్చినట్లుగా నాపౌత్రుడు నాకు యజ్ఞాశ్వమును దీసికొనిరాగా నేనిప్పుడు చేయగలిగిన యీయజ్ఞమునకు నీవు రోషము మాని వధూజనసహితముగా యుక్తసమయమున రావలెను."[16]

13. Cambridge History of India; vol. I, Edited by E. J. Rapson.
14. Smith: Early History of India (4th Edition) p 211
15. Cambridge History of India, vol.I, E. J. Rapson-p. 520.
16. వీరేశలింగముపంతులు అనువదించిన మాళవికాగ్నిమిత్రము నుండి (౫-వ అంకము.)

సంస్కృతసారస్వతధురంధరులలో నొకఁడైన పతంజలి తనగ్రంథములో ఈ యాగవిషయమై ప్రస్తావించెను. ఆప్రస్తావితవాక్యమునుబట్టి ఈయాగమాతనికాలమున జరిగెననియు బహుశః ఆతఁ డీ యాగమును స్వయముగ చూచియుండవచ్చుననియు ఊహించుట కెడమున్నది. పతంజలి పుష్యమిత్రునకు సమకాలీనుఁడు కాఁడనియు, ఇంతకుపూర్వమే ఆఱువందలయేండ్లక్రితమే యుండెననియు కొంద ఱనుచున్నారు.[17]. పతంజలులిద్దఱనియు,అందొకఁడు యోగశాస్త్రము రచించెననియు, మఱియొకఁడు వ్యాకరణ మహాభాష్యము రచించెననియు; వ్యాకరణమహాభాష్యము రచియించిన పతంజలి పుష్యమిత్రుని సమకాలికుఁడనియు,యోగశాస్త్రకారకుని కాలము సరిగా నిర్ణయింపలేమనియు మఱికొందఱు వాదించుచున్నారు[18].

### బ్రాహ్మణమతోద్ధరణము

జీవహింసకు సుతరాము ఒప్పుకొనని బౌద్ధమతము ప్రబలుటచేతను, అశోకవర్ధనుఁడు జీవహింసను నిషేధించి యుండుటవలనను బలియాగాచరణము హిందూదేశమున కట్టువడిపోయెను. బ్రాహ్మణమతమున బలియాగములు గొప్పకర్మలు. అట్టి కర్మలు కట్టువడిపోవుటచే బ్రాహ్మణమతప్రాబల్యము డిందుపాటు నొందెను. పుష్యమిత్రుని అశ్వమేధాచరణము తిరిగి బ్రాహ్మణమత ప్రాబల్యమునకు దారితీసెను. అయిదు శతాబ్దములకు పిమ్మట సముద్రగుప్తునికాలమున కలిగిన బ్రాహ్మణమత విజృంభణమున కిది ప్రథమదశ అన జెల్లును.

### బౌద్ధమత విద్వేషము

యజ్ఞయాగాదిక్రతువు లొనర్చి, వైదికకర్మల పునరుద్ధరించి, బ్రాహ్మణమతప్రాబల్యమునకు కారకుఁ డగుటయే కాక పుష్యమిత్రుఁడు బౌద్ధమతమునెడ విద్వేషమూని బౌద్ధుల నాశనముచేయుటకుగూడ పాల్పడె నని తెలియుచున్నది. అతఁడు బౌద్ధవిహారముల నెన్నిటినో పరశురామప్రీతి చేసెను. అశోకుఁడు రాజధానీనగరమున నెలకొల్పిన కుక్కుటారామ మను బౌద్ధవిహారమును పుష్యమిత్రుఁడు నాశనము చేయ ప్రయత్నించెను.[19] మగధదేశము మొదలు పంజాబునందలి జలంధరువఱకు గల బౌద్ధభిక్షుకుల నాతఁడు చంపివేసెను. చావు తప్పించుకొనిన భిక్షుకులు పరసీమలకు వెడలిపోయిరి. ఇట్లని బౌద్ధగ్రంథములు చెప్పుచున్నవి. ఇందు కొంతవఱకు అతిశయోక్తి యుండవచ్చును. అంతమాత్రమున ఈవిషయము కేవల మసత్య మనుట సాహసమే అగును.[20]

### పుష్యమిత్రుని ప్రాముఖ్యము

పుష్యమిత్రుని పరిపాలన ప్రాక్తనభారతవర్ష చరిత్రయందు మూఁడువిషయములచే ముఖ్యమైనది. మౌర్య చక్రవర్తి అశోకవర్ధనునికి తరువాతను, ఆంధ్రచక్రవర్తి గౌతమిపుత్ర శాతకర్ణి శాతవాహనునికి పూర్వమును హిందూదేశమును పరిపాలించిన రాజులలో ఎన్నఁదగినవాఁడు పుష్యమిత్రు డొక్కఁడే. అంతియేకాదు: ప్రాక్తన హిందూదేశ స్వాతంత్ర్యము నిలబెట్టిన జాతీయవీరులలో పుష్యమిత్రు డొకఁడు. అలెగ్జాండరు భారతదేశమున ఉంచిపోయిన గ్రీకుసైనికుల రూపుమాపి చంద్రగుప్తమౌర్యుఁడు తనరక్తమాంసములు పునాదిలోవైచి స్థాపించిన దేశీయ సామ్రాజ్యము తగినరక్షకుఁడు లేమి తిరిగి విదేశీయులచేతుల బడనున్న సమయమున పుష్యమిత్రుఁడు కార్యరంగమునకు దిగి,ఎత్తివచ్చిన యవనరాజును నిర్జించి, దేశమును కాపాడెను. గ్రీకురాజగు అలెగ్జాండరును ఎదిరించి పోరిన పురుషోత్తముఁడును, యవనరాజగు సెల్యూకసును ఎదిర్చి ఓడించిన చంద్రగుప్తమౌర్యుఁడును ఎట్లు జాతీయవీరులుగా పూజనీయులో అట్లే పరరాజగు మినాందరుదాడి నరికట్టి నిలిచిన పుష్యమిత్రుఁడును పూజనీయుఁడై వెలుగొందు

17. Kunte:Vicissitudes of Aryan Civilization in India.
18. The Yoga-Sutra of Patanjali, translated into English by Manilal Nabhubhai Dvivedi.
19. Cambridge History of India.
20. Smith. Early History of India (4th edition), p. 213.

చున్నాడు. మఱియు నాతడు అశ్వమేధయాగ మొనర్చి, వైదికకర్మల పునరుద్ధరించి, బ్రాహ్మణమత ప్రాబల్యము నకు పునాదులువైచి,హిందూమతోద్ధారకు లగు గుప్తరాజులకు మార్గదర్శకుడయ్యెను. పుష్యమిత్రుడు రాజ్యము చేయుకాలమునజీవించియుండి పతంజలి యోగశాస్త్రము, వ్యాకరణమహాభాష్యము రచించి సంస్కృత సారస్వత మును పెంపొందించెను. ఇట్లు పుష్యమిత్రుని పరిపాలన రాజకీయ మత సారస్వతవిషయము లందు ప్రాముఖ్యము నహించెను.

## 3

### తరువాతి శుంగరాజులు

ఇట్లు ముప్పదియాఱు సంవత్సరములు రాజ్యము చేసి పుష్యమిత్రుడు క్రీ.పూ. ౧౪౯లో మరణించెను.అంత నఱకు దక్షిణరాజ్యభాగమునకు రాజప్రతినిధిగను, యువ రాజుగను ఉండిన అగ్నిమిత్రు డపుడు పాటలీపుత్ర సింహాసన మధిరోహించెను. ఈతడు విదిశానగర ప్రాంత దేశమున ప్రతినిధిగా నుండినప్పుడు జయించిన విదర్భరాజ్యము లోని అర్ధభాగమును ఆంధ్రశాతవాహనరాజులు అచిర కాలముననే తిరిగి తమ సామంతరాజ్యములో చేర్చుకొని రని ఊహింపనై యున్నది.[21] అగ్నిమిత్రుని అనంతరము సుజ్యేష్ఠు డనువాడు (వసుజ్యేష్ఠుడని కూడ కలదు) రాజై ఏడుసంవత్సరములు పరిపాలించెను. ఇతడు బహుశః అగ్ని మిత్రుని సోదరుడు కావచ్చును. సుజ్యేష్ఠుని తరువాత వసుమిత్రుడు రాజయ్యెను. అగ్నిమిత్రుని కొమారుడును, పుష్యమిత్రుని యాగాశ్వరక్షకుడునునైనవా డితడే కావచ్చును. వసుమిత్రుడు పదిఏండ్లురాజ్యము పరిపాలించెను. అతనితరువాత ఆతనికొమారుడు ఓద్రక (ఆంధ్రక అని కూడ కలదు)అనువాడు రెండుసంవత్సరములు ప్రభుత్వము చేసెను. అనంతరము.పుళిందకుడు మూడుసంవత్సరములు రాజ్యమేలెను. ఈరాజులిట్లింతతక్కువకాలమురాజ్యము చేసియుండుటనుబట్టి చూడగా రాజ్యమున అశాంతియు, అంతఃపురమున కలహములును ప్రబలియుండెనని ఊహింపనగును. ఈఊహ సత్యమే అనుటకు బాణుని హర్షచరిత్రమునందలి యొకకథ ముఖ్యమైన ఆధారము. వసుమిత్రునకు ఓద్రకఅనువాడు కాక సుమిత్ర అనువా డింకొక పుత్రుడు కలడు. ఇతడు విషయాసక్తుడు. ఎల్లవేళల నటులతో సహవాసముచేయుచు నాటకముల చూచుటయందే ఇతడు కాలమును వినియోగించుచుండెను. ఇట్లొకపరి నటకులతో వినోదించుచుండగామిత్రదేవుడనువాడు వచ్చి ఈతని తల నఱికివైచెను.[22] ఈకథవలన ఆకాలమున అంతిపురమున కలహములు, అశాంతియు మెండుకొని యుండెనని గ్రహింపనగును. పుళిందకుని తరువాత ఘోషుడు మూడుసంవత్సరములు రాజ్యపాలన మొనర్చెను. ఘోషుని అనంతరము వజ్రమిత్రుడు తొమ్మిదిసంవత్సరములు రాజ్యముచేసెను. వజ్రమిత్రుని పిమ్మట భాగవతుడు రాజయ్యెను; ముప్పదిరెండుసంవత్సరములు రాజ్యముచేసెను. బీస్నగరమున గరుడస్తంభ శకలముపై ఇతని శాసన మొకటి గలదు. ఇది ఇతని పండ్రెండవ పరిపాలనసంవత్సరమున చెక్కబడినది.[23] ఇంతకుమించి ఇతనినిగూర్చి మఱియేమియు తెలియరాదు. భాగవతునిపిమ్మట దేవభూమి (దేవభూతి అనికూడ కలదు) రాజ్యమునకు వచ్చెను.ఇతడు మిక్కిలి చెడునడతకలవాడు; ముండలమారి. ఇతనిమంత్రి వాసుదేవు డీస్థితిగతులు చూచి రాజ్యమాక్రమింప నుద్యమించెను. తనరాజు (దేవభూమి) యొక్క దాసిపుత్రికకు రాణివేషము వేయించి ఆమెచే వాసుదేవుడు దేవభూమిని తుదముట్టించెను. ఇట్లని పురాణములు[24]ను, బాణుని హర్షచరిత్రయు[25] చెప్పుచున్నవి. క్రీస్తు పూర్వము ౧౮౫వసంవత్సరము మొదలు నూటపండ్రెండుసంవత్సరములు మగధ రాజ్యపాలన మొనర్చిన శుంగవంశ మిట్లు అపకీర్తి నొంది, హైందవచారిత్రక రంగమునుండి అస్తమించెను. ఇది క్రీస్తు పూర్వము ౭౩వ సంవత్సరమున జరిగినది.

## ౪

### కాణ్వవంశము

దేవభూమిని తుదముట్టించిన వాసుదేవుడు బ్రాహ్మ

21. Cambridge History of India vol. I; edited by E. J. Rapson.
22. Bana's Harsa, earita Chapter VI: Cowell and Thomas, translated by-p. 192.
23. R. D. Bhandarkar: Archeological Survey of India, Annual Report, 1913-14, p. 190.
24. Pargiter: Dynasties of the Kali Age, p. 71.
25. Bana's Harsa Carita, chapter VI; translated by Cowell and Thomas-p. 193.

ణుడు. సుమిత్రుడను శుంగవంశీయుని తలనఱికివైచిన మిత్ర దేవుని వంశమువాడు కావచ్చునీతడు. వాసుదేవునిది కాణ్వ వంశము. దీనికే కాణ్వాయన వంశమనికూడ పేరుకలదు. వాసుదేవుడు దేవభూతినిహతము చేసి సింహాసనమెక్కుట తో మగధసామ్రాజ్యమున కాణ్వవంశప్రభుత్వము ప్రారంభ మగుచున్నది. మగధరాజ్యమేలిన కాణ్వవంశీయులు నలుగురనియు, వారు నలువదిఅయిదు సంవత్సరములు పాలించిరనియు పురాణములవలన తెలియుచున్నది. పురాణములననుసరించి ఆనలుగురి కాణ్వరాజుల నామములును, వారి రాజ్యకాలపరిమితియు దిగువ నిచ్చుచున్నాను.

| వరుస నెంబరు | నామము | కాలము |
|---|---|---|
| 1 | వాసుదేవుడు | 9 |
| 2 | (పుత్రుడు) భూమిపుత్రుడు | 14 |
| 3 | (పుత్రుడు) నారాయణ | 12 |
| 4 | (పుత్రుడు) సుశర్మ | 10 |

ఈ కాణ్వరాజులను గూర్చి విశేషము లేమియు తెలియరావు. వీరిలో కడగొట్టువాడగు సుశర్మను చంపి ఆంధ్ర శాతవాహనరాజులలో నొకడు క్రీస్తుపూర్వము ౨౮-వ సంవత్సరమున మగధరాజ్య సింహాసన మాక్రమించుకొనెను.[26]

---

జనమంచి సీతారామస్వామి గారు

## సాటి నీ కెవరమ్మ! శ్రీ జానకమ్మ!



జనక రాజర్షి సుతవుగా జనన మొంది-నిరుపమోత్తమ లక్షణాభరణ వగుచు
భవ్యగుణధాముఁడగు రామునిభార్య వైతి-సాటి నీ కెవరమ్మ! శ్రీజానకమ్మ!

భక్తివినయానురాగభావంబు మీఱ-మువ్వురత్తలకును నీవు మ్రొక్కనట్టి
దినము లేదనియే చెప్పకొనెద రహహ-సాటి నీ కెవరమ్మ! శ్రీజానకమ్మ!

ఎన్నఁడు నొకపల్లెత్తు మాటని యనక-దాసదాసీజనము నెంతో దయను జూచి
అందఱకుఁ బ్రాణపదముగ నలరినావు-సాటి నీ కెవరమ్మ! శ్రీజానకమ్మ!

పతిని బరమేశ్వరునిఁగానె సతముఁ దలఁచి-యతని కఖిలోపచారము లాచరించి
ఇంతులకు నెల్లరకు మేలుబంతి వైతి-సాటి నీ కెవరమ్మ! శ్రీజానకమ్మ!

"ప్రాణనాయక! నీచెంత బ్రతుకునప్వ-డడవిగూడ నయోధ్యయే యగునునాకుఁ
గాన నీతోడ నే రాక మాన"నంటి-సాటి నీ కెవరమ్మ! శ్రీజానకమ్మ!

అమితకష్టంబుఁ బడుచున్నయప్పడైన-హనుమచే రామునన్నిధి కరుగఁబోక
"భర్త యొక్కఁడె నన్నంటఁ బాత్రుఁ"డంటి-సాటి నీకెవరమ్మ! శ్రీజానకమ్మ!

ఉంగరముఁ జూచినంతనె పొంగిపొంగి-ప్రేలికిని సేమమా? యని ప్రేమమీఱ
నాథుఁగూర్చియుఁ బ్రశ్నించినావు దాని-సాటి నీ కెవరమ్మ! శ్రీ జానకమ్మ!

"నేఁ బతివ్రత ననుమాట నిక్కమేని-అగ్నియే చల్లఁబడి సాక్షి యగు"నటంచు
నందుఁ బడి క్షేమ మందినా వబ్బురముగ-సాటి నీ కెవరమ్మ! శ్రీజానకమ్మ!

పలుకు పలుకునఁ దేనియ లొలుకునట్లు-శ్రీకరంబైన నీకథఁ జెప్పినట్టి
కవి ఋణంబును దీర్ప శక్యంబె మాకు?-సాటి నీ కెవరమ్మ! శ్రీజానకమ్మ!

---

26. Smith: Early History of India (4th edition), p. 271



ఆంధ్రసారస్వత సంఘము, లయోలా కళాశాల



గుజ్జుం వీరగోపాలకృష్ణారెడ్డి అనాథ శరణాలయము, [illegible]



శ్రీ అంకాల వెంకటసుబ్బరావుగారు



రాత్రిపాఠశాల, నాగిరెడ్డిపల్లి



వ్యవసాయకళాశాలాంధ్రవిద్యార్థులు, కోయంబత్తూరు



శారదానికేతనము. భవనములు—గుంటూరు



శారదానికేతనము. బాలికలు



శారదానికేతనము. బాలికలు. ఉపాధ్యాయులు. ఉపాధ్యాయినులు

# *అనంతపుర మండలము నందలి ఆది మాంధ్రులు

సీరిపి ఆంజనేయులు గారు

## ఉత్పత్తికాండము

### 1. మాల మాదిగలు (పూర్వగాథ)



పూర్వము కైలాసగిరియందు పార్వతీపరమేశ్వరుల సన్నిధి నొక ధేను వుండెను. దానిపోషణార్థము మహాదేవుం డిద్దఱు బాలకులను సృష్టించెను. వారు దంపతులకు మనఃప్రీతికలుగ నాయావును గాపాడుచుండిరి. దంపతులు తమ కాగోవువలనం బ్రాప్తించు క్షీరసృతాదులలో దేని నేని బసుపాలకుల కిచ్చుచుండలేదు. ఒకనాం డంబిక బాలకులలో నొక్కనికిం బాలగోంకుకు పెట్టెను. వాం డది భుజించి దాని మాధుర్యమున కలరి, తత్పదార్థప్రాప్తికి మూలమైన లేగటి యావు నున్మూలించినచో నట్టిది యింకను విరివిగ లభింపవచ్చు నని తలంచి, యాపనికై రెండవవానిం బ్రేరేచి యొడంబఱిచెను. అనంతరము ద్వితీయుం డా నవసూతికను వధించుటయుం, బ్రథముం డాతని నడిగి కొంత పలలముం బుచ్చుకొనుటయు సంభవమయ్యెను. ఉమామహేశ్వరు లది గ్రహించి, గోహంతకులును, మాంసభక్షకులును నగుటవలన నాబాలకు లన్యులం దాకరానివారినిగను, మొదట నామొదవును జంప సంకల్పించినవాండు మాంసాధికారికాక బాధ్యతగలద్వితీయునినడిగి పుచ్చుకొనుచు "మాల" యనంబడునట్లును, ద్వితీయుండు పలలాధికారియై మాంసప్రదాత యగుచు, 'మాదిగ' యనంబడునట్లును శపించిరి. అట్లు శాపసంత్రస్తులగు నాగోహంతకుల వంశజులే మాలమాదిగ లనం జెల్లినటు లీప్రాంతమునందలి యాదిమాంధ్రులు చిరకాలముగ నొక కట్టుకథ చెప్పుకొనుచున్నారు.

### 2. మాల మాదిగల పరస్పర సంబంధము

అనంతపురమండలమున మాలలు గ్రామములకు మిగుల సమీపముననను, మాదిగలు దూరముననను నిండ్లుకట్టుకొని వసించుచున్నారు. ఈ ప్రాంతమునందుగల మాలమాదిగల కేవిషయముననను బొత్తులేదు. అన్ని సందర్భములయందు నెవరికివారు వేఱుగనే యుందురు. ఈకుల భేదము బహుకాలమునుండి కలదు. చివర కది జాతితిరస్కారముక్రిందం బరిణమించినది. మాలమాదిగలలో నొండొరులకుం బంక్తి భోజనము లేదు. ఒకరిబావినీరు వేఱొకరు త్రాగరు. ఒక్క తాంబూలస్వీకారమనదప్పం దక్కిన యేసమయముననను నొండొరులకుం గలుపు మెలుపులు లేవు. దృష్టిలోమాత్రము మాలలకు మాదిగలును,మాదిగలకు మాలలునుహీనులు. తిలకధారణ ముభయవర్గములయందును గలదు; కాని కుగ్రామవాసులలో నెవ్వరును బొట్టుపెట్టరు. నాగరకతగల ప్రదేశములందు నామధారులు కొంద ఱీవల తిలకము ధరించుచున్నారు. విద్య నేర్చుకొనుట కేజాతివారికిని నడ్డంకి యావంతయును లేదు. ఉభయవర్ణముల బాలికా బాలకులును సమముగం గూరుచుండి, విద్యార్జనమునకయి ప్రయత్నింపవచ్చును. మాదిగలకంటె మాలలలోం దెలివితేట లధికముగ నున్నట్టు కన్పట్టుచున్నది.

## ఆచారకాండము

### 1. పంచముండు—బ్రాహ్మణుండు

ఆదిమాంధ్రులవాడలో బ్రాహ్మణుం డడుగు పెట్టినను,బ్రాహ్మణవీథిలోం బంచముండు ప్రవేశించినను నాదిమాంధ్రునకు దారిద్ర్యము తప్పదు. ఆదిమాంధ్రుండు చర్మమునకుం గంటవేయు పాత్రను బ్రాహ్మణుండు సమీపించినను, బ్రాహ్మణుల తులసివనమువద్దకు నాదిమాంధ్రుండు నడచినను బంచముని గూడె మే పాడగును. ఇది యీప్రాంతమునందలి యాదిమాంధ్రులలోంగల భీతి; కావున నీమండలమునం దెక్కడోట్ల నాదిమాంధ్రులు తమవాడకు బ్రాహ్మణులను రానిచ్చుటయును, బ్రాహ్మణులచేతి భోజనము గ్రహించుటయును జడియుచున్నారు. స్నానపానములకు నిరభ్యంతరము.

* ఆచారవృత్త్యాదికములలో రాష్ట్రమునందలి యాదిమాంధ్రుల వ్యవహారము లొక మండలమును వేఱొక మండలములోం బోల్చునెడలం గొంతకుం గొంత భిన్నించియున్నట్లు తెలియుచుండుటచే ననంతపురమండలమునందలి యాదిమాంధ్రుల చిరకాలాగతాచార వృత్తివిశేషములను యథాక్రమమున నిరూపించునుద్దేశమున నిది వ్రాయంబడినది. రాష్ట్రమునంగల ప్రజానాయకులును, సంఘసంస్కారప్రియులును సేవల జనహితకరమగు తమకృపావీక్షణము నిట్టి సాంఘికదైన్య చరిత్రములవంక మరల్చి, పతితజాతిజనుల దుర్భరవిషాదపరిస్థితులకు మూలమగు కీలకము నెఱింగి, దానిం దొలంచుటకయి యనుత్తప్తహృదయమున-మనసారం గృషిసల్పుచో నిక నాజాత్యభివృద్ధినిగూర్చి శంకించుపనియుండదు. ఇం దాదిమాంధ్రపదమునకు సమముగం బంచమశబ్ద ముపయోగించు వ్యాసరచనా సౌకర్యార్థమేయని పాఠకులు గ్రహింతురుగాక! సీ. ఆం.

### 2. ఆదిమాంధ్రుల వివాహవిధానము-అంతశ్శాఖలు

ఈమండలమునందలి యాదిమాంధ్రులలో గౌరీపరిణయములు, రజస్వలానంతర వివాహములు, వితంతూద్వాహములు కూడుకొను నియమములు గలవు. పైఁగా దాసురాంధ్రతెగ యొకటి యున్నది. ఇందన్నింటను గౌరీకల్యాణములే ప్రశస్తములుగఁ బరిగణింపఁబడు చున్నవి. రజస్వలానంతర వివాహమునకుఁ బందిరి, పచ్చతోరణము, ఉల్లెడ, కలశము, ముసుఁగు చీర, హరివాణము, బాసికము, నలుఁగు నేసలు లేవు. కన్యాశుల్కము మూఁడువరాలు మాత్రమే. తక్కిన వన్నియు గౌరీవివాహ క్రమమునే యనుసరించును. వారపుదాసరి యను కులపురోహితుఁడు పంచముల పెండ్లితంతు నడపును. వివాహము మూఁడుదినములైనను, నైదునాళ్ళయినను జరుగును. రజస్వలానంతర వివాహవిధిని బరిణయమైన దంపతు లితరుల నలుఁగునేసలలోఁ బాల్గొన గూడదు. ఈపద్ధతి నవలంబించిన గౌరీవివాహితలుగాని, మధ్యమావివాహితలుగాని రవికలు తొడుగరు. కొన్నిప్రాంతములలోమాత్రము వీరలకుఁ గంచుక ధారణ మున్నది. గుత్తి, తాడిపత్రి, కల్యాణదుర్గము (పశ్చిమప్రాంతమునఁ గొంతవఱకును) తాలూకాలలో స్త్రీపునర్వివాహ పద్ధతి యున్నది. తక్కిన భాగములం దది లేదు; కాని యీజాతిలోఁ బహుపురుష్యత్వ మున్న వైపులను సమానముగఁ గలదు. రవిక తొడుగ కొని గళమునకిన్నె జొట్టు ధరించుట సంసారిణులకంటె దాసురాంధ్ర కెక్కుడగు లాంఛనము. బస్విరాంధ్రు కొందఱు నుదుట శ్రీచూర్ణ ముగూడ నుంచుకొందురు.

స్త్రీలలోఁ బ్రథమవివాహమునలనఁ బుట్టిన సంతతికిని, ద్వితీయ వివాహమువలనఁ గలిగిన సంతానమునకును నంతశ్శాఖాభేదము లేదు. దాసురాంధ్రసంతతికిని, విధివిధానమునఁ వివాహమాడినవారి సంతానమునకునుగూడ నట్టి తారతమ్య మేదియును గానము. ఆచారానుసారముగ వివాహము జరుగక యౌవనమునుండి కూడుకొన్న పురుషుని వలనను, మగఁడు గతించిన పిమ్మట విటభర్తవలనను బుట్టినసంతతికి గోళకులనియు, కుండగోళకులనియుఁ జెప్పు. కంచుక ధారణము లేని ప్రాంతమున నీగోళకులు కులభ్రష్టులుగ నెన్నఁబడుదురు. రజస్వలానంతర కన్యావివాహపద్ధతియు, నీగోళకుల వివాహపద్ధతియు సమానమే; కాని సంతానమున మాత్రము గోళకులు భ్రష్టులనియు, రజస్వలానంతర వి వా హి త ల బి డ్డ లు స్వ జా తీ యు ల ని యు భావింపఁబడుచుండుట చిరకాలమునుండి యున్నది. ఈప్రాంతము నందలి యాదిమాంధ్రులలో నింతకంటె నంతశ్శాఖలు వేఱుగ లేవు.

### 3. ఆదిమాంధ్ర స్త్రీలు

హిందువులలోఁగల సమస్తజాతులయందువలె నాదిమాంధ్రుల లోను స్త్రీలకు స్వతంత్రాధికారము లేదు. వారున్నతస్థలముల నాసీనులయి యుండఁదగదు. రోటిపైఁ గూర్చుండి సంభారములు సిద్ధము చేయరాదు. చెప్పులువేసికొని తిరుగఁగూడదు. పదిమందిపురుషు లొకచోటఁగూడి మాటాడుచున్న సమయమున నామార్గమున వెళ్లఁదటస్థించిన స్త్రీ వినయభావమున వంగి యొదిగి పోవలయును. మగవారి యెదుట నింతు లొండొరులు దూషించుకొనరాదు. పరస్పరవాక్కలహములయం దెవ్వరును జెప్పు, చీఁపురు మున్నగు తుచ్ఛసాధనముల నోట నుచ్చరించుట యపచారము. వయసుచెల్లిన పెద్ద ముత్తయిదువ యైననే తప్ప, భర్తతో నేయువతియు మద్యశాల కరుగు టొప్పదు. నాగరకత హెచ్చినచోట్ల నీనియమములంతగాఁ గన్పట్టవు.

### 4. జాతినియమములు - కులదేవతలు

తాడిపత్రిభాగమునను, గుత్తిప్రాంతమునఁ గొంతప్రదేశమునందును నాదిమాంధ్రులకుఁ జాకలవాండ్రు నుడ్డలుమడుచుట కలవని తెలియుచున్నది. క్షౌరకు లేవైపున నాదిమాంధ్రులను స్పృశింపరు; పంచముల శుభాశుభ కర్మలయందు వాద్యములు మ్రోయింపరు కూడ. ఆదిమాంధ్రులు తమకుఁ దామే పరస్పరము క్షురకర్మ గావించుకొనెదరు. హిందూపురము, కల్యాణదుర్గము, పెనుగొండ, ధర్మవరము, అనంతపురము భాగములలో నాగరకతనెలసిన కొన్నిపట్టణములందుఁ దప్పఁ దక్కినచోట్ల అంగవస్త్రమేకాని యాదిమాంధ్రుల కంగవస్త్రము లేదు. ఇందులకుఁ బ్రబలహేతువు దారిద్ర్య మేయైనను గ్రమక్రమముగ నది జాతినియమముగ మాఱిపోయినది. స్త్రీలలోఁ గంచుకధారణము లేకుండుటకుఁగూడ నింతకంటెఁ బ్రబలమగు కారణము తోఁపదు. పురుషులందు మూఁడునెలల కొకక్షౌరము నాలుగునెలల కొకస్నానము పెక్కుచోట్ల సిద్ధము.

పుంటెమ్మ, కొల్హాపురమ్మ, గంగమ్మ, ఎల్లమ్మ, నల్లమ్మ, పెద్దమ్మ, బాటమ్మ, మారెమ్మ మున్నగునవి యాదిమాంధ్రుల స్త్రీదేవతలు. జోతిబోనముల నర్పించి, కోళ్లఁ బొట్టేళ్లను బలి యొసఁగుచుఁ బంచము లీదేవతల నారాధింతురు. ఓబళేశుఁడు, పోతలప్ప, నరసింహుఁడు మొదలగు పురుషదైవములను బుష్పఫలపత్ర నైవేద్యములతోఁ బంచములు పూజింతురు.

## వృత్తికాండము

### 1. పంచముఁడు - పంటకాఁపు

వృత్తులు—ఈప్రాంతమునందలి యాదిమాంధ్రులకు సేద్యమే ప్రధాన జీవిక. మాలలు నూలుగుడ్డలు, కంబళ్లుగూడ నేయుచున్నారు. వారేకులను మిగులనాణెముగఁ దీర్చి చాలసన్నముగ వడుకనేర్తురు. ఈప్రాంతమునఁ జిరకాలమునుండి మాలనూలు మిగులఁ బ్రసిద్ధివహించినది. మాలలనేఁత బిగువునందును, నాగరకతయందును దొగటవాండ్ర నేఁతను మించుననుటకు సందియము లేదు. ఇప్పటికిఁ గొన్ని యేండ్లక్రిందటి వఱకుఁ బెక్కుతరములుగ రైతులకు మాలలే గుడ్డలన్నియు సిద్ధముచేసి యిచ్చు

చుండిరని తెలిసెడిని. సేద్యమును, నేతయునుగాక మాలలకు దాసరి తనమును, వెట్టిపనియుఁ గూడఁ గలవు. ఉపవృత్తు లెన్ని యున్నను బంచమునకు వ్యవసాయము లేకున్నచో జీవిక కష్టతమమగును. కాన నాది మాంధ్రుఁ డెప్పుడును బంటకాఁపు నాశ్రయించియే యుండును.



అనంతపురమండ లాదిమాంధ్రులు-గ్రామవాసులు-వ్యవసాయవృత్తి

పంచముల గృహపతి తనకుమారులతో వ్యవసాయవృత్తికివలయు పట్టెడలు మున్నగువానికి త్రాళ్లు సిద్ధముచేయుచున్నాఁడు

అనంతపురమండలమునఁ బంటకాఁపు పంచములకుఁ బట్టుకొమ్మ. పంచమునకును, బంటకాఁపునకును గేవలము సన్నిహితసంబంధ మున్నది. ద్వాదశవిధ పుత్రులలోఁ బంచముఁడు పంటకాఁపునకు స్వయందత్తుఁ డనఁదగును. శ్రీరాముని కాంజనేయునివలెఁ బంటకాఁపున కాదిమాంధ్రుఁడు విశ్వసనీయుఁడగు బంటు. కొన్నియెడలఁ బంటకాఁపు లింటి మాదిగలను స్వసంతతికంటె నధికానురాగమునను, ప్రియబంధువులకంటె గాఢాభిమానమునను జూచి మన్నించుచుండుటయుఁ గలదు. సూర్యోదయము మొదల స్తమాన పర్యంతము నాదిమాంధ్రుఁడు పంటకాఁపు గృహమునను, పొలములలోను నొడలు వంచి మనసారఁ బాటుపడుచుండును. పంచముని విహారరంగములు పంటనేలలే. పంటకాఁపు పసులకొట్టమే తని విరామభవనము. ఒక్క వంటయింటను, సుగ్రాణమందిరమునను దక్క యజమానుని గృహమునఁ గేవల స్వతంత్రవృత్తిని సంచరించి, యందలి పిన్నపెద్దలలోఁ బూసలలోని దారమట్లు వర్తించి, పంచముసోదరుఁ డుత్సాహాతిశయమునఁ బనిచేయుచుండును. సమస్త శుభాశుభకార్యములయందుఁగూడఁ బంటకాఁపు సన్నిధిలోఁ బంచముఁడు సంసిద్ధుఁడయి యుండును. కింకరశబ్ద మీసేవకునియెడ సార్థకము. క్రిందివిషయములవలనఁ గాఁపునకును, నాదిమాంధ్రునకును గల సంబంధము విశదపడఁగలదు. రైతునకుఁ బంచముఁడును, బంచమునకు రైతును నియమానుసారముగ నిచ్చి తీసికొనవలసిన వస్తువిశేషములు సయిత మిందుఁ గ్రమరీతిని వివరింపఁబడును.

## 2. పంచముని విధి

ఒక యెకరము సాగుబడి బావిసేద్యమున కొక జత క్రొత్త చెప్పులు, కాఁడికొక చిల్లకోల, రెండుకాండ్ల కపిలెయెద్దుల కొక చిల్లపోటు, వారిణ, పంచముఁడు రైతున కొసఁగుచుండవలయును. పొలములలో నాకుపఱుచుటకు, నెరువుమోయుటకు, విత్తనము చల్లుటకు నొకమనుష్యుఁడు పనికిఁ బోవుచుండవలయును. రాగి, జొన్న, కొఱ్ఱ మొదలగువానిని విత్తవలసిన కాలమున నచ్చుకట్టు తీయుటకును, నసిలాగుటకును రెండుదినము లొక్కొక్క మనుష్యుఁడుచొంతునఁ బనికి వెళ్ళుచుండ వలయును. విత్తనపు గింజలుగాని, నసిగాని, లేనిచో యమునను, కపిలెచర్మములు వలయునపుడును, ఊరుగూరినుండి వానిని మోసితెచ్చుట కొక మనుష్యుఁడు వెళ్లుట యావశ్యకము. పాఁత చెప్పులు సవరించుట యాదిమాంధ్రుని విధి. ఎద్దుల పట్టెడలకు తమ్మెలుంచుట, చర్మపు ముసుఁగులు వేయుట, వారెలు పెట్టుట, మొలతోలు (కపిలెతోలునపుడు కృషికుఁడు పిక్కలకుఁ గట్టుకొనెడు చర్మాంబరము. దీనినే తొడతోలని కొందఱందురు.) కుట్టుట, పంచ



అనంతపురమండలాదిమాంధ్రులు-పట్టణవాసులు

చర్మకారకవృత్తి

"ఇంటియజమానునికి గౌరవార్థముగఁ బిన్న పెద్ద జోడు సిద్ధముచేసి యీయవలయును."

మునకు ముఖ్యము. కపిలెచర్మము పాఁతగిలినపుడు దానిని బాగుచేయు సవరించుటకుఁ బంచముఁడే వేళను సిద్ధముగ నుండవలయును. పంటకాఁపు గృహమున బఱ్ఱె యీనినతరువాత నొకటిన్నర నెలలోపల లేఁగమృతి నొందినచో, చచ్చిన దూడచర్మ మొలిచి యాకారముఁ గుదిర్చి తల్లి యెనుమునుండి పాలుపిదుకుట కను వేర్పఱుపవలయును. పాలు మాన్పుటకొఱకు దూడల మూతికిఁ దగిలించుటకయి పంచముఁడు మూఁజ్లచిక్కము కట్టించి యీయవలయును. కాఁపుసాని రాట్నమునకై చర్మముతోఁ జెవులుచేసి యిచ్చుచుండవలయును. కదురు వడితీర్చి తెలుచు సిద్ధము చేసి కాఁపుసాని కిచ్చుచుండుట పంచముని యిల్లాలి కర్తవ్యము. సూర్యచంద్రగ్రహణ సమయములయందు గ్రహశాంతి కర్మలకయి వెళ్ళుట కేసందర్భమున నాదిమాంధ్రుఁ డొకమనుష్యుని సిద్ధపఱుపవలయును. కళ్ళము చెక్కుట, యలికి శుభ్రముచేయుట, యాదిమాంధ్రుని కార్యము. పైరు కోసినపిమ్మట ధాన్య మిలుచేరునందాక కుప్ప వేయుట, కంకు లాఁటబోయుట, యెండవానలలో రాసికిఁ గావలి కాయుట, గడ్డి దొడ్డికిఁదోలుట, వామివేయుట మొదలగుపనుల నన్నింటిని బంచమసోదరుఁడే చూచుకొనవలయును. ఇంటియజమానునికి గౌరవార్హముగ బిన్నపెద్దజోడు సిద్ధముచేసి యీయవలయును.

పంటకాఁపుల యిండ్లు వెలిప్రక్కఁబ్రాయుటకును, కట్టెలు కొట్టుటకును నొకమనుష్యుని నిలుపుట పంచమున కావశ్యకము. రైతుల యిండ్లలో కన్య పుష్పవతి యైనపు డతఁడు కొమ్మ గొరిజలీయవలయును. వివాహవేళలందుఁ బదిమందికి మించని యధికసంఖ్యాకులతో నాది మాంధ్రసోదరుఁడు రైతునకుఁ దోడ్పడవలయును. రెండు మూఁడుదినము లింటిమెత్తు, పూఁత, కట్టెలు కొట్టుట, మున్నగు పనులు చూడవలయును. వధూవరులకుఁ బాదరక్షలమర్చుచుఁ జోరు గూరఁ జెండ్లి కూఁతు రెంతదూరమున నున్నను వానిఁ గొనిపోయి సకాలమునఁ జేర్పవలయును. వివాహసమయమున ధాన్యపుఁ బాతఱకయి పెండ్లికుమారునకు బమలుజో డీయవలయును. వివాహసందర్భములలోఁ దప్పెటలు మ్రోయింపవలయును ఆఁడుబిడ్డ పుట్టినింటినుండి నూతన వస్త్రముతో నత్తగారింటికిఁ బోవునపు డెల్ల క్రొత్త చెప్పులజత కుట్టి యిచ్చుచుండవలయును. పంటకాఁపు గృహమున మగబిడ్డ పుట్టినచో, నాబాలకుఁ డైదేండ్లవాఁడైన పిమ్మట, చెప్పులజత కుట్టికొనిపోయి యాపాపనికిఁ దొడుగవలయును.

పిల్లులు, కొక్కులు, గాడిదలు, గుఱ్ఱములు మున్నగు నంటరాని జీవములు చచ్చి వీథులలోఁ బడియున్నపుడు వానిఁ గొనిపోయి దూరమున మఱుఁగుచేయవలయును. గ్రామమున జాతర, పండుగ, పబ్బములు మున్నగు రైతులపనులకయి దండోరా వేయవలయును. గ్రామదేవరసందర్భమునందు కట్టెలుకొట్టుట, చావళ్లు చప్పరములు నిర్మించుట, వీథు లూడ్చుట, ఊరికిఁ బచ్చతోరణములు గట్టుట, గ్రామదేవత కావశ్యకమగు సమస్తోపకరణములను సమకూర్చుట, పలకలు కొట్టుట, కొఱవికట్టెలు (సంజులు) పట్టుట, బలివేయుట ఆదిమాంధ్రుని కర్తవ్యము.

అనాథప్రేతములు మోయుట, అశుభకార్యములలో దహనాది క్రియలు గావించుట, వార్తలు గొనిపోవుట పంచమసోదరుని విధి. ఇంతియకాక రైతునకత్యవసరములగు చిక్కువేళలలో నిల్లఁ బంచముఁడు పనికి వెళ్లుచుండవలయును.

## 3. పంటకాఁపునుండి పంచముఁడు పొందఁదగిన మేరలు

౧. కట్టుఁబడి—ఒకచోటికి వరిపైరున నేఁబదిసేర్ల ధాన్యము నకు సరిపడునట్లుగ నిచ్చెడు నొకపైరుకట్టయు, నొకవడెయు. (గట్టిధాన్యము పండించిన చోట్లనచో నొక్కొక్కశాలమున నొకమనుజుఁడు మోయఁదగిన మొక్కొక్క మూపెఁడు కంకులును, జోడుగాక పిన్నపెద్దజత, కపిలెచిల్లపోటు ఇచ్చినందులకయి జొన్న, రాగి పైరుపెట్టిన పట్టుల నొక్కొక్క స్థలమునను నొకయొంటిపటపుఁగంబళిమూపెఁడు కంకులును, గంపలు, చేటలు సవరించి వానికిఁ జర్మపుబతుకులు వేయుటయు, గాదెలు బండి జల్లలు మున్నగువాని నలుకుటయు లోనగు పనులకయి యిరువదిసేర్ల ధాన్యము పట్టఁగల గంపతో నొకగంపెడు కంకులు నాదిమాంధ్రున కొసఁగవలయును.)

౨. ఒడికంకులు—ఆఁడువాండ్రు రాట్నపుచెవులు తీసికొనిపోయి యిచ్చినందులకును, కదురు వడి తీర్చినందులకును, నొడిలో భరింపఁ జాలినంతపఱకు నాదిమాంధ్రుని యిల్లాలికిఁ గాఁపుసాని పెట్టెడు కంకులు.

3. పంపకపు గింజలు—ధాన్యపు పంపకమునఁ గడకళ్ళము నాఁడు బావిసేవ్యపుఁబట్టున నన్నిశాలములయందును బండెడు ధాన్యములోఁ బదెంట నొకపాలు పంచమునకుఁ బంచియీయఁదగిన గింజలు.

౪. దండికట్టు—ధాన్యము తూర్పాఱఁబోసిన తరువాత గట్టి గింజ లన్నియు రాసికిఁ జేర్చి విడిచెడి కొనభాగపు ధాన్యము.

౫. మిరాసిపట్టు—రాసి కొలచినతరువాత నడుమన రెండంగుళముల నిలువున నిలువనుండు గింజలు.

౬. రాసి యడుగువిడుపు—పంపకమైన రాసిలోఁ గొలఁత పోఁగా మిగతభాగమునందుఁ బంటనుబట్టి విడిచెడు ధాన్యము.

౭. గడ్డలు—గింజలన్నియు రాల్చుకొనఁగా తప్పదారి తసులు కొన్న నడితఱకలను రాలఁగొట్టుకొనుటకై పంచమునకు వదలిపెట్టెడి యుత్తకంకులు.

౮. నెత్తిప్రహనిక్రింపగింజలు—ధాన్యము తూర్పాఱఁబోసి రాసికిఁ జేర్చునపుడు రమారమి యెనిమిదిసేర్లకు తగ్గక పంచముఁడు వేసికొనెడి గింజలు.

౯. కళ్లపూడ్పు—కళ్లములోని గింజలు రైతు చేతితో నూడ్చుకొనఁగా నడుగున నందండు నిలిచెడు ధాన్యము.

౧౧. అత్తిమత్తి—పాత చెప్పులు కుట్టి యిచ్చినపుడును, కళ్ల మలికిననాడును బొంగ్లము (తాటి)తోఁగల టెంకాయ పరిమితిని బెట్టెడు సంకటిముద్ద. (ఇతరసమయములయందుఁ గూడ నింటిపని చేయుచున్నంతకాలము నాదిమాంధ్రునకు పంటకాఁపు భోజనము పెట్టుచుండవలయును.)

౧౧. కోడటికము—ఇంటియాఁడుబిడ్డ నూతనవస్త్రములతో నత్తగారియింటికిఁ బోవునపుడెల్ల నన్నము పెట్టి యిచ్చెడు ప్రాఁత వస్త్రము.

౧౨. ఉద్దాలగెంజలు—యజమానుని యింటిబిడ్డకుఁ బుట్టుచెప్పులు తొడిగినపుడు బిడ్డని పాదము లగపడకుండునట్లు పోసెడు ధాన్యము.

౧౩. పెండ్లియీవి—వివాహానంతరము గూడెమువారికెల్ల నొకపూఁట భోజనముపెట్టి, యింటిమాదిగ కెనుపపడ్డనుగాని, యావుపెయ్యనుగాని, (కుమపవాండ్రైనయెడల) గొఱ్ఱెనుగాని, మేఁకనుగాని యిచ్చెడిదానము.

౧౪. అంబటిగెంజలు—కపిలెకయి క్రొత్తగా నొక్కన సిద్ధము చేసిననాఁడు అంబలికొఱకుఁ బెట్టెడు ధాన్యము. (ఈధాన్యము కొన్ని గ్రామములలో నాలుగున్నరసేర్లును, మఱికొన్నిచోట్ల నాలుసేర్లను నిచ్చెడి పద్ధతి గలదు.)

౧౫. కుక్కలదోసిళ్ళు—అంటరాని జంతువులు చచ్చిపోయినపుడు వానిని లాగివేసిన వెట్టిపనికయి పెట్టెడు మూఁడుసేర్లధాన్యము. ఎకరమునకు ముప్పావుమేర. దండోరాపనికి జొన్న రాగి పంటల కొక్కొక్క కపిలెబావికి పంద్రెండుసేర్ల ధాన్యమొదుగుట కనునైన కంకులు. వరిశాలమగుచో నొక్కొక్కపట్టున నొక్కొక్కపంటకు వెన్నులవద్దఱ గజము ప్రొటిబిసవుగల యొకపైరుకట్ట. పంటనుబట్టి తిరి పమువూడ వేఱుగ నుండును. ఇంతియకాక యుగాది, సంక్రమణము, మహాలయపూర్ణిమ, నాగులచవితి, ఏకాదశి, పితృతర్పణము, అమావాస్య మున్నగు తిథులయందింటింట భోజనము పెట్టుటకూడ.

౧౬. నైబాబు—సాలపంటితోఁ బసువు చచ్చినపుడు పూర్తియును, పెద్ద పసరము పడినపుడు సగమును నొసఁగెడు చర్మము.

౧౭. కాలిబాడుగ—మరణవార్త గొనిపోయి బంధువుల కందఁ జేయు కాలమున భోజనము కట్టి యిచ్చుచు, పరువునకు రెండణాల వంతున నిచ్చెడు డబ్బు.

౧౮. ప్రేతసంస్కారము—కట్టెలు, పిడుకలు నూరిలోనుండి మోసికొనిపోయి శ్మశానవాటికఁ జేర్చి, కాష్ఠములఁ బేర్చి శవదహనము చేసినందులకయి యొసఁగెడు రు ౧|- ల పయికమును, దానితో నిచ్చెడు నాముదాలు నాలుగుసేర్లు, ఉప్పు రెండుసేర్లు. (చనిపోయినవారి కంత్యక్రియలు జరిపిననాఁడు గృహపతి యాదిమాంధ్రులలోఁ బంద్రెండుగురకు భోజనతాంబూలము లమర్చి, యొక రూపాయబహుమతిగ నీయవలయును.)

౧౯. సంతపాతిక—శవము పూడ్చుటకుఁ దీసెడుగోతికై యొసఁగుమాడ.

## 4. పంచమునినుండి యితరులకుఁ జెందవలసిన కానుకలు, పంచముని యతిథులు

౧. కాటిపాపని సుంకము—పంచముఁడు కాటిపాపని కేఁడాది కొక్కొకతడవ కాటిసుంక మీయవలసి యుండును. ఈకాటిపాపఁడు వీరబాహుని సంతతివాఁడని తెలియుచున్నది. కొందఱు గొల్లఁడనుచున్నారుగాని యది నమ్మదగినదికాదు. పాషాణధర్మము వెలయించి రాక్షసులలో దుర్యోధ పెంపొందించిన చంద్రఖండశేఖరుని వంశపువాఁడనియు, పాషాణధర్మావలంబియనియు, నిందుల కాతఁడు ధరించిన విభూతి, ఎముకపూసలపేరు, చర్మాంబరము, తలపడగ, ఇత్తికొమ్ము, కాటుక, కావివస్త్రము, కట్టెగంటలే నిదర్శనము లనియుఁ గొంద ఱనుచున్నారు.

"మురిసి ఫాలభస్మవర్మ - ములను నెముకపేరు లి
ట్లరయ నార్యులెల్ల నింద్య - మనుచు నూఱుచుండఁగా
నెరసునేయ కివి ధరింప - నేమికారణంబు
నీ చరితమెల్లఁ జెప్పుమయ్య - చంద్రఖండశేఖరా."

అని యాతని మత ధర్మములను గూర్చి పార్వతి శివునిఁ బ్రశ్నించునప్పటి వర్ణన సందర్భమును బట్టి చిరకాలాగతమైన యట్టివేషమే తమకు నుండుటచేతను, నందుఁ బ్రోక్తములైన ధర్మములే తాము నాచరించుచున్నందునను, దాము చంద్రఖండశేఖరుని సంతతికిఁ జెందినవారమని యాజనులు నుడువుచున్నారు. గ్రామములయందు వసింపక శ్మశానములఁ గాఁపుండి, యందువలనఁ దమకు లభించు కాటిమాడలచే జీవించుట వారికి ధర్మము; కాని యిపు డట్లుగాక యూరూరు తిరిగి బిచ్చమెత్తుకొనుచుఁ, గాటిమాడలకొఱకయి సంవత్సరమున కొకతడవ వీరు పంచములగూడెము సమీపించుచుందురు. పంచములలోఁ బ్రతి కుటుంబమునను గుటుంబమున కేఁడాదికి రెండురూప్యములు, పంద్రెండుసేర్ల ధాన్యము, ఒకకోడి వీరి కీయవలసి యున్నది.

౨. మాస్టీనివాండ్రు—ఒకప్పుడు శేరికోమటి దేవాంగ కమసాల ఒంటెద్దుగాండ్ల ఏకల గొల్ల బోయ మాదిగ మొదలగు 'పంచాచార (పాంచాల)ఫణకట్టు'నకుఁ జేరిన జాతులవారు విశ్వబ్రహ్మను బురస్కరించుకొని యొకప్రక్కను, నేతికోమటి లింగబలిజ సెట్టిబలిజ కుమ్మర చాఁకల తొగట మాల మొదలగు 'సెట్టి ఫణకట్టు'నకుఁ జెందిన జాతులవారు వీరశైవునిఁ బురస్కరించుకొని యొకవంకను నిలిచి, మతవిషయములలో ఘోరయుద్ధము సల్పిరనియు, నాకాలమునఁ బంచాచారపణకట్టునకు సహాయభూతులుగ వచ్చి తమశాస్త్రవిద్యాకౌ

శలముఁ జూపిన దక్కలిసు సింధువాండ్రలో నీమాస్టీనివాండ్రు కూడ నొకతెగవారనియుఁ జెప్పుదురు. అందులకుఁ దార్కాణముగ వంశాచారమునుబట్టి యేఁడాది కొక్కపర్యాయము వీరు తమపూర్వుల బలద ర్పాతిశయాదుల నూరూరఁ బొగడి చెప్పుకొనుచుందురు. వీరికిఁ జదువు రాదు.

౩. సింధువాండ్రు—వీరలు గోసఁగిసంతతికిఁ జెందినవాండ్రు; లింగధారులు; అష్టాగంధము, నక్షత్రలు దాల్చి, యాచారపరులుగ నుందురు. చదువునేర్చి జలస్తంభనేత్యాది గ్రంథములం బఠించి, యితరులకు విని పించుచుందురు.

౪. దక్కలివాండ్రు—జాంబవంతుని జ్యేష్ఠపుత్రుఁడగు నీలముని సంతతివారమని వీరు చెప్పుకొనుచున్నారు. వీరికి గాయత్రీధారణముగలదు. స్నానసంధ్యాద్యనుష్ఠాన తత్పరులై, వీర లాదిపీఠము నుండి యింతవఱకుఁ జెల్లిన యుగపురుషుల చరిత్రముల, నేయుగమున నెవ్వ రెవ్వ రెట్లెట్లు వర్తించి కీర్తిగాంచినదియుఁ దెల్పుచు, జాతీయధర్మములఁ బ్రకటించుచు, కల్పవృక్షము, కామధేనువు, చింతామణి మున్నగు వాని యుత్పత్తిక్రమాదుల నెఱింగించుచు, ఆగతానాగత వృత్తాంతములఁ దెల్పుచుండువారు. పంచములు వీరి నంటరానివారినిగ భావించి తమపాళెమునకు రానీయరు; నీరెత్తిపోయుదురు. వీరిని దాఁకినచోఁ దమకు వినాశము నిస్సంశయమని యాదిమాంధ్రులు తలంతురు. ఇందు ౨,౩,౪ భాగములలో వివరించిన ముత్తెగలవారు పురప్రవేశమొనర్చి, యది నవలిపోవునమక నాదిమాంధ్రులు వారిభోజనవ్యయములను దాము భరించుటయకాక, ప్రతివర్గమువారికిని గడప యొక్కటికి నాల్గణాలను, నేరుధాన్యమును తాంబూల సహితముగ నొసంగి వారిని సాగనంపెదరు.

౫. పెద్దయింటి గొల్లవాండ్రు—వీరు లాఁగు, చుంగురుమాలు, కాలియందె, నీలికాసె, ముకుగాలము, నాగస్వరము రక్తచందనము ధరింతురు. పూర్వము బ్రహ్మరథోత్సవకాలమున, సెట్టిఘణకట్టు వారి మంత్రశక్తివలన పంచాచారఘణకట్టువారి తేరు నిలిచిపోయియుండ, విద్యాబలముచే నారథముఁ దనముకుగాలమువలన లాగి, యుత్సవము సాగించిన పెద్దయింటి గొల్లవాని సంతతికిఁ జెందినవారమని యీతెగవారు చెప్పుకొనెదరు. పాములు బట్టుట, మోడివేయుట, యింద్రజాలాదివిద్యలను గనఁబఱచుట, యీవర్గమువారి కార్యములు. వీరికిఁ గడపకు రెండణాలు, రెండుపావులగింజలు నాదిమాంధ్రు లీయవలసి యున్నది.

౬. ఆదిజాంబవ మహాముని—పంచములకు గురువర్గములోనివారు. విభూతి, లింగము, జన్నిదము, రుద్రాక్షలురీ దండకమండలువులు, పాదుకలు, పిడిబాకు, కొంగ, వాలుఁగత్తి, త్రిశూలము, గండకత్తి (వేఁటకొడవలి), కాషాయాంబరము మొదలగు వానిని ధరింతురు. గుఱ్ఱముపై నెక్కి, నెమలిపించె వెలయ, బంగరు తప్పెటలు మ్రోయుచుండఁ, బరిచారకవర్గముతోఁ జూపఱకుఁ గన్నులపండువుగ వెడలుదురు. వీరు పంచముల పాళెమునకు బయలుదేఱుటకు ముందు భటులతో శిష్యవర్గమునకుఁ శ్రీముఖ మంపుదురు. దాని ననుసరించి వారికయి పంచములొకవిడిది కుదిర్చి, పవిత్రపఱచి, దానిఁ బచ్చతోరణములతోను, పందిరులతోడను నైనేసి, పాళెపు ముఖద్వారములకుఁ దోరణములు గట్టి, ముత్తయిదువులతో, మల్లెడ కలశములతో, పుష్పగంధ తాంబూల దక్షిణాదికములతోఁ, దమకుఁదగిన పనికొమ్ము, పనిరాలు, కాళిమంత, ఆరె, అంపె, చినకత్తులతో (సింధుక్రీడాసహితముగ) నాడుచుఁ బాడుచు నాసందభావము వెల్లివిరియ, సత్కారపూర్వకముగఁ బొలిమేరకడ నాదిమాంధ్రు లాచార్యునకు స్వాగత మొసఁగి యుత్సవపురస్సరముగ మహావైభవముతో వారిని రాజవీథిని బాళెమునకుఁ గొనిపత్తురు. గురుఁ డశ్వముమీఁదనుండి దిగుటకు ముందుగ వారికి నీరాజనము సమర్పించి, యనంతరము పాదములు గడిగి యమ్మహాశయుని విడిదిఁ జేర్తురు. దేశికవర్యుఁ డందున్నంతకాలము నాతనికివలయు పదార్థములఁ గొదవలేక సమకూర్తురు. అనంతరము వ్యయములు పోఁగాఁ గుటుంబమున కొకమాడ (రమారమి రెండురూప్యములు) చొప్పున గురుదక్షిణ సమర్పించి, యడుగులకు మడుగులిడి, విభవాభిరామము సాగనంపి, యాచార్యునిఁ బొలిమేరకడ వీడ్కొనెదరు.

## ఉపసంహారకాండము

### 1. ఆదిమాంధ్రులదుర్దశ- అందులకుఁ గారణములు

ఈమండలము నందలి యాదిమాంధ్రులకు సేద్యమే ప్రధాన జీవికయని వెనుక తెల్పియుంటిమి. వ్యవసాయమునకును, బంచముల కులవృత్తికిని నవినాభావ సంబంధ ముండుట పాఠకు లెఱుఁగుదురు.



అనంతపురమండలాదిమాంధ్రులు-గ్రామవాసులు

"పెద్దలలో స్త్రీపురుషులును, వృద్ధులును బగలెల్లఁ దమ పూరిగుడిసెల నీడలలోఁ గూరుచుండి పుక్కిటిపురాణములతోఁ గాలము వ్యర్థము సేయుచు, నుదయ సాయంసమయములయందుఁ దమ బిడ్డల నుపాదానమునకయి యూరిలోనికిఁ బంపుచుందురు."

పురపారిశుద్ధ్యసంఘమువారి వశమున నున్న పట్టణములలో మాలమాదిగలు వీథు లూడ్చుట, మఱుఁగు దొడ్లను శుభ్రముచేయుట మొదలగు పనులవలన జీవించుచున్నారు; కాని యీప్రాంతమునందలి యాదిమాంధ్రుల హీనదశ వర్ణనాతీతముగ నున్నది. ఇందులకు వారికండగ నుండిన కైతుసంఘమున విశేషభాగము స్వవృత్తినుండి విరమించుట యొక ముఖ్యకారణము.

పెద్దపెద్ద యూళ్లయందు శేలసేద్యము చాలవఱకు నడఁగంటిన దనవచ్చును. సకాలవర్షము లేకపోవుట కృషీవల యుత్సాహము భగ్నమగుటకుఁ బ్రధానహేతువు. ఇందులకుఁ దోడుగ బావుల బ్రతుకుఁ గూడ పాడయ్యెను. చెఱువుక్రింది కృషిమాత్ర మింకను కొనయూపిరితో నిలిచి యున్నది. ఈమండలమునందలి గొప్ప చెఱువులకు జీవనప్రదములుగ నుండిన యొకటి రెండేళ్ల కడ్డముగ నవ్యరాష్ట్రమున గట్లు పైచుటచేతను, కేవలము వర్షాభావమునను బుక్కపట్టణము, క్రొత్తచెఱువు మున్నగు ప్రదేశములఁగల సుప్రసిద్ధతటాకములు కర్షకులకొలఁదిగ నొక నీటిచుక్కయైనఁ గానకపోఁగా, వేలకొలఁది రూప్యముల వెలచేయుచుండిన యచ్చటిపల్లపునేలలు మెట్టపంటలకుఁగూడఁ గొఱగాక, నిరర్థకములయి యున్నవి. ఈకారణములచే ధర్మవరము, పెనుగొండ, మడకసిరా భాగములయందలి పంటకాఁపులకు సేద్యమునందుఁ బట్టుచిక్కక జీవనాధారములు తప్పిపోయెను. అందుచే నాప్రాంతములయందలి కైతులలో నొక్కొక్కఁడు నొక్కొక్క కాఁడి పశువులు చొప్పునఁ గొని, యొకబండి నుంచుకొని యుదయాస్తమానము లిద్దరులకూలిపనులకుఁబోయి యెడ్లను జంపుకొని, తనమ్మిలమునపైనఁ గుటుంబపోషణము జరుగనందున ఋణగ్రస్తులయి చెడుచున్నారు. పంటకాఁపు లిట్లు బ్రతుకులు పోఁగొట్టుకొని కష్టదశకు వచ్చుటచే, వారి నాశ్రయించియుండిన పంచములు తమకు రావలసిన మేరలు నశింపఁగా, వృద్ధిచెడి, జీవనోపాధికన్యమార్గముల బహుళప్రయత్నములు గావింపమాని, దుస్థితికి వచ్చుచున్నారు. అందుఁ గొందఱు గ్రామాంతరములకు వెళ్లి యెముకలు, తోళ్లు గొనితెచ్చెదమని లబ్బెలకడ లెక్కలు వాయించి, సంచకారములు తీసికొని, వాని నెప్పటికప్పుడే సంసారవ్యయములకును, త్రాగుడునకును వినియోగించి, నూతనసంస్కారములకయి క్రొత్తయజమానులను వెదకుచుందురు. మఱికొందఱు కొనిపోయినదానిలో నింటివెచ్చముల కుపయోగించుకొన్నది పోఁగా, నిలువపైకముతోఁ జిన్నచిన్నగ వ్యాపారములు సాగించుచు, త్రాగుడునకును, యజమానుల ద్రోహవర్తనములకును పాలై, మరల లేవలేక పడిపోవుచున్నారు. మఱియుఁ గొందఱు తెచ్చెడు సరకునకంటెఁ దీసికొనిపోయెడు ధనమే యధికముకాఁగా దానిని దీర్పఁజాలక, యజమానులకంటబడక నెలలకొలఁదిఁ దిరుగుచుఁ, జివర కెప్పుడో యాకస్మికముగ ఋణప్రదాతల హస్తగతులై మాటికి ముడివైచి కూర్చుండి, వర్ణింపరాని మానహానికరములగు వేదనలకుఁ బాల్పడి, కడకుఁ దల తాకట్టు పెట్టవలసి వచ్చుచున్నారు.

ఈమండలమునందలి యాదిమాంధ్రులలో నాత్మగౌరవ వాత్మవిశ్వాసములు క్రమక్రమముగ నరుగుచుటకు, ఆకులమునందుఁ బిచ్చుపెరుఁగుచుండెడి త్రాగుఁబోతుతనమునకంటెఁ బ్రబలతరమగు కారణము వేఱొండు కాన్పింపదు. ఇందుల కనుగుణముగ సోమరితనము సహితము వీరిలో నానాఁట వేరూనుచున్నది. పెద్దలలో స్త్రీలును, పురుషులును, వృద్ధులును బగలెల్లఁ దమ పూరిగుడిసెల నీడలలోఁ బరుండి పుక్కిటిపురాణములతోఁ గాలము వ్యర్థము సేయుచు, నుదయసాయంసమయములయందుఁ దమబిడ్డల నుపాదానముకయి యూరిలోనికిఁ బంపుచుందురు. పదిమందియున్న కుటుంబమునఁ బాటుపడువార లొకరిద్దఱకంటె నెక్కుడుమంది యుండు రనుకొనరాదు. వారైనను దమరాఁబడిలోఁ జాలభాగ మెప్పటికప్పుడే మద్యవిక్రేతకర్పించి వ్యర్థులగుచున్నారు. త్రాగుడునకు స్త్రీపురుషు లెల్లరు సమానముగ వాడుకపడి యున్నారనుట విపరీతాభిప్రాయముగాదు. ఈదురభ్యాసము గ్రామవాసులయందుకంటెఁ బట్టణవాసులలో నధికమనవచ్చును. మద్యశాల వారికిఁ దల్లియిల్లనవొప్పును. అందలి పంచములు మద్యశాలకేగెడు దమతోఁ బసిబిడ్డలనుసయితము నుంచుకొని, యొకసగంపులనుగూడఁ ద్రావించి యానందించుచుండుట కొన్నియెడల సంభవమగుచున్నది. పల్లెటూరి జనులలో నది కొంత తగ్గియుండుటకుఁ బని యధికముగుటయుఁ, బైఁకము లభ్యమవకపోవుటయుఁ గారణములు కానచ్చును. ఇంతియకాక గ్రామమునర్యాద లింకను సజీవములుగ నున్నందునఁ బల్లెటూళ్లసంఘము లేవేళ కైతు నాశ్రయించి కొంతవఱకు గౌరవముననే కాలముగడుపుచున్నారు.

ఆదిమాంధ్రులయందు ద్రాగుడు హెచ్చుటకు మార్గములనేకము కలవు. కులనిర్ణయము ననుసరించి ప్రతిశుభాశుభకార్యమునను వారు మద్యస్వీకారము నత్యంత ముఖ్యముగఁ బాటించుచున్నారు. పాణిగ్రహణమహోత్సవ సమయములయందుఁ బురుషుని వివాహమునకు 'సకాలురూక' యనుపేర నొకరూప్యమును, నాఁడుబిడ్డ పెండ్లికిఁ గలక్రొబాలు కానుక 'బాబులు'ను జేరి మొత్తమున దశమానమును, గృహపతులాదిమాంధ్రులలోని పెద్దల కొసఁగవలసిన కట్టడి గలదు. ఈపైకమున నొక కానియైన నిలువలేక యంతయు మద్యవ్యాపారికి ముట్టఁజెప్పి ప్రముఖులందఱు భాగములపంతునఁ దీర్ఘసేవనము గావింతురు. పంచములలో ఎల్లమ్మ భక్తులు. విషమసంఖ్యగల సంవత్సరములలో నాదేవతకు సాగుబోయుచున్నారు. ఒక క్రొత్తకడవ సురచే నింపి, పసపు కుంకుమములతో నాఘటముఁ బూజించి, గూడెమునఱకు దానిని సాగించి, యిష్టబంధువర్గముతో నిష్టాగోష్ఠి నందలి మద్యముఁ గ్రోలెదరు. త్రాగెడు నలవాటులేని బిడ్డలుగూడ నాతీర్థ మొకింతయినాఁ దలజల్లుకొనవలయును. ఊరజాతర సందర్భములలోఁ గుంభముపోయుట, చప్పరములు నిర్మించుట మున్నగు కార్యములకయి వచ్చెడు భాగధనమెల్లరకు సమానముగఁ జేరవలసి యుండుటచేత, నది ముఖ్యముగ కల్లుసారాలకే వినియోగింపఁబడుచున్నది. కులసంబంధ మగు తప్పు

పడినప్పుడు, పెద్దలు విధించుశిష్టాద్రవ్యభాగమింటింటికిఁ జెందవలయు నను నియమమున, దానిని సరకయియే వెచ్చించి, పిన్నలును, పెద్దలును సమముగ నందుఁ బాల్గొను చున్నారు. పురపారిశుద్ధ్యసంఘకార్యాలయములయందు వెట్టిపనులలోనుండు పంచములు వేతనములందిన దినము మొదలు వరుసగ రెండుమూఁడునాళ్ళు కల్లంగళ్ళు విడువరు. మద్య సేవాభిరతిచేఁ బెక్కండ్రు పనులకుఁగూడ వెళ్లరు.

## 2. సంఘముల తోడ్పాటు-పంచముల వెనుబాటు

పరిపాలకవర్గమును, స్థానికసంస్థలును, సేవాసంఘములను పంచముల పురోభివృద్ధినిసరించి మండలమున బాహుభంగుల శ్రద్ధవహించుచున్నవి. నిమ్నజాతుల విషయమునఁ బ్రత్యేకగ మనముగ్గి వారి కోఱికలను పరిశీలింపను త్వరితగతిఁ దీర్చుటకయి కార్మికశాఖయొకటి నియోగింపఁబడినది. పంచమబాలుర విద్యాభివృద్ధికొఱకు పాఠశాలలు విరివిగ సంస్థాపింపఁబడుచున్నవి. గ్రామపారిశుద్ధ్యసంఘములందును, స్థానిక, మాండలిక, రాష్ట్రీయసభలయందును వారికవకాశ మొసఁగబడుచున్నది. మఱియు వారియున్నతికి పలువు సమస్తసదుపాయములును గావింపఁబడుచున్నవి.

ఆదిమాంధ్రుల నున్నతికిఁ దేఁదగిన సాధనములలో విద్య ప్రధానమైనదనుట నిర్వివాదాంశము; కాని దానివలని ప్రయోజన మొకకొంత కాలముననే వ్యక్తమగునది కానందున, నాఁకటిపెల్లున నసురసురగుచున్న యీదరిద్రజాతియందది యంత ప్రోత్సాహసంజనకముగ వృద్ధినొందుచుండలేదు. తలిదండ్రులు చదువెఱుఁగనివారగుటచేఁ దమసంతతికి విద్యావిషయమున నేవిధమునను దోడ్పడఁజాలకుండుట యటుండఁ, వేళకుఁ బండి తీర్థములైన నమర్పలేకున్నారు. బాలురపఠనమున కావశ్యకములగు వస్తువుల నసలే తీసి యీయ నిచ్చగింపరు. రాత్రులయందు బాలకులు చదువుకొనుట కింటదీపములలోఁ జమురుండదు. ఆదిమాంధ్రుల బిడ్డలుగూడ క్షుధాతురు లగుటచే, విద్యార్జనమున సుస్పృహింపక వెనుబడుచున్నారు. ఆదిమాంధ్రవిద్యార్థులు పంచమేతరులను సగ్రవర్ణజులతోఁ గలసి విద్యాభ్యాస మొనర్చుటచేత, వారి వేషభాషాదులందుఁ గొంతవఱకు మార్పుగలుగుననుట నిస్సంశయము: కాని పంచమేతర పాఠశాలలయందున్న తకుల జు లాదిమాంధ్రసంతతి నభిమానభావముతోఁ జూచుట యరుదు. ఉత్తమవర్గమునకుఁ జెందిన యుపాధ్యాయులు కొందఱు పంచమవిద్యార్థులను గడ గంటఁగాంచురను వాదమునుఁ గొంత సత్యము లేకపోలేదు. అదికారణముగ సగ్రవర్ణమునకుఁ జేరిన సహపాఠులుగూడ నాదిమాంధ్రబాలకులను హేళనము గావించి, యుత్సాహభంగకరముగ మాటలాడెదరు; ఇట్టి భిన్నవ్యాపార మెంత కాలమో సాగనేరదని మన మెఱుఁగుదుము. అయిన నాదిమాంధ్రుల పెంపు పంచమేతర పాఠశాలలలో వారిని జేర్చుటయందు మాత్రమే యాధారపడియుండలేదు.

వివిధసంఘములయందు గౌరవసభ్యులుగఁ జేరుటవలన నసంతపురమండలము నందలి గర్భనరేంద్రులగు నాదిమాంధ్రుల కబ్బినది కీర్తిమేదియును లేదు. పలుదెగల మనుష్యులతోఁ గలసిమెలసి వర్తించుటచేఁ గొంతవఱకు వారినాగరకత పెంపొందుననుటతప్ప, పంచముల భుక్తిమార్గమున కది తోడ్పడకుండుట స్పష్టము. భుక్తికి సాధనము కాకపోవుట యటుండ,నది యొకవిధముగ వారినష్టమునకుఁగూడ హేతుభూత మగుననుట ప్రమాదకరవిషయముకాదు. ఈపదవుల సవిస్తార్యారి యని యబ్బుటవలనఁ దమ్ముఁ దామే మఱచి,కష్టపడిపనిచేయు సమర్థత యుండియుఁ గార్యములపట్టున ననాదరముచూపి,మిట్టపెత్తనములకు మరగి, ఉన్న బ్రతుకులనుగూడఁ బోఁగొట్టుకొని, కష్టములపాలైన యువకులు స్మృతిపథమునఁ దగులుచున్నారు. ఒకపంచమసోదరుఁ డొకానొక సాధారణసంఘమున గౌరవసభ్యపదముఁ బొంది కులవృత్తిలోఁ బ్రవేశింపనొల్లక, యందువలనఁ దనకు విధిగ రాఁదగిన రెండునందలకు మించిన వార్షికభృతిఁ గోల్పడి ఋణగ్రస్తుఁ డయ్యెను. మఱియొక సోదరుఁ డుద్యోగం బే మున్నతగౌరవాధికారము నాకాంక్షచేసి, మాసమునకుఁ బది రూపాయల రాఁబడిగల జీవనాధారమునంటి తన యుద్యోగమునకుఁ గనుపు గస్కురితిచే శాంతిచెప్పి, పిమ్మటఁ గుటుంబనిర్వహణము దుర్భరముకాఁగాఁ జిక్కులఁ బొందెను. ఎజేఁగినవారి నెల్లఁ బీడించుట, పలువురకు లొంగివర్తించుట, పుల్లవిఱుపుమాటలచేఁ గక్షలను బెంచుట యిట్టివారికి బ్రతుకు దెరువు లగుచున్నవి. ఈమండలమున నిట్టి స్థానములు విరివిగ నుండుటయు, నవి పంచమసోదరులకే లభ్యమగుటయు నెంతమాత్ర సంభవము కానేరదు. ఎచ్చటనో ప్రధాన పట్టణములయందు మాత్రమేయొకరిద్దఱికో యిట్టి యవకాశ మపురూపముగఁగాని లభింపదు. ఈకాలఁదిస్థానములకుఁగూడ నర్హులగు సోదరులరుదన, మండలమునందలి యాదిమాంధ్రులస్థితి యెంతవిచారకరముగ నుండునదియు నూహించుట సులభము. చదు వెఱుఁగనివారిలో దినమున కొక్కప్రొద్దుఁ గడుపార నింతగంజి త్రావఁగలవారి సంఖ్య యంత హెచ్చుగాదు. పెక్కుచోట్ల నాదిమాంధ్రులు రెండుమూఁడు దినములుగూడఁ దిండిలేక వాడి వత్తలగుచుండుట తటస్థించుచున్నదే. ఇఁక వ్రాయఁ జదువనేర్చినవార లెచ్చటనో స్వల్పసంఖ్యాకులుగ నున్నను వారందఱు నేదియో యొక యుద్యోగము నాశ్రయించి, తమ్మయ్య మున సంసారయాత్ర సాగించుటకు శ్రమనొందవలసినవారుగనే యున్నారు. తోళ్లు రంగాడుచెక్క- వ్యాపారములయందుఁ బ్రవేశించి, స్వతంత్రవృత్తితో జీవనము సాగించుకొనఁ దగుశక్తి వారికున్నను నిందుల కత్యవసరమగు మూలధనము సేకరించుట వారి కెంతమాత్రమును సులువుగాదు! కాన నీమండలమునందలి యాదిమాంధ్రుల స్వచ్ఛందజీవనోపాధికి వెరవుఁ గల్పింపఁజూచుట నాయకుల ముఖ్యవిధి యగుచున్నది.

## 3 అభివృద్ధిమార్గము

ఈవల నాదిమాంధ్రులలోఁ బ్రతికుటుంబమునను దలయొకటికి రెండేసి యెకరముల మెఱకనేల యొసఁగ నిశ్చయింపఁబడినటులు తెలియుచున్నది. ఈపద్ధతి చాలవఱకుఁ బ్రయోజనార్హమే; అయిన



నీలగిరి పత్రికా కార్యాలయము. నల్లగొండ



సీతారామాలయ సింహద్వారము, ధ్వజస్తంభము, పెదపాఱుపూడి



సీతారామాలయము, పెదపాఱుపూడి



పరబ్రహ్మానందాశ్రమము-బ్రహ్మవిద్యాసాధనాలయము

నిందును బంచముల పురోభివృద్ధినిగూర్చి శంకింపఁదగిన తర్కాంశమొకటి లేకపోలేదు. ఈమండలమున నిపుడెందును వ్యవసాయమునకర్హమగు నేలలు నిలువలో లేవనుట నిజము. ఇఁక మనపంచమ సోదరులకుఁ జెందనున్నవి పోరంబోకుభూములే. పోరంబోకులన కొండమాలిన సారవిహీనములగు మరుస్థలము లనుట వింతకాదు. అట్టి నిరుపయోగ ప్రదేశముల నెన్నింటిని గొన్నను మండలమునందలి యాదిమాంధ్రుని దారిద్ర్యము పాయఁజాలదు. వఱపునకుఁ దావలమయిన యీమండలప్రాణముల నిలువఁబెట్టఁ దలంచుచో, ముఖ్యముగ నిందు జలాధారములను విరివిగఁ గల్పించి, వానిఁ బెంపొందించుట ప్రధానకర్తవ్యమను భావము మావఱకే పెద్దలలోఁ బ్రబలతమముగఁ గలదు. ఏఁటేఁట నెందులకు నుపకరింపక నిరర్థకముగ మున్నీటి పాలగుచుండు నేటినీటి నీప్రాంతములకుఁ ద్రిప్పి మండల వ్యవసాయాభివృద్ధి కాదరువు గల్గించుటకన్న మండలాభివృద్ధికి మార్గాంతరము లేదు. వ్యవసాయము భారతమాతకే వెన్నెముక యనుట నది పెంపు వహింపనిచో మండలసౌభాగ్య మింపు నింపనేరదు. భారతప్రపంచమునకుఁ బ్రాణతుల్యుఁడగు పంటకాఁపు లేమి లోకదారిద్ర్యమూలముగాక మఱేమి? ఈమండలమందలి యాదిమాంధ్రుని వృద్ధి తరతరములుగఁ బంటకాఁపువశమున నుండినదనుట యతిశయోక్తి కానేరదు. పంటకాపు సేద్యపుబ్రదుకు ప్రశస్తదశయందున్నంతకాలము మూఁడుపూవు లాఱుకాయలుగఁ, బంచముఁడే పంటకాఁపట్లు ముప్పొద్దులఁ గడుపార భుజించుచు నాఁకలియెట్టిదో యెఱుఁగక, పేదఱికమనునది తెలియక, యఱచేతినిమ్మపండువలె నుండెను. వఱపువలన వ్యవసాయ మంతరించుటయు, దానితోఁ బంటకాఁపు భగ్నహృదయుఁ డగుటయు, నాహేతువున మండలమున పీఁటపెట్టుటయు, నందుచే నాదిమాంధ్రునివృద్ధి సన్నగిలుటయు సంభవమయ్యెను. వ్యవసాయార్హములై ప్రశస్తతములైన నేలలు వందలకొలఁది యెకరములు బీడుపెట్టుకొని, యందువలనఁ గాసువీసమేని ప్రయోజనము గానకుండుట యటుండఁ, బన్నులనొసఁగెడు ప్రయాససహితము పైకొన భూస్వాములే యెందఱో యలజడి నొందుచుండ, నెట్టి యాదరువును లేని తుంగరైనను మొలవని యూషరక్షేత్రముల నెన్నింటిని గైవస మొనర్చికొనినను, బంచముఁ డందువలన మూటగట్టుకొనున దేమియు నుండఁజాలదు. అట్టి నేలలకుఁ బ్రప్రథమమున జలాధారములను గల్పింపఁ బ్రయత్నించుట నాయకుల ప్రధానవిధి. ఆభూములను సేద్యమున కర్హమగురీతి నొనర్చుకొని, తన్మూలమునఁ జాలినంత ద్రవ్యోపపత్తిని బొందుదనుక తకాలినుండి వడ్డిలేకయో స్వల్పమైన వడ్డిపైననో ఋణ మిప్పించి, యాదైన్యవిచారపరులఁ గార్యావలంబులనుగ నొనర్చుట యనంతరము కాఁదగినది. ఇదిరైన నొక్కపెట్టున నాదిమాంధ్రుని వశ మొనర్చుటయు మేలుగాదు. ఒక్కొకయూరను బరోపకారార్థం భగల గ్రామపంచాయతీ సంఘమొకటి యుండనేయుండునుగదా ! సహాయ ధన మాసమాజవశమున నునిచి, యాదిమాంధ్రుల కార్యసౌకర్యము ననుసరించి వారికై దానిని వినియోగించు విధమున నాసంఘమువారి తోడ్పాటున నాదిమాంధ్రులకృషిని బెంపొందింపఁ దివురుట నాయకుల ధర్మము.

## 4. నాయకుల కర్తవ్యకార్యములు

చర్మకారకకర్మయం దాసక్తహృదయులగు యువకులను స్థలాంతరములకుఁ బంపి, వివిధములగు కరశిల్పములయందు వారలఁ గుశలురుగ నొనర్చి, యాజాతిసోదరుల కులవృత్తికిఁ బోషణము గల్గింపవలసియున్నది. వ్యవసాయమునకుఁ దరువాత మానవజాతిపురోభివృద్ధిని గాపాడునది వాణిజ్యమే; కావున నెముకలు, తోళ్ళు, తంగెడుచెక్క మొదలగు లాభకరములైన యనుకూల వ్యాపారములయందుఁ బంచమజాతి కభిరుచిఁ గొల్పుట యుక్తము. అందులకుఁ దగిన విధమునఁ బరపతిసంఘములు పాటుపడునట్లు చూచుట యవసరము. బాటలు చక్కఁజేయుట, బావులు త్రవ్వించుట, కుంటలు గట్టించుట, ప్రభుత్వమువారి కట్టడములు నిర్మించుట, మొదలగు ప్రజాహితకర కైంకర్యములయందుఁ, జిన్నచిన్నగఁ బంచములకుఁ బ్రవేశము గల్గించి, యావిషయమున వారికిఁ గేలూఁత యొసఁగుట యొప్పును. పంచమబాలికా బాలకులలో యథాక్రమమున నొకవంక విద్యను సాగించుటయు, పగలు తీఱుబడిలేని యువకులకు రాత్రిపాఠశాలలు స్థాపింపఁబూనుటయు నాయకులవిధి. విద్యతోఁగూడఁ బంచముల చేతిపనులకుఁ బ్రోదివెట్టఁదగును. బాలురకు నేఁతయు, బాలికలకు వడుకుటయు, గృహావితరణాదికములును గఱపఁబూనుట యుక్తము. ముఖ్యముగ మండలభాగములలోని ప్రధానపట్టణములయందెల్లఁ బంచమవిద్యార్థుల కుచితభోజన వసతిగృహములఁ గల్పింపవలయును. ఈక్రియాకలాపములతోఁగూడ నన్నింటికంటె నవసరముగను, నత్యంతావశ్యకముగను నాజాతియందలి పిన్నపెద్దలలోఁ జక్కఁగఁ బాదుకొనియున్న మద్యపాన దురభ్యాస మహామహీరుహమును గూఁకటివ్రేళ్లతోఁ బెల్లగించుటకయి వలయుప్రయత్నముల నన్నింటిని గావింపఁదివురుట లెస్స. ధర్మవరప్రాంతమునందలి పంచములు కల్లుద్రావకుండఁ గట్టుదిట్టము లేర్పఱుచుకొనిరిగాని, కొంతకాలమునకే యది యజగరోపవాసము ననుసరించెను. ఆ పెనుభూతము వీడనంతవఱకుఁ బంచముల శ్రేయము నాసించి చేసెడుసర్వప్రయత్నములను బూదిలోని హోమమువలెఁ బరిణమింపక తీఱదు. అట్లగుచోఁ జివర కాదిమాంధ్రుల యున్నతి గగనకుసుమమే యగును. ఈకీలక మెఱిఁగి వర్తించి పంచములను బతనదశనుండి తొలఁగించి నాయకులు వారి నుద్ధరింతురుగాక !

# గొలుసుల బొమ్మ

వడ్డాది సుబ్బారాయఁడు గారు

ప్రభవశ్రావణ శుద్ధపంచమికి మత్త్స్వాయంపువర్షంబు లో
యభవా! డెబ్బదిమూఁడు నిండె భవదీయావ్యాజదీవ్యద్దయన్;
విభవాదుల్ మఱికొన్ని భక్తునకుఁ జూపింపం దలంపేని, నా
ప్రభువా! నల్పు దృఢాంగు; నిల్పు నిజసేవన్, భక్తచింతామణీ!

మేలుం గీడు ఘటించెద-వేలో వంతుమెయి; నెదెపు డెట నెటొ తెలియం
జాలము; వేకువ దేవా-తే లఱకా ల్గుట్టె మేడ దిగి నడ నడవన్.

నరములబలహీనత కీ-వలువాతను దేలువిసము పరహాపధమా?
మొఱవెట్టఁ గొండిసూచిక-నఱకాలను గ్రుచ్చితివి శివా! భవవైద్యా!

ఆపద నేరికేనిఁ దరమా మరలించుకొనన్ స్వశక్తిచే?
నోపరమేశ! లేదు వెర వొక్కఁడు నీనియమంబు మీఱఁగా;
దీపము చేతఁ బట్టుకొని తేలుపయిన్ దెలవాఱుజామునన్
నాపద మాని తద్విషమునం బగలున్ రెయి బాధఁ బొందితిన్.

ధరణి యొకసారి గిఱ్ఱునఁ-దిరుగకమును విషపుబాధ తిరుగదు మణి మం
తరమున మందున మాఁకునఁ-గొఱవిం జూఁడినటు తేలు గుట్టిన నొవ్వన్.

చెప్పుల నడచుచు నొక్కఁడు-సప్పమెగసి జంఘఁ గఱవ జామునఁ జచ్చెన్
ముప్పులరాకడ నెవ్వఁడు-దప్పించుకొనంగలండు తన వెరవులచేన్?

కేలును గాలు నొల్లు మహికిన్ మఱి దేనికిఁ దాఁకకుండఁగా
గాలిని నాకసంబునఁ బగల్ నిసి సంచరణం బొనర్తుమా?
తే లెట దాఁగునో ముణిఁగి దీనిని గృహ్యముఁ జేసె స్రష్ట హా!
యేలొకొ; యింటిదొంగ నలయీశుఁడుఁ బట్టఁగ లేఁ డటంద్రుగా!

మెయిఁ జొరఁ బాఱినంతన యమేయదురత్యయవేదనాకరం
బయిన విషానలంబు తనయం దెపు డుండెడు వృశ్చికం బెటుల్
సయిచునొ బాధ నాఁ జనదు, సాజము గావున దాని కద్ది; య
ట్లయిన నెటుల్ మనన్ జనుల ప్రాణము దీయుగరాగ్ని సర్పముల్.

గొల్లున నేడ్చుచుండఁ గనుఁ గొందుముగా ప్రజఁ దేలు గుట్టినన్;
గల్లయొ నిక్కమో చెవులెకాని యెఱుంగవు కన్ను లెన్నఁడున్
"జిల్లులువోవు బిందెలును జెంబులు" నం "డ్రొక వెండ్రు కూడెడుం
బిల్లికి నేమి దద్విషము వేదన సేయ" దటందు రెందఱో.

గోడమీఁదిబొమ్మ, గొలుసులబొమ్మ, వ-డ్డించుబొమ్మ యని పొడిచెడుకట్టు
కథకు నర్థమైన ఘాతుకప్రాణిని-దలఁచుకొన్న నొడలు జలదరించు.

---

# పూర్వ వాణిజ్యము

కిలాంబి రంగాచార్యులు గారు, యమ్.ఏ., బి.యల్., గర్భాం అప్పారావు గారు, బి. ఏ.

౧



సముద్రము ఋగ్వేదకాలమునాఁటి యార్యులకుఁ దెలియునా, తెలియదా యను విషయముం గూర్చి విద్వాంసులు విభిన్నాభిప్రాయులై యున్నారు. ఓడలు ప్రయాణముచేయు సముద్రమార్గములు (సు-ముద్రియాః) వరుణునకుఁ దెలియు నని ఋగ్వేదము(1-25-7)లోఁ జెప్పఁబడి యున్నది. (1-56-2) ఋగ్వేదములో వణిజులయొక్క వ్యాపారసందర్భమున సముద్రము చెప్పఁబడి యున్నది. వరుణుని యొక్కయు, వసిష్ఠుని యొక్కయుఁ బ్రయాణ వర్ణనలో సముద్రమును, నావయుఁ జెప్పఁబడి యున్నవి. (R. vii 88.3-4).తుగ్రకుమారుఁడైన భుజ్యుఁడు జనకునిచే శత్రుజయార్థము పంపఁబడి సముద్రమధ్యమునం దున్నపు డతనినౌకలు వ్రక్కలై యతఁడును అతనిసైనికులును బ్రాణహానిఁ జెందనుండిరి. అపుడు భుజ్యుఁ డశ్వినీ దేవతలఁ బ్రార్థించెను. అంత నశ్వినీదేవతలు సైన్యముతోఁ గూడ భుజ్యుని రక్షించిరని ఋగ్వేదగాథ యొకటి కలదు. మఱియు నీయశ్వినీదేవతలే వంద తెడ్లుగల తమయోడపై నీభుజ్యు నింటికిఁ బంపినారని చెప్పఁబడి యున్నది. (R. i. 116, 3-5)

సిరియా, సుమేరియా దేశములలో నీ నడుమఁ బురాణవస్తు శాస్త్రజ్ఞులు ప్రేతస్థానములు మున్నగువాని యందుఁ గన్గొనిన ముద్రాదికములపై ఋగ్వేదాది మంత్ర కర్తలగు ఋషులనామము లుండుటంబట్టియు, నీజిప్టుదేశమునందు సంగ్రహింపఁబడియున్న ప్రేతవస్త్రములు కొన్ని నీలిరంగుగల వగుటచేతను, నీజిప్టురాజ్ఞియగు హాత్సెప్సిటు కాలములో భారతదేశమునందలి చందనము నీజిప్టు దేశమునకుఁ దెప్పించుకొనియుండుటచేతను, ఉరా ప్రదేశమందలి చంద్రదేవతాలయ నిర్మాణమునందు హిందూదేశపు టేకుపయోగింపఁబడుటచేతను, వేదకాలము నుండియు భారతదేశమునకును, నీజిప్టుమున్నగు దేశములకును వర్తకము జరుగుచునేయుండెడిదని మన మూహింపవచ్చును.

౨

బూలరుదొరవారు భారతదేశీయాక్షర సంజ్ఞలు అస్సిరియాదేశ సంబంధమైన తోలముపై నుండు సంజ్ఞలతోడను, క్రీస్తుజననమునకుఁ బూర్వ మేడెనిమిదితొమ్మిది శతాబ్దములనాఁటి మేషశాసనములందలి కొన్ని యక్షరములతోడనుసరిపోవుచున్నవని కనుఁగొనిరి. కెన్నెడిదొరవారు (1898 వ సంవత్సరములో జర్నలు ఆఫ్ది రాయలు ఏషియాటిక్కు సొసైటీలో) సుమేరియా, సిరియా దేశములకును, భారతదేశమునకును క్రీస్తు జననమునకుఁ బూర్వ మేడవశతాబ్దములో మిక్కుటముగ వ్యాపారములు జరుగుచుండెడివని కనుపఱచిరి. పాణినీయ సూత్రములంబట్టి ద్వీపాంతరవాసులతో భారతీయులు వాణిజ్యముం జేయుచుండెడివారని నిశ్చయమగుచున్నది.

యవనులు మున్నగువారి వ్రాఁతలలోఁ గూడ భారతదేశమునకును, దదితర దేశములకును మిక్కిలి ప్రాచీనకాలమున విస్తారముగ వాణిజ్యము జరుగుచుండెడి దని తెలియఁజేయు విషయము లున్న వని విద్వాంసులు చెప్పుచున్నారు. హోమరను యవనకవివరుఁడు 'టిన్' అనులోహమునకు 'కస్సిటేరాస్' అనుపదమును వాడెను.

ఈలోహమునకే సంస్కృతభాషలో 'కస్తిర' అని పేరు. క్రైస్తవవేదముయొక్క ప్రథమఖండములో (Old Testament: Kings) రాజులంగూర్చి చెప్పెడు భాగములో సోలమనురాజుయొక్క నావలు, ఆఫిరు దేశమునుండి కొనివచ్చెడు వస్తువులలో తుఖిమ్ (మయూరము), కోఫ్ (మర్కటము), షెన్హాబ్బిమ్ (దంతము) అనునవి ముఖ్యముగఁ బేర్కొనఁబడుచున్నవి. తమిళభాషలో మయూరమునకు లూకి యని యందురు. సంస్కృతమున శిఖి యందురు. కోతికి సంస్కృతమునఁ గపియందురు. పైఁ జెప్పఁబడిన పదములు హీబ్రూభాషకుఁ జెందకుండుటచే 'ఒఫిల్' అను దేశము హిందూదేశముయొక్క పశ్చిమభాగమున నుండెడి యరేబియా మండలమై యుండి యుండుననియును, దత్పూర్వకాలములో భారతదేశమునకును, బాబిలోనియా మున్నగు దేశములకును మిక్కుటముగ వాణిజ్యము జరుగుచుండెడి దనియును విద్వాంసులు చెప్పుచున్నారు.

స్మృతులు చూచిన, బోధాయన ధర్మసూత్రముత్తర హిందూదేశ వాస్తవ్యుల దురాచారములలో సముద్రయానమును బేర్కొనుచున్నది. ఇఁక బౌద్ధగ్రంథములం బరికించినచో జాతకకథలలో ననేక స్థలములందు సముద్రయానము పేర్కొనఁ బడుచున్నది. బవేరు జాతకములో బవేరుపట్టణమునకు నౌకలపై వర్తకులు పోవుచుండిరని చెప్పఁబడినది. బవేరుపట్టణము బాబిలానుపట్టణమనియే విద్వాంసు లూహించుచున్నారు. వాలహాస్సజాతకమునఁ దాంబపన్నికి నోడలపై వర్తకులు పోవుచుండినట్లు చెప్పఁబడినది. లొశక, శిలానిసమ్స, ధమ్మద్ధజ, పండర మున్నగు జాతకకథలలో సముద్రయానముఁ జేయువారు పడుకష్టములును, నావలు బ్రద్దలై చావు తప్పి ప్రాణములతో నొడ్డునఁ జేరినవారి యిడుములును బరిస్ఫుటముగ నభివర్ణింపఁబడుటచే నట్టివానిం గేవల కల్పితములని త్రోసిపుచ్చఁజాలము. మఱియు నీ జాతక కథలలోఁ జెప్పఁబడిననావలు ఘనమైనవి. సముద్దవణిజ జాతకములో నొక నావయందే వేయిమంది రథకారులు ప్రయాణమై పోయినట్లుచెప్పఁబడినది. శంఖజాతక కథలో నెనిమిదివందలమూరలు పొడవుగల యోడ పేర్కొనఁబడినది.

బవేరు, ధమ్మద్ధజజాతకములలో సముద్ర మధ్యమున నోడ యుండునపు డోడనడుపువారు భూమియుండు దిక్కుఁ దెలిసికొనలేక కాకములను విడిచిపెట్టి, యవి పోవుమార్గముంబట్టి నావను నడిపి యొడ్డుచేరుచుండెడివారని చెప్పఁబడినది. మఱియు దిఙ్నిర్ణయకయంత్ర మెచ్చోటను బేర్కొనఁబడలేదు. ఈ సముద్రపు వర్తకులలో గొంద ఱొడ్డునంటిపోవుచు వాణిజ్యముం జేయుచుండెడివారనియుఁ, గొందఱు సముద్రమునుదాఁటి దూరస్థదేశములకుంబోయి వర్తకముం జేయుచుండెడివారనియు మన మూహింపవలయును. గంభీరపట్టణ, భరుకచ్ఛ, రోరుక, సుప్పారక, కావేరీపట్టణ మున్నగు నౌకాశయస్థానములు కొన్ని జాతకకథలలోఁ బేర్కొనఁబడుచున్నవి.

## 3

క్రీస్తుజననమునకుఁబూర్వ మైదాఱువందల సంవత్సరములనాటి గ్రంథములంబట్టి చూడ ధైర్యశాలులగు వర్తకులు బహువృషభశకటములపై వస్తువుల సేకరించుకొని భారతదేశపు వివిధభాగములకుం బోవుచు వ్యాపారము చేయుచుండెడివారని స్పష్టమగుచున్నది. ఇట్లు దేశములోనే వ్యాపారముంజేయు వర్తకులు చనుపలంగూర్చుకొని రాజబాటల ననుసరించి కాని, నదులమీఁద నోడలపైఁ బోయి కాని వర్తకముం జేయుచుండెడివారు. ఇట్టి చనుప లేనూఱు మొదలు వేయిశకటములవఱకుఁ గలిగియుండెడివని జాతకకథలలోఁ జెప్పఁబడినది. చనుపల నేర్పాటుచేసి వాణిజ్యముం జేయువర్తకులు తమలో నొక్కని ముఖ్యునిగ నియమించుకొనుచుండెడివారు. అట్టివాని పేరు సథవాహుఁడు. ఈరీతిని వ్యాపారముం జేయువారు బహుకష్టములకుఁ బాలగుచుండెడివారు. చనుపను సంరక్షించుటకై రక్షకభటు లున్నను జోరులవలన హాని కలుగుచుండెడిది. సట్టిగుల్మ జాతకములోఁ

జనుపలను గొల్లగొట్టెడి యైదువందలదొంగ లొకగ్రామ మున వసియించుచుండెడివారని చెప్పఁబడినది. చోరభయ మునకుఁ దోడు ఘోరమృగాక్రాంతములగు వనములవ లనను,నిర్జీరములగు నెడారులవలనను నిట్టివణిజులకు బాధ లు కలుగుచుండెడివి. విశాలములగు నెడారులలోఁ గర్ణధా రులు నక్షత్రములంబట్టి చనుపల నడుపుచుండెడివారని తెలియవచ్చుచున్నది. ఎడారులఁదాటవలసి వచ్చునపుడెండ వేఁడిమి మిక్కుటమగుటచే నట్టివారు ప్రయాణ మాపి విశ్ర మించి, రాత్రిసమయములోఁ బ్రయాణము సాగించిపోవు నాచార ముండెడిదఁట.

చనుపలు ముఖ్యపట్టణములలోను, వ్యాపారము మిక్కుటముగ జరుగుప్రదేశములలోను నాఁగుచుఁ గ్రయ విక్రయములను జేయుచుండెడివారని మన మూహింపఁద గును. ఇట్టి వ్యాపారస్థానములయందు వస్తుజాలములు సమీపస్థ ప్రదేశముల కమ్మకమునకుఁ గొంపోఁబడుచుండె డివి. ఇట్టి స్థానములు సంప్రవిభాగమూలస్థానములై వర్తి ల్లుచుండును.

దేశమునందుఁ బండుపంటలును, దయారుచేయఁబ డిన వస్తువులును నిగమములకుఁగాని, పట్టణములకుఁగాని గొంపోఁబడి యచట నమ్మఁబడుచుండును. వాణిజ్యస్థానము లకు నిగమములందురు.వస్తువులమూల్యము బేరమువలననే నిర్ణయింపఁ బడుచుండెడిది. అర్థశాస్త్రములందును, ధర్మ స్మృతులయందును, వస్తువులధరలు రాజులచే నిర్ణయింపఁ బడుచుండవలె నని చెప్పఁబడినను, జాతక కథలకాలము నాఁటికి మాత్రము (క్రీస్తుజననమునకుం బూర్వమాఱేడుశ తాబ్దములనాఁడు) అట్టినిర్ణయము లుండియుండ లేదు.

పట్టణంబులలో నాపణంబు లుండెడివి. వర్తకు లలో లావణికులు, శలాఁటుకులు నేకజాతివస్తుక్రయ విక్ర యములనే చేయుచుండెడివారని తెలియవచ్చుచున్నది. (పాణిని ౪౧-౪౮)వలె గాఁడిదలపై వస్తువులను వేసికొని వీథులం దిరుగుచుఁ దమతమవస్తువులను వర్తకులకమ్ముచుం డెడివారు. ఆపణంబులందు లేక పణ్యాగారములందు వివి ధవస్త్రములు, ధాన్యములు,పుష్పములు, సుగంధిద్రవ్య ము లు ము న్న గు వా ని న మ్ము చుం డె డి వా రు. బజారులలో రథము లు, బాణములు, కరవాలములుగూడ నమ్ముచుండెడివారు. పట్టణములలో సురాపాన గేహ ములు (కల్లుపాకలు),పూఁటకూటియిండ్లు, మిఠాయిదుకా ణములు నుండెడివి. (పణ్యాగార, ఔదనిక,పక్వమాంసిక). మేఁకలు మున్నగువానిం జంపి వాని మాంసముల నమ్ము టకై సూనగృహంబు లుండెడివి. (అర్థశాస్త్రము, రెండవ ఖండము: వినయ (i. 20, ii. 267). కూరలు, చేఁపలు మున్నగువానిం బురద్వారములం దుంచి యమ్ముచుండెడి వారు.

రాజసేవకులలో 'అర్ఘకారకుఁడు' అనువాఁడు రాజోపయోగార్థమైన వస్తువుల క్రయధనమును నిర్ణ యించుచుండెడివాఁడు. ఈయర్ఘకారకుఁడే స్వదేశవస్తువు లపై వానిమూల్యములలోఁ బంద్రెండవ వంతును, బర దేశాగతవస్తు ముఖ్యములలోఁ బదియవ వంతును గర ములుగ విధించి బలిప్రగ్రాహకులచే వసూలు చేయించు చుండెడివాఁడు. సుర, ద్రాక్షరసము మున్నగువానిపైఁ గరములు విధింపఁబడుచుండెడివి. అట్టివానిని వసూలు చేయువాఁడు గ్రామణికుఁడు.

గున్నేపల్లి అక్షయలింగము గారు

కౌరవాన్వయ దీపకళికవోలె జనించి - పెంపు గాంచిన గుణోపేతుఁ డగుట
చెలువారు కురురాజ్య సింహాసనమ్ము న-లంకరించు ప్రజానురాగి యగుట
అమిత దోర్బలులు భీష్మాదిమహాయోధు-లాప్త బాంధవులు, సహాయు లగుట
సకల రాజన్యమస్తక విభాసిత పద-ద్వయుఁడు పాండువిభుండు తమ్ముఁ డగుట
ఆంబికేయుని సంబంధ మన్నివిధుల-నర్హ్వతమ మంచు నెంచి నీయనుఁగుఁ దండ్రి
మెఱఁగియును బుట్టుగ్రుడ్డి కిం పెసఁగ నిన్నుఁ-బరిణయము చేసె సుబలభూవరకుమారి!

నయనానందము లేని రాజటనె! నానాథుండు మేలంచు న
ప్రియముల్ వల్కక తల్లిదండ్రులయెడన్ ప్రేమమ్ము నిండార వే
పయనంబైతివి హస్తినాపురికి నీభవ్యత్వముల్ లోకవి
స్మయకారిత్వ మహత్త్వముం బొరసి శశ్వత్కీర్తి సంధిల్లఁగన్.

ఎన్న సతీత్వసిద్ధి కిదియే తగవైన సుధర్మవృత్తి నాఁ
గన్నులఁ బట్టముం బఱచి గాఢతరాప్రతిమాన భక్తిసం
పన్నతఁ గాంచి భర్తృపదపద్మములన్ సతతమ్ముఁ గొల్చుచున్
జెన్నెసలార వర్తిలి ప్రసిద్ధి వహించితి వెంతధన్యవో?

ప్రకృతి సౌందర్యమును జూచు భాగ్యగరిమ-పతికి లేదంచు నీవును బడయవైతి
కనులు గల్గియు లేకున్నగతి మెలంగ-నెంతటి మనోబలమ్ము వహించి తమ్మ!

తనయుల నూర్వురం గని పదంపడి కూఁతును గాంచి యెన్నఁడున్
గనుఁగొనవైతి బిడ్డలను గన్నులఁ గట్టినకట్టు విప్పి యే
జనని సహింపఁగాఁ గలుగు సంతతి నిమ్మెయిఁ జూడ కుండ నీ
కెనయె సతీలలామలు మహీవలయమ్మున నెందుఁ జూచినన్.

పొలుపార నవమాసములు మోసి చిరతపః-ఫలము నాఁ బడసిన భవ్యమూర్తి
మూఁడుప్రొద్దులు నీకు మ్రొక్కునట్టిగుణాఢ్య-భానుమతీదేవి ప్రాణవిభుఁడు
అనుఁగునెచ్చెలికాని యసదు వాయఁగ నంగ-రాజుగాఁ జేసిన రాజరాజు
రాజ్యలక్ష్మీకరగ్రహణలోలత నొప్పు-త్రైలోక్యనుత మహాస్థైర్యఘనుఁడు
విజయమును గోరి తన్ను దీవింపు మనఁగఁ-బుత్రవాత్సల్యమును ద్రోసిపుచ్చి యస్పు!
ధర్మమే గెల్చునని చెప్పఁదగితి వమ్మ!-పుడమి నీవంటిధర్మ విస్ఫురిత గలదె?

భవ్య, లోకారాధ్యఁ, బరము, నురుక్రము-శపియింపఁ జాలిన సత్త్వగరిమ
ప్రేమారఁ గొడుకు శరీర మెల్లను వజ్ర-నిభముఁ జేసిన సమున్నిద్రశక్తి
యమసూతి, రాజసూయపవిత్రు పద నఖ-మ్ములను గందించిన యలఘుమహిమ
జరఠ చంద్రుని వెన్కఁ జనెడి చంద్రికపోల్కిఁ-బతితోడ నడవి వెంబడిన ఘనత
వెలుఁగులై నేతుశీతపృథ్వీధరాంత-రమున నీపుణ్యభూమి సంతమస మెల్లఁ
బాపి యిల్లాండ్ర కెపుడు సౌభాగ్యలక్ష్మి-నోజఁ గూర్చుత! గాంధార రాజతనయ!

---

# అనంతవరతామ్రశాసనము

వేటూరి ప్రభాకరశాస్త్రి గారు

ఈశాసనము రాగిరేకు లిప్పుడు గానరావు. సర్వేయర్ జనరల్ మెకంజీదొరగారియొద్ద నుద్యోగిగానున్న 'మల్లయ' క్రీ. 1811 సం. డిసెంబరు 16 వ తేదిని రాగిరేకులనుజూచి మూలముప్రతి వ్రాసికొనివచ్చినాఁడు. ఆప్రతి ప్రాచ్యలిఖితపుస్తకశాలలోనున్నది. దానినిబట్టి నేనీశాసనమును బ్రకటించుచున్నాఁడను. అనంతవరములో నేఁ డారాగిరేకులు దొరకునేమో యని యక్కడివారి నడిగితిని గాని యెవ్వరును నున్నట్టుచెప్పలేదు. అప్పుడున్న యారేకు లీనూటపదునేడేండ్లలో నెప్పుడో యెందుక్రిందనో మాఱియుండవచ్చును.

## శాసన గౌరవము

రెడ్డిరాజులతర్వాత నోడ్డరాజులు తెలుఁగుదేశమును గొంతకాలము పరిపాలించిరి. కాని నే నెఱిఁగినంతలో నేఁడు చరిత్రములు వ్రాసి ప్రకటించినవా రాయొడ్డెరాజుల పరిపాలనమును గూర్చి విపులముగా పరిశోధనము జరపలేదు. వారిశాసనములుగూడ నెక్కువగా దొరకలేదు. కీర్తిశేషులయిన బుక్కపట్టణము రాఘవాచార్యులుగారు మాత్రము కొంచెముగాఁ దమ యాంధ్రదేశచరిత్రలో * వీరినిగూర్చి చర్చించిరి. శ్రీకృష్ణదేవరాయలవారిచేఁ బరాజితుఁడై తనకుమార్తె నారాజేంద్రున

---

* ఈగ్రంథ మముద్రితము. ఈరాఘవాచార్యులుగా రించుమించుగా నిరువదియేండ్లక్రింద కీర్తిశేషులయిరి. బోర్డుమెంబరగు కార్మైకేల్ దొరగారి ప్రాపున వీరు పెక్కుశాసనములను బరిశోధించి యాంధ్రదేశచరిత్రను గొన్ని వాల్యములుగా వ్రాసిరి. అందుఁ గొన్ని వాల్యములను మద్రాసులో నున్న యాదొరగారికిఁ బంపినట్లు తెలియును. దొరవారా గ్రంథములను సరిగా సంరక్షింపకపోయియుందురు. మన్మిత్రులు మా. రామకృష్ణకవిగారు పెక్కువత్సరములకుముందు గుజిలీపుస్తకములయంగళ్ళలో వ్రాఁతప్రతులను శాసనచరిత్రవిషయములతోనున్నవానినిజూచి కొంతసొమ్మిచ్చి కొనిరట! కాకతీయులనుగూర్చి వ్రాసినభాగము వారిదగ్గఱఁ గలదట! మఱొకపట్టు చరిత్రలో వ్రాసిన విషయములకు ఆకరములయిన శాసనములు గొన్ని గలవి. అట్టివి శ్రీకవిగారు నాకు ఎరవుగా ఒసఁగిరి. వారు నాకొసఁగిన వ్రాఁతప్రతికాగితములు మిక్కిలి నిస్సారములై చూర్ణములైపోయినవి. అందలిశాసనము లనేకము లిటీవల ప్రకటితము లయినవే. క్రొత్తవిగాఁ దోఁచినవి కవిగారుగాని, వారియనుమతిని నేనుగాని ప్రకటింతుము. ఇది యిట్లుండె. నే నే డెనిమిదేండ్లక్రింద గుంటూరుజిల్లాటూరులో నుండఁగా నర్సారావుపేటలోను, పొన్నూరిలోను గ్రంథకర్తయగు శ్రీరాఘవాచార్యులవారికుటుంబమువారిని యాదృచ్ఛికముగాఁ దెలిసికొనఁగల్గితిని. వారిదత్తపుత్రులు తమయింటఁ బొడిపొడియై చెడిపోయి యొకవాల్యము పెంటపాలుకాఁగాఁ దత్తుల్యదశలోనున్న వేఱొకవాల్యమును నాకుఁ జూపిరి. కార్మైకేల్ దొరగారికిఁ బంపినవాల్యముల ప్రత్యంతరములుగాఁబోలును వారియింట నున్నవి. నేఁడు క్రొత్తవిగా నపేక్షింపఁదగిన విషయము లనేకములు లేకున్నను, నేఁటి చరిత్రకారు లెవ్వరును దలయెత్తక పూర్వము అనన్యసాధారణమయిన పరిశ్రమచేసిన మహనీయుని గ్రంథమని కన్నుల కద్దుకొని పెద్దలయస్థులఁబోలె నాచినిఁగిన తునుకలకట్టను ప్రాచ్యలిఖితపుస్తకశాలకుఁ జేర్చితిని. అంతగానింగ్లీషురాని యావిద్వాంసుని యట్టిపరిశ్రమచేఁ బరితోషితుఁడై కార్మైకేల్ దొరగా రాయనకు ఫస్టుక్లాస్ రివిన్యూ ఇన్‌స్పెక్టరుపదమునుండి సబ్ మేజస్ట్రీటు ఉద్యోగము నిప్పించిరి. ఈయాచార్యులుగా రిట్టి చరిత్రరచనమే కాక కువలయాశ్వవిజయమని ప్రశస్తమయిన తెలుఁగుప్రబంధమునుగూడ రచియించిరి. దానినిగూడ ప్రాచ్యలిఖితపుస్తకశాలకుఁ జేర్చితిని. మాసిపోవనున్న మహనీయుని పరిశ్రమను బయల్పఱుపఁగల్గినందుకు సంతోషించితిని. కాని యామహనీయుఁడు సేకరించియుంచిన తామ్రశాసనము లిందుమించు 10, 15 అపరిశీలితములుగా వారి యాఁడుపారు కాఁగులక్రిందను, గంగాళములక్రిందను మార్పించిరని తెలిసికొని వారిపుత్రులును, నేనును వగవవలసినవార మయితిమి.

కర్పించి శరణాగతుఁ డయినవాఁడు, తెలుఁగుదేశమును బాలించిన యొడ్డెరాజులలోఁ గడపటివాఁడు నగు ప్రతాప రుద్ర గజపతిది యీశాసనము. ఈరాజుశాసనము లింత వఱకు రెండుమూఁడు మాత్రమే దొరకెను. అందు విశేషవిషయము లంతగా లేవు. అవి యును ముద్రితములు గాలేదు. ఈశాసన మన్నింటికంటె గొప్పది; అపూర్వవిషయములు గలది. కాన దీనిఁ బ్రకటించుచున్నాఁడను. అపూర్వవిషయము లేవో యిఁకఁ దెలియఁ గలవు.

## అర్థసంగ్రహము

వరాహహేరంబసింహాద్రినృసింహులు ముగ్వురు మూఁడుశ్లోకములలో స్తుతింపఁబడిరి. 4. సూర్యప్రశంస. 5. ఆ(సూర్యుని)వంశమునఁ బరాక్రమశాలి యైనవాఁడు కపిలేశ్వరుఁ డనురాజు జన్మించెను. 6. ఎప్పుడును దానము లొసఁగుచుండు నీగజపతిని లోకులు సింహాసనవర్తులగు మూగురురాజులలోఁ బుణ్యవదగ్రగణ్యుఁ డని పేర్కొనుచుందురు. 7. ఈతఁడు అనేకాగ్రహారముల నొసఁగెను. 8. ఈతఁడు బలాత్కరించి కర్ణాటరాజధాని యైన విద్యానగరిని తనసేనలతో నరికట్టి సమున్నతమయిన మానమునుబోలె హెచ్చుపన్నును గైకొనెను. 9. ఆతనియానతిచొప్పున కుమారహంవీరవిభుఁడు దక్షిణదిక్కును జయించి శత్రురక్తసిక్తమయిన తనఖడ్గమును దక్షిణసముద్రోదకములందుఁ గడిగెను. 10. ఉత్కళదేశనాయకుఁడగు నాతఁడు (కపిలేశ్వరుఁడు) దిగంతసామంతకిరీటమాలికామణిద్యుతిద్యోతితపాదుఁడై కటకము రాజధానిగా రాజ్యమేలెను. 11. ఆతనికిఁ బురుషోత్తముఁడు కుమారుఁడు. ఆతనియెడ వసుంధర పతివ్రతాధర్మము నెఱపెను. 12. ఆతఁడు మహాదాత. 13. ఆతని ప్రతాపాగ్ని జ్వాలయో యనునట్లు కుసుంభవర్ణము గలది ధ్వజపటము కానరాఁగా, శత్రువులు చిదికిపోవుచుండువారు. కర్ణాటదేశాధిపుఁడయిన నరసింహరాజు అభయయాచనాంజలితో ఉదయగిరి నర్పించుకొని తనప్రాణములఁ గాచుకొనెను. 14. ఆతనిధాటిని విన్నంతనే శత్రురాజు లడవులపా లగుచుండెడివారు. 15. ఆతనికి ప్రతాపరుద్రుఁడని కుమారుఁడు జన్మించెను. 16. అమాత్యులచే అభిషేకాది సత్క్రియలఁ బడసి వృద్ధి పొంది యీతఁడు తండ్రికిఁ దర్వాత రాజ్యమేలెను. 17. ఆతఁడు యుద్ధమందు కాలరుద్రుఁడని, దానమందు కల్పవృక్షమని, సకలజనరంజనమందు చంద్రుఁడని, సౌందర్యమందు మన్మథుఁడని, విద్యలందు బ్రహ్మయని తలఁపఁబడుచుండును. 18. ఆతఁడు కర్ణాటాంగవిదర్భతురుష్కరాజులకు వెఱపుగొలుపు వాఁడుగా నుండెను. 19. ఆతఁడు సేనాసమేతుఁడై దక్షిణదిగ్జయార్థము దాడివెడలి కృష్ణాతీరమును జేరి బ్రాహ్మణులకు భూదానము చేయ నుద్దేశించెను. 20. 1422 అగు శకాబ్దమందు రౌద్రివత్సరమున కార్తికమాసమున (పూర్ణిమా) గురువారమునాఁడు చంద్రగ్రహణపుణ్యకాలమున శ్రీవీరరుద్రగజపతి కృష్ణానదీపశ్చిమతీరమున సస్యశ్రీయుతమై విరాజిల్లుచున్న యాతుమూఁడియను నగ్రహార తిలకమును బ్రాహ్మణులకు దానముచేసెను. 21. సర్వవిద్యావిశారదులయిన బ్రాహ్మణులతోనున్న యాతుమూఁడియగ్రహారము నూటయిర్వైయెని మిది భాగములుగా విభాగింపఁబడినది. 22. వృత్తిమంతుల గోత్రనామములు చెప్పఁబడినవి. ఉత్తరవీథి నారంభించి తూర్పువీథినుండి ప్రదక్షిణక్రమముగాఁ జూడవలెను. తరువాత భాగస్వాములగోత్రనామములు, భాగసంఖ్య, సీమాచిహ్నములు గలవు.

## దత్తాగ్రహారము

ఆతుమూఁడి అనఁగా, తెనాలితాలూకాలోని అనంతవరమే. మెకంజీదొరగారి లోకల్ రికార్డువాల్యంలో, "ఆతుమూఁడి ప్రతినామధేయమయిన అనంతవర" మని వ్రాఁత కలదు. మఱియు, నీశాసనమునఁ జెప్పఁబడిన యెల్లలు నేఁడును నావ్యవహారముతోనే కలవు. అవి తెనాలి తాలూకాలో కృష్ణాతీరమున విద్వద్బ్రాహ్మణ భరితమయిన గొప్పగ్రామముగా వెలయుచున్న 'అనంతరవము'

# అజంతా చిత్రములు ॥

కో. నరసింహాచారి గారు



౧. అలంకార వైఖరి-ఒకటవ గుహాలయమునందలి చిత్రము

నకే చెల్లుచున్నవి. మఱియు నీశాసనమునఁ బ్రతిగ్రహీతలుగాఁ జెప్పఁబడినవారి వంశపరంపరలలోనివా రనఁదగినవారు బ్రాహ్మణులుగొంద ఱాగ్రామమున నేఁడునువసించుచున్నారు.

## చరిత్ర వివరణము

కళింగదేశాధీశ్వరులగు గాంగవంశ్యనృపాలురశాసనములు పెక్కులు దొరకియున్నవి. ఆరాజులకును నీశాసనమునఁ బ్రస్తుతులగు రాజులకును నేమేని సంబంధము కలదో లేదో నా కెఱుఁగరాలేదు. * ఈవంశపురాజులలోఁ దొలుతటిరాజుగాఁ దెలియవచ్చినవాఁ డీశాసనమునఁ దొలుతఁ బ్రస్తుతుఁడగు కపిలేశ్వరగజపతియే. కపిలేశ్వరుని వంశమున పూర్వు లెవరో, వా రెక్కడ నుండిరో నా కెఱుఁగరాలేదు. 'గజపతి గౌడేశ్వర నవకోటికర్ణాట కలుబరగీశ్వరు'లని సరస్వతీవిలాసమునను, గొన్ని శాసనములందును వీరిబిరుదావళి గానవచ్చును. ఈబిరుదావళి కపిలేశ్వరగజపతినాఁటికిఁ గలదనుట కాధారము గానరాదు. కపిలేశ్వరునినాఁటనుండియు వీరికి రాజధాని కటకము. నేఁ డది 'కటక్' అనియుచ్చారము గలిగి జగన్నాథక్షేత్రముచేరువ నున్నది. ప్రతాపరుద్రగజపతిరచితముగాఁ జెప్పఁబడియున్న సరస్వతీవిలాసమున వీరి వంశక్రమ మిట్లు గలదు:

కపిలేశ్వరగజపతి
| (భార్య పార్వతి)
పురుషోత్తమగజపతి
| (భార్య రూపాంబ)
ప్రతాపరుద్రగజపతి
| (భార్య పద్మాంబ?,మయి [లాంబ)
పురుషోత్తమ గజపతి

శాసనములఁ బరిశోధింపఁగా నీవంశమున మఱి కొందఱు పురుషు లెఱుఁగవచ్చుచున్నారు. గణదేవుని కొండవీటి తామ్రశాసనమున [1] నిట్లు గలదు.

కపిలేశ్వర గజపతి (వంశమున)
|
చంద్ర దేవుఁడు
|
గుహిదేవ పాత్రుఁడు
|
గాణమహీపతి

ఈశాసనమున వర్ణితు లగువారు కపిలేశ్వరగజపతి సంతానక్రమమువారో, జ్ఞాతివంశమువారో యని నా సంశయము. ఇందుఁ గడపటివాఁడగు గాణమహీపతి కపిలేశ్వరగజపతికిఁ బ్రతినిధిగాఁ గొండవీట నుండెను. మఱియు జక్కంపూడి శాసనమున [2] ప్రతాపకపిలేశ్వరదేవ మహారాయలకు అంబదేవ మహారాజని కొమారుఁ డున్నట్టు గాన నగును. ప్రతాపరుద్రగజపతికిఁ దిరుమలప్ప రాయఁడని పినతండ్రి యొక్కఁడున్నట్టును, ఆతఁడు కృష్ణరాయలచే శా. ౧౪౩౭ భావ జ్యేష్ఠ బ. ౨ నాఁడు పట్టుకొనఁబడినట్టును ఉదయగిరి శాసనమునఁ గలదు. ప్రతాపరుద్రుని కాతఁడు సరిగాఁ బినతండ్రియో, పినతండ్రి వరుసవాఁడో యెఱుఁగరాదు. సరస్వతీవిలాస మాతనిఁ బేర్కొనకుండుటచే నాతఁడు స్వయాన పినతండ్రి కాఁడేమో యని నా సందేహము. మఱియుఁ బ్రతాపరుద్ర గజపతికిఁ వీరభద్ర గజపతి యని కొడు కున్నట్టు శాసనములు తెలుపుచున్నవి. సరస్వతీవిలాస మాతనిఁ బేర్కొనలేదు. కాని ప్రతాప

---

* గంగవంశానుచరిత మను సంస్కృతచంపూగ్రంథమున నిట్లు గలదు: "గౌడగంగరాజు గజపతులను వెడలఁగొట్టి త త్సింహాసనమునఁ దాను గూర్చుండెను. తద్వంశక్రమము: రాజరాజేశ్వరుఁడు, అతిరఘుఁడు, కామదేవుఁడు, మదనకామదేవుఁడు, అనంగభీముఁడు, నృసింహుఁడు, (లాంగూలనృసింహుఁ డని నామాంతరము), భీమనృసింహుఁడు, పురుషోత్తముఁడు, కలినృసింహదేవుఁడు, అవటానృసింహదేవుఁడు, ప్రతాపనృసింహదేవుఁడు, నిశ్శంకభానుఁడు, వాతూలభానుఁడు, వీరభానుఁడు, రుచిరభానుఁడు, మధుపభానుఁడు, కజ్జలభానుఁడు-ఈతఁడు దిగ్జయమున కరిగియుండఁగా, కటకరాజధానిలో మంత్రులు కపిలేశ్వరు నభిషేకించిరి. ఆతఁడు గుడీరి (ఉదయగిరి?) కటకమున దాక్షిణాత్య రాజును దొలఁగఁద్రోలి అక్కడ రాజ్యముచేసెను—"దీనినిబట్టి గంగవంశపురాజులకును కపిలేశ్వరాదులకును సంబంధ మెట్టిదో నిశ్చయింపఁ గుదురదు. వారి కీవంశమువారు బంధువులేని, సేనాపతులేని, శత్రువులేని కాఁదగుదురు.

1. ఇది ఫ్లీట్దొరగారిచే 1891 సం॥ ఇండియన్ ఆంటిక్వరీలో ప్రకటితము.

2. ఈశాసన మముద్రితము. లోకలురికార్డు 15_5_37 వెం. సంపుటము పేజి 206 లోఁ గలదు. "మవుంజె జక్కంపూఁడి పరగణేమయిలవరం జక్కంపూఁడిగ్రామమునకు తూర్పున చెర్వు పడమర భూమిమీఁది శాసనం" అని కలదు.

రుద్ర గజపతికిఁ బురుషోత్తముఁ డని కొడుకున్నట్టందుఁ గలదు.[1] ప్రతాపరుద్రగజపతికి 'భద్ర' యను నామె కుమార్తెగలదు.[2] ఆమెను బ్రతాపరుద్రగజపతి శ్రీకృష్ణదేవరాయలవారి కొసఁగెను. ప్రతాపరుద్రగజపతికుమాళ్ల తర్వాతి వంశవృత్తాంతము నా కెఱుఁగ రాలేదు. ఆంధ్రదేశమునకు వారిసంబంధ మప్పటితోఁ దీఱిపోయినది. ఇప్పుడు పరామర్శించిన విధమున వీరివంశవృక్షమి ట్లేర్పడును:

కపిలేశ్వర గజపతి (భార్య పార్వతి)

పురుషోత్తమగజపతి — అంబదేవమహారాజు — తిరుమలప్ప రాయఁడు

పురుషోత్తమగజపతి → ప్రతాపరుద్రగజపతి

ప్రతాపరుద్రగజపతి → వీరభద్రగజపతి — పురుషోత్తమగజపతి — భద్రాంబ(కూఁతురు)

శక. ౧౦౫౭ గజపతివంశజుఁ డగు గణపతి గోపరాజు రామప్రధానునకు భూదాన మొసఁగినట్లును, బాలభాస్కరదేవుఁడని రా జప్పుడున్నట్టును కొన్ని వ్రాఁత ప్రతు లున్నవి.[3] సరస్వతీవిలాసమునుబట్టి, శాసనములను బట్టి మీఁదఁ జూపఁబడిన వంశముతో వారి కేమేని సంబంధము గలదో లేదో, అట్టివారు కలరో లేరో నేను నిర్ణయింపఁజాలకున్నాను. వీరు గాక లాంగూలగజపతి, బాహుబలేంద్ర గజపతి, హరిశ్చంద్ర గజపతి, విద్యాధర గజపతి మొదలగు గజపతులపేళ్లు కొన్ని శాసనములందును, దండకవిలెలందును, లోకలురికార్డులు మొదలగు వ్రాఁతవ్రాఁతలందును గానవచ్చుచున్నవి. వారిలోఁ నేను గుర్తింపఁగల్గినవారి నాయారాజుల ప్రసక్తిలోఁ దెల్పుదును.

## కపిలేశ్వరగజపతి

ఈతని రాజ్యారంభకాల మేదో నేను గుర్తింపఁజాలనయితిని. కటకము రాజధానిగా రాజ్యమేలుచు నీతఁడు క్రీ. 1455 కిఁ బూర్వమే కొండవీటిరాజ్యమును జయించి తనవంశమువాఁడగు గాణమహీపతి నక్కడఁ దన ప్రతినిధినిగా నిల్పెను. ఈతనికి శ్రీవీరగజపతి గౌడేశ్వరప్రతాప కపిలేశ్వరుఁడని జక్కంపూడిశాసనమున బిరుదుపేరున్నది. ప్రస్తుతశాసనమున నీతఁడు 'విద్యానగరము సరికట్టి విద్యానగరరాజు దగ్గఱనుండి పన్నుగొన్నాఁ'డని యున్నవిషయము క్రొత్తది. ఈవిషయ మన్యత్ర నా కెక్కడను గానరాలేదు. "ఈతనియాజ్ఞచేఁ గుమారహంవీరవిభుఁడు దక్షిణదిగ్జైత్రయాత్ర సాగించి శత్రురక్తసిక్తమగు తన ఖడ్గమును దక్షిణసముద్రోదకములందుఁ గడిగె"నని ప్రస్తుతశాసనమందే కలదుగాన విద్యానగర నిరోధాదిక మాకుమారహంవీరవిభుని జైత్రయాత్రలో జరగిన దయియుండును. కుమారహంవీరుఁ డనఁగాఁ (కపిలేశ్వరునికిఁ) గుమారుఁడగు హంవీరవిభుఁడని రాఘవాచార్యులుగారు వ్రాసిరి. ఇది యెంత విశ్వాస్యమో! శాసనములలోఁ గాని, సరస్వతీవిలాసమునఁగాని స్పష్టముగా నీవిషయము గానరాదు. కృష్ణదేవరాయఁడు కొండవీటిని బట్టుకొన్న

1. స్వయం పురుషోత్తమోఽపి పురుషోత్తమ తనయః, స్వయం పురుషోత్తమ తనయోఽపి పురుషోత్తమ జనకః, స్వయం పురుషోత్తమ జనకోఽపి పురుషోత్త మసేవకః. (సరస్వతీవిలాసము)

2. శ్లో. ప్రతాపరుద్రస్య గజేశ్వరస్య పుత్రీంపవిత్రీకృత భూతధాత్రీం, ప్రత్యగ్రహీద్యః ప్రకటప్రతాపో భద్రాంసుభద్రా మివపాండవేయః.
—తిమ్మరసు ప్రబోధచంద్రోదయవ్యాఖ్య.

3. ఈవని ఫాలాల్లో ఉండేశాసనము — అర్కసంఖ్యాక గోత్రాణాం విప్రాణాంచ మహాత్మనామ్। ద్విచత్వారింశ సంఖ్యానామూర్వీం గణపతి గ్దదౌ। ......... శ్రీమాన్ శకాబ్దే రసబాణఖేందుసంఖ్యాప్రవృత్తే ద్విజ పుంగవేభ్యః। గ్రామాన్ దదౌ శ్రీ గణపత్యభిఖ్యో వృత్తిప్రయుక్తాన్ గజపత్య ధీశః।......... శరబాణాభ్రభూ సంఖ్యే ప్రవృత్తే శకవత్సరే। ప్రమాదీచాఖ్య వర్షేతు గజపత్యన్వయోద్భవః। అర్కసంఖ్యాక గోత్రాణాం విప్రాణాంచ మహాత్మనామ్। బాలభాస్కరదేవేశో .........ఇత్యాది—ఇట్లు లోకల్ రికార్డు వాల్యుములలోఁ గలదు. ఆంధ్రదేశచరిత్రమున శ్రీ బుక్కపట్టణము రాఘవాచార్యులుగారును వ్రాసిరి. ఈవనిఫాలాలలో పయిశాసన మున్నట్టు ఇప్పుడు తెలియరాలేదు. ఈవ్రాఁత ప్రామాణికమే యని నిర్ణయింపఁదగ్గ యాధారము నాకుఁ గానరాలేదు. కొండవీటి దండికవిలెలోఁ గూడ గోపరాజు రామప్రధానిని గూర్చి, గణపతి గజపతిని గూర్చి ప్రశంస గలదు. ఇది నమ్మఁదగినదిగా నాకుఁ దోఁపదు.

ప్పుడు దుర్గముమీఁదఁ బ్రతాపరుద్రగజపతి కుమారుఁడగు వీరభద్రరాయఁడును, కుమారహంవీరపాత్రునికుమారుఁడగు నరహరి దేవు మొదలగువా రుండిరని కలదు. కపిలేశ్వర గజపతి క్రీ. 1455 కింకను బూర్వమే కొండవీటిరాజ్యము నాక్రమించుకొన్నాఁడుగాన యానాఁటికి రాజమహేంద్రవరమున వీరభద్రారెడ్డి కుటుంబము రాజ్యమేలుచునే యుండెను. వారితో మైత్రి గల్గి, వారితోడ్పాటును బడసియే కపిలేశ్వరుఁడు కొండవీటి నాక్రమించుకొని యుండును. వేమ వీరభద్రారెడ్లు ఉత్కలరాజుతో మైత్రి గలవారని భీమఖండమునను, గాశీఖండమునను గలదు. 'ఉత్కలకర్ణాటతురుష్కరాట్పరమమిత్రా!' 'కర్ణాటోత్కల పారసీక నృపసఖ్యప్రాభవశ్రీనిధీ!'—కాశీఖండము. వేమవీరభద్రారెడ్లకుఁ గొండవీటి పెదకోమటి వేమారెడ్డికుటుంబముతో విరోధము గాన వారు కొండవీటి విజయమున నుత్కలులకుఁ దోడ్పడియుందురు. ఇప్పుడు విశాఖపట్టణ మండలమునఁగల పార్వతీపుర మీకపిలేశ్వరునిభార్య పేరఁ గట్టఁబడిన దనియు,కృష్ణామండలమునఁగల కపిలేశ్వరపుర మీతని పేరఁ గట్టఁబడినదనియు,బహుపరాక్రమశాలియగుటచే బాహుబలేంద్రుఁ డనికూడ నీతనికి బిరుదుపేరనియు,ఏలూరిదగ్గఱఁగల బాహుబలేంద్రునిగూడ మా బిరుదుపేర వెలయింపఁబడినదనియు శ్రీరాఘవాచార్యులుగారు వ్రాసిరి. కాని బాహుబలేంద్ర గజపతి పురుషోత్తమ గజపతికిఁ దర్వాతివాఁడని, ఆతఁడు కపిలేశ్వరగజపతికంటె భిన్నుఁడని యీక్రిందిపద్యము చెప్పుచున్నది:

"వీరశ్రీ గజపతి పురుషోత్తమ గజపతి నిర్మితంబును ........అగు పురుషోత్తపట్టణంబున......

ఉ. సాంద్రయశోధనుండు హరి
శౌర్యుఁడు బాహుబలేంద్రుఁ డాహరి
శ్చంద్ర మహీతలేశుఁడు భృ
శంబుగ సత్యవచో(?) నొసంగఁగాఁ
జంద్ర సుగంధపుష్పఘన
సంకుమదాంబర రత్నరాజిని
స్తంద్రశుభోక్తిఁ గైకొనిమె
దాసరిగంగన లోక మెన్నఁగన్."

మాఘమాహాత్మ్యము—ఒడ్డెపూఁడి పెద్దన.

ఈకపిలేశ్వర గజపతి క్రీ. 1460, లేక 1461వఱకు రాజ్యమేలెను. ఈతని 3౮వ విజయరాజ్యాంక వత్సరమున వెలయింపఁబడినదిగా నొకశిలాశాసనము దాక్షారామక్షేత్రమునఁ గలదు. శ్రీకాకుళమున నాతని ౨౮వ విజయరాజ్యాంక వత్సరమున నొక శాసనము కలదు. కాన యాతఁడు కొండవీటిని జయించినపిదపఁ బదియేండ్లకు మించి రాజ్య మేలినట్లు తెలియును.

## పురుషోత్తమగజపతి

తండ్రివోలె నీతఁడు విద్యానగర రాజ్యముమీఁదికి దండువెడలి యక్కడ రాజ్యమేలుచున్న సాళ్వగుండ నరసింహరాయలను బట్టుకొనఁగా నాతఁ డభయయాచనాంజలితో నుదయగిరిరాజ్యము నొసఁగి తన్ను విడిపించుకొనెనని ప్రస్తుతశాసనము చెప్పుచున్నది. కావున నీతనికాలమున నుత్కళరాజ్యము, కర్ణాటరాజ్యములోని భాగమగు నుదయగిరిసీమను గూడ నాక్రమించె ననియుఁ, గర్ణాటకులకు గుండెదిగులు గొల్పుచుండెననియుఁ దలఁపఁదగును. పురుషోత్తమగజపతి రెడ్డిరాజు లొసఁగిన యగ్రహారదానశాసనములు కొన్నింటిమీఁదఁ దన పునరంగీకారమును జెక్కించుకొన్నాఁడు. ప్రజలు ప్రార్థింపఁగా నీతఁడు క్రీ. 1486లో పెండ్లిసుంకములను తీసివేసినాఁ డని కొండవీట శాసన మున్నది. ఈతఁడు సంస్కృతమున విద్వాంసుఁడు—త్రికాండ శేషము, ఊష్మ భేదప్రకాశిక మొదలగు గ్రంథము లీతనివి గొన్ని గలవు. ఈతఁ డెంతకాలముదాఁక రాజ్యమేలెనో నేను గుర్తింపఁజాలనయితిని. క్రీ. 1490 వఱకు నీతనిశాసనముల యునికిని గుర్తించితిని. బెజవాడదగ్గఱ నున్న పురుషోత్తమపట్టణ మీతనిపేరఁ గట్టఁబడినది. ప్రతాపరుద్రగజపతికాలమున బాహుబలేంద్రగజపతి, విద్యాధరగజపతియు నాపట్టణమున నుండిరి.

## ప్రతాపరుద్రగజపతి

ఈతఁడు 'దుర్గావరపుత్త్రుఁ'డని సరస్వతీవిలాసమునఁ బ్రశంస గలదు. పురుషోత్తమగజపతి బెజవాడకనకదుర్గకు భక్తుఁడనియుఁ, దదనుగ్రహమునఁ బ్రతాపరుద్రగజపతి జనించెనన్న నమ్మికచే నాతనికిఁ 'దుర్గావరపుత్త్రుఁ'డన్న బిరుదు వెలసెననియుఁ దలఁపఁదగును. 1490 దాఁకఁ బురుషోత్తమగజపతి శాసనములు గానవచ్చుచున్నవి గావునను, జైత్రయాత్ర వెడలినప్పుడు చేసిన మన ప్రస్తుతశాసనము కాలము 1500* కావునను నీతఁడు 1495 ప్రాంతముల రాజ్యమునకు వచ్చియుండునని తలఁపఁదగును. పురుషోత్తమగజపతికాలమునను, నీతనికాలమునను నోఢ్రదేశమున గొప్ప మతప్రవర్తకుఁడొక మహనీయుఁడు వెలసెను. ఆయన గౌరాంగదేవుఁడు. చైతన్యమత మామహాత్మునిచేఁ బ్రవర్తితమైనది. ఆయన విద్యానగరమునకుఁగూడ విచ్చేసినట్లు గాథలు గలవు. ఈగజపతుల యభ్యర్థనముచే విద్యానగర దండయాత్రాకాలమున నాయన వచ్చినను వచ్చియుండవచ్చును. ప్రతాపరుద్రగజపతికి వైదికాచారమునీఁదను, సంస్కృతభాషమీఁదను నాదరము హెచ్చు. సంస్కృతభాషలో సరస్వతీవిలాసమని యొకగొప్ప ధర్మశాస్త్ర నిబంధనగ్రంథము తత్కృతముగా వెలయుచున్నది. అందుఁ బ్రతాపరుద్ర గజపతినిగూర్చి యీక్రిందివిషయములెఱుఁగవచ్చుచున్నవి. "వీరరుద్రోఽపి పద్మాశ్లిష్టతనుః--కటకనగరీం పద్మా పద్మాలయేలా మహిలాభిస్సమం సమ్మానయన్-"వయివాక్యములచే వీరరుద్రగజపతికిఁ బద్మయని యొకర్తె భార్య గలదని స్పష్టముగా నెఱుఁగనగును. రాఘవాచార్యులుగారు మహిలా పదమునుబట్టి యామె పేరు మైలమాంబ యని తలఁచిరి. మైలమాంబకూడ వేఱొకతె యుండిన నుండవచ్చును—"స్వయం విద్యాధర సదృశోఽపి కింకరీకృత విద్యాధరః" అని యందుఁ గలదు. దీనిచే విద్యాధరుఁడని యొకఁడు తదనుజీవి గలఁడని యేర్పడును. ఈవిద్యాధరునిపేరనే బెజవాడదగ్గఱ విద్యాధరపురమని గ్రామము వెలసినది. మఱియు సరస్వతీవిలాసమున వీరరుద్రుఁడు గౌడేంద్రమానమర్దనుఁడనియు,జమునాపురాధీశ్వరుఁడగు హుసేనసాహి యనుతురుష్కుఁడుశరణాగతుఁడు కాఁగా శత్రులనుండి వాని రక్షించెననియుఁ గలదు. కొండపల్లిదగ్గఱ నీతఁడు గాలబుఖాన్ అనే తురకసర్దారును జయించినట్లు కొండపల్లి దండకవిలెలోఁ గలదని రాఘవాచార్యులుగారు వ్రాసిరి. కొండపల్లిదండకవిలె యెక్కడఁగలదో నేఁజూడలేదు. మఱియు రాఘవాచార్యులుగారు "ప్రతాపరుద్రగజపతికే విద్యాధరగజపతి యనిపేరు. ఈయన పేర కొండపల్లిలో దుర్గంకింద విద్యాధరగజపతిచెరువు అని చెరువు ఉన్నది. ఆచెర్లో యీతడు లక్కపడవమీద షికారుచేసేవాడట"అని వ్రాసిరి. విద్యాధరగజపతి ప్రతాపరుద్ర గజపతిక్రింది యుద్యోగియని సరస్వతీవిలాసమునఁ గలదుగదా! ఈతనికి "వీరశ్రీ గజపతి గౌడేశ్వర నవకోటి కర్ణాట కలుబరగీశ్వర శ్రీ దుర్గావరపుత్ర రాజాధిరాజ రాజపరమేశ్వ"రేతి బిరుదావళి గలదు.

సరస్వతీవిలాసము ప్రతాపరుద్రగజపతి కృతమని గద్యమునను, అవతరణికలోను గలదుగాని యది విశ్వసనీయము గాదు. అందొక్కయుల్లాస మెల్లఁ గృతికర్తృవంశప్రశస్తియని కలదు. ఆప్రశస్తియుఁ, గాదంబరీగద్యములంబోలు గద్యములతో, హృద్యపద్యములతో నద్భుతకావ్యముగా నున్నది. గ్రంథకర్తయే తన్నుఁ దానిట్లు ప్రస్తుతించుకొనవచ్చునా యని యాక్షేపమును,దాని కేదో యప్రౌఢ సమాధానమునుగూడ నందుఁ గలదు. ఎన్నియున్న నేమి?

* ఈసమయముననే బాపట్లతాలూకాలోని దగు ఈడ్పులపాడు గ్రామమునుగూడ యాజ్ఞవల్క్యబ్రాహ్మణాల కీతఁడు దానముచేసెను. "శాకాబ్దే కరనేత్రవార్ధి శశభృత్సంఖ్యేచ శార్దే శర, ద్యూర్జేమాసి విధూపరాగసమయే శ్రీవీరరుద్రేభరాట్, భారద్వాజసగోత్రమాధవబుధాయా [ ] శాఖాజుషే, ప్రాదాదిట్పులపాటినామక మహాగ్రామం నృపగ్రామణీః. సీ. శ్రీయాజ్ఞవల్క్య ప్రసిద్ధాన్వయమునందు ముఖ్యుండు దామయ్య ముత్తతాత—ఇత్యాది- సంస్కృతాంధ్రపద్యమయ శాసనము- గవర్న మెంటువారి 1922 సం॥ శాసనసంచయమున 802 నెం॥ గలదు. ఇది యప్రకటితము.

అది వీరరుద్రగజపతి స్వయంకృతము గాదని స్పష్టముగా నెఱుఁగనగుచున్నది. వీరరుద్రగజపతి యాస్థానమున లొల్లలక్ష్మీధరుఁడని గొప్పవిద్వాంసుఁ డుండెను. ఆగ్రంథ మాతఁడు రచించినది. అట్లనుటకుఁ గారణము లివి:—

లొల్లలక్ష్మీధరుఁడు బహుగ్రంథకర్త. ఆవిద్వాంసుని సౌందర్యలహరీవ్యాఖ్యానారంభశ్లోకములే సరస్వతీవిలాసారంభమునను గలవు. గ్రంథకర్త ప్రతాపరుద్రగజపతియే యగునేని మహాకావ్య మనఁదగినట్లు స్వవంశప్రశస్తిమయమగు ప్రత్యేకోల్లాసమును, ప్రశస్తవాక్య రచనతో గ్రంథమెల్లను రచింపనేర్చినవాఁడు గ్రంథారంభశ్లోకములను ఆస్థాన కవికృతమగు గ్రంథాంతరముననుండి కైకొనఁ గోరఁడు. వేఱుగా శ్లోకములు వెలయించి చేర్పఁగలవాఁ డయినను లక్ష్మీధరపండితుఁడు సరస్వతీవిలాసము తన కృతి యని భావిలోకము గుర్తించుట కిదియునొకసాధనమై యుండుఁ గాకయనుతలఁపుతోఁగాఁబోలు,సౌందర్యలహరీ వ్యాఖ్యా పీఠికాశ్లోకములనే యిందుఁ జేర్చినాఁడు. మఱియు నాపండితుఁడు రాజాజ్ఞచేఁ దనపరిశ్రమము నానాఁడు రాజార్పితముఁ జేసినను భావికాలమునఁగూడ వాస్తవము ప్రవ్యక్తమగునుగాక యనుకోరికతోఁ గాఁబోలును, తన సౌందర్యలహరీ గద్యమందు సరస్వతీవిలాసమను పేరుగల స్మృతి నిబంధనమును దాను రచించినట్లు చెప్పుకొన్నాఁడు

సౌందర్యలహరీ వ్యాఖ్యాంత గద్యము.

"........నిఖిలయామళతం త్రావగాహన రుద్రేణ ఆశ్రయీకృత గజపతివీర రుద్రేణ నీలగిరి సుందరచరణారవింద చంచరీకేణ వాణీ సహచరీకేణ, సరస్వతీవిలాసాద్యనేకస్మృతినిబంధన, లక్ష్మీధరాద్యనేక సాహిత్య నిబంధన, నయవివేకాద్యనేక గురుమత నిబంధన, యోగదీపికాద్యనేక పాతంజల మతనిబంధన, మహానిబంధనాఖ్య మానవ ధర్మశాస్త్రటీకా, కర్ణావతంస బర్హావతం సాద్యనేక కావ్య కల్పకేన ఆశ్రితజనకల్పకేన నిగ్రహానుగ్రహకౌశికేన శ్రీమహోపాధ్యాయ లక్ష్మీధర దేశికేన—"

ఈలక్ష్మీధర పండితుని వంశమువా రిప్పటికిని కృష్ణాతీరమున ప్రస్తుతశాసనమున దత్తాగ్రహారమగు ననంతవరమునకుఁ గడుఁజేరువనే కొల్లూ రనుగ్రామమున లక్ష్మీధర పండితుఁ డార్జించిన విపులసంపదల ననుభవించుచు వెలయుచున్నారు.

ఈలక్ష్మీధరపండితుఁడు గాక ప్రతాపరుద్ర గజపతి యాస్థానమున దివాకరుఁడను కవీశ్వరుఁడుగూడ నుండెను. ఆతఁడురచించిన మహాకావ్యము'భారతామృతము'చెన్నపురి ప్రాచ్యలిఖితపుస్తకశాలలోఁ గలదు. ప్రతాపరుద్ర గజపతి యాతనికిఁ దనయాస్థానమున 'కవిచంద్రరాయ' పదము నిచ్చెనట. ఆతని భారతామృతము ప్రౌఢము, రసవంతము నగు మహాకావ్యము. ఆతనిచరిత్ర మించుక:—

'యం ప్రాసూత పతివ్రతా గుణవతీ...,శ్రీవైద్యేశ్వరత్తో విభూషితభరద్వాజాన్వయా దాత్మజమ్, కావ్యే తస్య దివాకరస్య కృతినో బాలాధరస్వాదుని, ఖ్యాతే భవ్యపదోఽయ మాది గదిత స్సర్గ స్సమాప్తోఽభవత్ – కావ్యే తస్య పితృవ్యతః కవినృపా త్సాహిత్య శిక్షా భృతః. యద్భ్రాతా మధుసూదనో మధురయా కం నామ నానందయత్, భాణోఽభణ్యత యేన ధూర్తచరితం చేతశ్చమత్కారకృత్, యో దేవ్యా స్తుతి మద్రిరాజదుహితు శ్శ్లోకై శ్శతే నాకరోత్, జాతో వాజసనేయినామపి కులే యోఽనేకవిద్యావతామ్,రమ్యం చాకృత పారిజాతహరణం సన్నాటకం, యశ్చాపత్ కవిచంద్రరాయ పదవీం రుద్రభూమీభుజః. యత్పిత్రా కవిడిండిమోఽపికవితావాదే జితః, య శ్చక్రే రసమంజరీతి రసికాహ్లాదాయపద్యావళిం,కావ్యే తస్యసహోదరా దభినవశ్రీగోవిందతః.'

ఈతని చరిత్రము తెల్గుదేశపు సంస్కృతకవుల చరిత్రలో విస్తరించి వ్రాసితిని.

లొల్లలక్ష్మీధరపండితుఁడును, నీ దివాకర కవియు క్రీ. 1519 లో ప్రతాపరుద్రగజపతి ఆంధ్రరాజ్యమును బూర్తిగాఁ గోల్పోయినపిదప, శ్రీకృష్ణదేవరాయలవారి యాస్థానకవులై పేర్వెలసిరి. దివాకరకవి 'కర్ణాటాధిప కృష్ణరాయసదసి ఖ్యాతస్య విద్వత్తయా' అని చెప్పుకొన్నాఁడు. లొల్లలక్ష్మీధర పండితుఁడుగూడఁ గృష్ణరాయలవారి సమ్మానమునఁ గొన్ని కృతులఁగూర్చెను. వానిలో దైవజ్ఞ విలాసము ప్రధానమయినది.

## ప్రతాపరుద్రగజపతి

ఈతఁడు 'దుర్గావరపుత్త్రుఁ'డని సరస్వతీవిలాసమునఁ బ్రశంస గలదు. పురుషోత్తమగజపతి బెజవాడకనకదుర్గకు భక్తుఁడనియుఁ, దదనుగ్రహమునఁ బ్రతాపరుద్రగజపతి జనించెనన్న నమ్మికచే నాతనికిఁ 'దుర్గావరపుత్త్రుఁ'డన్న బిరుదు వెలసెననియుఁ దలఁపఁదగును. 1490 దాఁకఁ బురుషోత్తమగజపతి శాసనములు గానవచ్చుచున్నవి గావునను, జైత్రయాత్ర వెడలినప్పుడు చేసిన మన ప్రస్తుతశాసనము కాలము 1500* కావునను నీతఁడు 1495 ప్రాంతముల రాజ్యమునకు వచ్చియుండుననితలఁపఁదగును. పురుషోత్తమగజపతికాలముననను, నీతనికాలముననను నోఢ్రదేశమున గొప్ప మతప్రవర్తకుఁడొక మహనీయుఁడు వెలసెను. ఆయన గౌరాంగదేవుఁడు. చైతన్యమత మామహాత్మునిచేఁ బ్రవర్తితమైనది. ఆయన విద్యానగరమునకుఁగూడ విచ్చేసినట్లు గాథలు గలవు. ఈగజపతుల యభ్యర్థనముచే విద్యానగర దండయాత్రాకాలమున నాయన వచ్చినను వచ్చియుండవచ్చును. ప్రతాపరుద్రగజపతికి వైదికాచారముమీఁదను, సంస్కృతభాషమీఁదను నాదరము హెచ్చు. సంస్కృతభాషలో సరస్వతీవిలాసమని యొకగొప్ప ధర్మశాస్త్ర నిబంధనగ్రంథము తత్కృతముగా వెలయుచున్నది. అందుఁ బ్రతాపరుద్ర గజపతినిగూర్చి యీక్రిందివిషయములెఱుఁగవచ్చుచున్నవి. "వీరరుద్రోఽపి పద్మాశ్లిష్టతనుః --కటకనగరీం పద్మా పద్మాల యేలా మహిలాభి స్సమం సమ్మానయన్-"పయివాక్యములచే వీరరుద్రగజపతికిఁ బద్మయని యొకర్తె భార్య గలదని స్పష్టముగా నెఱుఁగనగును. రాఘవాచార్యులుగారు మహిలా పదమునుబట్టి యామె పేరు మైలమాంబ యని తలఁచిరి. మైలమాంబకూడ వేఱొకతె యుండిన నుండవచ్చును—"స్వయం విద్యాధరసదృక్షోఽపి కింకరీకృత విద్యాధరః" అని యందుఁ గలదు. దీనిచే విద్యాధరుఁడని యొకఁడు తదనుజీవి గలఁడని యేర్పడును. ఈవిద్యాధరునిపేరనే బెజవాడదగ్గఱ విద్యాధరపురమని గ్రామము వెలసినది. మఱియు సరస్వతీవిలాసమున వీరరుద్రుఁడు గౌడేంద్రమానమర్దనుఁడనియు,జమునాపురాధీశ్వరుఁడగు హుసేనసాహి యనుతురుష్కుఁడుశరణాగతుఁడు కాఁగా శత్రులనుండి వాని రక్షించెననియుఁ గలదు. కొండపల్లిదగ్గఱ నీతఁడు గాలబుఖాన్ అనే తురకసర్దారును జయించినట్లు కొండపల్లి దండకవిలెలోఁ గలదని రాఘవాచార్యులుగారు వ్రాసిరి. కొండపల్లిదండకవిలె యెక్కడఁగలదో నేఁజూడలేదు. మఱియు రాఘవాచార్యులుగారు "ప్రతాపరుద్రగజపతికే విద్యాధరగజపతి యనిపేరు. ఈయన పేర కొండపల్లిలో దుర్గంకింద విద్యాధరగజపతిచెరువు అని చెరువు ఉన్నది. ఆచెర్లో యీతడు లక్కపడవమీద షికారుచేసేవాడట"అని వ్రాసిరి. విద్యాధరగజపతి ప్రతాపరుద్రగజపతిక్రింది యుద్యోగియని సరస్వతీవిలాసమునఁ గలదుగదా! ఈతనికి "వీరశ్రీ గజపతి గౌడేశ్వర నవకోటి కర్ణాట కలుబరగీశ్వర శ్రీ దుర్గావరపుత్ర రాజాధిరాజ రాజపరమేశ్వ"రేతి బిరుదావళి గలదు.

సరస్వతీవిలాసము ప్రతాపరుద్రగజపతి కృతమని గద్యముననను, అవతరణికలోను గలదుగాని యది విశ్వసనీయము గాదు. అందొక్కయుల్లాస మెల్లఁ గృతికర్తృవంశప్రశస్తియని కలదు. ఆప్రశస్తియుఁ, గాదంబరీగద్యములం బోలు గద్యములతో, హృద్యపద్యములతో నద్భుతకావ్యముగా నున్నది. గ్రంథకర్తయే తన్నుఁ దానిట్లు ప్రస్తుతించుకొనవచ్చునా యని యాక్షేపమును,దాని కేదో యప్రౌఢసమాధానమునుగూడ నందుఁ గలదు. ఎన్నియున్న నేమి?

* ఈసమయముననే బాపట్లతాలూకాలోని దగు ఈడ్పులపాడు గ్రామమునుగూడ యాజ్ఞవల్క్యబ్రాహ్మణుల కీతఁడు దానముచేసెను. "శాకాబ్దే కరనేత్రవార్ధిశశభృత్సంఖ్యేచ రౌద్రే శర, ద్యూర్జేమాసి విధూపరాగసమయే శ్రీవీరరుద్రేభరాట్, భారద్వాజసగోత్రమాధవబుధాయా [ ] శాఖాజుషే, ప్రాదాదిట్పులపాటినామక మహాగ్రామం నృపగ్రామణీః. సీ. శ్రీయాజ్ఞవల్క్య ప్రసిద్ధాన్వయమునందు ముఖ్యుండు దామయ్య మత్తతాత–ఇత్యాది– సంస్కృతాంధ్రపద్యమయ శాసనము– గవర్నమెంటువారి 1922 సం॥ శాసనసంచయమున 802 నెం॥ గలదు. ఇది యప్రకటితము.

అది వీరరుద్రగజపతి స్వయంకృతము గాదని స్పష్టముగా తెలియఁగనగుచున్నది. వీరరుద్రగజపతి యాస్థానమున లొల్లలక్ష్మీధరుఁడని గొప్పవిద్వాంసుఁ డుండెను. ఆగ్రంథ మాతఁడు రచించినది. అట్లనుటకుఁ గారణము లివి:—

లొల్లలక్ష్మీధరుఁడు బహుగ్రంథకర్త. ఆవిద్వాంసుని సౌందర్యలహరీవ్యాఖ్యానారంభశ్లోకములే సరస్వతీవిలాసారంభమునను గలవు. గ్రంథకర్త ప్రతాపరుద్రగజపతియే యగునేని మహాకావ్య మనఁదగినట్లు స్వవంశప్రశస్తిమయమగు ప్రత్యేకోల్లాసమును, ప్రశస్తవాక్య రచనతో గ్రంథమెల్లను రచింపనేర్చినవాఁడు గ్రంథారంభశ్లోకములను ఆస్థాన కవికృతమగు గ్రంథాంతరముననుండి కైకొనఁ గోరఁడు. వేఱుగా శ్లోకములు వెలయించి చేర్పఁగలవాఁ డయినను లక్ష్మీధరపండితుఁడు సరస్వతీవిలాసము తన కృతి యని భావిలోకము గుర్తించుట కిదియనేకసాధనమై యుండుఁ గాకయనుతలఁపుతోఁ గాఁబోలు, సౌందర్యలహరీ వ్యాఖ్యా పీఠికాశ్లోకములనే యిందుఁ జేర్చినాఁడు. మఱియు నాపండితుఁడు రాజాజ్ఞచే దనపరిశ్రమము నానాఁడు రాజార్పితముఁ జేసినను భావికాలమునఁగూడ వాస్తవము ప్రవ్యక్తమగునుగాక యనుకోరికతోఁ గాఁబోలును, తన సౌందర్యలహరీ గద్యమందు సరస్వతీవిలాసమను పేరుగల స్మృతి నిబంధనమును దాను రచించినట్లు చెప్పకొన్నాఁడు

సౌందర్యలహరీ వ్యాఖ్యాంత గద్యము.

“........నిఖిలయామళతంత్రావగాహన రుద్రేణ ఆశ్రయీకృత గజపతివీర రుద్రేణ నీలగిరి సుందరచరణారవింద చంచరీకేణ వాణీ సహచరీకేణ, సరస్వతీవిలాసాద్యనేకస్మృతినిబంధన, లక్ష్మీధరాద్యనేక సాహిత్య నిబంధన, నయవివేకాద్యనేక గురుమత నిబంధన, యోగదీపికాద్యనేక పాతంజల మతనిబంధన, మహానిబంధనాఖ్య మానవ ధర్మశాస్త్రటీకా, కర్ణావతంస బర్హావతం సాద్యనేక కావ్య కల్పకేన ఆశ్రితజనకల్పకేన నిగ్రహానుగ్రహకాశికేన శ్రీమహోపాధ్యాయ లక్ష్మీధర దేశికేన—”

ఈలక్ష్మీధర పండితుని వంశమువా రిప్పటికిని కృష్ణాతీరమున ప్రస్తుతశాసనమున దత్తాగ్రహారమగు ననంతవరమునకుఁ గడుఁజేరువనే కొల్లూ రను గ్రామమున లక్ష్మీధర పండితుఁ డార్జించిన విపులసంపదల ననుభవించుచు వెలయుచున్నారు.

ఈలక్ష్మీధరపండితుఁడు గాక ప్రతాపరుద్ర గజపతి యాస్థానమున దివాకరుఁడను కవీశ్వరుఁడుగూడ నుండెను. ఆతఁడురచించిన మహాకావ్యము ‘భారతామృతము’ చెన్నపురి ప్రాచ్యలిఖితపుస్తకశాలలోఁ గలదు. ప్రతాపరుద్ర గజపతి యాతనికిఁ దనయాస్థానమున ‘కవిచంద్రరాయ’ పదము నిచ్చెనట. ఆతని భారతామృతము ప్రౌఢము, రసవంతము నగు మహాకావ్యము. ఆతనిచరిత్ర మించుక:—

‘యం ప్రాసూత పతివ్రతా గుణవతీ..., శ్రీవైద్యేశ్వరతో విభూషితభరద్వాజాన్వయా దాత్మజమ్, కావ్యే తస్య దివాకరస్య కృతినో బాలాధరస్వాదుని, ఖ్యాతే భవ్యపదోఽయ మాది గదిత స్సర్గ స్సమాప్తోఽభవత్ – కావ్యే తస్య పితృవ్యతః కవినృపా త్సాహిత్య శిక్షా భృతః. యద్భ్రాతా మధుసూదనో మధురయా కం నామ నానందయత్, భాణోఽభణ్యత యేన ధూర్తచరితం చేతశ్చమత్కారకృత్, యో దేవ్యా స్స్తుతి మద్రిరాజదుహితు శ్శ్లోకై శ్శతే నాకరోత్, జాతో వాజసనేయినామపి కులే యోఽనేకవిద్యావతామ్, రమ్యం చాకృత పారిజాతహరణం సన్నాటకం, యశ్చాపత్ కవిచంద్రరాయ పదవీం రుద్రభూమీభుజః. యత్పితా కవిడిండిమోఽపి కవితావాదే జితః, య శ్చక్రే రసమంజరీతి రసికాహ్లాదాయ పద్యావళిం, కావ్యే తస్యసహోదరా దభినవశ్రీగోవిందతః.’

ఈతని చరిత్రము తెల్గుదేశపు సంస్కృతకవుల చరిత్రలో విస్తరించి వ్రాసితిని.

లొల్లలక్ష్మీధరపండితుఁడును, నీ దివాకర కవియు క్రీ. 1519 లో ప్రతాపరుద్రగజపతి అంధ్రరాజ్యమును బూర్తిగాఁ గోల్పోయినపిదప, శ్రీకృష్ణదేవరాయలవారి యాస్థానకవులై పేర్వెలసిరి. దివాకరకవి ‘కర్ణాటాధిప కృష్ణరాయసదసి ఖ్యాతస్య విద్యత్త్రయా’ అని చెప్పకొన్నాఁడు. లొల్లలక్ష్మీధర పండితుఁడుగూడఁ గృష్ణరాయలవారి సమ్మానమునఁ గొన్ని కృతులఁగూర్చెను. వానిలో దైవజ్ఞ విలాసము ప్రధానమయినది.

ఈసమస్య శ్రీకృష్ణరాయల పేర లక్ష్మీధర పండితుఁడు పూరించినది:

శ్లో. శ్రీకృష్ణక్షితిపాల దత్తమణిభి ర్విద్వత్కవీనాంగృహా,
నానారత్నవిచిత్రకుట్టిమభువో రత్నాకరత్వంగతాః,
అబ్ధిః కేవలవారిపూరనిలయః సంభావ్యతేసజ్జనై,
రంభోధి ర్జలధిః పయోధి రుదధి ర్వారాంనిధి ర్వారిధిః.

ప్రస్తుత శాసనము ప్రతాపరుద్ర గజపతి క్రీ. 1500 లో దక్షిణదిగ్జయార్థము బయలువెడలి కృష్ణాతీరమున బ్రాహ్మణుల కగ్రహారదానము చేసిన సందర్భమందలిది గదా! ఇది జరపినపిదప గజపతి జైత్రయాత్ర సాగించెనో లేదో,దక్షిణ దేశ మేమి జయించెనో యెఱుఁగరాదు. క్రీ. 1513 సంవత్సరముదాఁక నీతఁడు క్రొత్త దేశమును జయింపకున్నను,బూర్వ ముండిన దేశమును గోల్పోలేదని నమ్మవచ్చును. కొండవీటిలోఁ గుమారుఁ డగు వీరభద్ర గజపతిని, ఉదయగిరిలోఁ బినతండ్రియగు తిరుమల రాత రాయ మహాపాత్రుని నెలకొల్పి యేల్బడిని బలిష్ఠముగాఁ జేసినాఁడు. ఈతనికి నమ్మకముగల భృత్యులై యాంధ్ర దేశమున నొక క్షత్రియకుటుంబమువారు మిక్కిలి సహాయపడుచుండిరి. వారివంశవృక్ష మిట్టిది:




రాఘవాచార్యులుగారు కపిలేశ్వరగజపతి పరంపరవారును,వీరును ఒక్కవంశమువారే యని తలఁచిరి. ఈతలఁపు సదాధారము గలదిగా నాకుఁ దోఁపదు. మీఁదఁ జూపఁబడిన వంశవృక్షమునఁ గల తిర్మలరాయఁడే (క్రీ. 1524) ప్రతాపరుద్రగజపతి పిన్నతండ్రియు, నుదయగిరి దుర్గము మీఁద నున్నవాఁడు నని వర్ణితుఁడయిన తిరుమల రౌత మహారాయఁడని వారువ్రాసిరి.ఆతఁడు, నీతఁడు భిన్నులని నాతలఁపు. శ్రీకృష్ణరాయలు క్రీ. 1514లో ఉదయగిరిని బట్టుకొని, అక్కడనుండి వీరరుద్రగజపతిని వెనుకకుఁ ద్రోలెను. 1515 లో కొండవీటిని జయించెను. 1516 తిరిగి కళింగదేశ విజయార్థము దండయాత్ర వెడలి, 1519 లో పొట్నూరిలోఁ బ్రతాపరుద్ర గజపతి నోడించి విజయ స్తంభము వేయించి, యాతని కుమార్తెయగు భద్రను బెండ్లాడి,యాంధ్ర దేశమునగజపతిరాజ్యము నంతరింపఁజేసెను. కాని కృష్ణరాయల తర్వాత ప్రతాపరుద్రగజపతి కుమారుఁడు గాఁబోలును, మరల కన్నడము మీఁదికి దండెత్తి రాఁగానో, రాఁబోవఁగానో, పెద్దనామాత్యుఁ డీక్రింది పద్యము చెప్పి యాతని సిగ్గిలఁ జేసెనట!

సీ. రాయరాహుత మిండ రాచయేనుఁగు వచ్చి
యారట్లకోటఁ గోరాడునాఁడు
సంపెట నరపాల సార్వభౌముఁడు వచ్చి
సింహాద్రి జయశిలఁ జేర్చునాఁడు
సెలగోలుసింహంబు చేరి ధిక్కృతిఁ గంచు
తల్పులఁ గరుల డీకొల్పునాఁడు
ఘనతరనిర్భర గండపెండెర మిచ్చి
కూఁతు రాయల కొనఁ గూర్చునాఁడు
ఒడ లెఱుంగవొ చచ్చితొ యుర్వి లేవొ
చేరఁ జాలక తల చెడి జీర్ణమైతొ
కన్నడం బెట్లు సొచ్చెదు గజపతీంద్ర
తెలిచినిలు కుక్క సొచ్చిన తెఱఁగు దోఁప.

గజపతుల పరిపాలనకాలమున నాంధ్రదేశమున స్మార్తధర్మములును, సంస్కృతవిద్యయు నభ్యుదయము

నందెను. గజపతులు స్వయము తెలుఁగు గ్రంథములను వేనిని గృతు లందరయిరి. కాని వీరి మంత్రులగు తెలుఁగు వారు కొన్నికృతులందిరి. వీరి పాలనకాలముననే శ్రీనాథ కవిసార్వభౌముఁడు దారిద్ర్యదగ్ధుఁడై కడగండ్లు గుడిచి యుసురు విడిచెను.

"వీరు స్వతంత్రాధికారము గల రాజు లయినందుకు దృష్టాంతముగా వీరి నాణెములు వేఱుగా నుండెను. గజపతివారి నాణెములమీద హావుదాతో ఏనుగు స్వరూపము వేయబడియుండెను. కొన్నిటిమీద సూర్యచంద్రులు సమేతం ఉండును" అని రాఘవాచార్యులుగారు వ్రాసిరి.

రాఘవాచార్యులుగారీశాసనము నెఱుఁగుదురు. వారిచరిత్రలో దీనిని బ్రస్తావించిరి. వారియింటఁ జెడఁగొట్టఁబడిన శాసనములలో నిదియుఁ జేరియుండునేమో! ఈశాసన వివరణమున రాఘవాచార్యులు గారి గ్రంథము నాకుఁ గొంత యుపకరించినది.

ఆతుమూడి ప్రతినామధేయమయిన

## అనంతవరముతామ్రశాసనము*

శ్లో. లక్ష్మీంనశ్చిరమాతనోతుభగవాఀల్లీలావరాహోహరి
ర్మగ్నాముద్ధరతఃపయోధిసలిలేవిశ్వంభరాందంష్ట్రయా
లగ్నాయస్యతనూరుహేషుసరితో భాంతిస్మసప్తార్ణవా
భూకాంతాపరిషంగసౌఖ్యజనితస్వేదాంబులేశాఇవ. ౧

,, హేరంబ శ్శ్రియమాతనోతుజగతాం గండస్థలీసంచర
ద్భృంగీమంగళగానకర్ణనసుఖవ్యాసక్తచిత్తాంబుజః
యస్యేంద్రాదిమరుత్సుతైస్సహచరైఃప్రక్రీడతశ్శైశవే
క్రీడాకందుకతాంభజంతివిపులాశ్చిత్రం కులక్ష్మాభృతః.

,, అస్మాకి మచలాంశ్రియం వితనుతాం సింహాద్రిచూడామణే, స్స్నేహాద్యస్య కరాంబుజద్వయగతౌ శ్రీశంఖచ
క్రౌచిరం, సూర్యాచంద్రమసోర్విలోచనపదంసంప్రాప్త
యోర్భ్యాయసో, స్తిర్యక్నిర్గత తేజసావిలసతో బింబావి
వాత్యాయతౌ. 3

శ్లో. పతిస్త్విషామస్తిసరోజినీపతిస్త్రయీమయాత్మాతమ
సాంనిషూదనః, ప్రకాశసంవీతదిగంబరంజనాః శివస్య
మూర్తిం సముదాహరంతి యమ్. ౪

,, తదీయవంశేతదనుప్రతాపవాం శ్చిరస్యరాజా కపిలేశ్వ
రాహ్వయః, అభూదభూతోపమపౌరుషోర్జితోజితోభ
యారాతిగణోగుణోన్నతః. ౫

,, యమగ్రగణ్యంకిలపుణ్యవర్తినాం నృపేషు సింహాసనవర్తి
షు త్రిషు, అజస్రదానాంబుఝరక్షరత్కరం వదంతి
లోకా భువి దంతినాంపతిమ్. ౬

,, ఘనేనయేనద్విజసంఘసాత్కృతా మహాగ్రహారాశ్శు
చిహాక్తికోజ్జ్వలాః, మహీపురంధ్రీహృదయావలం
బినో మహాగ్రహారా ఇవ సంచకాసతే. ౭

,, ప్రసహ్యకర్ణాటమహీపతేః పురీంనిరుధ్య విద్యానగరీం
నిజైర్బలైః, సమున్నతం మానమివోచ్ఛ్రయం కరం
సమాదదేకర్కశచక్రవిక్రమః. ౮

,, కుమారహంవీరవిభు ర్యదాజ్ఞయా విజిత్య కార్తాంత
దిశం ప్రతాపవాఀ, అశోధయచ్ఛాత్రవశోణితోక్షి
తాం కృపాణికాం దక్షిణసాగరాంబుషు. ౯

,, సరాజధానీం కటకాభిధామశా దకంటకా ముత్కళ
దేశనాయకః దిగంతసామంత కిరీటమాలికా మణి
ద్యుతిద్యోతితపాదపంకజః. ౧౦

,, సుతోభవత్తస్య సురేంద్రతేజసః పురందరశ్రీః పురు
షోత్తమోనృపః వసుంధరాయత్రవసూపమే దధా
మహీధరస్థేమ్ని పతివ్రతావిధిమ్. ౧౧

,, యద్దానేన వినిర్జితా సురగవీ ఖాద త్యజస్రంతృణం
చిత్తేసంతతచింతయా సురమణి శ్చింతామణిత్వంగతః,
మేరౌ సంభృతవల్కల స్సురనగో ఘోరంతపస్తప్యతే
మాలిన్యంజలదోబిభర్తి గణనాకావాపరేషామహో.

,, యస్మై నిత్యతరప్రతాపదహన జ్వాలాయమానధ్వజ
స్తంభాబద్ధ కుసుంభ రక్తవసన ప్రేక్షావిభగ్న ద్విషే,
సంధాయాభయయాచనాంజలి మహోదత్వో దయా

* వ్రాఁతప్రతికలోఁ బెక్కులు తప్పు లున్నవి. స్పష్టమయినవానినిమాత్రము దిద్దితిని. ఇంకను నిందుఁ దప్పు లున్నవి.

ద్రింభయా, దాత్మానం ముముచే నృసింహ నృపతిః కర్ణాట దేశాధిపః. ౧౩

శ్లో. యద్ధాటీచల ఘోటికాఖురపుటక్షుణ్ణక్షమా మండల ప్రోద్ధూ తాధ్వవిస్తృత్వరాధిక రజస్తోమం సమీక్ష్య ద్విషః, ధ్యానంతే సపదిజ్వలిష్య దలఘుప్రౌఢ ప్రతాపానల, ప్రోద్గచ్ఛద్ఘనధూమమండలధియా భీతా వనాభ్యంతరమ్. ౧౪

,, జాతస్తస్య సుతః ప్రతాపపదవాగ్ రుద్రాధిప శ్రీనిధిః, ఖ్యాతానంత గుణాన్వితాచల మహాధర్మగ్రహప్రోత్సుకః,విధ్వస్తాలఘుదుర్జయారినగరః ప్రాప్తాచ్యుతోగ్రజ్వాలద్భాసద్భ్యాతిరివేశ్వరోద్ధృతశివ శ్రీరాజచూడామణిః.

,, అమాత్య(...)తాభిషేక ముఖ్యసత్క్రియా ప్రవర్ధితామలప్రభాధిభాసు భాసురాంగ సౌష్ఠవః,
అనంతరం పితు ర్మహీ మశా దశాత్ర వామయం ప్రతాపడింభదీధితిః ప్రతాపరుద్ర పార్థివః. ౧౬

,, యుద్ధే క్రుద్ధంవిపక్షక్షితిపతినివహోమన్యతేకాలరుద్రం కల్పక్షోణీరుహంయం కవిబుధనికరోదాన శౌండ ప్రభావమ్, లోకాః పీయూషభానుం సకలజనమనోరంజనోదారవేషం, కాంతాస్సాక్షాద్రతీశం కమలభవమపి ప్రౌఢ విద్యాయుతం వా. ౧౭

,, అథత్తేభవితస్య రుద్రనృపతే ర్ధాటీదిగంతద్రవ, ద్ఘోటీశైల గుహాంతరస్థిత రిపుక్ష్మాభృద్వధూటీగణమ్,కర్ణాటం విపినాట మంగనృపతిం తుంగాద్రి శృంగాలయం, వైదర్భం నవవర్భగర్భ మరసం శుష్కం తురుష్కం రణే. ౧౮

,, వేదండవ్రజగండ మండల గళద్దానాంబుధారాప్లుతో, త్పాదన్యక్కృతదైన్య సైన్యనివహక్షుణ్ణక్షమామండలామ్, యాత్రాందక్షిణదిగ్జయాయ విదధత్సంప్రాప్య కృష్ణాతటీం, సోయం రుద్రనృప స్స మైచ్ఛ దనఘో దాతుం ద్విజేభ్యో మహీమ్. ౧౯

,, శాకాబ్దేద్వయనేత్రవేదశశభృత్సంఖ్యాక రౌద్ర్యాహ్వయే, కార్తికాయాం గురువాసరే గజపతి శ్రీ వీర రుద్రాధిపః, సస్యశ్రీయుత మాతుమూడివిదితం చంద్రోపరాగే ముదా, విప్రేభ్యోఽదిశ దగ్రహారతిలకం కృష్ణాతటీపశ్చిమే. ౨౦

ఆదినా(?)మాతుమూడిప్రవిదితధరణీ దేవరమ్యాగ్రహారే, వేదైర్వ్యైప్తై) షడంగశ్రుతిపఠన సరోజానన ప్రౌఢవాగ్భిః, కీర్ణేవాక్యప్రమాణ స్ఫుటపద పదవీవా కృతిఖ్యాతవృత్తైః, భాగానా మష్టవింశత్యధికశతమితా క్లప్తసంఖ్యావిభాతి.

వృత్తిమద్గోత్రనామాని లిఖ్యంతేదక్షిణాదికం,
ఉత్తరశ్రేణిమారభ్య ప్రాచీవీథ్యా ప్రదక్షిణమ్.

కౌశికగోత్రః అచ్చన్న సోమయాజీ ఏక భాగః- కౌండిన్య గోత్రః కోటమల్లుభట్టః అర్ధభాగః-కాశ్యప గోత్రః తల్లప్పన గంగాధరభట్టః అర్ధభాగః-శృంగిభారద్వాజ గోత్రః రేగులగడ్డ రామాభట్టః ఏకభాగః- శౌనకగోత్రః ఇంగువజ్యేష్ఠ సోమాభట్టః తదనుజసోమాభట్టః పుత్ర సోమాభట్టః ప్రత్యేక మేకైక భాగినః-శృంగి భారద్వాజ గోత్రః తనికెళ్ల పోతుభట్టః ఏకభాగః - శాండిల్య గోత్రః హోతాలక్ష్మణ భట్టః ఏకభాగః-హారితసగోత్రః మల్లాది యజ్ఞేశ్వరభట్టః ఏకభాగః-శృంగిభారద్వాజగోత్రః తనికెళ్ల గంగాధరభట్టః అర్ధభాగః-శ్రీవత్సగోత్రః జనసానిఅన్నం భట్టః అర్ధభాగః-ఆభ...సగోత్రః గుంటూరి గణపతిభట్టః ఏకభాగః-కాశ్యపగోత్రః పాలపర్తి రామాభట్టః ఏక భాగః-శృంగిభారద్వాజగోత్రః రేగులగడ్డ యర్రంభట్టః అర్ధభాగః-తత్తిమ్మాభట్టః అర్ధభాగః-రేకపల్లి రామాభట్టః ఏకభాగః-గుంటూరి రాఘవభట్టః అర్ధభాగః-కాశ్యప గోత్రః ములుకుట్ల గంగాధర భట్టః అర్ధభాగః- ఆత్రేయ గోత్రః ఆకొండి గిరిపండితః ఏకభాగః - హారితస గోత్రః కొరవిగంగాధరభట్టః అర్ధభాగః-తదనుజఃసింగాభట్టః అర్ధ భాగః - కౌండిన్యగోత్రః బ్రొక్కదుర్గాభట్టః అర్ధభాగః- కౌశికగోత్రః కాండన కొండుభట్టః అర్ధభాగః-శ్రీ వత్సస గోత్రఃభావనారాయణభట్టః ఏకభాగః-కౌశికగోత్రః వేదం మల్లుభట్టః అర్ధభాగః-కౌండిన్యగోత్రఃబ్రొక్కతిమ్మాభట్టః అర్ధభాగః-కౌశికగోత్రఃఅక్క పెద్దిపోతుభట్టఃఅర్ధభాగః కౌశి



శివుని ప్రళయ తాండవము

చిత్రకారుడు: శ్రీ రాజా ఆనందమోహనశాస్త్రిగారు, మదరాసు.

కగోత్రః జయంతిభైరవభట్టః అర్ధభాగః-తద్గోత్రః మంచి భట్టః అర్ధభాగః-భారద్వాజగోత్రః రాళ్లపల్లికొండుభట్టః అర్ధభాగః-గౌతమగోత్రః పినపాటియల్లుభట్టః ఏకభాగః-కౌండిన్యగోత్రః శ్రీనృసింహాభట్టః ఏకభాగః-ఆత్రేయగోత్రః తాడేపల్లి లక్ష్మణభట్టః ఏకభాగః-దేవరాతగోత్రః యేర్లగడ్డ విశ్వనాథభట్టః ఏకభాగః-హారితసగోత్రః వేమూరియజ్ఞభట్టః ఏకభాగః-శ్రీవత్ససగోత్రః పినపాటిఓబళ భట్టః అర్ధభాగః-భారద్వాజగోత్రః చివ్వలూరి ఓబళ భట్టః అర్ధభాగః-వైష్ణవ తిరుమలభట్టః అర్ధభాగః-హారితసగోత్రః వేమూరిసామాభట్టః ఏకభాగః-హారితసగోత్రః బొడ్డుపల్లి రాఘవభట్టః ఏకభాగః-శ్రీవత్సగోత్రః సౌమిత్రి సామాభట్టః ఏకభాగః-భారద్వాజగోత్రః యంపరలమాధవభట్టః అర్ధభాగః-కౌండిన్యగోత్రః బ్రొక్కయల్లుభట్టః అర్ధభాగః-శ్రీవత్సగోత్రః వజ్ఝలవల్లుభట్టః ఏకభాగః-కౌండిన్యగోత్రః బ్రొక్కసర్వాభట్టః ఏకభాగః-కాశ్యగోత్రః కట్టమూరి రుద్రాభట్టః అర్ధభాగః-కౌశికగోత్రః పిల్లలమఱ్ఱితిరుమలభట్టః ఏకభాగః-శ్రీవత్సగోత్రః రాళ్లపల్లి రాఘవ భట్టః ఏకభాగః-శ్రీవత్సగోత్రః రాళ్లపల్లి రామాభట్టః ఏకభాగః-హారితగోత్రః లొల్లలక్ష్మణభట్టః ఏకభాగః-శాలావతగోత్రః సుసృ అక్కభట్టః ఏకభాగః-శాండిల్యగోత్రః చమిటిగంటి తిరుమలభట్టః ఏకభాగః-శ్రీవత్సగోత్రః నారాయణభట్టః ఏకభాగః-కాశ్యపసగోత్రః ములుకుట్ల కొమ్మాభట్టః అర్ధభాగః-హారితగోత్రః వేదాంతం మల్లు భట్టః ఏకభాగః-భారద్వాజగోత్రః మునగాలపెద్దిభట్టః ఏకభాగః-భారద్వాజగోత్రః రాలపల్లివల్లభభట్టః ఏకభాగః-కౌశికసగోత్రః మామిళ్లపల్లి నారాయణభట్టః అర్ధభాగః-తదనుజసూరంభట్టః అర్ధభాగః - కౌశికగోత్రః...... ద్దికొండుభట్టః ఏకభాగః-తత్పుత్రిః నారాయణభట్టః ఏకభాగః-శ్రీవత్సగోత్రః రాళ్లపల్లికామాక్షిభట్టః షడ్భాగః-కౌండిన్యగోత్రః చల్లనరగిరిభట్టః ఏకభాగః- కుమారలింగ భట్టః ఏకభాగః-తజ్జామాతా లక్ష్మణభట్టః ఏకభాగః-శ్రీవత్సగోత్రః రాళ్లపల్లి హరిభట్టః ఏకభాగః - శ్రీత్సగోత్రః రాళ్లపల్లి సింగాభట్టః ఏకభాగః-భారద్వాజగోత్రః ప్రాలపో

మయాజీ ఏకభాగః-శ్రీవత్సగోత్రః యేటూరికాళహస్తీ అర్ధభాగః-హారితగోత్రః కొమ్మనకూచిసింగాభట్టః ఏకభాగః-తదనుజతిమ్మాభట్టః అర్ధభాగః-భారద్వాజగోత్రః వడ్డె మహాదేవభట్టః ఏకభాగః-తదనుజతిరుమలభట్టః అర్ధభాగః-హారితగోత్రః కలగనృసింహాభట్టః అర్ధభాగః-భారద్వాజసగోత్రః రాళ్లపల్లికృష్ణంభట్టః ఏకభాగః-భారద్వాజగోత్రః మునగాలకృష్ణంభట్టః ఏకభాగః-హారితసగోత్రః తుమ్మపూండి అనంతభట్టః అర్ధభాగః-హారితసగోత్రః తూమునూరి కామాభట్టః అర్ధభాగః-శ్రీవత్సగోత్రః రాళ్లపల్లి కృష్ణంభట్టః ఏకభాగః-శ్రీవత్సగోత్రః చిఱ్ఱావూరి దేవం భట్టః ఏకభాగః-భారద్వాజసగోత్రః నోరిసర్వాభట్టః ఏకభాగః-శ్రీవత్సః యేటూరిలక్ష్మణభట్టః అర్ధభాగః-హారితగోత్రః అడ్డాడ...మలభట్టః అర్ధభాగః-కౌండిన్యగోత్రః లంకయజ్ఞుభట్టః ఏకభాగః-భారద్వాజగోత్రః నాలసకృష్ణంభట్టః ఏకభాగః-లోహితగోత్రః గుళ్లపల్లికృష్ణంభట్టః ఏకభాగః-భారద్వాజగోత్రః పినపాటి అక్కంభట్టః అర్ధభాగః-తత్తిమ్మాభట్టఃఅర్ధభాగః-భారద్వాజగోత్రః పినపాటినారాయణభట్టఃఏకభాగః-భారద్వాజగోత్రఃశిష్టురామాభట్టఃఏకభాగః-భారద్వాజగోత్రః(కువ?) మానభట్టప్రోలుభట్టఃఅర్ధభాగః-కౌండిన్యగోత్రః బ్రొక్కత్రివిక్రమభట్టః అర్ధభాగః-హారితగోత్రః తూమునూరిపెద్దిభట్టః ఏకభాగః-శ్రీవత్సగోత్రః రాళ్లపల్లిపిన్నాభట్టః ఏకభాగః-శ్రీవత్సగోత్రః రాళ్లపల్లియల్లుభట్టః ఏకభాగః-హారితసగోత్రఃతూమునూరికొమ్మాభట్టః ఏకభాగః-(శ్రీ)వత్సగోత్రః రాళ్లపల్లియఱు భట్టః అర్ధభాగః-హారితగోత్రః తూమునూరికనిష్ఠతిమ్మాభట్టః ఏకభాగః-హారితగోత్రః తూమునూరిసర్వాభట్టః ఏకభాగః-శృంగిభారద్వాజగోత్రఃఅప్పతాతనృసింహాభట్టః ఏకభాగః-హారితగోత్రః తూమునూరినూరుభట్టఃఏకభాగః-భారద్వాజగోత్రః పెద్దిసామావధానీ ఏకభాగః-కౌండిన్యగోత్రః శిష్టయీశ్వరభట్టః అర్ధభాగః-కౌండిన్యగోత్రః తత్కృష్ణావధానీ అర్ధభాగః-భారద్వాజగోత్రః ఖండవెల్లి జగన్నాథభట్టః అర్ధభాగః-కౌండిన్యగోత్రః నడిమింటినారాయణభట్టః ఏకభాగః-వాధూలసగోత్రః హరిఅయ్యం

గారిభట్టః అర్ధభాగః-భారద్వాజసగోత్రః మట్టపల్లితిరుమలభట్టః ఏకభాగః-అల్లూరి అనంతభట్టః అర్ధభాగః-వారణాశి తిప్పాభట్టః అర్ధభాగః-కాశ్యపగోత్రః గొడవర్తిగంగాధరభట్టః ఏకభాగః-విదుకేశ్వరపురాఘవభట్టః ఏకభాగః-ఆత్రేయసగోత్రః సొలవపెద్దిభట్టః ఏకభాగః-కాండూరియజ్ఞేశ్వరభట్టః అర్ధభాగః-భారద్వాజగోత్రః చామర్తినరసింహాభట్టః ఏకభాగః-కాశ్యపసగోత్రః మాగంటిఅమరేశ్వరభట్టః ఏకభాగః-హారితగోత్రః అడ్డాడరామాభట్టః అర్ధభాగః-కౌండిన్యగోత్రః యజ్ఞఅప్పనసింగాభట్టః అర్ధభాగః-అడ్డాడజ్యేష్ఠతిరుమలభట్టః అర్ధభాగః-హారితగోత్రః అడ్డాడకనిష్ఠప్రోలుభట్టః అర్ధభాగః-గౌతమగోత్రః లక్ష్మణజోస్యః ఏకభాగః-వేముజౌభలభట్టః అర్ధభాగః-శాండిల్యగోత్రః వేంగాభట్టః అర్ధభాగః-శ్రీవత్సగోత్రః గొడవర్తియీశ్వరభట్టః అర్ధభాగః-శ్రీవత్సగోత్రః గొడవర్తితిరుమలభట్టః అర్ధభాగః-హారితసగోత్రః శ్రీకంఠసోమయాజులరామచంద్రభట్టః ఏకభాగః-భారద్వాజసగోత్రః కామకొల్లి భయిరవభట్టః అర్ధభాగః-భారద్వాజగోత్రః కామకొల్లి జ్యేష్ఠభైరవభట్టః అర్ధభాగః-హూద్గల్యగోత్రః మంత్రమూర్తిఅవుభళభట్టః అర్ధభాగః-హూద్గల్యగోత్రః మంత్రమూర్తిబసవాభట్టః పాదాధికభాగః-హూద్గల్యగోత్రః మంత్రమూర్తిలక్ష్మణభట్టః పాదోనైకభాగః-లోహితగోత్రః గుళ్లపల్లితిమ్మావధానీ ఏకభాగః-హారితగోత్రః గరికపాటి విశ్వేశ్వరభట్టః ఏకభాగః - శ్రీవత్సగోత్రః యేటూరి పెద్దిభట్టః ఏకభాగః-కౌండిన్యసగోత్రః బ్రొక్క తిమ్మాభట్టః అర్ధభాగః - కౌండిన్యసగోత్రః సర్వాగ్రహారప్రతిగ్రహీతా శిష్టకపర్దీశ్వరభట్టః-పంచభాగః తత్సర్వాభట్టః పాదభాగః-కౌండిన్యసగోత్రః పెదతిప్పాభట్టః అర్ధభాగః-కౌండిన్యగోత్రః శిష్టమాభట్టః అర్ధభాగః-ఏతేసాష్టభోగాభాగాః. శ్లో. దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనమ్ దానాత్స్వర్గమవాప్నోతి పాలనాదచ్యుతపదమ్, అస్యగ్రామస్యమాచిహ్నాని లిఖ్యంతే.

అతుమూడి పొలిమేర సీమా చిహ్నాల లక్షణం పూర్కి తూర్పున చలుమూర్కి పొయ్యే డొంకనుండి పొలిమెర దక్షిణముఖమై కొత్తమెరరాగాను అక్కడనుండి కునిపల్లం జొచ్చి తూర్పుగా వచ్చి అందుండి దక్షిణముఖమై వచ్చి యీపూరి నల్లగుంట్ల తూర్పు డ్రోచికుంట్ల ఉత్తరపుకట్ట మోపుకొని పశ్చిమంకుని నుండి దక్షిణముఖమై వచ్చి ఆమీదట పడమట పిన్నకుని అందుండి దక్షిణముఖమై పూరిపొలిమేర పుట్టనుండి ఆవలకునిగా పశ్చిమపుముఖమై వెల్లంబాటి వుత్తరంగా వచ్చి అందుండి కుని దక్షిణముఖమై వచ్చిదక్షిణము ముట్టిన ఆగ్నేయకోణం పుట్టనుండి పడమరముఖమై వచ్చి ఆమీద దక్షిణముఖముకుని ఆమీద నైరుతి ముఖమైవచ్చి అవురుదుబ్బలపల్లం జొచ్చి పడమరగా వచ్చి అతుమూడి దక్షిణపుపొలము నైరుతిమూల వెల్లబాటి కుచ్చిళ్లపాటి పొలిమెరకూడలినుంచ్చి కుచ్చిళ్లపాటి పొలిమెరతూర్పు పట్టుకుని వుత్తరముగాను కొంత్తమేర రాగాను అందుండిపడమరముఖమై వచ్చి అందుండి వుత్తర ముఖమై కుని ఆమీదను పడమరగాకుని ఆమీద వుత్తరముఖమై కుని ఆమీదను పడమటిముఖమై వచ్చి అందుండి వుత్తరముఖమై అందుండి పడమరగాకుని అందుండి వుత్తరముగాకుని ఆమీద కుంట్ల తూర్పుముఖముగా వచ్చి వుత్తరపు...ంట్లనుండి చముడుపాటి పొలిమెరసంద్దినుండి పడమరగావచ్చి ఆమూలనుండి కున్కి వుత్తరం వాయువ్యముఖమై అందుండి వచ్చి భీమారెడ్డి కుంట్లపడమర చముడుపాటి దావులూరి పొలిమేర మోచుకొని తూర్పుగా మెడితోపు వుత్తరము కునిగా వచ్చి అందుండి తూర్పుముఖమై రాగాను కుని కుంట్ల దావులూరి పొలిమేరసంద్దు వుత్తరపు ముఖమై వచ్చి అందుండి కుని పడమర వచ్చి అందుండికుని వుత్తరముగావచ్చి దావులూరు పొలిమేర తూర్పు సరసదూల గొట్టె కొనదాకాను తూర్పుగా వచ్చి అందుండి తూలుగొట్టె కొననుండి వుత్తరముగావచ్చి పడమర దావులూరి పొలిమేర సంద్దు వాయువ్యం మూల తూములూరి పొలిమేర సరసనంటించ్చుకకుని తూర్పుగావచ్చి అందుండి పిన్న కుని వుత్తరంగా వచ్చి తూములూరి ఆగ్నేయం పొలిమెర దక్షిణపు సరసను తూర్పుగా రాగాను

అద్దుండ్డి మేడితోపు వుత్తరముగా వచ్చి తూర్పుగా కొంత్తె మెర రాగాను అద్దుండ్డి ఆతుమూడి మెలెపాడు తూములూరు యేలెపాడ్కి పడుననయించ్చి పసువుల యిచ్చి(?) పసుపుదొడ్డిపొలం తూములూరి పొలాననుండ్డి ఆతుమూడి వాయవ్యభాగాననుండ్డి తూర్పు ముఖమై కొంత్తె మేర రాగాను పెద్దపుట్ట అద్దుండ్డి వుత్తరపు ముఖమై రాగాను పెద్దజంమ్మిన్ని వెంట ఒకజంమ్మిన్ని అద్దుండ్డి వుత్తరపు ముఖమై రాగాను నక్కశిరిగిచెట్టు అద్దుండ్డి వుత్తరము ముఖమై రాగాను తాడిమొలక పడ్మరగా వచ్చెడి డొంక్కగలశి వుత్తరముఖమై వచ్చి జువ్వి మొలక చింన్న జంమ్మిన్ని తాటింన్ని అద్దుండ్డి వుత్తర ముఖమై రాగాను పాడిఆవుల ఆధరి డొంక్క వుత్తరపు వ్రాడల్కు మేడిమోచి దక్షణపు కట్ట డొంక్కనుండ్డి తూర్పుముఖమై వచ్చి తూర్పుగా దావులూరి డొంక్క వచ్చి శివుని పాయను జొచ్చి యీశాన్యపుకోణను వుత్తర ముఖమై దావులూరి పెదలంక్క యీశాన్యపుకోణం పుట్టనుండ్డి తూర్పుగా పుచ్చలలంక్క పడమటిదరి పట్టుకుని ఆగ్నేయముఖమై గాదెలమట్ట తూర్పువద్ది అన్న వరపు మినుములలంక్క చేని వుత్తరపుకీవి మెరపట్టుకుని నైరుతిముఖమై వచ్చి కొంత్తెమెర పింన్నకుని వాయువ్య ముఖమై శివునిపాయ వుత్తరపుధరి పట్టివచ్చి అద్దుండ్డి దక్షణముఖమై ఆతుమూడి అన్నవరపు కాటేల్లడొంక్క పట్టుకుని దంట్టబోయినవాసివాగు జొచ్చి వీరంరాజురావి తూర్పుకాలవ ధరిదాకా వచ్చి అద్దుండ్డి తూర్పుముఖమై డొంక్కవద్ది కెడమాసాభండ్డి ఆవునంగ్గాను దక్షణముఖమై దీవిడొంక్కకువచ్చి అద్దుండ్డి తూర్పుముఖమై దీవిడొంక్క దక్షణపు పొలిమెరగట్టు పట్టుకొనివచ్చి అద్దుండ్డి అన్నవరపు బుడమలశెనుపొలం హద్దుఆనుకుని పడమటి గరవుపట్టి పొలిమెర దక్షిణముఖమై వచ్చి అద్దుండ్డి పడమరగావచ్చి అద్దుండ్డిదక్షిణంగ్గా కొంత్తెమెరవచ్చిఅద్దుండ్డికునితూర్పుగా కొంత్తె మెరవచ్చి అద్దుండ్డియీశాన్య మూల అన్నవరం పొలిమెర దక్షిణం...తూర్పుముఖమై అన్నవరపు మాలవాడ తూర్పు జంమ్మి వుత్తరపు పెద్ద పుట్టనుండ్డి డొంక్కలంక్క పొలం కృష్ణవేణిలోపల్కి తూర్పుగా దిగి అద్దుండ్డి యీశాన్యప్రాచిని అయిలూరాక్క పడమర వెపుకుని దక్షణముగా వచ్చి రావి లంక్క తోటఛాయ లంక్క పడమటి లంక్కమీది జంమ్మిదాకాను పడమటిముఖమై వచ్చి అద్దుండ్డి పడమర ముట్టి వాయువ్యం పడమటిదరి మోచి నేల జంమ్ములగట్టు పట్టుకుని వాయువ్యముఖమై అంన్న వరం దక్షణపుదిక్కు మూడోపెద్దజంమ్మి దక్షిణపుదాకా వచ్చి అద్దుండ్డి యించ్చుక పడమరముఖమై చిలుమూరి ఉత్తరపుపొలిమెర యీశాన్యమూల తూర్పుగట్టు పట్టుకుని వుత్తరముఖమై రెండ్డోజంమ్మి దక్షణాన కొంత్తెమెర నుండ్డి పడమరముఖముగా వచ్చి అద్దుండ్డి కుని దక్షణ ముఖమై అద్దుండ్డికుని పడమరగావచ్చి పొలిమెరపటి దక్షణముగా వచ్చి అద్దుండ్డి ఆగ్నేయముఖమై కునిగాను యించ్చుక మేర వచ్చి అద్దుండ్డికుని దక్షణముఖమై వచ్చి అందుండికుని పడమరగా వచ్చి అద్దుండ్డి దక్షణముఖమై వచ్చి అద్దుండ్డి ఆతుఅద్దుండ్డికుని పడమూడి తూర్పు చిలుమూరిపొలం పొలిమెరమీది డొంక్క కలిశెను.

ప్రతివిలేఖకుని వ్రాత:—

—"ప్రజోత్పత్తినామ సం॥ మార్గశిర బ. ౧౦ జయవారం తే ౧౦ ది డిసెంబరు ౧౮౧౧ సంవత్సరం.

ఈవ్యాసమునుగూర్చి నేను వ్రాసినదానిని ముద్రణదశలోఁ జూపఁగా మన్మిత్రులు శ్రీ సోమశేఖరశర్మ గారు వారు సేకరించుకొన్న విషయమును దీనినిగూడఁ జేర్చుకొన వ్రాసియిచ్చిరి.

కళింగ గంగవంశపు రాజులయొక్కయు, ఒరిస్సా గజపతులయొక్కయు చరిత్రమునుగురించి కొంత పరిశ్రమచేసి మన్మోహన చక్రవర్తిగారు కొన్ని వ్యాసములు వ్రాసియున్నారు. వారు వ్రాసిన వ్యాసములనుబట్టియు, శాసనములనుబట్టియు ఈక్రింది విషయములు తెలియుచున్నవి: గంగవంశములోనివాఁడైన నాలుగవ భానుదేవుని పిదప బమ్మానిరాజు సహాయముతో కపిలేశ్వరగజప

తి క్రీ. శ. ౧౪౩౪-౩౫ లో రాజ్యమునకువచ్చి ౧౪౬౯-౭౦ వఱకు పరిపాలించెను. ఇతడు ౧౪౬౨ ప్రాంతముల విజయనగర రాజ్యముపై దండెత్తివెళ్లెను. అప్పటికి విజయనగరమును పాలించుచుండిన రాజు మల్లికార్జునరాయలు. గంగాధరకవి విరచితమైన 'గంగాదాస ప్రతాప విలాస' మను సంస్కృత నాటకములో మల్లికార్జునరాయలు పేర్కొనబడుటయేకాక, ఆతడు సింహాసనమెక్కిన కొద్దిదినములకే గజపతిప్రభువు తురుష్కసుల్తాను సాయముతో విద్యానగరమును ముట్టడించినట్లును, మల్లికార్జునరాయలే విజయము నొందినట్లును, ఆతని శత్రువులు ప్రాణావశిష్టులై పారిపోయినట్లును చెప్పబడి యున్నదట. ఇందు పేర్కొనబడిన గజపతిప్రభువు కపిలేశ్వరుడే కావచ్చును. అతడు ఓడిపోయినమాట ఎంతవరకు సత్యమో కాని క్రీ. శ. ౧౪౬౪ నాటి అతని శాసనములు కంచికి దక్షిణమునను గాన్పించుచున్నవి.

కపిలేశ్వర గజపతికి కొడుకులు చాలమందిగలరు. వారిలో పురుషోత్తముడొకడు కాని యితడు జ్యేష్ఠుడు మాత్రముకాడు. కపిలేశ్వరుని యనంతరము సింహాసనమునకై కొడుకులలో కొడుకులకు తగవులు పుట్టినవి. తుదకు బహ్మనీసుల్తానయిన రెండవ మహమ్మదుషా సాయమున పురుషోత్తమ గజపతియే క్రీ. శ. ౧౪౬౯-౭౦ లో రాజ్యమునకువచ్చి ౧౪౯౬-౯౭ వరకు పాలించెను. చైతన్యచరితామృతమను చైతన్యస్వామి జీవితము ననుసరించి, ఈపురుషోత్తమగజపతి విజయనగరముపై దండెత్తి అచటినుండి యొక రత్నసింహాసనమును దెచ్చి జగన్నాథ స్వామి కర్పించెననియు, సాక్షి గోపాలవిగ్రహమును దెచ్చి తనరాజధానిలోనే యుంచుకొనెననియు దెలియుచున్నది. ఇతని తరువాత క్రీ. శ. ౧౪౯౬-౯౭లో ప్రతాపరుద్రుడు సింహాసనమునకు వచ్చెను. ఇతనికి వెంకటగజరాజ, త్రిభువనమల్ల, తోడరమల్ల బిరుదములు కలవు. ఇతడు తన రాజ్యమునందలి దక్షిణభాగమున నున్నపుడు గౌడదేశాధిపతి యితనిరాజ్యమునందలి యుత్తరభాగముపై దండెత్తివచ్చి దానిని స్వాధీనపఱుచుకొనెను: ఈవిషయము తెలిసికొని యాతడు మరల నాభూపతిపై దాడివెడలి ఆతని నోడించి తనరాజ్యమును దిరిగి స్వాధీనము చేసుకొనెను. గౌడభూపాలుని ఓడించుటచేతనే కావచ్చును ఈతనికి పంచగౌడాధినాయక బిరుదమును గలదట.

ప్రతాప రుద్రదేవుని రాజ్యాంత మెప్పుడో తెలియదు. ఇతని తరువాత ఇతనికొడుకు 'కాలు-ఆ-దేవు' సంవత్సరము అయిదుమాసములును, అటుపిదప అతని మరియొక కొడుకగు 'కఖ్ఖారు-ఆ-దేవు' మూడుమాసములును రాజ్యముచేసిరట. ఈ యిరువురినిగూడ వారి మంత్రియైన గోవింద విద్యాధరుడు వధించి క్రీ.శ.౧౫౪౧-౪౨ సంవత్సరమున సింహాసన మెక్కెనట. దీనివలన ప్రతాప రుద్రుడు క్రీ. శ. ౧౫౩౯-౪౦ వరకు పాలించిన ట్లు భావింపవలసి యున్నను.

# పితృస్మృతి

మండలేముల వెంకటశాస్త్రి గారు, బి. ఏ., యల్. టి.

కృతపుణ్యుఁడు గుణగణ్యుం-డతిమాన్యుం డార్యనుత మహాసౌజన్యుం
డతులితమతిమంతుఁడు మ-త్పితరుఁడు సత్కీర్తి నొంది వెలసెన్ బుడమిన్.

అక్షయవర్ష ఫాల్గుణసితాష్టమి ప్రొద్దునఁ బుట్టి పూర్వపున్
బక్షపుఁ జంద్రు మాడ్కి నభివర్ధనుఁ డై కళలందు మిన్న నా
దక్షత నొంది సత్పథముఁ దప్పి చరింపక పుణ్యమూర్తి యై
యక్షయమౌ యశోధన మనారతముగ్ గడియించె ధాత్రిలోన్.

ఆడినమాట కేనాఁడేని భంగ మింతైనఁ గన్పడని సత్యవ్రతుండు
భువి "నాత్మవ త్సర్వభూతాని" యనున్యాయ మరసిన భూతదయాపరుండు
సుఖదుఃఖములు గల్గుచో మోదఖేదంబు లూనని యాత్మవిజ్ఞాన ఘనుఁడు
తన కెంత నడువని తతినైన యన్యులఁ జే సాఁచి యడుగని శీలవంతుఁ
డిలను బండిత వంశమై వెలయుచుండు-మండలేముల సత్కుల మండనుండు
బొబ్బిలి నృపాలు నాస్థాన భూషణుండు-మద్గురువరుండు సద్గుణమండలుండు



కీ. శే. మండలేముల సీతారామశాస్త్రి గారు

విలసితబాహు విక్రమ వివేక ధురీణచరిత్రులైన బొ
బ్బిలినరపాలసింహముల విశ్రుతసచ్చరితంబుఁ దెన్గునన్
సలలితపద్యకావ్యముగఁ జక్కనిశైలి రచించి రంగభూ
తలపతిచే బహూకృతు లుదారముగాఁ గని మించె నెంతయున్.

ఘనతరకాళిదాస కవికల్పమహీరుహ జాతమై సుధీ
జనశుకభోగ్యమై మధురసమ్ముల నెమ్మెయిఁ జిమ్ము సత్ఫల
మ్మును రఘువంశ కావ్యమును ముద్దులు మూటలుగట్టు మాటలన్
దెనుఁగునఁ బద్య కావ్యముగ ధీమహితుం డొనరించెఁ బూనికన్.

అమృతరసప్రవాహయుతమై శ్రుతిపర్వ మొనర్పఁ జాలు వా
క్యములబెడంగు, నెన్నఁదగు నంచిత సుస్వరవైభవంబు, న
ర్థము వివరించు కౌశలము, రాగ విశేషము నొప్పఁగాఁ బురా
ణముల నతండు పండితగణమ్ములు నౌనని మెచ్చఁ జెప్పెడున్.

ప్రాణము వోవనున్నతఱిఁ బ్రక్కను జేరిననన్నుఁ జూచివి
న్నాణము మీఱఁగా "ననుఁగునందన! ధర్మపరత్వమున్, శ్రిత
త్రాణపరాయణత్వమును దప్పనిధర్మము లంచు నెమ్మదిన్
బూనుము నీకు మేలగును బో"మ్మని పల్కెహితోపదేశమున్.

ధీరగుణాఢ్యుఁ డంచుఁ బ్రణుతిన్ గని సద్యశ మందఁజాలి సం
సారముఁ బాయఁజాలని విచారము నవ్వలఁ బాఱఁదోలి జం
భారిని గొల్చి స్వర్గసుఖ మందెడు వేడ్కను జాలిమాలి యీ
తీరునఁ బాసిపోయి మము దీనుల జేయఁగ మీకుఁ బాడియే?

మిత హిత సత్యభాషణము, మేర యెఱుంగనిజ్ఞానభాగ్య, మా
ర్జిత ఘనసద్యశంబుఁ, దగుశీలము, నూర్జితభావ, మార్య స
న్నుతచరితంబు నియ్యవి యనూన నిసర్గసులక్షణంబు లో
పితృవర? మీకు నెయ్యెడల వేల్పులు సాటి యనంగఁ బోలునే?

శాంతరస మొల్కు బ్రహ్మతేజంబు గల్గి-వైది కాచారసంపదఁ బరిఢవిల్లి
జ్ఞానమూర్తి యనంగఁ బ్రజ్ఞావిశేష-మమర వెలసితి గాదె మహాత్మ నీవు?

కర్మవశంబునన్ గలుగు కాయము వోవు టదేమివింత? స
త్కర్మము లాచరించి గత కల్మషులై మనినట్టి మీకు నేఁ
డర్మిలి మోక్షలాభ మగు టబ్రమె? పండితవర్య! మాకు మా
కర్మమె తోడు వచ్చు నని కాదె త్యజించితి వీవిధమ్మునన్.

పురుషార్థంబుల గెల్చి సౌఖ్య మనయంబున్ బొంది సత్కీర్తి కా
కరమై పొల్చి సుపుత్ర పౌత్రతతి వేడ్కన్ గొల్వఁ బెక్కేఁడు లు
ర్వరపై నిల్చి కృతార్థతన్ బరఁగి యార్యశ్రేణి మెచ్చంగ నేఁ
గిరి యీలోకము వాసి మీచరితమున్ గీర్తింపరే పండితుల్!

అనఘా! మీఋజువర్తనం బిలను మా కాదర్శమై ధర్మవ
ర్తన సౌభాగ్యము గూర్చుఁగావుతఁ! గృపాధౌరేయులై మేలి దీ
వెనలన్ మమ్ము ననుగ్రహింపుఁ డిదె సంప్రీతిన్ బితౄణంపున
ప్పనమున్ గైకొనుఁ డార్జితోన్నత యశోభాగ్యోదయా! పావనా!

అనుపమభక్తిసమన్విత- ఘనులగు మీయాత్మ కొసఁగుఁగావుత శాంతిన్
మనసున వాకునఁ గన్నులఁ-గనరాని పరాత్పరుఁడు సుఖప్రదుఁ డగుటన్.

---

# ఆంధ్రనాటకరచనము

పాతాళభేది సుబ్రహ్మణ్యకవి గారు

"సంసారవిషవృక్షస్య ద్వేఫలే అమృతోపమే, కావ్యామృతరసాస్వాద స్సల్లాప సజ్జనైస్సహ."

అను నీపెద్దలనుడి జగద్విదితముగదా. సంసారమను విషవృక్షమునకు నమృతోపమానంబులగు రెండుపండ్లలోను దొలిది కావ్యామృతరసాస్వాదము. అమృతరసము గురియుచుండు కావ్యములు శ్రవ్యములని, దృశ్యములని రెండువిధములు. ఈదృశ్యకావ్యములనే యార్యులు నాటకములని,రూపకములని వ్యవహరించిరి. మనహిందూదేశమునందుండు భాషల కన్నింటికిని దల్లి సంస్కృతమని యెల్ల రెఱింగిన విషయమే. ఆభాషను దృశ్యకావ్యములు రసము లొలుక, నమృతము గురియింప ననువగునట్లు రచియింపఁ గవులకు మార్గము చూపఁగల ప్రతాపరుద్రీయ దశరూపకసాహిత్య రత్నాకరాది లక్షణ గ్రంథము లెన్నేనియుం గలవు. కాని తెలుఁగుభాషను నట్టిరూపకలక్షణగ్రంథ మొక్కటియైనను గానవచ్చుటలేదు. ఇప్పుడిప్పుడు ననేకాంధ్రకవులు సంస్కృతవిద్యాగంధ లేశమైనను లేక యేరెండు పదములో కూర్చి యెట్టులెట్టులో కష్టపడి పద్యమున నర్థపాదము నల్లఁగల్గినతో డనే నాటకములు వ్రాయ నుపక్రమించుచున్నవారు. అట్టి నాటకములఁ గన్నడప్పు డంతయు నాంధ్రభాషాయోషకు నెట్టియిక్కట్టు ప్రాప్తించెనాయని పెద్దలు చింతింతురు. ఈవిషయమునుగూర్చి ముచ్చటించుచు నాంధ్రసాహిత్యపరిషద్దష్టమ వార్షికోత్సవ సమయమునఁ దత్సభాధ్యక్షులగు మహామహోపాధ్యాయ కళాప్రపూర్ణేత్యాది బిరుదాంకితులగు బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయశాస్త్రులవారు తమ యుపన్యాసమునఁ జెప్పిన విషయము గొంత తెలిపిన సమంజసముగా నుండకపోదని యెంచి తెలుపుచున్నాను.

"రూపకములు ప్రకృతకాలముననే ఉత్పన్నములై ఇప్పటికే నెల్లెడలను పదమిడవలనుపడనియట్లుగాఁ జెత్తపెరిఁగి, కవితానగరసంస్కరణాధ్యక్షులకు మితిమీఱిన పనిం గలిగించుచున్నవి. ఇవి పెక్కులు ఏలక్షణముం బొరయక హూణరూపక లక్ష్యములం గని కవి యూహించుకొన్న మార్గమున వ్రాయంబడినట్టివి. ఇవిగాక సంస్కృతనాటకముల కాంధ్రీకృతము లగుటచేతను, ఆంధ్రకవి యిచ్చచేతను భరతోక్తలక్షణానుసారులైన రూపకములును కొన్నికలవు. ఈరెండులక్షణములలో ఏది శ్రేష్ఠము. హూణమే సులువు: మంచినీళ్ల జాలు. భరతోక్తలక్షణము హఠయోగము: గురుశుశ్రూష లేక యలవడదు. ఈపీడ యేల ౨. ని దీనిని పెడంటులకు 'ఒగ్గివయిచి' అమూల్యయశోలిప్సు శిఖామణులు హూణమార్గము నవలంబించుచున్నారు. ఈవిషయమున ఇందు ఏమార్గము శ్రేష్ఠమో పండితులు నిర్ధారింపవలసియున్నది. రెండింటిస్వరూపములను విస్తరించు గ్రంథములు రచింపవలయును." అని యుపన్యసించియున్నారు. పండితవర్యులు తెలుఁగున నాటకము లెట్లుండిన రసవంతములుగను, సర్వజనసమాదరణీయంబులుగను నొప్పఁగలుగునో యారసి తల్లక్షణగ్రంథములు రచియించి యాంధ్రభాషామతల్లికిభూషణములు పెట్టవలసియున్నది. సంస్కృతాంధ్రములఁ జక్కఁగ నాఱితేఱిన పండితప్రకాండులు పనిఁబూని యీకార్యమునకుఁ దొడంగుట లగ్గు.

నే నీవ్యాసమున నాటకలక్షణముల ననుశాసింపఁబూనినవాఁడను గాను. ఏ నర్దానికి వలంతిని గాను. ఇప్పుడిప్పుడు వెలువడుచుండుననేకనాటకగ్రంథములఁ జూచి యందందుఁగల కథాసరణులందును, పాత్రపోషణములందును, పాత్రోచిత భాషావిరచనములందును నాస్వల్పబుద్ధికిఁ దోఁచిన కొన్ని యంశములను జెప్పి నాయోపినకొలఁది భాషాసేవయుఁ, దన్మూలమున దేశసేవయుఁ జేయనెంచితిని. పండితవరులీసాహసకృత్యమునకై నన్ను మన్నింతురుగాక.

దేశాభిమానమును, ప్రపంచమును బాగుపఱుపఁగల నీతిమార్గములును జనులకెల్లరకును దెలియఁజేయఁ గలుగుటకేమి, భగవద్భక్తి ప్రబోధింపనేమి యిట్టి యన్నివిషయములకును నాటకమువంటి సులభమార్గము వేఱొక్కటి గానరాదు. కావున నాంధ్రలోకమునకే కాక ప్రపంచమున కంతకును నాటకప్రదర్శనము మేలు గూర్చునట్లు వేఱేదియు మేలుగూర్పఁజాలదని చెప్పనగును. పూర్వ

రాజుల చరిత్రములేమి, పూర్వీకుల యాచారవ్యవహారములేమి, పూర్వీకుల సద్బుద్ధి ప్రతిభలేమి, ప్రజలకుఁ జక్కగఁ జిత్రించి చూపఁగల ఫలకము నాటకమేయని ఘంటాఘోషముగఁ జెప్పఁదగియున్నది. కావున నాటకములు ప్రజలకు నీతి గఱపునట్టివిగా నుండవలయును. అందలి నాయకులు సత్యవాదులుగను, న్యాయమార్గావలంబులుగను, ధర్మసంస్థాపకులుగను, నధర్మోన్మూలకులుగను, దుష్టశిక్షకులుగను శిష్టరక్షకులుగను స్వార్థత్యాగులుగను దేశోద్ధరణ తత్పరులుగను నుండునట్లు నాటకకవులు చిత్రింపవలయును. నాటకకథా సంవిధానమునందును నీగుణములు లెస్సగ ద్యోతకములగుచుండిన నెంతయు బాగు. అట్లుగాక యే యుద్యానవనములలోననో, యేయుత్సవములలోననో నాయకుఁడు నాయికను జూచుటయు, నంతతోడనే వారల కొండొరులపై మోహ ముదయించుటయు, నంత వారికిఁ బునర్దర్శనమేని సంభవింపక విరహము గలుగుటయు, నప్పట్టున వారు చంద్రమదనానిలముల దూఱుటయు, నేవిదూషకుఁడో, యేచేటియో వారలను గూర్చుటయు నను నింతపట్టు విషయములే నాటకములలోని కెక్కఁ జేసినయెడల నెట్టి లాభమును బొందఁజాలము. నాయకుఁడు నిజముగ దుర్మార్గుఁడే యైనను వారివలన నెవ్వియేని జనులు నేర్చుకొనఁదగిన యంశము లున్నయెడలఁ గవులు నిరంకుశులైనదానిచేత సాధ్యమైనంతవఱకు నట్టినాయకుల దుర్మార్గములను సన్మార్గములుగ మార్చి చిత్రించుచు వారి సన్మార్గము లావంతయు వీడక ప్రజలకుఁ జిత్రించి చూపవలయును. అట్లేకదా రోమునగరాధిపతియగు జూలీసు సీజరనునాతఁడు నిశ్చయముగ నత్యాశ గలిగి స్వార్థపరుఁడే యైనను షేక్స్పియర్ కవిచంద్రుఁ డాతనియెడ నుండిన కల్మషవృత్తులఁ గనఁబఱుపక యాతనియెడలఁ బ్రజల కెట్టి యసూయయుఁ బుట్టకుండునట్లు రచియించి వన్నెవెట్టియున్నాఁడు. అట్లే బొబ్బిలియుద్ధమప్పుడు తదంతఃపురాంగనలు పెండ్లికూఁతులయ్యును, గర్భిణులయ్యును, గన్యలయ్యును బతులచేతఁ గుత్తుక లుత్తరింపఁబడినట్లు దేశచరిత్రలు నుడువుచుండినను, శ్రీవేంకటరాయశాస్త్రులవారు రచియించిన బొబ్బిలియుద్ధనాటకమున నీయంతఃపురాంగన లెల్లరును వీరపతివ్రతలై తమంతఁ దామే మనసార నగ్నిప్రవేశముఁ జేసి స్వర్గమునఁ దమపతులకు స్వాగతములు సమర్పింప నెదురుచూడఁ బోయినట్లు రచియింపఁబడియున్నది. దానంజేసి ప్రజలకు రంగారాయాదుల శౌర్యమును, వారి వీరపత్నుల పతిభక్తియు వెల్లడియయి మనస్సుల నూతనోత్సాహ మంకురించుచున్నది.

నాటకములు ప్రజాపరిస్థితికి మేలు గూర్చునట్టి విషయములు బోధించునట్టివై యుండవలయునుగాని వేఱువిధము లైనచో గుణముండదు. నాయకుని దుర్మార్గమువలనఁ బ్రజలు మేలందునట్టి పరిస్థితి గలుగునేని దానిని దప్పక తెలుపవలయును. "కంసుఁడు హింసయే పనిగాఁ బూని చేయుటంజేసి కడకుఁ దానే హింసింపఁబడెను. పరసతీమోహమునంజేసి రావణుఁడు హతుఁడయ్యెను. లోభబుద్ధియయి దుర్యోధనుఁడు చంపఁబడె"నను నిట్టివిషయము లెటింగించుపొంటె వారి దుండగములు ప్రజలకు లెస్సగఁ జిత్రించి చూపవలయును. కంసు నిహింసాకరణము చూపక కృష్ణుని లీలలని యాతని కొంటెతనములఁ జూపుచు వానిసందునఁ గంసవధమును జూపినయెడల నెట్టినీతియుఁ దోఁపదు. అందుఁ గృష్ణుని కొంటెతనమే తెలిపినయట్లగును. నాయకుల దుండగములఁ జిత్రించుటలోనను గవులు యుక్తాయుక్తములు లెస్స విచారించి చేయవలయును. దుర్యోధనుని దుండగమేకదా యని యాతఁడు పతివ్రతాతిలకమగు ద్రౌపదీదేవిని సభ కీడ్చి తెప్పించి తమ్మునిచే నామె పుట్టము లొలిపించినది ప్రత్యక్షీకరింపరాదు. నీతి యున్నదని యవినీతు లెక్కువగనుండు నెట్టి యితివృత్తములును నాటకములుగ రచింపరాదు. గురుద్రోహముచేసి చంద్రుఁడు కళంకి యయ్యెనని 'తారాశశాంకము' నుడువుచున్నది. దీనిలో నెట్టినీతి యుండినను దల్లి కి మాఱైన గురుపత్నియగు తారయుఁ, బుత్రతుల్యుఁడగు చంద్రుఁడును నొండొరులు వలచిరని నీతికి వెలితియైన విషయము చూపి దానిచేతఁ జంద్రుఁడు కళంకి యయ్యెనన్న నీతి గ్రహింపఁజేయుట కొండను ద్రవ్వి యెలుకను బట్టుట వంటిది. 'అహల్యాసంక్రందనీయము' నట్టిదే యగును.

కవులు తాము రచించు నాటకములలో నౌచిత్యముదెస మిగుల జాగరూకులై చూపుంచి యుండవలయును. పైనఁ జెప్పినశాస్త్రులవారి యధ్యక్షకోపన్యాసమునందే, "ఈ సులభరూపకం పుటలలో ఔచిత్యము అసలంటుచున్నది. రాజును మంత్రియు, రాజు,మంత్రిని ఓరీ యనక మానరు. సేనికూఁతురు నిండుగుబ్బెత సేనియమాత్యసత్తముని ఓరీ యనకమానదు. క్షత్రియచక్రవర్తి ఘనుండైన తురకబీబీని ఉంచుకొనకమానఁడు. ఆయుత్కట సుకృతమునకు ఫలముగా

"త్రిభిర్మాసై స్త్రిభిర్వర్షై స్త్రిభిఃపక్షై స్త్రిభిర్దినైః
అత్యుత్కటైః పుణ్యపాపై రిహైవ ఫల మశ్నుతే"

అను మహదాశీఃప్రభావమున బీబికా గర్భశుక్తిముక్తామణీభూత నిజౌరసపుత్రునిచేత రణరంగంబునం బ్రాణముం గోల్పోకమానఁడు. అంతటితోఁ జంద్రవంశపరిపాలనము అస్తమింపక మానదాయెను. ఆసేతు వింధ్యము ఆంధ్రాదిలోకము అంధతామిస్రలోకము కాకమానదాయెను. ఇట్టి యనౌచిత్యపుఁ జెట్టలను తోట్టతోలుతనే దిట్టపండితులు నెట్టివైవవలయును" అని చెప్పియున్నవారు. ఈ తుదివిషయము శ్రీ శాస్త్రులవారు "రామరాజు" నాటకముపైఁ దీసినదెబ్బ యని యానాటకము చదివియో చూచియో యుండు నెల్లరును నెఱుంగఁగలవారు. అరయఁగా దేశచరిత్రములలో నెందును లేని రామరాజుయొక్క యీ విపరీత వ్యభిచారప్రవృత్తి మేల తెలుపవలసివచ్చెను. ఆవలఁ బితృహత్యచేసి తినని పఠాణికిఁ బిచ్చియెత్తి, తత్పాతకము మత్తు తల కెక్కఁ, దనవలచిన కాంత నాషాబీని జంపివైచెను. అంతలో నాస్త్రీ హత్యకుఁ గందుచు నొడలు తెలిసి యాయింతివలని విరహ మోర్వక యాత్మహత్యతోఁ బితృ



శ్రీ రామదాసు కట్టించిన మంటపము



భద్రాచలయాత్రకై రాజమహేంద్రవరమున పడవలెక్కుట



శ్రీరామగిరి గ్రామము పెద్దకొండపై రామాలయము కలశము



పర్ణశాల దేవాలయము



పట్టాభిషేకమంటపము (అసంపూర్ణనిర్మాణము)



పాపికొండలు



సీతను రావణుడు రథమున కొనిపోయిన ఆనవాళ్లు



పర్ణశాల-సీతాదేవి వస్త్రములనారవేసిన గుర్తు

హత్యయు, స్త్రీహత్యయుఁ గలిగించిన కిల్బిషమును బోఁగడిగికొనెను. ఆహాహా! ఈతఁడు తనవలపులాఁడితో వీరస్వర్గమునఁ గలిసికొనియుండు నేమో కదా. ఈ వీరస్వర్గము యుద్ధమరణము నొందినవా రుండు నా వీరస్వర్గమునకంటె వేఱుగ నాత్మహత్యలును, స్త్రీహత్యలును, బిత్రుహత్యలును నొనర్చినవారికని, బ్రహ్మసృష్టికిఁ బ్రతిసృష్టి యొనరించిన విశ్వామిత్రసృష్టిలోని త్రిశంకుస్వర్గమునకుఁ దోడుగ నేర్పడిన యింకొక్క వీరస్వర్గమై యుండునేమో. ఈకథకు నీతి రామరాజు వ్యభిచరించిన దానంజేసి చచ్చెననియో, కాక మఱెట్టిదో, తెలియరాదు. కవులు దేశాభివృద్ధి గలుగునట్టి విషయములు చెప్పి దేశాభ్యుదయమునకుఁ దోడు గావలయును. మిక్కిలి పేరును బెంపును వహించియుండిన రాజ్యము లట్టిస్థితి కెట్లు రా గలిగెనో తెలిపిన బాగు గాని యట్టి రాజ్యముల వినాశ మెఱింగింపరాదు. దానిచేత నెట్టి ప్రయోజనమును గలుగదు. నాటకమందలి యితివృత్త మెంతవఱకుఁ దోఁచినఁ బ్రేక్షకులమదికి విసుగు పుట్టింపకుండునో యట్లుండిన బాగు గాని శ్రవ్యకావ్యములందువలె మూఁడునాల్గు తరములకథ యొక్కటే రాత్రి ప్రదర్శించునట్లు రచింపరాదు. ఆంధ్రకవితాపితామహుఁడగు నల్లసాని పెద్దనామాత్యుని మనుచరిత్రములోని మూఁడుతరముల కథలను మూఁడు రూపకములుగ రచియించిన నెంతబాగుగ నుండును. "దశావతారచరిత్ర" మనునాటకమును నిట్టిదియే యగును. అట్టిది యూరక చిత్రపటప్రదర్శనమే యగును గాని నాటకప్రదర్శనమని యనిపించుకొనదు.

రంగస్థలమున యుద్ధము, ముద్దిడుకొనుట, చంపుట మున్నగు నిట్టి యంశములు చూపరాదని సంస్కృతమున లాక్షణికులు నిషేధించియున్నవారు. సాధారణముగ నాటకములలో నభినయించునటులు విలుకాండ్రుగాని, యోధులుగాని కారు. నాటకకవులు యుద్ధము ప్రత్యక్షముగఁ జూపునట్లు రచియించినచో నట్టియుద్ధము చూపుచోట బాణాద్యాయుధ ప్రహారముల నొక్కొక్కప్పు డెదుట నుండువారి కంగవైకల్యము గలుగుట తటస్థించుచున్నది. నావృద్ధమిత్రులలో నొకరు బాల్యమున నాటకమున వారియన్నతోడనే యుద్ధమాడి బాణప్రయోగమునఁ గన్నుఁ బోఁగొట్టికొనినారు. కొందఱు నటులు వీరభూమికల ధరించి రంగమునఁ గవివిరచిత వీరాలాపము లాడి, 'యిదే చూడుము నీతల యుత్తరింతు' నని పలికి విడిచిన బాణము ప్రతిస్పర్ధిచెంతకైనఁ జనఁజేయనేరక తమపాదములకడనే వైచికొనుటయుఁ గలుగుచుండును. అట్టివేళఁ గవి యెంచికొనిన రసమెల్లఁ బాడై ప్రదర్శనము ప్రేక్షకుల కపహాసపాత్రమునగుచున్నది. కావున నిట్టి రసభంగవిఘ్నలు గలుగకుండునట్లు రణము నాటకరంగమునఁ బ్రత్యక్షముగ రచింపకుండుటే మేలు.

రంగస్థలమున నాయికానాయకుల ముద్దులిడుకొనుటలు, కౌఁగిలించుకొనుటలు మొదలగు నిట్టిచేష్టలు చూపి, చూడవచ్చిన మానవతులగు స్త్రీలకును, గౌరవమునెడఁ బక్షపాతము వహించు పురుషులకును దలవంపులు గలిగింపకుండుట లగ్గు. అట్టియెడల ధూర్తులగు పురుషులు గొందఱు చూడవచ్చిన యందకత్తెలఁ జూచి నవ్వుటలును, గొక్కరించుటలును మున్నగు దుండగము లనేకములు సంభవించును. కొందఱు నాటకశాలలలోఁ బ్రేక్షకస్థానమునుండి నాటక మెంత బాగుగ నుండినను నద్దానిని జూచుటకైయే వచ్చుచుందురు. ఇఁక నట్టివారికి నిట్టివియు నొదవునేని వచింపవలసినదే లేదు. కాఁబట్టి కవులు రంగస్థలమున నిట్టి శయనాగారపుఁ జేష్టలు సంభవింపనట్లు రచింపవలయును.

రంగస్థలమున నొకరినొకరు చంపుకొనుటయుఁ జూపరాదు. ఒకప్పుడు తిరుపతిపురమున నుండియుండిన "శ్రీనివాసవిలాససభ" యను నొక నాటకసమాజమునఁ బ్రహ్లాదచరిత్ర నాడునపుడు నృసింహమూర్తి భూమికను ధరించిన యాతనికి శరీరము పెరుఁగ నాతఁడు హిరణ్యకశిపు భూమికను ధరించిన యాతనిమీఁదికి లేచెను. వెంటనే హిరణ్యకశిపు (పాత్రధారి) నాటకశాలవీడి ప్రాణములు దక్కించుకొన నింటికిఁ బరువిడవలసివచ్చెను. "నాటకశిరోమణి" యని కర్ణాటకదేశమున నెల్లయెడలను ఖ్యాతిగనిన కీర్తిశేషులైన శ్రీమాన్ మైసూరు వరదాచార్యులవారు "విష్ణులీల" యను నాటకమున హిరణ్యకశిపు భూమికను ధరించువారు. తత్సమాజమువారు హిరణ్యకశిపువధము ప్రదర్శింపఁ బోవుచోఁ బ్రేక్షకులలో నృసింహోపాసకులుగాని, తన్నామధారులుగాని యున్నయెడల దయచూపి వెడలిపొండని ప్రార్థించువారు. సాధారణముగ నభినయించునటులకంటెఁ జూడవచ్చిన ప్రేక్షకులకుఁ గథయందు మనస్సులు లీనములు గాఁగా ప్రేక్షకులు తాదాత్మ్యమును జెందుదురు. అట్టియెడ వారెట్టి పనులనైనను నొడలెఱుంగక చేయుదురు. మున్నొకప్పు డెక్కడనో హరిశ్చంద్రనాటక మాడుచుండఁ జంద్రమతీ లోహితాస్యుల నమ్మిన విత్తము తనదారి బత్తెమునకు సరిపోయెననియుఁ, దనగురునియప్పు దీర్పుమనియు నక్షత్రకుఁడు హరిశ్చంద్రునిఁ బీడించుట చూచి యొకప్రేక్షకుఁ డొడలు మఱచి రంగస్థలముమీఁదికి దుమికి, "ఏమి, మహారాజు నిట్లు కష్టపెట్టెదవా" యని చేతిబలువుకోలఁది నక్షత్రక వేషధారి చెంపపై నొక్కపెట్టిడెనని చెప్పుకొనుచుండఁగా వినియున్నాఁడను. మాతిరుపతిపురముననే మహాభారతము వీథిపురాణముగఁ జెప్పుచో దుశ్శాసనవధము చెప్పునప్పు డక్కడ శ్రోతలలో నొక్కఁడు భీముఁడు దుశ్శాసను నెద వ్రచ్చెనన్న పద్యము చదువుచుండ విని యొడలు మఱచి హుంకరించుచు లేచి తనచేతిబడియ సారించి విసరివైచెను. దైవవశమున నది చదువరికిని, పౌరాణికునకును నడుమఁ బడెను. వారిరువురును బొత్తమును, దంబుఱయును దిగఁబడ విడిచి దూరదూరంబుగఁ బరువులెత్తిరి. ఇది యేను గన్నులారఁ జూచినట్టిది. పురాణశ్రవణముననే యిట్లుండ నిఁక నాటకప్రదర్శనమునకుఁ జెప్పవలయునా. కావున రసభంగకారణములగు నిట్టియిక్కట్టు లెవ్వియుఁ దటస్థింప నాస్పదము గలుగకుండ నాటకకర్తలు నాటకములు రచింపవలయును. శ్రీవేంకటరాయశాస్త్రులవారి బొబ్బిలియుద్ధనాటకమునఁ బాపారాయఁడు విజయరామరాజును జం

పినదియుఁ, దాఁబొడుచుకొని చచ్చినదియుఁ జూపఁబడక యంతకంటె రసవంతముగాఁ జెప్పఁబడి యున్నది. కావున నిట్టి యంశములెల్లఁ బూర్వులగు నాటకలక్షణకర్తలు శాసించినరీతిని వర్తించుటయే సమంజసము.

నాటకమునకు నాయకుఁడు రాజుగనే యుండవలయునని కొందఱిమత మైనట్లు తోఁచెడిని. నాటకమునఁ బ్రకృతి ప్రతిబింబితముగా నుండవలయును. నాయకుఁడు దుష్యంతునివంటి రాజైననేమి, చారుదత్తునివంటి బిచ్చంపుబాపఁడైననేమి, నందునివంటిమాలయైననేమి హనుమంతునివంటిభటుఁడైననేమి, యెవరైననేమి, కథయాపాత్రను జుట్టుకొని ప్రతిపదంబునను బ్రకృతిధర్మములు సొంపులు గులుకుచుండవలయును. కొందఱు తమనాటకములఁ బ్రపంచధర్మమున కతీతముగ నుండునట్లు వ్రాయుదురు. కానియావిధానము సాధ్యమైనంతవఱకు లేకుండఁజేసి తమనాటకములు ప్రపంచధర్మప్రతిబింబములుగ నుండునట్లు రచింపవలయును. దేవతలు, గంధర్వులు మున్నగువారి విషయములకును, మానవాదుల విషయములకును భేదము చక్కఁగ నేర్పడుచుండవలయును. నాటకంబునఁ గథ ప్రవర్ధమానంబగుచుండు కొలఁదిని బాత్రల గుణములును బ్రవర్ధమానంబు లగుట యెంతయు లెస్సై యుండును. నాటకమునఁ బాత్రపోషణమే ముఖ్యాంశము.

ఈవిషయమునఁ గవులు మిక్కిలి జాగరూకులై వర్తింపవలయును. దీనికయి రెండునాటకములనుండి రెండువిషయములు తెలుపువాఁడను. చిత్రనళీయనాటకమున నలునిఁ బాము గఱచిన పట్టును, బ్రతాపరుద్రీయనాటకమున వలీఖానుఁడు ప్రతాపరుద్రుని నరణ్యమున నిద్రించుతఱి బంధితుఁగాఁ జేసినపట్టును నరసి చూడుఁడు. నలుఁడు తన్నుఁ బాము గఱచినతోడనే భార్యను స్మరించినాఁడు. అప్పుడు తాఁ జచ్చువాఁడనని చింతించినాఁడు. అట్టిచో దమయంతి తనదండనుండుటకుఁ దా నోమనైతినని వ్యసనము నొందినాఁడు.

"ఉ. చండమహాశకీలకును సాటి యనందగు క్ష్వేళవహ్ని యీ
కుండలి నన్నుఁ దాఁ గఱచెఁ గ్రూరత నింక మనంగఁజాల నో
యండజయాన యిట్టియెడ నాదట నూఱడఁ బల్కి నీవు నా
దండ వసించుభాగ్యము విధం బలరారఁగ నోచనైతిఁగా."

అని వాపోయినాఁడు. అంతఁ దనకుమారునిఁ దలంచుకొని,

"చ. మనసిజరూప చారుసుకుమార తనూభవ యింద్రసేన నీ
జననము తండ్రికిన్ మిగుల సౌఖ్యదమం చని రంతె కాని యో
తనయ యొకండుగాని యలదైవవిదుల్ గడు దిక్కులేక యీ
వనమున నంతరించు పరిపాటి యెసంగఁగ బల్కరైరిగా."

అని తనకుమారుని జన్మపత్రికలిఖించిన జ్యోతిషికులు మోహమోట వహించి నిశ్చయఫలముఁ జెప్పక తనయీదుర్గతి కప్పిపుచ్చి యనృతము లాడినట్లు దైవజ్ఞులయెడ దోష మారోపించినాఁడు.

ప్రతాపరుద్రుని యాస్థానమునను దైవజ్ఞు లుండియుందురుగదా! కాని ప్రతాపరుద్రుఁడు తనకుఁ గల్గిన యీదుర్గతి కిట్టివి కారణములుగాఁ గల్పించెఁ జూడుఁడు:—

"ఉ. కల్ల వచించినాఁడనో విఘాత మొనర్చితినో సురార్చకుం
దల్లి మనంబు నేయనో యదండ్యుల దండన వెట్టినాఁడనో
యుల్లము నొంతునో ద్విజుల కోమనో యార్తుని వింటినో ఖలున్
బల్లిదమైన నైశసముపాటిలఁగాఁ గత మేమి యీక్రియన్."

అని న్యాయశాస్త్రము వెల్లడించి కారణములఁ దనయందే మోపికొనినాఁడు.

నలుఁడు తన్ను భంగపెట్టఁబూనిన కలిరాజునకుఁ దనపైఁ బగ గల్గుట కేమికారణమో యని యరయఁగోరి, "కర్కోటకా! కలిరాజునకే నేమపకారము చేసియున్నాను" అని యడిగినాఁడు. ప్రతాపరుద్రుఁడు తన్ను బద్ధుఁ జేసిన వలీఖానుని (మృచ్ఛకటికనాటకమునఁ గన్నము వెట్టి తనకడ సువర్ణభాండమును దొంగిలించిన శర్విలకుని సాహసచాతుర్యములు చారుదత్తుఁడు మెచ్చుకొనినట్లు) మెచ్చుకొనినాఁడు.

"చ. శుకముల గోరువంకల వసుంధర లాతి విహంగమంబులన్
మెకములఁ బంజరాల నిడు మిక్కిలి వేఁటరు లుందు రెందఱో
వికలితవైరి నేకశిల వీరనరేంద్రునిఁ బంజరంబులోఁ
బ్రకటితరీతి నిట్లిడిన వ్యాఘ్రశిఖామణి వీ వొకండవే."

అని వలీఖానుని వ్యాఘ్రశిఖామణి యనినాఁడు. వేఁట నలసి నిద్రించుతఱిఁ గాక యుద్ధరంగమునఁ బోరాడి పట్టుకొనియుండినచో యోగ్యశిఖామణి యని యుండునేమో. ఈప్రతాపరుద్రుఁడు భంగముగాని, యానందముగాని కర్మఫలంబుగాఁ దలంచువాఁడు. భగవత్కృతమని యైన నొకప్పుడును దలంపఁడు. ఋతుపర్ణుఁడు సయితము ప్రతాపరుద్రునిపగిదినే "అతిమాత్రంబుగ దుఃఖము సుఖము గర్మాధీనతం బ్రాణిసంతతికిం గల్గు"నని తలంచుచుండ, నలుఁడు—

"ఉత్సా. ఎనసి సుఖమె యనుభవించునే నరుండు దుఃఖమే
యనుభవించువాఁడు గలఁడె యనని నేది వచ్చినన్
మనసులోనఁ బ్రాప్తమనియు మఱియు దైవకృతమటం
చును దలంచి శాంతిఁ బొందఁ జూడవలయు భూవరా."

అని తన్నుఁ బరిశీలించి కనిపట్టవచ్చిన సుదేవుని యెదుటనే "యీరకధర్మభంగుల నుగ్గడించితి" వని యెల్ల సుఖదుఃఖములు దైవముపైఁ ద్రోచి యూరడిల్లనెంచినాఁడు. ఇతఁ డెప్పుడును దప్పు తనపైఁ బెట్టుకొనక యొరులపైననే పెట్టువాఁడు. ఒకవేళ నిట్టిది మనుష్యులకు సహజగుణలోపమై యీతనియెడను బొడకట్టి నాటకమునఁ బ్రకృతి ప్రతిబింబిత మయ్యెనని ధీమంతు లెంతురేమో కాని కవి నాయకుని సర్వగుణశోభితునిఁగాఁ జిత్రించి ప్రపంచాదర్శప్రాయునిఁగా నొనర్చుట మేలగుఁ గదా.

పూర్వకవీశ్వరులు తమకాలములందలి ప్రపంచపరిస్థితులను సయి తము నాటకములలోఁ జిత్రించుచుండిరి. దీనికి ముద్రారాక్షస మృచ్ఛకటికములే తార్కాణములు. సామాన్యముగ నప్పటి నాటకములలోఁ జిత్రలేఖనమన్నకళ యభివర్ణితమై యున్నది. కాళిదాసును, భవభూతియు నీలలితకళను దమనాటకములలోని కెక్కఁజేసి యున్నారు. కాని మన యాంధ్రనాటకములలో నిట్టి చిత్రలేఖనమునకు మాఱుగఁ జెక్కింట నవసరములు గల్పింపఁబడి జాబులు చోరఁబెట్టఁబడి యుండెడివి.

నాటకమున ముఖ్యాంగమగు పాత్రపోషణమునకుఁ బాత్రౌచిత్యమును, బాత్రభేదమును నెఱింగి తత్తదుచిత భాషాప్రయోగము చేయుట మెఱుఁగుగ నుండుననియు, నవ్విషయమున సంస్కృతకవుల పథము ననుసరించుటయే సమంజసమనియుఁ జెప్పఁదగియున్న యది. నీచపాత్రలకును, నుత్తమపాత్రలకును దటాలున విభేద మెఱుంగఁ జేసెడివి పాత్రోచిత వేషభాషలు. ఆహార్యాభినయమునకు సంబంధించిన పాత్రోచితవేషముతో మన కిక్కడ నక్కఱలేదు. పాత్రోచిత వేషమూని యొక్కనీచపాత్ర రంగస్థలముఁ బ్రవేశించి గొప్పవై యాకరణులకన్న మేలగు విలక్షణభాష యాడునేని నాటకమున రసపోషణ మెంతవఱకు సొంపుగ నుండునో తజ్జ్ఞు లారయుదురుగాక.

సంస్కృతంబున సంస్కృత ప్రాకృతాదిభాషలు పాత్రౌచిత్యము ననుసరించి వాడఁబడి యున్నవి. అట్లే యాంధ్రంబునను బాత్రౌచిత్యము ననుసరించి గ్రాంథికవ్యావహారిక గ్రామ్యంబులు వాడిన నెంతరసవంతముగ నుండదు. కాళిదాస మహాకవికృతమగు శాకుంతలమున నిట్టియొక పట్టునకు రెండువిధములైన యాంధ్రానువాదము లిందుఁ జూపెదను. వానిలోన నేది రసవత్తరమో ధీమంతు లరయుదురుగాక.

౧

"తలవరులు—(మానిసిని గొట్టి) ఓరీ దొంగా, చెప్పరా. చెప్పరా. రతనమును బొదుగునెడఁ జేరుచెక్కిన యీయుంగరము నీ కెక్కడనుండి వచ్చినదిరా.

మానిసి—(భయమును నటించుచు) సాములారా! దయసేయుండు. నే నిటువంటిపనికిఁ బోయెడివాఁడను గాను.

మొదటివాఁడు—ఓరీ, నీవు మంచి బాఁపఁడవని యెంచి యేలినవారు నీకు దానము పుచ్చుకొమ్మని యిచ్చినారేమోగదరా.

మానిసి—ఇప్పుడు నేను మనవి చేసికొనుదాని వినుండు. నేను శక్రావతారతీర్థమునకు దాపున నుండెడి జాలరివాఁడను."

౨

"కావలివాండ్రు—(కొట్టి) ఓరేయ్. ఓరిదొంగా. శెప్పరా. శెప్పరా. రతనాల కట్టులోన యేలినవోరి పేరు శెక్కిన యీవుంగరం నీ కెక్కడ నోశె దొరికింది.

పురు—(భీతి నటించుచు) బాబులారా. నామీా ద్దయి శేండి. నా నిలాంటిపని శేశినోణ్ణి గానండి.

కావలివారిలోఁ బ్రథముఁడు—సుఱిగంటే నువ్వు మంచిబాఁపనయ్యవోరివని యేలినవోరు నీకు దానమిచ్చినారా యేంట్రా.

పురు—యినండి మారాజా యినుండిసుఱి. నానుండి శక్రావతారం రేవులో బదికీవోణ్ణి జాలరోణ్ణుండి."

రెండవవిధమున నగరమున నుండు కావలివాండ్రకును, నెక్కడనో పల్లెల నుండు జాలరివానికిని భాషయం దెట్టిభేదము చూపఁబడి యాయిరుదెఱఁగుల నీచపాత్రలలోని భేదము రసవంతముగ నెట్లు తెలుపఁబడెనో యారయనగును. మఱి తొలిదానియం దెల్లసంభాషణమును నచ్చతెలుఁగుననే సాగినది. ఇట్లే కొండొక్క నాటకమున నడవులఁ దిరుగు వేఁటకాండ్రచ్చతెలుఁగుననే గాక వృత్త్యనుప్రాస శబ్దాలంకారముఁ బోషించుచు నాలంకారికులవలె సంభాషించి యున్నారు.

"1. ఎఱు—ఏలికా! అందందుఁ జిందులు ద్రొక్కుచు సందడి చేయుచున్న పంది గున్నను నేఁడు క్రిందఁ గెడపి క్రమ్మందించియున్నాను.

2. ఎఱు—సామీ! అత్తమిల్లు సత్తువగల కత్తిమెకము హత్తి కత్తిఁ గత్తిరించి యున్నాను.

3. ఎఱు—ఱేఁడా! గోముమీఱిన యామునేనుఁగుతో సాము చేసి మోముఁ జించి గీమునకుం దెచ్చియున్నాను.

4. ఎఱు—ఒడయఁడా! సంగడికాండ్లతోఁ బొంగిపోవం గని దొంగవలె లొంగియుండిన సింగము మోముపై గొంగడి గప్పి చెంగించి యున్నాను.

5. ఎఱు—ఎకిమీఁడా! త్రుళ్ళిపడుచుఁ గ్రేళ్ళుఱుకు లేళ్ల గమి కాళ్లుపట్టి వేళ్లు వెఱికి త్రాళ్లఁ గట్టియున్నాను.

ఈ పాత్రలను గవిపండిత వర్యులకంటె మిన్నలుగ సృజియించినాఁడు. పాత్రోచితవేషము లూని యీపాత్రలు శుద్ధాంధ్రకవిత్వము రంగమున వెలువరించినచో రసభంగముగ నుండదా. గొప్ప పండితులకే యొక్కొక్కప్పుడు శుద్ధాంధ్రము దురవగాహముగ నుండ నెల్లవిధముల వారును జేరియుండు ప్రేక్షకు లిట్టిభాష వినఁగనే యది యేరాక్షస భాషయో యని బిక్కమొగము లిడికొనరా. పాత్రలకు వేషము లెట్లుచితరీతి నుండవలయునో యట్లే భాషయుఁ దత్తదుచితరీతిని నుండవలదా. రసజ్ఞు లరయుదురుగాక.

ఆంధ్రనాటక పితామహుఁడని వాసికెక్కిన కీర్తిశేషులైన శ్రీమాన్ ధర్మవరము కృష్ణమాచార్యులవారు రచియించిన 'విషాదసారంగధర' నాటకమునఁ దలవరులమాట లెంత రసవంతములో యారయుఁడు.—

"౧. తలవరి__అన్నాలమన్నాలము. ఏమి శేశిందాఁడ్రా యీ సామి.

౨ వ. తలవరి__అయ్యో. ఎట్ల నరకాల్రా మనం.

3 వ. తలవరి__ఖర్మం ఖర్మం.

౪ వ. తలవరి__పోరాక్కీ రాజోడు యీశాగన శేశిండ్లే. సూస్తే ముస్సంగయ్యింతాడు. శేశించే శేశిండీని."

శ్రీ వేంకటరాయశాస్త్రిలవారి నాటకముల నీపాత్రోచితభాషా విధానము మిగుల రసవంతమయి చూపట్టుచున్నది. వ్యాసవిస్తరభీతిచే నెల్లయు నుదాహరింప మానితిఁగాని తద్రచిత 'ప్రతాపరుద్రీయ' నాటకమునఁ జాఁకలి తురకలు, దక్షిణదేశమున నివసించుచుఁ దెలుఁగు మాటలాడు గాయకులు మున్నగు పాత్రలభాష యెంత రసవంతముగ నున్నదో తెలియనగును.

పూర్వకవుల గ్రంథములలో నాటకఫక్కి కనుగుణంబులైన పద్దెము లెన్ని యేనియుఁ గలవు. వానినరసి కవులు దంటలైన నట్టిపద్దెములు రచియించుట లెస్స. లేదేని వాని నట్లే యెత్తివ్రాయుట మేలగు త్రోవ. అట్లుగాక యారసవత్తరములగు పద్యముల నట్లే వ్రాయుచోఁ "దనకవిత్వము కొంత_తాళ్లపాకమువారి కవిత్వము కొంత" యనిన సామెతవలె నడుమ నారసవత్తరపదములు మార్చి తమవి చొప్పించి రసము పాడుచేయుచున్నారు.

శ్రీకృష్ణుఁడు తాను మన్ను దినలేదు నమ్ముమని యశోదాదేవికిఁ జెప్పుచు వలయునన్న "మదీయాస్యగంధ మాఘ్రాణముచేసి నావచనముల్ దప్పైన దండింపవే" యని పోతనకవిచంద్రుఁడు రచించియుండ, దానినొక్కపండితకవి మార్చి, "మదీయాస్యరంధ్రమాఘ్రాణముచేసి నావచనముల్ దప్పైన దండింపవే" యని దిద్ది వ్రాసియున్నాఁడు. ఈ మార్పున నెట్టిరస మున్నదో యారయనగును. ఇట్లు మార్చుట పూర్వ మహాకవీశ్వరులయెడ గొప్పద్రోహము చేసిన ట్లగుఁగదా.

పండితు లెల్లయు నార , యేది యుక్తమార్గమో, యేది రసతముగనుండునో, యేది సర్వజన హృదయాకర్షణచణమో యట్టి నాటకలక్షణగ్రంథములు రచియించి యిప్పుడు వెలువడుచుండు నీ నాటకగ్రంథముల కొక్కరీతియగు త్రోవ నేర్పఱిచి యాంధ్రభాషాయోషామణికిఁ జెడని తొడవు లిడుదురని యెంతయు వేఁడువాఁడను. అట్లొనర్చినయెడల సజ్జనులతోడి సల్లాపమునవలె సద్బుద్ధులఁ గఱపుచు నప్పటప్పటికిఁ గ్రొత్తక్రొత్తరుచు లీనుచు నీదృశ్యకావ్యము లెట్లు లోకహితములు గాకుండును?

## లోభము

వెలఁగపూడి దానయ్యచౌదరిగారు

వందమతినగుచు లోకము, నిందించుట నెఱుఁగబోక నిను మదియందున్
బొందుగఁ దాలిచి తగుఫల, మొందితి నటవీడి యరుగుమో లోభంబా!__

సీ. ఎంచఁగానీవు సుమ్మించుకంతయుఁ గాని, వంశక్రమాగత ప్రకట గరిమ
మరయఁగానీవు సుమ్మణుమాత్రమైనను, తులలేని యాత్మబంధుత్వరీతి
నడవఁగానీవు సూకడ కొక్కపద్మైని, వరణీయమహా ధర్మసరణియందుఁ
దలఁపఁగానీవుసూకలనైన నొకమాఱు, పరమార్థతత్వ సంపత్ఫలంబు
భావింప నీవు సుమ్మేవిధంబునఁ గాని, యంచితంబైన సత్యంపు మహిమ
తెలియగా నీవు సూతివిరి లేశంబైనఁ, జిరతరకీర్తి నార్జించు తెఱఁగు
ననుభవింపఁగ నీవు సుమ్మక్కటకట! కలికమునకైన నెట్టిసౌఖ్యమునుఁగాని
పరమ నీచస్వభావ సంపత్ప్రభావ, భరతచారిత్ర! పాపిలోభంబ నీవు.

గీ. అర్థమను స్నేహితుని పెంపునాత్మఁగోరి, యాశనాఁబడు పటుతరహాయము నెక్కి
మనుజ హృద్దేశముల సదా మసలుచుండు, చటులతరలోభమా! నమశ్శతమునీకు.

# ౭. మత వాఙ్మయము - సాంఘికము

## మనుస్మృతిలోని కులములు

అహ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి గారు.

### వర్ణములు ౪

| | | | |
|---|---|---|---|
| ౧ | బ్రాహ్మణుఁడు | బ్రాహ్మణస్త్రీకి బ్రాహ్మణునివలనఁ బుట్టినవాఁడు | ౧. యజనము, ౨. అధ్యయనము, ౩. దానము, ౪. యాజనము, ౫. అధ్యాపనము, ౬. ప్రతిగ్రహము. |
| ౨ | క్షత్రియుఁడు | క్షత్రియస్త్రీకి క్షత్రియుని వలనఁ బుట్టినవాఁడు | ౧. యజనము, అధ్యయనము, దానము, శస్త్రాస్త్రధారియై ప్రజలను రక్షించుట, |
| ౩ | వైశ్యుఁడు | వైశ్యస్త్రీకి వైశ్యునివలనఁ బుట్టినవాఁడు | ౧. బేరము, ౨. పశుపాలనము, ౩. కృషి. యజనము, అధ్యయనము, దానము. |
| ౪ | శూద్రుఁడు | శూద్రస్త్రీకి శూద్రునివలనఁ బుట్టినవాఁడు | ౧ నౌకరి, ౨. వడ్రంగము, ౩. చిత్రలేఖనము మొదలైన శిల్పవృత్తులు; మంత్రవర్జముగఁ గర్మానుష్ఠానము. |

### అనులోమసంకీర్ణులు. ౬

| | | | |
|---|---|---|---|
| ౫ | మూర్ధాభిషిక్తుఁడు | క్షత్రియస్త్రీకి బ్రాహ్మణునివలనఁ బుట్టినవాఁడు | గజశిక్ష, అశ్వశిక్ష, రథకృత్యము. |
| ౬ | మాహిష్యుఁడు | వైశ్యస్త్రీకి బ్రాహ్మణునివలనఁ బుట్టినవాఁడు | ౧. నృత్తగీతజీవనము, ౨. జ్యోతిష జీవనము, ౩. పైర్లు కాపాడుట. |
| ౭ | కరణుఁడు | శూద్రస్త్రీకి బ్రాహ్మణునివలనఁ బుట్టినవాఁడు | ౧. బ్రాహ్మణ క్షత్రియ వైశ్యకృత్యములలో నౌకరి, ౨. ధనధాన్యాధ్యక్షత, ౩. దుర్గములను, అంతఃపురములను గాపాడుట. |
| ౮ | అంబష్ఠుఁడు | వైశ్యస్త్రీకి బ్రాహ్మణునివలనఁబుట్టినవాఁడు | చికిత్స. |
| ౯ | నిషాదుఁడు, పారశవుఁడు | శూద్రస్త్రీకి బ్రాహ్మణునివలనఁబుట్టినవాఁడు | చేఁపలు పట్టుట. |
| ౧౦ | ఉగ్రుఁడు | శూద్రస్త్రీకి క్షత్రియునివలనఁగలిగినవాఁడు | ఎలుకలు, పాములు మొదలగువానిని బట్టుకొని జీవించుట. |

### ప్రతిలోమసంకీర్ణులు ౬

| | | | |
|---|---|---|---|
| ౧౧ | సూతుఁడు | బ్రాహ్మణస్త్రీకి క్షత్రియునివలనఁ బుట్టినవాఁడు | అశ్వసారథ్యము. |
| ౧౨ | మాగధుఁడు | క్షత్రియస్త్రీకి వైశ్యునివలనఁ బుట్టినవాఁడు | బజారువర్తకము. |
| ౧౩ | వైదేహుఁడు | బ్రాహ్మణస్త్రీకి వైశ్యునివలనఁబుట్టినవాఁడు | ఆఁడువారికి నౌకరి సేయుచు, అంతఃపురములఁ గాపాడుట. |
| ౧౪ | ఆయోగవుఁడు | వైశ్యస్త్రీకి శూద్రునివలనఁబుట్టినవాఁడు | వడ్రంగము. |
| ౧౫ | క్షత్త | క్షత్రియస్త్రీకి శూద్రునివలనఁబుట్టినవాఁడు | కలుగులు త్రవ్వి ఎలుకలు, పాములు మున్నగువానిని బట్టుకొని జీవించుట. |
| ౧౬ | చండాలుఁడు | బ్రాహ్మణస్త్రీకి శూద్రునివలనఁ బుట్టినవాఁడు | ౧. దిక్కులేని శవములను బూడ్చిపెట్టుట, లేక కాల్చివేయుట, ౨. మరణదండనపొందినవారిని జంపుట, ౩. ఒకచో నుండక తిరుగుచుండుట, ౪. ఊళ్ల వెలుపల నుండవలెను, ౫. పనియున్నప్పుడు పగలు పట్టణములలోఁ దిరుగవచ్చును గాని రాత్రులయందుఁ బట్టణములలోఁ దిరుగకూడదు, ౬. శవములమీఁది గుడ్డలు వారు ధరింతురు. ౭. ఉక్కుసొమ్ములు పెట్టుకొందురు. ౮. పగిలినకుండలలో భుజింతురు. |

## సంకీర్ణసంకరులు ౨౧

| | | | |
|---|---|---|---|
| ౧౭ | ఆవృత్తుఁడు | ఉగ్రస్త్రీకి బ్రాహ్మణునివలనఁ గలిగినవాఁడు | |
| ౧౮ | ఆభీరుఁడు | అంబష్ఠస్త్రీకి బ్రాహ్మణుని వలనఁ బుట్టినవాఁడు | |
| ౧౯ | ధిగ్వణుఁడు | ఆయోగవస్త్రీకి బ్రాహ్మణుని వలనఁ బుట్టినవాఁడు | ౧. చర్మములచేఁ జేయుపనులు చేయును, ౨. ఉపవనాదులలో వసించు. |
| ౨౦ | పుక్కసుఁడు | శూద్రస్త్రీకి నిషాదుని వలనఁ బుట్టినవాఁడు | కలుగులు త్రవ్వి యెలుకలు మొదలగువానిని బట్టుకొనుట; శైలాదుల వసించుట. |
| ౨౧ | కుక్కుటకుఁడు | నిషాదస్త్రీకి శూద్రుని వలనఁ బుట్టినవాఁడు | |
| ౨౨ | శ్వపాకుఁడు | ఉగ్రకులస్త్రీకి క్షత్రియుని వలనఁ బుట్టినవాఁడు | పైనఁ జెప్పిన చండాలవృత్తు లన్నియు వీనికిని జెప్పఁబడినవి. |
| ౨౩ | వేణుఁడు | అంబష్ఠస్త్రీకి వైదేహకపురుషుని వలనఁ బుట్టినవాఁడు | వాద్యభాండములను (డోళ్లు, రమ్‌డోళ్లు, తాషాలు మున్నగువానిని) వాయించుట. |
| ౨౪ | భూర్జకంటకుఁడు | బ్రాహ్మణస్త్రీకి ఉపనయనాది సంస్కారములు లేని బ్రాహ్మణుని వలనఁ బుట్టినవాఁడు | |
| ౨౫ | నటుఁడు లేక కరణుఁడు | రాచస్త్రీకి ఉపనయనాదులు లేని క్షత్రియుని వలనఁ బుట్టినవాఁడు | |
| ౨౬ | సుధన్వాచార్యుఁడు లేక సాత్వతుఁడు | వైశ్యస్త్రీకి ఉపనయనాదులు లేని వైశ్యునివలనఁ బుట్టినవాఁడు | |
| ౨౭ | సైరింధ్రుఁడు | ఆయోగవస్త్రీకి దస్యునివలనఁ బుట్టినవాఁడు | వలలు పన్ని మృగములను బట్టుట, తల దువ్వుట, ఒడలు పిసుకుట, ఉచ్ఛిష్టభక్షణము. |
| ౨౮ | మైత్రేయకుఁడు | ఆయోగవస్త్రీకి వైదేహకుని వలనఁ బుట్టినవాఁడు | సూర్యోదయమున గంట వాయించుట, మధుర భాషణము. |
| ౨౯ | మార్గవుఁడు, లేక కైవర్తుఁడు | ఆయోగవస్త్రీకి నిషాదునివలనఁ బుట్టినవాఁడు | ఓడలపని. |
| ౩౦ | కారావరుఁడు | వైదేహకస్త్రీకి నిషాదునివలనఁ బుట్టినవాఁడు | చర్మపుపని. |
| ౩౧ | పాండుసోపాకుఁడు | వైదేహకస్త్రీకి చండాలుని వలనఁ గల్గినవాఁడు | వెదురుబేరము. |
| ౩౨ | ఆహిండకుఁడు | వైదేహకస్త్రీకి నిషాదునివలనఁ గలిగినవాఁడు | |
| ౩౩ | సోపాకుఁడు | పుక్కసస్త్రీకిని చండాలునికిని బుట్టినవాఁడు | వధశిక్ష విధింపఁబడినవారిని వధించుట. |
| ౩౪ | అంత్యావసాయి | నిషాదస్త్రీకిని చండాలునకును బుట్టినవాఁడు | శ్మశానవాసము. |
| ౩౫ | అంధ్రుఁడు | కారావరస్త్రీకి వైదేహకునివలనఁ గల్గినవాఁడు | గ్రామముల వెలుపల నుండెడివాఁడు. |
| ౩౬ | మేదుఁడు | నిషాదస్త్రీకిని వైదేహకునికిని బుట్టినవాఁడు | గ్రామముల వెలుపల నుండెడివాఁడు. |

# పద్మనాభ ప్రభావము

మల్లాది సూర్యనారాయణశాస్త్రి గారు

(మదీయాంధ్ర భవిష్యపర్వములోనిది)

జనమేజయుఁడు——

ఒకనాఁ డాప్తగురుప్రధానతతితో నోడ్డోలగం బుండి య
య్యకలంకం బగుభారతంబు హరివంశాఖ్యానముం బ్రీతితో
సకలంబుల్ వినుపించునట్టి ముని వైశంపాయనుం జూచి పు
ణ్యకథాగోష్ఠికి డెంద మానసపడ విన్నాణంబుగా నిట్లనెన్.

కమలనాభుం డెంత కాలంబు వారాశి-నీరంబులో యోగనిద్ర నుండు?
కాలకారణుఁ డాతఁ డాలీల నేలొకో-పవళించు మరల నెప్పటికి లేచు?
లేచి వెండియు నాత్మలీల నెవ్విధి బహు-చిత్ర చరాచర సృష్టి చేయు?
ఎందఱు బ్రహ్మ లై రింతకుఁ బుష్క-రం-బున నెట్లు పొడమిరి మునులు సురలు?
సకలభూతప్రపంచంబు సమయునపుడు-పరమపూరుషుఁ డాతఁ డెప్పగిది నుండు?
అనెడి నాసంశయము లెల్ల నణఁగఁ గరుణఁ-బద్మనాభప్రభావం బుపన్యసింపు.

అన నత్తాపసుఁ డిట్లు పల్కె- జననాథా! బ్రహ్మజిజ్ఞాస మీ
ఘనవంశంబున కుగ్గుపా లగుటచేఁ గాంక్షించి తీ విట్లు పా
వననారాయణ కీర్తి కీర్తనము నీప్రశ్నాళి కారూఢ బో
ధనిరూఢాత్ములు గాక యన్యులు సమాధానంబు లీ నేర్తురే?

వినను బాదరాయణ మహాముని సద్గురుఁ డాగమాంత వి
ద్యానిధి నాకుఁ జెప్పినవిధంబున, నాదిపురాణ మ్మర్మ వి
జ్ఞానధనాదితేయ మునిచంద్రపరంపర దెల్పినట్టి చం
దానఁ బరాత్మ తత్త్వము యథామతి నీకు నుపన్యసించెదన్.

...ఆపురుషోత్తముఁడు మహాభూత వివిధభౌతికజాతంబు సంహరింప నభిలషించి సప్తమూర్తియగు విభావసుండై ప్రచండ దీప్తిగభస్తిచయంబులఁ జతుర్దశభువన సర్గంబు నిశ్శేషంబుగ భస్మంబు గావించి ప్రచండమారుతుండై దానినంతను దన యందు లీనంబు గావించి యా ఘోరోగ్ర తేజోరూపం బుపసంహరించి నష్టార్క-పవనాకాశంబై సకలశూన్యంబైన యాసూక్ష్మంబునఁ దానొక్క-రుండ యద్వితీయుండై పరంజ్యోతియై వెలుంగుచు నాత్మమాయాప్రభూతంబు క్షీరనీకాశ మధురంబునగు దివ్యతోయంబున నేకార్ణవసంజ్ఞితంబైన జలౌఘంబు గల్పించి యందుఁ బౌరాణరూపం బాశ్రయించి పవ్వళించి యోగనిద్ర నానందించుచుండు.

అత్యద్భుతం బైనయట్టి యేకార్ణవ-విధి యిట్టి దని చూపువిధియు లేదు
అమ్మహాయోగీంద్రుఁ డాశ్రయించినయట్టి-యోగంబుఁ జూచు వేఱొండు లేదు
ఎంతకాలం బాతఁ డెందుల కట్లు ని-ద్రించునో బోధించు దిక్కు లేదు
ఎవ్వఁ డాయోగీంద్రుఁ డేమి యోగం బది-యంచుఁ దెల్పెడుదారి యైన లేదు
ఏమి చెప్పుదు రాజేంద్ర! యేక మద్వి-తీయ మవ్యక్తము నఖండ తేజమైన
యాపరబ్రహ్మ మాయోగ మవ్విలాస-మాతఁడే కాక తెలియంగ నన్యుఁ డేఁడి?

అనుపమ యోగయజ్ఞమున కగ్నులు ఋత్విజు లాగమంబులుం
దనర నిజాంతరంగమునఁ దత్పరమాత్ముఁడు యజ్ఞకర్త యై
యనితరవేద్యరూపమున నట్టు లనేకయుగంబు లాజలం
బున శయనించి యుండు నని పూర్వులు చెప్పఁగ విందు భూవరా!

ప్రలయం బొందిన యీజగంబు తనగర్భంబందు లీనంబుగా
జలజాక్షుం డటు పవ్వళించినతఱిన్ సర్వంసహాతీర్థయా
త్రలు సాగించు చిరాయురున్నతుఁడు మార్కండేయుఁ డక్షీణ ని
ర్మలపుణ్యాంచిత దివ్యయోగబల నిర్వ్యాపన్న నైజాకృతిన్.

ఆపరమేశ్వరోదరగతాఖిలతీర్థము లాడి యాడి యా
త్రాపరితుష్టచిత్తుఁ డయి క్రమ్మఱ తన్ముఖమార్గగామి యై
వే పయి వచ్చి యెల్లెడలఁ బెల్లగు చీఁకటిప్రేవటు నాటి చూ
పే పఱె క్రిందఁ గూలఁ బడియెన్ భయసంభ్రమవిహ్వలాంగుఁ డై.

ఆయేకార్ణవ మట్లు చొచ్చి యతఁ డాహా స్వప్నమా భ్రాంతియా
మాయావేశమ? యేమివింత యిది? నిర్మర్యాద గాఢాంధకా
రాయత్తం బయి లోకమి ట్లనిలచంద్రాదిత్య తారాదులం
బాయం గారణ మేమి? యేమిగతి యీపై నాకు జీవింపఁగన్?

ధరణీభాగము గానరాదు గిరిబృందం బంతరించెన్ లతా
తరుగుల్మాదులు లేవు జంతుతతిశబ్దం బేని లే దీదశాం
తరముం జొచ్చి జగంబు చేడ్పడుట సత్యం బౌనె? కాకున్న దు
స్తరలోకాంతరమో యిదంచు బహు చింతామోహ నిర్మగ్నుఁ డై.

అరయఁగలేక సత్య మపు డాపద దాఁట నుపాయశూన్యుఁ డై
మరణము నిశ్చయించుకొని మానస మాతఁడు నాలుకొల్పి యీ
శ్వర భజనంబు సల్పి హిమశైలనిభంబును గోటిసూర్యభా
స్వరమును నీలమేఘ సదృశం బగు తత్పురుషోత్త మాకృతిన్.

కనుఁగొని యాతఁ డెవ్వఁ డని కన్గొనఁ జేరఁగఁ బోయి యజ్జనా
ర్దనువదనానిలంబు వడిఁ దజ్జఠరంబును వెండి చొచ్చి ని
ద్రను గని మేలుకాంచినవిధంబునఁ దన్నుఁ దలంచి తొంటి యో
జను జగతీతలాటనము సల్పఁగ వెల్వడి యల్లనల్లనన్.

హరియుదరంబులోని విపినాంబుధిశైలనదీనదంబు ల
ధ్వరములు నాత్మధర్మపరతంత్రము జాతిచతుష్టయంబుఁ దా
నరసి యనంతకాల మచలాంతము గానక యెంతకేని వే
సరి తనచొచ్చినట్టి గతిచాలున వెల్వడి వచ్చి వెండియున్.

మును పడినట్టి యబ్ధిఁ బడి మున్గుచుఁ దేలుచు నీఁదు లాడుచున్
దనగతి యట్టు లౌటఁ బరితాపము నొందుచు నంత ముందటన్
ఘనవటశాఖిశాఖల నొకానొకయాకునఁ బవ్వళించి యుం
డిన యుదయార్కతేజు నొకడింభకుఁ గన్గొని కౌతుకంబునన్.

ఇదియొక వేలువింత మును పీవటవృక్షము చూడలేదు నా
మది నలరించు నీరవిసమానుఁడు బాలుఁడు లేఁడుగాని యేఁ
జదురుఁడ నొక్క యీశిశువు సన్నిధిఁ జేరగ నిట్టిమేలు నా
కౌదవునొకో? యటంచు వగ నూర్చుచు నమ్ముని తల్లడిల్లుచున్.

ఆలోకాంతకుఁ డా జగన్నిలయుఁ డా యాదిత్య నీకాశుఁ డా
కాలాత్ముం డగు చిన్నిబాలకుఁడు, మార్కండేయ! వత్సా! భయం
బేలా నీ కిటు రమ్ము ధీరుఁడవు గావే? యైన నియ్యబ్ధిలోఁ
జాలా డస్సితి వెంతకష్ట మని యాశ్వాసించె నమ్మౌనియున్.

విని యాపల్కులు కోపగించి యెవఁడో వీఁ డిట్లు పేరెత్తి న
న్ననుమానింపక పిల్చె నాతపసు నాయాయుస్సుఁ దేజస్సునుం
గనఁ డౌరా! నిజ మిప్రమత్తునకుఁ బోఁగాలంబు దాపించెఁ బే
ర్కొనె నే నన్నిటు లాపితామహుఁడు రుద్రుం డచ్యుతుం డెన్నఁడే?

అమ్మహేశులు నన్ను దీర్ఘాయు వనుచుఁ-బిలిచెదరుగాని పేరెత్తి పిలుచువారె?
యిట్లు నన్నవమానింప నిక్కుమారుఁ-డేను ఘోరశిరుండ నా నెఱుఁగఁడేమొ!

అనుటయుఁ జిన్ననవ్వు నగి యవ్వటశాయి, కుమార! నేన నీ
జనకుఁడు నొజ్జ దైవమును సర్వము, నీపిత పుత్రకాంక్ష ము
న్ననఘ తపంబు చేయ నమితాయువుఁ బావకతేజు నిన్ను న
మ్ముని కిడినాఁడఁ గావున నె పోకడ దాఁటితి వీలయంబునన్.

నీ వింతకు బ్రతుకుటయును-నావర్తన మెఱుగుటయును నాకశమున నే
కావునఁ గొంకక గురుసం-భావనమతి నన్నుఁ జేరు మార్కండేయా!

అనవిని భక్తి విస్మయ భయంబులు ముప్పిరిగొన్న మానసం
బున మునినాథుఁ డప్పుడు నమో భవతే మహతే జగత్పతే
యని భగవత్కృపాశ్రయము నంది వటం బెగఁబ్రాకి యప్పరా
త్మని గని గోత్రనామములతో నిరుగేలు మొగిడ్చి మ్రొక్కుచున్.

కనుఁగవ మానసంబును మొగంబుఁ గలంక దొఱంగ నెంతయున్
వినయవినమ్రగాత్రుఁ డయి వేడ్క మెయిన్ వినుతించి యోసనా
తన పురుషోత్తమా! లయవిధానము నర్ణవ వర్తనంబు నీ
యనుపమయోగతత్త్వము దయామతిఁ దెల్పి యనుగ్రహింపవే!

అనుడుఁ బరాత్పరుండయిన యవ్వటశాయి కుమార! తొల్లి నీ
కనిన సమస్తసృష్టికిని గర్తయు భర్తయు హర్తయైన బ్ర
హ్మను జగదంతరాత్మను జరాచరజాలమ నేన నాతలం
పున మును పంచభూతములు పుట్టును బిమ్మట వానికూడికన్.

స్థిరచర రూపంబులు స్త్రీ-పురుష విభేదంబు లగుచు భువనంబులు చె
చ్చెర నేర్పడుఁ బదునాలుగు-వెరవుల బహునామరూప భేదంబులతో.

ఈరీతిని జనియించిన-యీ రేడు జగంబులందు నెందును నేనై
నారాయణ నామంబుఁ బ్రద-యీరూపము గలుగ నుందు నిచ్ఛాశక్తిన్.

యుగయుగమును నే నిట్టులె-జగములు కల్పించి పెంచి సమయింతును నా
దగుమాయ, నఖిలవిశ్వం-బగపడు నాకుక్షి నీ లయావసరమునన్.

వనజభవాదులైన సురవర్యులుఁ గాశ్యపుఁ డాదిగాఁ దపో
ధనులును నాదుకుక్షి నిజధర్మపరాయణులై చరింతు రా
ఘనులను గూడి నామహిమఁ గాంచి సుఖింపడు మీ వటంచు నా
తని మరలన్ నిజోదరపదంబును జేర్చెను దొంటికై వడిన్.

ఈవిధి మార్కండేయుం-డావిశ్వేశ్వరుని తత్త్వ మారసి తద్గ
ర్భావిష్టుం డయి నిశ్చల-భావంబునఁ బరమహంసభావనుఁ డయ్యెన్.

హరిహరమూర్తి యప్పరమహంసయు నల్లె చిరంబు దన్నుఁ దా
నరయుచు యోగదృష్టిని నిరంత నిరంతర తోయసూక్ష్మ గ

హ్వారమున నుండియుండి పరమాద్భుతమైన తపం బొనర్చి యూం
తర సకలప్రపంచముఁ బదంపడి వెల్వడఁజేయు కోరికన్.

ఆమహార్ణవ మించుకంత కలంచిన-దాన నేర్పడియె రంధ్రం బొకింత
ఆచిన్న యాకాశమందు శబ్దంబుతోఁ-గలిసి యెక్కించుక గాలి పొడమె
ఆగాడ్పు పెద్ద దై యర్ణవంబును గడు-వడిఁ గలంచిన దాన వహ్ని పుట్టె
ఆయగ్ని వర్ధిల్లి యర్ణవం బింకింపఁ-బెరిఁగినచదల నావిరియు నిండె
దాన వాన జనించెఁ దద్వర్ష జలము-నడుము పరమాణు సంఘటనంబు పేర్మి
యడర నొగి గడ్డకట్టినఁ బుడమి పొడమెఁ-బద్మనాభుని బొడ్డునఁ బద్మ మగుచు.

ఉరువిశాలోన్నతంబును సురభిళంబు-నగ్ని సూర్యప్రకాశంబు నై చెలంగె
సచ్చిదానందసంకల్ప జనితమైన-పార్థివంబగు తన్నాభిపద్మ మపుడు.

పరమాత్ముండును బంచభూతముల నాపాదించి యానంద సం
భరితుం డై మది లోకసర్గమును సంభావింపఁ దన్నాభి పు
ష్కరగర్భంబున బ్రహ్మ నాఁగఁ జతురాస్యుం డై తదంశంబు గో
చర మయ్యెన్ సకలప్రపంచరచనా సామర్థ్య సంపన్నమై.

అతఁడె హిరణ్యగర్భుఁ డఖిలాగమమూర్తి విధాత నా జగ
న్నుతుఁ డగు, నాహిరణ్మయ మనోహరపుష్కరమే నదీసరి
త్పతికులపర్వతాది వితతం బయి యేడగుదీవు లొప్పు నీ
క్షితి యని కీర్తి కెక్క మునిశేఖర గీతపురాణపద్ధతిన్.

---

## భావనాప్రపంచము

కొనురవోలు నాగభూషణరావు గారు

మలయానిలోద్ధూత లలితపుష్పపరాగ,ములనుండు తియ్యనివలపులెత్తఁగి
హిమవన్నగ ప్రాంతసుమనోజ్ఞ తుహిన త,ల్పములపై హాయిగాఁ బవ్వళించి
సుదతీగభీర సద్హృదయాంతరనిమగ్న, భావరత్నంబులప్రభలుగాంచి
ఆకాశ వారాశి రాకాసుధాకరు, సుకుమారమూర్తిపైఁ జూడ్కినిలిపి
సంతతానంద వాహిని నంతులేక, లీల విహగంబుపగిది బల్టీలు గొట్టి
కరుణరస మింపులొలుకంగఁ గవికుమార !, యింపుగాఁ గావ్యగీతిఁ జిత్రింపుమోయి!!

---

# వైదికకవులు

పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి గారు

శ్రుతిః. నమ ఋషిభ్యో మంత్రకృద్భ్యో మంత్రపతిభ్యః
మా మామృషయో మంత్రకృతో మంత్రపతయః పరాదుః
మాహ మృషీన్ మంత్రకృతో మంత్రపతీన్ పరాదాం.
—తైత్తిరీయారణ్యకే చతుర్థ ప్రపాఠకః.

"వైదికకవులు" అనువ్యాసము వైదిక నియోగ కవి చర్చ కాదనియు, నాకావివాదముతోఁ బనిలేదనియు, వేదముఁ జెప్పిన కవులని నాతాత్పర్యమనియు విన్నవించు చున్నాఁడను.

"అపౌరుషేయ" వేదమునకుఁ గవు లేమని యొక సందేహము తిరిగి బాధించుచున్నది. కాని, వేదమునందే "మంత్రకృత్తులు, మంత్రపతులు" నను రెండువిధములగు మును లున్నారు. ఆవేదవాక్యముఁ జూడుఁడు:

"నమ ఋషిభ్యో మంత్రకృద్భ్యో మంత్రపతిభ్యః."

తా. మంత్రములఁ జేసినట్టియు, సంప్రదాయ ప్రవృత్తిచే మంత్రములఁ గాపాడినట్టియు ఋషీశ్వరులకొఱకు నమస్కార మగుఁగాక.

"మా మామృషయో మంత్రకృతో మంత్రపతయః పరాదుః."

తా. నన్నుమంత్రములఁ జేసినట్టియు, మంత్రములఁ గాపాడినట్టియు ఋషు లనుగ్రహింతురు గాక.

"మాహ మృషీన్ మంత్రకృతో మంత్రపతీన్ పరాదాం."

తా. నే నాఋషులను మఱవక గౌరవించు చుందును.

ఈమంత్రమునకు భాష్యముఁ జేయునపుడు "విద్యారణ్యుల"వారి కపౌరుషేయ వేదముఁ జేయుట యేమని సందేహముఁదోఁచి యిట్లు సమర్థించుకొనిరి. యుగాంత మం దంతర్హితమైన వేదములను తపస్సుం జేసి భగవదనుగ్రహముచేఁ బొంది సేతిహాసములతో లోకములోఁ జెప్పినవారు మంత్రకృత్తులనియు, ఆమంత్రములను సాంప్రదాయములతోఁ గాపాడినవారు మంత్రపతులనియు ఆరణ్యక భాష్యమునం జెప్పియున్నారు. వ్యవధిలేనందున నాచర్యను విపులముగా వ్రాయలేదు కాని వేదములో మంత్రములకు ఋషులు వేఱుగాను, "కాండలు" లేక "మండలము"లకు ఋషులు వేఱుగాను కలరనియు, మంత్ర ఋషులు భాస్కరరామాయణములోని "కుమార రుద్రదేవుఁడు, మల్లికార్జునభట్టు" మొదలగువారితోఁ దుల్యు లనియు, "మండల, (లేక) కాండ" ఋషులు "భాస్కర"మహాకవితోఁ దుల్యులనియుఁ, బ్రస్తుతకాలమునందుండు వాఙ్మయములో "విలేఖరి, పత్రికాధిపతుల"తోఁ దుల్యులుగా మంత్రర్షి కాండర్షు లుందురనియు మనవిచేయుచు నీచర్చను ముగించుచున్నాను.

ఆర్యులారా! మన దురదృష్టవశమున వేదవాఙ్మయమను మహారత్ననిధిని జూడక, పరిశీలింపక, దాని ముందు పాషాణసదృశమగు తదితరవాఙ్మయమును శోధింపుచు మన మతనైతిక చారిత్రకాదులలో నితరులచే నను మానింపఁబడుచున్నా మని చెప్పినందులకు క్షమింపుఁడు. మన ప్రాచీనుల విజ్ఞానము విశేషముగా వేదవాఙ్మయమునఁ గలదు.

ఆర్యుల వాణిజ్యవిశేషములు, వ్యవసాయ పరిజ్ఞానము, వాస్తుశాస్త్ర పరిజ్ఞానము, భూగోళఖగోళ శోధన, వైద్యపరిజ్ఞానము, సూక్ష్మక్రిమిశోధనాదికము మొదలగు ప్రకృతిశాస్త్ర పరిజ్ఞానవిశేషములు వేదవాఙ్మయమును శోధించినకొలఁదియుఁ గాన్పించుచున్నవి. "కుక్కు" మొదలగు పాశ్చాత్యులవలె నుత్తరధ్రువ పరిశోధనకుఁ గడంగి విఫలులైనవారును, సఫలులైనవారును మన ఋషులలోఁ గలరు. "బోసు"వలె వృక్షశాస్త్ర పరిశోధనముఁ జేసి మనుష్యునియందుండు నవయవజీవాది పరికరము లావృక్షము

లలోఁగూడఁ గలవని కనుఁగొనిన మహర్షులు కలరు. రోగములు సూక్ష్మక్రిమిసముద్భూతము లనియు, నా క్రిముల మారణ మెట్లు చేయవలయు ననియు శోధించి చెప్పిన మహామునులు కలరు. వేయునేల? నేఁటి "ప్రాచ్య,పాశ్చాత్య" పరిశోధకు లొక్కొక శాస్త్రమున కెంతెంతయో పరిశోధన మెట్లు చేయుచున్నారో వేదర్షులు నటులు శోధించి శోధించి వేదవాఙ్మయమున నిమిడిచి యున్నారు. ఇంతమాత్రమె కాదు: సాహిత్యమున కనుకూలమగు రసాలంకారాదికమును గూడ మహర్షులు వేదవాఙ్మయమున బాగుగఁ బ్రదర్శించియున్నారు. ఇట్టి మహోపకారము నాఋషులు చేయుటచేతనే ద్విజులు నిత్యముఁ జేయు పితృతర్పణముకంటె ముందుగ ఋషితర్పణముఁ జేయవలెనని ప్రాచీనులు తమస్మృతులలో వ్రాసియున్నారు. నేఁటికిని పూర్వాచారపరులగు బ్రాహ్మణోత్తము లటుల ఋషితర్పణముఁ జేయుచున్నందులకు వారికిఁ గృతజ్ఞులము. కాని వా రెందుల కటులు చేయుచున్నారో మాత్రము తెలియనందులకు విచారింపవలసి యున్నది.

ఆర్యులారా! ఆర్యావర్తము, అందు పాంచాలము వేదవాఙ్మయమునకుఁ బుట్టినిల్లని తజ్ఞులు నుడువుదురు. దేవదేశ మనఁబడు బ్రహ్మావర్తము నేటి పాంచాలాంతర్గతము. ఏనాఁడు "డాల్‌హౌసీ"ప్రభువు ఆవేదభూమి యగు పాంచాలమును "కోహినూరు" మాణిక్యముతోఁ గూడఁ బాశ్చాత్యాధీనముఁ జేసెనో, నాఁడే వేద వాఙ్మయము కూడఁ బాశ్చాత్య కరగతమైనదని తలంపవలసియున్నది. డాల్‌హౌసీ పంజాబును క్రీ. శ. 1848 సం. ర ప్రాంతమున స్వవశముఁ జేసికొనెను. ఆవత్సరమే (1848) సామవేద సంహిత "లిప్‌జిక్" (జర్మనీదేశములోనిది)లో ముద్రింపఁబడినది. 1850 సం. రమున "ఋక్సంహిత"ఆక్స్‌ఫర్డులోను, 1852 సం.రమున "శుక్లయజుస్సంహిత" బర్లిన్‌లోను, 1855 సం. రమున "అథర్వసంహిత" బర్లిన్‌లోను, 1871 సం.రము "కృష్ణయజుస్సంహిత" లిప్‌జిక్‌లోను ముద్రింపఁబడినవి. ఇంతమాత్రమె కాదు. వేదానుక్రమణికలు, శిక్షలు, కల్పసూత్రములు మొదలగు వేదాంతగ్రంథములు భారతదేశమునుండి పాశ్చాత్యులు తమ సీమలకుఁ గొనిపోయి పరిశోధించి, భారతీయులకంటె ముందుగ ముద్రించి ప్రకటించుటయె కాక, భాషాంతరీకరించి మనవిద్యారణ్యాదికముఁ దోసిరా జనుచున్నారు. మన దేశమునన్, ఆవేదవిద్యను బ్రాహ్మణులలోఁ గొందఱు మాత్రము నూటికి 99 మంది యర్థవిచారమును జేయక, పోకుండఁగ మాత్రము ధరించి, బరోడా రాజ్యములోని "సంచార పుస్తకభాండాగారముల"తో సమానులై పొట్టను పోషించుకొనుటకుఁ దేశమునం దచట నచటఁ దిరుగుచుఁ గాన్పించుచున్నారు.

పాశ్చాత్యుల వైశద్యమునకు మనము వారికిఁ గృతజ్ఞులము కావలసియున్నది. వారి భాషాంతరీకరణమె మన యాంగ్లవిద్యావంతులకు వేద వృత్తాంతముఁ దెలిసికొనుటకు మార్గదర్శక మగుచున్నది. సాయనభాష్యము కంటె "గ్రిఫిత్, యగ్గిహింగ్, జిమ్మరు, మాక్సుముల్లరు" మొదలగువారి భాషాంతరీకరణములే మన వేద విశేషములఁ జెప్పుచున్నవి. కాని "భారతీయ సాంప్రదాయానభిజ్ఞు లగుటచే" పాశ్చాత్యుల భాషాంతరీకరణము పొరఁబాటులతోఁ గూడుకొని యున్నదని సాహసించి చెప్పుచున్నాఁడను. ఐరోపా అమెరికాలలోఁ గల వైదికగ్రంథరాజములు కొన్ని పుట్టినిల్లగు మనదేశమునఁ గాన్పింపకున్నవి. కౌషీతకీ శ్రౌతసూత్రములకు "హార్వర్డు" (అమెరికాలోనిది)ను, అథర్వవేదము యొక్క "పైప్పలాద" శాఖకు "సిడ్నీ" (ఆస్ట్రేలియాలోనిది) యును నివాసమైనది. మహాయుద్ధమున నలిగి సన్నగిలిన దనుకొనిన జర్మనీదేశము సంస్కృత మహాభారతము యొక్క మొదటి రెండుపర్వములను యుద్ధానంతరము ప్రకటించి యున్నది. "కొవెల్ట్‌హేగ్"లో భారతానుక్రమణిక సిద్ధమైనది. తెనుఁగుదేశపురాజగు కాటయవేముని శాకుంతలవ్యాఖ్య ౧౯ వ శతాబ్దారంభముననే "ఫ్రాంసు" దేశమునకును, పిమ్మట జర్మనీ యింగ్లండు దేశములకునువ్యాపించి "మోనియర్ విల్లియం"గారి యాంగ్ల వ్యాఖ్యానమునకుఁ గారణమైనది. పాశ్చాత్యుల యామహాశ్రద్ధకు మన మాశ్చ

ర్యము నొందవలసియున్నది. ఈచరిత్ర నింతటితోముగించి ప్రకృతాంశమునకు వచ్చెదను.

ఆర్యులారా!కవియన"జ్ఞాని"యని యర్థము.సామాన్యజనుల కలితమగు జ్ఞానమును పద్య, గద్య, గేయ రూపములతో లోకమున వెల్లడించినవాఁడు కవి. అట్టి మహాకవులు, సాధారణకవులు పెక్కువందలమంది వేద వాఙ్మయమును వృద్ధిఁజేచియున్నారు. ఆవాఙ్మయములో కేవల పద్యరూపకముగను, గద్యరూపకముగను, గేయ రూపకముగను మహర్షులు తమ యసమానప్రజ్ఞం జూపియున్నారు. ఛందోబద్ధమై పాదవ్యవస్థ కలది ఋక్కు, గేయము, సామము. మిశ్రమము యజుస్సు. ఋగ్యజుస్సులతోఁ గూడియు,దానిపోలిక నితరముఁ జెప్పిన దథర్వము. దీని విశేషములు పూర్వమీమాంసా శాస్త్రమున విశేషముగాఁ గలవు. వ్యవధి లేనందున నేఁటి భారతీయుల యొక్కయు, అం దాంధ్రులయొక్కయు వేదశోధనావిశేషములను విడచి వేదర్షుల కవిత్వవిశేషములను మాత్రమే నుడువుచున్నాను.

ఒకటిగాని, పెక్కులు గాని ఋక్కులు, సామములు, యజుస్సులుఁ జెప్పినవాఁడు మంత్రర్షి. అట్టి మంత్రములను ఏమంత్ర మెందులకుఁ జెప్పఁబడెనో, దానిసాంప్రదాయము నొకగ్రంథముగా సమకూర్చినవాఁడు కాండర్షి, లేక మండలఋషి. ఋగ్వేదము 10 మండలములు కలది. అందు 1, 10 మండలములకు మండలఋషి కాన్పింపఁడు. తక్కిన యెనిమిది మండలములకు విశ్వామిత్రాదు లధిపతులు.

ఇట్లే కృష్ణయజుర్వేదము 54 కాండలు కలది. ఆ కాండలకు ప్రజాపత్యాదులు 12 గురు కాండర్షులు.సామాథర్వవేదములకు కాండర్షులు కాన్పింపరు కాని మంత్రర్షులు 40 వఱకు సామవేదమునకు, 80 వఱకు అథర్వవేదమునకుఁ గాన్పించుచున్నారు. ఈ ఋషులలో ఖండకావ్యములఁ జెప్పినవారును, హాస్యరచనం జేసినవారును, గేయములను రచించినవారును,ఈశ్వరప్రార్థనముఁ జేసిన వారును, గజేంద్రునివలె నాపత్సమయమున నాపదుద్ధరణముకొఱకు కాయాదేవతలఁ బ్రార్థించినవారును కలరు. ఆ కవులు బ్రాహ్మణులుమాత్రమె కారు: అంబరీషాదిక్షత్రియులు, విశ్వేదేవాదివైశ్యులు, అసురులు,నాగులు (ద్రావిడులు), స్త్రీలుకూడ కలరు. వారి మంత్రములను అక్షర సంఖ్యతోఁగూడ పోకుండఁగ నాయామంత్రసాంప్రదాయములతో జాగ్రత్తచేసి కాండర్షులు వినుతికెక్కిరి.

వారివారి కవిత్వవిశేషములను యజ్ఞాదిక్రతువులం దుపయోగించుట కొక్కొకఋషి యొక్కొక యుగమున "వ్యాస"బిరుదముఁగైకొని వేదభాగముఁ జేసియున్నాఁడు. అట్టివా రిరువదెనమండ్రు కలరు. మొదటి వ్యాసుఁడు "స్వాయంభువ" మనువు. కడపటివాఁడు "కృష్ణుఁ" డను పేరుగల పారాశర్యవ్యాసుఁడు. వాల్మీకికూడ నొక వ్యాసుఁడే. వాల్మీకి, సాత్యవతేయులలో వాల్మీకి కొన్ని సామములను, సాత్యవతేయుఁడు ఋగ్వేద దశమమండలములో 11 ఋక్కులుగల 3 సూక్తములను, యజుర్వేదకాఠకములలో నొకవాక్యమును మాత్రము చెప్పినట్లు గాన్పించును. కాని రామాయణ మహాభారతములను రచించుట చేతనె వారికి "వ్యాసత్వ" మబ్బినది. కాని లోకము కృష్ణద్వైపాయనుఁడే వేదభాగముఁ జేసెనని తలంచుట మాత్ర మాశ్చర్యకరముః. వేదర్షులలోఁ గొందఱికవిత్వవిశేషములను మాత్రము దిఙ్మాత్రముగా నుదాహరించి నావ్యాసము ముగింతును.

## పరాశరుఁడు

ఈతఁడు ఋగ్వేద ప్రథమ మండలములో 41 ఋక్కులను మాత్రము చెప్పియున్నాఁడు. ఆ ఋక్కారమే పరాశరస్మృతిగాఁ బిమ్మట నొకపరాశరగోత్రికుఁడు వ్రాసియుండునని తలఁతును. పరాశరుని కవిత్వ మత్యంత మనోహరమై, యొక్కయుపమేయమునకుఁ బెక్కు లుపమానములు చూపుచు, వాల్మీకికిని, బిమ్మట కాళిదాసునకును దారి చూపియుండు నని తలఁతును. రెంటిని మాత్ర మాతని ఋక్కులఁ జూపుచున్నాఁడను.

విరాట్. దధార క్షేమ మోకోన రణ్వః యవో న పక్వః జేతా జనానాం ఋషి ర్న స్తుభ్వా విక్షు ప్రశస్తా వాజీన ప్రీతో వయో దధాతి.

అ. (అగ్నిః) క్షేమం=క్షేమమును; దధార=కలుఁగఁజేయుచున్నాఁడు; ఓకఃన=గృహమువలె; రణ్వః=పొందఁదగినవాఁడు; యవఃన=యవధాన్యమువలె; పక్వః=భోగయోగ్యుఁడు; జనానాం=శత్రుజనులకు (ను); జేతా=జయించునట్టి; ఋషిఃన=ఋషివలె; స్తుభ్వా=స్తుతిఁజేయునట్టి; విక్షు=మనుష్యులలో; ప్రశస్తః=ప్రశస్తుఁడు; వాజీన=గుఱ్ఱమువలె; ప్రీతః సంతోషపెట్టి; (అగ్ని) వయః=అన్నమును; దధాతి=కలుగఁజేయునుగాక.

విరాట్. పుత్రో న జాతో రణ్వో దురోణే వాజీ న ప్రీతో విశో వితారీత్.

అ. పుత్రఃన=పుత్రునివలె; జాతః=పుట్టిన (యగ్ని); దురోణే=గృహమునందు; రణ్వః=సంతోషకరుఁడగుచున్నాఁడు; వాజీన=గుఱ్ఱమువలె; ప్రీతః=సంతోషకరుఁడగుచు; విశః=శత్రువులను; వితారీత్=అతిక్రమించుచున్నాఁడు.

ఈతనియగ్నిస్తుతి ఖండకావ్యముగాఁ గాన్పించును.

శునశ్శేపుఁడు

ఋ. కస్య నూనం కతమ స్యామృతానాం మనామహే చారు దేవస్య నామ; కో నో మహ్యా అదితయే పునర్దా త్పితరంచ దృశేయం మాతరంచ.

అ. అమృతానాం=దేవతలలో; కతమస్య=ఎట్టి; కస్య=ఏ; దేవస్య=దేవునియొక్క; చారునామ=శుభమగు నామమును; మనామహే=ఉచ్చరింతుము; కః=ఏదేవుఁడు; (నన్ను) పునః=మరల; మహ్యై అదితయే=విస్తారమగు భూమికొఱకు; దాత్=ఇచ్చెను (పుట్టించెను); నూనం=నిజముగా; పితరంచ=తండ్రిని; మాతరంచ=తల్లిని; దృశేయం=చూచెదనా?

శునశ్శేపుఁడు హరిశ్చంద్రుని యాగ యూపస్తంభమునకుఁ బశువుగాఁ గట్టఁబడి ప్రాణభీతిచే దేవునిఁ బ్రార్థించు ఋక్కు. ఈఋక్కు గజేంద్రమోక్షములోని—

శా. ఏరూపంబున దీని గెల్తు నిటమీఁ దేవేల్పుఁ జింతింతు నె
వ్వారిం జీరుదు నెవ్వ రడ్డ మిఁక నివ్వారిప్రచారోత్తమున్
వారింపం దగువార లెవ్వ రఖిలవ్యాపార పారాయణుల్
లేరే మ్రొక్కెద దిక్కుమాలిన మొరాలింపం బ్రపుణ్యాత్మకుల్.

అను పద్యమునకు మాతృకగాఁ గాన్పింపదా? ఇట్టిఋక్కులు పెక్కులు వేదమునఁ గలవు కాని వానినుదాహరింప సమయ మిది కాదని మానితిని.

తెనుఁగులో హాస్యరసప్రధానపద్యములు పెక్కులు కలవు. వానిని సమకూర్పఁ బ్రయత్న మింకను మనము చేయుచుండుటలేదు. కాని కాండర్షులు మాత్రము హాస్యరస ప్రధానములగు ఋక్కులను సమకూర్చి యున్నారు. అట్టి రెండుఋక్కులను మాత్రము వ్రాయుచున్నాఁడను:

భావయవ్యుఁడు

ఋ. ఆగధితా పరిగధితా, యా కశీకేవ జంగహే। దదాతి మహ్యం యాదురీ యాశూనాం భోజ్యాశతా.

తా. సంభోగార్థ్యురాలును; మిక్కిలి ప్రీతితోఁ బరిగ్రహింపఁబడినదియు, బాలెంతయగు ముంగిసవలె విడిచియుండ నొల్లనిదియునగు వీర్యపుష్టిగల (రోమశ) నా కమితసౌఖ్యము నొసంగుచున్నది.

ఈమంత్రమును గర్భాదాన సమయమున నందర్థము తెలియక వైదికులు ఋగాశీర్వచనముగాఁ జేయుట విచారకరము. ఇది భార్య తనకు సరిపడలే దని భావయవ్యుఁ డను రాజు హేళనముఁ జేయుఋక్కు.

దానికి (రోమశ) హేళనముగా నిటులు సమాధాన మిచ్చెను:

ఋ. ఉపోప మే పరామృశ మా మే దభ్రాణి మన్యథాః; సర్వా హ మస్మి రోమశా గంధారీణా మి వావికా.

తా. నేను ప్రౌఢను గాననియు, అసంపూర్ణావయవననియుఁ దలఁపకుము: నన్ను తడవి చూడుము; నేను గాంధారదేశపు గొఱ్ఱెవలె రోమములు కలదాని నై యుంటిని.

ఇట్టి సంభాషణరూపకము లగు పద్యములు "శతపత్రంబుల మిత్రుని" మొదలగునవి తెనుఁగులోఁ గలవు. వాని నొక గ్రంథముగా సమకూర్చుట యవసరము.

వేదములోని వచనభాగమును స్వల్పముగా నుదాహరించి నావ్యాసమును ముగింతును.

ఋక్సామవేదములలో మాత్రము వచన ముండదు. తక్కిన వేద వాఙ్మయములో విస్తారము వచన భాగ ముండును.

యజుర్వేద కాఠకము

"అపశ్యం మహా మేతాం త్సప్తసూర్యా నితి పంచకర్ణో వాత్స్యాయనః సప్తకర్ణశ్చ ప్లాక్షిః."

అనుశ్రవిక ఏన నౌ కశ్యప ఇతి. ఉభా వేదయితే । నహి శేక మిప మహామేరుం గన్తుం । అపశ్యే మహ మేత త్సూర్యమండలం పరి వర్తమానం । గార్గ్యః ప్రాణత్రాతః । గచ్ఛంతం మహామేరుం । ఏకం చాజ హాసం । భ్రాజపటరపతంగాని హనే । తిష్ఠ న్నాతప న్తి । తస్మా దిహ త ప్తిరి తపాః.

తా. సందర్భమిది—సూర్యమండలమును, మహామేరువు (ఉత్తర ధ్రువమును) శోధించుటకు ముమ్వురు ఋషులు ప్రయత్నించిరి. అందు వాత్స్యాయనుఁ డను పంచకర్ణుఁడును, ప్లాక్షి యను సప్తకర్ణుఁడును (రెంటిని) కను గొన లేరైరి. కాని సూర్యుఁ డేడురంగులతో నుండుట మాత్రము చూచిరఁట.

(ఉత్తర సైబీరియాయం దేడురంగుల మాయ సూర్యు లుద్భవించుచుందురని, వెలుఁగుగూడులు కలుగు ననియు భూగోళశాస్త్రమునం జదివియున్నాము.) గర్గుని వంశజుఁడగు ప్రాణత్రాతర్షి మాత్రము గిఱ్ఱునఁ దిరుగు సూర్యుని, పరిభ్రమించు మహామేరువు(ఉత్తరధ్రువము)ను జూచితినని చెప్పియున్నాఁడు.

### పారాశర్య వ్యాసవాక్యము

"స హోవాచ వ్యాసః పారాశర్యః విద్యుద్వధ మే వాహం మృత్యు మైచ్ఛ మితి."

తా. "వ్యాసుఁడు పిడుగు పడి నేను చచ్చితిని అని చెప్పెను."

నే ననుటలో "ఆత్మావై పుత్రనామాసి" యను శ్రుతిచే శ్రీశుకుఁడై యుండును. శ్రీశుకులు వనములోఁ వృక్షములఁ బ్రతిధ్వని కలుగఁజేసి, భూతమయుఁడై యంతర్హితుఁ డగుట పురాణప్రసిద్ధము. అథర్వ వేదములోఁ బృథివీసూక్తమునం దిటులు కలదు. ఆసూక్తభావమే బంకిన్ చంద్ర ఛటర్జీయొక్క "సుజలాం సుఫలాం" అను గేయమునకు మాతృకయని తలఁతును.—

ఋ. జనం బిభ్రతీ బహుధా వివాచసం నానాధర్మాణం పృథివీ యథౌకసం । సహస్రం ధారా ద్రవిణస్య మే దుహాం ధ్రువేన ధేను రనపస్ఫురంతీ.

తా. ఈభూమి పెక్కు-భాషలను మాటలాడుచు, నానాధర్మములు గల జనులకు వారివారి స్థితుల కనుకూలముగా నుండి గోవు పాల నిచ్చునటుల సహస్రవిధములుగా ధనము నిచ్చుచున్నది.

ఋ. యస్యాం సముద్ర ఉత సింధు రాపో యస్యా మన్నం కృష్టయ స్సంబభూవుః.

తా. ఏభూమియందు సముద్రములు, నదులు నుదకము నిచ్చుచున్నవో, వ్యవసాయముచే నేభూమియం దన్నము లభించుచున్నదో (అట్టి యీభూమి యానందదాయక మగుచున్నది).

ఋ. గిరయ స్తే పర్వతా హిమవంతో రణ్యం తే పృథివీస్యోనామస్తు బభ్రుం కృష్ణాం రోహిణీం విశ్వరూపాం ధ్రువాం భూమిం పృథివీ మింద్రగుప్తాం అజీహతో అక్షతోఽధ్యష్ఠాం పృథివీ మహత్.

తా. ఓభూమీ, నీయందుండు హిమవత్పర్వతములు, ఇతరపర్వతములు, అరణ్యము ఆనందము నిచ్చుఁగాక! పచ్చని యెఱ్ఱని నల్లని రంగులు గలిగిన క్షేత్రములు గలిగి పరమేశ్వరునిచే రక్షింపఁబడు భూమి యాజన్మాంతము నా కానంద మిడుఁగాక!

---

## వలపు చెలమలు

శ్రీరంగం నారాయణబాబు (కవితా సమితి)

నవ వయస్సను వాన కందువనుబట్టి
విషయ వాంఛాకలుష పంక వీచికలను
భావశృంగాల ప్రవహించి ప్రణయహృదిని
మలినసలిలాల నామనఃస్థలిని బూరలె.

దీర్ఘనిశ్వాస పవనాగ్నిదిశల జెరగి
మన వియోగనిదాఘాగమన సమయము
రాగ, వేగ, రాగాంబుపూరంబు లింకె.
తొలిసుఖస్మృతులను తడిచలియిసుకల

మనకు సహకారి యగుచు మన్మథుడు వెదకి
వాడి యలుగులగాడి త్రవ్వంగ, క్రొత్త
చెలమలేర్పడి తేటలౌ జలములూరె.
సలలితములైన యీతీపి వలపుచెలమ.

లందు తేరిన యవ్వి శ్రీచందనోప
మాను రాగ సుధాగంధిలామల ప్ర
సన్న పావనతో యముల్ సకియ, యివియు
నింకిపోవును నీవు గ్రహింపకున్న!

---



సభ్యాభివర్ధకసంఘము, సరిపెల్ల



ఉపాధ్యాయ పండితపరిషత్తు ప్రథమవార్షిక సభాసభ్యులు రామచంద్రపురము



ఉపాధ్యాయ పండిత పరిషత్తు, రామచంద్రపురము




ఆంధ్రజన సంఘము, ఖరగపురము



ఆంధ్రయువజన సంఘము, ఖరగపురము

# సాంఘిక కర్మకాండ సమస్యలు

## HINDU RITUAL AND SOCIOLOGY

వల్లూరి సూర్యనారాయణరావు గారు



మన హైందవమతములో మతసంబంధమైన నిత్య నైమిత్తికకర్మలకును, సాంఘికాచారములకును, ఒండొంటితో సంబంధ ముండుటచేత మన సంఘమందు కాలానుసారముగ సంస్కరణములను చొప్పించుట మిక్కిలి కష్టమగుచున్నది. సంఘసంస్కరణ మనగానే తల కంటగించుకొను కొద్దిమంది పూర్వాచారపరాయణులుతప్ప, తక్కిన ప్రజలందరు కొద్దిగనో, గొప్పగనో కొన్ని సంస్కరణలు సంఘాభివృద్ధి కావశ్యకమని యభిప్రాయ పడుచున్నారు. మనకర్మకాండయు, సాంఘికధర్మములును సంస్కృతభాషలో నుండుటచేత జన సామాన్యములోని మూఢవిశ్వాసములు మన పూర్వశ్రుతిస్మృతులలో చెప్పబడినసాంఘికనైతిక ధర్మములకుకూడ వ్యతిరేకముగనున్నవని వారిని ఒప్పించుట మిగుల దుస్సాధ్యముగ నున్నది. వానిని తెలుగుటీకతో వ్రాయించి ప్రజలలో వెదజల్లిన యెడల ఈవిషయములలో ప్రవేశము గలిగి తరువాత విమర్శనకు గడంగెదరు. హేతువాదముతో కూడుకొనక మతవిశ్వాసము మీదనే యాధారపడిన కర్మకాండను, సాంఘికాచారములను పూర్వాచారచరిత్రమూలము ననే కాని మార్పించజాలము. పూర్వనాగరికతాభిమానులగు నిప్పటిశాస్త్రపండితులు తమయిచ్చకువచ్చిన కారికలను, భాష్యములను మాత్రమే ప్రజలయెదుట నుంచుచు తక్కినవన్నియు మరుగుపరుచుచున్నారు. వర్ణాశ్రమధర్మములు, అనులోమప్రతిలోమ వివాహములు, అంతర్వర్ణవివాహములు, భోజన ప్రతిభోజనములు, యువతీ వివాహములు, షోడశకర్మలు, వర్ణమిశ్రమములు, మాంసాహారము, మద్యపానము, విదేశయాత్ర, వితంతూద్వాహములు— ఈ మొదలగు ముఖ్యవిషయములలో నెట్లు ఆయాకాలములకు తగినట్లు మార్పులు కావించబడుచుండెనో విమర్శనా పూర్వకమగు గ్రంథములను వ్రాయుటకు సాహసించరు. అయిదువేల సంవత్సరములనుండి వ్రాయబడుచున్న మనవారి గ్రంథము లన్నియు పరమ ప్రమాణములనియు, సమానాధికారము గలవనియు, శ్రుతిస్మృతుల చేత నంగీకరింపబడినవి కూడ ప్రస్తుతాచారములకు వ్యతిరేకముగ నున్న త్యజింపబడవలెననియు, ఈయాచారములను మార్చుటకు ప్రయత్నించినయెడల, శాస్త్రములకు భంగకరమనియు నిట్లు స్వవచన విరోధముగ వాదించుచుందురు.

శాస్త్రచర్చ వదలివేసి సంఘసంస్కరణలను హేతువాదముమీద నిలువబెట్టుటకు మన దేశములో కొందరు ప్రముఖులు ప్రయత్నించిరి గాని కడచిన ఏబది సంవత్సరముల సాంఘికచరిత్రను బట్టి యీమార్గ మంతగా జయప్రదమైనట్లు కనుపడదు. నేనీమార్గమును నిరసించువాడను కాను గాని, సంఘమునుండి విడిపోయి, సంస్కరణలను బోధించువారి మాటలను జనులు పెడచెవిని బెట్టుట సహజము. పందొమ్మిదవ శతాబ్దములో బ్రహ్మసమాజము, ఆర్యసమాజము మొదలగు సాంఘిక విప్లవములుకూడ హైందవమత సూత్రములమీదనే ఆధారపరుపబడినవి. పై రెండుమతములు కూడ బొంబాయి, మద్రాసు, పశ్చిమోత్తర పరగణాలు, మధ్య పరగణాలు మొదలగు దేశవిభాగములలో జయప్రదము కాలేదు. మన వేదాంతమే దీనికి ముఖ్యకారణము. ఏవియో కొన్ని యాచారముల నవలంబించి యే కులములోనో చేరగలిగినయెడల నిరీశ్వరవాదులకైనను సంఘములో స్థానము కలదు; మోక్షమున కాటంకము లేదు; నైతిక సూత్రము

లకు భంగము వాటిల్లదు. ఏసుక్రీస్తు ఇరుగుపొరుగువారిని తన్నువలెనే ప్రేమించమని చెప్పగా, మన వేదకాలపు ఋషులు నీయిరుగుపొరుగువారు నీవే యని బోధించు నపుడు నీతికి ఇంతకంటె ఎక్కువపునాది యెచ్చటనుండి రాగలదు? వివిధ సాంఘికాచారములు ప్రపంచములో నెన్నియున్నను ఈనైతిక సూత్రము నుల్లంఘించనంత వరకుమోక్షమార్గమున కడ్డుకలిగించవని మనవారి నమ్మ కము. ప్రకృతివికాసమునకు మూలమైన పరిణామ సూత్ర మే లోకములోని నీతికిని, సంఘాభివృద్ధికిని కూడ వర్తించు చున్నది. ఈసాంఘిక పరిణామసూత్రములను ప్రజాసామా న్యమునెదుట వారి విమర్శనకు పెట్టినయెడల మనమిప్పుడు చొప్పించదలచిన సంఘసంస్కరణల యావశ్యకత వారు సులభముగ గ్రహించగలరు. ఇప్పటి మూఢాచారములు పటాపంచ లగును. పూర్వాచారములను, సాంప్రదాయ ములను పట్టుకొని వ్రేలాడుచున్న మన సంస్కృతపండి తులు, పురోహితులు, మతగురువులు మొదలగు వారి మాటలను విశ్వసించరు. వారికి విశాలదృష్టి లేదు. పూర్వు లు వేర్వేరు కాలములందు వ్రాసిన వేదవేదాంగములు, శ్రుతిస్మృతిపురాణేతిహాసములు మొదలగునవి యన్నియు వారికి పూజనీయములే. వానిలోని విషయముల యోగ్య తాయోగ్యతలు విమర్శించనే కూడదు. వేల కొలది సంవ త్సరములనుండి యేవి సంస్కృతభాషలో వ్రాయబడినను, వానిలో నెంత పరస్పరభేద మున్నను, వాని నెట్లో సమ న్వయము చేసి వానిలోనున్న దంతయు మంచిదేయని వీరు సమర్థింప జూచెదరు.

ఒకమూల,అర్థము తెలియక కర్మలను చేయుట,మరి యొకమూల వేదాంతసూత్రములనుబట్టి అవి యన్నియు అనవసరమే యనుట, భక్తి, జ్ఞాన, కర్మ మార్గములు మూడును మోక్షమును స్వతంత్రముగానే యిచ్చుననుట, కాని లోకసంగ్రహార్థము సమస్తమతకర్మలను, స్వధర్మ మును వదలక ఆచరణలో పెట్టుచుండుమనుట మన గురువులకు ఆచార మైపోయినది. వీని నన్నిటిని భగవద్గీత మొదలగు మతగ్రంథములవలన సమర్థించుచు అస్పృశ్య తానివారణము, వర్ణాశ్రమధర్మములలో మార్పులు, రజ స్వలానంతర వివాహములు,వితంతూద్వాహములు, అంత ర్వర్ణ అంతర్జాతీయ వివాహములు, అనులోమ ప్రతిలోమ వివాహములు, భోజనప్రతిభోజనములు, షోడశకర్మలను క్లుప్తపరచుట యీమొదలగు విషయములలో మన మత గురువులు, పండితులు, శాస్త్రజ్ఞులు మొదలగువారు సంఘ మును ముందుకు నడవనీయక అడ్డు తగులుచుందురు. గాంధిగారు వర్ణాశ్రమధర్మశబ్దమునకు ఒక వ్యాఖ్యానము చేయగానే తంజావూరుజిల్లాలోని పండితులందరు గుమి గూడి ఆవ్యాఖ్యానము శాస్త్రవిహితమైనది కాదని యాం దోళనము మొదలుపెట్టిరి. మన పండితులకు ఆయా శాస్త్రములలో కూలంకషజ్ఞాన మున్నదిగాని, విమర్శ నము, పరసాంఘిక వ్యవస్థలతో పోల్చిచూచుట, విశాల దృష్టి, ప్రకృతిలోని పరిణామము గుర్తించుట, పూర్వసాం ఘిక చరిత్రజ్ఞానము మొదలగునవి యలవడలేదు.

హేతుపూర్వకముగాని కర్మకాండయు (Dogmatic Theology)సాంఘికపరిణామము(EvolutionarySociology) వేదాంతము (Philosophy) ఈమూటిలోని ముఖ్య సూత్ర ములను సమన్వయము చేయుటకుగాని, వానిలో కొన్ని టిని విసర్జించుటకు గాని మనము ప్రయత్నించవలెను. ప్రపంచములోని వివిధమానవసంఘములలోని మతాచా రములు, వాని పూర్వచరిత్రలు పోల్చి, విమర్శించి, మన సంఘస్థితుల కనువగునట్లు ధర్మాధర్మనిర్ణయమును చేయు చుండవలెను. కాబట్టి మనసంస్కృతపాఠశాలలలో తయా రుచేయబడి మిడిమిడిజ్ఞానమును మాత్రము సంపాదించు 'విద్వాన్' 'శిరోమణుల'తో తృప్తినొందక, అక్కడ వేద వేదాంగములను, సాహిత్యమును బోధచేయు పండితుల సహాయము తీసికొని, సంస్కృతాంగ్లములలో పాండిత్య మును సంపాదించినవారును, సాంఘికశాస్త్రజ్ఞులును మన మతగ్రంథములను ఆంధ్రములోని కనువదించి, విమర్శించు టకు తగినగురువులుగ నేర్పడినగాని ప్రస్తుతము స్తంభించి పోయిన మన సంఘమునకు చలనశక్తి రానేరదు.

మనము చేయుచున్న శ్రౌతకర్మ యంతయు చేయించేవారికిని, చేసేవారికిని అర్థము తెలియక, గుంజంత యు పోయి వట్టిడొల్లవలె నున్నది. నేను చదువుకొన్న కొద్దిస్మృతులనుబట్టియే వర్ణాశ్రమధర్మములు,విధులు ఇది వరకే నశించినవి. వానిలో వ్రాయబడిన ఆచారకాండ యు, ప్రాయశ్చిత్తకాండయు బొత్తిగా అంతరించినవి. అప్పటి సద్బ్రాహ్మణుడుగాని, సచ్ఛూద్రుడుగాని యిప్పుడు కనుపడనే కనుపడడు. ఈవిషయములను దేశభాషలలో బాగుగా వెల్లడించినయెడల నిప్పటి మతాచారము లన్ని యు జనసామాన్యమే విమర్శించుకొనగలదు. గుప్తమేమి యు లేక తేటతెల్లముగ సుబోధ మగుచుండును.

ఈమధ్య, జడ్జీ శ్రీనివాసయ్యంగారు ఎన్నినడు దుడుకులు వచ్చినను, ఇన్ని వేల సంవత్సరములు చెక్కు చెదరక జీవించిన మనసంఘమువంటి దెక్కడ నున్నదని ప్రశ్నించెను. ఎటులో యొకవిధముగ జీవించినంతమాత్ర మున నే, దానిలో పటిమ యున్నదనుట వెఱ్ఱిమాట. వాన పాములు ఎన్నికోట్లు ప్రపంచమంతట లేవు! వానిజీవితము మహోత్కృష్టమైనదని చెప్పెదమా? ఇతరజాతుల అడు గులకు మడుగు లొగ్గుచు మనచరిత్ర తెలిసినంతవరకు కనీ సము రెండువేలసంవత్సరముల పైకాలమునుంచి మనము జీవించినాము. ఇటులనే యెన్నిసంవత్సరములైనను, ఐక మత్యములేని వివిధవర్ణములతో మనము జీవించగలము. మన మప్పుడు మృతజీవులముగాని,జీవన్మృతులముకాము. పూర్వాచారములను పట్టుకొని యెంత వ్రేలాడుచున్నను, మనలచుట్టు నుండు అగ్నిహోత్రము మనల నంటుకొన కుండునా? ఏటికెదురీద ప్రయత్నించుటేమిప్రయోజనము? మన వేదాంతసూత్రములను ప్రధానముగ చేసికొని వాని నాచరణలో పెట్టుటకు కర్మకాండను సంకుచితపరిచి,ఆధు నిక జీవనమునకు కావలసిన ధర్మములను, సంఘసంస్కార ణములను స్వీకరించి,మూఢాచారములను ప్రోద్రోలి,అన్య దేశీయులవలె స్వాతంత్ర్యమును సంపాదించి బలమును చేకూర్చుకొనవలెను గాని,ప్రపంచములో మన దేశమే కర్మ భూమియనియు, మూడు వేలసంవత్సరములక్రిందటి సంఘ ధర్మములు, వ్యక్తిధర్మములు, ఆచారములు, ఆదర్శములు సాంప్రదాయములు నిలువబెట్టతగిన వనియు చెప్పుట కంటె వెఱ్ఱి మరియొకటి లేదు. కాబట్టి మన వారు తమ కర్థవిహీనమైన మంత్రముల నుచ్చరించుచు స్వవంచకు లును, లోకవంచకులును కాకుండ త్రికరణశుద్ధిగ నేయా చారములను ఈయిరువదవ శతాబ్దములో అమలులో నుంచతగినవో తెలిసికొనుటకు ధర్మజ్ఞసభల నేర్పాటు చేసికొనుటయు, పూర్వ మతగ్రంథముల నన్నిటిని దేశ భాషలలో సులభశైలిని తర్జుమాచేయించుటయు మిక్కిలి యవసరము. అప్పుడుగాని వానిని సంపూర్ణముగను,న్యాయ ముగను విమర్శించుటకు అధికారము కలవారము కాము. కోవూరులోని ఆంధ్రగీర్వాణవిద్యాలయము, మైలాపూరు లోని సంస్కృతకాలేజి, విజయనగరములోని సంస్కృత కళాశాల మొదలగు సంస్కృతకాలేజీలు ఇట్టివిషయముల నన్వేషించుటకు తగినవై యున్నవి. కనుక ఆయాజిల్లాల వారు తమశక్తికొలది ధన మొసంగి గొప్పపండితుల నేర్ప రచి యీపనులను నెరవేర్చెదరని నమ్ముచున్నాను.

---

# "నీరసము నీరసము మఱి నీరసంబు"

పల్లె పూర్ణప్రజ్ఞాచార్యులు గారు

వసధోత్తంససుకుట్టిమోపరితలవ్యాసక్త సౌవర్ణ చి
త్ర సరోజంబును గాంచి పాఱెదరు తత్ప్రాంతంబు, నాకారపుం
బసయేకాని యథార్థదృష్టి కది దివ్య ద్దివ్య పద్మంబొకో?
రసమా? గంధమ? తేఁటులార! యిటు మీరాకల్ ప్రశంసింతురే.

రసికులరు మీరు, మీవలె-రస మానెడువారు మధుకరములారా! యీ
వసుమతిఁ గలరే, పై పై-మిసమిసలం గాంచి, యిటు భ్రమిసితిరి, కానీ.

అరయరైతిరి పెద్ద యాడంబరమెకాని లే దిందు సొంపైన తావు లంచు
తలపోయ రయ్యయ్యో! పత్రముల డాబేకాని లేదు లోపలఁ బస లేశ మనుచు
కన రయ్యో! వర్ణసాంకర్యమే కాని, లోపల నున్నదెల్ల నభావ మనుచు
భావింపరైతిరి పైవిలాసమెకాని యన్వేష్య మిందు లే దసలె యనుచుఁ
దెలియఁజాలకపోతిరే తేఁటులార!-నీరసమెకాని రస మిందు నెగడ దంచుఁ
దెలివితో నిప్పుడేనియుఁ దిరిగిపొండు-జనులు మీరసికతను సంస్తవ మొనర్ప.

కనఁగ మీపూర్వజన్మవాసనలు దప్ప-స్వల్పమే నిందు నితరవాసనలు కలవె?
ఏల యెఱుఁగకపోతిరి బేలలట్లు-కొంచెమే నిది నిర్గంధకుసుమ మనుచు.

అర్థమార్గంబునందేని యయ్యయ్యో! మీకుఁ-దెలియదయ్యెను గా మృగతృష్ణ యనుచుఁ
ద్వరగ దయచేయుఁడీ యెంత తన్నుకొన్న-రసము పుట్టదు తేఁటులారా! యిఁ కిందు.
పూవుఁదేనెలతోడ బోనంబు లిడు వియద్వాహినీహేమాబ్జవనము లుండ
సంతతంబును మదాసారంబుఁ గురిపించు మత్తేభఘనగండభిత్తు లుండ
నిర్భరమకరంద నిర్ణిద్రపుష్పగుచ్ఛోల్లస ద్వల్లీమతల్లు లుండ
స్యందమానమరందబిందుమానసహర వరరసాల ప్రసవంబు లుండ
వీని నన్నింటి విడిచి యోవెఱ్ఱితేఁటు-లార! తగునొక్కొ మీర లీదారి మెలఁగ?
మానుఁడీ కిన్క-వేయి జన్మములకైన-రసము లవలేశమును గూడఁ బొసఁగ దిచట.

ఎఱిఁగియును నీరసం బని యిట్టు లేల-దానికడ నుంద్రు పతుపాతమ్ముతోడఁ
బంతమున వీడి యిపుడైన బయలుదెండు-పోరఁబడితి రంద్రు మీగొప్ప పోదు దీన.
ఎపుడు రస ముప్పతిల్లునో యిం దటందు-రకట! యీదింపుఁగళ్లపు టాస యేల
రసము పుట్టదు పో దీన వ్రాసి యిత్తు-నీరసము నీరసము మఱి నీరసంబు.

ఒకసౌధోపరిసీమఁ జిత్రపటమం దొప్పారు పొందమ్మిఁ దా
నొకభృంగంబు భ్రమించి కంజ మని పో నూహింప వెన్వెంటఁ దే
టికొలం బెల్లను బోయెఁ దేనియలఁ బోటిక్ గ్రోలఁ దన్మాంద్యముల్
సుకవీంద్రుం డొకరుండు చూచి దయ నీసూటిక్ ప్రబోధించెడిన్.

---

## ౭. వైద్యము

# కలరా—విషూచి

వేటూరి శంకరశాస్త్రి గారు, ఎ. యల్., ఎ. సి.

కలరావ్యాధి భారతదేశమున ప్రాచీనకాలము నుండియు లేదనియు, ఇప్పటికి సుమారు నూరేండ్లక్రిందట పశ్చిమఖండవాసులు క్రొత్తగ నీవ్యాధిని కనుగొనిరనియు సామాన్యులే కాక కొందరు చరిత్రజ్ఞులుగూడ దలంచుచున్నారు. 1817 సంవత్సరమున 'జైస్సోర్' లోను, 1832, 1849, 1854, 1863 లో నింగ్లండులోను ఈవ్యాధి భయంకరరూపమున తనధాటిని జూపి, అనేకుల తనపొట్ట బెట్టుకొనెను. అప్పటినుంచియే పాశ్చాత్యులు దీనినిగూర్చి యెక్కువగా పరిశోధనలు జరిపిరి. తుదకు 1883 లో 'కాచ్' అను జర్మను శాస్త్రవేత్త 'కామా' (,) రూపముననుండు నొక సూక్ష్మజీవి కలరావ్యాధిని కలిగించుచున్నదని కనిపెట్టెను. అప్పటినుంచి యిప్పటివరకు నీవ్యాధి కారణము ఈ సూక్ష్మజీవిగానే తలంపబడుచున్నది.

ఈవ్యాధియొక్క కారణములు, లక్షణములు, నివారణములు ఈవిషయముల నటుండనిచ్చి, 'కలరా పూర్వము భారతదేశమున గలదా' యను విషయమును మాత్రమే యిక్కడ చర్చింప నుద్దేశించినాను. వైద్యశాస్త్రచరిత్రము చక్కగా తెలిసికొనినచో, ఈవ్యాధి 1817 నాటిది గాదనియు, అంతకు పూర్వమే ప్రాగ్దేశవాసులు దీనినిగూర్చి పరిశోధనలు జరిపి, గుర్తించినారనియు తెలియగలదు. పూర్వమీవ్యాధిని ఇప్పటివలె 'కలరా', 'గొట్టాలమ్మ' మొదలగు పేళ్లతో పిలువలేదనియేకాని, ఇప్పటి కలరావ్యాధితో నిశ్చయముగా సరిపోల్పదగినటువంటి 'విషూచి' యనబడు నిట్టివ్యాధి కలదని ముందుచర్చను బట్టి తెలియగలదు. క్రీస్తుపుట్టుకకు పూర్వము 1000 సంవత్సరములకే 'విషూచి' అనుపేరుతో నీవ్యాధి చరక, సుశ్రుతాది వైద్యగ్రంథములందు విపులముగా నిదాన, రూప, లక్షణాదులతో వర్ణింపబడియున్నది. చైనాదేశజులు క్రీ. పూ. 5-వ శతాబ్దిలో 'Ho-lovan' అనుపేరుతోను, అరబిక్ వైద్యులు 'హైజా' యనుపేరుతోను వ్యవహరించియుండిరి. ఇప్పటికిని కొన్నిచోట్ల నీవ్యాధిని 'హైజా' యని పిలుచువాడుకగలదు. చరిత్రపరిశోధకులు కొందరు పూర్వపు విషూచి ఇప్పటి కలరాకు పోల్పదగునా యని సంకోచపడిరి. పూర్వమొకప్పుడు బౌద్ధసంఘమువారిసభయందు దీనినిగూర్చి చర్చ జరిగెనట. అందు అపరిశుభ్రమును, దుర్గంధయుక్తమునగు నీటిని త్రాగుటచేతను, అపక్వపదార్థముల నతిగా భుజించుటచేతను నీవ్యాధి కలుగుచున్నదని వారి గ్రంథములనుండి కొన్నియాధారముల జూపి నిశ్చయించిరట! మాగురువర్యులు దివంగతులగు గోపాలాచార్యులుగారుకూడ 'విషూచి' యనబడు వ్యాధి వేదకాలమున గూడ భరతవర్షమునగలదని ఋగ్వేదాదులనుండిగూడ కొన్ని యుదాహరణముల జూపియున్నారు. (చూ: వారి 'విషూచి' యను పుస్తకము.) పూర్వము విషూచి చెప్పబడియున్నను, ఇప్పటి కలరాకును, అప్పటి విషూచికిని గల సంబంధమే మన కిక్కడ చర్చనీయాంశము. ఈరెంటికి సంబంధము లేదని వేరువేరు వ్యాధులుగనే డాక్టరు మహేంద్రలాల్ సర్కారుగారు నిశ్చయించినారు. కాని తగు బలిష్ఠములగు నాధారము వారు చూపలేదు. డాక్టరు సర్కారుగారి యూహప్రకారము కలరా, విషూచి వేరువేరువ్యాధులు కావనియు, ఒకేవ్యాధి నామాంతరములచే పిలుపబడుచున్నదనియు తగు సాక్ష్యముతో నే నిక్కడ చూపబోవుచున్నాను. పైయూహకు నాధారముగా మన ప్రాచీనగ్రంథములందు గల యీక్రిందివిషయముల ముందు జూపుచున్నాను.—

"తం ద్వివిధ మామప్రదోష మాచక్షతే భిషజో విసూచికామలసంచ.
తత్ర విసూచికా మూర్ధ్వం చాధశ్చ ప్రవృత్తా మదోషాం యథోక్త
రూపాం విద్యాత్. తత్ర వాతః శూలానాహాంగమర్దముఖశోష
మూర్ఛా భ్రమాగ్ని వైషమ్య సిరాసంకోచన స్తంభనాని కరోతి.
పిత్తం పునః జ్వర మతిసార మన్తర్దాహతృష్ణామదభ్రమప్రలపనాని
శ్లేష్మాతు ఛర్ద్యరోచకావిపాక శీతజ్వరాలస్య గాత్ర గౌరవాణి."
(చరక-నిమాన-ద్వితీయాధ్యాయః.)

"సూచీభిరివ గాత్రాణి తుదన్ సన్తిష్ఠతేఽనిలః,
యస్యాజీర్ణేన సా వైద్యై రుచ్యతేతి విసూచికా.
నతాం పరిమితాహారా లభన్తే విదితాగమాః,
మూఢాస్తా మజితాత్మానో లభన్తే కలుషాశయాః. [దాహః;
మూర్ఛాతిసారౌ వమథుః పిపాసా, శూలం భ్రమోద్వేష్టనజృంభ
వైవర్ణ్యకంపౌ హృదయే రుజశ్చ, భవంతి తస్యాం శిరసశ్చ భేదః;
యఃస్యావదన్తోష్ఠనఖాల్పసంజ్ఞో,వమ్యర్దితోఽభ్యంతర జాతనేత్రః."
(సుశ్రుత.ఉత్తర.)

"పీడ్యమానాహి వాతాద్యా యుగపత్తేన కోపితః,
ఆమే నాన్నేన దుష్టేన తదేవావిశ్య కుర్వతే;
విష్టం భయన్తోఽలసకం చ్యావయన్తో విసూచికాం,
అధరోత్తరమార్గాభ్యాం సహసైవాజితాత్మనః;

వివిధై ర్వేదనోద్భేదై ర్వాయ్వాదిభృశకోపతః,
సూచీభిరివిగాత్రాణి విధ్యతీతి విసూచికా;
తత్ర శూల భ్రమానాహ కంప స్తంభాదయో౽నిలాత్,
పిత్తా జ్జ్వరాతిసారాంతర్దాహతృట్ప్రలయాదయః;
కఫాచ్ఛర్ద్యంగగురుతావాక్సంగ ష్ఠీవనాదయః."

(వాగ్భట.సూత్ర.)

పైవిషయములనుబట్టి 'విషూచి'యనువ్యాధి అపక్వపదార్థములనతి గాభుజించుటచేత వాతాదిదోషములు ప్రకోపమునొంది,అజీర్ణము ప్రధానముగా గలిగి, ఊర్ధ్వాధోమార్గములనుండి వమన, విరేచనములు గలిగించు వ్యాధియని సామాన్యముగా తెలియుచున్నది గదా!

పాశ్చాత్యవైద్యపద్ధతి ప్రకారమును, ఆయుర్వేద వైద్యపద్ధతి ప్రకారమును 'కలరా, విషూచి' వీనియొక్క లక్షణాదులను పోల్చి చూచినయెడల రెండును వేరువేరు వ్యాధులు కావని చదువరులే గుర్తింపగలుగుదురు: చూపుచున్నాను—చిత్తగింపుడు.

| పాశ్చాత్య వైద్యపద్ధతి | ఆయుర్వేద వైద్యపద్ధతి |
|---|---|
| Cause:— Excess in eating, often of badly prepared or decomposing food. | "నతాం పరిమితాహారా లభంతే విదితాగమాః,మూఢాస్త్వజితాత్మానో లభంతే ఆ౽శనలోలుపాః." (సు) (భా) |
| Prodromal or premonitory diarrhoea. | అజీర్ణ (సు) విపాక (చ) |
| FIRST STAGE or the stage of evacuation. | విసూచికామూర్ధ్వం చాధశ్చ ప్రవృత్తాః. (చ) |
| Vomiting: first stomach contents, then rice water. | వమథు (భా) ఛర్ది (చ) |
| Purging: profuse and frequent. | అతిసార (భా) |
| Stool: foecal first, then rice water stool. | అతిమాత్రప్రలీనమల (చ) |
| Cramps and stabbing pain especially of calf muscles and those of feet, abdominal muscles less so. | సూచీభిరివగాత్రాణి తుదన్ (సు అంగమర్ద చ) ఉద్వేష్టన,హస్తపాదయోః(భా) ఖల్వీ(చ)హస్తాదౌ శిరమోటన రూపావేదనా (శ) అంగాదీనాం మోటనం 'ఖిలధరా' ఇతి లోకే (డ) |
| Thirst: Unquenchable | ముఖశోష(చ) తృష్ణా పిపాసా(భా) తృష్ణా (చ) |
| Prostration, sudden loss of strength, yawning. | జృంభన (భా) ఆలస్య (చ) |
| Gastrodynia. | శూల (చ) |
| SECOND STAGE the stage of collapse | తంద్రా (చ) సంస్తంభన (చ) |
| Nausea. | ఉత్క్లేశ (చ ద) ఉపస్థితంవమనమివ (భా) |
| Cramps. | ఖల్వీ (చ) |
| Failure of strength, complete lassitude. | విముక్తసంధి (భా) |
| Animal heat; superficial temperature reduced. | కంప (భా) శీతజ్వర (చ) |
| Rectal temperature: elevated sense of heat. Hyperthermic type fatal. | అంతర్దాహ (చ) |
| Circulation; heart pulse-imperceptible. | దాహ (మా) హృదయరుజా (భా) సిరాసంకోచన(చ) |
| Exeretions: urine; aneuria | మూత్రాఘాత (భా) ఆనాహ (చ) |
| Voice: Vox cholerica. | వాక్స్తంభ(వా) వాక్సంగ (వా) |
| Excessive rest-lessness, then apathy. | గ్లాని(భా) గాత్రగౌరవ (చ)అంగగురుతా (వా) |
| Perspiration: profuse; cold clammy skin. | ఘర్మ; స్వేద |
| Countenance: peculiar expression; pinched face. | వైవర్ణ్య (భా) |
| Eyes: sunk. | అంతఃప్రవిష్ట చక్షు (భా) |
| Complexion: blue. | శ్యామవర్ణ (భా) |
| Doughiness of the skin of the abdomen. | కుక్షిరానహ్యతే(సు) ఆధ్మాన (డ) |
| Dulness of perception. | అల్పసంజ్ఞా |
| Common sensibility: dull. | భ్రమ (భా)(చ) మూర్ఛా (చ) |
| Appetite: anorexia. | అగ్నివైషమ్య (చ) అరోచక (చ) |
| Vision } Hearing } impaired | విసంజ్ఞతా (భా) |
| Taste | అరోచక (చ) |
| Integrity of consciousness. | విసంజ్ఞతా(భా) భ్రమ (భా) (చ) |
| The intellect: delusion. | మత్తతా, ప్రలాప(చ) ప్రలయ (వా) |
| Head ache | (శిరఃశూలం భా) శిరోరోగం (శి) శిరసః భేదః (సు) |
| Sleeplessness | అనిద్రా (భా) |

THE THIRD STAGE
or the stage of reaction.

Cholera typhoid: surface warmer. Pulse; distinct urine; secreted temperature; febrile. Typhoid stage. — జ్వర (చ) (వా)

DEATH — మోహ తంద్రా (చ)
Coma and convulsion

CHOLERA SICCA
The patient dies of collapse without showing symptoms of vomiting or diarrhoea. "There is no, or very little diarrhoea and vomiting, collapse sets in so rapidly that the patient is quickly overpowered as by an overwhelming dose of some poison, and dies in a few hours, without purging or any attempt of reaction. At the postmortem examination, the rice water material so characteristic of cholera, though it may have not been avoided during life, is found in abundance in the bowels."

"నాధోయాతి నచాచార్ధ్వ నాహారోనచపచ్యతే, కోష్ఠే ఒస్థితో లసోభూత స్తతో ఒలసకః స్మృతః." (కాశ్యప)
అలస=Idle
భుజించిన యాహారము జీర్ణించక, ఊర్ధ్వాధోమార్గముల బయల్వెడలక అలసునివలె కోష్ఠమున నిలిచియుండును. అది 'ఆమవిషము' గ పరిణమించి అసాధ్యము లగు లక్షణముల గలిగించి మనుజుని జంపును. దీనినే 'దండకాలసక' మనిరి. (చ)

| | |
|---|---|
| Dyspnoea | మహాశ్వాసః; నిరుద్ధోమారుతొవాపి సక్షావుపరిధావతి (సు) |
| Hiccough | హిక్కా (సు) |
| Belching | ఉద్గార (సు) |
| Tympanites | ఆధ్మాన, విష్టంభ (చ) |
| Cries of Pain | అత్యర్థం కూజతి (సు) |
| Retention of urine and faeces | వాతవర్చోనిరోధః (సు) |

అలసక (Cholera Sicca); విషూచిక (Cholera Gravis): వీనియందు అసాధ్యలక్షణములు—

| | |
|---|---|
| Blueness of teeth, lips and nails. Cyanosis. | దంత ఓష్ఠనఖశ్యావవర్ణం (భా) |
| Slightly conscious. | అల్పసంజ్ఞా |
| Eyes deeply sunk in the orbit. | అభ్యంతరయాతనేత్రః (మా |
| Loss of Consciousness. | మోహ |
| Weak Voice. | క్షామస్వర (భా) |
| Looseness of joints. | విముక్తసంధి (భా) |
| Cessation of stools entirely is a symptom of evil omen. | స్తంభ (సు) |

[ఇందు ఈగుర్తు లుపయోగింపబడినవి:—(చ) చరకము; (సు) సుశ్రుతము; (భా) భావప్రకాశము; (శి) శివదాస; (డ) డల్హణాచార్య; (చ.ద.) చక్రదత్త; (వా) వాగ్భటము; (మా) మాధవ.[

పై లక్షణసామ్యమునుబట్టి కలరావ్యాధికిని, విషూచివ్యాధికిని భేదములేదని నిశ్చయింప సాధ్యమేకదా! భేదము:—ఆయుర్వేద గ్రంథములందు రోగలక్షణాదులు శ్లోకరూపమున నుండుటచేత సూత్రప్రాయముగా వ్యాఖ్యానావసరము లయియుండును. ఆంగ్లభాషయందు అట్లుగాక, విపులవివరణములతోడనే వర్ణింపబడి యుండును. ఇదే భేదము.

ఈవ్యాధికి 'విషూచి' యని పేరుగలుగుటకు ఈవిధముగా వ్యుత్పత్తులు చెప్పబడుచున్నవి:—

"విశేషేణ మృత్యుం సూచయతీతి విసూచీ." (శబ్దకల్పద్రుమము)

విశేషముగా మరణమును గల్గించునుగాన—విసూచి.

"విశేషేణ సూచీభిరివ తుద్యత ఇతి విసూచీ."

శరీరమంతయు సూదులచే పొడిచినట్లు బాధపెట్టునుగాన—విసూచి.

"విష్వక్ (సర్వతః) అఞ్చతీ (గచ్ఛతి)తి విషూచీ"

శీఘ్రముగ వ్యాపించునదిగాన—విషూచి.

ఈ పైవిషయములను బట్టి కలరా వ్యాధిని బహుప్రాచీనకాలమునాడే భారతీయులు కనుగొనిరనియు, పాశ్చాత్యులు నూతనముగ కనిపెట్టినది కాదనియు తెలియగలదు.*

---

* ఈవ్యాసము గిరీంద్రనాథముఖర్జీ గారి "హిస్టరీ ఆఫ్ ఇండియన్ మెడిసిన్" గ్రంథము ననుసరించి వ్రాయబడినది.

# సత్కవి

సోమంచి వాసుదేవరావు గారు

గంగాతరంగిణీ కల్లోల మాలికాడోలికా కేలికాలీలలందు
ననుపమ శరదాగమారంభ సంపూర్ణ పూర్ణిమాచంద్రికా స్ఫురణమందు
ఘనఘనాఘన కాలకలితసౌదామినీసుషమావిశేషవిస్ఫూర్తియందు
నానాసురభిదివ్యసూనరంజితవనీస్మితలప్రకృతి సౌష్ఠవమునందు
బాలభానుమయూఖసౌభాగ్యలలిత-పుష్కర రమావిలాస విస్ఫూర్తియందు
సత్కవి, భవన్మనోమానసౌక మనయ-మనితరానంద పారశ్యమునఁ బొందు.

ప్రకృతి విచిత్రచిత్రము లభంగవిలాసమునన్ భవన్మనో
ముకురవినిర్మలస్థలిని బొల్పెసఁగన్ బ్రతిబింబితంబులై
ప్రకటవచోవిలేఖినిని భవ్యకృతి ప్రతిసీర నాత్మహా
పకములు గాంచి విశ్వజనభావములన్ గరఁగించు సత్కవీ!

కలకంఠ కలరవంబు లెసంగుచోటఁ దేటులు ఝుంకృతిధ్వనుల్ సలుపుచోట
రాయంచకూఁతలు రాణించుచోట మాయూరి కేంకృతులు చెన్నారుచోట
సెలలచప్పుళ్ల పెం పలరారుచోట వీచీమందరవములు సెలఁగుచోటఁ
జిగురుంగములసంజ జగజిగిఁ గనుచోటఁ బ్రసవకాండామోద మెసఁగుచోట
మంద పవమాన నటనముల్ మలయుచోట-లలితలతికాగృహంబు లిం పొలయుచోట
సత్కవి, భవన్మనో మానసౌక మసయ-మనిత రానందలీల వాహ్యాళి సలుపు.

లలితకళాసుమంబుల విలాసమునన్ జరియించి తన్మరం
దలహరిఁ గావ్య శీధుసదనంబునఁ గూర్చియుఁ ద్రావలేక లో
కులకు నొసంగి స్వార్థమును గోరక నెమ్మిఁ బరోపకారితన్
బొలుచు భవన్మనోమధుపమున్ నుతియింతు సతంబు సత్కవీ!

ఈశ్వరుని మహిమంబుఁ దా నెంతయేని- వెల్లడించెడు ప్రకృతిని నెల్లజనుల
కీవు దెలియంగఁ జేసెద వెపుడు సుకవి,-నిన్న పరసృష్టికర్తగా నేఁ దలంతు.

నీవపరసృష్టికర్తవు నీదువాక్కు- లాగమ సమానములు సుకీర్త్యంగనావి
లాసలాస్యకరములు నీ లలిత కృతులు- నిన్ను వినుతింపఁ దర మగునే కవీంద్ర!

ప్రేమపీయూష రససమన్వితము తావకీన హృదయాంబురుహము ప్రకృతివిధాన;
నిత్యుఁడ వచింత్యుఁడ వమేయ సత్యమూర్తి- వతులుఁడవు నీవు సుకవి, బ్రహ్మంబురీతి.

అతిగభీరంబు నిర్మలం బనుపమాన- కాంతివిభ్రాజితం బయి కవివతంస!
తావకీనమానస నది తనరుచుండు- నది కళాసస్య వితతుల నలరఁ జేయు.

పూర్ణిమాచంద్ర చంద్రికా స్ఫురణ నలరు- గగనరమఁ బోలు నీమది కవివతంస!
భావసంతతు లందులోఁ బాఱుచుండు- విమల గంగానదీతరంగములభాతి.

# ఆరోగ్యరక్షణము

టి. రంగమన్నారుగారు, ఏ. యమ్., ఏ. సి. (భిషగ్వర)

శ్లో. నమామి ధన్వంతరి మాదిదేవం, సురాసురై ర్వందితపాదపద్మమ్;
లోకే జరారుగ్భయమృత్యునాశం,ధాతారమీశం వివిధౌషధీనామ్.

చ. తలతుఁ బ్రఫుల్లనేత్రు నిజదాససుమిత్రు రమాకళత్రునిన్
బిలుతుఁ గృపాలవాలు నవపీతసుచేలుఁ గుచేలపాలునిన్
గొలుతు విహంగరాజవరఘోటకవాహు వినీలదేహు ని
స్తులతరభక్తిఁ బాపపరిశోషణు విష్ణుని ముద్దుకృష్ణునిన్.

క. చరకుని సుశ్రుతు వాగ్భటు
నిరుపమునై ద్యాంబు నిధుల నిశ్చలభక్తిన్
గరకమలయుగము ఫాలము
దరిఁ జేర్చి నుతింతుఁ జేర్పఁ దరి యత్నంబున్.

క. స్తుతమతి విలసద్విద్యా
యుతుఁడు వినిర్మలయశఃపయోనిధి లక్ష్మీ
పతి మద్గురువరు ననిశము
స్తుతియింతుఁ బ్రసిద్ధగరిమ సుస్థిరబుద్ధిన్.

"సర్వమన్యత్ పరిత్యజ్య శరీర మనుపాలయేత్;
త దభావేహి భావానాం సర్వాభావః శరీరిణామ్".

అందుచేత మానవజన్మమెత్తిన ప్రతివాఁడును దన శరీరారోగ్య రక్షణము పట్ల మిక్కిలి జాగరూకతతో బ్రవర్తింపవలెను. మరియు-

"ధర్మార్థకామమోక్షాణాం సాధనం యతః;
అతో రుగ్భ్యస్తనుం రక్షే న్నరః". అను వచనప్రకారము ధర్మార్థకామమోక్షంబుల నీడేర్చుటకు పంచభూతాత్మకంబైన శరీరము ముఖ్య కారణము. అట్టిదానికి రోగములు రాకుండ గాపాడుకొనవలెను. అట్లు చేయకుండినయెడల పైపురుషార్థములు సిద్ధింపనేరవుగదా.

హిందువుల శాస్త్రము లనేకములందు శరీరారోగ్యవిధులను ఋషిచంద్రులు చెప్పియున్నారు. అం దాయుర్వేదమున నవి విపులముగ జెప్పబడియున్నవి. ఐనను నట్టిసూత్రరాజములను బరికించి యనుసరింప ప్రయత్నించువార లిపుడు మన దేశమునం దెంతయు నరుదు. పాశ్చాత్య వ్యామోహమునం బడి తచ్ఛక్తి దా మెరుంగలేక హిందూవైద్యశాస్త్రమునందు రోగానుత్పాదనీయ సూత్రములు చెప్పియుండలేదను దురభిప్రాయమున నున్నవారలు మెండు. అట్టియభిప్రాయము కేవల మనాధారమైనది. ఈనాచిన్న వ్యాసమునందు శాస్త్రములం దచ్చటచ్చట నుండి కొన్నియారోగ్య రక్షణవిధులను చదువరుల నామూలాగ్రముగ శాస్త్రమును జదువ బ్రోత్సహించునను నమ్మికతో వ్రాయసాహసించుచున్నాడను.

ఆయుర్వేదమునకు బ్రధానసూత్రమగు "వ్యాధ్యుపసృష్టదేహానాం వ్యాధిపరిమోక్షః స్వస్థస్య రక్షణంచ"యను నుపదేశము భగవానుడగు శ్రీధన్వంతరి తనశిష్యకోటి కుపదేశించియున్నాడు. ప్రస్తుతాంశము స్వస్థరక్షణముగాన దాని నించుకంత యాలోచింతము.

"ఆచారా దాయు ర్లభ్యతే" యనెడు ఆచార్యవచనానుసరణముగ నాయువును బాలించుట కాచారమే ముఖ్యసాధనము. "ఆయురారోగ్య మైశ్వర్యం యశో లోకాంశ్చ శాశ్వతాన్" అని యాచారఫలము చెప్పబడినది. ఆచారమనగ ఆహారవిహారాదులయందు ఆరోగ్యమునకై ప్రతిదినము ప్రవర్తించందగు క్రమము.

స్వస్థుడనగా నెవడు? నీరోగి-సమమైన వాతాది దోషములు, జాఠరాగ్ని, ధాతువులు, మలములు క్రియలు గలవాడుగను, నిర్మలమైన యింద్రియసముదాయము గలవాడుగను, మనస్సుగలవాడుగను నుండవలెను. "బ్రాహ్మే ముహూర్త ఉత్తిష్ఠేత్ స్వస్థో రక్షార్థ మాయుషః" అనగా నీరోగి యైనవాడు సూర్యోదయమునకు రెండుగడియల పూర్వము ఆయుః పాలనార్థమై నిదురనుండి మేల్కొనవలెను.

పిదప మలమూత్రాది వేగములను విసర్జించి ప్రక్షాళనము చేసుకొని దంతధావనము చేయవలెను. మలవిసర్జనానంతర మెనిమిదిమారులును, మూత్రవిసర్జనానంతరము నాలుగుమారులును చల్లని నీటితో బుక్కిలించి ఉమ్మివేయవలెను.

## దంతధావనము

"అపోథితాగ్రం ద్వౌకాలౌకషాయం కటుతిక్తకమ్;
భక్షయే దంతపవనం దంతమాంసా న్యబాధయన్."

అనగా ఉదయ సాయంకాలములయందు వగరు, కారము, చేదుగా నుండు పుడకలలో నొకదానిని కుంచెవలె నములి దంతమాంసములకు బాధలేకుండ దంతధావన మాచరించవలెను. మరియు సుశ్రుతుడు "ఏకైకం ఘర్షయే ద్దంతం" అని కూడ చెప్పియున్నాడు. బంగారు,

వెండి లేక రాగిరేకు, లేకపై పుడక బద్దతో నాలుకయందలి మలమును తొలగించవలెను.

"తథాస్యమలవైరస్యం కండూజిహ్వాస్యదంతజాః,
రుచివైశద్యలఘుతా భవంతి న భవంతి చ".

అని జిహ్వా నిర్లేఖనగణములు చెప్పబడియున్నవి. దంతధావనానంతరము పదునారుమారులు చల్లనినీటితో బుక్కిలించవలెను.

## అభ్యంగము

అనగా తైలము పూసుకొనుట. "అభ్యంగ మాచరే న్నిత్యం" అనుటచే బ్రతిదినము చేయవలెనని అర్థమగుచున్నది, గాని యట్లుచేయుటకు సాధ్యము కానేరదు. అందుచే నధమమున వారమునకు రెండుసారులైనను తైలమును పూసుకొనందగు. ఆపూసుకొనుటలో–

"శిరశ్శ్రవణపాదేషు తం విశేషేణ శీలయేత్"

అని యుండుటచే తల,చెవులు, పాదములక్రింద భాగము వీటియందు విశేషముగ పూసుకొనవలెను. అభ్యంగగుణ మీవిధముగ జెప్పబడియున్నది:

"...సజరాశ్రమ వాతహా, దృష్టిప్రసాద పుష్ట్యాయుఃస్వప్న సుత్వక్త్వదార్ఢ్య కృత్."

## ఉద్వర్తనము

అనగా పరిమళచూర్ణములచే నలుగుపెట్టుకొనుట. శరీరదుర్గంధము, బడువు, చెయి కాళ్లు చచ్చుకొని పోవుట, దురద, శరీరము మీది మలము, అధికముగ చెమటవలన గల్గుదుర్గుణాదులు–ఇవన్నియు నలుగుబెట్టుకొనుటవల్ల నశించుచున్నవి.

## స్నానము

ఉత్తమమైనది నదీస్నానము. తటాకస్నానము మధ్యమము. కూపస్నానము సామాన్యమైనది. భాండస్నానము వ్యర్థమైనది. నవరంధ్ర సమన్వితమగు దేహము మిక్కిలి మలినమైనదిగదా! తద్ద్వారములగుండా అహర్నిశలు మలములు స్రవించుచుండును. స్నానము వలన అట్టి మలములు శుద్ధియగును. "ద్వాకాలా ఉపస్పృశేత్" అనగా నుదయసాయంతనములందు రెండుసారులు దినమునకు స్నాన మాచరించ దగు. దిగంబరియైగాని, ఒక్కవస్త్రమును ధరించిగాని స్నాన మాచరించరాదు. మరియు నలసట తీరకమున్ను స్నాన మాచరించుటగాని, స్నానసమయమున జలమునందు మూత్రపురీషముల విడుచుటగాని, ఉమ్మివేయుటగాని చేయరాదు.

"దీపనం వృష్య మాయుష్యం స్నాన మూర్జాబలప్రదమ్;
కండూమలశ్రమస్వేద తంద్రాతృడ్దాహపాప్మజిత్."

అని స్నానఫలము చెప్పబడియున్నది.

## బలము

"బలాధిష్ఠానా మారోగ్యం తస్మాత్ బలం యత్నేన పాలయేత్."
ఆరోగ్యమునకు బలము పునాది వంటిది; అందుచే సర్వప్రయత్నములచేతను బలమును పాలించవలెను. బలము సహజము, కాలజము, యుక్తిజము అని మూడు విధములు. సహజమనగా పుట్టుకతో వచ్చునది. వయస్సు, లేక శీతోష్ణాది కాలములవల్ల గలుగునది కాలజము. వ్యాయామాహార విహారముల యోగముచేత గల్గునది యుక్తిజము.

అందుచే నిక వ్యాయామము, ఆహారము వీట్లగూర్చి యాలోచింతము.

## వ్యాయామము

"శరీరాయాసజననం కర్మ వ్యాయామ సంజ్ఞితమ్." శరీరమున కాయాసము కల్గించు పని వ్యాయామ మనబడును. మరియు నేపరిశ్రమము శరీరమునకు స్థిరత్వము కల్గించునో, బలమును వృద్ధిచేయునో అట్టి శరీరచేష్ట వ్యాయామ మనంబడును. దాని పరిమాణమును గుర్తెరిగి యాచరింపవలెను. వ్యాయామానంతరము సుఖముగా శరీరమును మర్దనచేసుకొనవలయును.

పదునారుసంవత్సరములకు లోబడిన బాలురు, డెబ్బదిసంవత్సరములకు పైబడిన వృద్ధులు వ్యాయామ మాచరించ దగదు. హేమంత, శిశిర, వసంతములు వ్యాయామమునకుం దగుకాలములు. ఇతరకాలములందు తక్కువగ నాచరించవలసియుండును. దేహపటుత్వము, కాంతి, స్థిరత్వము, అగ్నిదీపనము మొదలగు గుణములు కల్గును. శరీర స్థౌల్యమును బోగొట్టుటకు వ్యాయామము సాటి వేరొక్కటి లేదు. అన్నిటికన్న "ఆరోగ్యం చాపి పరమం వ్యాయామా దుపజాయతే |" అనుటచే జక్కని ఆరోగ్యముకూడ కల్గును. "ప్రాక్ శ్రమాత్ వ్యాయామవర్జీ స్యాత్" అనుటవల్ల శ్రమ కలుగకపూర్వమే దేహపరిశ్రమము విడువవలెను.

## ఆహారము

"న రాగా న్నా ప్యవిజ్ఞానా దాహార ముపయోజయేత్,
పరీక్ష్య హి త మశ్నీయా ద్దేహో హ్యాహారసంభవః."

అనగా అపేక్షవలనగాని, అజ్ఞానమువలనగాని యే యాహారమును పుచ్చుకొనరాదు. దేహ మాహారమువలన బుట్టినది గనుక దానిని జక్కగా బరిశోధించి హితమైనదానిని దెలిసికొని భుజించవలెను. ఉదయసాయంతనములు రెండే భోజనసమయములు. ఒక జామునకు లోపల భుజించిన నజీర్ణము పుట్టును. రెండుజాములు మించిన బలక్షయమగును. దానంజేసి మొదటి జామునందు భుజింపగూడదు. రెండవజామ అతిక్రమించకపూర్వము భుజింపవలెను. చేతులు, కాళ్లు, ముఖము కడుగుకొనక, నోరు పుక్కిలించక, పండ్లతో జక్కగ నమలకుండ అన్నమునుగాని, మరి దేనినిగాని తినకూడదు. మరియు "నజాతు

భుక్తవాన్ ఖాదేన్మాత్రాం ఖాదేద్బుభుక్షితః." అనగా భోజనము జేసినవెంటనే తిరిగి భుజింపరాదు. ఆకలి కల్గినపుడుకూడ మితముగా హితమగు నాహారము భుజింపవలెననుట.

వర్జనీయాహార మీరీతిగా జెప్పబడియున్నది.

"భోజనం తృణకేశాది జుష్టముష్ణీకృతం పునః,
శాకావరాన్నభూయిష్ఠ మత్యుష్ణలవణం త్యజేత్".

ఆహారపరిణామ మెట్లనగా, ఉదరముయొక్క రెండుభాగములు అన్నముచేతను, ఒకభాగ ముదకపానముచేతను నించి మిగతయొకభాగము వాతాదుల స్థానార్థము సశేషముగ వదలవలెను. భోజనానంతరము చల్లనినీటితో పన్నెండుమారులు పుక్కిలింపవలెను.

## నిద్ర

సుఖము, దుఃఖము; పెంపు, కృశత్వము; బలము, దుర్బలత్వము; పుంస్త్వము, నపుంసకత్వము; తెలివి, తెలివిలేమి; బ్రతుకు, చావు-ఇవన్నియు నిద్రాధీనములై యున్నవి.

"తస్మాత్ హితాహితం స్వప్నం బుద్ధ్వా స్వప్యాత్ సుఖం బుధః" అందువలన బుద్ధిమంతుడగు వాడు నిద్రయొక్క హితాహితమును చక్కగా దెలిసి నిద్రింపవలెను. కాలము నతిక్రమించకుండ సాత్మ్యముగా రెండు లేక మూడుయామములు రాత్రియందు నిద్రించవలెను. రాత్రులయం దొకప్పుడు జాగరణము చేసినయెడల జాగరణ కాలములో నర్ధకాలము ఉదయమునందు భుజించకయే పరుండవలెను.

పాడుట, చదువుట, స్త్రీసంగమము, వ్యాయామము, దారి నడచుట-వీటిచే నలసినవారు, ఆహారము జీర్ణించుకొనలేనివారు, గాయములు, దెబ్బలు తగిలినవారు, బాలవృద్ధులు, బలహీనులు, అతిసారము కడుపు లేక రొమ్మునొప్పి వీటిచే బాధపడువారు, ఉన్మత్తులు, కృశులు హిక్కా-శ్వాసరోగులు, ఎత్తునుండి పడినవారు, కుపితులు, దుఃఖితులు, జాగరణము చేసినవారు, పగటినిద్ర యలవాటు గలవారు-వీరెల్లరు పగటినిద్ర కర్హులు. క్రొవ్వుచే స్థూలముగ నుండువారలు, కఫస్వభావులు, రోగులు, స్నిగ్ధమైన ఆహారమును సేవించువారు, దూషీవిషాదులచే బీడింపబడువారు పగటి యం దెన్నడును నిద్రింపజనదు. గ్రీష్మకాలములో వాత వృద్ధియును, ఆదానకాల స్వభావమువలన అధిక రౌక్ష్యమును, నిద్రకు చాలకుండెడి స్వల్పరాత్రియును గల్గి యుండుటవలన పగటినిద్ర ఎల్లరకు హితకరమైనది.

"దేహవృత్తౌ యథాహారః తథా స్వప్నః సమాసతః-" అనగా, శరీరపోషణ యం దెట్లాహారము ముఖ్యమై యున్నదో నిద్రయు నట్టిదిగా నున్నది.

## విహారము

ఐదుదినముల కొకసారి తలవెంట్రుకలు, మీసము, గోళ్లు వీటిని కత్తిరించవలెను. ఎల్లప్పుడు చక్కగ నుతికిన బట్టలు కట్టుకొనవలెను. సుగంధద్రవ్యములను పూసుకొనవలెను. నోటిలో నుంచుకొనవలెను. తలవెంట్రుకలు చక్కగా దువ్వుకొనవలెను. పెద్దలవలె వస్త్రాలంకారాదులను ధరించవలెను. 'ఛత్రీ దండీ మౌళీ ఉపానసహితః యుగమాత్ర దృక్ చరేత్' అనగా-గొడుగు, కర్ర, తలగుడ్డ, జోడు వీటిని ధరించి రెండుగజములదూరము ముందునకు జూచి నడువవలెను. ఎదురుగాలి, అత్యధికమైనగాలి, ఎదురెండ, మంచు వీటిని వర్జింపవలెను.

సభయందు ముఖమునకు చేయిచాటు లేకుండ ఆవలింత, తుమ్ము, హాస్యము వీనిని జేయరాదు. శుభ్రతలేని చింపిగుడ్డలు, ఎముకలు, ముండ్లు, అమేధ్యము, వెంట్రుకలు, పొట్టు, వాటికుప్ప, బూడిద, పుర్రెలు, స్నానము చేయుస్థలములు వీటిని విడువవలెను. గ్రామమున, పట్టణమున, దేవాలయమున, శ్మశానమున, నాల్గుత్రోవలు కలియుచోట, తటాకాదుల సమీపమందు, మార్గమునందు మూత్రపురీషాదివేగములను విడువరాదు. మరియు చాటులేని స్థలములయందు విడువగూడదు.

"నవేగాన్ ధారయేద్ధీమాన్-" బుద్ధిమంతు డగువాడు మలమూత్రములు, శుక్రము, వాంతి, వాతము, తుమ్ము, ఎక్కిళ్లు, ఆవలింత, ఆకలి దప్పి, కన్నీరు, నిదుర, శ్వాసము ఈ వేగముల నాపజనదు. మరియు "ధారయేత్తు సదా వేగాన్ రాగాదీనాం జితేంద్రియః." అని చెప్పియున్నారు. ఇంద్రియనిగ్రహుడై లోభము, శోకము, భయము, క్రోధము, మానము, నిర్లజ్జ, ఈర్ష్య, అత్యాశ, పరద్రవ్యాపేక్ష ఈ వేగముల నెల్లప్పుడు అణచవలెను.

"ప్రసంగాత్ గాత్రసంస్పర్శాత్ నిశ్వాసాత్ సహభోజనాత్,
ఏకశయ్యాసనాచ్చైవ వస్త్రమాల్యానులేపనాత్;
కుష్ఠం జ్వరశ్చ శోషశ్చ నేత్రాభిష్యంద ఏవచ,
ఔపసర్గికరోగాశ్చ సంక్రామంతి నరా న్నరమ్."

అనగా-దగ్గరగ మాటలాడుటవలనను, శరీరమునకు శరీరము తాకుటవలనను, ఊపిరివలనను, కలసి భోజనము చేయుటవలనను, ఒక్కపక్కపై పరుండుటవలనను, ఒక ఆసనముమీద కూర్చుండుటవలనను ఒకరు ధరించిన వస్త్రములు, మాలలు, లేపములు ధరించుటవలనను కుష్ఠము, జ్వరము, క్షయము, నేత్రరోగము, స్త్రీరోగములు మొదలగు నంటువ్యాధులు మనుష్యునినుండి మనుష్యునకు వ్యాపించును. అందుచే నట్టిపనులు మానవలెను.

కోపించువాని సమాధానపరుచువాడుగ, భయపడువాని దిగులు తీర్చువాడుగ, దీనునియందు దయగలవాడుగ, "సర్వప్రాణిషు బంధుభూతః స్యాత్"-సర్వప్రాణులయందు బంధుభావము గలవాడుగ నుండవలెను. ఎల్లప్పుడును మంచినడవడిగల స్నేహితుని గపటరహితుడై సంపాదించుకొనవలెను. చెడుగొట్టులను దూరముగ వర్జించవలెను.

మరియు—"న అనృతం బ్రూయాత్; న అన్యస్త్రియం అభిలషేత్, న అన్యశ్రియం; నవైరం రోచయేత్-" అనియు, "న మద్యద్యూతవేశ్యాప్రసంగరుచిః స్యాత్-"అనియు, "న పాపేపి పాపీస్యాత్-"

అనియు, "న పీడయే దింద్రియాణి న చైతా న్యతిలాలయేత్." అనియు, "సంపద్విపత్స్వేక మనాః హేత్వావీర్ష్యే త్ఫలేనతు" అనియు, "కాలేహితంమితం బ్రూయా దవిసంవాది పేశలమ్." అనియు ననేక సద్వర్తననియమములు చెప్పియున్నారు.

మరియు "బ్రహ్మచర్య జ్ఞానదానమైత్రీ కారుణ్యహర్షో పేక్షా ప్రశమ పరశ్చస్యా దితి." అనగా బ్రహ్మచర్యము, జ్ఞానము, దానము; మైత్రి, కరుణ, సంతోషేచ్ఛ వీటిచే ఆత్మప్రశాంతి పొందవలెననియు మొదలగు ననేకవిషయములు చెప్పియున్నారు. మన శాస్త్రమున స్వస్థహితచికిత్స శరీరమునకు, మనస్సునకు రెంటికినిగూడ చెప్పియున్నారు. అందు మొదటివిధమగుచికిత్సనే నేనిట వ్రాసితిని. రెండవది వ్రాయుటకు తావునులేదు, సమయమునుగాదు. మరియు శరీరస్వాస్థ్యము ననుసరించియేకదా యుండును రెండవదియగు మనఃస్వాస్థ్యము. అందుచే మన ప్రయత్నములు మొదట తొలుతటి దానియం దనువర్తించవలెను. రెండవది దాని ననుసరించుచునే యుండును గదా!

నగరగ్రామాదుల ఆరోగ్య రక్షణవిధులను గూడ శాస్త్రములందు బహువిపులముగ వ్రాసియున్నారు. ప్రస్తుతవ్యాసమునందవి యెల్ల నే వ్రాయ సమకట్టలేదు. వేరొకప్పుడు పరిశీలించెదము గాక.

పాఠకమహాశయులార! మానవుడు జీవించియుండువరకు ప్రాణరక్షణకార్య మాచరింపవలెనుగదా. అట్టి సంరక్షణోపాయముల సూక్ష్మముగ నే నిందు చదువరులనే గ్రంథపఠనమందు ప్రోత్సహించునను నుద్దేశ్యముతో బొందుపరిచితినని తొలుతనే తెల్పియుంటిని. మరల దెల్పితిని. భగవంతు డనుగ్రహించుగాత.

---

## ఉమర్ ఖయాము-ఈశ్వరుఁడు

ఉమర్ అలీషా గారు



ఏను భవన్మహామహిమ నిందు జనించితి నీకతాన నిం
దేను ప్రవర్ధమానుఁడయి యెమ్మెసలారితి నూఱువర్షముల్
పూని యఘంబులన్ సలుపఁ బూనెద నీదయ పెద్దదో మదా
ధీన యఘంబు పెద్ద దొ విధీ! యిఁక నిన్నుఁ బరీక్ష సేసెదన్.

అక్కట కాలమెల్ల వృథమై చనె దుర్విషయప్రసక్తిలోఁ
జిక్కి నిషేధముల్ మెసవి చేప్పడి పాపమలీమసంబులన్
బొక్కి భవన్నియుక్త హితమున్ బొనరింపక నేడు నీదెసన్
మ్రొక్కఁగ వచ్చినార మిట మోమునఁ గజ్జల మావహింపఁగన్.

చెప్పుము పాపముల్ నరులు చేయనివా రెవరో జగంబునన్
జెప్పుము పాపముల్ నరులు చేయనిదే బ్రతు కెట్లు సాగునో
తప్పులు మేము చేసెదము దండన నీ వొనరింతువేని నీ
గొప్పతనంబు మా కిడిన కొద్దితనం బిఁక నేది యీశ్వరా!

నీదయపైని భార మిడ నేర్తుమె కాని వృథా తపస్సుపై
కా దల పాపపుణ్యములఁగాదు; భవత్కృపఁ గల్గెనేని నా
మోదముతోడఁ బాపియును మోక్షము నొందు ముముక్షుఁడైన మున్
నీ దయ లేనిచో నరక నిష్కృతియే గతి గాదె యీశ్వరా!

ఏ నరిషట్కమున్ గెలువనెంచిన నామతి యేదో లోపముల్
బూని యొనర్చు మాన దఘపుంజము నీదయచేతఁ బాపి నా
పైని ననుగ్రహింతు వభవా, యటులైనను నీదుమ్రోల నే
నే నొనరించినాఁడ నఘమేగతి లే దననేర్తు సిగ్గగున్.

ఏను మహాఘపుంజముల నెన్నిటినో యొనరించినాఁడ నా
ప్రాణము మేను వానికయి యాహుతి యయ్యెడుఁ గాన నీశ్వరా
నీనయభక్తి సల్పుచును నిన్ బతిమాలుచు నాదుపాపముల్
మానుప వేఁడుచుంటి ననుమానము మాని దయన్ దలంపుమా.

ఏల మదీయప్రార్థనము నీమహిమంబునకంటె మించునే
యేల మదీయపాపములు నీమహానీయత డిందు సేయునే
యేల నిబద్ధు సేతు విటు లీశ్వర పీడుము పెద్దకాలమున్
దాళియె పట్టె దీవు త్వరితంబుగ వీడెదవం చెఱుంగుదున్.

ఓవుమ రేల పాపముల కూరక చింత నొనర్చె దీవు నీ
భానము తల్లడిల్లినను వచ్చెడి దున్నదె లేశమైన నీ
భూవలయంబునన్ గిలుషమున్ బొనరింపనిచో శరణ్య మా
దేవుఁ డొసంగు నెవ్వనికి? దీనులనే కద కాఁచు నాతఁడున్.

ఓకరుణాళు! నీవు కరుణోదధివై మముబోఁటి పాపులన్
గైకొని కాచుటే కరుణ కావున స్వర్గమునందు పాపులన్
జేకొనవేమి నీతపము చేతనె ముక్తి యొసంగెదేని అ
య్యో! కరుణాళువన్ బిరుద ముండునె కావున మమ్ముఁ బ్రోవుమీ.

తపసున కుంకువగా నీ-యపవర్గ మొసంగెదేని యది విక్రయమా
కృప యనఁ జెల్లదు నీ కది-యపకీర్తికరంబు గాదె యారయు మభవా.

అక్కట నీవు దగ్ధనరకాగ్నినిఁ బ్రజ్వలనం బొనర్చుచోఁ
బొక్కుచు నెంతకాలము ప్రభూ, కరుణింపు మటంచు వేఁడుచున్
మ్రొక్కెద విట్టు లీశ్వరుని మ్రోలఁ బదంపడి ఓవు మర్ ఖయా
మెక్కడినుండి వచ్చితివి యీశునకున్ దయ నేర్పిపెట్టఁగన్.

---

# ౬. నైతికము

## సీత సతీత్వము

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ గారు



పరమపావనమైన మన భారతభూమి పూతచరితలగు సాధ్వీమతల్లులను బుట్టినిల్లు. కష్టసహిష్ణుతయందును, ధైర్యశీలతయందును, దయాధర్మశాంతవాత్సల్యాది సద్గుణసంపత్తియందును నసదృశలగు మహిళామణుల కాటపట్టగుటవలననే కడిగిన ముత్యమువలె, కరగించిన యపరంజివలె, సానబెట్టిన రత్నమువలె మన భరతఖండము నాటికిని నేటికిని నసమానకాంతితో విరాజిల్లుచున్నది.

మన శ్రుతిస్మృతి పురాణేతిహాసచారిత్రాది సమస్త గ్రంథములందును నిట్టి యమూల్యములగు సాధ్వీమణుల సచ్చరిత్రములు విరివిగ వివరింపబడియే యున్నవి. అయినను నిట్టి మహనీయచరితల చరిత్రము లెన్నిమారులు లిఖించినను స్మరించినను చర్వితచర్వణదోషము లేదు. అల్పమతులును, నజ్ఞానులును నగు నాధునికస్త్రీలు వాని నెన్నిమారులైన స్మరించి వారిశీలము నలవరుచుకొనవలసిన వారుగా నున్నారు.

శీలవతులలో కెల్ల మేటి సీత. ఆమె మహారాజపుత్రి; మహారాజపత్ని. కాని ఆమెజీవితములోని విశేషభాగము దయనీయమైన కష్టములతోనే కడచినది. ఆకష్టసహిష్ణుతయందు సీత భూపుత్రియను నామము చెల్లిపోయినది. సీత జీవిత మెల్ల పరికించితిమేని యామె యసమానక్షమాసంపత్తిని ప్రత్యంశమునను బరికింపగలము. క్షమయందు సీత అసదృశ. క్షమయే సీత. సీతయే క్షమగా బుట్టియుండె ననినను నతిశయోక్తి కాదు. క్షమయందే యామె సతీత్వమెల్ల రాణించినది.

శ్రీరాముని యువరాజ పట్టాభిషేకమునకు సర్వసంభారములు సిద్ధమైనవి. పుర మలంకరింపబడినది; రాచనగరు లలంకరింపబడినవి; మహారాజులు, ఋషులు మున్నగువా రెందరో తదుత్సవసందర్శన కుతూహలురై వచ్చి పట్టణమంతటను విడిసిరి; మంగళతూర్యఘోషణములతో పురము ప్రతిధ్వనించిపోవుచున్నది; సీత యుత్సాహమునకు గూడ మేరలేదు. రాచపుత్రికి పెనిమిటి పట్టాభిషిక్తు డగుటకంటె మిన్నయగు నానంద మెద్ది గలదు? పట్టాభిషేకోచితలాంఛనాలంకృతుడై తనప్రియుడగు శ్రీరామచంద్రు డేతెంచునని జానకి యెదురుతెన్నులు చూచుచున్నది. ఇంతలో మంథరాదుస్తంత్రప్రయోగమువలన మహారాజగు దశరథేశ్వరుని కైకేయి కోరిన రెండువరములు శ్రీరాముని పట్టాభిషేకము నాపుటయే కాక నతి డరణ్యవాసమునకుగూడ నేగునట్లు చేసినవి.

అడవికి వెళ్లవలసినది రాముడే! సీతారాములు వెళ్లవలెనని కైక కోరలేదు. దశరథు డాజ్ఞాపింపలేదు. వెలుగుతో నీడయు, నగ్నితో తేజమును దొలగుట సహజమే! దానికి ప్రత్యేకశాసన మెందులకు? వెలుగునీడలవలెనే, అగ్నితేజములవలెనే యైక్యమైపోయిన ప్రణయస్వరూపులు సీతారాములు. వారొకరిని విడిచి యొక రెట్లుండగలరు? పెనిమిటి యడవులలో గాయగసురుల మెసవుచుండ నాతని సహధర్మిణియగు సీత సమస్తభోగైక నిలయమగు నంతఃపురమున నెట్లుండగలదు? శీలవతియగు సీత యట్టి ధర్మేతరక్రియ కంగీకరించునా? రాముడు సీతను జేరి, "సీతా, నే నడవులకు వెళ్లవలెను. బహుకాలము గాదు; పదునాలుగేండ్లు మాత్రమే. క్షణములో గడపివత్తును. నీ విచ్చటనే యుండుము" అనెను. ఆపలుకులాలించుటలోడనే సీత నిర్విణ్ణయై నేల గూలినది. అది పట్టాభిషేక మాగిపోయెనను చింతచే గాదు; కైకాదశరథులు తనపెనిమిటి నడవులపాలు చేసిరే యనుదుఃఖముచే గూడ కాదు; తనప్రాణప్రియుడగు శ్రీరామచంద్రుడు తన్నువీడి యొంటరియై యడవుల కేగెద ననుటచేతనే. అడవులలో గలిగెడి మృగములబాధలు, రాక్షసులతొందరలు, త్రోవనడచుటయందలి కష్టములు, వల్కలాజినముల ధరించుటలు, వన్యఫలముల మెసవుటలు నాదిగాగల వనవాసక్లేశములనెల్ల శ్రీరాముడు సీతకు వివరించి చెప్పెను. కాని యవేవియు శ్రీరాము నెడబాసి యుండునంతటి కష్టములుగా సీతకు దోచలేదు. పతి ననుగమించుటయే తననిశ్చయమని సీత దృఢముగా బలికినది. రాముడు కాదనకుండ తీసికొనివెళ్లినాడు. సుకుమారసుందర శరీరయు, మహారాజకుమారియు నగు సీత యంతఃపురమును విడనాడి, చీనిచీనాంబరము లుజ్జగించి, రుచిరాన్నముల విసర్జించి, కఠినశిలాకంటక పరివృతములగు నరణ్యమార్గములకు పతివెంట నడచినది.

ఆ సుకోమలగాత్రిని నడవులలో శ్రమపెట్టవలసివచ్చినందులకు శ్రీరాముడు చింతించినాడు. లక్ష్మణుడు చూడలేక కైకపై క్రుద్ధుడైనాడు. కాని అపారక్షమాశీలయగు సీత తమవనవాసక్లేశములకు గారణభూతులైన మంథరను గాని, కైకను గాని పల్లెత్తి యొక్కమాటయైనను నన లేదు.

సీతారాములు కలిసియున్నంతవఱకు వారి కరణ్యావాస మెంత మాత్రము కష్ట మనిపింప లేదు. అంతఃపురోద్యానవిహారమువలె నానంద దాయకమే యైనది. కాని ఆయరణ్యమందైన సీతారాములు కలిసి యుండుట ఈశ్వరసంకల్పము గాదు. ఏప్రాణప్రియుని విడువలేక సీత తా నుగ్రాటవి కేతెంచెనో, ఆప్రాణప్రియునకును నామెకును నెడ బాటు గల్గించుటయే విధాత సంకల్పము. రామలక్ష్మణులు పర్ణశాల యందు లేనితఱి చూచి పరదారాపహరణాభిరతు డగు రావణుడు కపటవేషమున వచ్చి సీతను గొనిపోయి తనలంకాపట్టణమునందలి యశోకవనమునందు మృత్యువును బ్రతిష్ఠించుకొనినట్లు ప్రతిష్ఠించుకొని నాడు. అచ్చట—

క. "దానవనాయకు చెఱఁబడి
జానకి యుఱిఁ బడిన హరిణశాబము పోలెన్
మానిని సంతత భర్తృ
ధ్యాన వివశ యగుచు నుండెఁ దాపం బెసఁగన్."

మానవతియగు యువతికి దుశ్శీలు డగు పరపురుషునిచే జిక్కువడుటకంటె మిన్నయగు దుస్సహదుర్భరదుఃఖము వేరొండు గలదే! ఆదుశ్శీలునిచే పట్టువడిన క్షణముననే సీత యసువు లెగిరిపోవలసినదే! కాని సీత సుకోమలహృదయమునందు వజ్రకఠినసదృశ మగు ధైర్యము గలదు. ఆ ధైర్యకవచమువల్లనే యామె జీవములు వీడక నిలిచియున్నది. అంతియే కాక చచ్చుటకూడ నామె కిష్టములేదు. ఆమె చావును గోరియున్న చో నేపైటకొంగుతో నురిబోసికొనియైన నుసురుల విడిచియే యుం డును. కాని యామె మరణించుటకే ప్రయత్నింపలేదు. ఏలయందురా? సీత పతిగతప్రాణ. శ్రీరామచంద్రునియం దామెకు మహాప్రేమ. రామునకును సీతయనిన మిక్కిలి మక్కువ. ఒక్కమాట, ఒక్కపత్ని, ఒక్కబాణము గలవాఁ డనుబిరుదును బొందిన పురుషతల్లజుఁ డాతఁడు. అట్టిరాముడు—సీత తాను ప్రాణమువిడిచినచో దనవియోగదుఃఖముచే రాముడును ప్రాణము విడుచును. అంత నిఖిల లోకసంతాపకరుడైన రావణుడు మృత్యుభీతి లేక చిరకాలము భూమిపై మనును. మానవతీ మనఃకంటకుడగు రావణుడు జీవించుటయు, శ్రీరామచంద్రుడు నశిం చుటయు సీత కిష్టమా? ఎంతమాత్ర మిష్టములేదు. కాన రావణుని శీఘ్రముగా నిర్మూలింపవలచుచో దాను ప్రాణములతో నుండుట యవసరము. తాను బ్రతికియుండిననేకాని రాముడు రావణసంహారమున కుపక్రమింపడు. ఇన్నియు యోచించి రాక్షసాంతఃపురనివాస మను దుర్భరక్లేశమును సీత సహించినది. ఈవిధముగా సీత పదిమాసములు రావణమందిరమున కేవల ముచ్ఛ్వాసనిశ్వాసమాత్ర ప్రాణముతో నిలిచినది.

-పాశ

రావణుడు బలవంతుడే! సాహసవంతుడే! పరస్త్రీమోహాదేశ బద్ధుడే! అయిననేమి? దినమణికిరణముల దివాంధమువలె సీత యొక్క దుర్నిరీక్ష్యమైన పవిత్రతేజమును ఆమోహాంధుడు చూడలేక పోయినాడు. కణకణఖాడు నవలపురాశివలె నున్న యామెనుస్పృశింప లేకపోయినాడు. కాన దూరమునుండియే బతిమాలినాడు; ప్రాధే యపడినాడు; తన సంపదల నేకరువు పెట్టియు, తన ప్రతాపము నుగ్గడించియు నామెను మోహపెట్టి వశపఱచుకొన యత్నించినాడు; కాదనినప్పుడు సంహరించెదనని భయపెట్టినాడు: కాని సీత చలింపలేదు. మహాధైర్యముతో దన ప్రాణనాథుఁ డగు శ్రీరా మచంద్రుని బలశౌర్యము లుగ్గడించి రావణుని తృణీకరించినది. తాను నిస్సహాయయగు నబలయై యుండియు జగత్త్రయశాసనదక్షుడైన రావ ణుని నెదిరించిన జానకి సాహసము మహాస్తుత్యమైనది. అదే సమయ మున మహాభక్తుడగు హనుమంతునకు సీతాదేవి సందర్శనలాభము గలి గినది. ఆమె యుండినవిధమును జూచియు నక్కడ రాముడున్న విధము తలచియు—

క. "ఈరామమనం బెప్పుడు
నారాముని యంద యుండు నారామమనం
బీరామయంద యుండును
ఘోరవ్యసనము లిరువురకు సమానంబుల్."

క. "ఇరువురుఁ జిత్తంబులనొం
డొరువులఁ జెడఁబాసి యునికి నొక్కెడ దారొం
డొరులఁ గనఁ డివురు నాశా
భరముల నున్నారు తెగక ప్రాణమ్ములతోన్."

అనుకొనినాడు హనుమంతుడు. సీత యాంజనేయునిచే బంపిన సందేశము కృత్రిదూంగనోచితమైనది. అట్టియెడ దా నెట్లున్నదియు వివరించుచు సీత పలికినపలుకులు మొల్ల తన రామాయణమునందు వర్ణించి మనోవాక్కాయకర్మములచేత గూడ సీతయున్న తెఱుగును తన యక్షరతూలికచే జిత్రించి మన మనోనేత్రములకు గోచర మగునట్లు చేసినది. ఆపద్యరత్నము నీసందర్భమున స్మరించుట యప్ర స్తుతము గాదని తలంచెదను.

"సీ. నిడుదపెన్నెఱివేణి జడలుగా సవరించి
మలినజీర్ణాంబరం బొలియఁ గట్టి
భూమిరజంబు విభూతి పూఁతగఁ బూసి
తన దివ్యమూర్తిఁ జిత్తమున నిల్పి
నిరశనస్థితితోడ నిలిచి భూశయ్యను
బవళించి నిదుర యేర్పడఁగ విడిచి
తారకబ్రహ్మమంత్రంబుఁ బఠింపుచుఁ
గఠినరాక్షస దురక్రృగములలోన
నహిత లంకామహాద్వీప గహనసీమఁ
దపము సేయుచు నున్నాను దన్నుఁ గూర్చి
నాకుఁ బ్రత్యక్ష మగు మని నాధునకును
విన్నవింపుము సత్వసంపన్న, నీవు!

వానర సేనాసమేతుడై శ్రీరామచంద్రుడు సేతువు గట్టి, సముద్రముదాటి, లంక ప్రవేశించి, అనుజ పుత్ర మిత్రామాత్యభృత్య

సమేతముగా రావణుని సంహరించినాడు. రావణ సంహారము విని సీత మిక్కిలి సంతోషించినది. తనప్రాణప్రియుడగు శ్రీరామచంద్రుని మరల నేత్రానందకరముగ సందర్శించు భాగ్యము గలిగినందులకు హర్ష నిర్భరచేతస్కురా లైనది. సముచితశృంగారముచే సీతరాముని సన్నిధికి తీసికొని రాబడినది. రాము డామెను కన్నెత్తి చూడలేదు. "లోకకంటకు డగు రావణుని బరిమార్చుటయు, నీకు బంధవిమోచనము గావించుటయు మాత్రమే నాలక్ష్యముగాని, సీతా, నీయందు నాకు బరిగ్రాహ్యబుద్ధి లేదు. నీయిచ్ఛవచ్చినతావునకు వెళ్ళవచ్చు"నని మొగమోటమిలేకుండ బలికినాడు. హృదయవిదారకములగు నాపలుకు లాలించి సీత మూర్ఛపోయినది. శ్రీరామచంద్రు డావిధముగా దన శీలమును శంకించి తృణీకరించునని సీత యెప్పుడును భావించి యుండలేదు. కలనైన నూహించియుండని విపత్తి యామె నెదుర్కొనినది. ఆమె శ్రీరామునియం దుంచిన విశ్వాసమునకు బ్రతిఫలముగా నాత డాడిన వాక్కులు నిజముగా నతి దారుణములైనవి; మహాకర్కశములైనవి. శ్రీరామునివంటి పత్నీప్రియునినోట వెలువడవలసినవి కావు. సామాన్యస్త్రీయై యుండినచో నప్పుడు తాల్మి వహించియుండజాలదు. కాని వైదేహి యప్పుడుగూడ తనకు నైజమగు నోర్మిని వీడలేదు. పరుషములు పలుకలేదు. "హనుమంతునిచే నానవా లంపుటకంటె నిన్ను పరిగ్రహింపనని వర్తమాన మంపిన బాగుగ నుండునే; నేనప్పుడేయసువుల బాసి యుందునే" అనిమాత్రమే సీత పలికిన పలుకు. మఱియు నొక విషయమునుగూడ సీత చెప్పినది. ఏమనగా, "పరపురుషుని చెఱయందుండి వచ్చిన నన్ను మీరు శంకించుట సహజమే. మన వివాహకాలమందు సాక్షియై యున్న అగ్నివలననే నాశీలమును బరిశీలించి, శుద్ధచరితనని రుజువైనచో నన్ను బరిగ్రహింపుడు; లేదా,పరిత్యజింపుడు" అని నుడివినది. రాము డంగీకరించినాడు. లక్ష్మణుడు క్షణములో సొద పేర్చ సీత యందు ప్రవేశించినది. జానకిపవిత్రత యనెడి వేడిమి కంటె దహనునివేడిమి యెక్కుడు తీవ్రము కాదేమో! అనలుడు చల్లపడిపోయినాడు. సిగపూవు వాడకుండ సీత అగ్నినుండి యీవలకు వచ్చినది. సువర్ణగ్రాహకుడు సువర్ణముయొక్క మంచిచెడుగులను నిరూపించుకొనుటకు నగ్నియందు తప్తపఱచి చూచుకొనునట్లే శ్రీరాముడు సీత నగ్నియందు కాల్చి నాణెము నిర్ణయించుకొనినాడు. సమస్తదేవతలు, ఋషులు గూడ సీత శుద్ధచరిత పరిగ్రహింపుమని నమ్మ బలికినారు. మహాదారుణదహనజ్వాలల జొచ్చియు కసుగందని వైదేహిని రాముడు సంతుష్టుడై పరిగ్రహించి,పుష్పకవిమానము, నెక్కించుకొని, అయోధ్యానగరమునకు దోడ్కొనివచ్చినాడు. అప్పట్టున సీత యెన్ని సుగుణములచే దననాథుని వశపఱుచుకొనెనో పోతన ... కంటె ... నాడు:

ఆ. "సిగ్గువడుట గల్గి సింగారమును గల్గి
భక్తి గలిగి చాల భయము గల్గి
నయము ప్రియము గల్గి నరనాథుచిత్తంబు
సీత దనకు వశము సేసికొనియె,"

దుస్సహములగు వనవాసక్లేశముల నెల్ల మఱచి సీతారాము లొకవిధముగ నానందముగ గడపుచుండిరి. కౌసల్యాసుమిత్రాది సతీమణు లెల్ల హర్షనిర్భరచేతస్కులు కా,సీత గర్భవతి యైనది. వేకటిసౌభాగ్యముల నొప్పు నిల్లాలిని జూచి శ్రీరామచంద్రుడు మేరలేని యానంద మందెను.

"మనః ప్రసాద సౌమ్యత్వం మౌన మాత్మ వినిగ్రహః,
భావసంశుద్ధి రిత్యేత త్తపోమానస ముచ్యతే." —గీత.

"మనోనైర్మల్యము, సద్వృత్తియు,మితముగా మాటలాడుటయును, మనోనిగ్రహమును కపటములేమియు, మనస్సునకు సంబంధములైన తపస్సు"లని శ్రీభగవద్గీతలో చెప్పబడియున్నది. కావుననే సుజనులైనవా రానియమమును బాటించి మితముగా భాషింతురు. అనవసరముగ వాగ్వ్యయము సేయరు. కాని పామరులు వాగ్వ్యయము వలని ప్రమాద మెఱుగరు. నోటికి వచ్చినట్లెల్ల వ్యర్థముగ బ్రలాపింతురు. ఈవదరుబోతులవలన నొక్కొక్కప్పు డెంతైన నాపద తటస్థించును.

అగ్నిపరీక్ష చేసి యెల్ల ... పరిశుద్ధురా లనిపించుకొని రాముడు సీతను బరిగ్రహించెను. ఇక నా ... నాక్షేపింపవలసిన పనిలేదు. కాని వదరుబోతు లూరకొనరుగదా! ... మాసములు పరపురుషుని చెఱలో నున్న సీతను రాముడు పరిగ్రహించెనని పామరులు కొంద ఱాక్షేపించిరి. రాముడు ప్రజారంజకుడు; ప్రజాక్షేమాభిలాషి; ప్రజాభీష్టానువర్తి.

"య ద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదే వేతరో జనః,
స య త్ప్రమాణం కురుతే లోక స్త దనువర్తతే." —గీత.

అనగా, శ్రేష్ఠుడు దేనినాచరించునో దానిని ప్రమాణముగా గైకొని యితరు లెల్లరు దాని ననుకరింతురు–అని తాత్పర్యము. కావున లోకమున కాదర్శభూతుడుగా నుండువా డేలోపమును లేక యుండవలెనని రాముని సంకల్పము. కావున లోకములో దనవిషయమై యాక్షేపణీయముగానున్న సీతను బరిగ్రహించుటయను లోపమును సీతను బరిత్యజించి బాపుకొనవలెనని శ్రీరామచంద్రుడు నిశ్చయించెను. కావున తాపసాశ్రమములజూపించువ్యాజమున సీత నడవిలోడించి రావలెనని రాముడు లక్ష్మణుని కాజ్ఞాపించెను. అగ్రజాజ్ఞాబద్ధుడగు లక్ష్మణుడు అమలచరితయగు సీతను అడవిలో విడిచివచ్చెను. భర్తతో నరణ్యవాసము సేయుటకంటె నొంటరియై యరణ్యముననుండుట మిన్నయైన దుఃఖముగదా! అట్టి మహావిపత్తి మహారాజపత్నియై, నిండుచూలాలై యున్న సీత నెదుర్కొనినది. మహాక్షమాశీలయగు సీత యప్పుడుగూడ సంభ్రమము చెందలేదు; పతిపై గినియలేదు; లోకుల నిందింపలేదు. రాము డిక దన్ను ...హించుటపట్టిది—కావున నసువులబాయవలెనని తలంపలేదు. ఆమె శ్రీరా...డి మరణించిన గర్భమున నిర్భయులై యున్న యర్భకులుగూడ ...ంతురు. రాము డేకపత్నీవ్రతుడు. సీతగర్భమున నున్న యర్భకులే నశించినరామునికింక సంతానప్రాప్తియే లేదు. రామచంద్రునివంశమింక నిర్వంశమై పోవును. ఇన్నియో గాము లాలోచించి మహాధైర్య



భీష్ముని కౌరవసేనకు అధిపతిని జేయుట

“ముగలుచిత్రము”—అక్బరుచక్రవర్తియొక్క సొంత రాజనామాలోని యొక చిన్న చిత్రమునుండి.

శీలయగు సీత వాల్మీకాశ్రమము సేరి యిరువురు తనయులను గని, వాల్మీకమహామునిచే యాబాలురకు జాతకర్మాదిధన్యకర్మల నడిపించి, వేదాదివిద్యల నేర్పించి, శ్రీరామచంద్రునకు సమర్పించినది. ఆసమయమున,

ఆ. "సీత ముద్దరాలు చిత్తవాక్కర్మంబు
లందు సత్యమూర్తి యనులచరిత
పుణ్యసాధ్వి విడువఁబోలదు చేకొను
రవికులాబ్ధిచంద్ర, రామచంద్ర."

అని వాల్మీకమహాముని శ్రీరామచంద్రున కెఱిగించినాడు కాని ప్రజాభీష్టానువర్తియగు శ్రీరామచంద్రమూర్తి చేకొనవలెనని సీతవంక చూడలేదు. చేకొనుమందురా? యని ప్రజలవంక జూచినాడు. ప్రజలు కిమ్మనలేదు. నిస్సందేహముగ బరిగ్రహింపుమని రామున కనుజ్ఞ నీయలేదు. అంత నిరాశుడై రాముడు చూచిన యొక్కచూపుతో హతాశయై సీత యసువుల విడిచినది. ఈవిధముగా మహాసాధ్వియగు జానకి పామరజనులవాదులకు బలి యైపోయినది. ఇట్లు జీవితాంతమువఱకొకే విధముగా లెక్కకుమిక్కుటములైన కష్టము లనుభవించుట జేసి యేస్త్రీయైన నెక్కుడుకష్టపడుచున్నచో "సీతమ్మ కష్టాలుపడుచున్న"దనిచెప్పుట లోకసామ్యమైపోయినది. అనగా, సీత పడినకష్టములకంటె మిన్నయైన కష్టములు లోకములో లేవన్నమాట. సీత సిగ్గు, సింగారము, భయము, భక్తి, నయము, ప్రియము అను ఆఱు సుగుణములచే దననాథుని [illegible]రు వశము చేసికొనియెనని పోతన కవీంద్రుడు తన భాగవతమునందు [illegible]చియుండెను. కాని తన యపూర్వ క్షమాగుణముచే సీత యఖిలభార[illegible]ల హృదయమును వశముచేసికొని యున్నది. ఆమె సతీత్వమెల్ల యొక్కక్షమాగుణమునందే యత్యధికముగా రాణించినది. ఇటు లనుటచే నామెయందు తక్కుంగల గుణములు లోపించెనని భావముకాదు. సీత సకలసద్గుణసముపేత. సతీత్వమన నేమియో యామె జీవితమునందు రాణించినట్లు మఱియొక స్త్రీజీవితమునందు రాణించియుండలేదు. కాని ఇతోధికముగ నామె యందు ప్రకాశించినది తాల్మి. అడవుల కేగునపుడు తాల్మి; రావణునిచే జెఱబడినపుడు తాల్మి; రాముడు మరల నడవులకంపినపుడు తాల్మి; ఎప్పుడు తాపసమున కవకాశము గల్గెనో అపుడెల్ల సీత ధైర్యములో గూడిన తాల్మియే వహించినది.

కావుననే శ్రీభగవద్గీతయందు,

"కీర్తిశ్శ్రీ ర్వాక్చ నారీణాం స్మృతిర్మేధా ధృతిః క్షమా" అనినాడు శ్రీకృష్ణస్వామి. అనగా, "స్త్రీలయందు కీర్తిలక్ష్మి, వాక్కు, తెలివి, బుద్ధి, ధైర్యము, ఓర్పు నేనే"అని అర్థము. ఇన్ని సుగుణములను గలిగియుండుటచేతనే సీత దేవ్యంశ సంభూతగా బూజింపబడుచున్నది.

భారతహృదయములందు జానకి గలస్థానమత్యుచ్చమైనది. పాటలుగను, పద్యములుగను, కథలుగను, కావ్యములుగను పరమపావనమైన జానకీదేవి చరితము పండితపామరభేదము లేక యెల్లరచే గీర్తింపబడుచున్నది. వివిధవిధములగు గేయములుగా రచియింపబడియున్న యామె కష్టగాథలు పాడి, కనికరించి, దుఃఖవివశలై కన్నీరువిడుచు వృద్ధురాండ్రనెందరనో మనము నిత్యము చూచుచుందుము. ఆబాలవృద్ధముగ నందఱు నెఱిగియున్న యిట్టి సీతా సతీమణిచరిత్రమును దెలుపుట దివిటీతో దివాకరుని జూపుటవలె బరిహాసాస్పదమని నే నెఱుగుదును. అయినను నా సతీమణి సత్సతీత్వము నొకపరి భక్తితో స్మరింపవలెనను నిచ్ఛయే నన్నీవ్యాసమును వ్రాయ బ్రేరేపించినది. విజ్ఞు లిందలి దోషముల సైరింప వేడెద. పవిత్రతకు దావలమై, క్షమ కునికిపట్టై, ధైర్యమునకు గాణాచియై, పతిభక్తికి తానై యొప్పెడి జానకీదేవి సతీత్వము భారతమహిళామణుల కాదర్శనీయమై యొప్పుచున్నది. ఆంధ్రయువతీమణులెల్లరు శ్రీవైదేహీచరితమును బలుమాఱులు బఠించి యామెవలె సతీత్వమును బడయ యత్నింతురు గాక!

---

## ఆవేదన

కొంపెల్ల జనార్దనరావు గారు

అంటి తొలఁగింపఁజాల మదర్పితములు
ముగ్ధకుసుమముల్ కసుగంది పోవునేమొ!
తహతహ నడంపఁజాల- నీదర్శనమున
నొడలు పులకించు ధన్యత నొందవలయు!

ఆశుభపవిత్రపూజనావేశ గరిమఁ
ద్వన్మధురమూర్తినే కప్పివైచెఁ దుదకు
ఆర్ద్రి మోహన సురభి లతాంతచయము,
పరమభక్తి పరిప్లుత భావచయము!

నీరసిల్లిన నిష్ఠావినీతి నిపుడు
మ్రొక్కికొందు పేదమనస్సు బూరటిల్ల:
తహతహ నడంపఁజాల నీ దర్శనమున,
కంటి తొలఁగింపఁ జాలఁ ద్వదర్పితములు!

# హిందూదేశవ్యవసాయాభివృద్ధి

దరిశి చెంచయ్య గారు, బి. ఎస్ సి.

1. ప్రతి దేశమందును ప్రజలలో నెక్కుడుభాగము వ్యవసాయమువలననే జీవించుచుండుట మనకు తెలిసినవిషయమే. ఇతర దేశములకంటె, మన దేశమందు వ్యవసాయమే యాధారము చేసికొన్నవారు ఎక్కుడుగా నుండుటచేతను, ఇతరవృత్తులవలన జీవించెడివారు అతి స్వల్పసంఖ్య యగుటవలనను, మన దేశాభివృద్ధి కోరువారు వ్యవసాయమభివృద్ధి గాంచుమార్గముల నరసి, వ్యవసాయదారుని, అందువలన దేశమును ఎక్కుడ ద్రవ్యవంతము చేయుటకు ప్రయత్నించవలెను.

2. మన దేశమున వ్యవసాయవృత్తి విద్యావంతుల నెందుకు ఆకర్షించలేదు? పశ్చిమదేశీయులలో చాలమంది విద్యాధికులు దానినే ముఖ్యవృత్తిగా చేసికొననేల? ఈ దేశమందలి వ్యవసాయకళాశాలలో నేర్చుకొనినవారుకూడ ఈవృత్తి వదలి యుద్యోగములకు పోనేల? విద్యాధికులభూములు సయితము సాగుచేయబడుటకు విద్యావంతులు కానివారి స్వాధీనము చేయుట విచారకరమైనవిషయము కాదా? వీటి కన్నిటికిని సమాధానము మన దేశమందు వ్యవసాయము ఇతర వృత్తులయంత ప్రతిఫల మిచ్చుటలేదు. విదేశములలో విద్యావంతులకు వ్యవసాయవృత్తి లాభకారిగా నుండుటకును, మనవిద్యావంతులకు లాభకారిగా నుండకపోవుటకును కారణములు ఏవో తెలిసికొనుట మంచిది. భూములనుండి ఏపద్ధతులవలన ఎక్కువఫలితమును పొందగలరో, వాటిని నేర్పుటయందు విదేశముల వ్యవసాయకళాశాలలలో ఎక్కువ శ్రద్ధ పుచ్చుకొందురు. ఏయేభూమిలో ఏయేపైర్లవలన ఎక్కువలాభము సంపాదింపవచ్చునో అట్టి శాస్త్రపద్ధతులను వారు పఠించుచున్నారు.

3. మైసూరురాష్ట్రి వ్యవసాయశాఖవారు ఈలాగున వ్రాసిరి: "ఒక యెకరములో ఫలితమును అభివృద్ధి చేయవలెననిన, ఎరువులు, మంచివిత్తనములు, క్రొత్తపనిముట్లు ముఖ్యావసరము. ఐరోపా అమెరికాఖండములలో తెలిసికొనబడిన విషయ మేమనగా, ఎక్కువగా లభించుచున్న ఫలితములో నూటికి 50 పాళ్లు ఎరువులవలనను, 30 పాళ్లు మంచిజాతి విత్తనములవలనను, 20 పాళ్లు క్రొత్తపనిముట్లవలనను ఏర్పడినది. కాబట్టి ఫలితాభివృద్ధికి ముఖ్యమైనది ఎరువులను వేయుటవలననే యని తెలియుచున్నది." కాబట్టి యీ యెరువులను గురించి యీవ్యాసమందు చర్చింతము.—

4. ఆనాటి కానాడు ప్రజాభివృద్ధి అయినకొలది, ఎక్కుడు నేల సాగులోనికి తేబడుటవలన, పశువులకు బీళ్లు తగ్గిపోయి, ఎరువులు లభించుట దుర్లభ మగుచున్నవి. సాలునకు ఒకటిరెండుపంటలు సర్వసాధారణముగా నున్నది. ప్రతిపంటవల్లను భూమిలోనుండి ఫలితమును తగ్గించుచున్నాము. తిరుగ భూమిని బలపరుచుట ముఖ్యావశ్యకమని తెలిసియు, పెంటలు లేకయు, మరేవిధముగా బలపరుచుట తెలియకయు, నూటికి ఏపదవభాగము నేలలోనో ఎరువులు వేసి, మిగిలిన నేలను బాగుచేయలేక పోవుచున్నాము. రానురాను మిగిలినభూమి బలహీనమై పెట్టుబడికి తగినవడ్డీ యైనను వచ్చుట లేదు. భూమిని బలపరుచుట ముఖ్యవిధియని ప్రతిరయితు ఎరింగియు, తనకుగల పెంట, పాటిమట్టి, పచ్చిరొట్ట మొదలుగాగల ఎరువులు తన పొలమునకు చాలక తహతహపడుచున్నాడు. ఏయేదేశమందు వరి ఎకరమునకు ఎంతెంతసరాసరిని పండుచున్నదో యీక్రిందపట్టికను చూచిన తేటపడుటేకాక మనకుగలుగు నష్టము సయితము తెలియగలదు.—

| దేశముపేరు | ఎకరమునకుసరాసరి ఫలించెడివడ్లు | | మాగాణీవిస్తీర్ణము | |
|---|---|---|---|---|
| స్పెయిను | 5700 | పౌనులు | 116,000 | ఎకరములు |
| ఇటలి | 3,300 | ,, | 316,000 | ,, |
| ఈజిప్టు | 3,300 | ,, | | |
| జపాను | 2,100 | ,, | | |
| ఇండియా | 830 | ,, | 80,171,558 | ,, |

5. పైపట్టికను గమనించిన, మన దేశములో 8 కోట్ల ఎకరముల మాగాణిభూమిలో ఫలితము తక్కువయినందున కలిగెడి నష్టము తెలియగలదు. కొన్ని యితర దేశములలో రయితులు సంపాదించెడి ఫలితములో అయిదవవంతుమాత్రమే మనము పండించుచున్నామని తేలుచున్నది. మన భూములబలము అంతమాత్రమే యని అనుకొందమా? ఇటీవల వ్యవసాయశాఖవారి పరిశోధనలలో కోయంబత్తూరు వ్యవసాయస్థానమందు 1924-25 సంవత్సరములలో రసాయనపు ఎరువుల నుపయోగించుటవలన ఈక్రిందిఫలితము లభించినది:—

| ఎకరమునకు వేసినయెరువు | ఎకరమునకుపండినవరిధాన్యము | |
|---|---|---|
| (1) పచ్చిరొట్ట—15,000 పౌనులు | 4,630 | పౌనులు |
| (2) పచ్చిరొట్ట—1,500 పౌనులు + 50 పౌనులు ఆమ్మోనియమ్ సల్ఫేటు | 5,020 | ,, |
| (3) పచ్చిరొట్ట 15,000 పౌనులు + 50 పౌనులు నైట్రేటుఆఫ్ సోడా | 4,785 | ,, |

(4) పచ్చిరొట్ట 15,000 పౌనులు +
50 పౌనులు సల్ ఫేటు ఆఫ్ అమ్మో
నియా + 100 పౌనులు కాన్ సెన్
ట్రేటెడు సూపర్ ఫాస్ ఫేటు 5,755 ,,

(5) పచ్చిరొట్ట 15,000 పౌనులు +
50 పౌనులు నై ట్రేటుఆఫ్ సోడా
+ 1 0 పౌనులు కాన్ సెన్
ట్రేటెడు సూపర్ ఫాస్ ఫేటు 4,915 ,,

6. చాల బలమైన భూములలోను, ఎక్కువగా నాటు ఎరువులను వేసియు కొందరు కొన్నిగ్రామములలో పై మొత్తమును ఫలింపజేయుచుండుట వాస్తవమే. కాని కావలసినంత పచ్చిరొట్టయు, పశువుల ఎరువులును లభించనిచోటను, బలహీనమైన ప్రదేశములలోను పైమొత్తములు పండించగలమా? స్పెయినుదేశములో సరాసరి ఎకరమునకు 5,700 పౌనులధాన్యము పండుచున్నదని వ్రాసియుంటిని. వారు ఎకరమునకు ఎంతెంత రసాయనపు ఎరువులు వేయుచున్నారో యీపట్టికవలన తెలియగలదు:

| ఎరువుపేరు | ఎకరమునకువేయబడు పౌనులు | | |
|---|---|---|---|
| 1. సల్ ఫేటు ఆఫ్ అమ్మోనియా | 240 | మొదలు | 320 |
| 2. సూపర్ ఫాస్ ఫేటు | 324 | ,, | 432 |
| 3. సల్ ఫేటుఆఫ్ పొటాష్ | 36 | ,, | 48 |
| | 600 | ,, | 800 |

రసాయనశాస్త్ర పరిజ్ఞానమును తెలిసి భూమియందు ఏయే మూల పదార్థములు లోటుగా నున్నవో కనుగొన గలుగు ఈదినములలో, ఏలాటి భూములనైనను సారవంతమైనవిగా మార్చగల యీ దినములలో, రసాయనపుఎరువులు మన రయితులకు ఇంకను తెలియకుండుట విచిత్రముకాదా? 1840 సంవత్సరముమొదలుకొని భూరసాయన శాస్త్రవేత్తలయిన లీజేగ్, లూయిగిల్బర్టు మొదలుగా గలవారందరు నేలలోను, పయిర్లలోను గల భూతములను కనుగొని అనేకపరిశోధనలు చేసి, వ్యవసాయాభివృద్ధికి సహాయపడిరి. ఏయేనెలలో ఏయే పయిర్లకు ఏయే యెరువులను ఎంతెంతవేసినయెడల ఎంత ఫలితమును పొందగలమో ఆరహస్యములను బయల్పరిచిరి. ఇందువలన రసాయన సంబంధములైన యెరువుల పరిశ్రమాలయములు ఏర్పడి, పశ్చిమ దేశవాసుల వ్యవసాయమునకును, అత్యధిక ద్రవ్యోత్పత్తికిని ఆధారములయినవి. ఈక్రింద కనుపరిచిన ముఖ్యమైన రసాయనపుఎరువులు 1924 సంవత్సరములో పశ్చిమదేశములలో తయారుచేయబడి ఆదేశ కృషికులచే వినియోగపెట్టబడినవి.

| | | |
|---|---|---|
| సూపర్ ఫాస్ ఫేటు | టన్నులు | 11,366,828 |
| బేసిక్ స్లాగు | | 3,321,974 |
| సల్ ఫేటుఆఫ్ పొటాష్ | | 1,173,137 |
| నైట్రేటు ఆఫ్ సోడా | | 2,192,000 |
| సల్ ఫేటుఆఫ్ అమ్మోనియా | | 2,472,600 |
| | | 20,526,539 |

7. అదేసంవత్సరమున మనదేశములో 12,000 టన్నులు మాత్రము వాడబడినది. ఒక్కకృష్ణ, గోదావరిడెల్టాలలో నొక్కొక్క తాలూకాలో 75,000 మొదలు 100,000 ఎకరముల మాగాణియున్నప్పుడు, ఆ 12,000 టన్నుల రసాయనపు ఎరువు ఒక్కతాలూకాకైనను చాలనప్పుడు, మనదేశమందు ఒక్కమాగాణికి మాత్రమే ఎంతయెరువు కావలసియున్నదో చదువరులే తెలిసికొందురుగాక! చెరకు, అరటి, పొగాకు, మిరెపకాయలు, ఉల్లి, పసుపు, కొబ్బరి మొదలయినవాటికి ఈ యెరువులు అలవాటుపడినప్పుడు పై రెండుకోట్ల టన్నుల యెరువులు మనదేశమునకే చాలవు.

8. పాఠకమహాశయులారా! వ్యవసాయమందు మన మెంతవెనుకపడియున్నామో తెలిసికొనుడు! మన రయితులకు భూసారము క్రమేణ క్షీణించిపోవుచున్నదని తెలియును. ఏదియైన ఎరువును చేర్చిన భూమి పండుననియు తెలియును. తనకు మామూలుగా తెలిసిన పేడ, పచ్చిరొట్ట, పాటిమన్ను మొదలయిన యెరువులు చాలనపుడు ఏమి చేయవలెనో మన రయితులకు తెలియదు. రసాయనపు ఎరువులను గాని, వాటిని ఎకరమునకు ఎంతెంత ఏలాగు వాడవలెనో ఆ విషయములు గాని తెలియవు. రయితు పగలెల్ల పొలమందే కష్టపడును; తనపశువులను కష్టపెట్టును; కాని మూలసూత్ర మెరుగక అసహాయుడై యున్నాడు. ఇల్లెంతకాల ముండవలయును! రసాయనశాస్త్రపద్ధతులను తెలిసికొని తనభూమిని బాగుచేసికొనుటకు తగినంతవిద్య లేదు. ఎక్కువ పంటలను పండించుకొని తాను భాగ్యవంతుడై తనదేశమును భాగ్యవంతముగా చేయగలవారు రయితులే. కాని వారు ఆలాగు చేయుస్థితిలో లేరు!

9. భూములను సారవంతము చేయు మూలపదార్థము లేవో, బలహీనమైననేలలకు ఏయే యెరువులను వేయవలెనో, వాటివెలయెంతో, అందువలన వచ్చెడిఫలిత మెంతో, రసాయనపు ఎరువుల వలన భూములకు గలుగు చెరుపు లేవో, మొదలయినవిషయములను చర్చించనిది యీవ్యాసము ఆంధ్రపాఠకులకు వినియోగపడ దని పై విషయములను క్లుప్తముగా వ్రాయుచున్నాను.

10. ప్రపంచము 83 భూతములచే నిర్మింపబడినట్లును, వృక్షజాతిలో 13 భూతములు మాత్రమే యున్నట్లును రసాయనశాస్త్రజ్ఞులు తెలిసికొనిరి. ఈ 13 భూతములలో 10 భూతములు మాత్రము నేలలో విశేషముగా నుండి, ఎప్పటికిని తరుగనిస్థితిలో నున్నందున, వీటినిగురించి మనము ఆలోచించ పనిలేదు. భూమిలో తగినంతగా లేక, పంటలఅభివృద్ధికొరకు కావలసినవి మూడుమాత్రమే—నత్రజని (Nitrogen), పాస్ఫరము (Phosphorus), పొటాసియము (Potassium). వీటినే కర్షకుడు నాటు ఎరువులవలననో, లేక రసాయనపు ఎరువులవలననో నేలలకు చేర్చుచుండవలెను.

11. పై మూడుభూతములును పైరునకు మూడువిధములుగా ఉపచరించును. నత్రజని పైరు పెరుగునట్లు చేయును; ఆరోగ్యముగా

నుండునట్లును చేయును. ఈభూతము భూమిలో విశేషముగా నున్న యెడల, పైర్లు, వృక్షములు పచ్చనై, బాగుగ పెరిగి, కన్నులకు ఆనందముగా నుండును. ఎచ్చట పెరుగుట లేదో, అచ్చట నత్రజని నేలలో తగినంత లేదని తలంచవలెను. మలమూత్రములలోను, పచ్చిరొట్టలోను, ఆముదపుపిండిలోను, వేరుసెనగపిండిలోను ఈనత్రజనికలదు. పశ్చిమదేశీయులు సల్ఫేటు ఆఫ్ అమ్మోనియా, నైట్రేటు ఆఫ్ సోడా, కాల్సియము సైనమైడు అను నత్రజనిగల ఎరువులను కార్ఖానాలలో తయారు చేసి అమ్ముచున్నారు. గాలిలోనుండి నత్రితమును పుచ్చుకొని, సల్ఫేటు ఆఫ్ అమ్మోనియాగా సంవత్సరమునకు 1,000,000 టన్నుల వంతున తయారుచేయగల కార్ఖానాలను మూడింటెని జర్మనివారు ఈ సంవత్సరములోనే నిర్మించిరి. పై ఎరువులు సర్వసామాన్యముగ ప్రతి రయితును పశ్చిమదేశములలో వినియోగించుచునే యున్నాడు. ఇంతకంటెను ప్రసిద్ధి జెందిన రసాయనపు ఎరువులు ప్రపంచములో లేవు.

### స్ఫురికామ్లము (Phosphoric Acid)

12. నత్రజని యెరువుల తరువాతను ముఖ్యమైనది స్ఫురికామ్లము గల యెరువులు. ఎచ్చట సస్యములును, పండ్లచెట్లును బాగుగ పెరిగి, ధాన్యము పొల్లుగాను, పండ్లు కాయకయు నుండునో, అట్టినేలలో స్ఫురికామ్లములోటుగానున్నదని తెలిసికొనవలెను. అట్టినేలలకు సూపర్ ఫాస్ఫేటు అను ఎరువును వేసినయెడల, ధాన్యము గట్టిగాను, కంసులు చిక్కగాను ఉండుటయే కాక, వృక్షములకు ఫలములు ఏర్పడును. చెరుకులో రసము చిక్కగా నుండునట్లు చేయును.

### పొటాష్ (Potash)

13. ఇది మూడవది- పైరెండువలె అంత ముఖ్యమైనది కాదు. మంచిరుచియు, సువాసనయు, మంచిరంగును మొదలయినవాటి నిచ్చును. పొగాకు, మిరప, ఉల్లి, పండ్లు, కూరగాయలు, పువ్వులకు చాల ముఖ్యమైనది.

14. ఒక్కొకపంటకు ఒకయెరువు ఎక్కువగాను, మరొకటి తక్కువగాను కావలసియుండును. అంతేకాక, ఒక నేలకు కావలసినయెరువు మరొక నేలకు అవసరముండదు. ఈ విషయములు చర్చించవలెననిన చాల వ్రాయవలసియుండుటవలన నిచట క్లుప్తముగామాత్రమే వ్రాయవలసివచ్చును. సాధారణముగా ఎకరముమాగాణిలో ఒకవరిపంటవలన 1,600 పౌనులధాన్యము, దానికి తగినంత గడ్డియుఫలించును. వీటిలో 16 పౌనుల నత్రజనియు,20 పౌనుల స్ఫురికామ్లమునుండును. అంతకంటె ఎక్కువఫలించిన భూమిలో ఎక్కువగాను, తక్కువ ఫలించిన భూమిలో తక్కువగాను నత్రజనియు, స్ఫురికామ్లమును నేలలోనుండి తీసికొనబడును. ఎక్కువతక్కువ ఫలితమునుబట్టి అనుగుణముగా ఎరువులను వేసినయెడల భూమి పంటకు పూర్వమువలె సారవంతముగా నుండును. కాబట్టి సాధారణముగా 16 పౌనుల నత్రజనియు, 20 పౌనుల స్ఫురికామ్లమును ఒక ఎకరమునకు ఒక పంటకు అవసరము. పశ్చిమదేశములలోవలె ఎక్కువ పంటలు పండవలెనని కోరెడువారు ఎక్కువగా వేయవలెను. ఎనిమిదవపేరాలో స్పెయినులో ఎకరమునకు 5,700 పౌనుల ధాన్యము పండుననియు, 600 మొదలు 800 పౌనుల రసాయనపుఎరువులను వాడుదురనియు వ్రాసియుంటిని. ఆయెరువులలో 48 మొదలు 64 పౌనుల నత్రజనియు, 60 మొదలు80 పౌనుల స్ఫురికామ్లమును ఉండును.

15. రసాయనపు ఎరువులను కొనువారు రెండు ముఖ్యవిషయములను గమనించవలెను. వెంటనే పయిర్లకు వినియోగపడుటయు, వెలలును ఈవిషయములను లక్ష్యపెట్టనియెడల రయితుకు లాభము రాకపోవచ్చును. ఈక్రిందిపట్టిలోని వెలలనుపట్టి ప్రస్తుతము మన ఆంధ్రదేశములో నత్రజని యెరువుల వెలలను తెలిసికొనవచ్చును.

| వరుస నెంబరు | ఎరువు పేరు | ఒక పౌను నత్రజని వెల | |
|---|---|---|---|
| 1 | ఆముదపు పిండి | రు. | 1- 0-8 |
| 2 | వేరుసెనగ పిండి | ,, | 0-12-6 |
| 3 | నైట్రేటు ఆఫ్ సోడా | ,, | 0-10-0 |
| 4 | సల్ఫేటు ఆఫ్ అమ్మోనియా | ,, | 0- 7-5 |
| 5 | కాల్సియము సైనామైడ్ | ,, | 0- 6-3 |

16. మద్రాసురాజధానిలో వరికి కొంత పశువులపెంటలు, లేదా, పచ్చిరొట్ట వేసి, ఎకరమునకు 80 పౌనుల సల్ఫేటు ఆఫ్ అమ్మోనియాయును, 112 పౌనుల సూపర్ ఫాస్ఫేటును వేసినయెడల, లాభకారిగానే యున్నదని వ్యవసాయశాఖకు డైరక్టరుగా నున్న ఆన్ స్టెడ్ దొరగారు తనయుపన్యాసములో అచ్చటచ్చట చెప్పుచున్నారు. పశ్చిమదేశములలో రయితులవలెనే మనరయితులు సయితము కొద్దిగా ఎరువులు వేసి, కొలదిఫలితమునకు తృప్తిపడక, తమ భూమికి కావలసినంత వేసి, తమభూమిలో పండగలిగినంత పండునట్లు చేయుదురని నమ్ముచున్నాను. ఈసంబంధములో వ్యవసాయశాఖవారు ముందుగా ప్రయత్నములు చేసి రయితులకు నచ్చచెప్పవచ్చును.

### నైట్రేట్ ఆఫ్ సోడా (Nitrate of Soda)

17. ఇది నత్రజనిసంబంధమైన యెరువు అయినను, మాగాణికి అంతగా నుపయోగించదు. నీటిలో కరిగియుండునే కాని, భూమిలో ఐక్యము కాజాలదు. మన మాగాణిభూములలో ఒకమడిలోనుండి మరియొక మడిలోనికి నీటిని పోనిచ్చుచుండుటవలన మనము ఏమడిలో ఎరువును వేసితిమో ఆమడికి ఉపయోగము లేకపోవచ్చును. ఇది మాగాణికితప్ప మిగిలినపైర్లకు, అనగా చెరుకు, అరటి, పొగాకు, ఉల్లి మొదలయిన నీరుకట్టబడు పయిర్లకు చాల శ్రేష్ఠమయిన యెరువు. సరియైన పద్ధతులమీద ప్రచారము జరిపినయెడల మనదేశమందు తోటలకు చాల ఖర్చుకాగలదు..

## కాల్సియము సైనమైడ్ (Calcium Cynamide).

18. ఇది ఆంధ్రదేశములో వినియోగపెట్టబడలేదు. అన్ని పైర్లకు శ్రేష్ఠమైనది.

19. వరిసరువార చెరకు ముఖ్యమైన పంట; కాబట్టి దానికి ఎరువులు ఎంతెంత కావలసినది ఆలోచింతము. దీనికి, ఎకరమునకు షుమారు 100 మొదలు 200 పౌనుల నత్రజనియు, 40 మొదలు 80 పౌనుల స్ఫురికామ్లమును (Phosphoric Acid) కావలసియున్నది. అనగా 500 మొదలు 1000 పౌనుల సల్ఫేటు ఆఫ్ అమ్మోనియా గాని, 625 మొదలు 1250 పౌనుల నైట్రేటు ఆఫ్ సోడా కాని వేసిన యెడల కావలసిన నత్రజని లభించును. 200 మొదలు 400 పౌనులు సూపర్ ఫాస్ఫేటు వేసినయెడల తగినంత ఫాస్ఫారిక్ ఆసిడ్ లభించును.

20. ఇప్పుడిప్పుడు అరటితోటలు సయితము ప్రాముఖ్యము నొందుచున్నవి. వీటికి అధికముగా ఎరువులు వేయుట అవసరము. ఎకరమునకు 800 చెట్లు ఉన్న వనుకొందము. 160 పౌనుల నత్రజనియు, 160 పౌనుల స్ఫురకామ్లమును కావలసి యుండును. కాబట్టి 800 పౌనుల సల్ ఫే టు ఆఫ్ అ మ్మో ని యా, లేదా 1000 పౌనుల నైట్రేటుఆఫ్ సోడా, వే సి న యె డ ల కావలసిన నత్రజనిమాత్రము లభించును. 800 పౌనుల సూపర్ ఫాస్ ఫేటు వేసినయెడల 160 పౌనులు ఫాస్ఫారిక్ ఆసిడ్ లభించును. పెట్టుబడివిషయము సయితము ముఖ్యముగా గమనింపవలసి యుండును. వరికి ఎకరమునకు రు 12-8-0 చెరకునకు రు 55-0-0, అరటికి రు 110-0-0 అవసరము. నైట్రేటుఆఫ్ సోడా వేసినయెడల ఇంకను కొంచెము ఎక్కువపెట్టుబడి అవసరము. ఈలోపల పశ్చిమదేశములలో పోటీలు ఏర్పడి, కొన్ని ఎరువులవెలలు తగ్గిపోవుచున్నవి. రయితులు వెలలను తెలిసికొనుచుండవలెను. మెట్టపైర్లకు ఈరసాయనపు ఎరువుల నుపయోగింపవచ్చును గాని, వర్షములు సకాలములో నుండనియెడల పయిర్లకు నష్టము వచ్చును. కాని, యీ యెరువులలో అనుభవము గలవారిసలహా పుచ్చుకొని, కొద్దికొద్దిగా మాత్రమే వాడవలసియుండును. వీటిని వాడుకొనుపద్ధతి తెలిసినవారికి లాభకారిగానే యుండును. కాని తెలియనివారికి నష్టము కలుగవచ్చును. మామూలుపెంటలు వేసినందున పండెడుపంటలకంటె, నాటు ఎరువులను, రసాయనపుఎరువులను కలిపి వాడినయెడల ఎక్కువగా ఫలించి పెట్టుబడి పోగా లాభము మిగులును. నాటుఎరువులు పుష్కలముగా లేవని కొన్ని ఎకరములలో ఎరువులు వేసియు, కొన్నిటిలో వేయకయు, కొన్నిటిలో తృప్తికరముగా పండియు, కొన్నిటిలో పండకయు, నష్టపడుటకంటె నాటుఎరువులను, రసాయనపుఎరువులను కలిపి భూమి కంతటికి సమానముగా వేసికొని, భూమియంతటిలోను తృప్తికరముగా పండునట్లు చేయుట మంచిపద్ధతి.

21. ఇంత సులభముగాను, చౌకగాను ఉపకరించు రసాయనపు ఎరువులలో దుర్గుణములు ఉండకపోవునా? కొన్ని యున్నవి; కాని, హానికరములైనవి కావు. కొంత వ్యవసాయశాస్త్రపరిచయ మున్నయెడల కాని, అట్టివారితో సంప్రతించి చేసిన కాని, హాని యుండదని వ్రాసియుంటిని. షుమారు 60 సంవత్సరములనుండి పశ్చిమదేశములలో అన్నిరకములపైర్లకు ఈ రసాయనపుఎరువులను వాడియున్నారు. అందువలన వాటిగుణాగుణములు శాస్త్రజ్ఞులకును, పశ్చిమదేశపు రైతులకును తెలిసిన విషయములే. వారి అనుభవములను తెలిసికొనినయెడల, వారికష్టనష్టములు మనకు ఏర్పడక, లాభము పొందగలము. ఈ యెరువులు మంచివో చెడ్డవో, తెలిసికొనుటకు వారి 60 సంవత్సరముల అనుభవము చాలదా? మనదేశములో ప్రస్తుతము వినియోగింపబడు ముఖ్య రసాయనపుఎరువులను గురించి క్లుప్తముగా వ్రాసెదను.

## సల్ఫేటు ఆఫ్ అమ్మోనియా

22. ఇది ఆమ్లసంబంధమైన యెరువు. దీనిని ప్రతిసంవత్సరమును వాడుచుండిన యెడల నేలలో ఉండు ఉప్పుగుణము క్షీణించి పులుపుగుణము ఏర్పడును. ఉప్పుగుణము పోవుట మంచిదే కాని, పులుపుగుణము ఏర్పడుట మంచిది కాదు. అట్టిపరిస్థితులు ఏర్పడినప్పుడు సున్నమును పొలములో వేసి దున్నిన చాలును. పశ్చిమదేశములలో, ఎకరమునకు అయిదుసంవత్సరములకు ఒకపర్యాయము 1,000 పౌనుల సున్నము వేసి కలియదున్నుచుందురు. సల్ఫేటు ఆఫ్ అమ్మోనియావల్ల కలుగు దుర్గుణములు సున్నము వేయుటతో నశించిపోవును. మన డెల్టాభూములలో సున్నపుగుల్లలు ఎల్లప్పుడు ఏర్పడుచుండుటవలన, సున్నము వేయవలసిన అవసర ముండదు.

## నైట్రేటు ఆఫ్ సోడా

23. దీనిని కొన్నిసంవత్సరములు ఒకే నేలలో వేయుచు వచ్చిన యెడల, కొద్దిగా చవుడు ఏర్పడును. ఇది వేయబడినభూములలో సయితము 5 సంవత్సరములకు 250 పౌనులవంతున సున్నము భూమిలో కలియదున్నవలెను. చౌటిభూములకు ఈయెరువును వేయకూడదు.

## కాల్సియము సైనామైడు

24. సున్నము లేనిభూములలో, అనగా సల్ఫేటు ఆఫ్ అమ్మోనియా ఉపయోగపడని భూములలో, ఇది బాగుగనుపయోగించును. దీనిలో కొంతవిషము కలదు. నేలలో వేసి దున్నవలసినదే కాని, పైరెండింటివలె పైరుమీద చల్లినయెడల పైరు చచ్చిపోవును. పశువులు గాని, మనుష్యులు గాని పొరపాటున తినినయెడల ప్రాణహాని కలుగవచ్చును. అందువలన దీనిని ఇనుపడ్రమ్ములలో ప్యాకీచేసి యుందురు.

## సూపర్ ఫాస్ఫేటు

25. ఇది ఆమ్లముతో కూడిన ఎరువు. ఇది చౌటినేలలకు వజ్రాయుధమువంటిది. పర్రలను సైతము దీనివలన బాగుచేయవచ్చును.

అంతేకాక, సస్యములవేళ్లు బాగుగ పెరిగి, పయిరు త్వరగా తయారగునట్లు చేయును.

### సేంద్రియపు ఎరువులకును (Organic Manures), నిరింద్రియపు ఎరువులకును (Artificial Fertilisers) గల వ్యత్యాసము

26. సేంద్రియపుఎరువులను,అనగా పెంటలు,పచ్చియాకులు,గానుగపిండ్లను మొదలయినవాటిని అనేకవేలసంవత్సరములనుండి పొలములకు వేసి మంచిపంటలు పండించుచున్నారు. రసాయనపుఎరువులకు అంత పరపతి లేదు. కాని ఇవి ఎక్కువచౌకగా నుండుటేకాక, వెంటనే పయిరుకు వినియోగించును. వీటిరెంటిని కలిపి పయిర్లకు వేయుటవలన మనకుగల భూమియంతటిలోను సాధ్యమైనంత పండించి లాభము పొందగలము.

27. రసాయనపుఎరువుల నుపయోగించువారికి వ్యవసాయశాస్త్రము తెలిసినవారిసలహా ప్రథమమున ముఖ్యావశ్యకము. మందులకంటె ఇంజక్షనులు ఉపయోగపడువిధముగా, నాటుఎరువులకంటె రసాయనపుఎరువులు శీఘ్రముగా పనిచేయును. ఎక్కువగా వేసినను, అకాలములో వేసినను పయిరు చెడిపోవును. వ్యవసాయయిలాకా డిమాంస్ట్రేటర్లు ప్రతితాలూకాలోను కలరు. వారు సరియయినసలహా యివ్వగలరు. ఈయెరువుల నమ్మె కంపెనివారుసయితము తగినసలహా యిచ్చెదరు. ఏయెరువుల నమ్మువారిని వాటినిగురించి సలహా అడిగితే మంచిది. నాటుఎరువులు మనకు పుష్కలముగా లభించనికారణమువలనను, రసాయనపుఎరువులు పుష్కలముగాను, చౌకగాను లభించుచుండుటవలనను, ఒకతరము గడచులోపల మనదేశమందు ప్రతిరయితుకును అలవాటుపడియుండును.

28. విదేశపుఎరువులను మనదేశమందు వినియోగపెట్టుమని వాదించుట సరికాదని కొందరుమిత్రులు నన్ను ప్రశ్నించవచ్చును. రసాయనపుఎరువులు మనదేశమందు సహితము తయారగుచున్నవి కాని, కావలసినంత లభించుట లేదు. ఎకరముమాగాణికి ఏపదుమూడు రూపాయల ఎరువో వేసిన షుమారు నలువదిరూపాయల ధాన్యము ఎక్కువగా ఫలించును. ఈధాన్యమును విదేశీయులకు అమ్మి మనదేశమును ద్రవ్యవంత మైనదిగా చేయవచ్చును. మనమాదిని పరదేశీయులు కొని, బట్టలుగా తయారుచేసి, మనకే అమ్మి ద్రవ్యమును సంపాదించినరీతిగా, వారియెరువులను మనభూములలో వేసి, ఎక్కువఫలితమును పొంది, దానిని వారికే అమ్మి వారిద్రవ్యమును మనదేశమునకు వచ్చునట్లు చేయుట మంచిది కాదా? ఈయెరువులు ప్రజానురంజక మగుకొలది వీటిని తయారుచేయుటకు మనదేశమందు కార్ఖానాలు ఏర్పడకపోవునా? రసాయనపుఎరువులను మనపయిర్లకు వేసికొనుయుగము ప్రారంభ మయినది. అందువలన రయితులు ఎక్కువద్రవ్యవంతు లగుటకు సంశయము లేదు.

---

# కృషీవలుఁడు

క్రొత్తపల్లి సూర్యరావుగారు

గీతమాలిక.



అయ్య దండము! దీర్ఘాయు రస్తు; పుత్త్ర
పౌత్త్రవృద్ధి రితోధికైశ్వర్యవృద్ధి
రస్తు! మీరెల్లసుఖులె మీయయ్య దార్ఢ్య
మునఁ బనులవెంటఁ దిరుగునె మునుపటివలెఁ?

దిరుగుచున్నాఁడు. తాత? గతించె మొన్న.
అవ్వ పాపము! వృద్ధాప్యమం దవస్థ
తప్ప దెవ్వరికో కాని; తల్లి లక్ష్మి,
యచ్చ లక్ష్మియె యట్టియిల్లాలు గలదె.

మీచిరంజీవులకు క్షేమమే కదయ్య!
పెద్దవాని వయస్సెంత? పెండ్లియైన;
దతని తర్వాతివాఁడు నేఁడాదినుండి
సిగయె వేసికొనును; గడచిన్నవాఁడు
ముందలే ర్దోలుచున్నాఁడు; ముగుర వెనుక
నాఁడు పిల్లది పెండ్లి యీడైన దిట్టి
పట్టణములోన దాని సంబంధమునకుఁ
దల్లి కున్నది యూహ. యాదఱును మీ ర
దృష్టవంతులు. మా దే మదృష్ట మండ్రు
పల్లెటూరునఁ బడియుండి పాప మనక
పుణ్య మనకుండ నెప్పుడు మూర్ఖులమయి
పనుల వెంటఁ జరించుచుఁ బసుల వెంట
వనుల వెంట వసింతుము-పట్టణమున
వాస మొనరింత్రు మీ కున్న భాగ్య మేది?

మాకుఁ జదువుల, యుద్యోగమా, ధరింప
మంచిబట్టల-యేమని మాయదృష్ట
మును స్తుతింతురు స్వామి? ఏమొ యనుకొంటి,
వెఱ్ఱివై; పట్టణం బన్న, వేషభాష
లున్న మాత్రాన వీరంద ఱూడిపడిరె?

జనపదములోని సౌఖ్యము, జనపదంబు
లోని యారోగ్యమును బురిలోనివారి
కేది? పల్లెకు సాటియే యెట్టిపురము?

తినక మెదలంగఁ జాలరు, తినినఁ గదలఁ
జాల రిందలివారలు. జనపదంబు
లన్న స్వర్గములే, పల్లె లన్నఁ గామ
ధేనువులె, యూరు లన్న సర్థిజనకల్ప
కంబులే, పల్లెటూ ళ్లనంగనె పురజను
లీసడింతురు. జ్ఞానంబు వీసమంత
యున్నఁ, బూర్వాపరవిచార మున్నఁ, దార
తమ్యవిజ్ఞాన మున్న, నింతయును బల్లె
టూరులకు రాకపోకలు, వారితోడఁ
గలసి మెలసి వసించుట గలుగుచున్న
వార లెవ్వరు నట్లనఁ బోరు: పల్లె
పట్టణమునకుఁ దల్లి; యాపల్లెలేని
యెడలఁ బట్టన మే హానో యెంచు మయ్య,
కృషికవర! యూళ్లలో నున్న స్వేచ్ఛ యిచట
నేది? సర్వంబునకుఁ బరాపేక్షయె కద!

దున్నెదవు, డోకెదవు; నెండయన్న, వాన
యన్న, లెక్కింప; వీఁక మే మటన్న, వినుము,
కదలలే; మిక్కడిపుడ కక్కడకుఁ జేర్పఁ
జాల; మన్నింటికి నొకళ్లు సాయపడఁగ
వలయుఁ; గాలికడకు జోడు పట్టి తెచ్చి
పెట్ట వలయును సేవకుఁ; డట్టు నిట్టు
తిరుగుటకు శక్తి చాలదు; తిండి యొకరు
తెచ్చి ముందటఁ బెట్టినఁ దినుట; లేఁత
యెండకు గొడుగు, చినుకులు రెండుపడిన
గొడుగు; చేతికి మేజోడు, గుత్తుకకును
గుడ్డ, కాలికిఁ దొడుగు, ముక్కునకు మూఁత,
కంటి కద్దము-చలువ కొక్కటియుఁ, జూడ్కి
కొక్కటియుఁ; జెవిలో దూది గ్రుక్కుకొనుట,
తలకుఁ డొప్పియు, మొలకుఁ దోల్తంగు, దేహ
మంతటికిఁ గవచాదులు నలవరించు
కొనియు, మూన్నాళ్ల కొకసారి మునుకులాట-

నీకు దృఢకాయుఁడవు గాన మాకుఁ బోలె...
గొడుగు వల—దన్నమునకును గోడుపడవు;

పాటుపడెదవు, సుఖముగాఁ బండుకొందు:
నేము తిండి మితికి మించ నెపుడు మెక్కి,
తిన్న దఱుగక, వ్యాయామ మన్నమాట
లేక, నిద్దుర పట్టక, లేవలేక,
మంచమునఁ బడి పొర్లాడి, మాటి మాటి
కెదియొ రోగమునను వైద్యునెదుట బ్రదుకు
చుందు మిట. మీరు హాయిగా శుభ్రమైన
భోజనము చేసి, పొలములోఁ బూర్ణముగను
బను లొనర్చుచు స్వచ్ఛమౌ వాయువును, వి
నిర్మలం బగు నీరును, నిర్వ్యాపార
మానసముఁ గల్గి నీరోగమైన దేహ
మునను దీర్ఘాయువున మందురు: ముప్ప దేండ్ల
కిచటివారికి సెలవు. మే మేము గొప్ప
వార మని, మీరు హీనులం చారయకయె
వన్నెలవిసనకఱ్ఱల వలెను సంచ
రించు చుందుము: మీ రార మించ మంచి
మంచి పంటలు పండించి మాకుఁ బంప,
నొడలు తెలియక వీథుల వెడలి, దుర్వ్య
యములు చేయుచు, నెలపుట్టునప్పటికిని
జేత దమ్మిడి లేకయుఁ, జిల్లరప్పు
లను, బదుళ్లును జేయుచు, లంఘనముల
పడవలె లోకయాత్రను గడపుచుండి,
నేటికో విజ్ఞవీఁగుదు మిందు నుండి.

చక్కఁ బండించుకొని తిని, యొక్కరి కిడి,
పాడితో మెలఁగుదురు మీ రీడ: నేది,
పాడి పాడయ్యెఁ; దగవులఁ బడుట, తిట్టు
పడుట, చిక్కులు పడుటయు, బడుగుపడుట
యేకద కృషీవలోత్తమ! యెందు నీదు
నేమములు మాకు లేవుగా; నీయదనులు
పదనులును, దేవతాభక్తి పట్టనముల
లోని మా కెక్కడివి? పొట్టలోని కింత
దొరకిన చె యద నుదరంబు తొట్టుకొనుటె
పదను; దైవము లేదు దేవతయు లేదు.

ఉన్నవానిని గనినఁ జూ పోప కతనిఁ
బాడు చేయనె భక్తి. మీపాటివారు
గారు పౌరు, లేయూరిపై నూరు పడిన,
మీపను లవేమొ, మీ రేమొ-మిట్టిపడరు;

త్రుళ్లుటలు లేవు; మావలె 'దొళ్లుదోవ'
వ్యయము చేయరు; వ్యర్థములైన సరకు
లెల్లఁ గొనుచును బిచ్చగాఁ డింటికడకు
వచ్చినను గూలి చేయలేవా య టనరు;

ఆటలకుఁ బాటలకుఁ బోవ; రదను దప్పి
యేపనియుఁ జేయఁబోరు, మీ-రేకులంబు
వారొ, యేవృత్తివారొ, యేవాడవారొ
జుట్టునను, బొట్టునను, మఱి కట్టువలనఁ
జెల్పుదురు; మావలెనె మీరు తెలియకుండ
మసల: రిక్కడ బాపడు, మాల యొక్క
వేషమున నుండ్రు, మర్యాద వెడలిపోయె;

వానితక్కువ యేమను బాపఁ డంత్య
జునుని, నీగొప్ప యేమనుఁ జెనఁకి యూతఁ
డతని; నిద్దఱు నొక్కచో నాడుచుందు,
రిద్ద ఱొకబల్లపైఁ దిందు, రిద్ద ఱొక్క
పనికొఱకు గ్రుద్దులాడుదు: రనిన నాల్క
తెగిపడదె జానపదుల నీతీరువార
లంచుఁ; గులముమర్యాద మీయందె కలదు!

ఒక్కరిం గాంచి యొక్క రా రెక్కువయును,
దక్కువయు నున్నయట్ల యథార్థముగను
దిరుగుచుందురు-కులగుట్టిఁ దిరుగఁబోరు
కర్షకా! మావలెను మీరు కానికూళ్లు
దినరు, తినినను గొప్పయంచనరు, తినియుఁ
దినని వారివలెనె మీరు దిరుగఁబోరు;

దొంగతిండ్లను దినరు; మెత్తు రని వారు
వీరుఁ జేయుమనిన పను ల్చేసి మోస
పోరు; మీ రన్ని జాతులవారిఁ దాఁక
రుగద, మావలె మీరు వారు స్పృశియించి
నట్టివస్తువు ముట్టుదు రయ్య చెపుమ!
ఎందు నాచార మాయువు నెనఁగఁజేయుఁ;
బండుగను బబ్బమునఁ దప్ప వలసినప్పు

## కృష్ణాసాగర సంగమ మహోత్సవము హంసలదీవి


యాత్రికులు మార్గమధ్యమున విడియుట


యాత్రికుల పుణ్యప్రయాణము


దేవాలయముఖమంటపము


హంసలదీవిచెంత యాత్రికజనులు


కృష్ణానదియందు పడవలు


దేవాలయముచెంత యాత్రికుల జనులు


వేణుగోపాలస్వామి దేవాలయము

డెల్లఁ గొందురె మీరు మీయిండ్లలోన
గారెలును, గజ్జములుఁ, బానకములుఁ, బాయ
సములు? వెచ్చని యన్నమొ, చలిదియన్న
మో భుజింతురు; వేళకుఁ బొలము పోయి
వేళ కేతెంచి తిందురు పాళముగను-
మీరు మావలెఁ దిందురె మితికి మించి?

కాలు వానిదె యని ముల్లు కాలుతోడ
ముల్లు దీయించు కొందురు పొలములోన
మీరు మాలనిచే-నిట మేము మాది
గరును జెప్పుల కొలతకుఁ గాలు సాఁపి
కొల్చు కొమ్మందు, మింతె మాకుఁ గలగొప్ప.

తక్కినవి సర్వమును మీకు లొక్కె; పల్లె
టూళ్లలో నున్న సుఖము, నాయూళ్లలోని
కట్టు, స్నేహంబు నన్యోన్య గౌరవంబు,
సర్వవస్తు సమృద్ధియు, సర్వసహన
మున్నదే పట్టణములలో! నుండవచ్చు
నరుదుగా-నిప్పుడిపుడు మీయందుఁగూడఁ
బట్టనమునకుఁ బలుమారు వచ్చి పోవు
చుండుకతమునఁ బిన్నవా రొక్క-కొంత
యనుకరించుచు నున్నవా, రంతలోన
నాగరక చిహ్నములు రావు; నాగరకత
కర్థ మిప్పుడు వే అయ్యె-నర్థశూన్య
మయ్యె ననవచ్చుఁ! బల్లెటూ రన్న గొప్ప,
పట్టణం బన్న రాదు; మీవాఁ డొకండు
పట్టణములోనఁ జదివి చేపట్టినట్టి
తెల్వితేటలు వినుము-బుద్ధి యొకయింత
యున్నఁ బట్టణ మేమి, పేటొక్క- టేమి;
లేనివారి కదేమియు లేదు-పట్ట
భద్రుఁడై వచ్చినాఁడు స్వభవనమునకు;
ఆఁడువారిని, మగవారి నన్నివర్ణ
ములజనులఁ జూచి యాక్షేపమున హసించు:

నేమిజు ట్టది, క ట్టది యేమి, మొద్దు
చెప్పు లేమిటి? యీయిండ్లచేరువలనె
పసుల దొడ్లేమి? యీపేడవాసనకును
దాళఁ గూడదు. గృహముల దాపునందు,
నాయనా, గొడ్లఁ గట్టింప కోయి, యనిమె.

బిడ్డ! నీవలెఁ జదివిన దొడ్డవారె
పేడలోపల నున్నది "రేడి" యమ్మ
టంద్రు, మంచిది గాదె, యి ల్లలుకుకొనుట
యందుకే యందు రసినఁ, దప్పందు లేదు
నాపుడును-వార లెఱుఁగరు; నాకు నచ్చ
దింకమీఁదటఁ బసువుల నిచట నుంచ
నీకు మని వానిఁ బొలములోనికిని బంపె;

పల్లె రొక్క-టఁ గూర్చుండి బట్టబైట
సిగ్గుమాలెద రిచట నిస్సి, రుచియింప
దద్ది నా కని పసులఁ దా నవల కనిపి
నట్టిచోట మఱుఁగు దొడ్డిఁ గట్టఁ జేసె;
నింక నెన్నియొ కలవు! దా రిట్టు లుంద్రు
వెనుక-ముందులు దెలియని విద్దెకాండ్రు.

వారు నిందించెదరు పల్లెటూరివారి,
వా రసహ్యించుకొందురు పల్లెటూరి
వారి, వారలు నిందింత్రు పల్లెటూరి
వారి; వారలు పల్లెలోపలనె పుట్టి
నారు-వారికి మాత్ర భూసార మింత
తెలియ దిఁక నేమి తెలియు నవ్వలివిషయము
లోయి కర్షక! పురముల నున్నవార
లందఱును మోసగాండ్రె, వా రందఱును శ
ఠాత్ము లే; యొక్క-పనిలోన నచ్చవృత్తి
లేదు, నమ్మిక మాటాడరాదు వారి
తోడ- నమ్మంగ మోసంబు గూడియుండుఁ,
గొనఁగ వంచనయందు లోకానిమె యుండు;

మంచి దని చెడ్డ దిచ్చును మనకు సొమ్ము
పెచ్చుగాఁ బుచ్చుకొని; మంచివి గలవేని
జెడ్డవని మనయొద్దివి చేదుకొనును
దక్కు-వకు; మంచివారలే తప్పుకొంద్రు
మన కదేటి కటంచు, నేమాటకైనఁ-
దెలిసినట్టిది యడిగినఁ దెలియ దంద్రు.

ఎఱిఁగియును దప్పుకొంద్రు మా కేల యంచుఁ;
బలుకరించినఁ దమమీఁదఁ బడు నటంచుఁ
జూచియును జూడనట్లు ముసుఁగులు వైచి
కొని చరింతురు. మీరో, యే క్రొత్తవాఁడు

నూరిలోనికి వచ్చిన నూర కుండ
కెవ్వ? రేయూరు? మీ రెవ్వరింటి కేఁగె
దరని యడిగెద; రంతలోఁ దాళ, రతని
యి ల్లెచట నన్న- మీ కాయ నేమి యగును?
ఏమిపని మీకు? నెలజీత మెంత? వారి

యిల్లు నే నెఱుఁగుదును రం, డిదిగో, సందు
చివర నున్నది-యనుచు వచ్చి యిలు సూపి
పోవుదురు. చూచినావె కాఁపు తలమాని
కంబ, యిక్కడి యక్కడి గౌరవములు!

ఆఁడువారల కాఁడువా రన్ని తెగలు
పిన్ని యని, యక్క- యనుచు వావి వరుసలను
గలపికొని పల్లెటూళ్లలో మెలపుతోడ
సంచరింతురు: పురిలోని మించుఁబోండ్లో
యొకరి నొక్కరు పిలువరు, నొకరిఁ గనరు;
నొకరి నొక్కరు హేళన యొనరిచెదరు;

బంధువులనైన, నేమి టాబట్టకట్టు;
కొప్పు పెట్టుకొనును, జిన్నకుఱ్ఱ దైన
దిపుడు వెంకమ్మ; పుల్లమ్మ కేమి వచ్చె,
ముదిమొగము వడియెఁ బసుపుఁ బూసికొనుట;
బెద్దముత్తైదువ వలెనె వేయుఁ బెద్ద
పైట యని తాము సిన్నటివఱకుఁ దాల్చి
నట్టివానిని నిందింతు రయ్య కృషిక!

పురిని నిందింపఁగా నేను బూనలేదు,
పల్లెటూరిని బొగడఁగా వలయు నంచు
నెంచ లే, దిచ్చట నచట నెసఁగుచుండు
తారతమ్యము లొక కొన్ని తారకాణ
కై వచించితి; నిచ్చట నంద ఱిట్టి
వార లుండరు, నచ్చటివారు శుద్ధ
మానసులు గారు నెల్లరు; మాటమీఁద
మాట వచ్చుట నంటిని-మఱియొకవిధ
మునను దలఁపకు మయ్య; యేమొ పనిమీఁద
నెచ్చటికొ పోవువాని నే నిచట నాఁపి
కాలమును వ్యర్థపఱిచితిఁ, గాన నెంత
సేపు ని న్నిచ్చట నిలిపి చేసినాఁడ
నో పనికి విఘ్న -మింక నేను నొకకొంత
యంగడికిఁ బోయి వచ్చెద; నన్ని పనులు
చూచుకొని మరలునపుడు సుంత మాగృ
హమున కేతెంచి యింతదాహమును గొనుము.

లేదు స్వామి! క్షమింపుఁడీ, లేదు తెలిసి-
మీకు మాకును భేద మేమియును నెప్పు
డైన నున్నద! వచ్చెద నవల నాలు
గైదునాళ్లకు లోపల, నపుడు వత్తు
జున్నుఁ బాల్పట్టుకొని: యీన నున్న దొక్క-
గేదె; పిల్లలఁ జూచి యేఁగెదను నాఁడు.

సెలవు దయచేయుఁడీ దండములు! శుభంబు-
చూడు మందువె, యమ్మాయి సుఖపడియెడు
మంచి సంబంధ మున్నది-మాటలాడు
కొంద మవతల మంచిది యుందు నయ్యా!

———

# సంగీతము—స్వరావళి

వింజమూరి వరాహ నరసింహాచార్యులు గారు

సుమారు శతాబ్దమునాటినుండియు మనవారేమి, పాశ్చాత్య లేమి, హిందూస్వరావళియొక్క ప్రాశస్త్యమును గూర్చియు, శాస్త్ర సమ్మతిని గూర్చియు వివాదపడుచునే యుండిరి. బహుప్రాచీనకాలమునుండియు మనదేశపుప్రజలు స్వరావళి నెఱిగియుండిరనుటను గ్రీకు దేశస్థుల చరిత్రలేమి, మనదేశపు చరిత్రలేమి, శాసనములేమి, చెప్పుచున్నవి. ప్రాచీనకాలమునుండియు సంగీతము మహోపదవియందుండుట యేకాక, ఇటలీదేశపు శాస్త్రవేత్తయగు 'ఫియట్లో ఫ్లైసరినా', 'హెల్మహోల్ట్సు' శాస్త్రజ్ఞుడు మున్నగువారు తెలిసిన సంగతులు మనవారప్పటికే యెఱిగియుండి రను సంగతి మరవకూడదు. తమ దివ్యజ్ఞానమున నెఱిగిన మన ఋషులు చెప్పు సంగతులు భౌతికవిషయాతీతమైన మన కగ్రాహ్యములై వాదభేదములకు గారణము లగుచున్న వనాశ్చర్యము లేదు. శ్రుతులగూర్చియు, వివాది మొదలగు స్వరముల గూర్చియు, గ్రామమూర్ఛనల గూర్చియు నిట్టి వివాదము లనేకములు బయలువెడలుచున్నవి. మహాబుద్ధిమంతులగు 'ఫింగేలు', 'సహస్రబుద్ధి', 'రాజా సౌరేంద్రమోహన ఠాకూరు,' 'చిన్నస్వామి మొదలియారు' మున్నగు సంగీతప్రియులు, విద్వాంసులు పైసంగతులను విమర్శించి మార్గదర్శకులైరి. కాని యిటీవల 'కృష్ణాజి బలాల్ డేవల్ గా' రనునాయన వీరి విమర్శనలను చక్కగ జదివి వీరి తలంపులను ఖండించియుండెను. ఈయన చెప్పు ఖండనమంతయు నిట వ్రాయుట ప్రస్తుత వ్యాసముయొక్క యుద్దేశము కాకపోవుటచే స్వరావళిగూర్చి యీయన చెప్పుసంగతులను ముఖ్యముగా వ్రాయువాడను.

స్వరావళిగూర్చి నేర్వకముందు ధ్వని (Sound) గూర్చియు, నిది స్వర మెట్లగుచున్నదియు మొదలగు సంగతులు తెలియవలయును. ఈసంగతులకు మనవా రేమి చెప్పినదియు, నందులకు ఫ్లైసరినా, హెల్మహోల్ట్సు శాస్త్రవేత్త లేమి చెప్పినదియు నెంచునప్పుడు వీరి యభిప్రాయములకు భేదము లేమియు లేవని గ్రహింతుము. ఎట్లో యీ క్రిందివిధమున చూడుడు___

## ధ్వని

### మన శాస్త్రజ్ఞుల అభిప్రాయము

శ్రుతి. శ్రు=వినుట

"శ్రవణయోగ్యా ఏవ శ్రుతయః" (రాగవిబోధ.) "శ్రవణేంద్రియ గ్రాహ్యత్వాత్ ధ్వనిరేవ శ్రుతి ర్భవేత్."

మరియు,

"ప్రథమశ్రవణా చ్ఛబ్దః శ్రూయతే హ్రస్వమాత్రకః;
సా శ్రుతిః సంపరిజ్ఞేయా స్వరావయవ లక్షణా."

అని. ధ్వని అనగా___చెవికి వినబడు నట్టిది.

### పాశ్చాత్యుల అభిప్రాయము

ధ్వనియన నేది వినబడుచున్నదో అదియే. అదియెఱుంగుటకు మన చెవియే ప్రధానము. శ్రవణేంద్రియములోని నాడిమాత్రము వినుచున్నది. (Holmes)

ధ్వని మన చెవికి వినబడుచున్నది. ఇది కలుగజేయుటకు వలయు స్పందనములు (Vibrations) మనకు వినబడకపోయినను ధ్వనియందు కలవు. చెవిటివాడు ధ్వనిని వినకపోయినను ఇవి కలవు. కావున ధ్వని స్పందనములవలన కలుగుచున్నది. (Blesrena)

## స్వరము

### మన శాస్త్రజ్ఞుల అభిప్రాయము

(౧) "తంత్రీ-మేరు-సారీ-సంశ్లేషాద్భవా యే ధ్వన
యః తే శ్రుతయః శ్రుతిశబ్దవాచ్యాః" (రా. వి.)

(౨) "శ్రవణయోగ్యతా అనురణనాత్మకస్య
స్వరాఖ్యస్య దీర్ఘధ్వని ర్వర్తతే." (రా. వి.)

(3) "శ్రుత్యనంతర భావీ యః స్నిగ్ధో ఽనురణనాత్మకః;
స్వతో రంజయతి శ్రోతృచిత్తం స స్వర ఉచ్యతే."
(సంగీతరత్నాకరము)

### పాశ్చాత్యుల అభిప్రాయము

సంగీతవాద్యములందు కలుగు ధ్వనివలె స్వరము మనకు శ్రావ్యముగను, మృదువుగను వినబడును. (Holmes)

ధ్వని స్వర మగుటకు అది చెవికి ఇంపుగ నుండవలెను. (Blesrena)

## "అనురణనాత్మకధ్వని" (Hormonics)

### మన శాస్త్రజ్ఞుల అభిప్రాయము

"అనురణనాత్మకో ధ్వనిర్విశేష యస్మాత్ సంభవతి తాస్యక్ లక్షణ ఉదీయాత్-తదా ప్రథమతంత్రీ బంధనీయా." (రాగవిబోధ)

ఒకప్పుడు నారదుడు తన వీణను పరీక్షించుచు గూర్చొనియుండగా నది గాలిచే మీటబడి ప్రథమమున ముఖ్యస్వరము (షడ్జము), క్రమముగా తక్కినవియు, నిట్లు స్వరమండలిని పలుకగా వినగలిగెను అని మనవారు చెప్పుదురు. మాఘకావ్యమందు నిట్లు చెప్పబడినది. పాశ్చాత్యులు భౌతికశాస్త్రములందు ప్రజ్ఞానంతులుగ నుండి చెప్పిన సంగతులే మాసుగ్రంథకర్త కాలమునాటికి శ్రద్ధాభక్తులతో గమనింపబడిన సంగతి విశదమే. సోమనాథుడు 'రాగవిబోధ'యందు 30, 31 ఆర్యలందు వీని ప్రాధిక్యమునుగూర్చి చెప్పుచు వీని "స్వయంభూ" స్వరములని పేర్కొనినాడు. (స్వస్మాదేవ భవంతీతి స్వయంభువః.) రెండుపీటలకు బిగింపబడిన తీగె (వీనిమధ్య) కదలునప్పుడు కలుగు శ్రుతిమండలి స్వయంభూశ్రుతులు. "మేరుగతస్వయం భూస్వర పంక్తి ప్రామాణ్యేన" అని 34 న ఆర్యయందు చెప్పినాడు. వీని ననుసరించి విద్వాంసులు తమ స్వరములను సరిచూచు కొనెడిది యని కూడ చెప్పినాడు.

### పాశ్చాత్యుల అభిప్రాయము

*తంత్రిని మీటినప్పుడు అది ముందుకు వెనుకకు కదలుటయేకాక,మధ్యమధ్య, అనగా రెండుభాగములందును, మూడుభాగములందును, ఇట్లే నాలుగు మొదలగు భాగములందును,కదలుచుండును. ఇందెల్ల ప్రత్యేకప్రత్యేకములైన ధ్వనులు కలుగుచున్నను, ఇవి అన్నియు నేకకాలములోనే జరుగుచుండుటచే నీవిభిధ్వను లన్నియు ప్రథమధ్వనియందు మిళితమై యొక్కస్వరమునే కలిగించుచున్నవి. మనకు ప్రధానముగ వినబడునదే ప్రథమస్వరము (షడ్జము); తక్కినవన్నియు ననురణనాత్మకధ్వనులు (Harmonics) అని పిలువబడుచున్నవి. (Holmes)

ఇక బ్లెసరినా యిట్లు చెప్పినాడు: రెండుపీటలకు గట్టబడిన తీగెను మీటి పరీక్షించునప్పుడు పీటల (మేరు) వద్ద నిశ్చలముగ నుండుటయు, మధ్యభాగములందు కొన్నిచోట్ల తీవ్రముగ గదలుటయు, మరికొన్నిచోట్ల మందముగ గదలుటయు మొదలగువాని జూతుము.మధ్యభాగము, మూడుభాగములు,నాల్గు మొదలగు భాగములపలములందు కలుగు ఈకదలికలు తీగెపొడవున కడ్డముగ (Transverse) నుండును. ఇప్పుడెల్లధ్వనులు కలుగుచున్నను తీగెయంతయు కదలునప్పటి ప్రథమస్వరము (షడ్జము - Fundamental note) మధ్యస్వరములకన్న ముఖ్యమగుచున్నది. ఈతీగెయొక్క మధ్యను జాగ్రత్తగా నొక్కితిమా, దీనికి పైస్వరము అనగా రెట్టింపు స్పందనముకలది వినబడును. ఇప్పుడే తీగె రెండుభాగములందు చలించుచు, నీమధ్య ప్రదేశమందు నొక్కినచోట నిశ్చలతను కలిగియుండును. ఈప్రదేశమును ముడి (Node) అందురు. ఇట్లు మూడుభాగములందు, నాలుగు మొదలగు భాగములందు తీగెను నొక్కి హెచ్చు స్వరములను ఒక్కొక్కస్థాయి(Octave)హెచ్చుగా పలుకువాని కలిగించవచ్చును. ఇట చూడుడు:




1. తీగె అంతయు కదలుట. 2. మధ్య నొక్కినప్పుడు రెండుచోట్ల కదలుట. 3. మూడుభాగములుగ కదలుట. 4. నాల్గుభాగములుగ కదలుట.

ఇట తీగె అంతయు కదలునప్పుడు ముడి లేదు. రెండుభాగములుగ కదలునప్పు డొక్కముడి (Node), మూడుభాగము లప్పుడు రెండును, నాల్గుభాగము లప్పుడు మూడును ఇట్లు కలుగుచుండును. ఈభాగముల (Ventral Segments) నుత్పన్నమగు స్వరములనే మనవారు "శ్రుతిమండలా స్స్వరాః" అని చెప్పుచుండిరి.

## సంవాదిస్వరములు

### మన శాస్త్రజ్ఞుల అభిప్రాయము

సరళప్రమాణమున నుండు చలనములుగల స్వరములను మనశాస్త్రజ్ఞులు సంవాదిస్వరము లని చెప్పుకొనుచుండిరి.

"సంవాదినాం సమాజో, రంజనకారీ భవే దితిన్యాయాత్;
నిత్యం నిశ్శంకాదిభి, రిహాపి సంవాది సాన్నిధ్యమ్." (రా. వి.)

శార్ఙ్గదేవులు రత్నాకరమందు-

"చతుర్విధాః స్వరా వాదీ సంవాదీచ వివాద్యపి;
అనువాదీచ వాదీతు ప్రయోగే బహులః స్వరః"

అని చెప్పినారు.

### పాశ్చాత్యుల అభిప్రాయము

స్వరములు ఏకకాలమందు పలికింపబడిన కాని, ఒకటివెంబడి నొకటి పలికింపపడినకాని,యవి సరళమైనవ్యత్యాసము కలిగియుండిన, శ్రావ్యముగ నుండును; అనగా నవి నిమిషమునకు చేయు స్పందనలయొక్క ప్రమాణము (ratio) సరళముగ నుండవలయునని బ్లెసరినా యెంచినాడు. ఇట్టి స్వరముల నాలుగువిధములుగ నితడు పేర్కొనెను.-

(1) Unison or octave = శుద్ధసంవాది.

(2) Perfectly consonant = సంవాది.

* ప్రత్యేకముగ రెండుతీగెలుగల వాద్యమున (Diachord instrument.)

(3) Consonant = అనువాది.

(4) Dissonant = వివాది.

ఇక మనశాస్త్రజ్ఞులు తమ స్వరముల నెట్లు గ్రహించినదియు జూచుచు, నాస్వరముల యన్యోన్యతగూర్చియు, వీణె మొదలగు తంత్రీ వాద్యములందువీనిస్థానములు, అవికలుగజేయుస్పందనముల(Vibrations) తారతమ్యము మొదలగుశాస్త్రవిషయములగూర్చియు నేర్చుకొందము. పైవిధమున మనవారు పాశ్చాత్య విజ్ఞానులకు తీసిపోవనట్లే యీసంగతులందును వారి కెయ్యెడ నెనుదీయరు. తమ స్వరముల యేర్పాటునకు ముఖ్య సంవాదిత్వమే (perfect concord) కారణమని పలుమారు శాసించుచుండిరి. వీరిని బాగుగ గ్రహించి డేవల్‌గారు ఈవిధముగ పరిశోధించి స్వరావళిని చక్కగ వ్రాసిరి. ఈసంగతులు చెప్పుటకు ముందు ముఖ్యమగు నీయంశములు గమనించవలయును.–

(1) రెండు తంత్రులు బిగించబడిన తంబూరవంటి వాద్యమును (Diachord) తీసికొనుట ముఖ్యము. రెండుబిరడాలమధ్యగల తంత్రియొక్క పొడవు 36 అంగుళము లుండవలెనని డేవల్‌యొక్క అభిప్రాయము. ఈరెండుతీగెలు ఒక్కరీతిగనె శ్రుతిచేయవలెను. తీగెలక్రింద సారిక (movable feet) ముందునకు వెనుకకు జరుగుచుండును. కావలసిన స్వరము లిందువలన కలుగును.

(2) సారికయొక్క యెత్తు తీగెను తాకీతాకనట్టుల మాత్ర ముండవలెను.

(3) ఒకతీగె శ్రుతిచెప్పుటకును, రెండవది వివిధస్వరములు చెప్పుటకును ఉపయోగించుచుండవలెను.

(4) కావలసిన స్వరము పలికించునప్పుడు తీగెను సారికపై జాగ్రత్తగా మొనవంటి వ్రేలిగోరుతో మెల్లగ మెట్టవలెను కాని క్రిందకు తీగెను బిగించునట్టు లదిమి యుంచరాదు.

సూత్రము 1. షడ్జస్వరము:—పైన రెండుమేరుల మధ్యనున్న తీగె కదలునప్పుడు ముఖ్యముగ ప్రథమస్వరము షడ్జము పలుకునని చూచితిమికద.

"మేరుశిలస్తుశుర్యాతంత్రీరవే సః షడ్జ అభివ్యజ్యతే." (రా.వి.)

ఈతీగె పొడుగు అం. 36 లుగ నెంచితిమికద. ఇది నిమిషమునకు కలుగజేయు స్పందనములు 240 గ భావింతము.

సూ. 2. ఈతీగె మధ్యప్రదేశమందు ఈషడ్జమునకు ఒకస్థాయి హెచ్చుగల షడ్జమే కలుగునని యిదివరలో నెంచితిమి. "మధ్యస్థానస్థః షడ్జః ద్విగుణసమః" (రా. వి.) 18 వ అంగుళమున కలుగు స్వరము హెచ్చు షడ్జము. దీని స్పందనములు మొదటి వానికి రెట్టింపు: అనగ, $2 \times 240=480$ గ నుండును.

సూ. 3. ఇట్లు తీగెపొడవు తగ్గుచుండినకొలది హెచ్చుస్వరములు కలుగుచుండును.

సూ. 4. అనగా తీగెపొడవు తగ్గుకొలది స్వరము కలుగుటకు వలయు స్పందనలు హెచ్చుచుండును. ఇట్లే స్వరములు, లేక వీని కాధారము లగు స్పందనలు, తగ్గుకొలది తీగెపొడవు హెచ్చుచుండును. ఈ 3, 4 సూత్రములు పైసూత్రములవలన నూహింపబడినవే. 4 వ సూత్రము నిట్లు మనవారు చెప్పి:—

"తంత్రీ తంతుస్వరో జ్ఞేయః తద్దైర్ఘ్యవ్యస్తమానతః"

ఈసూత్రములను గణితశాస్త్రసమ్మతిని పొడియక్షరములతో నిట్లు చెప్పవచ్చును.–సౌలభ్యముకొరకు–$Vn=ln$ అంగుళములు పొడుగుగల తీగెయొక్క స్వనము, లేక స్వనమున కాధారపడు చలనముల సంఖ్యగ నెంచుదము. $U=l$ అంగుళములుగల తీగె చేయు స్పందనములు (చలనములు)గ నెంచుదము. అనగా నిట $U=240$ స్పందనలు. $l$=తీగెయొక్క పొడవు. అనగా షడ్జమును కలిగించునప్పటి రెండుమేరులకు మధ్య గలతీగ యిట 36 అం. ఇక గణితశాస్త్రము ప్రకారము–

$$Vn \times ln = U \times l \ \ldots \ \ldots \ \ldots \ \ldots A$$

$$Vn = \frac{U \times l}{ln} \ \ldots \ \ldots \ \ldots \ \ldots B$$

$$ln = \frac{U \times l}{Vn} \ \ldots \ \ldots \ \ldots \ \ldots C$$

ఇట్లు చెప్పవచ్చును. ఈముఖ్యసూత్రముల ననుసరించి మధ్యమము మొదలగు స్వరముల నెంచుదము.–

మధ్యమము:—"మధ్యస్థానస్థః మధ్యమః" (రా. వి.)

"ఉభయోః షడ్జయో ర్మధ్యే మధ్యమం స్వర మాచరేత్."

(సంగీతపారిజాతము)

సూ. 5. తగ్గు హెచ్చు షడ్జ స్వరముల మధ్యస్థానమందు మధ్యమము పలుకును. అనగా'స'కును,'స'కును మధ్య $\frac{36+18}{2}$ = 27 అం. పొడవు నందు పలికింపబడును. కావున B సూత్రము ననుసరించి—$Vn=240 \times \frac{36}{27}=320$ స్పందనములు కలుగు చున్నవి. C సూత్రమువలన– $ln=240 \times \frac{1}{320} = \frac{3}{4} l = \frac{3}{4} \times 36$. అనగా, $\frac{3}{4}$ పొడవునందు మధ్యమము కలుగుచున్నది.

సూ. 6. ఇందువలన మధ్యమముయొక్క పొడవు షడ్జతంత్రియొక్క పొడవునందు $\frac{3}{4}$ ఉండును. ఈస్వరమునకు వలయు స్పందనలు షడ్జమునకు వలయువానికన్న $\frac{3}{4}$ రెట్లుండును.

పంచమము:–"త్రిభాగాత్మకవీణాయాం పంచమః స్యా త్తదగ్రిమః"

(సం. పా.)

సూ. 7. పంచమము $\frac{1}{3}$ లేక $\frac{2}{3}$ తీగె పొడవునందు కలుగుచున్నది. చివరది హెచ్చు పంచమ మగును. ఇదివరకువలెను B, C సూత్రముల ప్రకార మిట్లు తేలును:

$$Vn = U \times \frac{l}{ln} \ldots \quad \ldots \quad \ldots B$$

తీగెలో నిట $ln=36 \times \frac{1}{3}$ లేక $\frac{2}{3}=12$ లేక 24 అంగుళ ములవద్ద కలుగుచున్నది. (పకృతము 24 అం. వద్ద కలుగునదే మనకు కావలయును. అందుచే, $Vn=240 \times \frac{36}{24}=360$ స్పందనములగును. అనగ $\frac{3}{2}$ U లేక షడ్జస్పందనములకన్న $\frac{3}{2}$ రెట్లు హెచ్చుగ నుండును.

సూ. 8. ఇందువలన పంచమము షడ్జపుతీగె పొడవునందు $\frac{2}{3}$ భాగమునందు కలుగును. దీనికి వలయు స్పందనములు షడ్జముస్పందనల కన్న $\frac{3}{2}$ రెట్లు హెచ్చు.

**ఋషభధైవతములు:**—ఈస్వరముల నారయుటకు ముందు ముఖ్య సంవాదిస్వరముల నెంచవలసి యున్నది. షడ్జమునకు ముఖ్యసంవాది స్వరము పంచమము. ఇట్లు మిగిలినస్వరములు కందుము.

| స్వరము | సంవాదిస్వరము. |
|---|---|
| స | ప |
| రి | ధ |
| గ | ని |
| మ | ṡ (స) |
| ప | ṙ (రి) |
| ṡ (స) | ṗ (ప) |

N. B. ఇట [illegible]లు ముఖ్యసంవాదులు కావు. ధైవతమునకు హెచ్చు గాంధారము అనువాది యగుచున్నది.

ఈముఖ్యసంవాదిత్వమువలన మిగిలిన స్వరముల నిట్లు కందుము.

సూ. 9. "స-ప-స-మముఖ్యాః సంవాదినః స్వరాః ఏకసం శ్రేయాఃగ్నాయః." (రా. వి.)

స, ప లున్ను, మ, ṡ లున్ను ముఖ్యసంవాదిస్వరము లగుచున్నవి. ఇందుచే పంచమము ప్రథమస్వరముగ నెంచినప్పుడు, అనగా పంచమము పలుకు తీగెయందు, పంచమస్వరము హెచ్చు ఋషభస్వరమగుచున్నది. మన స్వరములం దిది ṙ యగును. పైవిధమున B సూత్రముప్రకారము $Vn=U \frac{l}{ln}$ కావున 7 వ సూత్రముప్రకార మిచట $U=360; l=24;$ $ln=\frac{2}{3} \times 24=16$ అగుటచే, $Vn=360 \times \frac{24}{16}=540$. అనగా C=540 స్పందనలు; లేక మనకు వలయు ఋషభమునకు $\frac{540}{2} = 270$ స్పందనములు కలవు. మరియు—

$$ln=36 \times \frac{240}{270}=32 \text{ అంగుళములు; అనగా—}$$

సూ. 10. ఋషభము తీగెయందు 32 అంగుళముల పొడవున బలుకును; లేక షడ్జపుతీగె పొడవున $\frac{8}{9}$ భాగమునందు పలుకును, దీనికి వలయు స్పందనములు 270, లేక $\frac{9}{8}$ రెట్లుండును.

సూ. 11. **ధైవతము:**—ఈపై ఋషభమునకు ముఖ్యసంవాదియగు నీధైవతము $\frac{2}{3} \times 32=21 \frac{2}{3}$ అంగుళము పొడుగున కలుగును. దీనికి వలయు స్పందనములు $\frac{3}{2} \times 270=405$ అగుచున్నవి.

సూ. 12. **గాంధారము:**—ధైవతమునకు హెచ్చు గాంధారము ముఖ్యసంవాదిగ నుండవలయునుకదా. ఎందుచేతనో మనవారు కొంచెము భిన్నమగుదానినే వాడుచున్నారు. అనగా, పైధైవతమువలన ముఖ్యసంవాది సూత్రముల ననుసరించి హెచ్చుగ $\frac{2}{3} \times 21 \frac{2}{3}$ అం. పొడుగున లేక మనకు వలయు $గ=2 \times \frac{2}{3} \times 21\frac{1}{3}= 28 \frac{4}{9}$ అం. పొడవున కలిగినదై, $\frac{1}{2} \times \frac{3}{2} \times 405=303\frac{3}{4}$* స్పందనములు చేయుచున్నది. కాని కొంచెము గ్రాహ్యముగ నుండుటకొఱకు 300 స్పందనములు చేయునట్టి గాంధారమునే యెంచిరి; కావున నిది $\frac{240 \times 36}{300}=28 \frac{4}{5}$ అం. పొడవునందు నిందుము.

సూ. 13. **నిషాదము:**—ఈగాంధారము ప్రథమస్వరముగ నెంచి పైవిధమున నీస్థాయియందే కల నిషాదమును 8 వ సూత్రముప్రకారము $300 \times \frac{3}{2}=450$ స్పందనలు కలదిగ భావింపవచ్చును. ఇప్పు డిది $\frac{2}{3} \times 28\frac{4}{5}=19\frac{1}{5}$ అం. పొడవున వినబడును. వీనినెల్ల సులభముగా గ్రాహ్యమగునట్లు పటకరూపముగ బొందుపరతును. (చూ. పటకము 1.)

ఈపటకమువలన మనస్వరావళియందు మూడురకముల స్వరవ్యత్యాసమునుకందుము. అవి 8: 9; 9: 10; 15: 16; అనునవి. 8: 9 అనునవి మూడుపర్యాయములును, 9: 10 రెండుచోట్లను, 15: 16 రెండుచోట్లను వచ్చుట చూతుము. మధ్యమము స్వరసోపానపరంపరను (సం. ర.) రెండు(tetra chords) భాగములు చేయుచున్నది. మొదటి భాగమందు స-రి, రి-గ, గ-మ అను అంతరములును, రెండవభాగమందు ప-ధ, ధ-ని, ని-ṡ యనునవియు కలవు. ప్రథమభాగమందలి ప్రతి అంతరముతోను రెండవభాగమందలి యంతరము విచిత్రముగ సమమగుట చూడవలెను. మ-ప, ల 8: 9 అంతరము (interval) రెండు భాగములకు మధ్యగ తటస్థమై యున్నది. అన్నిటికన్న చిన్నయంతరువు 15: 16 అనునది గ-మ, లకును, ని-ṡ; లకును మధ్య వచ్చును. దీని ననుసరించి వికృతిస్వరములను కనుగొన వచ్చును. ఈ 15: 16 అంతరమునే తీసికొనుటకు కారణ మిది: 7 అంతరములందును కడు చిన్న దగుటయే కాక, (మ.గ.) శంకరాభరణ స్వరముల స్వనముకన్న తక్కువస్వనముగల మరికొన్ని స్వరములే యమర్చవలెను కావున పెద్ద యంతరమందు చిన్న యంతరము లిముడుచున్నవి. ఇట్లు 8: 9, 9: 10 అంతరములుగల నాలుగు ప్రదేశములందును ఈచిన్న 15: 16 అంతరమును జొనిపిన, మరినాలుగు వికృతి స్వరములుకలిగి మొత్తము 12

---

* ఇయ్యది క్లెమెంట్సుదొరవారి యభిప్రాయప్రకారము మన పూర్వుల 12 వ శ్రుతి ప్రీతి యనుదానికి సమము.

## పథకము శంకరాభరణ మేళమునకు తుల్యమగు స్వరమండలి (Diotonic Major Scale)

| 1 | 2 | | 3 | 4 | 5 | * 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| వరుస నెం. | స్వరము పేరు | | స్పందనములు | స్వరాంతర నిష్పత్తి | ఇంగ్లీషు పేరు | ఇల్లిసు దొరవారి సెంట్లు | స్వరములకు ప్రథమ స్వరముతో సంబంధము | స్వరము కలుగుటకు గల తీగె పొడవు | శ్రుతులు | శ్రుతి సెంట్లు | స్వరాక్షరము | రిమార్కు |
| 1 | షడ్జము | C | 240 | | | | | 36 అం. | 0 | | స. | |
| 2 | ఋషభము | D | 270 | 8: 9 | Major 2nd | 204 | 8: 9 | 32 ,, | 3 | 204 | చ. రి. | 9 వ కాలమ లోని ప్రస్తుతు లు 'రాగవిబోధ' గ్రంథమునందు చూడుడు. |
| 3 | గాంధారము | E | 300 | 9: 10 | Minor 2nd | 182 | 4: 5 | 28 4/5 ,, | 5 | 386 | అం. గ. | |
| 4 | మధ్యమము | F | 320 | 15: 16 | Diatonic Semitone | 112 | 3: 4 | 27 ,, | 9 | 498 | శు. మ. | |
| 5 | పంచమము | G | 360 | 8: 9 | Major 2nd | 204 | 2: 3 | 24 ,, | 13 | 702 | ప. | |
| 6 | ధైవతము | A | 405 | 8: 9 | Major 2nd | 204 | 16: 27 | 21 2/3 ,, | 16 | 906 | చ. ధ. | |
| 7 | నిషాదము | B | 450 | 9: 10 | Minor 2nd | 182 | 8: 15 | 19 1/5 ,, | 18 | 1088 | కా. ని. | |
| 8 | షడ్జము | C | 480 | 15: 16 | Diatonic Semitone. | 112 | 1: 2 | 18 ,, | 22 | 1200 | స. | |
| | | | | | | 1200 | | | | | | |

స్వరము లగుచున్నవి. స, రి (ల) ల మధ్యగల పెద్దఅంతరమునందు 15: 16 తొలగిపిన 256 స్పందనలుగల శుద్ధ ఋషభము కలుగుచున్నది. షడ్జమునకు శు. రి. 15:16 వ్యత్యాసమును, శు.రి.నకు చ. ఋషభము 128: 135 వ్యత్యాసమును కలదు. ఇల్లిసుదొరవారి సెంట్ల ప్రకారము 15: 16 అంతరమునకు 112 సెంట్లును, 128: 135 నకు మిగత 92 సెంట్లును, మొత్తము 8: 9 అంతరమునకు గల 204 సెంట్లతో సరిపోవుచున్నది. ఈయంతరమునే 15: 16 పంచమ ధైవతములమధ్య నుంచిన నిట్లె శు. ఋషభమునకు ముఖ్యసంవాది యగు శు. ధైవతము వచ్చును.

ఇక మరియొక పెద్దయంతరము 9: 10 నందు కూడ నీచిన్న యంతరము 15: 16 ను తొలగిపిన, సాధారణగాంధారము వచ్చును. ఇది 288 స్పందనము కలది. ఇప్పుడు చ. ఋషభమునకు సా. గాంధారమునకు గల సంబంధము 15: 16 అగుచున్నది. దీనికి ఇల్లిసుసెంట్లు 112 అగుచున్నవి. సా. గ. కును, అం. గ. కును సంబంధము 24: 25 అగుచున్నది. దీనికి 70 సెంట్లు ప్రమాణము. మొత్తము 9: 10 కుగల 182 సెంట్లకు నీరెంటిసెంట్లు సరిపోవుచున్నవి. ఇట్లే ధైవతనిషాదముల మధ్య, అనగా 9: 10 అంతరువునందు చిన్న 15: 16 అంతరము నుంచిన 112 సెంట్లుగల కైశికనిషాదము వచ్చును. దీని స్పందనములు 432 అగుచున్నవి. చ. ధ. నకును కై. ని. నకును సంబంధము 15: 16 ను, కై. ని. నకును కా. ని. నకును సంబంధము 24: 25 ను అగుచున్నది. దీనిసెంట్లు 70 యగుటచే నీయంతరమునందు గల సెంట్లు కూడ సరిపోవుచున్నవి. ఈవిధముగ ప్రకృతివికృతి భేదములు గల స్వరములు 12 యేర్పడుచున్నవి. మధ్యమపంచమములయందు కూడ నీ 15: 16 అంతరముపయోగించుటచే శు. మధ్యమమునకును, ప్రతిమధ్యమమునకును 128: 135 వ్యత్యాసము కలుగుచున్నది. ప్ర. మధ్యమ పంచమములకు 15: 16 వ్యత్యాసము కలదు. ఇట షడ్జపంచమము లీవిధమున మార్పు చెందినవని గ్రహించునది. "షడ్జపంచమయో రవికృతత్వాత్" (రా. వి.) ఈచెప్పిన స్వరములే వీణయందును, మరి యితర వాద్యములందును మనవారు వాడుచున్నారు. ఉత్తరహిందూ దేశమునం దీస్వరములను కోమలస్వరములు, తీవ్రస్వరము లనుపేర్లతో వ్యవహరింతురు. వీనిపథక మిట చూడుడు: (చూ. పథకము ౨)-

---

* షడ్జము, దీనికి పై షడ్జము వీని మధ్యగల స్థాయిని ఇల్లిసు (Ellis) దొరవారు 1200 భాగములుగ విభజించి సెంట్లు అని పేరిడి వీనిమూలమున ప్రతిస్వరస్థానమును కొలచిరి ఈపద్ధతితో నిప్పటి ప్రతిదేశమువారి స్వరావళిని కొలచిరి. మనస్వరావళి వీరికొలత కద్భుతముగ సరిపోవుచున్నట్లు చూతుము.

పథకము ౨. హిందూదేశపు ప్రకృతి వికృతి స్వరముల పథకము (Indian Chromatic Scale)

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| వరుస నెం. | స్వరముల పేర్లు | కంపనములు సం. | స్వరముల యంతరము | ఇంగ్లీషు పేరు | ఇల్లిసుదార వారి సెంట్లు | స్వరములకు షడ్జముతో గల సంబంధము | సెంట్లు | స్వరముకలు సటుకు గలతీగ పొడవు | స్వరాక్షరము | సంగీతరత్నాకరోక్త శ్రుతులు | రిమార్కు |
| 1 | షడ్జము | 240 | | | | | | | | | |
| | | | 15: 16 | | | | | | స. | ఛందోవతి | 5 వ కాలము లో పేర్లు హెల్మ్ హోల్ట్జ్ దొరవారి పుస్తకము నుండి గ్రహించబడినవి. |
| 2 | శుద్ధఋషభము | 256 | | | | | | | | | |
| | | | 128: 135 | Diatonic Semitone | 112 | 15: 16 | 112 | 33¾ అం. | శు.రి. | రంజని | |
| 3 | చతుశ్శ్రుతి ఋషభము | 270 | | | 204 | | | | | | |
| | | | 15: 16 | Small Limma | 92 | 8: 9 | 204 | 32 ,, | చ.రి. శు.గ. | రౌద్రి | |
| 4 | సాధారణ గాంధారము | 288 | | | | | | | | | |
| | | | 24: 25 | Diatonic Semitone | 112 | 5: 6 | 316 | 30 ,, | ష.రి. సా.గ. | వజ్రిక | |
| 5 | అంతరగాంధారము | 300 | | | 182 | | | | | | |
| | | | 15: 16 | Small Semitone | 70 | 4: 5 | 386 | 28 4/5 ,, | అం.గ. | ప్రసారిణి | |
| 6 | శుద్ధమధ్యమము | 320 | | | | | | | | | |
| | | | 128: 135 | Diatonic Semitone | 112 | 3: 4 | 498 | 27 ,, | శు.మ. | మార్జని | |
| 7 | ప్రతిమధ్యమము | 337½ | | | 204 | | | | | | |
| | | | 15: 16 | Small Limma | 92 | 32: 45 | 590 | 25 3/5 ,, | ప్ర.మ. | రక్త | |
| 8 | పంచమము | 360 | | | | | | | | | |
| | | | 15: 16 | Diatonic Semitone | 112 | 2: 3 | 702 | 24 ,, | పం. | ఆలాపిని | |
| 9 | శుద్ధధైవతము | 384 | | | | | | | | | |
| | | | 128: 135 | Diatonic Semitone | 112 | 5: 8 | 814 | 22½ ,, | శు.ధ. | రోహిణి | |
| 10 | చతుశ్శ్రుతి ధైవతము | 405 | | | 204 | | | | | | |
| | | | 15: 16 | Small Limna | 92 | 16: 27 | 906 | 21 2/3 ,, | చ.ధ. శు.ని. | ఉగ్ర | |
| 11 | కైశికనిషాదము | 432 | | | | | | | | | |
| | | | 24: 2 | Diatonic Semitone | 112 | 5: 9 | 1018 | 20 ,, | ష.ధ. కై.ని. | తీవ్ర | |
| 12 | కాకలి నిషాదము | 450 | | | 182 | | | | | | |
| | | | 15: 15 | Small Semitone | 70 | 8: 5 | 1088 | 19 1/5 ,, | కా.ని. | కుముద్వతి | |
| 13 | షడ్జము | 480 | | | | | | | | | |
| | | | | Diatonic Semitone | 112 | 1: 2 | 1200 | 18 ,, | స. | | |
| | | | | | 1200 | | | | | | |



శ్రీయువరాజా సాహెబ్ నారాయణ శూరపట్టుదేవుగారు, తిర్లా



శ్రీరాజా సాహెబ్ వరదరాజ శూరహరిశ్చందనదేవుబహద్దరువారు, తిర్లాజమీందారు



శ్రీరాజా బొమ్మదేవర వెంకటభాష్యకార్లు రావుబహద్దరు మైనరు జమీందారుగారు, సౌతు వల్లూరు ఎస్టేటు ౧ వ పార్టు



శ్రీచిలకమర్తి లక్ష్మీనరసింహంపంతులుగారి షష్టిపూర్తి మహోత్సవము, రాజమహేంద్రవరము ౧౧-౯-౧౯౨౭



శ్రీ వాడ్రేవు చలమయ్య పంతులుగారు.



శ్రీ తాపీ ధర్మారావు నాయుడుగారు, బి. ఏ.



శ్రీ లింగం వీరభద్రయ్యా చౌదరిగారు, బి. ఏ., బారిష్టరు.



శ్రీ సుబ్బం గోపాలకృష్ణారెడ్డిగారు, పిల్లుట్ల.



శ్రీమతి ఆ. వసుంధరా కన్యగారు, యమ్. ఏ



డాక్టరు శ్రీ బొడ్డుపాటి తిరుపలరావుగారు.



శ్రీ వి. యన్. శాస్త్రిగారు, తెనాలి.

# మత స్వీకృతి

శ్రీ. శ్రీనివాసరావు గారు (కవితాసమితి)

౧

హైందవ మహమ్మదీయ హృన్మందిరముల
నైకమత్యానుభావ సౌహార్ద సద్గు
ణాదికములను నెలకొల్పి యతుల విభవుఁ
డైన యక్బరు పాలనం బంతరించె!

సంతతోత్సాహ కలిత వసంతుఁ డగుచు
జనుల కెల్లర కానందమును ఘటించి
కీర్తిఁ జెందిన యల జహాంగీరు నాఁటి
శాంత పరిపాలనావిధుల్ సమసి పోయె!

ప్రాక్ప్రతీచ్య శిల్పాచార్య బంధుర ప్ర
భావ సమ్మేళనమ్మున బాట బాట
లెల్ల శిల్పవిస్ఫూర్తి వేనోళ్లఁ జాట
షాజహానుని కాలమ్ము చల్లఁబడియె!

నాఁటి సౌహార్ద సద్గుణౌన్నత్య శక్తి,
నాఁటి సదమలశాంతి సౌందర్యగరిమ,
నాఁటి లలితకళా నిరాఘాట పటిమ
కలయ వెదకిన నెందును గానరావు.

అది మదోన్మత్త వేదండ సదృశ విహార
ణార్తి నౌరంగజేబు నిరంకుశముగ
భారతక్షితి నవ్య కహ్లార సరసిఁ
గలఁత నొందించిన విషాదకర సమయము!

పూర్వరాజన్య పాలనా స్ఫూర్తిఁ దవిలి
యతి సుఖంబుల నందిన హైందవులకు
దినకరమనోజ్ఞ కిరణ సందీప్తి యడఁగి
కల్గినట్లయ్యె నప్పుడు కాళరాత్రి.

క్రూరపరిపాలనమున సంక్షోభ మొంది
భూప్రజలు మలమల మాడి పోవు చుండ
నెచటఁ గనినను రోదనాప్రచలిత మగు
హైందవకుటుంబ దుఃఖాశ్రు లలమికొనియె.

వెనుక దినముల భారతోర్వీ స్థలమునఁ
బుట్టు వొందుట యొక గొప్పపుణ్య మయ్యె!
కటకటా! నాఁడు భారత ఖండమందు
హిందువునిజన్మ మత్యంత హీన మయ్యె!

భరతపుత్రుల గాసిల పఱిచి మరలఁ
బ్రాంత తలపన్ను వారలపై విధించి
నిరత మెన్నెన్నొ విధుల దండించినైనఁ
దృప్తి యనుమాటఁ బాదుషా తెలియఁడయ్యె!

అపుడు మత మను పేరిట ననఁగరాని
యష్టకష్టములను బెట్టి హైందవులను
స్వీయమతధారణ మొనర్పఁ జేయు కొఱకు
దారుణక్రియ లొనరింపఁ దలఁచె నతఁడు.

నిజమతప్రోక్త మిది యని నిశ్చయించి,
అన్యమతముల నన్నిటి నడఁగఁ ద్రొక్కి;
స్థిరత నిస్లాము మతము వర్ధింపుఁ డనుచు
నపు డలంఘిరు సేనల కాజ్ఞ యొసఁగె!

అదియె తడవుగ వడిగ మహమ్మదీయ
సైన్యవారము నిర్భీతశక్తి నెనసి,
నిజమతమ్మును నెలకొల్పు నెపమునిూఁద
భరతభూమినిఁ జీకాకు పఱిచినారు.

నాఁడు హైందవ రుధిరమ్ము నేలగడలను
గాంగతటినీప్రవాహ సంకాశ మయ్యె!
నాఁడు హైందవజనరోదనా నినదము
భూనభోంతరముల మాఱుమ్రోఁగఁ దొడఁగె!

మతమునందలి గట్టినమ్మకము చేత
హిందువులు ప్రాణములనైన నిచ్చినారు!
మతమునందలి గట్టి నమ్మకము చేతఁ
దురకలును హిందువులఁ జంపఁ దొడఁగినారు!

నిజమతాభినివేశ నిర్నిద్రు లగుచు
నపుడు తురక లొనర్చిన యట్టహాస
ఘోషముల కెందు వెదకినఁ గొదవలేదు!
ఘోరముల కెందు వెదకినఁ గొఱంతలేదు!

ఆనిరామాట సంఘట్ట నాగ్నియందు
నతి దురంత వ్యథాక్లిన్న హైందవజన
శతసహస్రాధికప్రాణ సమిధ లెల్ల
నొక్కపరి భగ్గురని మండి యారకొనియె!

౨

నిర్మలమనోజ్ఞ మందాకినీ ప్రశాంత
ధవళ వీచిక లెచ్చోటఁ దటిసి పాఱు
నది యనన్య మనుష్య విహారభూమి!
నవనవాజ్ఞాత మధుర కాంతారవీథి!

ఆశుభోత్సవ దివ్యప్రదేశమందుఁ
బ్రకృతి లక్ష్మికి స్వాగతాభ్యర్చనమునఁ
బ్రత్యహాజ్వల దరుణగభస్తిచయము
నిరతనిరవధికానంద నియతిఁ గూర్చు!

వితత లీలావిలాస ప్రవృత్తి దనరి
యచట విహరించు వివిధవిహంగమములు
కలకలారవ సంక్షోభ కారణమున
నచటి నిశ్శబ్దభావము నపనయించు!

ఆమనోహర కాంతార భూములందుఁ
బ్రతిదినాంతప్రదోష ప్రభాపటలము
ప్రవిమల నదీజలంబులఁ బ్రతిఫలించి
స్వర్ణనీరప్రకార విభ్రాంతిఁ గూర్చు!

స్వైరవిహరణ దీక్షాప్రసక్తిఁ దనరి
యతిపిపాసను జనుదెంచు హరిణసమితి
ప్రతికురంగమ రూప బింబమును గాంచి
త్రాసభరమున నీటిని ద్రావ మాను!

ఆసముజ్జ్వలశాంత దివ్యస్థలమున
నామనోజ్ఞ నదీతీర భూములందుఁ
బర్ణకల్పితకుట్టి మాభ్యంతరమున
వాసముండెడు యదునాథ వసు వొకండు.

బ్రహ్మతేజో మహత్తర ప్రాభవమున
జ్ఞానసంభృతహృద్వికాసము వహించి
జాహ్నవీతీర సంస్థిత శాంతమూర్తి
భక్తిబంధుర గీతముల్ పాడుచుండు.

ఆర్యతేజఃప్రభావ గానామృతమునఁ
గృష్ణలీలాచరిత్ర సంకీర్తనమునఁ
గంఠ నిర్గతరవళి గద్గదిక మెనయఁ
బరవశత్వము నొంది మైమఱచు నతఁడు.

అతఁడు హైందవ వీరమహోద్భుతప్ర
వర్తనామూల్య రాగాలపన మొనర్చ
సమయమం దశ్రుబిందూత్కరములు వెడలి
గాంగ నిశ్చల సలిల సంఘములఁ గలియు.

భరతరమణీమహోత్కృష్ట చరితములను,
భారతప్రాక్తన గరిష్ఠ వైభవమును
దనివి తీరక సతముఁ గీర్తన మొనర్చి
కడపు జీవిత నాటకాంకముల నతఁడు!

౩

అది మనోజ్ఞప్రశాంత దినాగమనము!
ప్రకృతి నెల్లెడ హర్ష వీచికలు వీచె!
కమలమంజులమందిరాంగణములందు
సమద బంభరగాన ఘోషలు నదించె!

అపు డనంతప్రమోదభరావలబ్ధ
నవనవోత్సాహమున యదునాథవసువు
ప్రత్యుషః పవనాంకుర ప్రతతులందుఁ
గీర్తన నినాదమును దరంగిత మొనర్చె!

ఆసమయమందు గంగానదీసమీర
చలిత వీచులు నాట్యవిద్యల నటింప
మాధురీహృద్యమున యదునాథవసువు
పాడె నిట్టుల గంభీర భావగీతి!

"భయద విరహానల
ప్రబల తీక్ష్ణతయందు
జీవనంబే యింకి
పోవునని భయమయ్యె
నో ప్రేమవారాన్నిధీ!
దీనునకు
నీప్రాపుఁ జేకూర్పుమా!

*   *   *   *

అంధతమస్సంక్రాంత ని
రర్థక జీవితపదముల
శారదరజనీజ్యోత్స్న
కారా! కన్పడవేరా!

హాలాహల కీలా ని
ర్వేల ప్రాపంచాంబుధి
నో కారుణ్యామృతమూ
ర్తీ! కానంబడవేరా?

*   *   *   *

దేదీప్యమాన దీ
ధితుల కంధుండనై
నామది నిరంతరము
నడయాడు హృదయేశుఁ
గనుఁగొనఁగ లేకుంటచే
నిది వియో
గవ్యథగ నూహించితిన్.

ఇది వియోగానర్హ
విభుసమాగమకాల
మిది విచారానర్హ
(?)మధురసంతసవేళ
భావదర్పణమందునన్
శ్రీమూర్తి
ప్రతిబింబితుం డయ్యెఁగా!"

ఆ ప్రసన్న ప్రశాంత దినాగమమున
నామనోహరభావగీతామృతములఁ
దీయఁదనమును గంగానదీమనోజ్ఞ
వీచికాసంతతులు తల లూఁచి మెచ్చె!

తన్మయానంద రసమహోత్సాహి యగుచు
మాధురీషూర్ధ్యమున యదునాధవసువు
ప్రార్థనాత్మకగీతముల్ పాడువేళఁ
బుష్పసంతతు లానందమున హసించె!

ఆవినిర్మలశాంతగీతావిరావ
మాలకించి యనంతహర్షాప్తి నొంది
పరిసరస్థితభూరుహపత్రవితతి
సాంద్ర నీహారహర్ష బాష్పముల రాల్చె!

అపుడు తలఁపని తలఁపుగ నన్ని దిశలు
ఘోరభీషణఘోష సంకులము లయ్యె!
అపుడు యవనచమూసమూహాంబురాశి
యమభటఘటాహతాదాగమముగఁ బర్వె!

వారిఁ గాంచక యదునాధవసు వనంత
భక్తిభావప్రభావ సంపద వహించి
నిశ్చలధ్యాన దీక్షాప్రణీతుఁ డగుచుఁ
బాడఁ దొడఁగెను గంభీర భావగీతి!

క్రాఁగుచుండు నయః పాత్రికల నపూర్వ
శీతల తుషారబిందువుల్ చిలికినట్లు
క్రమసత్ప్రార్థనామేయ గానరవళి
యవనసైన్య జనాగ్నికి నాజ్య మయ్యె!

జలధర మహోగ్ర ఘోషాప్రచండనినద
మష్టకకుబంతముఖరితంబై ధ్వనింప
నిజమతాభినివేశ నిర్నిద్రయవన
భటమహత్తరుఁ డొక్కఁడు పలికె నిట్లు.

"ఇది యనన్య జనోల్లంఘనీయ భరత
చక్రవర్తి ప్రకల్పిత శాసనమ్ము!
ప్రాణ మొసఁగెదో? లేక మహమ్మదీయ
మతముఁ గొనియెదో? మఱి మఱుమాట వలదు."

ఆగభీరవినిర్ఘోష మాలకించి
మది నోకించుకయును జలింపకయ నిల్చి
మృదుమధుర మందహాస సంస్ఫీత వదన
వనజుఁ డయ్యెను యదునాథ వసుఘనుండు.

అటుల నిశ్చలుఁడై గరీయఃప్రభావ
శాంత చేతస్కుఁడై నిల్చి సౌమ్యగుణుఁడు
సాధుహృదయాంచితుఁడు యదునాథవసువు
శృంఖలాబంధనమునకుఁ జేతు లొసఁగె!

తన కరమ్ముల నట్లు బంధన మొనర్చు
సమయమందున వీణాప్రసన్న గాన
నవ్య నిర్ఘోషమున యదునాథ వసువు
పలికె నిట్లు యథార్థ సంభాషణముల!

"మీ మతమ్మున నొక్కఁడ నై మెలఁగుట
నాకు సమ్మత మగు; నవాంతరము లేదు!
మతము లన్నియు నాకు సమానము లగు
నెందు నైనను దేవు నూహింపఁగలను!

మతము లన్నియు దైవసమ్మతము లగును!
మతము లన దైవభజనకు మార్గము లగు!
ఏమతమ్మున నున్న నా కేమి? నాకు
దైవపూజాప్రణీత చిత్తంబు కలదు!

అన్ని మతముల యందున ననుసరింపఁ
దగిన నీతులు గలవు వందల కొలంది!
దోషమును మాని వరలు సద్గుణము మెచ్చి
యనుసరించెడువాఁడె మహామహుండు!

ఆ నిరామయ సేవామహావరము,
చిరసమార్జిత పుణ్యావిశేషఫలము!
ఆనిరంజన తేజోవిలీన పదవి
బహుళ జన్మసమార్జిత భాగ్యఫలము!

ఆపరాత్పర దివ్యపాదారవింద
సేవకంటెను నా కన్యచింత లేదు!
ఆసనాతను గానమ్ముఁ జేసికొనుచుఁ
బాపుకొనెద మఱియ జీవన భరమ్ము!"

---

# మా గాంధి

బసవరాజు అప్పారావు గారు

కొల్లాయి గట్టితే నేమీ?
మాగాంధి,
కోమటై పుట్టితే నేమీ?
వెన్నపూసా మనసు
కన్నతల్లీ ప్రేమ
పండంటి మోముపై బ్రహ్మతేజస్సూ! కొ.

నాల్గుపరకల పిలక,
నాట్యమాడే పిలక,
నాలుగూ వేదాల నాణ్య మెరిగిన పిలక! కొ.

బోసినో ర్విప్పితే
ముత్యాల తొలకరే,
చిరినవ్వు నవ్వితే వరహాల వర్షమే! కొ.

చకచక నడిస్తేను
జగతి కంపించేను,
పలుకు బలికితేను బ్రహ్మ వాక్కేను! కొ.

కౌశికుడు క్షత్రియుడు
కాలేద బ్రహ్మఋషి?
నేడు కోమటిబిడ్డకూడ బ్రహ్మఋషాయె!
కొల్లాయిగట్టితే నేమీ?
మాగాంధి,
కోమటై పుట్టితే నేమీ?

---

# ౧౨. ప్రకీర్ణకము

## దీపావళి పండుగను సార్థకపఱచు టెట్లు?

మడుంబ నరసింహాచార్యులు గారు

### పండుగల ప్రయోజనము

భగవదవతారమూర్తులయు, మహాపురుషులయు సచ్చరిత్రముల సంస్మరింపఁజేసి వారిసద్వర్తనములను బ్రజలచే ననుకరింపఁజేయుటకే పండువు లుద్దేశింపఁబడినవి. స్వజాత్యభ్యుదయమునకు సహకారకములుగ నుండురీతి నాయాపండువు లన్నియు నాచంద్రార్కము భారతీయులచే నాచరింపఁబడ వలెననియే వాని నేర్పఱిచిన మన యార్యుల యభిమతము. అందుకొఱకే వారు జనసామాన్యమును విశేషముగ నాకర్షింపఁగల కొన్ని వేడుకలను బ్రతి పండువునకును జతపర్చి యున్నారు. శ్రీకృష్ణజయంతికి గొల్లలు ఉట్లు కొట్టుట, దసరాకు పిల్లలు గిలకలు పట్టుట, దీపావళికి జనులు బాణసంచులు కాల్చుట మున్నగునవి కేవలము పామరజనాకర్షణార్థము కల్పింపఁబడిన వేడుకలే. ప్రజోత్సాహమును బోషించుట కేర్పడిన యిట్టి వేడుకల వెల్లిలోఁ బడి పండుగయొక్క ముఖ్యప్రయోజనము వెస నుపేక్ష వహించుట, ఫలరసరక్షణార్థ మేర్పడిన త్యాజ్యములగు పండ్లతొక్కలు భక్షించి భోజ్యములగు ఫలరసంబుల వర్జించుట వంటిదికదా!

పండువు లట్టి పెడమార్గములం బడి నిరర్థకము లగుచున్నప్పుడు వాని తత్త్వ మెఱింగిన విజ్ఞులు ఫలప్రదములగు కొన్నిమార్పులతో వాని నాచరించుట ప్రారంభించి, పెద్దల ననుకరించుటే స్వభావముగాఁ గల జనసామాన్యమును సన్మార్గమున వర్తింపఁజేయుచు, ఆ పండుగలకు నూత్నవికాసము గల్గించు టెంతయు సముచితము. విలువిద్యానైపుణ్యము, ఆయుధకళాకౌశల్యము, మల్లయుద్ధప్రావీణ్యము మున్నగునవి పరీక్షింపఁబడి పరాక్రమవంతులగు యువకులును, దద్గురుసత్తములును సమ్మానింపఁబడుట కుద్దేశింపఁబడిన దసరాపండుగ కాలవశమున గిలకలు, దసరాపద్యములు, కోలాటములుగల వినోదబాలక్రీడామాత్రముగ మారిపోవుచుండఁగా మరల నిప్పుడిప్పుడు వ్యాయామప్రదర్శనములు, బహుమతులు మున్నగున వేర్పఱిచి యువకులభుజవీర్యసంపాదనానురక్తిని బెంపొందఁజేయు సన్నాహములతో దేశాభిమానులా పండుగ నన్వర్థముగఁ జేయుచుండుట మనము గనుచున్నాముకదా! అట్లే దేశాభ్యుదయ దాయకములగు పండువులలో నగ్రగణ్య మనఁదగిన దీపావళిపండుగను సముచిత సంస్కారములచే సార్థకముగఁ జేయఁగడంగుట ప్రస్తుత కాలమున దేశసేవానురక్తుల విధ్యుక్తధర్మమని నేను మనవిచేయుచున్నాను.

### దీపావళీ కార్యక్రమము

దీపావళిపండుగ మనదేశమున వివిధప్రాంతములందు వేర్వేరు రీతుల నాచరింపఁబడుచున్నది. మన యాంధ్రరాష్ట్రవాసులు నరకచతుర్దశి (ఆశ్వయుజ బ. ౧౪)నాఁడు ప్రాతఃకాలమున నభ్యంగస్నానము లొనర్చి, మఱునాఁడు పండుగ చేసికొని, నాఁటిరాత్రి దీపపఙ్క్తులచే గృహముల నలంకరింపఁ జేతురు. కొన్నిప్రాంతములందలి జనులు దీపావళి మఱునాఁడు ధనలక్ష్మీపూజ యొనర్తురు. మఱికొన్నిచోట్ల వసించువారద్దానినే సత్కార్యదీక్షావలంబన దినమగు నుగాదిపండుగగ పరిగణించి యుత్సవము లొనర్తురు. ప్రధానవిధానములం దిట్టిభేదము లున్నను

బాణసంచులు కాల్చుటయందు మాత్రము కొద్దిగనో గొప్పగనో యన్నిప్రాంతములవారును బాల్గొనుచున్నారు. జనసామాన్యమున కాకర్షణమాత్రముగ దొలుత నుద్దేశింపఁబడిన యీ బాణసంచుల కాల్పులు మనప్రాంతములందు ప్రాముఖ్యస్థాన మాక్రమించి పండుగయొక్క ముఖ్యప్రయోజనమును మ్రింగివేయునంతటి దుర్వ్యసనముగ బరిణమించుట చాల శోచనీయము.

## పౌర్వాపర్యవిచారము

దీపావళిపండుగకు సంభవకారణమగు తొల్లింటి కథాకాలమునాఁటి పరిస్థితులకును నేఁటి మన స్వరాజ్య సంరంభకాల పరిస్థితులకును వీడరాని సంబంధ మున్నది.

ద్వాపరయుగమున మనదేశమందు పరహింసాకర్మంబు లొనర్చుట కుత్సహించు స్వార్థపరులను జక్కఁబరుచుటకై శ్రీమహావిష్ణువు భూమియందు నిజాంశమున భయంకరశాసనుండగు నరకమహారాజును ప్రజాపరిపాలనార్థము జన్మింపఁజేసెను. ఇక్కలికాలమున మనదేశమందు కులధర్మానుసారము వర్తించుటకుఁ బ్రాలుమాలి ధనాశ, భోగవాంఛ, యధికారానురక్తియను వ్యామోహత్రయమ్మునఁజిక్కి, పరాయత్తవర్తనులమై భారతీయవ్యక్తిత్వము నుగోల్పోవుచున్న మన దృక్పథమునందు సవ్యమగుమార్పు గలిగించుటకై దయామయుఁడగు నీశ్వరుఁ డాచారవేష భాషాదుల భిన్నస్వభావులగు బ్రిటిష్ వారిని మనకుఁ బరిపాలకులుగ నిర్ణయించియున్నాఁడు. నరకరాజు దుష్టులగు ప్రజలచే సాధుసంతాపకరములగు నకార్యములు చేయించి వారి ముచ్చటలను దీర్చుచుఁ బాపభూయిష్ఠములగు తత్ఫలితములను వారిచేతనే గ్రహింపఁ జేసెను. బ్రిటిషువారు మనకు రాజకీయదాస్యమునకుమాత్రమే యుపకరించుపరవిద్యలు నేర్పి, భారతవిజ్ఞానమును వెల్లడించు శాస్త్రవిద్యలును, దేశాభ్యుదయసాధకములగు వృత్తివిద్యలును నామమాత్రావశిష్టము లగుటకు దారి చూపి తత్ఫలితమును మనచే ననుభవింపఁజేయుచున్నారు. మన కిప్పుడు బ్రిటిషు పరిపాలనయందు విరక్తి జనించినట్లే యప్పటి ప్రజలకును నరకభూపాలుని పాలనమునెడ విసుగు పుట్టినది.

తఱి మెఱింగి గాంధిమహాత్ముఁ డిప్పు డసహాయయోగమును, అహింసావ్రతమును, నిర్మాణ కార్యక్రమమును విధించి మనకు స్వతంత్రజీవనాపేక్షయు, స్వరాజ్యకాంక్షయు నెట్లు వర్ధిల్లఁజేయుచున్నాఁడో యట్లే భగవానుఁడగు శ్రీకృష్ణుఁ డప్పటి ప్రజలకును జాలవర కిట్టికార్యక్రమమే విధించి వారిని ధర్మమార్గానువర్తనులుగఁ జేసెను. ప్రజలు ధర్మవర్తనులైన పిమ్మటఁ దదర్థమై సృష్టింపఁబడిన నరకనరపతిపని తీరిపోయెను. ఆతఁడు శ్రీకృష్ణ చక్రాయుధ నిహతుఁడై తన కారణశరీరమును వీడి పరమాత్మయందు లీనమైపోయెను. మన భారతీయుల మానసములందు స్వతంత్రజీవనాపేక్షయు, స్వరాజ్యకాంక్షయు లెస్సగా నెలకొన్న వెంటనే భగవన్నిర్మితంబును, శిక్షా సదృశమ్మును నగు పరరాజ్యము నిస్సందేహముగ నదృశ్యమై స్వరాజ్యముసాక్షాత్కరింపఁగలదని మన కీదీపావళిపండుగ ఘంటాపథముగ చాటుచుండలేదా?

## నరకుని విచిత్రశీలము

ప్రజలు తమ యధర్మవర్తనముఁ బెంపొందించుకొనుట కవకాశ మొసఁగెనే కాని నరకభూపతి తాను స్వయముగ నెట్టియధర్మకార్యము నొనర్చినట్లు కనఁబడదు. అతఁడు తన రాజ్యావసానదినములందు నిరంకుశవర్తనకుఁ గడంగెనే కాని మిగిలినకాలమంతయు శాసన సమ్మతముగనే ప్రజలఁ బాలించెను. పురాణకర్త లాతని తొలివర్తనమున నాల్గు నేరములు మాత్రమే పట్టఁగలిగిరి. ఒకటి—అదితికుండలము లపహరించుట. రెండు—వరుణచ్ఛత్రమును లాగుకొనుట. మూఁడు—మేరువునందలి మణిశైలము నాక్రమించుట. నాలుగు—తన్ను వివాహమాడ నొల్లని పదియాఱువేల కన్యకామణులను చెఱయందుంచి బాధించుట. మహాప్రభావసంపన్నములును సకలశుభదాయకములును నగు ఆ కుండలచ్ఛత్రమ్ములు జగదేకవీరుఁడగు తనయొద్దనే యుండదగిన వగుటచే నదితి, వరుణుల యొద్దనుండి బలాత్కారముగ వాని నాతఁడు గ్రహించెను. మణిపర్వతము సర్వైశ్వర్యప్రదమగుటచే వీరభోగ్యములగు తద్ధనరత్నరాసు లెల్ల నతఁడు స్వాధీ

నము చేసికొనెను. ఈకార్యములందు క్షాత్రధర్మమే వెలయుచున్నది కాని కేవల మధర్మవర్తనము గోచరించుట లేదుకదా! ఇక కన్యలను చెఱయం దుంచుటను గూర్చి విచారింతము.

నరకుఁడు మహాపరాక్రమసంపన్నుఁడగు సార్వభౌముఁడు కాని సామాన్యనరుఁడు కాఁడుగదా. అట్టి ధన్యుని కన్యలు తమంత తామే యుత్కంఠలై వరింపఁదగి యుండఁగా, రాజేంద్రుఁడు స్వయముగ వేఁడినను, చతుర్విధోపాయముల బలాత్కరించినను వా రాతనిని వివాహ మాడ నొల్లకుండుటకు కారణ మేమి? శ్రీకృష్ణప్రబోధితులగు నక్కాలపు ప్రజలధ్యక్షపథములందు సంభవమైన సవ్యమగు మార్పే యందులకు కారణము.

శ్రీకృష్ణప్రబోధము

"నరకమహారాజు దుష్టుఁడని తలంపకుడు. అతఁడవనియందు నాయంశమున జన్మించినవాఁడే. అధర్మవర్తనులగు ప్రజలకు కఠినశాసనులగు ప్రభువులను, ధర్మమూర్తులగు ప్రజలకు ప్రజాభీష్టప్రదులగు ప్రభువులను నేనే సృజించుచుందును. 'అధర్మ మొల్లము. మాకు ధర్మమే కావలె'"నని మీ రెప్పుడు గట్టిదీక్ష వహింతురో అప్పుడే కఠినమగు నరకపరిపాలన మంతరించి మీకు సౌమ్యపరిపాలనము సంఘటిల్లును. 'అధర్మకార్యములు చేసిననే కాని యాహారము దొరకదే! మే మెట్లు బ్రదుకఁగల?'మని మీ రధైర్యపడవద్దు. 'ఆఁకలిచేత దేహములనైనఁ ద్యజింతుము కాని యధర్మకార్యముల కొడఁబడ' మను నంతటి ధర్మదీక్ష మీకు కలదో లేదో పరీక్షించుటకే నేను మీకిట్టి కఠినపరిస్థితులు కల్పించితిని. రాజు మిమ్మధర్మకార్యములకుఁ బ్రోత్సహించినను మీరు మోసపోవద్దు. రాజసహాయము మీ రపేక్షింపకుఁడు. పరాయత్తవర్తనములు మాని స్వతంత్రులై, నిర్భయులై, యాత్మజ్ఞానులై, ధర్మమూర్తులై భాసిల్లుఁడు." అని యనేక విధముల శ్రీకృష్ణుఁడు తఱిమెఱింగి తెలిపిన సద్బోధలు ప్రజల కాకష్టకాలమున హృదయముల బాగుగ నాటుకొన్నవి. ఆ హితోపదేశములను త్రికరణశుద్ధిగ నాచరణయం దుంచుటకు దీక్ష వహించియున్నవారగుటచే నరకుఁ డెన్నివిధముల యత్నించినను స్త్రీపురుషాదు లనేకులు అధర్మమునకు లొంగక రాజునెడఁ బూర్తిగ నసహాయయోగము నవలంబించిరి. కావుననే తమ కుమార్తెల నాతఁడు పెండ్లాడి సంబంధములు కల్పుకొన నుత్సహించినను బ్రజ లందుల కియ్యకొనరైరి. తమ్ము చెఱయందుంచి రాజు నయభయముల నెంతయత్నించినను కన్య లాతని వివాహమాడ నొల్లరైరి. వారెల్లరు శ్రీకృష్ణనామమంత్రమే జపించుచు ధర్మదీక్ష నవలంబించి యుండిరి. ఎన్ని చేసినను బ్రజలు తనకు లోఁబడనందున నరకరాజు నిరంకుశవర్తనకుఁ గడంగి మురాదిదైత్యుల సహాయముచేఁ బ్రజల సర్వస్వమును దనకైవసము చేసికొని వారి ననేకవిధముల బాధింపఁదొడఁగెను. ప్రజలు తినఁదిండి, కట్టబట్ట లేక నానాబాధ లందిరేకాని యధర్మమునకు లొంగలేదు; శ్రీకృష్ణసంస్మరణమును మానలేదు. అట్టి ధర్మదీక్ష దేశమునఁ బ్రబలినప్పుడే నరకపాలన మంత మొందుట తటస్థించినది.

పండుగదినము

ప్రజలయనుమతిని శ్రీకృష్ణుఁడు నరకరాజతనయుఁడును, నిజభక్తుఁడును, బరమదయాళుఁడును నగు భగదత్తుని రాజుగ నేర్పఱిచి కొల్లలుగ రాజు బొక్కసమునఁ బడియున్న ధనరత్నరాసులను బ్రజలకు సమృద్ధిగఁ బంచిపెట్టించెను. వారందఱు మహాసంతుష్టులై తిండికి, బట్టకు, దీపమునకుఁగూడ కఱవంది యనుభవించిన తమ పూర్వకష్టము లెల్ల వడ్డితోఁ దీరులాగున మఱునాఁడుగొప్పపండుగ చేసికొనిరి. ప్రతివారును బిండివంటలతో మృష్టాన్నములు భుజించిరి. నూతనవస్త్రములు ధరించిరి. విజయసూచకముగ నక్కడక్కడ ఫిరంగులు పేల్చిరి. ధనరాసులను లెక్కించుకొని ముదమందిరి. కొన్నాళ్లవఱకు రాత్రులందు గృహములెల్ల దీపావళులచే నలంకృతము లొనర్చి పట్టపగళ్లవలె వెలుఁగొందఁ జేసిరి. నాఁటినుండి నూతనయుగము ప్రారంభమైన దెంచి ప్రజలెల్లరు మహానందమును బ్రకటించిరి. రాజకీయసౌఖ్యోన్నతికి మార్గదర్శకమును, బవిత్ర

మును నగు ఈపండుగను భారతీయు లెప్పుడును మఱువకుండుటకై యానాఁడొనర్పఁబడిన యుత్సాహ కార్యములే కొద్దిమార్పులతో మన భారత దేశమున వివిధ ప్రాంతముల భిన్నరీతులఁ బ్రతియేఁటను నాశ్వయుజబహుళ అమావాస్యదినమున నాచరింపఁ బడుచున్నవి.

మన యసహాయస్థితి

శ్రీ గాంధిమహాత్ముఁడు బోధించిన అసహాయ సూత్రము సరిగా నవలంబింపఁబడిన యెడల నది తప్పక ఫలప్రదమై భారత దేశోద్ధరణ మొనర్చితీరునని నొక్కి చెప్పుటయే కదా యీపండుగయొక్క ముఖ్యప్రయోజనము. మహాత్ముఁడు బోధించిన త్రివిధబహిష్కారములు— అనఁగా విదేశవస్త్రములు, బ్రిటిష్ న్యాయస్థానములు, ప్రభుత్వవిద్యాలయములు బహిష్కరించుట—మన దేశప్రజలాచరింపఁగల్గిరా ? అట్లాచరించినచోఁ గుక్షింభరిత్వమునకును, భోగపరాయణతకును లోపము వాటిల్లునని కదా మనవారి భయము. కులవృత్తుల నశింపఁజేసికొని, పరాయత్తవర్తనులమై పడియుండుటవలనఁగాదే మన కట్టిభయము గల్గుచున్నది! ప్రస్తుతస్థితిలోనైనఁ గొంతకాలము భోగవాంఛలను గట్టిపెట్టి దీక్షతో నిరాడంబరజీవనము చేయుచుఁ ద్రివిధబహిష్కారములకుఁ గడంగినచో సస్యశ్యామలయై, సర్వఫలసంధాయినియై తనరారు పవిత్రభారతమాత మన కన్నవస్త్రముల నిచ్చి పోషింపక మానునా? అయితే మనలోఁ బెక్కుమంది కాహారము, ఆరోగ్యముకన్న వేడుకలు, వ్యసనములే ముఖ్యమైపోయినవి. ఒక్కవిషయమును గమనింపుఁడు.

నిరర్థక ధనవ్యయము

స్వరాజ్యసంపాదనకు మార్గదర్శకమై యొప్పు దీపావళి పండుగనాఁడు మనవా రేమి చేయుచున్నారు? కులాసాగా టపాసులు కాల్చుచున్నారుకదా! అసహాయ యోగ మవలంబించి నిరాడంబరజీవనము చేయుటే మన కర్తవ్యమని ప్రబోధ మొనర్చుకొనవలసిన యీపవిత్రదినమున నందుకు వ్యతిరేకముగ బాణసంచులకై నిష్ప్రయోజనకరమగు ధనవ్యయము చేయుటా? తదర్థమై లక్షల కొలఁది రూపాయలు విదేశములకుఁ బంపివేయుటా? ఈ పండుగనిమిత్తము మన బీదదేశమున బాణసంచులకై వెచ్చింపఁబడు ధనమును గూర్చిన సరియగులెక్క మనకుఁ దెలియదు. కాని ఒకకోటి యేఁబదిలక్షల రూప్యములకు మించియుండునని కొందఱును, అట్లుగాక అయిదాఱుకోట్లవఱకు నున్నట్టు లంచనా వేయఁబడినదని మఱికొందఱును జెప్పుచున్నారు. ఈపండుగనాఁడు టపాసులకై వెచ్చింపఁబడు సొమ్మంతయుఁ బూడిదలోఁ బోసిన పన్నీరువలె నిరర్థకమే యగుచున్నదికదా! గాలిని శుభ్రపఱుచుట కదెంతయు సహకారి గావున ననవసరవ్యయము కాదని కొందఱు వాదింపఁజూతురు. కాని యట్లు పలుకుట హాస్యాస్పదము. గాలిని శుభ్రపఱుచుట తమవిధి యని తలఁచునంతటి భాగ్యశాలులు తమకు సంతోషసమయములగు వివాహాది శుభకార్యములందు వినోదములకై వెచ్చించు ధనమున బాణసంచులకుఁగూడ నుచితస్థాన మిచ్చి కృతార్థులు కావచ్చును. అంతేకాని స్వరాజ్యము వచ్చువఱకును ద్రివిధబహిష్కారములను గొనసాగించుచు నిరాడంబరజీవనముఁ జేయుదమని శపథము పట్టవలసినరోజున దుర్వ్యయముచేయు టేటిన్యాయము? నిజముగా దేశ మత్యంత దరిద్రావస్థలోనుండఁగా నొకపైసయైన వృథావ్యయము సేయుట మన కనుచితముగాదా?

ధనాభావమున దేశమున నెన్నిజాతీయ విద్యాలయములు మూసివేయఁబడినవి? నెలకు పావలాచందా నిచ్చుకొనఁజాలు సభ్యులు దొరకమిచే నెన్ని పుస్తకభాండాగారములు నామమాత్రావశిష్టము లైపోయినవి? ఏఁడాదికి రెండుమూఁడు రూపాయ లొసంగ సాహసించు చందాదారులు లేకుండుటచే నెన్ని దేశభాషాపత్రికలు విరమింపఁ బడినవి? దేశాభిమానము కల్గియు నేఁడాది కొక్కపావలా కాంగ్రెస్ చందానైన నీయలేని దరిద్రస్థితిలో మనసోదరు లెంద ఱల్లాడుచున్నారు? దాస్యవృత్తులు త్యజించిన మానధనులగు దేశభక్తు లెందఱు తిండికిఁ జాలక బాధపడుచున్నారు? ఆహా! ఇట్టి దరిద్రావస్థలో నర్థములేని వేడుకలకై నూటయేఁబది లక్షలరూప్యముల కధిక

ముగ మనము టపాసులకై తగులఁబెట్టుచుండుట విషాదకరముగదా? ప్రతివత్సర మీధనమంతయు సద్వ్యయ మొనర్పఁబడుచున్నచో, దేశోప యోగకరములగు జాతీయ విద్యాసంస్థలు, వార్తాపత్రికలు. పఠనమందిరములు మున్నగునవి కొల్లలు కొల్లలుగ నెలకొల్పఁబడి సత్వర స్వరాజ్యప్రాప్తి కనుకూలపడియుండునుగదా! బాణాసంచులు కాల్చుట మాని యథాశక్తిని మంచినూనెతోఁ గొన్ని ప్రమిదదీపములు పెట్టుకొనుట యను ప్రధానలాంఛనమును మిగుల్చుట వలన పామర జనాకర్షణమునకు భంగము కలుగక పండుగ కొనసాగ కుండునా?

## సార్థకమగు కార్యక్రమము

ఆనాఁడందఱు త్రివిధబహిష్కారములలో ముఖ్యమగు విదేశవస్త్రపరిత్యాగదీక్షను బూని ఖద్దరువస్త్రములు ధరించుట—జాతీయ విద్యాలయనిధి, స్వరాజ్యనిధి మున్నగువానికి యథాశక్తిని దానరూపములగు భిక్షలొసంగుట—దానము సేయుట కిచ్చగింపనివారు తాము టపాసులకై పూర్వము వెచ్చించుచు వచ్చిన ధనముతో ఆనాఁడు వార్తాపత్రికలకు, పఠనమందిరములకు చందాదారులుగను, జండా లిచ్చి కాంగ్రెస్‌సభ్యులుగను జేరుట మున్నగు పవిత్రకర్మములతోఁ గూడిన నిర్మాణకార్యక్రమము పూనిననేకదా పండుగ ప్రయోజనసహితమగును. వ్యాసములు, ఉపన్యాసములు, హితబోధలు, ప్రకటనలు మున్నగువానివలన దీపావళి యిట్లు సంస్కరింపఁ బడునని మనము భ్రమింపఁదగదు.

బందరు జాతీయకళాశాల వారివలెనే తదితర జాతీయవిద్యాసంస్థాపకులు — పత్రికాధిపతులు— పఠనమందిర నిర్వాహకులు—కాంగ్రెసు కార్యాలయోద్యోగులు—ప్రచారకులు మున్నగువా రనేకులు యీ పండుగ సమీపదినములందు తమ పరిసరప్రాంతములగు నిర్ణీతగ్రామాదులందు సంచారమొనర్చి చందాలు వసూలుచేయుట ప్రారంభించవలెను. ప్రస్తుతస్థితిలో దీపావళికి టపాసులు కాల్చుట దేశమున కవమానకరమనియు, ససహాయయోగముఁ బూనుటకు శక్తినొసంగు సత్పరిస్థితుల నొనఁగూర్చుకొన దీక్ష వహించుటే స్త్రీ పురుషాదులెల్లరు ఈపండుగనాఁ డొనర్పవలసిన విధ్యుక్తధర్మమనియు నవసర మగునెడల చిన్న కరపత్రములమీఁద నచ్చొత్తించి పంచిపెట్టవచ్చును.

దీపావళినాఁడు నిష్ప్రయోజనముగ వ్యయపఱుపఁబడుచున్న యద్భుతమగు ప్రజాశక్తిని సవ్యమార్గమునకు మరలించి దేశోద్ధరణ కార్యమునకుఁ దోడ్పడునట్టి సత్కార్యదీక్ష మన భారత ప్రజానాయకులకుఁ గలుగునట్టు లనుగ్రహించుఁ గాత మని దీనజనబాంధవుఁడగు శ్రీకృష్ణభగవానుని భక్తి తత్పరహృదయులమై ప్రార్థించుచు మన మీవిషయము నింతతో విరమింతము.

---

అనంతపంతుల రామలింగస్వామి గారు

ఇరులన్ దీపిక, యెండలో గొడుగు, వాహిన్యాదులన్ ద్రోణి, సం
గరమందున్ దరవారి, యంధతను విఖ్యాతాంజనం, బాకటన్
బరమాన్నంబు, దగన్ సుధారసము, సర్వవ్యాధులం దౌషధం
బరయ న్నీకు వివేక మయ్యెడును దివ్యజ్ఞాన సంపాదకా!

అరిషడ్వర్గమదేభయూథముల కౌరా! యంకుశం బూర్ధ్వలో
కరహస్యావళిఁ దెల్పు చారిణి, యఘౌఘాంభోద ఝంఝానిలం,
బురు పంచేంద్రియ ఘోటకవ్రజ 'ఖలీ'నోత్కృష్ట, మాముష్మికా
ధ్వరహోత్రగ్రణి యా వివేక మిల దివ్యజ్ఞాన సంపాదకా!

భవదీయైహికజీవధూమశకటప్రాప్తోన్ముఖజ్యోతి, మా
నవజన్మానుజ సద్గుణాగ్రియము, విజ్ఞానప్రభాత ప్రభో
ద్భవమున్ జాటెడు వేగుఁజుక్క, భవదాదర్శాచలారోహణ
వ్యవసాయంబున కూఁతకోల యగు దివ్యజ్ఞానసంపాదకా!

అతితాపత్రయ తాపకాలమున శైత్యాకీర్ణవాతంబు, స
ద్గతికిన్ మూలము, సర్వసమ్మతము, సత్యాన్వేషణార్థాను ని
ర్మిత ఘంటాపథ, మైహికప్రథన భూమివ్యూహ రాజంబు నై
షతిత్రోద్ధారిణి యా వివేక మిల దివ్యజ్ఞాన సంపాదకా!

తనునౌకాస్థిత దిక్ప్రదర్శిని, వియద్గంగాపవిత్రంబు, పా
వసమున్యాశ్రమ పాలనధ్వజ, మఘప్రారణ్య దావానలం,
బనుమానాహివితానగారుడ, మవిద్యారాత్రి సూర్యోదయం
బనుజా! నీకు వివేక మయ్యెడును దివ్యజ్ఞాన సంపాదకా!

నీజీవాంబరమందు నిద్రదను వౌ, నీమానసారణ్య వి
భ్రాజత్పూర్ణ వసంతమౌ, భవనిశాప్రాప్తాబ్జ బింబంబు నౌ
నోజన్ దర్పణ మాత్మదర్శన మహోద్యోగంబునన్, దావకీ
నాజన్మాంతము దేశికుం డగును దివ్యజ్ఞాన సంపాదకా!

ఆదర్శమాన్చెకు నిష్టదేవత, మహోద్యచ్ఛక్తి సద్రక్షు, జీ
వోదధ్యాంతర సంస్థితప్లవము, మోక్షోదంత విఖ్యాత్రమ
ర్యాదన్ జాటుపవిత్రపుస్తకము, కర్మక్షీణ మంత్రంబు, జీ
వాదర్శంబు వివేక మయ్యెడును దివ్యజ్ఞాన సంపాదకా!

నిను నేకాగ్ర మనస్కుఁగా నునుచు, సందేహాత్మునిన్ జేయఁ డె
దును, సన్మార్గములందుఁ ద్రిప్పు, సుజనస్తోమాధిపున్ జేయు స
ర్జనదేశంబుల సంగడీఁ డగును, మోక్షావాప్తిఁ జేకూర్చు భ
వ్యనికాయం బిడుచున్, వివేక మిల దివ్యజ్ఞాన సంపాదకా!

——

# లైంగిక వాసన

## (అనగా సంభోగ సంతానేచ్ఛల సంబంధమైన వాసన)

పొరనంది జగన్నాథస్వామి గారు, యం.ఏ.,యల్.టి.

[గతించిన రెండుసంవత్సరముల సంచికలలోను వ్యక్తిత్వవాసన గురించిన్నీ, సాంఘికవాసన గురించిన్నీ వ్రాశాను. ఇప్పుడు మూడో వాసన గురించి వ్రాస్తున్నాను. దీనికి ఇంగ్లీషులో Sex Instinct అని అంటారు. దీనికి సరిపోయే చక్కనిపదము మరొకటి కుదరకపోవడముచేత, ఈపదమును కల్పించాను. Sex కు సరిపోతూ 'లింగ' అనే సిద్ధరూపం ఉన్నదిగదా; దానినుండి 'లైంగిక' నేను కల్పించాను.]

స్త్రీపురుష భేదకములయిన శారీరికలక్షణాలకున్నూ, మానసిక ధర్మాలకున్నూ ఆధారమైనది లైంగికవాసన. ఆ శారీరికలక్షణాలు బాహ్యాంగములే కాకుండా, కంటికి కనబడని సూక్ష్మబీజాలున్నూ, వాటి ఉత్పత్తిస్థానములున్నూ కూడా అవుతవి. ఈ సూక్ష్మబీజాల ధర్మాలు ఒకవిధంగా ఇతర లక్షణాలకు సూచనలుగా రూపించవచ్చును. పురుషబీజము చిన్నదై చాలా చురుకుగా ఉంటూ, స్త్రీబీజము విడిచే ఆకర్షణపదార్థాలను గ్రహించగలుగుతుంది. పురుషబీజము చిన్నది కావడమువల్ల తనలో చాలా ఆహారపదార్థాన్ని నిలవగా ఉంచుకొనియుండలేనందున అట్టేకాలము బ్రతికియుండదు. స్త్రీబీజము పెద్దది; కాబట్టే చాలా ఆహారమును ఉంచుకోగలదు; కాబట్టే చాలా మందగామి. అందుచేతనే పురుషబీజాన్ని ఆకర్షించుటకు కొన్ని ఉత్తేజక పదార్థాలను విడిచిపెట్టుతూ సంచరిస్తుంది. జంతువుల పరిణామములో ఈ బీజలక్షణాలు చెదిరి, శరీరమంతటా వ్యాపించి, అంగములలో అక్కడక్కడ బాగా వ్యక్తమవుతూ, స్త్రీపురుషులను వేరుపరుచుటకు తగిన ధర్మాలుగా ఏర్పడుతూ ఉన్నవి.

ఈలక్షణాలలో ప్రధానమైనది ఆకర్షణయోగ్యత. ఉత్కృష్ట జంతువులలో ఈయోగ్యత జంతువుయొక్క మొత్తము లక్షణాలని పట్టి యుంటుందిగాని, ఏయొక అంగమునందే ఆధారపడి యుండదు. ఈ ఆకర్షణకు ముఖ్యప్రయోజనము సంయోగమైత్రి. సంయోగఫలము వాసనాస్వరూపముల రెండింటిలో ఒకటి. రెండోదైన సంతానఫలము సంయోగఫలముపై ఆధారపడియున్నది. ఈరెండూ కార్యకారణములుగా సంబంధించి ఉండడమే కాకుండా, సాధారణముగా ఒకదానిని విడిచి ఒకటి ఉండదు. ఈఫలాలవల్ల సంక్రమించే గుణాలలో స్త్రీ పురుషులను బట్టి కొంతభేదము కలుగుతూ ఉంది. సంతానవిషయమై గల బాధ్యతంతా స్త్రీదే కావడముచేత, ఈఫలము కోసము చూపే శ్రద్ధాదులద్వారా అబ్బే గుణాలు స్త్రీకి సంక్రమించినట్లు పురుషునికి సంక్రమించలేదు. సంయోగఫలముకోసము అబ్బవలసిన గుణాలలో అట్టి తారతమ్యము లేదు. స్త్రీయొక్క స్వాభావిక మందత్వమూ, సౌందర్యమూ ఒకవైపున, పురుషుని చురుకుతనమూ, గ్రహణసామర్థ్యమూ (Sensitiveness) మరొకవైపున వృద్ధిబొందినవి.

ఇవి సాధారణముగా కనబడే భేదాలు. వీటికి మార్పు వివిధ సాంఘికవ్యవస్థల ననుసరించి రావచ్చును. ఎట్లంటే, పురుషులకంటే స్త్రీలు ఎక్కువగా ఉండి, పురుషులకు ఏకపత్నీనియమము ఉన్నప్పుడు, ఆసంఘములో పురుషులకు బదులుగా స్త్రీలే ఎక్కువ చురుకుగాను, ఉత్సాహవంతులుగాను ఉండుట సంభవిస్తుంది. మరీ ఎక్కువ సుఖజీవనానికి బాగా అలవాటుపడ్డ కుటుంబాలలోని స్త్రీలకు సంతానేచ్ఛ క్షీణించిపోయి, మొదట పిల్లలను పెంచుట గురించి, తరువాత పిల్లలను కనుటగురించి కూడా ద్వేషము పుట్టవచ్చును. సాంఘికరాజకీయ సమస్యలలో పాల్గొంటూ, బుద్ధి శరీరక్లేశములలో సామర్థ్యము చూపుతూ, క్రమేణ పురుషునికి విశేషలక్షణమని చెప్పదగిన వ్యాపారము లన్నిటిలో స్త్రీలు పురుషునితో పోటీ పెట్టుకోవచ్చును. కొన్ని కొన్ని పరిస్థితులనుబట్టి స్త్రీకి విశేషలక్షణమని చెప్పే గృహసంబంధ వ్యాపారాలలో పురుషుడు ఎక్కువశ్రద్ధ తీసుకొంటూ, ఇల్లన్నా, పిల్లన్నా ఎక్కువప్రీతి కనబరుస్తూ ఉండవచ్చును.

అందుచేత ఈ వాసనాస్వరూపాన్ని సామాన్యంగా మూడు అంశములు కలదానిగా వర్ణించవచ్చును; ఒకటి స్త్రీపురుషుల శరీర సంబంధమైన సుఖము; రెండోది మనస్సంబంధమైన మైత్రి; మూడోది సంతానసంబంధమైన ధర్మము. ఈ మూడుకీలులు విశ్రేషముగా వ్యక్తమవుతున్నచోట ఆవాసన ఆరోగ్యవంతముగా ప్రవర్తిస్తున్నట్లు భావించడము కలదు. అలాగుగాక అవి విడిపోయి ప్రత్యేకముగా ప్రవర్తిస్తే స్త్రీపురుషులకు ఉండవలసిన బాంధవ్యానికి లోపము వస్తుంది. ఇందులో ఏఒక్కటితోనో ప్రారంభమై ఆ ఒక్కరూపముగానే ఉద్రేకించి క్రమముగా మిగిలిన మార్గాలలోనికి ప్రవర్తిస్తుండడము చాలా తరుచు. కొన్నిచోట్ల ఆలాగుగాక ఆ ఒక్కఅంశములోనే ఆవాసన నిలిచిపోవడము కూడా కలదు. అనగా, ఏ రెండోరీతితోనో, అంటే మానసిక మైత్రితోనో, స్త్రీపురుష సంబంధములు ప్రారంభమై వృద్ధిజెంది, అంతటితో విరమించేవి చాలా అరుదు; అనగా ఆసంబంధము క్రమముగా మొదటిదైన శరీరసంబంధముగా కూడా మారడము సాధారణముగా

సంభవిస్తుంది. ఆలాగని మానసిక మైత్రిలోనే వారి వాసనాతృప్తినంతను పొందేవారు లేరని కాదు ఈ ఉపపాదన అభిప్రాయము.

ఈమూడూ ఒకదాని నొకటి విడువకుండా స్త్రీలలో కలిసి ప్రవర్తిస్తున్నట్లు పురుషులలో ఉండడము లేదు: మూడో అంశమైన సంతానధర్మము తల్లులకు బంధనమైనట్లు తండ్రులకు కాకపోవడమే అందుకు కారణము. పురుషునికి ఈ బంధనము లేకపోవడముచేతనే, స్త్రీకైనట్లు పురుషునికి కూడా సంతానము సంభోగ వాంఛానిరోధము కాకున్నది. అందుచేతనే గృహిణియైన భార్యను గాక ఇతర భార్యలను పురుషుడు కోరుతూ ఉన్నాడు: కాబట్టే చాంచల్యమును పురుషుని స్వభావలక్షణముగా నిరూపిస్తూన్నారు. అంతమాత్రాన స్థిర పురుషులుగాని, చంచల స్త్రీలుగాని లేరని అభిప్రాయము కాదు; శరీర నిర్మాణమును బట్టిన్నీ, ఈవాసనా వ్యాపారమును బట్టిన్నీ స్త్రీపురుషులకు ఇట్టి సామాన్య భేదము చేయక తీరదు. కాని నాగరికతా ప్రభోధము వల్ల, సాంఘిక నిర్బంధములవల్ల, ధర్మబుద్ధి ప్రసారమువల్ల స్త్రీపురుషులలో అన్యోన్యము ఉండవలసిన స్థిరత దృఢపడుచున్నదని నమ్మ వచ్చును.

ఈవాసనా బలమును తగ్గించు కొనుటకు ఒకసాధనము గలదు. అత్యధికమైన శృంగార వాంఛ గలవారికి కాయకష్టమును ఔషధముగా వైద్యులు నిర్ణయిస్తూ ఉంటారు. ఆలాగే ఇతర వ్యాపారాలలో మునిగి యుండే వారికి ఈవాంఛ తీవ్రముగా బాధించలేదు. అట్లు ఇతర మార్గాలలోనికి ఈ వాసనా శక్తిని త్రిప్పివేయుట అనుకొన్నంత సులభమైన పని గాకపోయినా, దాని వాంఛను అణచివేయుటకు ప్రయత్నించుట కంటె శ్రేయస్కరమైన పని. ఎందుచేతనంటే, దానిని అణచివేయుటకు ప్రయత్నిస్తే, ఆశక్తి అరికట్టిన ప్రవాహమువలె పూని, ఇతర మనశ్శక్తిని అంతను తనక్రిందనే ఉపయోగపడేటట్లు లోలోపునే విజృంభించి, మొత్తము మీద మనస్స్వాస్థ్యానికి లోపము వచ్చేటట్లు చేస్తుంది. ఒకవేళ మనోవైకల్యము స్పష్టంగా స్థిరపడక పోయినా, మనశ్శాంతికి భంగము కలగక మానదు.

ఇతర వ్యాపారాలలో విజృంభించేవా రంపగూ తమ లైంగిక శక్తిని దాని ప్రయోజనాలనుండి తప్పించిన వారే. ఇట్టి ఇతర వ్యాపారాలలో కొన్ని ఈవాసనా స్వరూపాంశములకు సంబంధించినవిగాని ఉన్నప్పుడు, ఈవాసనాశక్తిని వాటిక్రింద వినియోగించుట సులభమవుతుంది. ఉదాహరణ—సంగీతము, అభినయము, స్త్రీపురుషుల అన్యోన్యము, స్నేహము, సేవ మొదలైన వృత్తులు, స్త్రీపురుషుల (సంభోగేతర) సహవాసము: ఇవీ, ఇట్టివీ ఎక్కువగా లైంగికవాసనతో సంబంధము గలవి. ఈవిధముగా ఆవాసనాశక్తిని పశుతుల్య వృత్తులనుండి తప్పించి ఆధ్యాత్మికమైన ఉత్కృష్టవృత్తులలో వినియోగించడము ఎంతవరకూ సహజము, మానుషీయము, నీతిధర్మము అనే సమస్యగురించి భేదాభిప్రాయాలు ఉన్నవి. పూర్ణసన్యాసాన్ని అంగీకరించక కొంత శక్తినైనా సంభోగసంతానవృత్తులక్రింద ఉపయోగించవలెనని వాదించేవారు కొంద రున్నారు; ఆలాగని వారు స్త్రీధర్మము విషయమై సంకుచితాభిప్రాయములు గలవారు కారు. పూర్తిగా స్త్రీని ఈవాసనా సాఫల్యవృత్తుల క్రిందనే నిర్బంధించి ఉంచాలని వాదించే సాంఘిక రచకులు ఈరోజులలో లేనేలేరు అని చెప్పవచ్చును. స్త్రీకూడా వ్యక్తే; ఆమె వ్యక్తిత్వ వినియోగానికి తగిన అవకాశములు ఉండితీరవలెను. స్త్రీకూడా సాంఘికవస్తువే; ఆమెకు కూడా సాంఘికజీవితలాభములు అందుబడిలో ఉండవలెను. ఇది స్త్రీయొక్క వాస్తవపదవి; దీనిని అంగీకరించు సాంఘిక రచనే ఉండాలని ఆధునిక ప్రచారకులు వాదిస్తున్నారు. ఆదర్శము స్త్రీస్వభావానికి స్వవిరోధి కాదని రుజువు చేయుటకు బలమైన నిదర్శనముగా స్త్రీమణుల చరిత్రను ఉదాహరించవచ్చును. కాని వ్యవహారము, పరిపాలనము మొదలైన వ్యావసాయిక వృత్తులలోకూడా వారు నైపుణ్యమును చూపగలుగుతున్నా, వాళ్ళ సహజభావ నిర్మాణమునకు ఎక్కువగా అత్తియుండేది సాంఘికసేవావ్యాపారము. అందులో వాళ్లు కనబరుస్తున్న ఓర్మి, శాంతి, అనురాగము వర్ణనాతీతములు. ఈగుణాలు వారి సహజమైన వ్యాపారములో, అనగా బిడ్డలను పెంచడములో, వాళ్లు సాధారణముగా కనబరిచేవే: కాబట్టి సాంఘికవ్యాపారాన్ని, సంతానవ్యాపారాన్ని రెండింటిని కలిపి స్త్రీ తన ఆత్మకు పూర్ణతృప్తిని కలుగజేసికోగలదు. ఈ రెండుధర్మాలు విడిపోయి వేరువేరుగా తేనెటీగలలో ప్రవర్తిస్తూ ఉండడముచేత, వాటిలో రెండు తెగలు సిద్ధమైనవి: ఒకతెగ సంతానసంతులుగా ఉండడానికిన్నీ, రెండోది లైంగికముకానిసాంఘిక సేవలో ఉపసరించడానికిన్నీ. ఆలాగే మనుష్యులలోకూడా ఈవ్యాపారాలు విడిపోయేటట్లు సంఘనిర్మాణము మారాలని వాదించేవారు కొంద రున్నారు. ఇప్పుడుకూడా ఈ రెండింటిలో ఒకటి ఎక్కువగా ఉండి, రెండోది చాలా అప్రధానముగా ఉండేస్త్రీలు అనేకులు ఉన్నారు. మొదటి గుణము తీవ్రముగాగల స్త్రీయే పురుషునికి సాధారణముగా ఆమోదకరమైనది. అనగా లైంగిక వ్యాపారాలలో ఉపయుక్తమయే వాసనాశక్తి ఎక్కువగాగల స్త్రీలే పురుషునికి సామాన్యంగా ఇష్టులవుతారు. తాను వరించిన స్త్రీలో సాంఘికసేవాపరమైన శక్తి విజృంభించినట్లు ఎప్పుడైతే పురుషునికి వ్యక్తమవుతుందో, అప్పుడు ఈ రెండువ్యాపారాలు విడిపోయియుండే స్త్రీలతెగలు ఉండాలని పురుషుడు కోరతాడు. ఈ ఆశయము పురుషునిహృదయంలో ఉద్భవించడానికి కారణము కేవలము వాసనాప్రోత్సాహమే. ఆధునిక నాగరికతావిశేషము మాత్రము ఈపద్ధతిని అంగీకరించడము లేదు. భార్యాభర్తలమైత్రి పశుసాధారణమైన వాసనాతృప్తే కాదనిన్నీ, మనుష్యునికి అసాధారణమైన ఆత్మలమైత్రి అనిన్నీ ఆధునికాభిప్రాయము; ఇది క్రమముగా పెరుగుతూ ఉంది. కాబట్టే, శారీరకసంపద కలిగియున్నా, వాసనావ్యాపారాలకు బాగా అనుగుణమైయున్నా, కొందరు స్త్రీలు, కొందరు పురుషులకు తృప్తి నివ్వలేకున్నారు. ఆపురుషుల కోరికలప్రకారము భార్య మైత్రి ఆధ్యాత్మికమూ, విజ్ఞానపరమున్నూ అయియుండవలెను.

ఈ నాగరికప్రపంచములో ఈ లైంగికవాసన పూర్ణవికాసము పొందుటకు ఎన్నో విరోధా లుండడమువల్ల, ఈ వాసనాఫలితములు కొన్ని చాలా సూక్ష్మములై ఉంటున్నవి; ఎంత సూక్ష్మములో అంత బలము గలవై ఉన్నవి కూడా. ఏవిధమైన ఆటంకమూ, అభ్యంతరమూ లేకుండా ఈ వాసనేచ్ఛలు నెరవేరే మాట ఉంటే, ఆ వాసనాశక్తి గర్భీకృతమై లోలోపునే అల్లరి చేయకుండును; ఇతర శక్తులను తన స్వాధీనములోనికి తీసుకోకపోవును; వక్రగతుల ప్రవహించకపోవును. నాగరికప్రపంచములో ఆలాగు స్థితిగతులు ఉండకున్నవి; చాలావరకు గర్భీకృతము అవుతున్నది. గర్భీకృతము కాకుండా ఉన్న శక్తినే సన్మార్గాలలోనికి ప్రవహింపజేసే అవకాశములు ఉంటవి; ఈమార్పు సాధ్యము కావడమువల్లనే వ్యక్తిజీవితములోనూ, సాంఘికజీవితములోనూ ఎన్నో శ్లాఘనీయవ్యాపారాలు సాధ్యమవుతూ ఉన్నవి.

లైంగికవాసనా వికృతులు చాలా ఉన్నవి; వాటినన్నిటినీ వర్ణించుటకు ఇక్కడ స్థలము చాలదు. ఒకటి రెండింటిని మాత్రము సూచిస్తాను. ఈవాసనకు లక్ష్యము స్త్రీపురుషుల అన్యోన్యసంబంధము. ఒకస్త్రీ, ఒకపురుషుడూ ఏవిధంగానైనాసరే దగ్గరసంబంధము గలవారైనపుడు వారి భావాలలో కొద్దిగనో, ఎక్కువగనో ఈలైంగికవాసనాసంబంధమైన అసాధారణ భావము ఉంటున్నదని ఒకవాదము కలదు. ఆవాదమునకు నిదర్శనముగా తల్లీ కొడుకూ, తండ్రీ కూతురూ వీళ్ల మధ్యనుండే భావసంబంధానికిన్నీ, తల్లీ కూతురు, తండ్రీ కొడుకూ వీళ్ల మధ్యనుండే భావసంబంధానికిన్నీ గల వ్యత్యాసమును నిరూపిస్తుంటారు మొదటి కక్షలోని సంబంధులు భిన్నలింగములవారు కాబట్టి, వారిభావములలో లైంగికవాసనావిశేష భావము ఎంతోకొంత ఉండితీరునని వారి సమన్వయము. కాని సామాన్యంగా స్త్రీపురుషులమధ్య సంభవమయే శృంగారము వీరి మధ్యనుకూడా ఉన్నదని ఊహించడమైనా చాలా అవాచ్యముగా నాగరికులందరూ భావించడము కలదు కాబట్టి వారిలో ఆవాసనా విశేషము నిర్మూలమైనట్లు అణగిపోయిందని సమన్వయము చేస్తున్నారు. ఈసంబంధుల విషయమై ఖండించునంత తీవ్రముగా ఇతర సంబంధుల విషయమై ఈ లైంగికభావమును జనసామాన్యము ఖండించక పోయినా, నీతి దృష్టిలోమాత్రము వారిమధ్యను కూడా శృంగారోద్రేకము అవినీత మని నాగరికాభిప్రాయమై యున్నది. తల్లిదండ్రుల విషయమై మనుష్యజాతి అంతటిలోనూ— ఉత్కృష్టపశువులలోకూడా అని కొందరు అంటున్నారు— ఈ నిరోధము తీవ్రముగా ఉంటున్నది కాబట్టి, వారి విషయమై ఈ వాసనోద్రేకము పరిణామ చక్రము దిగువ చీడలోనే అణగిపోయినది. అట్లు మిగిలిన సంబంధుల మధ్య అణగిపోయియుండనందున, అనేకస్థలములలో శృంగారోద్రేకము కలుగుతూ ఉన్నది. వీరిసంబంధమై కావలసిన నిరోధముకొరకు నీతి, అంతరాత్మ మొదలైన ఉత్కృష్ట ధర్మాలు ఆవశ్యక మవుతూఉన్నవి లైంగిక వాంఛ హృదయంలో పుట్టినట్లు తన బుద్ధికే తెలియకూడ దన్నంత సన్నిహిత సంబంధుల స్థలములు కొద్దిగాను, తనకు ఇచ్ఛ కలిగినా నీతి అంతరాత్మ నాగరికతలు అంగీకరించవనే స్థలములు చాలా ఎక్కువగాను మానవసమాజములో ఉంటున్నవి. కాబట్టి ఏవిధాన్నో ఒకవిధాన్న ఈలైంగిక వాసనానిరోధము ఏమాత్రమూ లేనిమనుజుడు లేడని విమర్శకులు ధైర్యముతో చెప్పుతున్నారు. ఆ నిరోధమువల్ల ఏదో ఒక వైకల్యము మనస్సుకు కలుగుతూంది; ఏ మనోవైకల్యమూ లేని మనుజుడు ఈ నాగరికప్రపంచములో లేడు. చాలాచాలా వైకల్యములకు మూలహేతువు ఈ లైంగికవాసనా నిరోధమే అని కొందరు శోధకులు అభిప్రాయ పడుతున్నారు. కొందరిలో ఉండే వైకల్యము సూక్ష్మమై, అల్పమై యుండి, ఆఇచ్ఛాతృప్తికి తుల్యమైన తృప్తి వారికి అన్యథా కలుగుతూ ఉన్నందున, వారు కేవలము మనోరోగులని చెప్పవీలు లేకున్నది. అందుచేతనే కేవలము రోగులైనవారు మాత్రము తక్కువమందే ఉంటున్నారు.

మరొక వికృతి. సంభోగానుచిత వస్తువులపై సంభోగవాంఛను తీర్చుకొనుట. ఇది పిల్లలలో కానవస్తుంది. సహజమైనసంతుష్టికి సాధనములు లేనందున, పిల్లలలో ఈవాసన అసహజమార్గాలలో ప్రవర్తించి, కొన్నిచోట్ల వికారములకు పునాదు వేస్తుంది. కొంచెము పెరిగిన బాలురు, బాలికలు, ఒకేలింగమువారు తమలో తామే చేసుకొను చుంబనాలింగనములు ఈ వికృతిచిహ్నములు. ఆలాగే ఒకేలింగమువారు ఎదిగిన తరువాత తమలోతామే చేసుకొను శృంగారవ్యాపారాలు,సంభోగాది క్రియలు ఇందుకు నిదర్శనాలు. ఇంత స్పష్టముగా శారీరక వృత్తులలో వ్యక్తము కాకుండా ఉండి, గోప్యముగాను, అస్పష్టముగాను వ్యక్తమయేటట్లు ఈవికృతి ఉండడము చాలా తరుచు. ఈ అసహజమార్గాలలో లైంగికవాసనా శక్తిని అంతను వినియోగముచేసేవారికి సాధారణవృత్తులపై మరి ఇచ్ఛ ఉండదు; అట్టి ఇచ్ఛల తృప్తికొరకు వాసనాశక్తి ఏమీ మిగలదు. వారికి వివాహము రుచించదు. దీనికి సమమైన హేతువుచేతనే స్త్రీలలో ఎక్కువగా వివాహద్వేషము కనబడుతూ ఉంది. స్త్రీల వాసనానిర్మాణమునకు సాంఘికసేవ అత్తియుండుట వల్ల, ఆవిధాన తమశృంగారేచ్ఛలతృప్తిని పొందిపోతూ ఉండడమువల్ల ఇట్టి తృప్తి పురుషులలో అంత స్వాభావికము కాకపోవడమువల్ల, స్త్రీలలో ఎక్కువద్వేషము కనబడుతుంది. వాస్తవముగా సాంఘికసేవ కూడా అసహజవస్తుసామగ్రిలోనిదే కదా; కాని ఈమార్గమున తృప్తి పొందుటలో స్త్రీలకున్నూ, పురుషులకున్నూ భేదము ఉండుటచేత, ఇట్టి స్త్రీలవాసనా నిర్మాణము చెడకుండా ఉన్నట్లు పురుషులలో ఉండకుండా ఉన్నది. కాబట్టి సాంఘికసేవలో మునిగియుండిన స్త్రీలలో కొందరు కొన్నాళ్లు అయినతరువాత వివాహమార్గమును స్వీకరించగలరు. అట్టివారు అనేకు లున్నారు కూడా. ఇతరకారణములచేత వాసనానిర్మాణము వికృతిపొందితే వివాహము సంభవము కాదు. ఈ పద్ధతి పురుషులలో ఎక్కువ.

కుటుంబములో వ్యక్తమయే భావాలన్నీ ఈ లైంగికవాసనా వ్యక్తీకరణముపైనే ఆధారపడియున్నవి. ఆసంబంధాలలో ఉద్రేకించు సంరక్షణశీలము, అనురాగపూర్వకత్యాగము, స్వార్థరహితప్రేమ ఇవే అధర్మనాశకకోపము, ధర్మసంస్థాపనోత్సాహము, అనాథశరణశీలము, లోకహితము, పదార్థబుద్ధి మొదలైన సాంఘికభావాలుగా పరిణమిస్తున్నవి. అందుకే కుటుంబసంఘములకు సామ్యము చెప్పి, సర్వసాంఘిక బాధలకు ఔషధముగా కుటుంబసాహిత్యమును, సంఘకుటుంబ భావనయు కొందరు ఉపపాదిస్తున్నారు. ఇట్లు కొందరి మతములో సర్వప్రవృత్తికి మూలముగా వాసనలు చెప్పి ఆవాసనలలో కెల్ల లైంగికవాసనను ముఖ్యముగా చెపుతున్నారు. కాబట్టి ఈచర్చ ఇంతకంటె విపులముగా ఆవశ్యకమైనా, స్థలభీతిచే చేయలేను.

---

## ఒక నాఁడు

వెలువోలు సీతారామయ్య చౌదరిగారు

నవ్య సుమఫలశోభిత నందనమునఁ
చిలుఁగుగమి నవకిసలయములను మెక్కి
శ్రావ్యతరమైన కంఠస్వరంబు తోడ
సహజ మాధుర్యగానంబు సలుపు చుండెఁ;
గమ్మ తేనియ లాని ఝుంఝుమ్మటంచు
మత్తమధుపాళి స్వేచ్ఛాప్రవృత్తి గదుర
నిచ్చవచ్చిన పూల సేవించుచుండెఁ;
గుసుమ సౌరభ్యములఁ గొల్లఁగొని మలయ స
మీరముల్ చోరుల విధాన మెల్ల మెల్ల
సంచరించుచుఁ బ్రమద మొసంగు చుండె;
నాఁడు సెలవౌట బాలగణంబు గూడి
యధిక సమ్మదమున నాట లాడు చుండెఁ;
"ప్రకృతి" బహురమణీయమై పరఁగుచుండె;
సర్వ మానందమయమని చాటుచుండె;
నస్మదీయ హృదంతరాళంబునందుఁ
గూడ నానంద బీజముల్ గొనలు వారె!

అంత నుత్సాహసంభరితాత్ముఁడ నయి
ప్రణతిఁ జేసిన నిజభక్త గణము నెల్ల
స్వాత్మతుల్యులఁగాఁ జేయఁజాలు వాని
మేలిమి పసిండి నెనయు నెమ్మేనువాని
నమ్మహాత్ము బ్రహ్మస్వరూపావతారు
నాత్మఁ దలపోసి వందన మాచరించి
పాహిమాం, హే దయామయ, పాహి, పాహి
యనుచు వేఁడితి; ప్రకృతి నవ్యంపుఁ గాంతు
లీనె; నూతన భావోదయాన నేను
పరవశుఁడ నైతి; నేమని పల్కువాఁడ
నామహామహు దివ్యలీలల తెఱంగు!

నస్మదీయశూన్యపు హృదయానఁ బ్రణయ
మంకురించెఁ బ్రేమోన్మాది నైతి నేను,
ప్రేమతత్త్వంబు నరసి సంప్రీతుఁడ నయి
ప్రేమలో లీనమైతి, నెల్లెడల నాకుఁ
బ్రణయపుం దివ్య సుస్వరూపంబె కనులఁ
గట్టుచుంట బ్రహ్మానంద ముట్టిపడఁగ
వర్ణనాతీత ప్రేమానుభవము వడసి
మైమఱచినాఁడ—నంత—తన్మయుఁడ నైతి.
పరమపురుషుండు—గోపికా వల్లభుండె
గుఱుతు స్వలీలల నెఱపెనం చెంచినాఁడ.

---

# కీ. శే. శ్రీ పూగంటి అన్నపూర్ణాదేవిగారు

మం. పురుషోత్తమ శర్మ గారు

"మనుజుని జీవితంపు పరిమాణము నాయువుచేత గాక చే
సిన ఘనకార్య సంచయముచేత గణింపగ జెల్లు నెప్పుడున్."

ఈసుభాషితమును తమ దివ్యజీవనముచే సార్థక పరిచి ధన్యులయిన వారిలో శ్రీ అన్నపూర్ణాదేవి గౌరవ స్థానమును బడయుచున్నది. కొమ్మలచాటున ఎక్కడనో అదృశ్యముగా పెరిగి, వసంతవాయువులు వనవీథుల వీచి నంతనే అవ్యక్తకలస్వనము నెత్తి కీర్తించి, దేవమానవులను దిగ్భ్రమ నొందించి, మరల ఇంతలోనే కాలపరివర్తనముతో ఱెక్కలు విదర్చి మాయమయి యెగిరిపోయి వనమును శోభావిహీనముగా మార్చు కోకిలను అన్నపూర్ణాసతి జీవితము స్ఫురణకు తెచ్చుచున్నది. అబలగా బుట్టి, మూడుపదుల యేండ్లయిన సరిగా నిండక మునుపే దేశ స్వాతంత్ర్య సంపాదనకై సమర కుతూహలమున నడుము బిగించి, అలనాటి సత్యాదేవివలె రణరంగమున ప్రవేశించి వీరప్రతాపమును జూపిన అన్నపూర్ణ అసామాన్య మానవతి యనుట నిర్వివాదము. అన్నిటికన్నను మిన్నగ ఆమె యోధురాలు. బ్రిటిషుసింహముయొక్క మీసములను పట్టి యుయ్యాలలూగి సంగ్రామమధ్యమున వీరశయనమును చూరగొన్న ఝాన్సీలక్ష్మీబాయివలెనే ఈవీర నారియుఅసహాయశస్త్రధారిణియై బ్రిటీషుసింగమును కదన రంగమున ఎదుర్కొని ఆపోరాటమున తిన్న గాయముల నుండి మరి కోలుకోలేక తుదకు క్రమక్రమమున రక్త మాంసములు దొఱగి ప్రాణములనే కోల్పోయి భారత మాత కంఠము నలంకరించు వీరమణి హారమున ఒక యమూల్యమణియై వెలుగొందుచున్నది.

శ్రీమతి అన్నపూర్ణాదేవి 1900 సం.లో చాటపఱ్ఱు వాస్తవ్యులగు శ్రీ కలగర రామస్వామి చౌదరి, పిచ్చమ్మగార్లకు ఏకపుత్రికయై జన్మించెను. ఆడుపిల్ల పుట్టి నంతనే ఆపురుమని యేడ్చు తల్లిదండ్రులవలె గాక ఈ దంపతులు తమ కూర్మిపుత్రికను విద్యావతిగా జేసి స్త్రీజన్మ యెంత యుత్కృష్టమో వెల్లడించుటకు ఈశ్వరు డవకాశ మొసగెనని యానందించుచుండిరి. బాల్యమున పూర్ణకు బడియన్నను, చదువన్నను బెబ్బులిప్రాయము. అందుచే తల్లిదండ్రుల శిక్షణా నిర్బంధనల క్రింద చదువు మొదలయ్యెను. ఏలూరులో శిశుతరగతులు ముగిసిన పిమ్మట గుంటూరు నందలి మిషన్ బాలికాపాఠశాలకు పూర్ణాదేవి పంపబడెను. అక్కడ రెండేండ్లు విద్య నేర్చిన పిమ్మట మిత్రుల ప్రోత్సాహముపై కలకత్తా యందలి బ్రాహ్మ బాలికాపాఠశాలలో చదివించుటకు నిర్ణయింప బడెను. కాని రామస్వామిగారు భాగ్యవంతులు కారు. అందుచే ఆయన వ్యాపారమువల్ల నెల 1-కి రూ 10చొ॥న సంపాదించి యిచ్చుటకును, తల్లి శ్రీ పిచ్చమ్మగారు కుట్టుమిషనువల్ల నెల 1-కి రూ 5 చొ॥ గడియించి యిచ్చుటకును నిశ్చయించుకొనిరి. అట్లే 1911 లో అన్నపూర్ణ కలకత్తాలో బ్రాహ్మమత ప్రచారకు లగు హేమచంద్ర సర్కారుగారి యింటనుండి, బ్రాహ్మబాలికా పాఠశాలలో మొదటిఫారమునందు ప్రవేశించెను. అప్పటికి కలకత్తాలో ఆంధ్రవిద్యార్థు లెవ్వరును చదువుట లేదు. సర్కారుగారి యింటనే పెంపుడుకూతురు వలె పెరుగుచున్న శ్రీ శకుంతలమ్మ మాత్రమే అన్నపూర్ణకు తోడి తెలుగుబాలిక. ఈహేతువుచే ఆమెకు బంగాళీ భాష మాట్లాడుట, చదువుట నిర్బంధమయ్యెను. అక్కడ 5 వ ఫారము ముగించిన పిమ్మట ఆరోగ్యము చెడినందున ఇంటికి వచ్చివేసెను. తర్వాత చెన్నపురిలో ప్రైవేటుగా

చదివి స్కూలు ఫయినలు పరీక్షకు వెళ్లెను. తదుపరిని ఇంటికి వచ్చి పుస్తకరచనవల్ల ధనార్జనచేసి చదువు సాగింప గోరెను. 1917 లో సీతారామఅను గ్రంథమును వ్రాసెను. ఈపుస్తకము హైస్కూలు తరగతులకు పఠనీయముగా నేర్పాటుచేయబడెను. మరలఆరోగ్యము చెడినందుననామె 1919 లో మదనపల్లెకు గొనిపోబడెను. ఆ నివాసముచే శరీరము స్వస్థత నొందెను. పిమ్మట 1920 లో మహా వైభవముతో ఏలూరునందు మాగంటి బాపినీడుగారి కిచ్చి వివాహము జరిపిరి. ఈవివాహము సంఘసంస్కారపరుల కందరకు మార్గదర్శకముగా నుండెను. మంత్రము లన్నియు మాతృభాష యగు తెలుగునందు; పురోహితులు బ్రాహ్మణేతర ప్రముఖులగు కానూరి వెంకట చలపతయ్య చౌదరీగారు; ప్రేక్షకులు వంగబ్రాహ్మ ప్రముఖులగు శ్రీఉమేశచంద్ర విద్యారత్న మహాశయులు, శ్రీ ఆదిపూడి సోమనాధరావు మున్నగువారు. ప్రాచీనభారత స్వయంవరలక్ష్మి మరియొకమారుకన్నులపండువు చేసెను. వివాహానంతరము 1920 లో బాపినీడుగారు వ్యవసాయ శాస్త్రము చదివి దేశసేవ చేయవలెనన్న కోరికతో అమెరికాకు పయనమైరి. ఆ ముహూర్తమున అన్నపూర్ణాదేవి తనభర్తతో "మీరు నన్ను మరచినను మాతృదేశమును మరువబోకుడు" అని హెచ్చరించి పంపెను. తర్వాత ఆమెకూడ అమెరికాకు పోయి ఉన్నత విద్య నేర్చుకొన యత్నించెను. ఇందుకై రూ 1200 వెలగల ఉడుపులను ముందుగా కొని యుంచెను. ఓడ టిక్కెట్టుకై రూ 250 డిపాజిట్టు చేసెను. కానియింతలో మహాత్ముని అసహాయవాదదుందుభి మ్రోగెను. పుట్టినప్పటినుండియు దేశసేవకై పరితపించుచుండిన ఆమె ఆత్మ కిది ప్రత్యేకాహ్వానముగా వినవచ్చెను. చదువా, దేశ స్వాతంత్ర్యమా? యేది ముందు? ఈప్రశ్న స్వాతంత్ర్యేచ్ఛా ప్రజ్వలితమైన అన్నపూర్ణ హృదయమునుండి ప్రత్యుత్తరము బడయుటకు వ్యవధిని కోరలేదు. తక్షణమే ఆమె గాంధి నాయకత్వమున స్వరాజ్యసైన్యమున జేరెను. ఇంటినుండి వెలుపల నడుగుపెట్టనైన జాలని ఆసుకుమారగాత్రి గ్రామగ్రామములకును మహాత్ముని సందేశమును గొనిపోవుచు కాలినడకను ప్రచారము సలిపెను. ఖద్దరుమూటలను భుజముపై వేసుకొని వీథులవెంబడి విక్రయముచేసెను. నోరు తెరచి సరిగా మాట్లాడనైన నేర్వని ఆయువతి కేసరి వలె సభాపీఠములనుండి గర్జించెను. ఒకరికి పెట్టనేకాని అడుగ నెన్నడు నెరుగని ఆకోమలహస్తములు చాచి, "భవతి భిక్షాం దేహి" యని స్వరాజ్యభిక్ష యాచించెను. ఇంతలో ఆమె హృదయరాజ్యమును చూరగొన్న మహాత్ముని దివ్యమూర్తి గోచరించెను. అన్నపూర్ణ ఆయన పాద కమలములపై తన ఆభరణ సర్వస్వము, తుదకు వివాహాంగులీయకమును అర్పణము చేసెను. వైదేశికము లగు చీనిచీనాంబరములను-ఇది అతిశయోక్తి కాదు-విసర్జించి ముతుకఖద్దరు పట్టాలను స్వీకరించెను. అలనాడు నారచీరెలు చుట్టుకొన్న సీతమ్మ పవిత్రత్యాగమే మన అన్నపూర్ణయందు గోచరమయ్యెను. ఆమెకు విశ్వాసమును, ఆచరణయు ఎన్నడును వేరు కావు. గాంధి మహాత్ముని ఆరోగ్యమార్గమును చదివినంతనే ఫలహార నియమమును స్వీకరించెను. ఆర్మీనియాస్త్రీలకై తన రెండువేల రూపాయల వెలగల చీరలను మహాత్మునిద్వారా పంపి వేసెను. గాంధి ఆజ్ఞానుసారము,విదేశీయములగుటచే,ఒక్కొక్కటి రూ 500 విలువగల పెండ్లి చీరలకే నిప్పు ముట్టించెను. ఖద్దరునందలి విశ్వాసమును క్రియారూపముగా పరిణమింప జేయుటకై హాయిదరాబాదు, పాలకొల్లు, భీమవరం, ఏలూరు, గంపలగూడెం మున్నగుచోట్లరు 3000 వసూలు చేసి మోహన్‌దాసు పరిశ్రమాలయమును నెలకొల్పెను.

ఆమె మహోత్సాహముతో అహమ్మదాబాదా కాంగ్రెసుకు వెడలెను. తదుపరిని శాంతముగా అసహాయ ధర్మప్రచారమును గావించుచునే యుండెను. ఇంతలో 1923 లో ఆమె భర్తయయిన బాపినీడుగారు చదువు ముగించి హిందూదేశమునకు మరలి వచ్చిరి. ఓడ వద్దకు ఆమె స్వయముగా ఖద్దరు దుస్తులు కొనిపోయి విదేశపు సూటును, బూటును, హ్యాటును ఆసముద్రమందే కలిపి



కీ. శే. శ్రీమతి మాగంటి అన్నపూర్ణాదేవిగారు




చిత్రకారుడు : శ్రీ చామకూర సత్యనారాయణగారు, రాజమహేంద్రవరము.

వేయించి, పవిత్ర స్వదేశీదీక్షనిచ్చి ఆమోటు ఖద్దరుదుస్తులను ధరింపజేసెను. అహా! భర్తకు త్యాగదీక్ష నిచ్చు భారతరమణి తిరిగి ఉదయమయ్యెను. భార్యాభర్తలు చిరకాల సమావేశసౌఖ్యమును తనివితీర పొందకమునుపే, పాపము, అన్నపూర్ణాదేవి వ్యాధిగ్రస్తురాలయ్యెను. అందుకై వైద్యమునకై యీదంపతులు కలకత్తా వెళ్లిరి. 1923 లో ఆమెకు మగశిశువు కలిగి చనిపోయెను. మరల జబ్బు హెచ్చినందున వారు బెజవాడ, పక్షితీర్థమమున్న గుచోట్లకు ఆరోగ్యముకొరకు వెళ్లిరి. ఈకాలముననే ఆమె "నారి"యను స్వతంత్రగ్రంథరచనకు గడగెను. శ్రీరామకృష్ణ పరమహంస లీలామృతము 3 భాగములు వంగభాషనుండి తెనిగించెను. ఇంటికి మరలివచ్చి వీణాభ్యాసముకై కృషిసలిపెను. ఇంతలో ఆడశిశువును గాంచెను. కాని పాడురోగము మరల విజృంభించెను. ఎందరో ఘనవైద్యులైరి. ఎన్నియో దివ్య చికిత్సలు జరిగెను. కాని మృత్యువే కడకు జయించెను. ఆమె భౌతిక శరీరము శుష్కించి శుష్కించి కడకు ఈ పంచభూతములందును మరల చేరిపోయెను (౯-౧౦-౨౭). ఆమె దివ్యాత్మ పరంధామమున కెగసి ఆమెకు పరమప్రియుడైన పరమేశ్వరుని పాదసన్నిధిని వ్రాలెను.

['సత్యాగ్రహి' అనుబంధమునుండి]

# అన్నపూర్ణాదేవి ప్రశంస

శ్రీ శేషాద్రిరమణ కవులు

పెట్టెడుసొమ్ములన్ విడిచిపెట్టితి వున్నత దేశసేవకై
కట్టెడి జిల్గుపట్టములఁ గాలిచి దట్టపునేతబట్టలన్
గట్టుట నేర్చికొంటి, వతిగౌరవపాత్రుని బాపినేనిఁ జె
పట్టితి భర్తృధర్మమునఁ; బావన వన్నిట నీవు సోదరీ!

అసహాయ యోగరహస్యంబు విప్పి బోధించి దేశముఁ బ్రబోధించునపుడు
దాస్యమోహము మీకుఁ దగదంచు సోదరాంధ్రుల మోములం జూచి నుడువు
దేశీయసభల యాదేశంబు పల్లెలఁ బట్టణంబుల నొత్తి పలుకునపుడు [నపుడు
ముందంజ నిడి మాతృపూజకై బలి గాఁదలంచి దేశమునఁ జరించునపుడు
రుద్రదేవీముఖాంధ్ర వరూథినీ ని-రూఢ తేజంబు నీయందు రుచిర మయ్యె
అభ్యుదయసూచకంబునీయ మృతవాణి-ప్రాఁబడియెనొక్కొ అన్నపూర్ణాకుమారి!

తీయనిమాటపొందికను దేటగఁ గూరిచి తెల్గుబాసలో
వ్రాయఁగ నేర్చి తీవు రసవంతముగా నవలల్ ప్రబంధముల్
కాయము మాతృపూజకు నగల్ వలువల్ నిజదేశసేవకే
రీయఁగ నేర్తు భక్తి నెలయించి మనంబున సోదరీమణీ!

పతి, చింతాపరితప్తుఁడై పోగిలె, నీబంధుప్రతానంబు హ్రా
గ్గతశోకంబున నిల్వునీరగుచు సంతాపించుచుండెన్, మహో
న్నతుఁడౌ గాంధి మహాత్ముఁడున్ వగచె; నన్యాయంబుగా మృత్యుసం
గతి నీకేల ఘటిల్లెనోకద వయఃకాలంబునన్ సోదరీ!

పత్రికలెల్ల నీస్మృతికి వందురె; భారతమాతగూడ మే
ల్పుత్రిక పోయె నంచు వగఁ బొందుచు నున్నది యుష్మదీయపా
గాత్రము నాశనం బయినఁ గాని భవద్రుచిరప్రబోధపూ
ర్ణాత్రము లాంధ్రదేశమునఁ జూపుతఁ దేజము సోదరీమణీ!

## పెమ్మరాజు లక్ష్మీపతి గారు

ఏమి యీ యస్తమయకాల మీ యకాల-సంధ్య, దుఃఖజలార్ద్రి కషాయవస్త్ర
మకటయీ యాంధ్ర దేశ మాద్యంతములకు-నారఁ గట్టంగఁ జేసిరెవ్వారో నేఁడు!

అల్లారు ముద్దుగా నాంధ్రదేవీమణి యర్మిలిఁ బెంచిన యాఁడు పడుచు!
అఖిలలోక స్తుత్యుడైన గంధీమహాత్ముం డాత్మ మెచ్చు పెంపుడు కుమార్తె!
మహితవిజ్ఞాని యా నాగంటిబాపి నీ డాహ్వాయునకును నర్ధాంగలక్ష్మి!
చటుల స్వార్థత్యాగపుటపాకముల వన్నెఁ దేరిన యట్టి బంగారు తునుక!
సకలవిద్యావిశారద, సర్వధర్మ-సంప్రవర్తకశీల యోషాలలామ [యయ్యొ!
యాంధ్రలోకంబు నెల్ల దుఃఖాబ్ధి ముంచి-అన్నపూర్ణమ్మ శాంతిమయాత్మ

ఎగిరిపోయెనె దేశమెల్ల వక్తృత్వ గానామృతంబున ముంచినట్టిపికము?
రాలిపోయెనె యాంధ్రరాష్ట్రంబు సౌందర్యలహరిఁ దేలిచిన గులాబిపూవు!

ఐక్యమందెనె హా! మహాసమాధిం జెంది నిష్ఠమై నలయోగినీవతంస!
మొరగెనే నేలకు నుగ్రసుందరశాంత రణకేళినిపుణ శౌర్యాంచితాంగి!

అస్తమించెనె భువియు విహాయసంబు-లాలితానంద జ్యోత్స్నదుకూలకాంతి
నిండ గప్పిన నవచంద్రమండలంబు-అఖిలకల్యాణ గుణపూర్ణ యన్నపూర్ణ!

అంతములేని దుర్భరపరాశ్రయ దాస్యవిమోహ భీకర
ధ్వాంత మహావినీలిమ విదారణకారణ సుప్రభన్ సమా
క్రాంత నభోదిశాంతవివరంబుగ పొంగి మహాంధ్రసీమ నా
ద్యంతము వెల్లి దేల్చిన సుధాబ్ధితరంగమ, యంతరించితే!

ఉపవాసవ్రతసంయుతంబగు మహాయోగంబుఁ గల్పించి య
గ్నిపరీక్షన్ ఘటియించె గంధి తనువేరిన్ లెక్క సేయంగఁబో

ని పటుధ్యాననిరూఢిఁ బొల్చితివి పో! నీ కేది లో టింక, నా
జపమందుల్ భవదీయ దేహ మొక పూజాపుష్పమై పోయెనో!

పోయెను బోయె నంచుఁ బలుపోకల నీమృతి కెల్లవారు వా
పోయెద రేలతల్లి! పడిపోవదె పంజర మెప్పుడైన, "నా
పోయిన త్రోవఁ బోవఁ దలపోయుఁ"డటంచు రచించి, జీవితా
ధ్యాయముఁ బూర్తిఁజేసి పరమార్థముఁ గంటివిగాదె సోదరీ!

ఆదివి సంచరించు దివిజాంగనవీవు తదీయఛాయయే
మేదిని నన్నపూర్ణయన మించి వెలింగె, విమర్శనంబు సొం
పేది తలంపమైతి మిటు లింతయు, నీడయు వెంట నంటఁగా
సోదరి! చేరుకొంటివె విశుద్ధహిరణ్మయకాంతి ధామముల్?

అసమరణక్రియానిపుణులై విలసిల్లెడు కమ్మవారి యిం
ట సకలవీరలోకమకుటం బన జన్మము నంది, శాంతధ
ర్మసమర కేళి నిల్చి యసమాన యశంబుఁ గడించుకొన్న నీ
యసదృశపుణ్యవైభవ మయారె నుతింపఁ దరంబె సోదరీ!

వినుటే కాని త్వదీయరూపరమనే వీక్షింపఁగా లేద;పో
యెనుగా! లోకముదాఁటి; జన్మమున కింతే! యింకఁ గన్పట్ట; దే
మనుకొన్నల్ ఫలమేమియో చెలియలా మైనం గనుంగొందు, నే
మ్మనమందుల్ భవదీయకాంతిమయ రమ్యాకార మింపారగల్.

లేదు బ్రాహ్మణా బ్రాహ్మణభేద మింత-లేదు హైందవ యవనవిభేదమైన
నీమృత శరీర మొకటఁ గన్నీటఁ దడిపి-చేసి రభిషేక మొనర నశేషజనులు.

జీవకళ నూడ్చు నప్పరభావ దాస్య-హేయ దారిద్ర్యమెల్ల మాయించి చేతి
నిండఁబెట్టితి స్వాతంత్ర్య నిరతి మాకుఁ-బూర్ణహా భిక్ష! నోయన్న పూర్ణతల్లి!

స్వస్తి, శాంతింపు ఓమ్ః శాంతి శాంతి శాంతి!

---

పతి, చింతాపరితప్తుండై పొగిలె, నీబంధుప్రతానంబు హ్రా
గ్గతశోకంబున నిల్వనీరగుచు సంతాపించుచుండెన్, మహో
న్నతుండౌ గాంధి మహాత్ముండున్ వగచె; నన్యాయంబుగా మృత్యుసం
గతి నీకేల ఘటిల్లెనో కద వయఃకాలంబునన్ సోదరీ!

పత్రికలెల్ల నీమృతికి వందురె; భారతమాతగూడ మే
ల్పుత్త్రిక పోయె నంచు వగఁ బొందుచు నున్నది యుష్మదీయమా
గాత్రము నాశనం బయినఁ గాని భవద్రుచిరప్రబోధపున్
సూత్రము లాంధ్రదేశమునఁ జూపుతఁ దేజము సోదరీమణీ!

## పెమ్మరాజు లక్ష్మీపతి గారు

ఏమి యీ యస్తమయకాల మీ యకాల-సంధ్య, దుఃఖజలార్ద్రి కషాయవస్త్ర
మకటయీ యాంధ్ర దేశ మాద్యంతములకు-వారఁ గట్టంగఁ జేసి రెవ్వారొ నేఁడు!

అల్లారు ముద్దుగా నాంధ్రదేవీమణి యర్మిలిఁ బెంచిన యాఁడు పడుచు!
అఖిలలోక స్తుత్యుడైన గంధీమహాత్ముం డాత్మ మెచ్చు పెంపుడు కుమార్తె!
మహితవిజ్ఞాని యా మాగంటిబాపి నీడాహ్వాయునకును నర్ధాంగలక్ష్మి!
చటుల స్వార్థత్యాగపుటపాకముల వన్నెఁ దేరిన యట్టి బంగారు తునుక!
సకలవిద్యావిశారద, సర్వధర్మ-సంప్రవర్తకశీల యోషాలలామ [యయ్యో!
యాంధ్రలోకంబు నెల్ల దుఃఖాబ్ధి ముంచి-అన్నపూర్ణమ్మ శాంతిమయాత్మ

ఎగిరిపోయెనె దేశమెల్ల వక్తృత్వ గానామృతంబున ముంచినట్టిపికము?
రాలిపోయెనె యాంధ్రరాష్ట్రంబు సౌందర్యలహరిఁ దేలిచిన గులాబిపువ్వు?

ఐక్యమందెనె హా! మహాసమాధిం జెంది నిష్ఠమై నలయోగినీవతంస!
మొరగెనే నేలకు నగ్రసుందర శాంత రణకేళినిపుణ శౌర్యాంచితాంగి!

అస్తమించెనె భువియు విహాయసంబు-లాలితానంద జ్యోత్స్నాదుకూలకాంతి
నిండ గప్పిన నవచంద్రమండలంబు-అఖిలకల్యాణ గుణపూర్ణ యన్నపూర్ణ!

అంతములేని దుర్భరపరాశ్రయ దాస్యవిమోహ భీకర
ధ్వాంత మహావినీలిమ విదారణకారణ సుప్రభన్ సమా
క్రాంత నభోదిశాంతవివరంబుగ పొంగి మహాంధ్రసీమ నా
ద్యంతము వెల్లి దేల్చిన సుధాబ్ధితరంగమ, యంతరించితే!

ఉపవాసవ్రతసంయుతంబగు మహాయోగంబుఁ గల్పించి య
గ్నిపరీక్షన్ ఘటియించె గంధి తనువేర్నిన్ లెక్క సేయంగఁబో

ని పటుధ్యాననిరూఢిఁ బొల్చితివి పో! నీ కేది లో టింక, నా
జపమందున్ భవదీయ దేహ మొక పూజాపుష్పమై పోయెనో!

పోయెను బోయె నంచుఁ బలుపోకల నీమృతి కెల్లవారు వా
పోయెద రేలతల్లి! పడిపోవదె పంజర మెప్పుడైన, "నా
పోయిన త్రోవఁ బోవఁ దలపోయుఁ"డటంచు రచించి, జీవితా
ధ్యాయముఁ బూర్తిఁ జేసి పరమార్థముఁ గంటివిగాదె సోదరీ!

ఆదివి సంచరించు దివిజాంగనవీవు తదీయఛాయయే
మేదిని నన్నపూర్ణయన మించి వెలింగె, విమర్శనంబు సొం
పేది తలంపమైతి మిటు లింతయు, నీపయు వెంట నంటఁగా
సోదరి! చేరుకొంటివె విశుద్ధహిరణ్మయకాంతి ధామమున్?

అసమరణక్రియానిపుణులై విలసిల్లెడు కమ్మవారి యిం
ట సకలవీరలోకమకుటం బన జన్మము నంది, శాంతధ
ర్మసమరకేళి నిల్చి యసమాన యశంబుఁ గడించుకొన్న నీ
యసదృశపుణ్యవైభవ మయారె నుతింపఁ దరంబె సోదరీ!

వినుటే కాని త్వదీయరూపరమ నే వీక్షింపఁగా లేద;పో
యెనుగా! లోకముదాఁటి; జన్మమున కింతే! యింకఁ గన్పట్ట; దే
మనుకొన్నన్ ఫలమేమియో చెలియబా మైనం గనుంగొందు, నే
మ్మనమందున్ భవదీయకాంతిమయ రమ్యాకార మింపారఁగన్.

లేదు బ్రాహ్మణా బ్రాహ్మణభేద మింత - లేదు హైందవ యవనవిభేదమైన
నీమృత శరీర మొకటఁ గన్నీటఁ దడిపి - చేసి రభిషేక మొనర నశేషజనులు.

జీవకళ నూడ్చు నప్పరభావ దాస్య - హేయ దారిద్ర్యమెల్ల మాయించి చేతి
నిండఁ బెట్టితి స్వాతంత్ర్య నిరతి మాకుఁ - బూర్ణహా భిక్ష! నోయన్న పూర్ణతల్లి!

స్వస్తి, శాంతింపు ఓమ్ శాంతి శాంతి శాంతి!

---

# కవిత్వము: చిత్ర లేఖనము

కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు

మనదేశ విద్వాంసులు కవిత్వమును, చిత్రలేఖనమును జతుష్షష్టి కళలలోఁ జేర్చి యున్నారు. పాశ్చాత్య విద్వాంసులును వీనిని గళలనుగా భావించుటయేకాక యాకళలలో నురల విభాగములు చేసి వీనిని లలితకళలఁగా నెంచిరి. ఇంతయేల? నాగరకతగల ప్రజలెల్లరును వీనిని సోదరకళలనుగా భావించుచున్నారు. ఈరెండింటియందును సాదృశ్యము హెచ్చుగఁ గాన్పించుచున్నది. కర్త వర్ణముల నాధారముగాఁ దీసికొని కలము చేతఁబూని తన యూహల నొకచోఁ జిత్రించుటచే నీరెండును బుట్టుచున్నవి. ఉభయమును నేర్పుగల కర్తలచేఁ జిత్రింపఁబడిన రసికజనాహ్లాదమును గూర్చునవిగా నున్నవి. ఉభయమును గంటి యెదుటలేని వస్తువులఁ జక్కఁగఁ జిత్రించి యెదుట నున్నట్లే తోఁపఁజేయఁగల శక్తికలనై యున్నవి. పూర్వచరిత్రాదులు రెండిటివలనను గూడ లోకమునకు విశదీకరింపఁబడుచున్నవి. రామచారిత్రము రామాయణమువలన బోధపడునట్లే దేవాలయ కుడ్యములపైఁ జిత్రింపఁబడియుండు రామాదిచిత్రములు రామకథను జదువుకొనినవారికిని, జదువుకొననివారికిని గూడ విస్పష్టము చేయుచున్నవి. కవిత్వమునం దెన్ని చమత్కృతులు గలవో చిత్రలేఖనమునందును నన్ని చమత్కృతులు గలవు. చిత్రకవిత్వమని, భావకవిత్వమని కవిత్వము రెండు విధముల నుండును. చిత్ర చిత్రములని, భావచిత్రములని చిత్రలేఖనముంగూడ రెండు విధముల నుండును, చదువరుల వినోదార్థమయి వాని నిచట సంగ్రహముగా వ్యక్తపఱుచుచున్నాఁడను.

## అనులోమవిలోమ చిత్రరచనము

కవిత్వమునందు అనులోమవిలోమ కావ్యములు కలవు. అనఁగా, పద్యమును రెండుపెడలనుండియుఁ జదువవచ్చును. ఒకపెడనుండి చదివిన నొక యర్థమును, మఱియొక పెడనుండి చదివిన మఱియొక యర్థమును నొక్కపద్యమే యిచ్చుట కలదు. ఇట్టిచిత్రపద్యము లర్థగౌరవముకల కిరాతార్జునీయాదుల యందును గలవు. కిరాతార్జునీయమునుండి యొక యుదాహరణము నిచ్చుచున్నాఁడను.

### ప్రతిలోమానులోమ శ్లోకము

"నిశితాసిరతోఽభీకో న్యేజతే మరణారుచా,
సారతో నవిరోధీనః స్వాభాసో భరవానుత."

(అనులోమపాఠము)

### భావము

ఓమరణము లేనివారలారా! నిశితఖడ్గరతుఁడును, భీతిలేనివాఁడును తేజస్సుతో గూడినవాఁడును, సుందరుఁడును, అత్యంతమురణభరము సహించువాఁడును నగు మన శత్రువు బలమునుండి చలింపఁడు. (కావున మీరుకూడ స్థిరులుగా నుండవలయు ననిభావము.)

"తనువారభసో భాస్వానధీరోఽవినతోరసా,
చారుణా రమతే జన్యే కోఽభీతో రసితాశిని."

(ప్రతిలోమపాఠము)

### భావము

కవచముతోఁ దేజరిల్లువాఁడును, భాస్వంతుఁడును, సుందరమైన ఉన్నతమగు వక్షముతోఁ గూడినవాఁడును నైనను అధీరుఁడై, ప్రాణుల మ్రింగునట్టి యుద్ధమునందు భయములేనివాఁడై యెవఁడు క్రీడించును? అని భావము.

ఒకశ్లోకమే యీరీతి ననులోమముగా జదివినపు డొక భావమును, ప్రతిలోమముగాఁ జదివినపుడు మఱియొక భావమును గలిగియున్నది. ఇట్టి శ్లోకము లనేకములు గలవు శ్లోకము లనేల, గ్రంథములే కలవు. రామకృష్ణవిలోమకావ్యము, సంస్కృత హరిశ్చంద్ర నలోపాఖ్యానము నిందుల కుదాహరణములు. రామకృష్ణవిలోమకావ్యమునందలి శ్లోకములు ఒకపెడనుండి చదివినరామార్థమును, మఱియొకపెడనుండి చదివిన కృష్ణార్థమును నిచ్చుచుండును. అట్లే హరిశ్చంద్ర నలోపాఖ్యానమునందలి శ్లోకములును నొక పెడనుండి చదివిన హరిశ్చంద్రార్థమును, మఱియొక పెడనుండి చదివిన నలార్థమును నిచ్చుచుండును. ఇట్టి చిత్రరచనము చిత్రలేఖన కళయందును గలదు. ప్రౌఢులగు చిత్రలేఖకు లొకపెడనుండి చూచిన యొకరూపమును, నింక నొక పెడనుండి చూచిన మఱియొక రూపమును పొడకట్టురీతిగా నొక చిత్రమునే చిత్రించి, నాగరకులు ప్రచురించు పత్రికలందు వానిని బ్రకటించుటయుఁ, బ్రాజ్ఞులగువారు వానిం గని యానందించుటయుఁ గలుగుచున్నది. చదువరుల యుపయోగార్థమై యట్టి చిత్రపటముల నొక రెండిటి నీక్రింద నిచ్చుచున్నాఁడను.

ఇవి పురుష శిరస్సులు, ఒకవైపునుండి చూచిన బాలుర శిరస్సులుగను, మఱియొకవైపునుండి చూచిన వృద్ధుల శిరస్సులుగను నుం



### గర్భప్రథమకందము

క. శ్రీనరిష్ఠం బావన
జీవు స్థిరభృగుతనయుని సిరి గలుగుటకై
భావింతున్ సంభావిత
భావుం బ్రబలిమగసముదిత బహుతనుమహితున్.

### గర్భద్వితీయకందము

క. దేవేంద్రాదిప్రస్తుత
దేవున్ దలితనయతుహినదినకర కిరణున్
ధీవిద్యాద్యోతున్ నను
దేవున్ ధృతిమదగుణయుతు నృణీతవిదురదున్.

ఇట్టి గర్భచిత్రములు చిత్రలేఖనమునందును కలవు. ఈ క్రిందిచిత్రపటము దానిని సువ్యక్తముచేయునదిగానున్నది. ఈయది మొత్తముమీద నొక గజరూపముగా నున్నది. ఈ

...మును. ఇట్టిచిత్రపటములనేకములు గలవు. కుడిప్రక్కనుండి చూచిన యొకరూపమును, నెడమప్రక్కనుండిచూచిన వేఱొకరూపమును సూచించు ప్రతిమలుకూడఁ గలవు.

### గర్భచిత్రరచనము

ఒక పెద్దపద్యములో మఱికొన్ని చిన్న పద్యము లిమిడి యుండునట్లు రచించునది గర్భకవిత్వ మనిపించుకొనును. ఇందనేకవిధములు కలవు. చదువరుల యుపయోగార్థమై యప్రకటితమునుండి యొకచిన్న యుదాహరణము నిచ్చుచున్నాను. ఈ క్రిందినది కందద్వయగర్భ సరసిజ వృత్తమై యున్నది—

"శ్రీనరిష్ఠం బావన జీవు స్థిరభృగుతనయుని సిరిగలుగుటకై, భావింతున్ సంభావితభావుం బ్రబలిమగ సముదితబహుతను మహితున్, దేవేంద్రాది ప్రస్తుతదేవున్ ధృతితనయ తుహిన దినకర కిరణున్, ధీవిద్యాద్యోతున్ నను దేవున్ ధృతిమదగుణయుతునృణీతవిదురదున్."

ఇది యొకసరసిజవృత్తము. ఈవృత్తగర్భమున రెండుకందపద్యము లిమిడియున్నవి. చదువరుల యుపయోగార్థమై వాని నీక్రింద వివరించుచున్నాను.



ఈ గర్భస్త్రీకృత చిత్రపటము ఆంధ్రదేశ ప్రసిద్ధినందిన భారతిసంచికలోఁ బ్రచురింపఁబడియున్నది.

రూపము గర్భమందున్న స్త్రీప్రతిమల మూలముగాఁ గలిగినది. గర్భమందున్న స్త్రీలయాకృతులే మొత్తముమీఁద గజరూపమును గలిగించినవి. గర్భకవిత్వము వలెనే గర్భచిత్రలేఖనమును ప్రాజ్ఞులెల్లరును గని యానందించుచున్నారు.

## బంధచిత్రరచనము

చిత్రకవిత్వములో బంధకవిత్వ మనునది యొకటి కలదు. ఈయది చిత్రలేఖనమునకును, కవిత్వమునకును గల సంబంధమును దన సంబంధము చేతనే వ్యక్తపఱచునదిగా నున్నది. ఈకవిత్వము చెప్పు కవి చిత్రలేఖనమునందుఁ గూడఁ గొంత ప్రజ్ఞకలవాఁడైయుండవలెను. చిత్రపటమునందే కవితాచమత్కృతి యొప్పుచుండిన, ననఁగా, చిత్రమునందు చమత్కారముగాఁ బద్యము లిఖింపఁబడి యుండిన, నయ్యది బంధకవిత్వ మనఁబడును. దీని యుదాహరణ మిచ్చుటకై కవిత్వమును వేఱుగను, చిత్రలేఖనమును వేఱుగను జూపుటకు వలను పడదు. రెండును గలసియేయుండును.

అప్పకవీయమునుండి యొసఁగఁబడిన యీక్రింది కుండలినాగబంధము విషయము నంతను సువ్యక్తము చేయఁగలదు. చదువరులకొఱకై పద్యమునుగూడ నిచ్చితి.



చ. ద్యుతిధర దేవకీతనయ తోయభవస్తుత భూరమేశ సం
మిత గణసారభూతి దయమేయ బృహజ్జన పూరుషానసా
జిత నరకా పురా తనయజేయ సువిష్కర భారవాహ శా
శ్వత పురుహూతపీతదవపావక శేషపురాణకోవిదా.

## శ్లేషరచనము

శ్లేష కవిత్వమునందును, చిత్రలేఖనమునందును గూడఁ గలదు. రసికులగు కవులవలెనే రసికులగు చిత్రలేఖకులును శ్లేషరచనమునకై కడఁగుచుందురు.

## కవిత్వశ్లేష

ఒకపద్యమునందే యర్థభేదమువలన విషయభేదవర్ణనము గావించుచో నయ్యది శ్లేషకవిత్వ మగును. ఒక యుదాహరణము నిచ్చెదను. రాఘవపాండవీయమునందలి యీక్రింది పద్యముచే నయోధ్యాపురవర్ణనమును, హస్తిపురవర్ణనమును గూడ గావింపఁబడి యున్నవి.—

అ. వెలయు నఖిలభువనములలో నవారణ-నగరిపురమతల్లి నాఁ దనర్చు
రాజ్యలక్ష్మి మిగులఁ బ్రబలనయోధ్యనా..రాజవినుతిగనినరాజధాని.

ఈపద్య మొకవిధముగఁ బదచ్ఛేదమును జేసికొనిన నయోధ్యాపురవర్ణన మగుచున్నది; ఇఁక నొకవిధముగఁ బదవిభాగము కావించుకొనిన హస్తిపురవర్ణన మగుచున్నది. వారణనగరివర్ణనములో నయోధ్య యనునది యుద్ధము చేయుటకు శక్యము కానిది యను నర్థము నిచ్చునది యగుచున్నది. అయోధ్యావర్ణనములో "అఖిలభువనములలోన, వారణనగరి, పురమతల్లి" అనునది "అఖిలభువనములలోన్, అవారణనగరి పు, రమతల్లి" యగుచున్నది. కవిత్వములో నిట్టి శ్లేష చమత్కారములనేకములు గలవు. ఒక పద్యమందే సంబంధ మించుకయును లేని భిన్నవిషయ వర్ణనములు కూడ నుండును.

చిత్రలేఖనమునందుఁగూడ శ్లేషరచనము గలదు. ఒకచిత్రముచేతనే యనేక పదార్థములు వ్యక్తము చేయఁబడుచో నయ్యది చిత్రలేఖనమందు శ్లేషయగును. ఈక్రిందిపట మట్టిశ్లేషను తెలుపునదిగనున్నది.



ఈ చిత్రపటమొక్కండే యాంగ్లదీవుల యాకృతిని, ద్విచక్రిపైఁ జుట్ట గాల్చుచుఁ గూర్చుండియున్న యొకపాశ్చాత్యుని యాకృతిని గూడ సూచించుచున్నది. కావున నీయది శ్లేషచిత్రలేఖన మగుచున్నది. ప్రౌఢులగు చిత్రలేఖకు లిట్టి శ్లేషచిత్రముల వ్రాయుటయు, వానిం గని రసికు లానందించుటయును గూడఁ గలవు. పై చిత్రపట మొక యాంగ్లేయప్రకటన పత్రికనుండి గ్రహింపఁబడినది. ఇట్టి శ్లేష చిత్ర రచన మాంగ్లేయులందే కాక మనయందును గలదు. మనవారు భారత దేశము నొక స్త్రీగను, సింహళద్వీప మొక తామర మొగ్గగను గాన్పించునట్లు చిత్రించుచున్నారు. ఇట్టి శ్లేషలం గని మన రసికులెల్లరు నానందించుచున్నారు.

వస్తువర్ణనము చేయుటలోఁ గవి చూపినంత నేర్పు నెంతటి చిత్రలేఖకుఁడైనను జూపలేకున్నాఁడు. రామరాజభూషణుఁ డీక్రింది పద్యములో నదిని స్త్రీగ వర్ణించుటలోఁ బరిపూర్ణమగు జయము నొందినాఁడు.—

ఉ. "వేణి చలింపఁ గంపితనవీనమృణాళ భుజాగ్రకంకణ
శ్రేణి నటింప లోలశఫరీ నిబిరీ సకటాక్షకాంతి వి
న్నాణము చూప హంసక గణక్వణనంబులు మీఱ సైకత
శ్రోణి వివర్తితాబ్జముఖశోభిత యై కడు సంభ్రమించినన్."

నదీపరముగ నర్థము చెప్పవలసివచ్చినప్పు డీ పద్యమునందలి పదములన్నియుఁ దత్పరముగు భావమునిచ్చుచున్నవి. "వేణి చలింపన్" అనఁగ "ప్రవాహము చలింపగ" నని యర్థము ఇట్లే యన్నియుఁ జూచుకొనవలెను. స్త్రీపరముగ నర్థముఁ జెప్పునపుడును ఇందలి పదములన్నియు స్త్రీపరముగు భావమునే చెప్పుచున్నవి. "వేణి చలింపన్" అనఁగ "జడ కదలఁగ" నని భావము. ఇట్లే తక్కినవి చూచుకొనవలెను. నదీపరముగ నర్థమును జెప్పునపుడు సరిగనదిని నంతటను వర్ణించుచున్నట్లే తోఁచును. స్త్రీపరముగ నర్థమును చెప్పునప్పుడు సరిగ స్త్రీవర్ణనము చేయుచున్నట్లే మొదటి నుండి తుదివఱకును దోఁచును.

ఇఁకఁ జిత్రలేఖకుల నేర్పుంగూర్చి ముచ్చటించుకొందము. ఈకళయందుఁ బ్రఖ్యాతి వహించిన రవివర్మ గంగావతరణమును జిత్రించినాఁడు. ఇందు గంగానదిని స్త్రీగఁ జిత్రింప నెంచి లేఖనమును గావించె. కాని వర్ణముల నాధారముచేసికొని యుత్తంత చేసిన రచనములో నదిలో వేఱుగ నొకస్త్రీ యున్నట్లు కాన్పించుచున్నది. కాని నదిగా భావించునపుడు మొత్తమంతయు నదిగను, స్త్రీగా భావించునపుడు మొత్తమంతయు స్త్రీగను గాన్పించుటలేదు. కాన చిత్రలేఖకుఁడు నదిని స్త్రీగ వర్ణించుటలో నెగ్గలేకపోయినాఁడు. ఈ క్రింది గంగావతరణ చిత్రముంబట్టి చదువరులకు విషయము బోధపడఁగలదు.



కొందఱు చిత్రకవిత్వమును తృణీకరింతురు. అది సరసమగు పనికాదు. సరసమగు భావకవిత్వమంత మనోహరముగా నుండకుండినను జిత్రకవిత్వమును రసికజన హృదయాహ్లాదము నొనరించుచునే యుండును. కావుననే చిత్రలేఖనకళయందుఁగూడ నిది వెలయుచున్నది. ఇదియుఁ గళయే. కళలలోఁ జేర్పఁదగిన చిత్రరచనముం గూర్చి కొంత ముచ్చటించుకొనినాము గావున నిఁక భావరచనముం గూర్చి యించుక ముచ్చటించు కొందము.

## భావరచనము

కవిత్వములో భావప్రధానమగు కవిత్వము చాల ఘనమైనది. చిత్రలేఖనమునందుఁ గూడ భావ వ్యక్తీకరణ మొనర్చు చిత్రరచనములు చాల మెచ్చు కొనఁదగినవై యుండును. ఉభయమునందును భావ వ్యక్తీకరణ మొనరించు నుత్తమరచనములు బహువిధముల నుండును. వాని కన్నింటికిని నుదాహరణముల

నీ చిన్నివ్యాసమున నిచ్చుట దుర్ఘటము. వీనింగూర్చి ప్రత్యేకవ్యాసముండఁదగినది. కాన దిక్ప్రదర్శకముగా నొక యుదాహరణమును మాత్ర మిచట నిచ్చెదను. ఈక్రింది చిత్రపటమును, పద్యమును భస్మీభూతుఁడైన పతిం గని రతీదేవి దుఃఖించునవస్థను సువ్యక్తము చేయుచున్నవి. ఈ రెండు రచనములును గూడ చేతనచేష్టావిశేషముల వ్యక్తపఱచునవియై, హృదయభావ బోధకములై యున్నవి. కావున నిట్టి భావరచనముల మించు ర చనములు లోకములో వేఱొండు లేవు.

ము మూఁగవాఁడు చేయు భావవ్యక్తీకరణమువలె నుండును. కవిత్వము చేయు భావవ్యక్తీకరణ మన్ననో, వాగ్మియగువాఁడు చేయు భావవ్యక్తీకరణమువలె మనోహరమై శోభించును. కావునఁ గవిత్వమును మించిన కళ లోకములో లేదు. కాని కవిత్వము నేత్రపర్వం బొనర్చుటకై చిత్రలేఖనమును, శ్రోత్రపర్వం బొనర్చుటకై సంగీతమును సాయమునఁదీసికొనిన లోకాతీతమహిమచేఁ జెన్నారును. మూఁడుకళలు నేకీభవించిన బ్రహ్మానందరస ముట్టిపడును. ఇట్టి కళావిశేషములు



రతి విలాపము

పరవశయై పడి రతి సెచ్చెరఁ దప్పిఁదీ లేచి చూచి శిఖిపాడవు నిజే
శ్వరు పాడవుఁ గాన కచ్చటఁ.. బురుషాకృతి నున్న భస్మపుంజముఁ గాంచెన్.

—నన్నెచోడుని కుమారసంభవము.

భావవ్యక్తీకరణము చేయుటలోఁ గవిత్వమున కున్నంత యవకాశము చిత్రలేఖనమునకు లేదు. చిత్రలేఖనము చేయు భావవ్యక్తీకరణ

మన భారతవర్షంబునఁ బరిపూర్ణాభివృద్ధి నందుటకై పరమేశ్వరు డనుగ్రహించుగాక!

# కీ. శే. దీ. బ. డాక్టరు శ్రీకిళాంబి రామానుజాచార్యస్మృతి

విద్వాన్ దూసి రామమూర్తి శాస్త్రి గారు



కీ. శే.

సంస్కృతాంధ్రాంగ్లభాషాసేవఁ జేయుచు
గడపె నెవ్వఁడు తనకాల మెల్ల
ఆనందదంతీంద్ర సానందగౌరవ
పాత్రుఁ డయ్యె నెవండు ప్రాయమునన
ఉభయభాషలఁ గర ముద్ధరించె నెవండు
పూని పాలకులతోఁ బోరి తుదకు
విజయపురీశుల వేఁడి పండితుల యకిం
చనత్వ మెవండు త్రుంచినాఁడు
సంస్కృతకళాలయం బనుసరసలతకు
సంతికాశ్రయభూరుహ మయ్యె నెవఁడు
అతఁడు రామానుజాచార్యుఁ డస్తమించెఁ
దీరనికొఱంత కల్గె నీ దేశమునకు.

త ప్పొనర్చినభృత్యతతి కైనఁ గోపించి పొట్టపై నెన్నఁడుఁ గొట్టఁ డెవఁడు
పరిజనుల్ దనుపనిపాట్లు దప్పిన సహో పరు సంపుఁ బల్కులఁ బల్కఁ డెవఁడు
అధికారి యని యెంత యవినీతు నైనను నాగ్రహమ్మునఁ దూల నాడఁ డెవఁడు
తాఁ జేయుక్రియయె యుత్తరముగాఁ దగుఁ గాని యనృతభాషణముల నాడఁ డెవఁడు
ఆగ్రహావేశమును జూపు నదను రాఁగ-లేనికోపమ్ము నెట్టులో యాను నెవఁడు
నతఁడు రామానుజాచార్యుఁ డరిగె దివికి-పండితజనాళి శోకమ్ముపాలు సేసి.

వంశదీపకులైన వరతనూజులఁ గాంచి తీర్చి దేవర్షిపితౄణములను
అగ్రగణ్యత నొంది యన్నింట నొప్పఁగ దేశమాతౄణమ్ముఁ దీర్చి భక్తి
ప్రాలు మాలినయట్టి ప్రాచ్యవిద్యలఁ దేర్చి తీర్చియు భారతీదేవి ఋణము
ప్రవిమలస్వీయ ప్రవర్తనాదులఁ దీర్చి ప్రభువులఋణమును భక్తి మీఱ
ఘనతరసువర్ణవర్ణసంకలిత మైన-భవ్యమౌ తననామము భారతీయ
విబుధహృత్పీఠములను స్థాపించివిష్ణు-ధామముం జేరె రామావతార మకట!
ప్రభవఫాల్గునసితచతుర్దశి యదేమి-పాపపుదినమ్మొ త్వన్మృతివార్తయకట!
కరముఁగఠినమ్ము సంతాపకరము నయ్యె-విన వలసి వచ్చె మాకు మాసీనులవియ.

ఉర్వినున్నతధామమ్ము నొసఁగినట్టి-సచ్చిదానందమూర్తి యా సర్వసముఁడు
పరమపదనాథుఁ డొసఁగుతఁ బరమపదవి-నాత్మశాంతిని నీకనఘా, పరమున.



# కీ. శే. పావులూరి శ్రీరాములుగారు

జన్మస్థలము: స్వర్ణ, గుంటూరుజిల్లా.

విద్యాభ్యాసము: బాపట్ల, గుంటూరు, విజయనగరము.

జననము 15-9-1906.

నిర్యాణము: మాఖ శుద్ధ అష్టమీ (14-2-28)

శ్రీరామనిర్యాణము:—మా శ్రీరాములును, నేనును ఇంచుమించు సమవయస్కులము. వయస్సున అతనికంటె నే నొకింత పెద్దనైనను బుద్ధినైభవమున మా సహకాలికుల నేకులకంటె నాతడే పెద్ద. చిన్న నాటిచెలిమి చిరస్మరణీయమును, బహుత్తరమును నగుటం జేసి మా శ్రీరామునిగూర్చి వ్రాయవలసిన విషయ మధికముగ నున్నను స్థలాభావముచే సంక్షేపించెదను. అసహాయోద్యమారంభదినములందు దేశమాత పిలుపు నాకర్ణించి ప్రభుత్వపాఠశాలలను బహిష్కరించుటయే మా శ్రీరాముని నిరవధిక దేశభక్తికి ప్రబల నిదర్శనము. నాటనుండి తన మేన ప్రాణము లుండునంతవరకు స్వదేశవస్త్రధారణ దీక్షాకంకణబద్ధుడై యుండుటయే యాతని అచంచలకార్యదీక్షకు, దృఢసంకల్పమునకును పరమ ప్రమాణము. గురువుల, బంధుజనుల, మిత్రకోటియొక్క ప్రేమను మారగొని యుండుటయే యాతని సుగుణసంపదకు సాక్షి. "అనివార్యమగు రుగ్మత అడ్డువచ్చి పట్టభద్రుడని యనిపించుకొనజాల నీచుకపోయెగదా!" యని సహపాఠులును, "కతిపయ దినంబులలో వివాహముహూర్తము నిశ్చయించియుండ నింతలో నిట్లు పిడుగువలె దయమాలిన దైవము మావానిని మూడు పోగులతో నుండగనే విగతజీవుని జేసెగదా!" యని చేతి కక్కరకు వచ్చిన పుత్రుని గోల్పోయిన మా శ్రీరాముని తండ్రియు చింతింపవచ్చును. కాని తనకై నిశ్చయించిన కన్యకను స్వీకరింపకమున్నె అల్పప్రాయమునందే యాతడు కీర్తికన్యకను జేపట్టెను. పట్టపరీక్షకు రుగ్మత అంతరాయముగ నేర్పడినను తన నిర్మలచారిత్రముచే నిష్కామ్య కర్మానుష్ఠానముచే నాతడెన్నడో తనబంధుమిత్రుల మానసముల పట్టభద్రు డాయెను. తా చదివిన చదువునకు తన వినయమే భూషణముగ, తా సలిపిన సద్గోష్ఠికి తన సుహృద్బృందమె సాక్షిగ, తా నాచరించిన కార్యములకు తన యంతరాత్మయే ప్రమాణముగ, నమ్రత్వాది గుణగణములకు తనవాక్సుధావృష్టియే తార్కాణముగ ఇరువదిరెండేడులు విశుద్ధబ్రహ్మచారియై, అత్యంతదేశభక్తియుక్తుడై ఇహలోకయాత్ర ముగించి మా శ్రీరాము డారాముని జేరెను.—నీలంరాజు వెంకటశేషయ్య.

---

## స్వప్నమూర్తి

ప్రతివాది భయంకరం రంగాచార్యులు గారు

తనదు వెలుగులగుమితీయదన పుటలల
భువనముల ముంచి కరగించు మూర్తి యెట్లు
చండమధ్యాహ్నమార్తండు సరస జేరి
గుసగుసల నాడగల మైత్రి గూడి యుండు!

ఏమరని నవ్వు తళుకుల నింపు గురియు
శ్యామలత యెన్నడో యేగె సఖిని వీడి
తీవచెలిమోము వెల్లనై దిగులు జెందె
నీహరీమళ మెందుండి యేగుదెంచు!

తారకల నాట్య మింతయు దరుగలేదు
ముగ్ధ యీశాంతిబాల సమ్మోహనంపు
గానమున నపశ్రుతి యింతయైన లేదు
వానచిన్కు లేకడనుండి వచ్చు నిపుడు!

మున్ను నే నిట్టివింతల నెన్న డెరుగ;
గాని మిము గన్నదాదిగా గలిగె నిట్టి;
వెందొ చూచితి మిము, జ్ఞప్తియందు లేరు;
కరుణ జెప్పు డెవ్వరు మీరు? కవిని నేను.

---

# ప్రభవసంవత్సర విశేషములు

౧౯౨౭

ఏప్రిల్ ౨. వ్యవసాయ విచారణ సంఘమువారు ఇంగ్లాండునకు ప్రయాణమయిరి.

౭. సక్లత్ వాలాగారు బొంబాయి నుండి ఇంగ్లాండునకు ప్రయాణమయిరి.

౧౪. హిందూమహాసభ-పాట్నా.

,, అయిదవ అఖిలభారత పద్మశాలీయ మహాజనసభ-నెల్లూరు.

౧౫. అఖిలభారత వైద్యసమ్మేళనము-పాట్నా.

౨౧. రైట్ ఆనరబిల్ వి. యస్. శ్రీనివాసశాస్త్రిగారు దక్షిణాఫ్రికాలో ఏజంటు జనరలుగానియమింపబడిరి.

౨౧. వి. జె. పటేలుగారు లండను చేరిరి.

౨౬. జె. యమ్. సేనుగుప్తగారు మరల మూడవ మారు కలకత్తా కార్పొరేషనున కధ్యక్షులుగ నెన్నుకో బడిరి.

౨౯. బొబ్బిలి మహారాజాగారు కీర్తిశేషు లయిరి.

మే ౨. సిమ్లాలో భారతరాజప్రతినిధుల సభ జరిగినది.

౧౧. అరలసప్ప చంద్రగౌడుగారు చిక్ మాగలూరులో వైద్యశాల నిర్మించుటకు 1 లక్ష రూ. విరాళ మిచ్చిరి.

౧౫. సుభాసు చంద్రబోసుగారి విడుదల.

౧౬. జార్జినక్రవర్తితో పటేలుగారి సంభాషణ.

జూన్ ౭. గౌ॥ శ్రీనివాసశాస్త్రిగారు దక్షిణాఫ్రికాకు ప్రయాణమయిరి.

౯. మామిడిపూడి వెంకట రంగయ్యగారు విజయనగర సంస్థానపు దివానుగా నియమింపబడిరి.

జూలై ౨. కోయంబత్తూరులో బ్రాహ్మణేతర మహాసభ.

3. గాంధీమహాత్ముడు బెంగుళూరులో ఖద్దరు ప్రదర్శనము ప్రారంభము చేసిరి.

౪. బొంబాయి కార్పొరేషను ఇంజనీరు గంటి లక్ష్మీనరసింహముగారు కీర్తిశేషులయిరి.

౧౪. వ్యవసాయసంఘ సభ్యులు సర్. లాలాగంగారాము గారు దేశోపకారమునకు 14 లక్షల దానము చేయుచు వీలునామా వ్రాసి కీర్తిశేషు లయిరి.

౧౯౨౭

జూలై ౧౫. డా॥ బ॥ టి. రంగాచారిగారు ఆస్ట్రేలియా నుండి తిరిగి వచ్చుచు కొలంబో చేరిరి.

౧౬. వి. జె. పటేలుగారు గ్లాస్గోనగరమున ప్రథమ భారత నౌకాప్రయాణ ప్రారంభోత్సవమును జరిపిరి.

౨౪. పంజాబులో ఘోరహత్యలను గావించిన దయ్యారు సేనాని మృతి నొందెను.

ఆగస్టు 3. సర్ సి. పి. రామస్వామి అయ్యరుగారు జినీవాసభకు ప్రయాణమైరి.

౫. "ఆంధ్రప్రకాశిక" సంపాదకులగు ఏ. సి. పార్థసారథినాయకుగారు కీర్తిశేషు లయిరి.

,, పటేలుగారు బొంబాయి వచ్చి చేరిరి.

౧౯. సి. యఫ్. ఆండ్రూసుగారు ఆఫ్రికానుండి బొంబాయికి తిరిగివచ్చిరి.

౨౧. మోతీలాల్ నెహ్రూగారు యూరపునకు ప్రయాణమైరి.

౩౧. గాంధీమహాత్ముడు బెంగుళూరు విడిచెను.

సెప్టెంబరు 3. గాంధీమహాత్ముడు మదరాసు చేరెను.

౬. అసెంబ్లీవారు నూలుసంరక్షణచట్టము నామోదించిరి.

అక్టోబరు ౪. విజయనగరాస్థాన పండితులు కట్టా పాపయ్యశాస్త్రిగారు కీర్తిశేషులైరి.

౧౬. సర్ సి. కుమారస్వామిశాస్త్రిగారు యూరపునుండి మద్రాసు వచ్చిరి.

౧౭. సినీమాకమిటీవిచారణప్రారంభము

౨౨. నెహ్రూగారు లండను చేరిరి.

౨౯. ప్రథమబ్రాహ్మణేతర యువజనసభ-చెన్నపురి.

౩౦. బెసంటమ్మగారు మద్రాసు చేరిరి.

నవంబరు ౧. నెల్లూరు మండలమున తుపాను.

౬. అఖిల భారత ఇంజనీరింగు సభ-కరాచి.

౧౨. గాంధీమహాత్ముడు కొలంబో చేరెను.

,, తొమ్మిదవ ఆంధ్ర రాష్ట్రీయ మహాసభ-అనంతపురము.

౧౩. ఆంధ్రదేశ గ్రంథాలయ సభ-అనంతపురము.

